# బ్రాహ్మవివాహము

రచయిత:

కందుకూరి వీరేశలింగము పంతులు



ఆఱవ కూర్పు.

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము.

1950

# ఈనాటకమునందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

ధనాలకామయ్య—పెండ్లికొమార్తెయొక్క తండ్రి.

పుల్లయ్య, పిచ్చయ్య—పెండ్లికొమార్తెయొక్క బంధువులు

పేరిశాస్త్రులు, వట్టిసోమయాజులు—పెండ్లి బేరమునకై బంపఁబడిన వైదికస్వాములు.

పెద్దయ్య—పెండ్లికొమారుఁడు.

పరమేశ్వరావధానులు, నీలకంఠసోమయాజులు — పెండ్లికొమారుని యొక్క బంధువులు.

బొజ్జయ్య—సిద్ధాంతి.

రామయ్య—పెద్దయ్యగారి పరిచారకుఁడు.

భోగరాజు, సుబ్బారావు, భీమరాజు, సోమరాజు, రామస్వామి, వెంకప్ప, చెవిటిచయనులు, గుడ్డి గున్నయ్యగార్లు — తాంబూలమునకు వచ్చిన పెద్దమనుష్యులు.

భాగవతుల పాపయ్య, సోమయాజులు, సాగి సర్వావధానులు, వేదుల వెంకయ్య, మాడంబి నరసింహాచార్యులు, సుబ్బావధానులు, లక్ష్మణావధానులు సూరావధానులు—సదస్యులు.

వెంకటరెడ్డి—మాన్యముసాగుబడిచేయుకాపు.

నీళ్ళ కావళ్ళ కొండయ్య, పీనుగుల పేరయ్య—వడ్డనబ్రాహ్మణులు.

రాజన్నగారు, పాపయ్యపంతులుగారు &c —పెండ్లివిందుకువచ్చినారు.

పైడిపాటి పాపావధానులు, బంధకవి భానుమూర్తి—పూటకూటింటికి భోజనములకువచ్చినారు.

## స్త్రీలు.

అజ్ఞానమ్మ—పెండ్లికొమార్తెయొక్క తల్లి,

చిన్నమ్మ—పెండ్లికూతురు.

కన్నమ్మ—కామయ్యగారిపనికత్తె.

బట్టతల అలివేణి, సొట్టకాలి హంసయాన, చిలికికన్నుల చకోరాఁ నత్తినోటి మంజువాణి—వేశ్యలు.

శాపనమ్మ—ముత్తైదువ.

## మొదటి కూర్పులోని పీఠిక

మనదేశములో నిప్పుడు జరుగుచుండెడు దురాచారములలో వివాహవిషయమున నడచెడియక్రమములు మిక్కిలి హేయములుగా గనఁబడుచున్నవి. సంబంధము లేశముగాని లేని యొకపురుషునకును కన్యకును బ్రతికియున్నంత కాలము నన్యోన్య సుఖదుఃఖములయందు వీడని సంబంధమును దెచ్చిపెట్టెడి వివాహమను మహాకార్యమును ఒక యల్ప కార్యముగా నెంచి మనవారు పెక్కండ్రు దానిని బొమ్మల పెండ్లితో సమానమైనదానిఁగా జూచుచున్నారు. అందుచేతఁ బెక్కు చోట్ల వివాహములు కన్యకల సౌఖ్యముకొఱకు చేయఁబడక, తల్లిదండ్రుల వేడుకకొఱకును లాభముకొఱకును మాత్రము చేయఁబడుచున్నవి. కొన్నిస్థలములయందు వృద్ధులయిన దంపతులు తాము బ్రతికియుండఁగానే బిడ్డలయొక్క పెండ్లి వేడుకను జూడవలెనని, తరువాత వారిగతి యేమగునోయనుచింత యావగింజంతయైనా హృదయమునఁ బెట్టుకోక అయిదాఱుసంవత్సరముల వయస్సుగల పుత్రునకుగాని మూడుఁనాలుగేండ్ల ప్రాయముగల పుత్రికకుఁగాని వివాహమనఁగా నేమో యెఱుఁగని దశయందే వివాహోత్సవములను జరిపించుచున్నారు. సొమ్ముపుచ్చుకొని తమకన్యలను వృద్ధులకును అంగహీనులకును దరిద్రులకును విక్రయించి లాభము పొందెడివారిని నిందార్హులనుగాను పాపకర్ములనుగాను గణించి యగౌరవముతో జూడక వారినిగూడ నందఱితో సమానులనుగానే చూచుచుండుటవలనఁ బెరుగుచున్న యనర్థమింత యంతయని చెప్పనలవి కాకయున్నది. మన శాస్త్రములు కన్యాశుల్కము దూష్యమైనదనియు దానిని గ్రహించువారు పంక్తిభోజనమునకుఁగూడ నర్హులు కారనియు వేవిధముల ఘోషించి చెప్పుచున్నను, ఏమి కాలకర్మ దోషముననో కాని మనవారు శాస్త్రములయందుఁ బ్రమాణబుద్ధిని విడిచి యాస్మృతివచన

నములను పాటింపఁ జేసినారు. ఈ బ్రాహ్మవివాహము శుల్కమును
గైకొని కన్యను విక్రయించుటనుగూర్చియే వ్రాయబడి, అట్టివివాహము
వలనఁ గలుగు నష్టములను కడపట నట్టికన్యలకు సంభవించుగతిని సూచ
నగాఁ జెప్పుచున్నది. కాని నడుమనడుమ సంబంధమునుబట్టి మన
వివాహములలో సాధారణముగా జరగెడి శాస్త్రసంబంధము లేని
దురాచారములును జ్యోతిష్కులు మొదలగువారు చేయుమోసము
లును మఱికొన్ని యితర విషయములును గూడ తెలుపఁబడి యున్నవి.
ఇందు వ్రాయబడిన ప్రతివాక్యమును నేదో యొక దురాచారమును
వెల్లడిచేయు కొఱకే యుద్దేశింపఁబడి యున్నదిగాన దీనిం జదువువారు
వట్టి వేడుక కొఱకు మాత్రమే చదువక దాని యుద్దేశమును గూడ శ్రద్ధతో
విచారింపఁ గోరఁబడుచున్నారు. ఈ పుస్తకము యొక్క ప్రథమాంక
మున సాధారణముగాఁ గొందఱు దంపతులకు గలవైకమత్యభావమును
చిన్నతనములో వివాహము చేయుటకును పెద్దవారికిచ్చుటకును చెప్పు
కుత్సితహేతువులును పెండ్లిబేరమును కుదుర్చెడువారు చేయుకుతంత్ర
ములును శాస్త్రమిషమున తమచే కల్పితములయిన శ్లోకములను
చదివి చేసెడి మోసమును గొంత సంగ్రహముగాఁ జెప్పఁబడినవి;
ద్వితీయాంకమున ముసలివాండ్రు తాము చిన్నపిల్లలను వివాహమగు
టకుఁ జెప్పెడు కారణాభాసములును వివాహకార్యములలో జ్యోతి
ష్కులు చేయు మాయలును రాయబారులుగా నుండువారు ధనార్జన
మునకయి చేయు కపటకృత్యములును కొంతవఱకు వివరింపఁబడి
యున్నవి; తృతీయాంకమున నిశాలగ్నము పెట్టుటవలన సంభవించెడి
యిబ్బందులును పాతివ్రత్యము నేర్పఁదగిన యీకాలములో లంజెల
చేత సొమ్ము వ్యయపెట్టి బూతుపాటలుపాడించు దురాచారమును
ఆపదుపుకన్నెల నుంచుకొన్నవారు పిలువనిదే వచ్చి దంభమునకయి
పసుపు నొసంగుటయు తదితరులుకూడ నొసఁగులిచ్చుట చేతఁ గలిగెడి

నష్టములును తెలుపఁబడినవి; చతుర్థాంకమున సభాతాంబూలములు సభాపతులని పిలువఁబడెడి నిరక్షరకుక్షులయిన బ్రాహ్మణామధార కులకు ముట్టుటయు అపాత్రసంభావనక్రింద విశేషధనము వ్యర్థపఱచియు తిట్లుతిని యప్పులపాలయి పాడగుటయు వర్ణింపబడినవి; పంచమాంకమున భోజనములకు వచ్చువారు వ్యర్థదంభమునకయి లాంతరులు మొదలగువానికొఱకు ప్రయాసపడుటయు వేళకురాక పలుమాఱు పిలుపించుకొనుటయు ఎంతసేపునకును రానితప్పిదమును తమయొద్దనుంచుకొని మీదిమిక్కిలి తొందరపనియున్నవారు భోజనమునకుఁగూరుచున్నచో కోపపడి లేచిపోవుటయుఁ బేర్కొనబడినవి: షష్ఠాంకమున రాత్రికాలమున నూరేగుటవలన పెండ్లివారికిని పరులకునుగూడ నిద్రాభంగము మొదలైనవి సంభవించి కలిగెడి చెడుగులును వసంతోత్సవసమయమునఁ బెండ్లివారిలోనే కాక ఇతరులలోఁగూడ జరిగెడి యనాగరికములైన మోటుపనులును మానవప్రకృతికనర్హములైన పరిహాచకములును సంతోషసమయమైన అప్పగింతలవేళ నేడుపుమొదలుపెట్టు బుద్ధిహీనతయు ముత్తయిదువలనువారిస్థితియు వాకొనఁబడినవి; సప్తమాంకమున ముసలివాండ్రకు పిల్లలనిచ్చెడివారికిపుట్టు తలంపులునువారిచేష్టలును ముసలివాండ్రను జేసుకొన్నవారికిఁ గడపటలభించు గతియును జీవితకాలములో వారి చర్యలును తేటపఱుపఁబడినవి. దేశాభిమానులైనవారు ఇందలిభాగములను కొందఱికి నేర్పించినకాని పుస్తకమునుజూచియైనఁ జదివించి కాని జనసమూహము ముందఱ నాడించినచో, ఇందులో వివరించిన రీతిగల యక్రమములకు లోనగువారు కొంతవఱకు సిగ్గుపడి ముందు తమప్రవర్తనమును జక్కచేసికొందురనుటకు సంశయముండదు.

# బ్రాహ్మవివాహము

—:o:—

## ప్రథమాంకము.

ప్రదేశము—పెండ్లికూతురు గృహములోనిచావడి.

[పెండ్లికొమార్తెయొక్క తల్లిదండ్రులును, ఇద్దరుబంధువులును, ప్రవేశించుచున్నారు.]

కామయ్య—(పెండ్లాము వంక జూచి) వోసీ! వోసీ! మనం రహస్యం మాట్లాడుకుంటూవుంటే యెవరైనా తటాలునలోపలికి వచ్చిపోతారు; వచ్చేదానవు వీధితలుపు వేశైనావచ్చావా?

అజ్ఞానమ్మ—యీ చెప్పేది యింతకుముందైనా చెప్పరాకపోయిందా? తీగావచ్చి కూర్చున్న తరువాత పెళ్ళాం వూరికేవుండిపోచుందని యేదోవక లేనిపోనిపని కల్పిస్తారు. మీరు వెళ్ళి వేసిరారాదా? నాకు తలుపు వేస్తూవుండడమూ తీస్తూవుండడమూ తప్ప వేరే యేం పనివున్నది? తిరగలేక చచ్చిపోతూవున్నాను. యెలాగయినా నా ఖర్మమే కాలిపోచుంది; తప్పేనుందా యేమిటి? వెళ్ళి వేస్తానులెండి. (అని తలుపు వేసి వచ్చుచున్నది.)

కామ—(బంధువుల వంక జూచి) పుల్లయ్యగారూ! రండి. పిచ్చయ్యగారూ! కూర్చుండండి (అందఱును గూర్చుండియుండగా) పుల్లయ్యగారూ! భూమిమీద మన తనువులు శాశ్వతాలు కావుగదా! అయ్యగారి బుచ్చయ్య కూతురికి పెళ్ళి చేస్తానంటూనే మొన్న యిట్టే చచ్చిపోయినాడు. నాకళ్ళముందర మొన్న మొన్నటిదాకా బట్ట విప్పివేసుకుని ఆడుకుంటూవుండే అన్నప్పగారి కన్నమ్మకు, కొడుకు వివాహం కళ్ళారా చూచుకోవడానికి రుణంలేకపోయింది. మనంమాత్రంయెల్ల

కాలం యీ లోకంలో పుట్టికట్టుకుని వూగులాడబోచామా? మా
భాగ్యానికల్లా లేక లేక పుట్టిన వక్కకూతురుగదా వున్నది! చేతు
లారా వక్క కన్యాప్రదానం చేసుకుంటే యెంతో పుణ్యంవస్తుందని
తమవంటి పెద్దలు చెపుచూవుండగా విని వున్నాను. నాకున్నూ అరవ
య్యోపడి వచ్చింది; మా యింటిదానికిన్నీ యాభై యేళ్ళు విండవచ్చినవి.
ఇఖ బతికినన్నాళ్ళు బతకబోము మాయిద్దరి ప్రాణాలూ బాగావుండగానే
పెండలకాడే వకసమ్మంధం విచారించి ముడిపెట్టివేస్తే, పెళ్ళి చెయ్యక
పోయినామని అవతల మాజీవాలుకపడి యేడవకుండా మొగుడూ
పెళ్ళామూ తమపాట్ల తాముపోసుకుంటూ సుఖంగావుంచారు.

పుల్లయ్య—ముక్క పచ్చలారనిపసిబిడ్డ; యిప్పుడు పిల్లదాని
వివాహానికేమితొందర వచ్చింది? వడసారమూ మొన్నటి శ్రావణ
శుద్ధ నవమికిగదా దానికి రెండేళ్ళు వెళ్ళినవి? బ్రతికి బట్టకడితే
ముందు పెళ్ళి చేసుకోరాదా?

కామ—అంతావిని మళ్ళీ మీరీలాగు సెలవియ్యడంచూస్తే
చాలా ఆశ్చర్యగావున్నది. ఇందులో తమకు విశదంకానిది యేమి
వున్నది? కాలంసంగతి చూడబో తేవట్టిపాపిష్ఠి దినాలువచ్చినవి. మేమో
మూడుకాళ్ళముసలివాళ్ళము; తెల్లవారి లేచి మీ నలుగురి మొఖాలూ
చూచేదాకా యేరోజుకారోజు రేపుమళ్ళీ మిమ్మల్ని చూస్తామో
లేదోఅని భయంవేస్తూవుంచుంది, మా రెండుప్రాణాలూ బొందెలో
వుండగానే పిల్లదాన్ని యేఅయ్యవాళ్ళనో పెట్టిమా అవశిష్టంలేకుండా
తీర్చుకుంటే, అవతలవుభయుల అదృష్టమూ యెల్లావుంటే అల్లాజరుగు
తుంది. మనం చేతనైనపని పెట్టగలం పొయ్యగలంగాని—

అజ్జా—(గొంతెత్తి) పుల్లయ్యతండ్రీ! నువ్వోయిలా సెలవిస్తే యిఖ
నేను యేగంగలోదిగుచాను? నాముద్దులూ ముచ్చటలూ యెల్లా తీరు
చవి? నేనూపెద్దదాన్నయినాను: యిఖను యెన్నాళ్ళో బ్రదకను; యేమిపో

వెనుకటి అలవాటునుబట్టి తిరుగుచూన్నానుగాని దేహంలో మునుపటి సత్తువలేదు; వంట్లో రక్తమాంసాదులుహరించిపోయినవి; లేస్తేకూర్చో లేను. కూర్చుంటే లేవలేను. మీదటికి బ్రతుకుచానో లేదో, మీరేమీ అడ్డంచెప్పక నాదేహంలో ప్రాణం వుండగానే యీ యేడేయీశాస్త్ర కార్యమూ కానియ్యండినాయనా! (అని పెద్దపెట్టున నేడ్చుచున్నది.)

పుల్ల—ఘూరుకో. పెద్ద ముత్తయిదవు, శుభకార్యం ముందు పెట్టుకొని యేమీ తెలియని దాసికిమల్లే యిలాకంటతడి పెట్టుకోరాదు. కన్నీళ్లు తుడుచుకో. నీకేమి యిప్పుడు తొంభయియేళ్ళు వచ్చినవా? నూరేళ్ళువచ్చినవా? మొన్న మొన్నటిదానవు. నీకంటె పెద్దవాళ్ళం దరూ బ్రతుకుచూ వుండలేదా? నీకిప్పుడు మరేమీ భయంలేదు. నీ కూతురు పదిమంది బిడ్డలను గన్నదాకా నీవు బ్రతుకుచావు.

అజ్జా—(చేతులతో కన్నులు నలుపుకొనుచు డగ్గుత్తికతో) నాయనా! నీనోటివాక్యాన్ని అలా బ్రతుకవలెనుగాదా?

పిచ్చయ్య—నీజాతకంలో యెనభైయేళ్ళు జీవిస్తావని వ్రాసి వున్నది. అధైర్యపడకు. నీవు యిక ముప్పయ్యేళ్ళు అడ్డంలేకుండా బ్రతుకుచావు. భూమిమీద నీవు ఇంకా యెంతమంది మనమలనూ మనమరాళ్ళనూ యెత్తవలెనో!

అజ్జా—(సంతోషముతో) నా నాయన! నా తండ్రి! నీఅమ్మ కడుపుచల్లగా! నీఅత్తకడుపు చల్లగా! నాఆయువూ నీఆయువూకూడా పోసుకుని నీవే వెయ్యేళ్ళు బ్రతుకు.

కామ—మీరిద్దరూ నాకు కావలసినవారుకదా? నాకుయిప్పుడు యేమిఆలోచన చెపుతారు?

బంధువులు—మీరు యిప్పుడుతలపెట్టిన కార్యం బహుసర్వోత్త మంగావున్నది. అవశ్యంగావివాహం సాధ్యమయినంతత్వరలో కావల

శించే. అన్నీ సరేకాని మరి మీరు సంబంధం యెక్కడనైనా విచా రిస్తూవున్నారా?

కామ-సమ్మంధాలకేమి తలవెండ్రుకలన్నివున్నవి. నిత్యమూ పదినుండివచ్చి అడిగిపోతూవున్నారు. నాలుగుదినాలనుంచి బుచ్చయ్య పైనటుగారి కొమారుడు కొమరయ్య కియ్యమని ఆచిన్నవాడి మేన మామ అడుగుతూ వున్నాడు. చిన్నవాడు చూడబోతే బహుచిన్న వాడు; చిన్నతనంలోనే నాలుగు ముక్కలంటినవి; నాలుగు వందల రూపాయల నగలు పెడతామంటూవున్నారు; నాలుగువుట్ల మాన్యం వున్నది; పిల్లవాడు మంచి బుద్ధిమంతుడట! అన్నీ భాగానేవున్నవికాని చిన్నవాడికి అన్నదమ్ములు చాలామంది వున్నారు. అందుచేత ఆ చిన్నవాడికి యివ్వడానికి బొత్తిగా సమాధానం లేకుండావున్నది. పిల్లవాడి మేనమామ దినదినమూ వచ్చి తిరిగిపోతూవుంటే నిన్నరాత్రి పిల్లనియ్యనని స్పష్టంగా తెలియచెప్పినాను.

పిచ్చి-పోనీ, మన గునుపూడి సోమశాస్త్రికొమారుడు కామ శాస్త్రికియ్యరాదా? వాడుతండ్రికి వొక్కకొడుకు, వయస్సువిచారించ బోతే యిరవై సంవత్సరాల కన్నయెక్కువ లేదు. పిల్లవాడు మంచి రూపసి; నిరుడు యఫ్. ఏ. పరీక్ష ప్యాసయినాడు; మీదటికి బియ్యే పరీక్షకూడా ప్యాసయి ధారలచేత గొప్ప బహుమతీ పొందు తాడట! వాడు తప్పకుండా గొప్పవుద్యోగం చేస్తాడని అందరూ చెప్పు కుంటూవున్నారు. ఆసమ్మంధం మొదటినుంచీ కలిసిందికూడాను.

కామ-నామనస్సుకు యీసంబంధం యెంతమాత్రమూ బాగా వున్నదికాదు. మాన్యాలా? మళ్ళా? యేమివున్నవి? తండ్రి పదిరూపా యలు తెస్తే వాటితో జీవనం చేస్తూవున్నారు. పట్నమంటే యిప్పుడు పదినగరాలు లేలేరు. ఇక యెప్పుడో పిల్లవాడువుద్యోగంసంపాదించి

గడింకి పెదవాడని యిస్తేడు నోట్లో వేలుపెట్టుకొని కూర్చోవలెను. అవతలగడిస్తాడో లేదో యెవరుచూచారు? కీడెంచి మేలెంచమన్నాడు. వొకవేళ గ్రహచారంచాలక పిల్లవాడు కాలంచేసెనా, తరువాతచిన్నది పూటకూటికి గతిలేక యావజ్జీవమూ మా ప్రాణాలకుసూరుమనియేడుస్తూవుంచుంది. ఆపిల్లి బ్రహ్మత్యవచ్చి నాకు చుట్టుకుంచుంది. చూస్తూ చూస్తూ పిల్లదానిగొంతుక యెట్లాకొయ్యను? నాకీసంబంధంపనికిరాదు.

అజ్ఞా—పిచ్చయ్యగారూ! మావారిసంగతిచూస్తూవున్నారుగదా! యెటువంటి సంబంధంవచ్చినా యేదోఒకవంకపెట్టి అదిమంచిదికాదంచారు. ఎక్కడనో కొండమీదనుంచి దిగివచ్చేసంబంధం తెస్తా మంచారు. నేనెంత మొత్తుకున్నా నామాటవినరు. మాణిక్యంలాగు నా అన్నకొడుకు నలభయియేళ్ళవాడున్నాడు. పిల్లదాన్ని వాడికిమ్మని నిత్యమూ చెవినియిల్లుకట్టుకొనిపోరుచాను. నామాటలు లేశమయినా చెవినిపెట్టకుండావున్నారు. నేనియ్యానడానికి రెండోపెళ్ళివాడయినా కాడుగదా! ప్రపంచంలో మాన్యాలులేని వాళ్ళందరూ బ్రతుకుచూవుండలేదా? తనకేంభాగ్యంచూచి నాతల్లిదండ్రులు పిల్లనిచ్చినారు? లోకంలో అందరూ నగలుపెట్టుకున్నవాళ్ళే వున్నారా? పసుపూ కుంకమా తిన్నగా వుంటే, మెడకు కొయ్యపుస్తెకట్టుకొని మొగుడూ పెళ్ళామూ బలుసుకూరయేరుకునితిని బ్రతుకుచారు. మీరుఘట్టిగా కూకలువేసి మేనరికం మంచిదనివప్పించి నామేనల్లుణ్ని యెలాగయినా వకయింటివాణ్ని చేయించండి.

కామ—నేనూ ఇంతఅనుకూలమైన సంబంధం తేవలెననే శక్తి వంచనలేకుండా ప్రయత్నంచేస్తూవున్నాను. రాత్రింపగళ్ళు నాకు దీని మీదనేధ్యానము, దైవఘటన యింకా సమకూడకుండావున్నది. యీ వూళ్లోనే వక మంచి సమ్మంధంవున్నది. వారు పిల్లదానికి ఫదివందల రూపాయల ఆభరణాలువుంచుతారు; ఫడిపుట్లమాన్యంకూడావున్నది.

అంతకంటే అనుకూలమైన వరుణ్ని మనం మరివకచోట సంపాదించ లేము. పెళ్ళికొడుకును మీరున్నూ యెరుగుదురు. మీవుందర దాచడంయెందుకు? నెలదినాలకింద పెద్దింటి పెద్దయ్యగారిభార్య చచ్చిపోయింది. వారు చిన్నదాన్ని ఇమ్మని అడుగుతూ వున్నారు గాని నేనే యింకా మాట యివ్వలేదు.

అగ్ని—ఇదెక్కడిసమ్మంధం దొరికింది? పెళ్ళికొడుకకు ఇది నాలుగోపెళ్ళి. వయసుకా మావారికంటెనూ అతడు చాలా పెద్ద వాడు: అంతకన్న నామేనల్లుడి కియ్యరాదా? వాడికి నలభైయే ళ్లైనా నిండాలేవు.

పిచ్చ—(తనలో) పెద్దయ్యగారికి వివాహమహోత్సవంకంటె దినవార మహోత్సవంచేస్తే బాగావుంచుంది.

పుల్ల—(పిచ్చయ్యతో రహస్యంగా) పెద్దయ్య పెళ్ళిపాలకీ యెక్కడంకంటె నోడుకట్లపాలకీయెక్కవు రేగి తేదివ్యంగావుంచుంది.

కామ—ఈ వెఱ్ఱిబాగులది చిన్నదాన్ని తన మేనల్లుడికిమ్మని చంపుచూ వుంచుంది, చదువా? సంధ్యా? మాన్యాలా? మళ్లా? సొమ్మా? సంబంధమా? వాడికేమున్నది? మనం కొంచెమైనా చిన్న దాని సుఖం చూసుకో నక్కరలేదా? పిల్లదానియోగం బాగావుండి నేను చెప్పిన సమ్మంధం దొరికితే పిల్లదిచాలా సుఖపడుచుంది. వంటి నిండా పెట్టకొన్నన్నినగలు; కట్టుకున్నన్ని కోకలు; సుఖంగా తానింత తిని వకరికింత పెట్టవచ్చును. పయిని వేరేఆజ్ఞ పెట్టడానికి అత్తా ఆడ బిడ్డా యెవరూ లేరు. పెళ్ళికొడుకుజాతకంచూచాను. రమారమినలభై యేళ్ళవుంచవి. వాతశరీరంగనుక ముసలివాడులాగు కనపడచాడు. ఒకవేళ ముసలివాడే అయినప్పటికీ లోపంయేమిషి? ముసలివాళ్ళను చేసుకొనిమాత్రం సుఖపడ్డవాళ్ళు లేరా? వేగిరంకడుపుఫలించి దాని కడుపున నాలుగుకాయలు కాస్తే దానంత అదృష్టవంతురాలుయెవరు?

దేముడిచ్చిన కొర్రగింజంత ఆయువూ తిన్నగావుంటే, అదే యెల్ల కాలమూ కాపురంచేస్తుందేమో! దాని అదృష్టానికి యెవరుకర్తలు? దానిమంగళసూత్రబలం యెలాగంటిదో మనం యెవరైనా చూచి నామా? చూడండి. కన్నమ్మగారిపిచ్చమ్మ అరవై యేళ్ళవాణ్ని కట్టుకొని కడిపెడు బిడ్డలతల్లి అయినది. చిన్నవాళ్ళను చేసుకున్న వాళ్ళందరూ అయిదోతనమే చేస్తున్నారా? మామగారిగారమ్మకు మోచేతి పద్దంనోములోనే మొగుడి దినవారాలువచ్చినవి. ఇలాగు మూడేళ్ళ వాడిని చేసుకున్నదాని బ్రతుకుకూడా ముక్కలైపోయిందికాదా? ఇంతకూ నొసటవ్రాసివున్నవ్రాలు ప్రధానం. ఇప్పుడు పెద్దవాళ్ళను కట్టుకున్నవాళ్ళే తరుచుగా సుఖపడుచూ వున్నారు.

అజ్ఞా—(మొగము చిట్లించి) ఏమిషో! నాకీ పెళ్ళికొడుకును చూస్తే—

కామ—అవునే! వోసీ! నీకు చెవులోవకయేకాంతంచెప్పవాను యిలారా. (అని రహస్యంగా గుసగుసలాడుచు) నీవెంతమాత్రమూ అభ్యంతరం చెప్పవద్దు. ఈసంబంధంతప్పిపోతే యిలాగంటిసంబంధం మరిఒకటి వెయ్యేళ్ళుతల్లకిందైనా మనంసంపాదించలేము. వారికేమి భాగ్యవంతులు! లక్షమందిపిల్లలను యిచ్చేవారువుంచారు. దీనికివప్పకుంటేనా నీకు అగువులూ తగువులూ బాగా జరుగుచవి. వియ్యపురాలవు గనుక నీకయినకోజులూ చీరెలూ మాడలూ దొరుకుచవి. ఇంతేకాకుండా వారుమనకు యెనిమిదివందలరూపాయలు యిస్తామంచూ వున్నారు. నేను వెయ్యిరూపాయలకుచిల్లిగవ్వతక్కువవల్లపడదంచూ వున్నాను. పెద్దముత్తయిదవు నీముద్దూముచ్చటా బాగాతీరుచుంది. అందులో నాలుగువందలరూపాయలుపెట్టి నీకు నగలుకొనపెడచాను. కుదుర్చోవడానికి పరుపూ పట్టెమంచమూచేయిస్తాను. ఇంకో రహస్యం కూడావున్నది. పెళ్ళికొడుకు బహుముసలివాడు, మహాబ్రతికితే ఫది యేళ్లు బ్రతుకుచాడు, పన్నెండేళ్ళు బ్రతుకుచాడుగాని అంతకంటె

యెక్కవబ్రతకడు. ఆముసలిప్రాణాం కాస్తా గుటుక్కు మనడంతోటే, అవతల అతగాడి ఆస్తిఅంతా మనకే దక్కుచుంది.

అజ్ఞా—(నగలు వచ్చినవన్న సంతోషముతో బంధువులవంక తిరిగి) ఆయనచేస్తానంచూ వుండడమూ నేను వద్దంచూవుండడమూ బొత్తిగా బాగా వుండలేదు. పెనిమిటిఅజ్ఞ మీరినానని వట్టిరవ్వ నాకెందుకు? పుల్లయ్యగారూ! వేగిరం ఆయన యిష్టం వచ్చిన వాడికి పిల్లదాన్నియిచ్చి వివాహం చెయ్యమనండి. ఆయనకేది సమాధానమో నాకూ అదే సమాధానము.

[తెరలో]

ఎవరయ్యా యింట్లో? ఓ కామయ్యగారూ! తలుపుతియ్యండి. ఓహోయి! తలుపుతియ్యండి.

కామ—(ఆలకించి) భార్యవంకచూచి) ఔనే! యింటిదానా! యెవరో తలుపువద్ద పిలుస్తావున్నారు వెళ్ళితీసిరా.

అజ్ఞా—అలాగే. (అని తలుపుతీయబోవుచున్నది)

బంధు—కామయ్యగారూ! యివాళకు పదిరోజులనుంచి మా యింటికి బంధువులువచ్చి తింటూవున్నారు వారికి యేదో కోర్టులో వ్యాజ్యంవున్నదట! పెందలాడే వెళ్ళవలెను. వారు మాకోసం భోజనానికి కనిపెట్టుకుని వుంచారు. ఆలస్యమయితే వారికోర్టుపనికిభంగం కలుగుచుంది. ఈపాటి మాకు సెలవిస్తారా?

కామ—చిత్తం. మీరు తిరిగి యెప్పుడు దర్శనం యిస్తారు!

బంధు—యెప్పుడు పడితే అప్పుడేవస్తాములెండి. (అని నిష్క్రమించుచున్నారు.)

కామ—(మనసులో) అయ్యో! మనం సొమ్ముపుచ్చుకొని పిల్లదాన్ని ముసలివాడికి కట్టిపెట్ట తలచుకొంటూవున్నామే, దీనివల్ల మన

కేమయినా పాపంవచ్చి చుట్టుకుంటుం దేమో! అన్నిటికీ మనశాస్త్రుల్లగా రున్నారు. ఆయననడిగి మన సంశయ నివృత్తి చేసుకుందాము.

(అప్పుడిద్దఱు వైదికస్వాములు ప్రవేశించుచున్నారు)

కామ—రండి. శాస్త్రుల్లగారూ! రండి. సోమయాజులుగారూ! దయచెయ్యండి. మీయుభయులకూ నమస్కారము. (అని చేతులు జోడించుచున్నాడు.)

వైది—దీర్ఘాయుష్యమస్తు ధనకనక వస్తు వాహన సమృద్ధిరస్తు! శీఘ్రమేవ సుపుత్రప్రాప్తిరస్తు! రాజద్వారే రాజభవనే సర్వదా దిగ్విజయమస్తు! (అని కూరుచున్నారు.)

కామ—శాస్త్రుల్లగారూ! నాతో ప్రొద్దున్నే వస్తామని చెప్పి యింతప్రొద్దెక్కి వచ్చినా రేమయ్యా?

శాస్త్రి—నిన్ననయితే మీతో అలాగే మనవిచేసినానుకాని పెద్దయ్యగారియింటికి వెళ్ళి నూర్లాడి నిన్ననన్న వేళకే యిక్కడికి రావలెనని వస్తూ కోమటో పుష్టికి పోనగావున్న పంచాంగ బ్రాహ్మణ్ని చూచి యివేళ వర్జ్యం యెప్పుడని అడిగినాను. అతడు యిప్పుడే ప్రవేశించిందని చెప్పినందున నాలుగు గడియలబట్టి తంబిశెట్టిగారి వీధులో నిలుచుండి వర్జ్యంపోయిన తరువాత మరీవచ్చినాను. అందుచేత యింత ఆలస్యమయింది.

కామ—మీరు మంచిపనిచేశారు. నామనస్సులో మిమ్మల్ని వక్కధర్మసందేహం అడగవలెనని వున్నది. వాస్తవం సెలవిస్తారా?

శాస్త్రి—ముఖ్యంగా అడుగునాయనా! నాకుతోచిందేమో చెబుతాను.

కామ—డబ్బుపుచ్చుకొని పిల్లగాన్ని యివ్వవచ్చునా?

శాస్త్రి—ఆ. మహారాజువలె యివ్వవచ్చును. దానివల్లదోషం యేమి?

కామ-ఏమో కాని పెద్దలందరూ కన్యాశుల్కం కూడదంటారు. యెందుచేత?

శాస్త్రి-అలాగు చెప్పేవాళ్లు వట్టి తెలివితక్కువవాళ్లు; వాళ్ళు యేశాస్త్రాలుచూచి యీమాట చెప్పినారు? లోకంలో మనకు ప్రత్యక్షమయిన దృష్టాంతం వక్కటిచూచుకోరాదా? కన్యాశుల్కమే దూష్యమయినపక్షానికి యిప్పుడందరూ యెందుకు డబ్బుపుచ్చుకుని పిల్లలను యిస్తూవున్నారో నాకు చెప్పండి.

కామ-ఏశాస్త్రంలోనూ యెక్కడనూ బొత్తిగా నిషేధం లేకపోతే యిటువంటివార్తలు లోకంలో పుట్టవే. మీరు చూచినశాస్త్రంలో యీవిషయం యెక్కడనైనా యేమయినా చెప్పబడివున్నదేమో సెలవియ్యండి.

శాస్త్రి-(ఏమో తెలిసినట్లు మిన్నవంక చూచుచు నాలోచించి) ధర్మశాస్త్రంలో వకచోట కొంచెం కూడదని వున్నదికాని, అది యీ విషయంలో పనికిరాదు.

కామ-యెందుకుచేత?

శాస్త్రి-శాస్త్రకారుడు అలాగు చెప్పినా, వ్యాఖ్యానంలో దాన్ని సవరణచేసి శాస్త్రకారుని తాత్పర్యం వివరంగా వ్రాసినారు. వ్యాఖ్యానకారుడైన తాతంభట్టుగారు, కన్యను పిల్లవాడికిచ్చినప్పుడు సొమ్ముపుచ్చుకుంటే దోషమని శాస్త్రకారుడి అభిప్రాయ కాని ముసలివాడికిచ్చినప్పుడుకూడా పుచ్చుకోకూడదని కాదని నిష్కర్షించివున్నారు. ఏలాగంటే, శ్లో॥ వృద్ధాయ కన్యాం యో దత్వా। తద్వారద్విగుణం ధనం। నో హరేత్స పుమాన్నింద్యః స్తత్పిత్రా నామాధోగతిః। అని నిబంధనగ్రంథంలో వ్రాసి, ఆప్రకారంగానే ఆయన తనకొమార్తెనుకూడా ధనం స్వీకరించి శతవృద్ధునికిచ్చి వివాహంచేసి, ఆధనంతో తాను యజ్ఞంచేసి

పుణ్యం సంపాదించినట్టు పెద్దలు చెప్పకోవడం మీరు వింటూవుండలేదా? శాస్త్రం యెట్లావున్నా, కన్యాశుల్కం పుచ్చుకుంటూవుండడం యిరవై ముప్ఫయి యేళ్ళనుంచి శిష్టాచారంగా జరుగుతూనేవున్నది. అందుకు మన పెద్దలందరూ అంగీకరించి వూరుకుంటూనేవున్నారు. కాబట్టి మీరు మనస్సులో సందేహం వుంచుకోవలసినపని లేదు. పదేళ్ళక్రిందట పామర్రులో భాగవతుల పరబ్రహ్మశాస్త్రుల్లుగారు పిల్లనుయిచ్చి సొమ్ము పుచ్చుకున్నారు. నిరుడు మన గ్రామంలోనే పురాణం బుచ్చయ్య సోమయాజులుగారు నూరువరహాలు పుచ్చుకొని కన్యాప్రదానం చేసింది మీరు కళ్ళారా చూడలేదా? ఆయనను యెవరైనా యేమైనా అన్నారా? ఇప్పటి పెద్దలందరూ దాన్ని నిరభ్యంతరంగా అంగీకరిస్తూనేవున్నారు.

కామ-అదిసరే కాని ముసలివాడికి బిడ్డనుయిచ్చినందువల్ల మనకు యేమైనా దోషంవున్నదా?

శాస్త్రి-లేశమూ దోషం లేదు. దానివల్ల విశేషించి ఫలంకూడా వున్నది. పడుచువాడికి లోకంలో అందరూ కన్యనుయిస్తారు. అది వకఫలంలోది కాదు. ముసలివాడికి పిల్లను యివ్వడమే యివ్వడము. పది వేలు పుచ్చుకుని అయినా వక్క పెద్ద బ్రాహ్మడి యిల్లు నిలవబెడితే దానివల్ల కోటికన్యాప్రదానాలు చేసిన ఫలం చులాగ్గా లభిస్తుంది. యెలాగంటే,

శ్లో॥ వృద్ధవిప్రాయ యో కన్యాం। దదాతి ధనకాంక్షయా। సకోటికన్యాదానస్య। లభతే హి ఫలం మహత్॥ అని ప్రమాణంవున్నది.

కామ-ధర్మశాస్త్రాలన్నీ సమగ్రంగా చదివి క్రోడీకరించి సారం తీసిన మహాపండితులైన దొడ్డబ్రాహ్మలుగనుక, మీరు నా సందేహాలన్నిటినీ నిముషంలో అవలీలగా తీర్చివేసినారు. ఇలా చెయ్యడానికి మీవలె శాస్త్రరహస్యాలు తెలుసుకోని వారికి సాధ్యం అవుతుందా?

సోమ-శాస్త్రుల్లుగారివలె చిన్నప్పటినుంచీ అదేపనిగా శోధించి సాంప్రదాయ యుక్తంగా శాస్త్రధర్మం తెలుసుకోసినవారు పలువురు

కలుమాటలు చెవుచారు. వారి మాటలన్నీ మనంపాటిగాపట్టరాదు. పూర్వంఒకప్పుడు యీవిషయమయ్యేనాకున్నూ మరివక శాస్త్రుల్లకున్నూ వివాదవచ్చి చర్చజరిగినప్పుడు, ఆయన కన్యాశుల్కంబొత్తిగా కూడ దని వకస్మృతివచనం చదివినారు. నేను తక్షణమేఅందుకుని తడుము కోకుండానే కాక్షరవిఘంటువునుబట్టి కూడదనగా కూడుచుందనిఅర్థం చేసి నావాదం సిద్ధాంతంచేసినాను. "ధాతూనా మనేకార్థం" అని వుండడంచేత కూడదనగా కూడునని అర్థంచెప్పి నామతం సాధించి నాను. ఈశాస్త్రుల్లగారుచెప్పినధర్మశాస్త్రంకూడాకనపరచి, ఆస్మృతి వచనానికి కూడదన్న అర్థమేవప్పకుంటె రెండుస్మృతులుపరస్పర విరుద్ధంగావున్నప్పుడువాపక్షంచేత దేన్నైనాఅంగీకరించవచ్చునని సిద్ధాంత సమన్వయం చేసినాను. నలుగురిలోనూ ఆబ్రాహ్మడు చిన్నపోయి మొగ మింతచేసుకుని నాముందర మళ్ళీ నోరెత్తలేకవూరుకున్నాడు. అప్పటి సభవారిలో యెవరూచదువుకున్నవారు లేకపోయినా, నాయుక్తికిన్నీ పాండిత్యానికిన్నీ అందరూఆశ్చర్యపోయినారు. నేను యిచ్చినశాస్త్ర ప్రమాణాలుచూచి, యిక నాయంతటి పండితుడు లోకంలో మరి వకడువుండబోడని నన్ను వెయ్యినోళ్ళ మెచ్చుకుని సంతోషించినారు. యోగ్యతగ్రహించడానికి తెలివితేటలువుండవలెనుగాని చదువెందుకు?

(ఇంతలో అజ్ఞానమ్మ తలుపువేసి, లోపలకుపోయి యేదో
యొకపని చక్కపెట్టుకొని మరలవచ్చి స్తంభమువీద
చేయి వేసికొని నిలుచున్నది.)

కామ—శాస్త్రుల్లగారూ! ఇట యీమాటలు కట్టిపెట్టి వెళ్ళిన కార్యం పండయిందో కాకయిందో యేమిచేసుకుని వచ్చినారో చెప్పండి. వెయ్యింటికి తక్కువలేకుండా కుదిర్చినట్టయితే మీచెవులకు కుండలాలజోడు చేయించి వేస్తానని అప్పుడే చెప్పినానుగదా!

శాస్త్రి—(అజ్ఞానమ్మవంకచూచిసంకోచముతో నూరకున్నాడు)

కామ—మాఅమ్మాయికెల్లకీ యిది యిష్టమే. సంశయపడక చెప్పండి.

శాస్త్రి—మీరు చెప్పినతరువాత మరివక విధంగాకూడా అవుచుందా? నాయుపచ్ఛక్తి వినియోగించి మీరుకోరినరొఖంయివ్వడానికి పెద్దయ్యగారిని వొప్పించివచ్చినాను. ఇఖ నాకుండలాలజోడు సిద్ధం చేయించండి.

అజ్ఞా—(సోమయాజినిచూచి) అన్నయ్యా! చిన్నదానికి యేమి ఆభరణాలు వుంచుచారో చెప్పండి.

సోమ—అమ్మా! నగల కేమిలక్కుపే? మీచిన్నది పూర్వజన్మమందు బంగారపు పువ్వులతో పూజచేసుకన్నదిగనుక యీజన్మాన్ని శరీరంనిండా నగలు దిగవేసు కోవడానికి లభించింది. వెనుకటిభార్యవి వెయ్యివరహాల నగలువున్నవి. అవి కాకుండా కొత్తగా కాసులపేరు కట్టించుచున్నావున్నారు. పిల్ల అదృష్టవంతురాలయి సుఖపడేయోగ్యత వున్నదిగనుక నే దైవ మీవధూవరులకు యిద్దరకూ యేకకాలమందు యీసమ్బంధం చెయ్యడానికిబుద్ధిపుట్టించినాడు. మీదంపతులపూర్వ పుణ్యంవల్లనే యిటువంటి అల్లుడు మీకు లభ్యమయినాదు కాని మరి వకటి కాదు.

కామ—వోసీ! లోపలికివెళ్ళి తమలపాకులు తీసుకునిరా. శాస్త్రుల్లవారికీ తాంబూలం యిత్తాము.

అజ్ఞా—(స్తంభముచాటున పోయినగనికిక నంబకునట్టుగాలేవని మొగముత్రిప్పి సైగచేసి తనలో విసుగుకొనుచున్నది.)

కామ—(లోపలకు పొమ్మని చేసైగ చేసి) ఏమే! ముద్దులాగున అట్టే నిలుచున్నావు? వినపడలేదా యేమిటి? లోపలికి వెళ్ళితాంబూలాలు తీసుకురమ్మంటున్నాను.

అజ్ఞా—(కోపముతో నడిచిపోయి) తానేమోఆకులూపోకలూ తెచ్చి యింటినిండా కుప్ప వేసినట్టేతాంబూలాలు తెమ్మనినామీదపడి

యేడుస్తాడు. ఆడదాన్ని నేను యెక్కడనుంచి తేగలను? (అని తనలో తాను సణుగుకొనుచు మరల రాకున్నది.)

కామ—ఏమే తాంబూలాలు తెమ్మంటే అదేపోకగా పోయి నావు? పెట్టెతాళంచెవి కనపడలేదా యేమిషి?

అజ్ఞా—(లోపలనుండి) ఇందాకటినుంచీ దానికోసమే వెతుకు చూవున్నాను. ఎక్కడా కనపడకుండావున్నది. కుర్రముండ వకచోట వున్న వస్తువు వకచోట వుండనిచ్చి యేడుస్తుందా? అబ్బబ్బా! దాని మూలంగా నాప్రాణంవిసిగిపోచూవున్నది. తాళంచెవి యెక్కడ వేసి ఆడుకోపోయిందో! ఎప్పుడు దీన్ని అత్తవారింటికి పంపించేస్తే నాప్రాణం నిమ్మళంగా వుంచుందో! ఓపాపిష్టిదేవుడా! భూమిమీాద నాకు చావు పెట్టవుగదా?

వైదీ—తాంబూలాలకేమి? యెప్పుడూ వచ్చిపోచూవుండే వారికి మరివకప్పుడు యివ్వవచ్చునులెండి. ఈరోజున మాకు కోర్టులో సాక్ష్యం తొందర వకటివున్నది. ఆలస్యంగా వెళితే నాలుగురూపా యలు దొరకే సొమ్ము పోతుంది. వచ్చేలాభంపోగా మీాదిమిక్కిలి మునసప్పుగారు వేళకు వెళ్ళనందుకు జునుమానాకూడా వేస్తారు. యింకా ప్లీడరువద్దకుపోయి యేమిసాక్ష్యంచెప్పవలెనో నేర్చుకోలేదు. ఈ పూటకు సెలవియ్యండి మళ్ళీవస్తాము.

కామ—చిత్తం, కొంచెంసేపువుండి తాంబూలాలు పుచ్చుకో కుండానే వెళుతున్నారుగదా? ఈసారిఅయినా వెళ్ళేటప్పుడుచూచి జాగ్రతగాపొండి. మొన్నవచ్చినప్పుడు వాస్తుశాస్త్రప్రకారంగా యెత్తించిన పెద్దవీధి ద్వారబంధం తగిలి తలబొప్పికట్టి పాపం మూాడురోజులనుంచీ బాధపడుతూవున్నారు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

# ద్వితీయాంకము

---

ప్రదేశము — పెండ్లికొడుకు గృహములోనిగది.

(పెండ్లికొమారుఁడు పెద్దయ్యయు, బంధువులు పరమేశ్వరావధానులుఁను నీలకంఠ సోమయాజులుఁను ప్రవేశించుచున్నారు.)

పెద్ద—పరమేశ్వరావధానులుఁగారూ! దయచెయ్యండి నీలకంఠ సోమయాజులుగారూ! కూర్చోండండి.

నీల—పాపం! వార్ధకదశలో మీకుఁ గొప్పవిచారం పట్టుకున్నది. దైవసంఘటనానికి మీరు విచారించవలసినపనిలేదు. పుట్టినతరువాత యెప్పుడైనా చావువుండనేవున్నది. ఆవిడకేమి? అదృష్టవంతురాలు. మంచంయెక్కి తీసుకోకుండా పునిస్త్రీజన్మాన్ని పసుపుకుంకాలతో కొల్లలాడుచూ లేచిపోయింది.

పెద్ద—యేపాట్లువచ్చినా నావేకాని దానికేమి? మీకు సెలవిచ్చినట్లుగా అదియెలాగయినా అదృష్టవంతురాలే. బ్రతికివున్నన్నాళ్ళూ సుఖంగా తానింతతిని వకరికింత పెట్టింది. తుదకు వకరిచేత చేయించుకోకుండా అనాయాస మరణంగా లేచిపోయింది.

పర—మీసొమ్ము సుఖంగా అనుభవించడానికి ఆమెకు భూమిమీద ఋణంలేకపోయింది గనుక తననోట్లో మన్నుకొట్టుకొని తానే యెగిరిపోయింది. మగవాళ్ళు మీకేమి? రేపీపాటికి చక్కగా మళ్ళీ భార్యా వస్తుంది. పదమూడోనాడే వివాహకార్యం జరగడానికి ప్రయత్నం చెయ్యవలసినది చేసినారు కారు. ఇఖ మూడో నెల దాటకుండానైనా శుభకార్యం జరగడానికి తగినఆలోచన చేస్తూవున్నారు గదా?

పెద్ద—ముసలివాణ్ణి నాకుయింకా వివాహంయెందుకు? [illegible] జవసత్వాలు వుడిగిపోయినవి. మొన్నపోయింది యింకానాలుగేళ్ళకు

పోవుచుండనగానే నాకు కామంపోయింది. నాకు యిప్పుడు స్త్రీ వాంఛయేమీ లేదు.

నీల—భార్యాపోయినందున విరక్తిచేత మీరీలాగు సెలవిస్తూవున్నారే కాని నిజంగా మీకుమాత్రం మనసులో వాంఛలేకపోయిందా యేమి? మీకంటె పెద్దవారు భారతము భానుమూర్తి దీక్షితులుగారు రేపు వివాహం చేసుకోరా? తొంభయి నేళ్ళు దాటిన బులుసు బుచ్చయ్యశాస్త్రులుగారు మొన్న మూడేళ్ళపిల్లను వివాహం చేసుకోలేదా? పెద్దతనంలో వివాహం చేసుకుంటూవున్న వాళ్ళందరూ కామంవుండే చేసుకుంటూవున్నారా? భూమిమీద తమపేరు నిలవడానికిన్నీ, అగ్నిహోత్రాలకు భంగము కలుగకుండా వుండడానికిన్నీ, సంసారధర్మంలో భార్యాఅవివకతె అవశ్యంగా వుండవలెను.

పర—అవును; సోమయాజులుగారు సెలవిచ్చినదంతా వాస్తవము. తమ్ములున్నా తమ్ములబిడ్డలువున్నా పెట్టినప్పుడు దోచుకోనపోయ్యేవాళ్ళే కాని వొక్కట్యా సమయానికి అక్కరకువచ్చేవాళ్ళు కారు. కోపంవచ్చినప్పుడు గాలుకు [illegible] రాత్రి [illegible] స్వత [illegible] గా చేసుకున్న పెళ్లావంటిది వకటి కాదు. మానవదేహము లెప్పుడూ చెప్పినట్టు రావు. మీరు పెద్దలైనారు; మీకు వృపచారం జరగవలెను. యెందరు బంధువు లుంటేయేమి? కాలిమీద చెయ్యివెయ్యనా? నడుంమీద చెయ్యివెయ్యనా? రేపు కాలునొ[illegible] [illegible]; స[illegible] [illegible] తుంది. నామాటవిని అవశ్యంగా వివాహం[illegible]డి.

పెద్ద—తమవంటి పెద్దలందరూ ఈలాగే సెలవిస్తూవున్నారు. నాకుమాత్రమే మనసు [illegible]లుపకుండావున్నది. అయినా కానీ గృహస్థాశ్రమంలోవున్న గౌరవంమరివక [illegible] రాదు. ఇంతకు నాకు తిరిగీ వివాహం కావలసినయోగమున్నది, మీవంటి పెద్దలు నలుగురూ చేరి పట్టుమనిముడివేస్తే అవుచుందేమో యెవరు చూచినారు?

(ఇంతలో వట్టి సోమయాజులును, పేరిశాస్త్రియు,
ప్రవేశించుచున్నారు.)

పెద్ద—సోమయాజులుగారూ! మీరు వుభయులూ యిలాగు తివాసీమీద దయచెయ్యండి.

సోమ—(కూర్చుండి బంధువులనంకఁజూచి) పెద్దతనంలో పెద్దయ్యగారికి పెద్దగ్రహచారం తటస్థమయింది.

పర—దైవసంకల్పానికిమనం యేమిచెయ్యగలము! ఇక పెద్దయ్యగారు ధైర్యంఅవలంబించివుండవలెను. ఆస్త్రీవిచారించినకార్యం లేదు.

సోమ—అవును. గతించినదానికి విచారిస్తేయేమిప్రయోజనం? పోయింది పోయినా యిక యిందుమూట ఆలోచించుకోవలెనుగదా? ఇక జరగవలసిన కార్యంమాట యేమాలోచించినారు? కావలసినవారు మీరు యింతమంది గ్రామంలోవుండి మళ్ళీ వివాహప్రయత్నం చెయ్యకుండా వూరుకుండడం న్యాయంకాదు.

పర—ఇంతవరకూ మేము యీసంగతే చెప్పుకొంటున్నాము. మనగ్రామంలో మీయెరుకను యెక్కడనైనా ఇంత అనుకూలమైన సంబంధంవున్నదా?

సోమ—సొమ్ముంటే సంబంధాలు లేకపోచవా? విచారిస్తే కావలసినన్ని సంబంధాలు వస్తవి.

పెద్ద—(ఒకపరిచారకుని పిలిచి) రామయ్యా! బొమ్మగంటి బొజ్జయ్య సిద్ధాంతిగారు ఘటికలకేవస్తామని చెప్పి రెండుఝాములైనా ఇంకా వచ్చినారుకారు. నీవువెళ్ళి పెద్దయ్యగారు తీసుకురమ్మన్నారని చెప్పి ఆయనను త్వరగా పిలుచుకునిరా.

రామ—చిత్తం. (అని వెళ్ళుచున్నాడు.)

పర—(దివాణంనలేచి తనలో) రెండుఝాములవడంతోటే జ్ఞాపకంవచ్చింది. కోమటికన్నయ్యగారి యింట్లో సదస్యంవేళ మించి

పోచుంది. వేగిరంవెళ్ళవలెను. (ప్రకాశముగా) పెద్దయ్యగారూ! మేము వచ్చిచాలాసేపయింది. ఈపాటి సెలవుదయచేయిస్తారా వెళ్ళివస్తాము.

పెద్ద-చిత్తము. పోయిరండి. నమస్కారము (అని చేతులు జోడించుచున్నాఁడు.)

పర-నమోనమః శీఘ్రమేవ వివాహ సిద్ధిరస్తు!

నీల-శోభనపరంపరాభివృద్ధిరస్తు! శీఘ్రమేవసుపుత్రావాప్తిరస్తు! (అని ఇద్దఱును నడుచుచున్నారు.)

పెద్ద-(వారు దూరముగా పోయినతరువాత) సోమయాజులుగారూ! మీరు వెళ్ళినకార్యం అనుకూలంగా జరిగిందా?

సోమ-సిద్ధసంకల్పులు మీరుపంపిన తరువాత కార్యం అనుకూలంగా జరగకపోవడంకూడానా? సొమ్ము విషయంలోమాత్రం మనకూ వారికీ బేరంలో కొంచెం హెచ్చుతగ్గుగావున్నది. వారురొఖ్ఖం పదిహేనువందలు తెమ్మంటూవున్నారు. నేను పన్నెండువందలు ఇప్పిస్తానని చెప్పినాను. సందేహంలేదు. మీవిషయంలో యెంతశ్రమైనా పడి పన్నెండువందలకే వప్పిస్తాను. తక్కిన సంగతులన్నీ అనుకూలంగానే జరిగినవి.

పెద్ద-సొమ్ముకేమి? ఇంకారెండువందలిచ్చ్యమన్నా ఇవ్వవచ్చును. ఘట్టిగాపిల్లదాన్ని ఇస్తామన్నారుగద?

సోమ-ఆవిషయంలో మీరుయేమీ సందేహపడవలసిన పని లేదు. పిల్లదాన్ని మీకుయిప్పించడానికి నాదిపూచీ. అవతల ఇఖలక్ష సమ్మంధాలువచ్చినా పిల్లదాన్నిమాత్రం వారుమీకుకాదని మరివకరికియివ్వరు. ఆప్రకారం కామయ్యగారిచేత నేటిపుటయూన్న నేను చేతులోచెయ్యి వేయించుకున్నాను. మీరువక్క పనిమాత్రంచెయ్యవలెను. చిన్నదానితల్లిదండ్రులు మొదటినుంచీయింతపరువుగాబ్రతికిన

వారు. మీరు వారికి సొమ్మియిచ్చినమాట యెక్కడా బయలపడకుండా మహా రహస్యంగా వుంచవలెను సుమండీ.

పెద్ద—ఈసంగతులన్నీ మీరు నాకు నేర్పవలెనా? నేను మాత్రం చిన్నప్పటినుంచీ లౌక్యంలో తిరిగినవాణ్ని కానా? ఈసంగతి మీకూ నాకూ తప్ప బ్రహ్మకు తెలియనియ్యను.

సోమ—వివాహమయిన తరువాతకూడా యీ సొమ్మమాట మీ మామగారితో నైనా పొరబాటున ప్రస్తావించేరు సుమండీ! ప్రస్తావిస్తే ఆయనమనసుకు నొప్పి కలిగిపోతుంది.

పెద్ద—ఆయనమనసు కేకాదు నామనసుకూ నొప్పి కలుగుతుంది. ఆవన్నీ నే నెరుగనివా? సొమ్మిచ్చి పెళ్ళిచేసుకున్నానంటే నా ప్రతిష్ఠకు మాత్రం లోపం రాదా? మొన్న చచ్చిపోయినదాన్ని పెళ్ళిచేసుకున్నప్పుడు అయిదువందల రూపాయలు యిచ్చినాను. ఇప్పుడు నేను చెప్పినదాకా ఆ సంగతి మీకేమైనా తెలిసిందా?

సోమ—ఎందుకు తెలుస్తుంది? వారికే చెప్పవలసిన ధర్మంగనుక చెప్పినాను. లోకంలో మీకంటె ఘట్టివా రెవరు? కామయ్యగారితో మీజాతకం తీసుకునివస్తానని చెప్పివచ్చినాను. నిన్న మనమనుకున్న ప్రకారం సిద్ధంచేయించినారా?

పెద్ద—నీచస్థానంలోవున్న గ్రహాలన్నిటినీ వుచ్ఛస్థానంలో వేసి, ఇప్పటికి నాకు నలభయి యేళ్ళకంటె హెచ్చులేకుండా వుండేటట్టు పుట్టినసంవత్సరం మార్చి జాతకంవ్రాసి తీసుకురమ్మని బొజ్జయ్య సిద్ధాంతిగారితో చెప్పి, ముందుగా నిన్ననే పదిరూపాయలు చేతిలో పెట్టినాను. ఆయనగారిఆశీర్వచనప్రకారంవివాహకార్యంకలిసివచ్చిన మీదట బహుమానంకూడా చేస్తానని ఆశపెట్టినాను. ఆయనగారు యీవేళ పదిగడియలకే నేను చెప్పినప్రకారం జన్మపత్రికను పాత తాటాకులమీదవ్రాసితీసుకొనివస్తానని నమ్మకంచేసి వెళ్ళినారు. భార్య

కంలో నాకు పూర్ణాయుర్దాయమున్నూ సంతానయోగమున్నూ కూడా వేస్తానని సెలవిచ్చినారు. అందునిమిత్తమే మన రామయ్యను పంపినాను; ఈపాటి ఆయనను తీసుకొని వస్తూవుంటాడు.

సోమ—అన్నీసరేకాని రేపోమాపో పెళ్ళికూతురివారు పెళ్ళికొడుకు నాన్నలకు వస్తారు. మీరిప్పుడు మిక్కిలి వృద్ధులుగా కనబడుతూవున్నారు. నేతీసినట్టు కనబడకుండా గడ్డమున్నూ మీసమున్నూ శుభ్రముగాపనిచేయించుకొన్నైనాచేయించుకొన్నారు కారుగదా?

పెద్ద—చేతులోవున్నపని దానికేమి? రేపుప్రొద్దున్నే మంగలవాణ్ణి పిలిపించి పనిచేయించుకొంటాను. కాని శరీరంకనబడకుండా దేహంనిండా బట్ట కప్పుకొన్నా, మొగముమీది ముడుతలు యే ప్రకారం కనబడకుండా చెయ్యగలనో ఉపాయంతోచకుండావున్నది.

సోమ—అవును బట్టతలకూడా శాలువ చుట్టుకోవచ్చును. మీరన్నట్టు మొగంమీది ముడతలను కనబడకుండా చెయ్యడానికి సాధన తోచదు. మీరు మాట్లాడేటప్పుడు పళ్లూడిపోయినట్టుకూడా తెలుస్తుంది. ఇది ముఖ్యముగా ఆలోచించవలసిందేకాని, యీపని కూడా మన సిద్ధాంతిగారివల్లనే కావలెను.

పెద్ద—చేతనైనపని యేళ్ళు తక్కువవేసి జాతకాన్ని దిద్ది వ్రాయగలరుగాని, భగవంతుడుచేసిన ముసలితనానికి ఆయన యేమి చెయ్యగలరు?

సోమ—మనగ్రామంలో బొజ్జయ్యగారుతప్ప వేరేసిద్ధాంతులు లేరు. వారు పెళ్ళికొడుకునాన్నలకు ముహూర్తంఅడుగవచ్చినప్పుడు రేపురాత్రిమంచిదని సిద్ధాంతిగారిచేత చెప్పించినట్టయితే వారుఆప్రకారంగాచేస్తారు. మీరు ఆకాలంలో స్తంభానికి జేరగిలబడినట్టు దీపంకీనీడను కూర్చుండి మాట్లాడవచ్చును. పుస్తెముడిపడ్డదాకా నాలుగు

రోజులూ కొంచెం జాగ్రత్తగా వున్నపక్షమున, తరువాత మీరే లాగున కనఁబడ్డా యిబ్బంది లేదు.

పెద్ద—(ఆశ్చర్యముతో ముక్కుమీఁద వ్రేలుంచుకొని) ఆహాహా ఏమి సోమయాజులుగారి ప్రతిభ! ఎంతటి మేధావులైనా మీవలె నిముషంలో యింత మంచి వుపాయం వూహించగలరా? ఇంతవఱకున్ను సోమయాజులుగారంటే, ఏమో అనుకొన్నాను. మీశక్తి యిప్పుడు తెలిసింది.

సోమ—మీ దయ వుంచూవుండఁగా, వుపాయాలకేమి తక్కువ? ఆదరించే ప్రభువులు లేక తెలివితేటలు బయలఁబడకుండా యీలాగున మూలఁబడి వున్నాము కాని, ప్రభువు లేవుంటే ఉపాయం చేత నిముషంలో కొండలన్నీ తలక్రిందులు చేయలేకపోయినామా?

పెద్ద—మీ ముఖం ముందఱ మిమ్మల్ని స్తుతి చెయ్యవలసినది కాదు గాని, ఇంతటి బుద్ధిశాలులు మీరెంతటి పని చేస్తారన్నా నమ్మవచ్చును.

సోమ—మీ సెలవు ప్రకారం పన్నెండు వందలలోనే నేను కుదుర్చుకొని వచ్చినాను. గనుక మీరు నాకు వాగ్దానం చేసిన ప్రకారం కంసాలివాణ్ని పిలిపించి నాయెదుటనే మురుగుల జోడు నిమిత్తం బంగారము యిప్పించండి. పెద్దయ్యగారు పెళ్ళిలో మురుగుల జోడు బహుమానం చేసినారని లోకమున్నంత కాలమూ చెప్పుకొంచూవుంటాను. అందుచేత మీకు శాశ్వతమయిన కీర్తి లభిస్తుంది.

(ఇంతలో నారాయ్యయు, సిద్ధాంతియు ప్రవేశించుచున్నారు.)

పెద్ద—సిద్ధాంతిగారూ! దయ చెయ్యండి. (అని కొంచెము లేచుచున్నాఁడు.)

బొజ్జ—పెద్దలు తమరు లేవవలెనా? కూరుచుండండి.

సోమ—(పెద్దయ్యగారి వంకఁ జూచి) మన గ్రామములో బొజ్జయ్యగారు గొప్ప సిద్ధాంతులు సుమండీ,

పెద్ద-దానికి సందేహమేమి? మనసిద్ధాంతిగారు గొప్ప బుద్ధిమంతులు. మనఅందఱి పూర్వపుణ్యంచేతనూ ఈగ్రామంలో కేవలం బృహస్పతే యీప్రకారంగా అవతరించినాడుగాని మఱివకటికాదు.

బొజ్జ-మీకందరికీ నాయందు దయగనుక, అలాగునసెలవిస్తావున్నారు. నేనుబుద్ధిమంతుణ్ని కానన్నా, మీరిప్పుడు వప్పుకుంటారా? (అని పుస్తకములోని తాటాకుముక్కలను పయికిదీయుచున్నాడు.)

పెద్ద-(చేయిచాపి పుచ్చుకొనుచు) మనమనుకొన్న ప్రకారమే దీన్ని సిద్ధము చేసినారుగదా?

బొజ్జ రాత్రి రెండుఝాములవఱకూ నిద్రకూడా మానుకొని, తెల్లవారినతరువాతకూడా ఆదేపనిచేసి మీజాతకము యింతకుముందే ముగించినాను. నావ్రాతఅని తెలియకుండావుండడానికి యెడంచేతితో పట్టివ్రాసి, మాతండ్రిసుబ్బయ్యసిద్ధాంతిగారి వ్రాతపోలికకు కష్టపడి దింపినాను. పాతతాటాకువెంటనేదొరకక చిక్కులుపడుచూ, మాఅటకమీఁద బూజుపట్టివున్న పురాణపుస్తకాల కట్టమాట జ్ఞాపకంవచ్చి, చీకటిలోనిచ్చెనవేసుకొనితీసి, పుస్తకాలనన్నిటినీ వెదకి వకముక్కను సంపాదించి దానిమీఁదవ్రాసి, కొత్తగావ్రాసినట్లు తెలియకుండామీ రామయ్యవచ్చేటప్పటికి గదిలో తలుపులువేసుకొని పొగచూరఁబెట్టుచూవున్నాను. అందుచేతనే యిక్కడకు రావడానికి యింత ఆలస్యమయినది. మీవిషయంలో నేనింత శ్రమపుచ్చుకొన్నందుకు, ముందేలాగు సంతోషపెట్టుచారో ?

పెద్ద-ఆయుర్దాయం పూర్ణంగానే వేసినారుకదా?

బొజ్జ-దివ్యముగా వేసినాను. నిన్న మీతో మనవిచేసినదానికంటెనూ పదిసంవత్సరములు యెక్కువచేసినాను.

సోమ-పెద్దయ్యగారూ ! ఇందాఁకా మనమనుకొన్న సంగతిసిసిద్ధాంతిగారితో మనవిచేతునా?

బొజ్జ— ఆసంగతి యేమిటో సెలవుదయచేయండి.

సోమ— మరేమీలేదు. పెళ్ళికొమార్తెవంకవారువచ్చి పెళ్ళికొడుకు చూపులకు ముహూర్తం పెట్టండని మిమ్మల్నడిగినప్పుడు, రేపు రాత్రి పదిగడియలకు మంచిదని తమరు సెలవియ్యవలెను.

బొజ్జ— రేపు గురువారంగనుక రాత్రి దుర్ముహూర్తమని అందరికీ తెలుసునే. తొమ్మిదిగడియలకుజర్జ్యంకూడా ప్రవేశిస్తుంది. నేనొకవేళ అప్పుడేముహూర్తంపెట్టినా జ్యోతిష్కుడెవఁడైనావచ్చి యీ ముహూర్తంయేసిద్ధాంతి పెట్టినాడని అడిగితే నేనేమి చెప్పఁగలను? మీరు చెప్పినప్రకారంచేస్తే, నావృత్తికికూడాభంగంరాదా? జాతకపు సంగతిలో చచ్చినమాతండ్రిగారి పేరుపెట్టివ్రాసినానుగనక, ఇప్పుడు నన్నెవ్వఁడూ యేమీ అనేవాఁడు లేఁడు.

సోమ— నూఱుకల్లలాడి, వకయిల్లు నిలువఁబెట్టమన్న శాస్త్రం మీరువినలేదా? వివాహవిషయంలో మీరెన్నిఅబద్ధాలాడినా దోషం లేదు. వృద్ధబ్రాహ్మడికి కన్యాదానం చేయించినపుణ్యంమీకువస్తుంది. మీరీసహాయంమాత్రం చెయ్యకతప్పదు. (అని పెద్దయ్యవంకచూచి, రెండువ్రేళ్ళనుచూపి సైగచేయుచున్నాడు.)

పెద్ద— (లేచివెళ్ళి పెట్టెతీసి రెండురూపాయలను తీసుకొనివచ్చి చాటుగ సిద్ధాంతి చేతిలోపెట్టి) సిద్ధాంతిగారూ! మీరుసోమయాజులుగారి మాటతీసివెయ్యక ముఖ్యంగా చెల్లించవలెను. నామాటవినండి.

బొజ్జ— (కొంచమనుమానించి) మీరింతమంది యిన్నివిధాల చెపుతూవుండఁగా మూర్ఖప్పట్టు పట్టడఁ ధర్మంకాదు. ఈమార్గశిరశుద్ధ చవితీ గురువారం రాత్రిమాత్రం మంచిదని చెప్పి ముహూర్తంపెడుచాను. సిద్ధాంతులువచ్చినా కాచుకోవడానికి మీరొక్క సహాయం మాత్రం చేయవలెను. సోమయాజులుగారూ! మీరిప్పుడేహరిశాస్త్రిల

వారివద్దకు వెళ్ళి మనముహూర్తానికి అనుకూలముగా వక కారికను వ్రాయించుకొనిరండి.

సోమ—అదెంతపని? ఇప్పుడేపోయి మీరుకోరినప్రకారం చేయించి, రూపాయంగాలము కారికను మీయింటివద్దకు తెచ్చి యిస్తాను. భోజనానికి ప్రొద్దుపోయింది. మీరీపాటి యింటికినడవండి.

బాజ్జ—మరిచిపోకుండా తీసుకుని రావలెనుసుమండీ. (అనివెళ్లుచున్నాడు.)

పెద్ద—మీరుమజామునైనది సోమయాజులుగారూ! నేనుకూడా భోజనానికి లేతునా?

సోమ—చిత్తం. వకరూపాయ దయచేస్తారా? శాస్త్రులవారికిచ్చి శ్లోకంవ్రాయించుకొని వస్తాను.

పెద్ద—మంచిది. (అని లోపలికివెళ్ళి రూపాయతీసికొనివచ్చి యిచ్చుచున్నాడు.)

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

## తృతీయాంకము

---

### ౧ ప్రదేశము—పెండ్లికొమార్తెయిల్లు.

[ధనాల రామయ్య, వట్టి సోమయాజులు ప్రవేశించుచున్నారు.]

రామయ్య—సోమయాజులుగారూ! ఇప్పటికే చాలారాత్రి అయినది. ఇంకా సుముహూర్తం వ్యవధానంగా వున్నట్టున్నది. నేనొక నిద్రపోయి లేవమన్నా?

సోమ—ఇంటియజమానులు యింకరే నోపిక చెయ్యక పడుకొన్న, తక్కినవారెవరైనా మేలుకొంచారా? ఇంతవఱకూ మేలుకొన్నవారు మేలుకోనే మేలుకొన్నాడు. ఇఁక నాలుగ్గడియలుమాత్రం వోపిక

చెయ్యండి. రాత్రియిత్తవైయేసు గడియలకేముహూర్తంగదా! ఇప్పుడు యిరవైగడియలుపైగాఅయినది. ఈలోపుగానే పెళ్ళికొడుకువారుతర్లి వస్తారు. మనం వారికేమైన కావలసినవి జాగర్త పెట్టవలెను. ఇంక నాలుగునిమిషములు నిద్ర అవుకోండి.

కామ-మీరందరూవుండంగా నేనుచెయ్యవలసిందియేమున్నది? అన్నీ చక్కపెట్టుకుపోవడానికిమీరేవున్నారు. పెళ్ళిపనులచేత నాలుగు దినాలనుంచీ రాత్రిళ్ళుబొత్తిగానిద్రలేదు. బొజ్జన్యసిద్ధాంతిగారాలో చించి ఈబహుళ నవమినాడు మేషలగ్నముమంచిదని మొన్నచవితి నాడు ముహూర్తంపెట్టిగారు. కార్తీకమాస మవడంచేత యీనడి శీతాకాలంలో చలి మింగివేస్తూవున్నది. వాకవచ్చేలోగావక్కసారి యిట్టెమంచంమీద వొరిగిలేతునా?

సోమ-(చెవియొగ్గివిని)అదుగోదూరాన్నుంచివాద్యాలచప్పుడు వినబడుతూవున్నది. పెళ్ళికొమారుడు వస్తున్నాడు.

కామ-ఓసీ! ఓసీ! పెళ్ళివారు వస్తూవున్నారు. లేవవే, లేవవే. (అని మంచమువద్దకుపోయి అజ్ఞానమ్మను లేపుచున్నాడు.)

అజ్ఞా-(కన్నులు నలుపుకొనుచు లేచివచ్చి) పెళ్ళికొమారుడు వచ్చుచున్నాడు. హారతిపట్టుకొని వెళ్ళడానికి పళ్లెమెక్కడవున్నదో కనబడదు.

(ఇంతలో పెండ్లికొమారుడును, పేరిశాస్త్రులుమొదలగువారును ప్రవేశించుచున్నారు.)

కామ-వియ్యాలవారందరూ వచ్చినారు. పేరిశాస్త్రులు గారూ! వారినందరినీ చాపలువేసి కూర్చుండబెట్టండి.

బంధువులు-చాపలకేమి? సుముహూర్తం సమీపిస్తూవున్నది. పెద్దయ్యగారిని తీసుకొనిపోయి మంగళస్నానాలు చేయించండి.

కామ—పేరిశాస్త్రిగారూ! పెళ్ళికొమారుణ్ని లోపలకు తీసుకొనివెళ్ళి వుదకము ఇప్పించండి.

పేరిశా—పెద్దయ్యగారూ! ఇలాగున దయచెయ్యండి. పెద్దలయినారు జాగ్రత్తగానా చెయ్యి పట్టుకొని వత్తురండి (అని మెల్లగానడిపించుకొని దొడ్డిలోనికిఁ గొనిపోవుచున్నాఁడు.)

అజ్జా—ఓసీ! కన్నమ్మా! పెళ్ళికుమారుఁడు అప్పుడే స్నానానికి వస్తున్నాఁడు కాఁబోలును. వేణ్ణీళ్ళు పెట్టినావా?

కన్నమ్మ—అప్పుడే కాదా నిద్రపోతూవున్నదాన్ని లేపి చెప్పినావు. నిప్పుపట్టకవచ్చి పొయిలో వేస్తాను. ఎంతసేవు? తాటాకులమంట పెడితే నిముషంలో నీళ్ళు కాగుచవి.

పేరి—అమ్మా! అజ్జానమ్మగారూ! పెళ్ళికొమారుఁడుస్నానానికి వచ్చినాఁడు. నీళ్ళుసిద్ధము చేయించినారా?

అజ్జా—నాయనా! నేనెన్ని పనులకని చావను. అన్నింటికీ నేనొక్కదాన్ని కొట్టుకోవలెను. అవతలవిఘ్నేశ్వరపూజకు బియ్యమే తేనా? ఇవతల అల్లుడికి నీళ్ళే యియ్యనా? కాలికి సహాయము వచ్చేవారు లేరుగదా? చేతికి సహాయమువచ్చేవారు లేరుగదా? నీళ్ళుపెట్టుమని జాముకిందనే కన్నమ్మతో చెప్పినాను. ఆవిడకు ఇంకాపొయిలో నిప్పువెయ్యడానికే తీరుబడికాలేదు.

కన్న—నీకేం మాటలు చెపుచావు. పనిచేశేదానికి కష్టంనాకు తెలుస్తుంది. నూతిలోనుంచి బిందెడునీళ్ళు పైకివచ్చేటప్పటికి గుణ్లు మీదికి వస్తవి. నాకుమాత్రం పని చెయ్యడానికి వెయిచేతులున్నవా? వెయి కాళ్లున్నవా?

పెద్ద—దానికేమిలెండి. శాస్త్రప్రకారం మంగళస్నానాలు వేడినీళ్ళతో చేయనేరాదు. పేరిశాస్త్రిగారూ! నూతిదగ్గఱకు వెళుదాం రండి. కన్నమ్మనీళ్లుతోడిపోస్తుంది. (అని నడచుచున్నాఁడు.)

కన్న—పెద్దయ్యగారూ! ఈపెత్తుపీటమీఁద కూర్చుండండి. (అని నాలుగు చేదలు నీళ్లుతోడి మీఁదపోయుచున్నది)

పెద్ద—అహహహాహా! ఇహిహిహీహీ! ఉహుహుహూహూ! (అని వడఁకుచు వెనుక కొఱుగుచున్నాఁడు)

పేరిశా—(తటాలునఁ బడకుండఁ బట్టుకొని) కన్నమ్మా! కన్నమ్మా! ఇఁక నీళ్ళు పొయ్యకు.

కన్న—ఏమినాయనా? ఏమినాయనా? (అని పెళ్ళికొమారుని తడివిచూచి పెదవివిఱిచి పెద్దగొంతుకతో) ఓఅజ్ఞానమ్మా! ఓశామయ్యగారూ! పెండ్లికుమారుఁడు మాటలేకుండా పడిపోయినాఁడు. వేగిరము రండి. (అని కేక వేయుచున్నది.)

(ఆకేకవిని అందఱును లోపలినుండి గొల్లున పరుగెత్తుకొని
వచ్చుచున్నారు.)

సోమ—మీరెవ్వరూ తొందరపడకండి. పెద్దయ్యగారికి వచ్చిన భయములేదు. శాస్త్రిగారూ! వేగిరం చెవులు ముయ్యండి.

కన్న—ఇంకాయెక్కడిపెద్దయ్యగారునాయనా? శీతాకాలంలో రాత్రిరెండుఝాములవేళ చన్నీళ్లు మీఁదపడఁగానే మీఁదిప్రాణాలు మీఁదలేచిపోయినవి (అని చేతులు చఱచుచు వెక్కివెక్కి యేడ్చుచున్నది.)

పేరిశా—కన్నమ్మా! బంధువులందరూ వూరకుండఁగా, మధ్య పనికివచ్చినదానవు నీవు రాగాలుపెడుచావేమి? శుభకార్యం ముందు పెట్టుకొని, ఇటువంటిఅవాచికాలు పలుకరాదు. ఊరుకో.

సోమ—పెద్దప్రాణముగనుక వడగళ్ళవలెనీళ్ళుమీఁదపడఁగానే దేహము కొయ్య అయిపోయినదిగాని, మరేమీలేదు. ఇంకకొంచము సేపటికి తెలివి వస్తుంది, లోపలికి తీసికొని పోదాముపండి. (అని పేరి

శాస్త్రియు తానును తోడుపట్టి పంచపాళిలోనికిఁ గొనిపోయి చాప మీఁద పరుండఁబెట్టుచున్నారు)

పేరిశా—కామయ్యగారూ! అదడివి పాతతాటాకులు నాలు గందకోండి. మంటవేతాము. ఓరీ! చాకలవెంకా! కాగడాకు వక అకు ముట్టించి యీలా గిచ్చిపోరా. (అని మంటవేయుచున్నాఁడు)

పెద్ద—(మంటకాకచేత కొంచెముసేపటికి తెలివివచ్చి కన్నులు విప్పిచూచి) సోమరాజుగారూ! నావంటి పడుచువాళ్ళకే చలియిలా గున ముంచుకనిపోచూ వున్నది. ఇక ముసలివాళ్ళేలావుంచారోగదా? పేరిశాస్త్రిగారూ! ముహూర్తసమయముమించిపోతుంది. వేగిరంవివాహవేదిక దగ్గఱకు వెళదాముదండి (అనిలేవఁబోయి లేవలేకున్నాడు)

సోమ—మీరు కొంచెం వోపిక చెయ్యండి. నేము తీసుకొని పోతాము. (అని మెల్లగా లేవఁదీసి తానును పేరిశాస్త్రియు చెఱియొక చేయియుఁ బట్టుకొనిపోయి పీటమీఁదఁ గూరుచుండఁబెట్టుచున్నారు.)

పేరిశా—కామయ్యగారూ! పెద్దయ్యగారుచిన్నప్పటినుంచీమహా సుకుమారులుసుమండీ. చూచినారా? చన్నీళ్ళకు తాళలేకపోయినారు

(నాటితంతంతయు శాస్త్రోక్తముగా జరగిన మీఁదట పెండ్లి
కొమారుఁడు పిడిదికి బోవుచున్నాఁడు.)

---

౨ ప్రదేశము—పెండ్లికూమారుని యిల్లు.

[నీలకంఠ సోమయాజులుగారు మొదలగుసభికులుకూరుచున్నతరువాత
బట్టతల-అలవేణియు, సొట్టకాలి-హంసయానయు, చిలికి
కన్నుల-చకోరాక్షియు, నత్తినోటి-మంజువాణియు,
ప్రవేశించుచున్నారు.]

మంజువాణి-సస్సస్సభవారికి దద్దణ్ణాలండి.నన్నన్నాదరామ క్రియ మీఁది వవ్వర్ణం పప్పప్పడుదునా అండి? (అని శంఖధ్వనితో

అఅఅఅయ్యొయ్యోయెగటాయనే. పప్పయ్యదమీఁదా సేరి పప్పవ్వాళించి యుండేసామికి. అయ్యొయోఁయెగటాయనే, (సభికులవంకఁజూచి) అసలే నన్నన్నాది కికికిక్కుచుగొంతుకఁడి దద్దద్దానిమీఁద నన్నన్నా సెల్లెలూ నెక్కేనూపొమ్మన్నాటాపూటాఅఅనుకుంటేబొబ్బొంగుపోయిందండి.

[ఇంతలో కొందఱు తాంబూలమునకు వచ్చిన పెద్దమనుష్యులు
ప్రవేశించుచున్నారు.]

నీల—భోగరాజుగారూ! దయచెయ్యండి. భీమరాజుగారూ! కూర్చుండఁడి. సుబ్బారావుగారూ! మీరు పయికిదయచెయ్యవలెను.

మంజు— (అందఱికిదండముపెట్టి) అఅఅయ్యొయ్యో—మద్దెల తి త్తి త్తిన్నగా వాయించు— ఆఅఅయ్యొయ్యో—త్రిత్రిపుటతాళము—అఅ అయ్యొయ్యో—లల్లయ పడడంలేదు.

భోగ—భీమరాజుగారూ! దీనికంఠముచూచినారా? కొంచెము వత్తి అన్నమాట వక్కటేకాని, కిన్నరస్వరముసుమండీ.

భీమ—కొంచెం బొంగుగాకూడా వున్నది.

భోగ—బొంగయితేనేమి? ఎంతమాధుర్యంగా వున్నదో కనిపెట్టినారు కారుగదా?

భీమ—ఆపాడేపాటలో కొన్ని అపస్వరాలుకూడావున్నవిసుమండీ.

భోగ—ఆఅపస్వరాలుకవిత్వముచెప్పినవారివిగాని, దానివి కావు.

భీమ—పతాకహస్తము పట్టినప్పుడు వేళ్లుతిన్నగా వంచలేదేమి?

భోగ—అంతకంటె వేళ్లువంగితే సాగనేలేదు. ఆలాగే వుండవలెను.

భీమ—నాట్యముచేసేటప్పుడుభృంగివలె కాళ్లెత్తెత్తి వేస్తుందేమి?

భోగ—భరతశాస్త్రమందు మీకుబాగా పరిచయంలేదుగనుక ఆలాగంటున్నారుగాని దానిపాదాభినయ మెంత అందమయినది?

భీమ—ఎంత దివ్యమయిన నాట్యమూ గానుంటే మూడు వందల రూపాయలు పెట్టి కన్నెరికము చేసి, మీరు పూరికే నెలకు ముప్ఫయి రూపాయలిచ్చి దాన్ని వుంచుకుంటారా?

భోగ—అహహహాహా! (అని నవ్వి) ముప్ఫయిరూపాయలు లెఖ్ఖయేమిటి? నాసొమ్మంతా దానిదే. ఒక్కనాటిదాని "పాతివ్రత్యమహిమ" కు యేమి యిచ్చినా యివ్వవచ్చును.

భీమ—పరమేశ్వరావధానులుగారు రాత్రి మీయింటికివచ్చి తాంబూలానికి పిలువలేనట్టన్నదే.

భోగ—మాయిల్లు చాలాదూరమయినందున, చీకట్లో రాలేక పోయినారు. పెద్దయ్యగారి స్వజనములోవారను మమ్మల్ని వేరే పిలువవలెనా? నాకటువంటి అభ్యంతరంలేదు. పిలువకపోయినా నేను అనేకచోట్లకు వెళుతూనేవున్నాను. నామాటయందు నమ్మకము లేకపోతే, ఈమంజువాణిని అడిగిచూడండి.

భీమ-అక్కరలేదు. మీరుమాత్రము నాతో అబద్ధమాడుతారా? వెనుక మంజువాణి మేళముకట్టినప్పుడు మాయింటికిన్ని పిలువకుండానే వచ్చినారు అనునవును. అందఱున్ను రూపాయరూపాయవసూలు వేస్తే, మీరు నాలుగురూపాయలు వేసినారు. నాకు బాగా జ్ఞాపకమున్నది.

సుబ్బా—ఓసీ! మంజువాణీ! నీవు కొంచెంసేపు అవతలవుండి, ఒక్కమాటు చకోరాక్షిని గజ్జెకట్టుమను.

భోగ—మీరు వుంచుకొన్నది కావడంచేతనా, దాన్ని ఆడుమంటూ వున్నారు.

సుబ్బా—తొందరపడక గజ్జెకట్టనియ్యండి. మీదానిపాటు సాగనూ మాదానిపాటసాగనూ చిత్తగింతురుగాని.

[నత్తినోటి మంజువాణి వెనుకకుపోయి, చికిలికన్నుల చకోరాక్షి గజ్జెకట్టుకొని ముందుకువచ్చి నిలుచున్నది.]

చక్రో—(చేతులుజోడించి) సభవారికి దణ్ణాలండి.

సుబ్బా—ఏదీ కాంభోజిరాగముమీఁద "నోరెత్తనైతినమ్మా" అన్నపదముపాడు.

చక్రో—నోరెత్తనైతినమ్మా-ఓచెలియ నే-నోరెత్తనైతినమ్మా. పీరువారందఱు వింటే సిగ్గయ్యీనని-నోరెత్తనైతినమ్మా.

సుబ్బా—భీమరాజుగారూ! కొదుపవన్నీ అట్లావుండఁగా, దీని నేత్రాభినయంవక్కటే లక్ష చేస్తుందిసుమండీ

భీమ—నేత్రాభినయానికేమిగాని, పాదాభినయములో సొట్ట కాలి హంసయానఅయినా దీనికి చాలనుసుమండీ.

(ఇంతలో మఱికొందఱు పెద్దమనుష్యులు తాంబూలమునకువచ్చి ప్రవేశించుచున్నారు.)

నీల—సోమయాజులుగారూ! దయచెయ్యండి; రామస్వామి గారూ! రండి; వెంకప్పగారూ! కూర్చుండండి.

చక్రో—(అందఱికి దండముపెట్టి)

కలికిరో మోవిపై * కాటుకనిగ్గులతోను
చెలువుడింటికివచ్చెనె*అందుకు లోలో
పలనె నొవ్వుకొసె*పలికెనందుకు విభుఁ
డులికి రంతులు చేసెనె*ఆసుద్దులు
చెలులడిగి తేనున*వ్వులకనివారితో
మలయజగంధిరో*మలుగు చేసితినింతే.
నోరెత్తనైతినమ్మా. ఓచెలి-

సోమ—రామస్వామిగారూ! పెద్దయ్యగారి ముఖ్యస్నేహితులు గంగరాజుగారు యెందుకువచ్చినారు కారో మీరెఱుఁగుదురా?

రామ—ఆయన పదిదినాలనులోపల తహశ్శీల్దారుగారు మొదలయినవారియిళ్లలో సుమారు పదిపదిహేను రూపాయలు వసూలు

చదివించినారు. ఆయనకువచ్చేది నెలకు పదిరూపాయలు జీతము గదా? ఆపదిరూపాయలూ యేప్రకారంగా పోయినవి. చేతిలో సొమ్ములేక యిక్కడికి రావడం మానుకొన్నారు.

సోమ—ముఖ్యస్నేహితుడికన్న తహశ్శీల్దారుగా రెక్కువా? స్నేహితునిమనస్సు సంతోషపెట్టడానికి యేఅప్పోసొప్పోచేసి పక్క రూపాయ తీసికొనిరాలేకపోయినారా?

రా—మొన్న శిరస్తాదారుగారి యింటివద్ద యివ్వడానికిచేసిన అప్పుకే ఋణప్రదాత నిత్యమూ తొందర పెడుతూవుండగా, నేటి ఉదయాన్న దాహంతాగేకంచుచెంబు తాకట్టుపెట్టిబదులుతీర్చినారు. ఇప్పుడు మళ్లీయెక్కడ ఋణము తేగలరు?

సోమ—అటువంటి స్థితిలో శిరస్తాదారుగారి యింటికీ, తహశ్శీల్దారుగారి యింటికీ, యెందుకు వెళ్ళవలెను?

రామ—అక్కడికిమాత్రం వారిమీంది భక్తిచేత వెళ్ళారను కున్నారా? వారిని పట్టివున్న అధికారపిశాచానికి వెఱచి వెళ్ళినారు. మొన్నకోనుటి సుబ్బిసెట్టి తహశ్శీల్దారుగారియింట్లో వనూలు వెయ్యకపోవడంచేత, ఆయనభార్యామణి గుమ్మంలో పెంటవున్నదని వంక పెట్టి నాలుగురూపాయలు జుర్మానా వేశారు చూచారుకారా?

సోమ—మన హనుమన్లుగారుకూడా వచ్చారుకారేమి? పొద్దున్నే కనబడి నాతోవస్తానని చెప్పినారే.

రామ—ఆయన వుదయాన్నుంచీ రూపాయకోసమే తిరుగుతూ వున్నారు. ఎక్కడా అప్పుపుట్టలేదట! రూపాయిలేకుండావస్తే నలుగురూ పరిహాసంచేస్తారు గదా అనుమాత్రం వెయ్యకపోతే పరువు తక్కువగా వుంటుందని యెంచి రాలేదు, పట్టితాంబూలం చేతులో పెట్టి వెళ్ళితే, తెల్లవారింది మొదలుకొని రూపాయ చేతిలోపడే దాకా నిత్యమూవచ్చి బోగందె పీకుతూవుంటుంది.

సోమ—ఈ హేతువుచేతనే పెద్దయ్యగారి మిత్రులు చాలా మంది రాలేకున్నారు.

(చెవిటి చయనులుగారు చేయిపట్టుకొని తీసికొనిరాగా గుడ్డి గున్నయ్యగారు ప్రవేశించుచున్నారు.)

నీల—చయనులుగారూ! రండి. గున్నయ్యగారూ! దయచెయ్యండి.

గున్న—పరమేశ్వరావధానులుగారా పలకరిస్తూవున్నారు?

చయ—నీలకంఠ సోమరాజులుగారూ! యింత పొద్దుపోయి వచ్చారేమని అడుగుతూవున్నారా?

గున్న—చయనులుగారూ! పాటకేంగాని ఈబోగంది ఆట దివ్యంగా ఆడుతూవుంది. నిజం చెపుతూవున్నాను. నేనంధుణ్నని నమ్మకపోయేరుసుమండీ.

చయ—చెవిటివాణ్నయితే అయినానుగాని దీని ఆటను నేను మెచ్చుకోను. ఇంతకంటే చక్కగా ఆడేవాళ్లను లక్షమందిని చూచాను. నేను మెచ్చుకొన్నా దీనిపాటను మెచ్చుకోవచ్చును.

వెంకప్ప—అదుగో భోగరాజుగారు వచ్చి ఆమూలకూర్చున్నారు.

సోమ—మంజువాణి వచ్చినతరువాత వారు రాకుండావుంటారా? మొన్నటి వుదయాన్న కళ్ళులేని బీదముసలివాడు నకడు రెండు దినాలనుంచి అన్నంలేకవచ్చి యాచించినప్పుడు, చిల్లిగవ్వయినా లేదన్నారు. నేనుకూడా బహువిధాల చెప్పిచూచాముగాని కార్యం లేకపోయింది. ఆరాత్రి శిరస్తాదారుగారి లోపల నాలుగు హావాయీలు వనూలువేశారు సుమండీ.

వెంక—అదుగో సుబ్బారావుగారుకూడా వచ్చినారు.

[పరమేశ్వరావధానులుగారు గంధమును, నీలకంఠసోమయాజులుగారు తాంబూలమును ఇచ్చినతరువాత, సోమరాజుగారు, భీమరాజుగారు, రామస్వామిగారు, వెంకప్పగారు, లేచి ఒక్కొకరు నూపాయచొప్పున తాంబూలములోపెట్టి బోగమువానికిచ్చి వెళ్ళిరి.]

భోగ—నీలకంఠ సోమయాజులుగారూ! వక్కసారిమంజువాణిచేత సభలో కాలువాపట్టింతామా?

నీల—ఇప్పటికే రాత్రి రెండుగంటలయినది. ఈపాటి సభ చాలింతాము.

(భోగరాజుగారును, సుబ్బారావుగారును, నాలుగేసి రూపాయీలు తాంబూలములోఁబెట్టి తమ ప్రియురాండ్ర చేతిలోఁ బెట్టుచున్నారు.)

పర-మంజువాణీ! యీపాటి మేళం చాలించిమీయింటికిపోవచ్చును

(భోగరాజుగారును, సుబ్బారావుగారును తోడరాఁగా వేశ్యలు నిష్క్రమించుచున్నారు.)

---

## చతుర్థాంకము

---

ప్రదేశము—పెండ్లికూఁతువారి గృహముకోసి చావడి.

(దంపతులు పీటలమీఁదకూర్చుండియుండఁగా, భాగవతుల పాపయ్యసోమయాజులు, సాగి సర్వావధానులు మొదలగు వారు ప్రవేశించుచున్నారు.)

పాప—ఇప్పుడు మధ్యాహ్నం మూడుఝాములైంది. మనం నాల్గుగ్గడియలనుంచి సభాపతి వేములవెంకయ్యగారికోసంకనిపెట్టుకుని వున్నాము. అదుగో ఆయనకూడా వస్తూవున్నారు. ఇంక సంకల్పానకు సభవారి అనుజ్ఞ?

సభవారు—అయంముహూర్తస్సుముహూర్తోస్తు.

(వేముల వెంకయ్య ప్రవేశించుచున్నాఁడు.)

పాప-సభాపతిగారూ! దయచెయ్యండి. మీనిమిత్తం ఝాంనుంచి సభవారందరూనిరీక్షిస్తూవున్నారు. ఇంత ఆలస్యంచేసినారేమి?

వెంక—శ్రీమటి కన్నయ్యసెట్టిగారిలోపలసదస్యం కాగా నేనేనూ మీ వెంట నేబయలుదేరినాను. సంభావన తిన్నగాయివ్వలేదని పేరూరు నుంచి వచ్చినబ్రాహ్మలు తోరణాలు తెంపివేసికన్నయ్యసెట్టినిమీద పడికొట్టడానికి సిద్ధమయినారు. నేను వాళ్ళను బతిమాలుకొనినాలుగు రూపాయిలు కన్నయ్యసెట్టిచేత ఇప్పించి కలహం నివారించివచ్చే టప్పటికి యింత సేపయింది. అందులో నాకూ—డా రెండురూపాయల సొమ్ము లాభించింది.

సర్వా—గాడిదకొడుకు కన్నయ్యసెట్టి సంభావన మిక్కి—లితక్కు—వగా యిచ్చినాడునుమండీ. పెద్దకొడుకు పెళ్ళిచేస్తూ తనబ్రతుకుపెట్టు కొని తలకొకడబ్బా సంభావనయిస్తాడు?

వెంక—పెద్దయ్యగారిలోపల పెళ్ళవుచుందనివిని యిరవై ఆమడ నుంచి బ్రాహ్మలువచ్చారు. కాని కానిచొప్పునయిచ్చినా, ప్రత్యేకంగా సంభావనకిందమూడువందలయాభై రూపాయిలు అయినవి. సంభావన పుచ్చుకున్నవాళ్ళే కొందఱు మళ్ళీమళ్ళీవచ్చి రెండుమూడు పర్యాయ ములు పుచ్చుకొన్నారు.

పెద్దయ్యగారు—సభాతాంబూలం వైదీకులలో యెవరికి యిప్పించినారు?

వెంక—అమలాపురాన్నుంచివచ్చిన చతుశ్శాస్త్రపండితుడైన వారశాస్తుర్లగారికి యిప్పించవలెనని చాలాశుంది ప్రయత్నంచేశారు. కాని వారిమాట పడనివ్వక గ్రామంలోవుండేవారి కేకానియివ్వగూడ దని పట్టుపట్టి తుదకుమనఅప్పన్నబావగారి కేయిప్పించినాను. నామేన ల్లుడు శంకరశాస్త్రికి యిప్పించా లనుకున్నానుగాని, వాడు ముండ యింటికిపోయి వేళకురానందున వల్లపడ్డది కాదు.

పాప—సభాపతిగారూ! సభాతాంబూలానికి సమర్థుడయింది,

వెంక — శ్రీమతస్థులకూ తాంబూలాలు పెట్టి పళ్ళెం అక్కడ వుంచండి.

ముడుంబి నరసింహాచార్యులు — విశిష్టాద్వైత మతస్థులలో సభా తాంబూలం నాకు రావలెను.

సర్వా — విద్వాంసుఁడు మాడభూషి మాధవాచార్లుగారు వుండగా నీకెలా వస్తుంది?

వెంక — ఆయనమాట చూచుకోందాంగాని, అద్వైతతాంబూలం ముందుగా మా శంకరశాస్త్రికిప్పించండి — ఓరీ! శంకరశాస్త్రీ! నివ్వు లేచివచ్చి సభాతాంబూలం వుచ్చుకో.

బ్రాహ్మణులు — అయ్యయ్యో! చదువుకొన్న పెద్దవాళ్ళందరమూ వుండగా వక్క ఆశీర్వచనపనస్సైనా రాని యితని కేం తాంబూలం? ఆలోచించి మరీ యివ్వండి.

వెంక — మా గ్రామంలో మర్యాదయితే, మా వాడు యీ వక్క చోటనే పుచ్చుకొన్నాడా యేమిటి? వాడుండగా సభా తాంబూలం మరియెవరికీ రాదు. తండ్రిపోయిన ముప్ఫై సంవత్సరాలనుంచీ గ్రామంలో జరిగే ప్రతివివాహంలోనూ సభాతాంబూలం వాడికే యిస్తూవున్నది. ఈ ఆచారం తప్పించడానికి యెవరి చేత అవుతుంది? ఓరీ! శంకరశాస్త్రీ! ఎవరడ్డ వస్తారో చూతాం లేచివచ్చి తాంబూలం పుచ్చుకో.

సర్వా — రెండో తాంబూలం మాధవాచార్లుగారికి దయచెయ్యండి.

వెంక — నల్లపడను. మొన్న గొల్లమల్లిగాడింట్లో వివాహం జరిగి నప్పుడు సభాతాంబూలం నరసింహాచార్లకే ముట్టింది. అప్పుడు మాధవాచార్లు దగ్గిరవుండి యేంచేశాడు? అప్పుడు రాంది యిప్పుడు మాత్రం యెలావస్తుంది? నాలుగుముక్కలు చదువుకోంగానే సరిఅనుకున్నారా? నంబి నరసింహాచార్లు పులిహోర దగ్గోడనమూ పెట్టినందుకే అగ్రతాంబూలం యివ్వవచ్చును. నరసింహాచార్యులూ! వచ్చిపుచ్చుకో.

పాప—సభలో ద్వైతమతస్థులెవరైనా వున్నారా?

వెంక—గోవిందరావుపంతులుగారి వంటాచార్లు ఆ మూలకూర్చున్నాడు. వాడో తాంబూలం ఆయన్ని పుచ్చుకోమనండి. ఆయన తప్ప మాధ్వులలో మరి యెవరున్నారా లేరు.

పాప—సభా తాంబూలాలు యివ్వడం అయినది గనుక సభవారి పాటి మహదాశీర్వచనం కానియ్యవచ్చు.

(అప్పుడు బ్రాహ్మణోత్తములు మహదాశీర్వచనము చేసి దంపతులమీద అక్షతలను జల్లుచున్నారు.)

పెద్ద—బ్రాహ్మణులను గొడ్డిపెట్టినారా?

బ్రాహ్మణులు—పెద్దయ్యగారూ! మీ ప్రసిద్ధివిని యిరవై ఆమడ నుంచి వచ్చినాము. ఇప్పుడు విరివిగా సంభావన యిచ్చారంటే, మీ యశస్సు లోకంలో ఆచంద్రార్కంగా వుంచుంది. ఇక మీరు చేసే కార్యాల్లో యింతకంటే గొప్పవి లేవు.

పెద్ద—మీరందరూ దొళ్లోకిపోండి సంభావనలో లోపం జరగనియ్యను.

పాపయ్య—సంభావనకి మిత్తం సొమ్ము తీసుకురావడానికి లోపలికి వెళ్ళినారు. వారు వచ్చేదాకా మీరు యిక్కడనుంచి కదలవద్దు. శాస్త్రీ! ఈనడుమ నీవేమో కామయ్యగారిదగ్గిర, ముసలివాడికి కన్యనుయిచ్చి చిన్నదానికి యివ్వడంకంటె రెండురెట్లుగా ధనం పుచ్చుకోవచ్చుననిన్నీ, ముసలి బ్రాహ్మడికి కన్యనిచ్చి ధనం పుచ్చుకొన్నవాడికి కోటికన్యాప్రదానాలఫలం కలుగుతుందనిన్నీ, రెండు స్మృతివచనాలు చదివినావట! వక ముసలిబ్రాహ్మడికి కన్యను మాట్లాడవలసి వున్నది. ఆ శ్లోకాలు యేస్మృతిలోవో చెప్పి, నాకు వ్రాసియిస్తావా?

శాస్త్రి—కామయ్యగారిని వొప్పించడానికి మూడుదినాలు కష్టపడి నేను ఆ శ్లోకాలను కల్పించినాను. మొన్న వాటిని తీసుకుపోయి హరి

శాస్త్రుర్లవారికిచూపించేటప్పటికి, వాటిలో ఆరోఅక్షరం లఘువువుండ వలసిందానికి గురువుపడ్డందున రెండుశ్లోకాలకూ ఛందోభంగం కలిగిం దని సెలవిచ్చారు.

[బ్రాహ్మణుల సందడిని దొడ్డిలోకిఁబొండని కేకలువేయుచు, చేతిలో రూపాయలసంచిని పట్టుకొని నీలకంఠ సోమయాజులుగారును, పరమేశ్వరావధానులుగారును ప్రవేశించుచున్నారు.]

పెద్ద—మనం సంభావన యెంతయిస్తే బాగా వుంటుంది?

నీల—అంతదూరాన్నుంచిబ్రాహ్మలు వచ్చినప్పుడు పెద్దవాళ్ళకు రూపాయచొప్పునా చిన్నవాళ్ళకు అర్ధరూపాయచొప్పునా అయినా యివ్వకపోతే బాగావుండదు.

పర—వేడుకసమయంలో మనం సొమ్ముకు వెనకాముందూ చూడకూడదు. వకరికి వకలాగునామరివకరికి మరివకలాగునా యివ్వడంకంటె చిన్నాపెద్దా అనేభేదం విచారించకుండా అందరికీనొకంగా రూపాయచొప్పునే యిస్తే బాగావుంటుందని నేను తలుస్తాను.

పెద్ద—మీరుయిద్దరూ ఆలోచించి మీయిష్టంవచ్చినట్టు పంచి పెట్టండి. ఇప్పుడు రెండువేలరూపాయలున్నవి. దొడ్డిపద్దకు నడవండి.

బ్రాహ్మ-నీలకంఠసోమయాజులుగారూ!—నాకు—నాకు—నాకు—నాకు.

నీల-ఏమయ్యాబ్రాహ్మడా! నీవొకసారివుచ్చుకున్నట్టున్నావే.

బ్రా—నేనుకాను. యెవరినిచూచి వన్ననుకొన్నారో.

పర—లోపల బ్రాహ్మలు కొట్టుకొంచున్నారు—మీాదకు రాకు మీాదకురాకు. మీారందరూ నన్నిల్లాచుట్టుకుంటే నేనెల్లా సంభావన యిస్తాను?

బ్రా—నేను సోమయాజుల్ని. నాకందరికంటె విశేషంగా ముట్టవలెను.

పర—ఏమయ్యా! నీవక్కడవుచూక నిమళ్ళీయిక్కడికివచ్చావు?—
నీలకంఠసోమయాజులుగారూ! యీబ్రాహ్మడికి మీరివ్వలేదా?

నీల—యేదీ మొఖంచూశ్నయ్యండి. యీబ్రాహ్మడు నాదగ్గిర
కూడా రెండుమూట్లు పుచ్చుకొన్నట్లు అనుమానపడ్డాను. ఇందాకా
మూశారు కారా? నేనీయన్నడిగినాను.

బ్రా—రామరామా! పెద్దలు మీరేయిలాగ అబద్ధాలాడు
చున్నారేమయ్యా?

నీల—మీరాసాహేబూ! దొడ్లో బ్రాహ్మల్ని యివతలికి రాని
య్యరు. మేంవెళ్ళిపెద్దయ్యగార్నడిగి సొమ్ముతీసుకుని యిప్పుడేవస్తాం.

(అని నీలకంఠసోమయాజులుగారును పరమేశ్వరావధానులు
గారును లోపలికి నడుచుచున్నారు.)

పర—నీలకంఠసోమయాజులుగారూ! మీరుపంచిపెట్టినవెయ్యి
రూపాయలలోనూ మీరేమిగుల్చుకున్నారు?

నీల—ముప్ఫయిరూపాయలుతీసి మొదట్నేఅంగోస్త్రంకొంగున
కట్టుకొని బొడ్లోదోపుకున్నాను. అంతకంటె నేనేమీ తీసుకోలేదు.
మీరేంతీసుకున్నారు?

పర—నేను చివరకు తీసుకుందామనుకొని సంభావనయిచ్చి
సుమారు పాతికరూపాయిలు చేతులోపట్టుకొనేటప్పటికి పేరూరి
బ్రాహ్మలు మీదబడి గుప్పిలి విదిలించుకుని తీసుకుపోయినారు.
వాళ్ళనువదల్చుకొని యివతలపడడమే దుర్ఘటమయింది.

నీల—పెద్దయ్యగారు వుండేచోటికి వచ్చాం, ఇక యీసంగతి
మాటాడకండి.

పర—పెద్దయ్యగారూ! అధమం యింకా రెండువేల రూపాయ
లైనా తెప్పిస్తేనేగాని నూటదక్కేవుపాయం కనబడదు. రెండువేల
రూపాయలూ అయినవి. ఇంకా దొడ్లోవారు తరగనేలేదు.

నీల—వేగిరం రూపాయ లిప్పిస్తేనే గాని పడువు నిలవదు. అవతల బ్రాహ్మలల్లరి చేస్తూవున్నారు.

పెద్ద—యిదివరకే పెళ్ళినిమిత్తం మాన్యం మీద పదిహేను వందల రూపాయలు బదులిప్పించాను. మన మాన్యం చేస్తూవున్న వెంకటరెడ్డి సాక్షిల్లో కూర్చున్నాడు. ఇలాపిలవండి.

[వెంకటరెడ్డి ప్రవేశించుచున్నాడు]

పెద్ద—వెంకటరెడ్డీ! సంభావననిమిత్తం మాకింకా రెండువేల రూపాయలు కావలసివున్నవి. ఇదివరకు తాకట్టుపెట్టిన మాన్యం మీద యిప్పుడే ఆసొమ్మివ్వవలెను.

వెంక—ఇదివర్కే మాన్యం మీద పదిహేనువందల రూపాయ లిచ్చాను. మూడురోజుల్లో సొమ్మివ్వకపోతే మాన్యాలు నాకిందొచ్చేలాగు పత్రం రాసిస్తే నీకాని నేను సొమ్మివ్వను

పెద్ద—అలాగే వ్రాసిస్తాను. నీవింటికివెళ్ళి సొమ్ముతెస్తూవురా. యీలోగా పత్రం వ్రాయించి వుంచుతాను.—నీలకంఠసోమయాజులుగారూ! యీ కాగితంమీద వెంకటరెడ్డి పేరిట్ను నా పేరెట్టి పత్రం రాసి మీరిద్దరూ సాక్షివ్రాళ్ళు చెయ్యండి. నేను నాచేవ్రాలు చేస్తాను.

[వెంకటరెడ్డి యింటికి బయిలుదేరి వెళ్ళి సొమ్ము తెచ్చి పత్రముపుచ్చుకొని సొమ్మిచ్చుచున్నాడు]

పెద్ద—సోమయాజులుగారూ! సొమ్ము తీసుకొనిపోయి వేగిరం సంభావన కానియ్యండి. పడమట రాలుగడియల పొద్దుంది. సంభావన పూర్తిఅయితేగాని భోజనాలకు లేవడానికి వల్లపడదు.

బ్రాహ్మణులు—(వొకరితో) రూపాయలు వస్తూవున్నవి—రూపాయలువస్తూవున్నవి—నీలకంఠసోమయాజులుగారూ! మేము గుంటూరి నుంచివచ్చాము—పరమేశ్వరావధానులుగారూ! మేము విజయనగరాన్నుంచి వచ్చాము.

నీల—తొందరపడకండి వస్తూన్నాము.

బ్రాహ్మ—సుబ్బావధానులుగారూ! మనం పెద్దయ్యగారేమో వరాలో మూటలో యిస్తాడనుకొన్నాము. చివరకు తుస్సుమని రూపాయి చేతిలో పెట్టినాడు.

సుబ్బా—జోడిపెళ్ళిలే. ఎలాగ్గా తేయేమి యిచ్చారు వెధవ సంభావన. సూరావధాన్లూ! యేమీలేని అటుకుల వెంకమ్మిచ్చిందే నాలుగణాలు మొన్న కూతురు పెళ్ళికి.

సూరా—లక్ష్మణావధాన్లూ! నీవు శిష్యుణ్ణని చాలా పీడించినావే. నీకేమైనా యెక్కువిచ్చారా?

లక్ష్మ—యీమహాసంఘంలో అధికారం చూశేవారెవ్వరు? నీళ్ళకావిళ్ళ కొండిగాడూ నేనూ సమానమయినాము. వాడికీ రూపాయ నాకూ రూపాయూ?

సుబ్బా—కానూరి బ్రాహ్మలేసరి. వొక్కొక్కడు గోడదూకి దొడ్లో ప్రవేశించి మూడేసిసార్లు పుచ్చుకున్నవాడే మళ్ళీ పుచ్చుకున్నాడు

సూరా—సుబ్బావధానులుగారూ! చూశావా? నీళ్ళకావళ్ళ కొండిగాడున్నూ పీనుగుల పేరిగాడున్నూ రామచంద్రపురాన్నుంచి వచ్చిన జటావల్లభుణ్ణి యేకప్రకారంగా గోడమీద పడదోశారో.

సుబ్బా—దానికేంగాని ముంగొండనుంచివచ్చిన ముసలిపండితుణ్ణి గుమ్మం దగ్గిరవున్న తురకసాయిబు మహాచెడ్డదెబ్బలు కొట్టినాడునుమీ!

పర—కేకలువెయ్యకండి. కేకలువెయ్యకండి.

నీల—యెక్కడాన్నో గోడపడ్డట్టు చప్పుడవుతూవున్నది.

పర—గోడపడదోసుకొని బ్రాహ్మలు మందమందలుగా వస్తూవున్నారు—ఆగు—ఆగు—మీదికిరాకు.

నీల—సొమ్ముదోచుకుపోతారు; దోచుకుపోతారు. చేతులు విరవకండి—కొట్టకండి.

పర—చచ్చిపోతిని, చచ్చిపోతిని. మీరాసాహే—

బ్రా—పెద్దయ్యయెక్కడ? వాణ్ని యిలాగురమ్మను—పట్టాకో.

లోపలివారు—బ్రాహ్మలు లోపలదూరి దొమ్మిచేస్తూవున్నారు. పెద్దయ్యగారూ! మిమ్మల్ని కొట్టిపోతారు. గదిలోకిపోయి తలుపు వేసుకోండి. ఇదుగో తోరణాల్తెంపుతూవున్నారు—పటాలు బద్దలు కొడుతూవున్నారు.

పెద్ద—మీరుపోయి ఠాణాలో తెలియచెయ్యండి.

(ఆరక్షకభటులు వచ్చినతరువాత బ్రాహ్మణులు పాటి పోవుచున్నారు.)

---

## పంచమాంకము

ప్రదేశము—గాలవగాండురాత్రి పెండ్లికూతురు యిల్లు.

(ధనాలకామయ్యాయు, నీలకంఠసోమయాజులును, నీళ్ళకావళ్ళ కొండయ్యాయు, మఱికొందఱును ప్రవేశించుచున్నారు.)

నీల-కామయ్యగారూ! యీరాత్రి పెద్దమనుష్యులు చాలామంది భోజనానికి వస్తారు. వార్నందర్నీ మీరెల్లా పరామర్శచేస్తారో సుమండీ.

కామ-ఉభయఖర్చులూ పెట్టుకొని పెద్దయ్యగారే సమస్తం జాగ్రత్తపెడుతూవుండఁగా నాపనియేముంది? అన్నిమీరే సమర్థించవలెను.

నీల—కొండయ్యా! అందరునూ రెండోసారిభోజనాలకు పిల్చి వచ్చినావా?

కొండ-'వంటలు యుసిద్ధంగావున్నయి, విస్తళ్ళు వేశారు. పెద్దమనుష్యులు వచ్చికని పెట్టుకున్నారు. వడ్డనకు మీరురావడమేఅవసిష్టం' అని అందరితోనూ దీపాల వేళ్ళే చెప్పివచ్చాను.

నీల—వంట లెంతముట్టుకువచ్చినయి?

కొండ—కూరలుడికినవి. అన్నంవండడానికి నాలుగుబిందెలతో ఎసరు పెట్టినారు. ఇకపిండివంట కావలెను. వంటాలస్యంలేదు.

(ఒకతట్టలో చెంబులను మడిబట్టలను వేసికొని దానిని నెత్తిమీద బెట్టుకొని యొకబ్రాహ్మణుడుప్రవేశించుచున్నాడు)

కొండ—పేరయ్యా! యీ చెంబు లెవరివి?

పేర—రామచంద్రరావుగారివి. ఎక్కడ పెట్టను?

కొండ—రెండోపంక్తిలో మొదటిపీటదగ్గర పెట్టు,

నీల—భోజనాలకువచ్చేవారువస్తూవున్నారు. కొండయ్యా! పీటల ముందరవిస్తళ్ళు వేయించు.

(చేతిలో కంచు చెంబులతో నీళ్లుపట్టుకొని, బుజముల మీదతడిబట్టలుపెట్టుకొని, మడిబట్టలుకట్టుకొని, కొందఱుగృహస్థులు ప్రవేశించుచున్నారు.)

నీల—మీరు కొన్నిపీటలువదలి కూర్చుండండి—కొండయ్యా! నీవింకోసారి వెళ్ళి వడ్డనఅవుతూందని చెప్పి రానివారినిపిలుచుకురా.

కొండ—రామన్ననుపంపినాను—అదుగో — రామన్న వస్తూవున్నాడు—ఓరీ! రామన్నా! వెళ్ళినవారేమన్నార్రా?

రామ—అప్పయ్యపంతులుగారు రామన్నారు. పాపయ్యపంతులుగారు అందరూ పరిషేచనాలు చెయ్యబోయేటప్పుడువచ్చి పిలువుమన్నారు. వెంకటచలంగారుఇంట్లో లేరుయిప్పుడేలాంతరుమనిషికోసన్నా

యెందుకో వీధిలోకి వెళ్ళినారని స్త్రీలు చెప్పినారు. విశ్వనాధంగారు మడిబట్టలు తేవడానికి బ్రాహ్మడికి వర్తమానం పంపి అతనికోసం యెదురు చూస్తూవున్నారు. సోమశాస్త్రిగారు వస్తాం వెళ్ళమన్నారు. అవధాన్లుగారున్నూ అంతే చెప్పినారు. తక్కినవారందరూ వచ్చారు.

నీల—కొండయ్యా! నీవొకపర్యాయం వెళ్ళి రావలసినవాళ్ళని నలుగుర్నీ కేక వేసిరా.

కొండ—చిత్తం. (అని వెళ్ళుచున్నాడు)

నీల—(పీటలమీద కూరుచున్నవారితో) పాపం! మీరు చాలా సేపటినుంచి కూరుచున్నారు. భోజనాలకువచ్చేవారు వేగిరం రారు.

రాజన్న— పాపయ్యపంతులుగారెప్పుడీలాగే ఆలస్యంచేస్తారు.

భీమరాజు—బుచ్చయ్యపంతులుగారింటికి కిందటిసారి భోజనానికి వెళ్ళినప్పుడు వెంకటచలంగారు నేను వేళకూవచ్చారు కారు. విస్తళ్ళల్లో వడ్డించాక కూడా వర్తమానం వెళ్ళేటప్పటికి చీకట్లో లాంతరు మనిషి కోసం బయలుదేరారు. కూలిమనిషిని కుదుర్చుకునివచ్చేటప్పటికి రాత్రి రెండు ఝాములయింది. కొందరు పీటలమీదే నిద్రపోయారు; వడ్డించిన అన్నమూ కూరలు చల్లారిపోవడమే కాకుండా విస్తళ్ళకు చీమలుపుట్టలు పోసినవి.

రాజ—ఇప్పుడూ వెంకటచలంగారే లాంతరుమనిషికోసం వెళ్ళినారట! యీపాటికారం పిండిఆరబోసినట్టు వెన్నెలవచ్చిందే. ఇంకా లాంతరెందుకు?

భీమ—ఆయన మనిషికోసం బయల్దేరేటప్పటికి వెన్నెలరాలేదు. అయినా లాంతరు పరువుకోసంగాని వెలుతురుకోసం కాదు.

[ఇంతలో కొండయ్య ప్రవేశించుచున్నాడు]

నీల—యేమోయి కొండయ్యా! యెవరైనా వచ్చారా?

కొండ-పాపయ్యపంతులుగారు అందరూవచ్చి అపుపోసనాలు పట్టేటప్పుడువర్తమానం చెయ్యమన్నారు. వెంకటచలంగారు మనిషిని తీసుకువచ్చిలాంతర్లో మైనవృత్తి కొనడానికిబజార్లోకి వెళ్ళినారు. విశ్వనాథంగారు వచ్చారు. తక్కినయిద్దరూ వస్తారు.

నీల-రామన్నా! నీవోపర్యాయంవెళ్ళిరా?

రామ-వక్కవరుగులోవస్తాను. (అనినడుచుచున్నాడు)

రాజ-నాలుగ్గడియలనుంచి విస్తళ్ళదగ్గరమడిగట్టుకుని కూర్చున్నాము. నాకు జలబాధకు పోవలసివున్నది. ఎంతోయిబ్బందిగావున్నది.

భీమ-వకరింటికిభోజనానికివస్తేయిదేబాధ సుఖంగాయింటివద్ద పెందలకాడే భోజనంచేసి ంత వృత్తముపక్షం లేదు.

రామ- (మరలప్రవేశించి) వెంకటచలంగారుదయచేశారు. సోమశాస్త్రిగారు భోజనాలుపొద్దుపోతవని యిప్పుడేభోంచేసికూర్చున్నామని చెప్పమన్నారు. కామావధాన్లుగారునాఆలస్యంలేదునీతోటే వస్తానునడవమన్నారు. పాపయ్యపంతులుగారు యిందాకాచెప్పినట్టే చెప్పినారు.

నీల-పాపయ్యపంతులుగారితో అపుపోసనాలుపట్టబోతూవున్నారని చెప్పి కామావధాన్లగారినికూడా కేక వేసిరా.

రామ-అభికారం కానియ్యండి. నేను వారిద్దర్నీ నిముషంలో తీసుకునివస్తాను. (అని పరుగెత్తుచున్నాడు)

నీల-పాపయ్యపంతులుగారుదయచేశారు ఇంకొక్క కామావధాన్లుగారుమాత్రమే రావలెను.

[అప్పుడొక బ్రాహ్మణుడు రోజుచుంబుగెత్తుకొనివచ్చికూరుచున్నవారివంక బాఅజూచుచున్నాడు]

రామ-ఏమయ్యా! నీవొచ్చావూ?

బ్రాహ్మ—భీమరాజుగారెక్కడున్నారు? ఆయన చిన్నకుమారుఁడు చంటిపిల్లవాడికి తేలుకుట్టింది యెవరెత్తుకున్నావుండక గిజగిజలాడుతూ వున్నాఁడు.

భీమ—(లేచి) నేనువెళుతాను. నాకు సెలవియ్యండి.

నీల—ముందరివిస్తరి వదలివెళ్ళకూడదు. కామావధాన్లగారి నిమిత్తం మనవారందరూ కనిపెట్టుకుంటారు. మీరీవసారాలో కూర్చుండి రెండుమెతుకులు నోట్లోవేసుకుని యిప్పుడే వెళుదురుగాని రండి—ఇక్కడ వున్నవారందరూ నామనవిచిత్తగించి అనుజ్ఞయివ్వవలెను. (అనిబలవంతపెట్టి విస్తరియొద్దఁ గూర్చుండఁబెట్టుచున్నాఁడు)

అందఱును—మాకు పరమసంతోషం—మీరుభోంచేసివెళ్ళండి.

రామ—(మరలఁప్రవేశించి) కామావధాన్లగార్ని దుర్ఘటం మీద బయల్దేర దీసివచ్చాను. ఆయన నాలుగ్గడియలనుంచి మన కోసం కనిపెట్టుకున్నామని సెలవిచ్చారు.

[కామావధానులు వసారాలోనుండివచ్చి పంక్తులమధ్యను నిలువఁబడి మొగమెఱ్ఱచేసి చూచుచున్నాఁడు.]

రాజ—కామావధాన్లుగారూ! మీనిమిత్తం మేమందరమూ ఝాంనుంచి విస్తళ్ళదగ్గిర కనిపెట్టుకుని వున్నాము. పీటమీద శీఘ్రంగా దయచెయ్యండి.

కామ—(కోపదృష్టితో) భోజనానికి పిల్చినవారు యిలాగంటి పెద్దమనుష్యులని తెలిస్తే నేను భోజనానికి వస్తానా?

నీల—యేమి? యేమి? మావల్ల యేమి అపరాధంవచ్చింది? వస్తే మాఅపరాధం క్షమించాలెను.

కామ—పంచపాళీలో భోజనానికి కూర్చున్నవారెవరు?

నీల—మీనిమిత్తం మూడునాలుగు వర్తమానాలుపంపి, మీరావడం కొంచెం ఆలస్య మయ్యేటప్పటికి, యీలోపుగా ఆయన

చిన్నపిల్లవాడికి తేలుకుట్టిందని వర్తమానంవస్తే ఆయన భోజనం చెయ్యకుండా వెడతానని తొందర పడడంచేత, సభవార్ని ప్రార్థించి వారిఅనుమతిమీద పంచపాళీలో వడ్డింపించినాను. సభవారందరూ మీకోసం కనిపెట్టుకొనివుంటామని సెలవిచ్చి ఆయన్ని భోజనం చెయ్య మన్నారు. నావల్ల కలిగిన అపచారం మన్నించాలెను.

కామా—మూడునాలుగుసార్లు కాదు. పందసార్లు పిలవాలెను. మొన్న బుచ్చయ్యపంతులుగారింట్లో పదిసార్లు పిలిపించుకొని మరీ భోజనానికి వెళ్ళినాను. వెనకపోయినాథశాస్త్రిగారింలోపల నేనువచ్చే వరకూ కనిపెట్టుకుని వుంటారో లేదో చూతామని వడ్డనయిన తరు వాతకూడా మూడుఘంటలు ఆలస్యంచేశాను. ఎవరున్నూ యిలాగు చెయ్యలేదు. వారు పెద్దమనుష్యులు యెందుకుచేస్తారు? యీభీమరాజు యెలాగంటి పెద్దమనిషి? వీరందరూ చెపితే తానెలాకూర్చున్నాడు?

నీల—మావల్ల యెంతైనా అపరాధంవచ్చింది. క్షమించాలెను. (అని చేతులు జోడించుకొని బతిమాలుచున్నాడు.)

కామా—యిఖ నేనిక్కడ భోజనంచెయ్యను. ఛీ! పరువేగని స్థలానికి యెప్పుడూ భోజనానికిరాకూడదు. (అని యడ్డమువచ్చిన వారిని త్రోచికొనుచు వెడలిపోవుచున్నాడు.)

సభ వారు—మామనవి చిత్తగించాలెను-మాప్రార్థన అంగీక రించాలెను-మాయందు అనుగ్రహం వుంచాలెను. (అనియందఱును వచ్చి చేతులును గడ్డమును పట్టుకొని వేడుకొనుచున్నారు.)

కామా—నన్ను పోనివ్వండి—నాకడ్డంరాకండి.

[లోపలి కోలాహలముపిని పెద్దయ్యగారు పరుగెత్తుకొనివచ్చి సంగతి తెలిసికొని, దనత్వముతో గుమ్మముకడ్డముగా నిలుచున్నారు]

పెద్ద—నూవల్ల చాలా అపరాధంవచ్చింది. సోమయాజులు తెలివితక్కువచేత చేశాడు. మనమిద్దరమూ బాల్యస్నేహితులమూ బంధువులమూ కాబట్టి నన్నుచూచి కోపంశాంతిపొందించవలెను. (అని దీనముగా ప్రార్థించుచున్నాడు)

రామ—యిలాగంటి బుద్ధిహీనులకు పెత్తనమివ్వడమే మీదే తప్పితం. పెద్దయ్యగారూ! మీకు వచ్చి బతిమాలుతూవున్నారు గనుక మాటతీసివెయ్యలేక వొప్పుకున్నాను. (అని పీటమీదకూరుచున్నాడు)

పెద్ద—మా నీలకంఠ సోమయాజుల పౌరోహిత్యంచేత అందరూ వచ్చిన తరువాతకూడా రెండుగంటలు ఆలస్యమయింది. భోజనాలు ప్రొద్దుపోయినందుకు క్షమించవలెను. కొండయ్యా! అపోసనాలు పడుతూవున్నారు. నెయ్యివడ్డించు.

వడ్డించువారు (బంతులవెంబడిని దిరుగుచును)—ఘృతం-సూపం-భక్ష్యం.

రాజ—శ్లో॥ మాతానిందతి నాభినందతి పితా భ్రాతా నసంభాషతే
భృత్యఃకుప్యతి నానుగచ్ఛతిసుతః కాంతాచనాలింగతే
అర్థప్రార్థన శంకయా నకురుతేప్యాలాపమాత్రం సుహృత్
తస్మాద్ద్రవ్యముపార్జయ శృణుసఖే ద్రవ్యేణసర్వేవశాః.
భోజనకాలే గోవిందనామస్మరణ—గో—వింద.

కొండ—ఆజ్యం—ఆజ్యం—మీకు పంతులుగారు—కొంచెం.

పాప—అల్లాపడబోస్తావేమి? వద్దువద్దంటూవుండగా అతడు అన్నమూ అలాగే పడవేసిపోసినాడు. నిష్కారణంగా పారవెయ్యవలెను.

రామ—భక్ష్యం—భక్ష్యం— యీపాటికే చే— మక్కువయితే అన్నం దిగపెడుదురుగాని తెండి.

రాజ—కొండిభొట్లు! యీపాటి నేతిగిన్నారీ అక్కడపెట్టి మజ్జిగ పుచ్చుకో.

రామ—మజ్జిగకి ప్రసాదం—కొంచెం ప్రసాదం.

కొండ—పెరుగు—పెరుగు—పెరుగు,

రామ—కొంచెం పులుసూ కాటుకంపూ కాని, పెరుగు బహు దివ్యంగావున్నది. వక్క—రవ్వ లవణాం తెప్పించు.

కొండ—బుట్టలోది—బుట్టలోది

రాజ—అందరు భోజనాలూ అయినవి లేవవచ్చునా?

రామ—లేవవచ్చును-లెండి-గోవిందా-గో-విందా.

కొండ—లేవకండి. ఇక్కడ రామావధాన్లుగారు యిప్పుడే పెరుగు బాగుందికాదని మజ్జిగ వడ్డించుకుంటూ వున్నారు.

నీల—లోపల భోజనం అతి దివ్యంగా జరిగింది. గుమ్మడికాయ కూర యెంగిలిముక్కలు పంక్తులపొడుగునా వకరివిస్తర్లోనుంచి వకరివిస్తర్లోకి గంతులు వేస్తూవున్నవి.

రామ—భోజనం అయింది. లేవవచ్చును.

కొండ—మీరందరూ తిన్నగా వీధులోకినడవండి. రామన్ననీళ్ళు ఎందె అక్కడపెట్టినాడు.

[భోజనములుచేసి, తాంబూలములుపుచ్చుకొని, యెవరి యిండ్లకు వారుపోయిరి.]

---

## షష్ఠాంకము

---

౧. ప్రదేశము—పట్నములోని వీధులు.

[సి॥ శంకరసోమయాజులు, పరమేశ్వరావధానులు, బంధువులును ప్రవేశించుచున్నారు.]

నీల—పరమేశ్వరావధానులూ! ఇప్పటికేపన్నెండుగడియలరాత్రి

అయింది. వూరేగింపని యెంతతొందరపెట్టినా వేగిరం భోజనాలు తెమల్నిచ్చారుకారు. పెద్దయ్యగార్ని రమ్మని చెప్పి, పెళ్ళికూతురునిద్ర పోతూవుంది కాబోలను లేపు.

పర—వూరేగింపుకు బోగంమేళం వకటివచ్చిందా? చకో రాత్రిలో నాలుగ్గడియల పొద్దుపొయ్యేటప్పటికల్లా రమ్మని చెప్పినాను. యిప్పటికి రాలేదు. యిప్పుడేమివూరేగింపు? వూరందరూ గాఢమయినిద్రలో వుంటారు.

నీ—నీవుపోయి పెళ్లికుమార్తెను లేపు—చాకలిరామిగా! పల్లకీ సిద్ధంచేసి, యిలాయీ చుట్టలు వెలిగించమను.

పర—పెద్దయ్యగారూ! మీరు వెళ్ళి పల్లకీలో కూర్చుండండి. పదిలంపెద్దలయినారు. గోడపట్టుకుని మరీరండి—అజ్ఞానమ్మా! పెళ్ళి కూతుర్ని లేపినావా?

అజ్ఞా—దాన్ని నిద్రలో లేపేటప్పటికి రోదుస్తూ వున్నది. యేమ యినా చేతులో పెట్టి వోదార్చమని మావారికి వప్పగించి వచ్చాను.

పర—బోగంమేళం వచ్చింది. భజంత్రీలు వాయిస్తూవున్నారు. పెద్దయ్యగారు పల్లకీలో కూర్చున్నారు. పెళ్ళికూతురు యింతట్లో యేదుపుమానేటట్టు కనపడలేదు. అజ్ఞానమ్మా! పెళ్ళికుమార్తెను యెత్తుకు తీసుకువచ్చి పల్లకీలో కూర్చుండబెట్టు.

అజ్ఞా — అమ్మాయీ! యేడవకు అదిగో వీధులో బాజాలు వాయిస్తూవున్నారు. నాతాంవూరుకో. (అని యెత్తుకుని తీసుకొనివచ్చి పల్లకీలో కూర్చుండబెట్టుచున్నది.)

నీల—ఆకాశాన్ని మేఘం పట్టింది. కొంచెం సేపున్నాంచి మరీ బయలు ద్దేరవలెను.

పర— యిది వానవచ్చే మబ్బు కాదు. రామిగా! పల్లకీ సాగని య్యండి. నీలకంఠసోమయాజులుగారూ! పల్లకీముందర యెవ్వరూ లేరు.

మనం వెళ్ళి భోగం మేళం దగ్గర వుందాం రండి. ఆడవాళ్ళందరూ పల్లకీ వెనక్కు వచ్చారా?

నీల—ఓసీ! చకోరాక్షీ! "మగవారిని నమ్మరాదమ్మా" అను పదం పాడు.

చకో—మద్దెల తిన్నగా వాయించు—తాళం హంసయాన చేతి కిచ్చి నీవు తిత్తిపట్టు—ఊఁ—మగవా——

నీల—ముందుకు నడువు—ఆయింటి కాడ—ఆగు—పాడు.

చకో—మగవారి—మగవారీ—మగవారీ నా—

నీల—చాలించు——పయికి నడువు.

పర—యిదేమిటి? గాడిదకొడుకులు బాజావాళ్ళు నిలువుమన్న ఝాం సేపటికి నిలిపి భోగంది పాడుతూవున్నంత సేపూగోల్లుమని వాయిస్తూనే వుంటారు; పాటచాలించి భోగంవాళ్ళు నడవడాని కారంభించ గానే తామున్ను బాజాలు మానివేసి, వాళ్ళు మళ్ళీ పాట మొదలు పెట్టగానే యేమీ వినపడకుండా తామున్ను వాయించ మొదలుపెడు తూవున్నారు.

నీల—భోగరాజుగారూ! దయచేస్తారా? వకసారితిరిగి వత్తాము.

భోగ—మీరు మేళంతో వూరేగుతారనివిని మీతో రావడా నికే ఝామునుంచి వీధిగుమ్మంలో కనిపెట్టుకొనివున్నాను.

పర—మీప్రియురాలు యిక్కడవుండగా మీరు కని పెట్టుకొనివుండక యెక్కడికి వెళుతారు? అది మేళానికి రాకపోయినట్ట యితే మీరు యీపాటి దాని యింటికాడ నాలుగునిద్రలు చేసి వుందురు.

నీల—నారపరాజుగారూ! వక్కసారి విజయంచేస్తారా?

నార—వక స్నేహితుడితో ప్రొద్దుపోయినదాకా మాటాడుతూ వుండి యింతకుముందే పరున్నాను. నిద్రపట్టేటప్పటికి మీబాజాల

చప్పుడు వినబడి వులిక్కిపడి లేచినాను. మధ్యనిద్రాభంగం వస్తే మళ్ళీ వకపట్టాన్న నిద్రపట్టదు. మీ బాజాలచప్పుడువిని మా ఆవు బెదిరి కట్టు తెంచుకొని పారిపోయినది. చీకట్లోపోయి దాన్ని వెతికి తీసుకొని రావలెను. నేను రాను.

నీల—ఊం. సాగండి—అక్కడ నిలవబడండి.

చకో—మంగవారీ—మంగవారీ మంగవారీనమ్మా—

పర—సోమశాస్త్రిగారూ! నాలుగు ఘడియలు మాతో విజయం చేస్తురుగానిరండి.

సోమ—ఈసారికి నన్ను క్షమించవలెను. మా యింట్లో దానికి దేహంలో జబ్బుగావున్నందున నిన్న తెల్లవారినదాకా మాకెవరికీ నిద్రలు లేవు. దానికిపట్టకపట్టక యిప్పుడే కొంచె నిద్రపట్టినట్టూవున్నది. ఇంతలో మీవూరేగింపుమేళాలున్న దాని నిద్రకు భంగం కలగడమే కాకుండా చంటిపిల్ల లేచి పోరుపెడుతూవున్నది.

నీ—కొంచెము చినుకులారంభం అయినవి. — ఎవ్వరో పల్లకీ నానుక సందడిచేస్తూవున్నారు.

పర—మన అజ్ఞానమ్మకు తేలుకుట్టింది—కాగడా యీలాగు నాగాపి చూ—మాత్రిగాను లేదుగదా?

నీల—పెద్ద వర్షం వచ్చింది. పెళ్ళికొడుకున్ను పెళ్ళికూతురున్ను తడిసిపోవుచున్నారు—కాగడావాళ్ళు పరుగెత్తుచున్నారు.

పర—అజ్ఞానమ్మా! నా చెయ్యిపట్టుకుని మెల్లిగా రా! చీకటి మూలంగా యేమీ కనపడకుండావున్నది. అందరూ ముందుపరుగెత్తి పోయినారు.

అజ్ఞా—నాయనా! యిక నేను బ్రతుకను. నొప్పి గజ్జలోకి యెక్కి గొడ్డళ్ళతో వేసినట్లు కాలుబద్దలవుచున్నది. దానికితోడు వర్షపుదెబ్బ కూడా మొఖంమీద కొడుతూవున్నది.

పర—కాలుజారిపడ్డాను. నడుము నొప్పిపట్టింది; బట్టలుబురదయి నవి. అజ్ఞానమ్మా! కొంచెంచెయ్యిఆసరాయిచ్చి లేవతియ్యగలవా?

అజ్ఞా—నేను లేవతియ్యలేను. నాబాధచేత నేనుచచ్చిపోతూ వున్నాను. మెల్లిగాలేచి మీరు వెనుకరండి, పడుచూలేచుచూ నేను ముందుకు వెళుచాను. [అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.]

---

౨. ప్రదేశము—పెండ్లికొడుకు వారివీధి.

[పీనుగుల పేరయ్య, నీళ్ళకావళ్ళ కొండయ్య, నీలకంఠ సోమ రాజులు మొదలగువారు ప్రవేశించుచున్నారు]

నీల—పేరయ్యా! నీవు పెళ్ళికొడుకునెత్తుకో, కొండయ్య పెళ్ళి కూతుర్ని యెత్తుకుంచాడు. దండాడి పుణ్లో నీశక్తికనపడవలెను.

పేర—తాతగారూ! రండి. నేనుమిమ్మల్ని యెత్తుకుంటాను, పళ్లెంనిండా బుక్కావున్నది. చిన్నపిల్లవాడివలె చల్లవలెను.

కొండ—పెళ్ళికూతురు బుక్కా పొయ్యలేదు. మాయిద్దరి బదులూ నేనేపోస్తూవున్నాను. కాసుకోండి.

పేర—ఏమిరా మోటగాడిదకొడుకా! పెళ్ళికొడుకు కంట్లోనూ నోట్లోను బుక్కాపోసినావు? మీపెళ్ళికొమార్తె కంట్లో నేనుమాత్రం పొయ్యలేననుకున్నావా?

కొండ—పెళ్ళికొడుకుకంట్లోగాదు యీసారి నీకంట్లోపోస్తాను. చేతనయితే వక చెయ్యిచూచుకుందాముర.

నీల—ఓరిదున్నపోతులారా! మీరిద్దరూపోట్లాడి పెళ్ళికొడుకును పడదోసినారేమిరా? పెద్దయ్యగారూ!మీకేమీ దెబ్బతగలలేదుకదా?

పెద్ద—దెబ్బతగులలేదు. మోకాలు కొంచెం కొట్టుకుపోయింది నచ్చి లేవతియ్యండి.

పేర—నీలకంఠసోమయాజులుగారూ! మీరుపాండి, పెళ్ళికొడుకును నేనెత్తుకుంటూవున్నాను - పెద్దయ్యగారూ! బుక్కా-అయిపోయింది; బుట్టలో ముగ్గు తెచ్చినాను. మీమీద పోసినందుకు మీరు యీముగ్గు పెళ్ళికూతురి కంట్లోపొయ్యవలెను.

పెద్ద—అయ్యయ్యో! సున్నపుముగ్గు కాదుగదా నాకంట్లో పోసినారు?

కొండ—కాదుకాదు సుద్దముగ్గు.

పేర—వసంతము చిమ్మిరిగొట్టముతో పొయ్యవలెనుగాని చెంబుతో పోస్తారేమి?

కొండ—చేతనైతే మీరుకూడా పొయ్యరాదా? ఈసారి చూడు బిందెతోనే పోస్తాను.

పేర—నీమోటతనంమూను. వసంతంలోమునిగి పెద్దయ్యగారు వుక్కిరిబిక్కిరి అవుతున్నారు. వసంతంలో సున్నం యెక్కువపడ్డది కాబోలును ఘాటుగావున్నది. ఇఖపొయ్యకు పొయ్యకు.

పర—విస్సిగాడుపోయి వ్వారికేకూర్చున్న రామయ్యమీద చెంబులోవసంతంపోసినాడు, తెల్లబట్టలుపాడయిపోయినందుకుకోపంవచ్చి వాడులేచి చేతికొద్దీ వక్కలెంపకాయ కొట్టినాడు. అందుమీదవాళ్ళిద్దరూకలియబడి జుట్టూజుట్టూపట్టుకుని యేప్రకారంగాకొట్టుకుని తిట్టుకుంచూవున్నారోచూచినావా నీలకంఠసోమయాజులూ!

నీల—విస్సిగాడెప్పుడూ బండవాడే. వాడిందాకా నామీద కూడా అప్రకారంగానే పోసినాడు.

పర—దానికేమిగాని భోగరాజు భోగందానిబట్ట పట్టుకుని పట్టపగలు సిగ్గులేకుండా ఫదిమందిలోనూ యేప్రకారంగా వసంతంపోసి అల్లరిచేస్తూవున్నాడో చూడు.

నీల—ఇలాజరుగుతుందని తెలిసే యీవేళ భోగంవాళ్ళందరూ మంచిబట్టలూ నగలూ తీసివేసి సాధారణబట్టలతో వచ్చినారు.

పర—భోగంవాళ్ళను ఆలాచెయ్యడం ఆశ్చర్యంకాదు. మన వాళ్ళు పడుచువాళ్ళు వరుసలని పేరుపెట్టుకొని వయసులోవున్న ఆడ వాళ్ళమీదనిర్భయంగాబుక్కాయున్నువసంతమున్నూపోస్తూవున్నారు. అన్నమ్మగారి సీతి పరుగెత్తుకొనిపోచుండగా, వెంటబడి తరుముకొని పోయి మొగుడుచూస్తూండగానే పైటచెంగుపట్టుకొని శాస్త్రిగాడు కొప్పుమీదను రొమ్ముమీదనూ బుక్కాపోసి రుద్దుచూవున్నాడు. వాడి పొగరుబోతుతనం చూడు.

నీల—వక్క శాస్త్రిగాడే యేమిటి? దొడ్డినిపడి గంగాళంలోని వసంతం చెంబులతో ముంచుకొని ఆడవాళ్ళూమొగవాళ్ళూఅనేభేదం లేకుండా పడుచువాళ్ళందరూ పరుగెత్తుతూ వకళ్ళమీదవకళ్ళు పడ బోసుకుంచూవున్నారు. మగవాళ్లేలాగుచేసినా సరిపోచుందిగాని ఆడ వాళ్ళుకూడా మగవాళ్ళతోసమానంగా కేకలువేస్తూ వాళ్ళమీదపడి పెనుగులాడుచూ అలాగువసంతం దిమ్మరించడం ధర్మమా?

పర—బంధువులయినవాళ్లున్నూ పెళ్లివారున్నూ ఎలాచేసుకున్నా బాగావుంచుంది. ఏమీసంబంధం లేనివాళ్లందరూవచ్చి యీ ప్రకారంగా వసంతం చల్లుకోవడము యేమిదురాచారము? పడుచువాళ్లు బావగారివరుసా మరదలివరుసా అని చెప్పుకుంచూ హాస్యం పేరు పెట్టుకొనిపాడగుచూవున్నారు.

నీల—వసంతాలాడడం అయింది. నఖశిఖపర్యంతమూ పట్టుకున్న యీబుక్కావదలడానికి మనంపోయి స్నానంచేసివత్తామురండి.

(అని అందరు నిష్క్రమించుచున్నారు.)

3. ప్రవేశము — పెండ్లికూతురువారి లోపలి చావడి.

(అజ్ఞానమ్మ, నీలకంఠసోమయాజులు మొదలగువారు పళ్లెమును పాలచెంబును చేతితో బట్టుకొని ప్రవేశించుచున్నారు.)

నీల—అజ్ఞానమ్మా! అప్పగింతలపాట పాడడానికి బాపనమ్మ వచ్చిందేగాదు చూచినావా?

అజ్ఞా—ఆయమ్మ ఒకనాడైన వేళకు వచ్చి పాటపాడిపెట్టిందా?

నీల—దాని మొగుడు యెక్కడవున్నాడు? యెప్పుడూ చూడనే లేదు.

అజ్ఞా—వివాహమైన మూడేళ్లలో నాలుగు నెలలకో మొగుడు కాశీయాత్ర వెళ్ళి మళ్ళీ రాలేదనీ, అక్కడ జీవించి వున్నాడనీ చెప్పుచూ వుంచుంది. నేనీవూరికి కాపరానికి వచ్చిన నలభై సంవత్సరాలనుంచీ యీప్రకారంగానే ప్రతిసంవత్సరము కొనూ ముత్తైదువుగా చెప్తూవున్నది. అతగాడు చచ్చినాడని పెద్దభార్యకొడుకు తద్దినాలు పెడుతూవున్నాడు.

నీల—అదుగో బాపనమ్మ వచ్చింది. ఇక అప్పగింతలపాట కానియ్యవచ్చును.

బాప—అజ్ఞానమ్మగారూ! ఆపాలు పళ్లెంలో పొయ్యండి పిల్లదాన్ని అప్పగింతురుగాని.

అజ్ఞా—(చిన్నమ్మ చెయ్యి పాలలో ముంచి పెండ్లికొమారుని చేతిలో బెట్టి) ఇన్నాళ్ళూ పెంచి నిన్ను ఒక అయ్యపాలు చెయ్యవలసి వచ్చిందిగదా చిన్నమ్మతల్లీ! (అని వెక్కి వెక్కి యేడ్చుచున్నది.)

నీల—ఏమిటా వెఱ్ఱి? వూరుకో. సమస్తమూ తెలిసివుండీ సంతోషసమయంలో దుఃఖం తెచ్చుకోవచ్చునా?

అజ్ఞా—చిన్నప్పటినుంచీ పెంచి చిన్నదాన్ని ఒకరిచేతిలో పెట్టునప్పుడు కన్నతల్లికి దుఃఖం యెలాగు ఆగుతుందినాయనా! (అని మఱింత బిగ్గరగా యేడ్చుచున్నది.)

బాప—బంగారుపళ్ళెమున పాలుమరపోసి*సీతతల్లీదండ్రిశీఘ్రమునవచ్చి హస్తకంకాణాలఅటివానుదెచ్చి*అల్లుళ్ళచేతిలోచేయొప్పాగించిశశి పువ్వురాగిడీచేడియలదెచ్చి*శాంతమ్మచేతిలోచేయొప్పాగించి బుద్ధు లెరుగమమంగ బుద్ధులేకాం*బుద్ధివచ్చినదాకాదిద్దూకోరయ్యా

నీల—అజ్ఞానమ్మా! ఏమిటా యేడుపు? ఏమువుదిగమింగి ధైర్యం తెచ్చుకో.

బాప—నీలకంఠ సోమయాజులుగారూ! మీరు పూరుకోండి. ఆమెకుమాత్రం పిల్లదాన్ని అల్లుడికి వప్పగింతపెట్టలేక విచారిస్తూవున్న దనుకొన్నారా యేమిటి? వప్పగింతలకాలంలో ఆలాలాంచనం జరగ వలెను గనుక ఏడుస్తూవున్నది. అది వక విధమైన వేడుక గాని మరేమీ కాదు.

అజ్ఞా—నీలకంఠసోమయాజులుగారూ! అమ్మాయినిమీరువప్ప గించుకొంటురుగాని రండి. పిల్లది మీపాలైనది దాన్ని యెలా చూచు కుంటారో మీదే భారము.

నీల—చిన్నదానికేమీ లోపంలేదు. ఇటువంటి సమ్మంధం దొరకడం మీదంపతులు అదృష్టము.

బాప—అప్పగింతలయిపోయినవి. నేనుసెలవుపుచ్చుకొంమునా?

(అప్పుడందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## సప్తమాంకము

౧ ప్రదేశము—కామయ్యగారిగది.

[అజ్ఞానమ్మాయు, మగడును ప్రవేశించుచున్నారు.]

కామ—ఏమే! చేతులో డబ్బులేక యిబ్బందిపడవలసివచ్చింది? వివాహసమయమునందు మనం పుచ్చుకొన్న వెయ్యిరూపాయలలోనూ

నాలుగువందల రూపాయలు మన పుల్లయ్య బసూని పుచ్చుకొని అపహరించినాడు. యిమ్మని అడిగినప్పుడల్లా చేతిలోసొమ్ము లేదంటూ వున్నాడు. తక్కినసొమ్ము పెట్టి వర్తకం చెయ్యబోతే అసలికేదందుగ వచ్చి వెండిచెంబులజోడుకూడా అమ్మివేసినాముకదా?

అజ్జా—పెద్దయ్యగారిని మళ్ళీ యేమైనా యిమ్మని అడగండి.

**రామ**—పెళ్లి అయిన నాలుగేళ్లల్లోనూ లక్షసార్లు అడిగినాను. ఒక్కగవ్వయినా చేతిలోపెట్టినపాపాన్న పోయినాడుకాడు. వాడువట్టి మలభక్షకుడు. ఎన్నివిధాల అడిగినా ఇయ్యకపోతేనే కాదా ముసలి ముండాకొడుక్కు తగిన ప్రాయశ్చిత్తం చేతామని వెండిచెంబులజోడు నిముషంలో మాయంచేసినాను. అయినా అతను మనమీదమాత్రం అనుమానపడలేదు. ఇతడు యింతకాలం బ్రతుకుతాడనితోస్తే నే నప్పుడు పిల్లదాన్ని యిస్తునా?

అజ్జా—జరిగిపోయినదానికివిచారించి చేసేకార్యం యేమీలేదు. ఇకనయినా పెద్దయ్య వేగిరంచస్తే బాగావుండును. పిల్లదియెదిగెడబ్బయి యేళ్ళ ముండాకొడుకుతో కాపురంచేసి యేడుస్తుందా యేమిటి?

రామ—నాకున్నూ అదే విచారంగావున్నది. పాపిష్టి దేవుడు ముసలివాళ్లకు ఆయువు విశేషంగా పోస్తాడు. మొన్నసీతారామస్వామి వారి కోవిలకు వెళ్ళినప్పుడు పెద్దయ్య వేగిరంపోతే గరుడవాహనం చేయిస్తానని మ్రొక్కుకున్నాను.

అజ్జా—అదుగో పెద్దయ్యగారు స్నానానికివస్తూవున్నారు. ఇక మాటాడకండి. నేనుపోయి నీళ్ళియవలెను. (అని లేచిపోవుచున్నది.)

---

౨. ప్రదేశము—పూటకూటియింటిలోపలి వీధియరుగు.

[పైడిపాటి పాపావధానులును, బంధకివి భానుమూర్తియు
ప్రవేశించుచున్నారు.]

పాపా—భానుమూర్తిగారూ! నాపమీద కూర్చోండి.

భాను—వంట చేసిన తల వెంట్రుకల వితవ యెవ్వరో కాని పాకం దివ్యంగా చేసింది సుమండీ.

పాపా—ఆవిడె వక్క పాకంమాత్రమే కాదు, అన్నీ మీవంటి వారి కనుకూలంగా వుండేలాగునసే చేస్తుంది. పెద్దింటిపెద్దయ్యగారని చెప్పకోగా వినలేదా?

భాను—విన్నాను. ఆయన గొప్పభాగ్యవంతుడు కాడా? ఆయన పోయినాడట భార్య యెక్కడవున్నది?

పాపా—మీరిప్పుడు శ్లాఘించిన తలవెంట్రుకల వెధవే పెద్దయ్య గారిభార్యా. ఈవిడె పూర్వంఅటుకులు కొట్టుకుంటూవుండేది. సంవ త్సరాన్నుంచి వంటపూటితనం చేసుకుంటూవున్నది.

భాను—పెద్దయ్యగారెంతో భాగ్యవంతులయివుండగా అంత గొప్పవాడి భార్యాకు యిటువంటిగతి యెందుకు సంభవించింది? ఆమె గారిచరిత్ర మొదటినుంచీ చెపుతారా?

పాపా—ఈవిడె పెళ్లినాటికి మూడేళ్ళచిన్నది. పెద్దయ్యగారి కప్పటికే అరవయి సంవత్సరాలు వున్నవి. పెళ్ళిఅయిన తరువాత కూడా పదిసంవత్సరాలు బ్రతికినాడు.

భాను—అయ్యో! ఆయనజీవితకాలంలో భార్యయీడేరి అక్క రకు వచ్చిందే కాదా?

పాపా—పెసిమిటి ముసలివాడుగనుక భార్యా వేగిరం అక్కరకు రావాలేనని ప్రతిదినమూ మినపసున్ని మొదలయినవి పెట్టితల్లిదండ్రులు తమకూతున్ని బలిపిస్తూవుండేవారు. పెళ్లిఅయింది మొదలుకొని అత్త గామా మామగారూఅల్లుడివద్ద నేచేరినాడుగనుక వారుయేమికావాలె నంటే అవల్లా కూతురికి పెడుతూవచ్చేవారు. పెద్దయ్యగారు సంవ త్సరానికి పోతారనగా చిన్నదిరిజస్వలకాకముందే గర్భాదానం జరి గింది. ఆరాత్రిశోభనపుపెళ్లికొడుకు పెళ్లికూతురిమీద చెయ్యయినా

చెయ్యలేదని తలుపుకంతల్లోంచి చూచిన అమ్మలక్కలందరూ చెప్పుకున్నారు.

భాను — తుదకు పెద్దయ్యగారు యీ మొగజన్మలో మహోత్సవం కళ్ళారా చూచి మరీ పోయినారా? చూడకుండానే పోయినారా?

పాపా — పుత్రసంతానం అయిన రెండుమాసాలకల్లాయీ మొసముర్తాడి శక్తివంచన లేకుండా సంతానంకోసం బయటపాటుపడి మొగుణ్ని పున్నామ నరకంలోనుంచి తప్పించడానికే ప్రయత్నం ఆరంభించింది గాని, యేటా యేటా పెళ్ళాంబిడ్డలు కంటూవుండగా కన్నులపండుగగా చూచుకుంటూవుండే భాగ్యం పెద్దయ్యగారికి లేకపోవడంచేతనూ పుట్టబోయే సంతానానికి భూమిమీద బ్రతకవలసిన యోగం లేకపోవడం చేతనూ కొన్నిమాసాలకు భర్తృవియోగం సంభవించి యీ కృషి సఫలమయిందికాదు. లోకంలో అందరికీ భార్యాలు పెద్దవాళ్ళయినకొద్ది సంతోషం యెక్కువ కావడం సహజమయివుంటూవుండగా, అది యేం గ్రహచారమో కాని పెద్దయ్యగారికి మాత్రం భార్యకు వయసువచ్చినకొద్ది విచారం యెక్కువ కావడం మొదలుపెట్టింది. ప్రతినిముషమూ భార్యను విడవకుండా కనిపెట్టుకొనివుండి ఆవిడను యెవరు యేమన్నా కనిపించుకొనివస్తూ యెంతో మోహంతో సంచరిస్తూ వుండేవాడయినా సమర్తాడిన మర్నాటినుంచీ భార్యయొక్క నవ్వుమొగం చూచినప్పుడెల్లా తెల్లతెల్లబోతూ, ఆవిడ యవ్వనం తలుచుకుని దిగులుపడుతూ, బెంగపెట్టుకుని ఆదినానికాదినం క్షీణించి దేహమంతా పాలిపోయి భార్యయొక్క పరోపకారం చూడలేక లేచిపోయినాడేమో అన్నట్లుగా సాధ్యమయినంత శీఘ్రంగానే పెద్దయ్యగారు యీలోకాన్ని విడిచిపెట్టినారు.

భాను — పెనిమిటి మరణానంతరం యేమి జరిగింది?

పాపా—విభక్తకుటుంబమని చెప్పి చిన్నమ్మమీద కర్తవ్యం పెట్టి దినవారక్రియలు తండ్రి వకరిచేత చేయించినాడు. అదే ప్రకారంగా సమిష్టి కుటుంబం అవిజ్ఞాతులు కూడా నేరేవుత్తర క్రియలు జరిగించినారు. ఫదిదినములూ వెళ్ళిపోగా నేజ్ఞాతుల్లో వకడు తమది అవిభక్తకుటుంబం గనుక పెద్దయ్యగారి ఆస్తికంతా తానే కర్తనని వ్యాజ్యం తెచ్చినాడు. వారందరూ విభక్తులయినందుకు సాక్ష్యంగా వాటాలజాబితాను కోర్టులో దాఖలుచేసి చిన్నమ్మతరఫున వకప్లీడరు వాదంచేసినాడు కాని వాటాల జాబితాలో వ్రాళ్ళు చేసిన వాళ్లు వారివద్దలంచం పుచ్చుకుని తిరిగిపోయి నారు. వ్యాజ్యం విమర్శకు వచ్చినప్పుడు పాతమునసబుగారు న్యాయం వేలంపాడించి పెద్దపాటమీద కొట్టివెయ్యడానికి నిశ్చయించుకుని వాది పక్షం తీర్పు చెయ్యడానికి సిద్ధమయినాడు. ఇంతలో యీసంగతి తెలిసి ప్రతివాది తనమాన్యంలో వక భాగము మునసబుగారి బంధువుని పేర అమ్మివేసినట్టు దస్తావేజు వ్రాసియిచ్చి వ్యాజ్యం తనపక్షం చేయించుకుంది.

భాను—ఆన్యాయాధికారిపేరు శ్రీధరులు కాదా? ఆయన వుభయ పక్షాల వారివద్దనూ కూడా లంచాలు పుచ్చుకుంటూ వుండేవాడని విన్నాను.

పాపా—ఆయన పేరేమో నాకు తెలియదు. మొదటిఅక్షరం 'శ్రీ' అనిమాత్రం జ్ఞాపకం వుంది పేరు యెవరైతే నేమి? ఆన్యాయాధిపతి వాదిళ్ళు తమకు కావన్న సాక్షులను తప్పుసాక్ష్యం ఇచ్చినందుకు దండిస్తా నని కోర్టులో పెట్టించి వకదినం వుంచి తలవక్కటికి రెండేసివందలురూపా యల చొప్పున పుచ్చుకొని వదలిపెట్టినాడు. ఆ న్యాయప్రభువు వాది వద్దకూడా కొంతసొమ్ము పుచ్చుకొని ఖర్చులిచ్చుకో నక్కరలేకుండా తీర్పులో వ్రాయడమే కాకుండా ప్రతివాది అనంతరము మాన్యం తనకు చెందేటట్టుగా డిక్లెరేటరీ దావా తెచ్చుకోవచ్చునని కూడ తీర్పులో అవ

కాశం కలుగ జేసినాడు. తనసాక్షులు తిరిగిపోయినప్పుడు వ్యాజ్యంవాది పక్షం అవుతుందేమో అని జడిసి, భర్తగారు రుణాలుచేసినట్టు మరి వకరిచేత వ్యాజ్యం వేయించుకొని ఆబాకీలకుచిన్నమ్మ రుజువుమోశక దాఖలుచేసింది. తీర్పు కాగానే ఆవాది తీర్పు మొత్తంక్రిందమరికొంత భూమి వేలంవేయించి తనడిక్రీసొమ్ము అసలుఫాయిదాలతో రాబట్టు కొన్నాడు.

భాను—ఆమోతరఘున పనిచేసినందుకు ప్లీడరు యేమిపుచ్చు కున్నాడు?

పాపా—ఆప్లీడరు మంచివయసులోవున్నవాడు. చిన్నమ్మకూడా కొత్తగానేకదా యవ్వనంపొందింది. అతడు రాత్రిభోజనం చెయ్యగానే బయల్దేరిప్రతిదినమున్ను జోరునవర్షంకురుస్తూవున్నా మానకుండావచ్చి చిన్నమ్మయిల్లు చేరుతూవుండేవాడు. అటుతరువాత వారిద్దరూపడక యింట్లో ప్రవేశించి తలుపులులోపల గొళ్ళెపెట్టుకుని నాలుగుఘడి యలసేపుపుండి వెలపటికివస్తూవుండేవారు. వారు లోపలయేమిచేసు కుంటూ వుండేవారో చూచినవారు యెవ్వరున్ను లేరుకాని వారు వ్యాజ్యంవిషయంలో లోపల రహస్యం మాట్లాడుకుంటూ వుంటారని అడిగిన వారితో ఆమెతల్లిదండ్రీ చెపుతూవచ్చేవారు. వ్యాజ్యంతీర్పు కాక మునుపే చిన్నమ్మకుపుత్రిసంతానం కలిగిందని లోకులుమాత్రం చెప్పు కుంటారు. ఆమాటే నిజమయినట్టయితే వకవేళ పుట్టగానే స్వర్గానికి పోయినా కానీ ఆప్రథమపుత్రుడే తప్పకుండా పెద్దయ్యగారినిపున్నామ నరకంనుంచి ముక్తుణ్ని చేసివుంటాడు. ఈప్రవాదకలిగిన కాలంలోనే చిన్నమ్మయింటికి యెదురుగుండావున్న చెరువుగట్టుమీద చంపబడ్డ అప్పుడుపుట్టిన పురుషశిశువు వకటి కనబడ్డది. ఆశిశువుముఖాన్నిసందే హంలేకుండా చిన్నమ్మముఖపోలికకూడాకొంచెం కలిగివున్నది.

భాను—వ్యాజ్యం తనపక్షం అయినతరువాత చిన్నమ్మ యేప్రకారంగా ప్రవర్తించింది?

పాపా—వ్యాజ్యంతనపక్షం కాఁగా నేప్లీడరుగారిసలహామీద తన తదనంతరంకూడా జ్ఞాతులకు చెందకుండా చెయ్యడంనిమిత్తంమాన్యాలన్నీ అమ్మివేసిచిన్నమ్మరొక్కంచేర్చుకున్నది. ఆమెతల్లిదండ్రులున్ను కూతురుముండా మొయ్యడంవల్ల కలిగిన అయిశ్వర్యం కొంతకాలం అనుభవించి మనమలనూమనమరాళ్ళనూ చూడకపోయినాకూతురు కడుపుతో వుండడంమాత్రం చాలాసార్లు చూచి సంతోషించే లోకాంతర గతులైనారు.

భాను—తల్లిదండ్రులు పోయేటప్పటికి చిన్నమ్మస్థితి అంతగా చెడి పోలేదు కాబోలును. అటుతరువాత యేమిజరిగింది?

పాపా—పూర్తిగా చెడిపోలేదు. మొట్టమొదట దాము పెళ్ళి చెయ్యకముందు యేస్థితిలోవుండేదో ఆస్థితిలోకే మళ్ళీ కూతుర్నుతెచ్చి మరీవారు కాలంచేసినారు. తరువాత చిన్నమ్మ సర్వస్వతంత్రురాలై లోపల వక్కత్తేవుండలేక తరుచుగా వీధిగుమ్మంలో నేవుంటూ చాలా మంది మొగస్నేహితులను సంపాదించుకుని రాత్రిళ్ళు భయంచేత డబ్బిచ్చిఅయినా యెవరినైనావక్కణ్ని లోపల తనతోకూడాపడుకోవడానికి సహాయంతెచ్చుకుంటూ "పరోపకారార్థమిదంశరీరమ్" అన్న వాక్యాన్ని మరవకుండా ప్రవర్తిస్తూవుండేది. ఈప్రకారం జరుగుతూ వుండగా వకమంత్రవేత్తచిన్నమ్మయింటికి తరుచుగా వస్తూఆవిడకు ధనపిశాచం సోకివున్నదని తెలుసుకుని తన వుపాసనాబలంచేత దాన్ని నేర్పుగా వదలించి తన స్వాధీనంచేసుకుని తన దారినిపోయినాడు. ఆ పయిని జీవనం జరగడమే కష్టమయి యీామెఅటుకొలుకొట్టుకుంటూ దారిద్ర్యాంజన ప్రభావంచేత తెలివితెచ్చుకొనిమునుపటిసేహితులకు

భాను—గ్రామంలోవారు వుపేక్షచేసి వూరుకున్నా యిటువంటి పనిచేసి యీమె ప్రజలలో యేప్రకారంగా తలయెత్తుకుని తిరుగుతూ వున్నది?

పాపా—ఆమెకు వచ్చిననీతులు లోకంలో యెవ్వరికీ రావు. పది మందిచేరినప్పుడు తనపతివ్రతాధర్మం తానే వెయ్యినోళ్ళ మెచ్చుకుంటూ లోకంలోని సంసారస్త్రీలు దరూవ్యభిచారంచేత పాడవుతూవున్నారనీ తనమాటలువిని వారిని శిక్షించే నాధుడులేక లోకంచెడిపోతూ వున్నదనీ చెప్పుతూవుంటుంది. పరపురుషుల మొఖమయినా చూడకుండా వుండే పతివ్రతలలోసమేతూ యీమె రంకులు కట్టనివారొకరూ లేరు.

భాను—ఇటువంటి నష్టాలన్నీ తల్లిదండ్రులు డబ్బుకాశపడి కడుపునపుట్టిన బిడ్డలను ముసలివాళ్ళకు కట్టిపెట్టడంచేత కలుగుతూ వున్నది. కన్యాశుల్కం పుచ్చుకునేవాణ్ని పదిమందీచేరి వెలివేస్తే బహునష్టాలు మానిపోతయి.

పాపా—ఈ చెప్పినవిమాత్రమే కావు. చిన్నమ్మసుగుణాలు చెప్పవలసిన విలక్షణములువున్నవి. ఆమయింటికివస్తూవుండే పురుషులసంఖ్యానానాటికి వృద్ధి అవుతూవున్నందున వారికందరికీ కావలసిన సదుపాయాలు చేసి సమర్థించడానికి వంటరికత్తె కావడంచేత సమర్థురాలుగాక వారి వుపచారంనిమిత్తం కొందర్నిజీతాలకుకుదిర్చి బాగా పనిచెయ్యడానికి దేహపటుత్వంకలిగి పడుచుతనంలోవున్న పనికత్తెలను మాత్రమే యింట్లోవుంచుకున్నది. యిరుగుపొరుగు స్త్రీలకుకూడా వేదాంత ధర్మాలు వుపదేశంచేసి వారిని తనమార్గానికి దింపి పరోపకార పారీణురాళ్ళనుగాను ధనికురాళ్ళనుగాను చేస్తూవున్నది. కాబట్టి యీవీధి స్త్రీలకందరికీ యిప్పుడీమె గురుపీఠము. ఈకలికాలంలో కన్యావిక్రయం మాన్పించడానికి ప్రయత్నంచేసే వారెవరు? పెద్దలందరూ తమకదిలాభకరమయినప్పుడు అనుగ్రహించి యీ ఆచారాన్ని

న్వృద్ధిపొందించడానికే చూస్తూవున్నారు. ఇక చిన్నవాళ్ళమాటలు వినేవారెవరు?

భాను—ఈరోజంతా రంకువురాణంతోనే కాలక్షేపంచేసినాము. నాకీరెండు దినాలనుంచీ యీమెచరిత్ర పూర్తిగా తెలిసింది కాదు. ఇదివరకు భోజనంచేసినందుకు ప్రాయశ్చిత్తంచేసుకుని యీపూటనే మరవకచోట బసచేస్తాను. సెలవు దయచేస్తారా వెళుతాను.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు)

సమాప్తము.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము 1950.

# వ్యవహార ధర్మబోధిని.

గ్రంథకర్త :

కందుకూరి వీరేశలింగము పంతులు

ఐదవ కూర్పు.

ప్రకాశకులు.

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950

## ఈనాటకమునందువచ్చు పాత్రములు.

——: ౦ :——

సూర్యనారాయణ రావుపంతులు—వాదిప్లీడరు.
భాపిరాజు—ఏజెంటు.
రామయ్య—ప్లీడరు గుమాస్తా.
వీరన్న—కాపు, వాది.
కామావధానులు—ఒకవ్యాజ్యెగాడు.
బడేసాహేబు—జవాను.
సీతాపతిరావు—ప్రతివాది ప్లీడరు.
శేషాచార్యులు—ప్లీడరు గుమాస్తా.
దొరయ్య—ప్రతివాది.
సోమయాజులు, చలపతిరావు, కామరాజునాయుడుగార్లు—ప్లీడర్లు.
భాస్కరరావు—గుమాస్తా.
ఆనందరావు—డిస్ట్రిక్టుకోర్టు గుమాస్తా.
పుల్లయ్య, వెంకయ్య—సాక్షులు.
దానయ్య—మునసబుకోర్టు బేటాఖాను.
వెంకటరత్నము—కరణము.
సత్తెప్ప—పెత్తనదారు.
గురురాజు—మేజస్ట్రీటు గుమాస్తా.

మునసబుగాడు, తహాస్సీల్దారు, డిప్టికలక్టరు, గుమాస్తాలు, హెడ్డుకనిష్టేబిలు, కనిష్టేబిలు, డిస్ట్రిక్టుకోర్టు డఫేదారు, జమాదారు, కాపులు, కోమటి, యెఱుకలవాఁడు.

# వ్యవహారధర్మబోధి

## ప్రథమాంకము

### ౧. స్థలము—ప్లీడరుయొక్క కచేరీసావిడి.

[ప్లీడరుయొక్క గుమాస్తా మొదలగువారు కూర్చుండియుండగా, పల్లెటూరినుండివచ్చిన కాపును అతనియేజెంటును ప్రవేశించుచున్నారు.]

బాపిరాజు (ఏజెంటు)—సూర్యనారాయణరావు పంతులుగారున్నారా?

రామయ్య (గుమాస్తా)—ఓహోహో! బాపిరాజుగారా? దయచెయ్యండి. పంతులుగారింకా శశిరేఖయింటికాడనుంచి రాలేదు. వచ్చేవేళ అయినది.

బాపి—ఇప్పుడు వేసీఘంటలెన్ని? పంతులుగారు దంతధావనం భోగం వాని యింట్లోనే చేసివస్తారా? లేక యిక్కడికివచ్చినతరువాత చేసుకుంటారా?

రామ—ఈగడియారప్రకారం యెనిమిదిఘంటలు కావచ్చినది. ఇదివరకే అరఘంట స్లోగా నడుస్తూవున్నది. పంతులుగారు అన్ని అవశిష్టాలూ అక్కడనే తీర్చుకొనివస్తారు. రావడంతోనే మీతో మాట్లాడి మీకార్యం యింపుగా సఫరాచేసి మరీవకపని చూసుకుంటారు. నావెనకటి వాలంటరీబాపతు నాలుగణాలూ దయచేశారు కారుగదా?

బాపి—ఏమో యిచ్చినన్నా! యింకా నిల్చునేవున్నావా? చెప్పులజోడు కిందవిడిచిపెట్టి అలాచాపమీద మూలగాకూర్చో. రామయ్యగారిని యెరుగుదువా? ఈయన పంతులుగారిగుమాస్తా. నీవ్యాజ్యం

లో మంచిపని చేస్తారు. వ్యాజ్యం గెల్చినతరువాత మంచిబహుమతీ చెయ్యవలెను.

వీరన్న (కాపు)—రామయ్యగారూ! దణ్ణాలండి.

రామ—దీర్ఘాయుష్యమస్తు శీఘ్రమేవ లాభప్రాప్తిరస్తు.

బాపి—వీరన్నా! పిట్టలమీదిబట్ట కి దికితీసుకొని బాగాచతిగిల పడికూర్చో. యీలాగేనా పెద్దమనుష్యుల యింటికి వచ్చినప్పుడు కూర్చోవడం?

రామ—నీవ్యాజ్యం యేపాటి మొత్తం?

వీర—నాకేమీ తెల్దు. బాపిరాజుగారి నడగండి. అన్నీ ఆయనే మనవిచేసుకుంటారు.

రామ—పంతులవారు వస్తున్నట్టున్నారు. మాటలువినబడుతూ వున్నవి.

[ప్లీడరుగారు పదిమంది పాట్లతో వచ్చి తివాసీమీదకూర్చున్నారు.]

వీర—(నిలువబడి) పీడరుగారు దణ్ణాలండి.

సూర్య—(నఖశిఖపర్యంతము పారజూచి) నీ పేరేమిటి?

బాపి—ఇతను కేసారంగ్రామపెద్దకాపు. కొంచెం భూసంబంధమైన వ్యాజ్యంవుండగా తమదర్శనం చేసుకోవలెనని వచ్చినాడు.

సూర్య—నీవు యెవరిమీదనైనా వ్యాజ్యం వేస్తావా? నీమీద యెవరైనా వ్యాజ్యం వేశారా?

బాపి—ఇతనే అన్నగారిమీద వ్యాజ్యం వెయ్యవలెనని మీకు వకాల్తునామా యివ్వడానికివచ్చినాడు. మీరు ఫీజులో సదుపాయం చేసి ఇతనితరఫున బాగా పనిచెయ్యవలెను. (అని చెవిలో రహస్యముగా) పీడరు డబ్బుగలవాడు ఫీజు దిట్టముగా మాట్లాడుకోండి.

సూర్య—పని కేమి చూచుకొంవచ్చినప్పుడు చేస్తాను—రామయ్యా! వకాల్తునామా వ్రాసి అతనిచేత దస్కతుచేయించుకొని నీవున్నూ బాపిరాజుగారున్నూ సాక్షివ్రాళ్లు చెయ్యండి.

రామ—నీయింటిపేరేమి?

వీర—మా యింటిపేరాండి? తవ్వాలోళ్లు.

రామ—నీవు యెవరిమీద వ్యాజ్యం వేస్తావో వారిపేరు చెప్పు.

వీర—మాఅన్నగారిమీద.

రామ—కాదోయి. పేరు.

వీర—అతనూ గ్రామానికి పెత్తనదారేనండి. నాజిరాయితీ భూమి—

రామ—అదంతా యెందుకు పేరు చెప్పవోయి.

బాపి—అన్నీ నేనుచెప్తాను వ్రాయండి. అతనిపేరు తవ్వాల దొరయ్య, కేసారం గ్రామంలోవున్న పంటుంజిరాయితీభూమి ప్రతివాదివద్దనుంచి రాబట్టుకోవడముకు వ్యాజ్యం.

రామ—వీరన్నా! నీవు చదువుకొన్నావా?

వీర—నేను సదుపుకోలేదండి.

బాపి—నీవు వ్రాలుచెయ్యడం నేర్చుకొన్నావుకాదా? ఆకింద వ్రాలు చెయ్యి.

వీర—(అయిదు వేళ్లతోనుకలముపట్టుకొని) యిక్కడనే కాదూ?

(అని వకటిబంతి అక్షరములతో "యిరనవ్రలు" అని వ్రాసెను.)

రామ—ఏమోయి! వ్రాలుచెయ్యడానికే కలమంతా శిరా చేసినావు? అయ్యో! వకాల్తునామామీదకూడా శిరాపోసినావా? ఇలాతే; యెట్లు కాకితంలో అద్దుతాను.

సూర్య—బాపిరాజుగారూ! దస్తావేజు లేమయినావుంటె రామయ్య చేతికివ్వండి.

బాపి—రామయ్యగారూ! యివి పుచ్చుకోండి. ఇది అన్నగారూ ఇతనూకలిసి వ్రాసుకొన్నదస్తావేజు. ఇది కలెక్టరుగారివద్ద

అర్జీ యిచ్చుకుంటే శివిల్ ద్వారా న్యాయంపొందవలసినదని యిచ్చిన యిండార్సుమెంటు.

సూర్య—ఏమోయిపాపయ్యా! మాకు పాడికి బహు యిబ్బందిగా వున్నది. పూటకు శేరుపాలుయిచ్చే ఆవు నొకదాన్ని తోలిపెడుదూ.

పాప—యీ వేళ నావ్యాజ్యం హీరింగుగదా. గెలవనిత్తురూ. రెండావులను తోలిపెడుతాను.

సూర్య—మొన్న చెల్లూరివారి స్మాలాకాజువ్యాజ్యం గెలిపించినందుకు యాభైరూపాయలుపెట్టి ఈయుడుగులజోడు చేయించి బహుమతీ చేసినారు. వెధవవ్యాజ్యం వ్యాజ్యమయితే యిరవై రూపాయలదే కాని, అది మహాపట్టుదలమీదవచ్చినది. ఆవ్యాజ్యంలో నేను వాదులతరపున వకాల్తుగాను పుచ్చుకోకపోతే ప్రతివాదులు నూరురూపాయలు యిస్తామన్నారు. నేను హీరింగు చేసేకాలమునకు కోర్టు యెగిరిపోయినది. మునసబుగారు నావాదంనూరు హాశ్చర్యపోయినారు. ప్రతివాదిప్లీడరు నాయెదర నూటాకతే నేను రీజను చెప్పుతూవుంటే తలవంచుకొని వూరకున్నాడు.

బాపి—మీరు చెప్పుకొన్న బంగారు ప్రముత్తానుగారా బహుమతీచేసిన దేకాదా?

సూర్య—అవును మొన్నటిస్థలవ్యాజ్యంలో శాకల్లపూడివారు యిచ్చారు. నూరు రూపాయల కిస్మతుచేసే నివేశనప్పెరంబున్న షదిరూపాయలు ఖరీదుగల ఫలవృక్షములున్నూ రావలెనని వాదులు దావాతెచ్చినారు. వ మంచిగప్పున సాక్ష్యంపూర్తిగా రుజువయింది. క్రాసుయెగ్జామినేషన్‌లో యెలాగంటి నవాళ్ళు వేసి సాక్షులను పడగొట్టినానో మీరు చూచినారు కదా? అలా రుజువుపడిన వ్యాజ్యం హీరింగులో నేను చెప్పిన వకాల్తానంబుమీద యెగిరపోయింది.

కోర్టులో నాతో సమానంగా పని చెయ్యగల ప్లీడరు నొక్కణ్ని చూపండి. కొత్తప్లీడరు వాదిపక్షమున నేనుతప్ప మరివక ప్లీడరు వకాల్తునామా పుచ్చుకుంటే వ్యాజ్యం వాదులపక్షమయినదే. వ్యాజ్యం తమపక్షమయినదన్న సంతోషముచేత సుబ్బరాజుగారు తక్షణం రెండువందలరూపాయలు పెట్టి మొల్తాడు చేయించి నేను నా శ్రమకు యీ బహుమతీ చాలదని చెప్పి దగ్గరవుండి మొలకు పెట్టించినారు.

బాపి—మొన్న యిండిగవాళ్ళు తెచ్చిన పదిరూపాయల వ్యాజ్య మేమయినది? అందులో మీకు ఫీజు యేమాత్రం యిచ్చినారు?

సూర్య—అదీ మాపక్షమే చేయించినాను. ఇక నేను పట్టిన వ్యాజ్యం పోవడమనేది లేదు. ఎంతచిన్న కేజులోనూ నేను యిరవై రూపాయలకు తక్కువఫీజు పుచ్చుకోను. అలా యిచ్చేవారే నావద్దకు వస్తారు. మూడూ నాలుగూ పుచ్చుకొని పని చేసేప్లీడర్లున్నారు. వాళ్ళచేత పనిచేయించుకొనే వాళ్ళపాల్లు గాండడం లేదా?

బాపి—అందుచేతనే కదా పిలిస్తేను యింతమంది ప్లీడర్లుండగా మీవద్ద కేసు తీసుకువచ్చినాను. ఈ కేజులో మీరు బాగాపని చెయ్యవలెను.

సూర్య—ఫీజు యెంత యెక్కువిస్తే అంత దివ్యంగా చేస్తాను. మాకు నాలుగురూపాయలు యెక్కువ యివ్వడముల్లా పార్టీకి లాభమే కాని నష్టం కాదు—వీరన్నా! నీది స్థలసంబంధమయిన చిక్కువ్యాజ్యం కదా? విస్తారంపని చెయ్యవలెను. ఫీజు యేమిచ్చుకుంటావు?

వీర—నేను సంగతి తక్కువ పుచ్చుకోనుగనుక యిర్వై రూపాయలు దాఖలు చేసుకొంటాను. చేసినవారి ననుగ్రహించవలెను.

సూర్య—ఛీ! కల్లుసీసాలమ్ముకునే గమళ్ళవాడిచ్చినాడే పదిరూపాయలవ్యాజ్యంలో యిరవై రూపాయలఫీజు. నీవు పూటకి పెట్టినదారి

చేస్తూ స్థలవ్యాజ్యంలో చచ్చుఫీజు యిరవయిరూపాయలా యిస్తా నంటావు?

బాపి—ఇందులో ప్రస్తుతం పాతికరూపాయలు యిచ్చుకుంటాను. వ్యాజ్యం గెల్చినమీదట మిమ్మల్ని సంతోషపెడతాను. అందుకు నాది పూచీ. నేను చెప్పినప్రకారం అంగీకరించవలెను.

సూర్య—బాపిరాజుగారు సిఫారసు చేసినారు గనుక ఆప్రకారం ఒప్పుకున్నాను. లేకపోతే యీవ్యాజ్యంలో అధమము నూరురూపాయల ఫీజుకు తక్కువపుచ్చుకోను. ఏవీ రూపాయలు తే.

వీర—(బొడ్డుకొంగును ఉన్న మూటతీసి) ఇదిగోనండి యిరవయి రూపాయలున్నాయి ప్రస్తుతం వీటితో పనిజరిగించండి.

సూర్య—(రూపాయలు చేతిలోపుచ్చుకొని వరలకింద పెట్టి) యివి యేమూలకువస్తవి? యింకా నలభై రూపాయలు కావలెను. వకాల్తునామా అచ్చుఫీజు రూపాయి; వాంటరీ అర్ధరూపాయి; వకాల్తునామా స్టాంపుఖరీదు అర్ధరూపాయి? కంప్లయింటుస్టాంపు ఖరీదు పాతికరూపాయలు: ఫయిలు చేసుకున్నందుకు హెడ్డు గుమాస్తాకు నాలుగురూపాయలు; చిల్లరఖర్చులు నాలుగు రూపాయలు; వెరశి నలభై రూపాయలు గాక ఫీజు నిల్వాపుడగా ఖర్చులకే యింకా పక్తు యిరవయిరూపాయలు కావలెను.

బాపి—ఖర్చులకు కావలసిన యిరవైరూపాయలూ ఇచ్చుకో. రేపుపట్నానికివెళ్ళి తెచ్చి ఫీజుసొమ్ము దాఖలు చేసుకుందుగాని.

వీర—(తలగుడ్డ చెంగు పైకితీసి మూటవిప్పి) నాదగ్గర యీ పదిరూపాయలూ వున్నవి. స్టాంపు రెండురూపాయలు మానాలండి.

సూర్య—కంప్లయింటుస్టాంపులో తగ్గించడముకు వల్లకాదు. సర్కారురూపాయలు అలా దాఖలు చెయ్యవలెను. తక్కిన పదిరూపాయలూ యివ్వకతప్పదు.

బాపి—భత్యఖర్చుకు పెట్టుకొన్న రూపాయ తీసుకున్నా రెండో చెంగున వుంటవి. ఏదీ తలగుడ్డవిప్పు. ఫీజుకే నాలుగురోజు లాగుతారు గాని స్టాంపుకుండా ప్లీడరుగారు పెడతారా? (అని తలగుడ్డ తీయఁబోవుచున్నాడు.)

వీర—ఉండండి—ఉండండి నేనుతీస్తాను. (అని రెండవ చెంగుతీసి మూటవిప్పి యేడురూపాయ లిచ్చుచున్నాడు.)

బాపి—తక్కిన మూడురూపాయలూ యివిగో నేనుయిస్తాను. విరాంఫీజురూపాయిలు రేపులేదు యెల్లుండి మధ్యాహ్నముకు తీసుకుని వచ్చి దాఖలుచేసుకుంటాడు—వీరన్నా! వచ్చేటప్పుడు వకమణుగు పెండలమున్నీ ప్రశస్తమయిన వంగవరుగు బుట్టఒకటిన్నీ ప్లీడరు గారికి తెచ్చి దాఖలుచేసుకో.

సూర్య—రామయ్యా! దస్తావేజుయేదీ చూడనియ్యి. (చేతిలో పట్టుకొని) సోమోయి వట్టికాగితముమీద వ్రాయించినావుచెల్లదే.

రామ—పినాల్టీ పెడితే చెల్లుతుందేమో !

సూర్య—పినాల్టీపెట్టినా చెల్లదు. దీనికి వేరేసదుపాయం వున్నది. చెవుతాను. వీరన్నా ! యెందుకయినామంచిది నీవువచ్చే టప్పుడు ముప్పదిరూపాయలు పట్టుకొనిమరీరా. ఈలోగా పాతస్టాంపు జాగ్రతపెట్టిస్తాను.

వీర—బాపిరాజుగారూ ! యెళ్దామండి.

బాపి—వెళుదాము. ప్లీడరుగారితో కొంచెం నాకుమాట్లాడ వలసిన పనివున్నది. నీవు బసదగ్గిరవుండు. వచ్చికలుసుకుంటాను. వీరన్నా ! ఒక్కనూటు వీధిగుమ్మములోకిరా. (అని లేచినడుచు చున్నాడు.)

వీర—(లేచి) ప్లీడరుగారూ ! దండాలండి. సెలవుపుచ్చు కుంటాను.

సూర్య—వీరన్నా! మీవూళ్ళో నెయ్యి మహామంచిది దొరుకుతుందట. వచ్చేటప్పుడు మరచిపోక రెండురూపాయల నెయ్యి కూడా పట్టుకొనివస్తావు కాదా?

వీర—చిత్తం. (అని వీధిగుమ్మములోకి వెళ్ళుచున్నాడు.)

శాపి—(మెల్లగా) వీరన్నా! ఇందాకా నేను ప్లీడరు చెవిలో చెప్పి దేమో నీవు యెరుగుదువా? పదిమందిలోనూ నీవు బీదవాడవని చెపితే బాగుండదని, చెవిలో చెప్పి ఫీజు తక్కువ పుచ్చుకొని పని చెయ్యమని కోరినాను. ఆ ఘనతతో నాకు వేరేపనిలేదు. నీవు వెళ్ళినతరువాత సిఫారసుచేసి వ్యాజ్యంలో బాగా పనిచేసేటట్టు బందోబస్తుచేసి మరీవస్తాను.

వీర—అన్నిటికీ మిమ్మల్నే నమ్ముకున్నాను. ఇదివరకిచ్చిన పది రూపాయలుగాక, మీకింకా పదిరూపాయలసొమ్ము ముట్టచెప్తాను. ఎంతసొమ్ము ఖర్చుపోయి అయినా వ్యాజ్యం మనపక్షం చేయించుకోవలెను.

శాపి—అదేమిటి నీవు? నీవు ప్లీడరుగారికి వకాల్తానామా యెప్పుడిచ్చినావో వ్యాజ్యం అప్పుడేగెల్చినది. నీవింటికివెళ్ళు, ప్లీడరుగారితో మాట్లాడి నేను నీవెనుకనే వస్తాను.

వీర—శీఘ్రంగారావలెను. (అని వెళ్ళుచున్నాడు.)

శాపి—(లోపలికివచ్చి) వీరన్నను పంపివేసివచ్చినాను. వీడు వట్టిమూలధనికుడు. తండ్రి శ్రాద్ధమువాడంబరముగా వక్కకొత్తడబ్బు ఖర్చుపెట్టడు. తాతతండ్రులనాటినుండి వీడింట్లో ధనము మూలుగుతూ వున్నది, సూర్యనారాయణగారూ! మీరు కూడినవద్దనుంచి డబ్బు పిండాలంటూ లాగుతానో చూస్తాము.

సూర్య—ముఖ్య డబ్బులాగడముకు నాతరువాతనే. దమ్మిడీ ఖర్చుపెట్టవలసివస్తే పడిచస్తానని వానివద్ద యేమీలేనివానిలో

ఫ చేసికూ పాయింట్లు లాగినానే. వీడెంత? వీడివద్ద యెలాడబ్బుతీస్తానో తమాషాచూస్తురుగాని.

బాపి—అన్ని కేజులకువలె ఇందులో నూటికి యిరవైరూపా యల కమిషన్ పనికి రామనుకుండి. ఈ కేజులో సఖంఫీజునాది. సుబ్బారాయుడుగారు సఖంకంటె యెక్కువఇస్తాను, తనకు వకాల్తు నామా యిప్పించవలసినదని అడగుతూవుంటే, మొదటినుంచీమీకూ మాకూ ఖాతావున్నదని మీవద్దకే తీసుకొనివచ్చినాను.

సూర్య—దానికేమి? అలాగేవుచ్చుకొండురుగానిలెండి.

బాపి—మొన్న సిరంవారివ్యాజ్యం మీరు వేళకుకోర్టుకు వెళ్ళకపోవడంచేత నిష్కారణముగా పోయినది. ఫీజంతా మీరు ముందుగానే చేతులోవేయించుకొన్నారు. వాళ్ళు రేపువచ్చి అఘోరిస్తే యేమిచెప్తాము.

సూర్య—వాళ్ళురానియ్యండి. వాళ్ళతో చెప్పి పునర్విమర్శకు పిటీషను పెట్టింతాము.

[ఘూరీచెంబు చేతిలోబట్టుకొని, తలకొక అంగవస్త్రము చుట్టుకొని, ఒక బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నాడు.]

సూర్య — శాస్త్రావధానులుగారూ! యెప్పుడువచ్చినారు? కూర్చుండండి మొన్న నేనుపంపించిన ఉత్తరం అందిందా?

శాస్త్రీ—అందేవచ్చినాను. ఏమి? సూర్యనారాయణగారూ న్యాయమయినవ్యాజ్యం ఓవరం చేయించినారుగదా?

సూర్య—నేనేమిచెయ్యను నాశాయశక్తులా పనిచేసినాను. మీసాక్షులు తిన్నగా పలికినారుకారు. అక్కడికీ నాహియరింగుచూసిన వారందరూ వ్యాజ్యం మనపక్షమవుతుందనే అనుకున్నారు. మునసబు అన్యాయంచేస్తే మనమేమిచెయ్యము?

కామ—సాక్షులు వున్నదివున్నట్టు చెపుతామంటే పద నియ్యక మీరేమేమో లేనిసంగతులు బోధించడంచేత వాళ్ళుతొం దరపడి పోయినారు. అందుచేత మునసబు వాళ్ళసాక్ష్యం నమ్మినాడు కాదు. నాపనియింతేనా? ఇంకేమయినా ఆధారం వున్నదా?

సూర్య—ఇప్పుడేమయినది? ఇంకాపయిని రెండప్పీళ్ళున్నవి. చెన్నపట్నందాకా అయినావెళ్ళి పనిచేయించవలెనుగాని వదిలిపెట్ట కూడదు. అప్పీలుచేస్తేని ముషంలో యీతీర్పుతిరిగిపోతుంది. సాయం కాలంరండి. సావకాశంగా మాట్లాడుదాము. మునసబుగారు కోర్టుకువచ్చేవేళ అయినది. భోజనమునకు వెళ్ళవలెను.

(అని లేవంగా, అందఱును వెళ్ళిపోవుచున్నారు.)

---

౨. ప్రదేశము—ప్లీడరుగారిచావడి.

[ప్లీడరు, గుమస్తా, కూర్చుండియుండంగా, వంగవరుగును పెండలమును కావిడి వేయించుకొని నేతిచెంబు ఉగ్గము వేసిపట్టుకొని వీరన్న శాపిరాజుతో ప్రవేశించుచున్నాడు.]

శాపి—ఓరీ! కావిడి లోపలపెట్టివచ్చి యీ నేతిచెంబు అడం గులకు చెప్పి వప్పగించిరా.

సూర్య—శాపిరాజుగారూ! దయచెయ్యండి. వీరన్నా! యెప్పు డొచ్చినావోయి?

వీర—దండాలండి. యిదేరావడం. యీవాద్యం కోరటులో దాకలయిందాండి?

సూర్య—యెలాదాఖలవుతుంది? మునుపటిదస్తావేజు చెల్లదు. కొత్తదస్తావేజు నిమిత్తం మఱిఫదిలూపాయలు తెమ్మన్నాను తెచ్చి నావా? తెస్తేముందర్తిగా ఫదిరూపాయ లీలాగియ్యి. స్టాంపు తెప్పిస్తాను.

వీర—ఇదిగోనండి. (అని మూటవిప్పి చేతిలో పెట్టుచున్నాఁడు.)

సూర్య—రామయ్యా! ఈరూపాయలుపట్టుకొని స్టాంపు లెండరు గారి దగ్గరకువెళ్ళి నేనిమ్మన్నానని నాలుగయిదు సంవత్సరాలకిందటి పాతస్టాంపు అర్ధరూపాయి కిమ్మంతు చేసేది తీసుకొనిరా.

(చిత్తము అని రామయ్య వెళ్ళుచున్నాఁడు.)

సూర్య—రామయ్యా! చెవిలోమాట (అని చెవిలో మెల్లగా) నీవు దొడ్డితోవను వెళ్ళి నేనుపడుకునే గదిలో బీరువాలో కింద అరలో పాతస్టాంపులు వుంటవి. యింట్లో తాళంచెవులుఅడిగిపుచ్చు కొని యీరూపాయ లందులో వేసి నాలుగుసంవత్సరాలక్రిందటి అర్ధ రూపాయస్టాంపు వకటితీసి మళ్ళీపదిలముగా తాళము వేసి వచ్చే టప్పుడుకూడా దొడ్డిదారినే వీధులోనుంచి తిరిగిరా.

వీర—రామయ్యగారెంతసేపటికి మళ్ళీవత్తారండి.

సూర్య—యిప్పుడే వస్తాడు. బాపిరాజుగారూ! మీతో మొన్న చెప్పినప్రకారం యీలోపుగా ముసాయిదా తయారుచెయ్యండి. ఇదిగో కాగితంకలమూ.

బాపి—పంచాంగం వకసారి దయచేయిస్తారా? తెనుగు సంవత్సరమూ నెలా తిథీ వారముకూ సరియైన యింగ్లీషుతారీఖు చూస్తాను.

(అని ముసాయిదా కుదిర్చి వ్రాయుచున్నాఁడు.)

[ఇంతలో స్టాంపుపట్టుకొని రామయ్య ప్రవేశించుచున్నాఁడు.)

సూర్య—బాపిరాజుగారూ! ముసాయిదా వ్రాయడమయితే వీరన్నను తీసుకుని యిక్కడనే కోమటిభీమిసెట్టిగారిల్లువున్నది. వారి సావిట్లో కూర్చుండి లోపలతలుపు వేసుకొని తెలుఁగుసిరాతో పాత స్టాంపుమీద జాగ్రత్తగా సాపువ్రాస్తూ వుండండి. నేనింతలో వేరే

బడే—అరే యిక్కడయెవరో దొంగదస్తావేజ్ బనాయిస్తూ వున్నారట. అముల్‌దారుగారికి ఖబురు తెలిసి మీకీ హాజర్ పెట్టుమని హుకుమ్ ఐంది. భాంచోత్ కచేరీకీ నడ్వాండి.

బాపి—(భయముతో) సాహేబు సాహేబు. నీకేమనునా యిస్తాము వదిలిపెట్టు.

బడే—అరే భాంచోత్. నూకీ లంచం యిస్తావునోయి కచేరీకీ చెల్.

వీర—బాబూ బాబూ! నీకు యేంబయిరూపాయ లిచ్చుకుంటాను. నన్నిడిసిపెట్టు. సాయిబయ్యా! నీకు సలాము.

[అప్పుడు రామయ్య ప్రవేశించుచున్నాడు.]

బాపి—రామయ్యగారూ! మీరొక్కసారి వెళ్ళి పంతులుగారిని పిలుచుకొని రావలెను. మాకు అసాధ్యం వచ్చినది.

రామ—యేమిటి? సాహెబూ! వారినెందుకు లాగుతున్నావు?

బడే—యిద్దరిక్కడ ఘూటాదస్తావేజ్ బనాయిస్తూవున్నార్. కచేరీకి నడువ్మంటే భాంచోత్ రాకుండా వున్నార్.

రామ—ఒకనిముషం నామాటవిని తొందరపడకు. మాపంతులుగారిని తీసుకొని వస్తాను.

[కొంతసేపటికి పిల్లడుగారును గురూస్తూ రామయ్యయు ప్రవేశించుచున్నారు.]

బడే—హాజరత్ సలాం.

వీర—(కాళ్ళమీదపడి) పిడకరాయా! నన్నురక్షించవలెను. నూరురూపాయలైనా ఇచ్చుకుంటాను. నన్ను తీసుకునిపోయి ఖైదు చెయ్యకుండా చెయ్యవలెను.

సూర్య—సాహేబూ! మాట. నీకేవచ్చేలాభం యెందుకు పోగొట్టుకుంటావు? నామాటవిని యీ కాపు చెప్పిన సొమ్ము పుచ్చుకొని

వదిలిపెట్టు. ఒకవేళ నీవు స్టేషనుపోలీసువద్దకు తీసుకువెళ్ళినా, ఆయన లంచంపుచ్చుకొని ఎలాగూ వదిలివేస్తాడు.

బడే—పెద్దమనుష్యులూ మీకే సెలవిస్తున్నారుగనుక, ఆలాగే చేస్తాన్. రూపాయలూ తేండి.

సూర్య—వీరన్నా! నీవిప్పుడెన్నిరూపాయలయినా ఖర్చుపోయి మానుషం దక్కించుకోవలసిన సమయం. ఏవి నూరురూపాయలూ నాచేతికియ్యి.

వీర—(ఏబదిరూపాయలు చేతికిచ్చి) మిగిలిన రూపాయలు బసలోకెళ్ళి తీసుకొని వచ్చియిస్తాను. సొమ్ముకు మీరు పూచీపడవలెను.

సూర్య—సాహేబూ! సొమ్ముకు నేను జామీను వుంటాను. మధ్యాహ్నము మాయింటికిరా ఇచ్చివేస్తాను. వీరన్నా! వేగిరము వెళ్ళి రూపాయలు పట్టుకొనిరా. బాపిరాజుగారూ! దస్తావేజు వేగిరము పూర్తిచేసి మీదస్కతీచేసి రెండు సిశాక్షులచేత సాక్షివ్రాళ్లుపెట్టి నాచేతికివ్వండి. (అట్లు చేసిన తరువాత అందఱును పోవుచున్నారు)

---

3. స్థలము—మరియొక ప్లీడరుగారి చావడి.

---

[ప్లీడరుగుమాస్తా శేషాచార్యులు కూర్చుండియుండగా,
బాపిరాజును, గౌరయ్యయు ప్రవేశించుచున్నారు.]

శేషా—బాపిరాజుగారూ! కూర్చోండి.

బాపి—సీతాపతిరావుగారు లోపలవున్నారా? వకాల్తునామా యిప్పించడానికి వకీలును తీసుకొనివచ్చినాను.

శేషా—యెనిమిదిగంటలు వేస్తేనేకాని ప్లీడరుగారు బయిటికి రారు. మొన్ననే శంఖచక్రాంకములు వేయించుకొని, వైష్ణవేష్టి చేసినారు. ప్రొద్దున్న రామాయణపారాయణమయి పాశురములను చదివితేకాని, వ్యాజ్యస్తులను చూడరు.

బాపి—మునుపు ఆదివారం ఆదివారమూ స్వాములకందరికీ గంధసేవ జరిగేది. యిప్పుడు జరుగుతూవున్నదా?

శేషా—దివ్యంగా జరుగుతూవున్నది. స్వాములందరూ తిరుమణితిరుచూర్ణములు ధరించుకొని, మెడనిండా తులసిపూసల తావళములు వేసుకొని, ద్వాదశోర్ధ్వపుండ్రములతో శ్రీమహావిష్ణులవలె కూర్చుండి వుండగా, ద్రావిడభాషలో దివ్య ప్రబంధములు చదువుతూ చందనసేవ చేసేసమయములో యాసావిడికలియుగ వైకుంఠములాగున వుంటుంది.

[ప్లీడరు సీతాపతిరావుగారు ప్రవేశించుచున్నారు.]

సీతా—శ్రీమతే రామానుజాయనమః. బాపిరాజుగారూ! మీరీమధ్య నాకు వక్కాకైనా యిప్పించడం మానివేసినారు. యిలా దయతప్పడం న్యాయమేనా?

బాపి—మీరీలా అనిపోతారనే వకాల్తునామా యిప్పించముకు వకరివి తీసుకొని మరీ మీదర్శనానకు వచ్చినాను. ఈకుంభకోణపు పంచెలు యెప్పుడు తెప్పించినారు?

సీతా—మొన్ననే తెప్పించినాను. మీరవయిపునయెక్కడయినా మంచితులసిక(ర)లువుంటే సంపాదించి పెడుదురూ, రామదాసుగారు తులసిపూసల తావళము చేసి పెడుతామన్నారు.

బాపి—ప్రయత్నంచేస్తాను.—నారయ్యా! నీకువచ్చిన నోటీసు పంతులుగారికి చూపించు.

సీతా—యితనిమీద యెవరైనా వ్యాజ్యం వేసినారా?

బాపి—యితను స్వార్జితంమీద సంపాదించుకొన్న పందుంభూమి తనకురావలెనని అక్రమంగా యితనితమ్ముడే యితనిమీద వ్యాజ్యం వేసినాడు. ఇప్పుడితనికినోటీసు వచ్చినది.

సీతా—వాదితరపు ప్లీడరుయెవరు?

శాస్త్రి—సూర్యనారాయణరావుగారు.

సీతా—కరిసరే! అతనివ్యాజ్యంబాగానే గెల్చింది. ఆయనముందు యిల్లోకూర్చుండి పార్టీకి సమయమిచ్చి మాట్లాడుతాడా? కోర్టుకు చిన్నగావచ్చి హీరింగు చేస్తాడా? మొన్న బోగంవాళ్ళవిషయంలో ఆయనా మరివకరు ప్లీడరుగారూ పబ్లికుకోర్టులో తిట్టుకున్నందుకు మునసబుగారు యిద్దరికీ చెరివకనూరు రూపాయలజరిమానా వేసి ప్రాసీడింగ్సు చేసినారు. ముందుయిల్లోకూర్చుండి చేసేకు కోర్టుకురావందున, నిన్నగాక మొన్ననే ఆయనపెట్టినవ్యాజ్యములు రెండు మునసబుగారు కొట్టివేసి, పార్టీలను నష్టం ప్లీడరువల్ల రాబట్టుకోమ్మని సెలవిచ్చినారు.

శాస్త్రి—ఇది అక్రమమయిన వ్యాజ్యంగనుక దేలాఖైనాసాను చేయించవలెనని నేను ఆయనకు వకాల్తానామా యిప్పించినాను. అతనితో తగాదాపడలేక యింటిను ఎదుంభూమి యిస్తానని రాజీనామా పడబోతే యిష్టపడకూడా వృథాగా భూమియెందుకు పోగొట్టుకుంటావు. రాజీపడవద్దని యితనికి సలహా యిచ్చినాను. ఇంకా అడిగిచూడండి—నేమోయి! దొరస్వామీ! నీతో అలాగని చెప్పినానా? లేదా?

దొర—మీరు చెప్పినారండి. ఇప్పుడు యాజ్యంకూడా కొట్టివేయించవలెనా.

శాస్త్రి—అద్దే. దానికేమి? వకీలునిమిషంలో కొట్టివేయిస్తాను. సీతాపతిరావుగారికి వకాల్తానామా యివ్వడమూ మరివకతరహాను జరగడమూనా కాదా? నిన్నచేత ఈయనకు వకాల్తానామా యెందుకు యిప్పించినాను కాననుకొన్నావు? ఈయన కేవలం విష్ణుమూర్తివంటివారు. ఈయనపట్టినవ్యాజ్యం మోసమోసారాసాలెట్టియినా వ్యతిరేకంగా యెప్పుడూ తీర్పుకాదు.

నార—అన్నింటికీ మిమ్మల్నే నమ్ముకొన్నాను.

సీతా—బాపిరాజుగారూ! ఫీజుమాట నేమి చెపుతారు? చెయ్య వలసినపని చాలావున్నది.

బాపి—వారి పదిరూపాయ లిచ్చినారు. ఇతనూ అదే ప్రకారం యిస్తాడు.

సీతా—రామానుజ! రామానుజ! అంతతక్కువఫీజు నేను యెంతచిన్న కేజులోనైనా పుచ్చుకొంటానా? అలాగంటి తక్కువ ఫీజు సూర్యనారాయణరావుగారివంటివారే పుచ్చుకోవలెనుగాని నావంటివారు యిరవైరూపాయలకు తక్కు వెందులోనూ పుచ్చుకోరు.

బాపి—దొరయ్యా! పంతులుగారు యిరవైరూపాయలకు తక్కువపుచ్చుకోరు. పదిరూపాయలిప్పుడియ్యి. తక్కినపదిరూపాయలూ హీరింగు కాలములో యిస్తువుగాని.

నార—చిత్తం యేమయినాకొంచెము సదుపాయము చెయ్యవలెను. (అనిరూపాయ లిచ్చుచున్నాడు.)

సీతా—నాఫీజు కొంతెయిచ్చినావు. యిఖర్చులు మరి పదిరూపాయలు కావలెను. స్టేటుమెంటు స్టాంపురూపాయి; వకాల్తు నామాస్టాంపుఅర్ధరూపాయి; వాలంటరీ అర్ధరూపాయి; కంప్లయింటు నకలుకు నాలుగురూపాయలు; ప్రయివేటుఖర్చునాలుగురూపాయలు.

బాపి—కంప్లయింటు వకపేజీనిండాలేదే దానికంతఖర్చు యెందుకు?

సీతా—వాలంటరు బంతికి మూడేసి అక్షరముల చొప్పున వ్రాసిఆకాస్తాయిరవై పేజీలలో పట్టిస్తాడు; వేగిరం వ్రాసినందుకు అతని కేమయినా ఇయ్యవలెను. నకళ్ళపనిచూసే గుమస్తాకు కంపిరింగు ఫీజుకాక అర్ధరూపాయ అయినా చేతిలోపెడితేనేకాని నకలు వూడిపడదు. అక్కడికీ నేను చాలా తక్కువ చెప్పినాను.

శాపి—అఖర్చులుతప్పవు ఆమూపాయలుకూడా యిచ్చివేసి వకాల్తునామామీఁద దస్కతుచెయ్యి. దొరయ్యా! నీవు హియరింగు నాటికి వచ్చేటప్పుడు వకీలుగారికి వకకావిడి వంగవరుగుమ్నా పెండలముమ్నా పట్టుకొని మరీరా.

సీతా—నారయ్యా! మీవూరుదగ్గర అదేకోవూళ్ళో రాగి చెంబులు మహాబాగా చేస్తారట! నీవువచ్చేటప్పుడు మట్టులేని కుంభకోణపు చెంబులవంటివి నాలుగుచేయించి తీసుకొనివస్తూ.

శాపి—మీరు వైష్ణవేష్టి చేసినతరువాత బంధువులయిండ్లలో భోజనము చేస్తూవున్నారా?

సీతా—బంధువులదాకాపోతారు. నాభార్య చక్రాంకితము కాలేదు; దానిచేత భోజనము చేస్తానా? ఎక్కడకువెళ్ళినా నాకు స్వహస్తపాకము కావలెను.

శాపి—అబ్దికములకు స్మార్తులకు పెడుతూవున్నారా? వైష్ణవులకే పెడుతూవున్నారా?

సీతా—మాకు అదివక్కటే లోపముగావున్నది. వైష్ణవులు మనముచేసిన వంటలో భోజనము చేయరు. వారుచాటున వంటచేసి తిని, మిగిలిన అన్నములో మనకుఅంటతప్పేలాలు యివతల పడవేసినా వైష్ణవులకు పెడితేనేకాని మనపితృదేవతలకు గతులుండవు. వైష్ణవుడైనవాడు దినానికివెయ్యితప్పులు చేస్తూనియుండి దిట్టముగా నొసటను నామము ధరించుకొని తులసిపూసల తావళములు వేసికొన్నంతమాత్రముచేత మరణకాలమందు కేవలమూ వైకుంఠమునకు పోతాడు. అటువంటి పరమభాగవతోత్తములైన వైష్ణవులసేవ యెంతో పూర్వజన్మపుణ్యము గలవారికిగాని లభించదు.

శాపి—దొరయ్య కనిపెట్టుకొనివున్నాడు. ముందుగా అతని పని కానిచ్చి పంపివెయ్యండి. నేనుమీతో రహస్యముగా వేరేసంగతి మాట్లాడవలసివున్నది.

సీతా— దొరయ్యా! నీవు వకాల్తు నామామీఁద వ్రాలుచేసినావా? వ్యాజ్యం మనపక్షం కావడముకు వేరేసదుపాయము వున్నది. మునసబుగారికి యీభయముచూపా— ఇప్పుడెందుకులే పదిరోజులలో సాక్షుల పేరస్తుదాఖలు చెయ్యడముకు వస్తావుగనుక అప్పుడు మాట్లాడుదాము. నీవిప్పుడు వెళ్ళిపో. రాగిచెంబులమాట మరచిపోకుమా. దొరికేటట్టయితే స్వాములనిమిత్తం వకవంద విసనకర్రలుకూడా పట్టించుకొనిరా.

దొర— చిత్తము దణ్ణాలండి. చెంవుపుచ్చుకొంటాను. బాపిరాజుగారూ! బసలో వుంటాను యేగిర మొస్తారుకదా?

(అని వెళ్ళుచున్నాఁడు.)

బాపి— ఇందులో మీఫీజులో సఖంగాను రావలెను. అంతకు తక్కువైతే వల్లపడదు. కిందటిసారి యిప్పించిన వ్యాజ్యములో నాకమీషనుపూర్తిగా యిచ్చినారేకాదు. అందుచేతనే యీమధ్య మీవద్దకు నేను కేజులు తీసుకురావడం లేదు.

సీతా— అప్పుడుసొమ్ము అవసరంవుండి వాడుకొన్నాను. ఆనాలుగు రూపాయలూ ఇవిగోపుచ్చుకోండి. (అని చేతిలో వేయుచున్నాఁడు.)

బాపి— ఇందులో ఖర్చులుకూడా యెక్కువ పుచ్చుకొన్నారు. ఆఅరురూపాయలూకూడా యిలాఇవ్వండి. కిందటిసారి బత్తుల వాళ్ళవ్యాజ్యం ఇప్పించినప్పుడు ఖర్చులకిచ్చిన సొమ్ముకూడా వాడుకొని వ్యాజ్యం కోర్టులో దాఖలు చేసినారేకాదు. ఈమాటుకూడా ఆలాగేచేస్తే మాటదక్కదుసుమండీ.

సీతా— ప్రతిదఫానూ ఆలాచేస్తానా? అప్పుడేమో సొమ్ముతో అవసరమొచ్చి వాడుకొన్నాను. అప్పుడైనా ఫిర్యాదు కాకా రాచ్చినానా? వాళ్ళకు తెలిసి ఫిర్యాదు చేస్తామనడంతోటే మాయింట్లోవాళ్ళ

వస్తువు తాకట్టుపెట్టి సొమ్ము తెప్పించి వెంటనే వాళ్ళముఖముమీద పా
వేసినాను.

బాపి—అవును మీరు యెగబెట్టి గానున్నారు. చేతిలో ఖర్చుకు లే
వాడుకొంటే తరువాత యిబ్బందిపడవలసివస్తుంది.

సీతా—అప్పుడు కేజులుయిస్తాం లేవుగనక అట్లా చెయ్యవలసివచ్చి
నది. ఈనైష్ఠనపక్షం అవలంబించి, తరువాత మునసబుగారు నా
తరచుగా కేజులుయిప్పించి సహాయంచేస్తూవున్నారు. ఇప్పుడు నాయ
డందరికీ బహుగౌరవము.

బాపి—ఆఅరురూపాయలు కూడా దయచేస్తారా? హీరింగుకా
ములో యిచ్చేదానిలో మీఫీజుగూడా ఉంచుకొండు మరుగాని.

సీతా—ఇప్పుడు నాలుగురూపాయలు పుచ్చుకోండి. తక్కి
మీదపాయిస్తాను. ఇప్పుడు కోర్టువేళ అయినది. నేను భోజనము
లేదునా? శ్రీశక్తిదేవముకూడా కావలెను.

బాపి—చిత్తము. (ఇద్దరుఅందరూ లేచుచున్నారు.)

ద్వితీయాంకము.

౧ ప్రవేశము—కోర్టుసావడు.

[ప్లీడరుసీతాపతిరావును, నారయ్యయు, సాక్షులును, ప్రవేశిం
చున్నా

సీతా—దొరయ్యా! మునసబుగారు వచ్చేలోగా సాక్షు
కొన్నిసంగతులు బోధించవలసివున్నవి. సాక్షులమతీసుకొని నీవు
చెట్టుక్రిందకురా. మునసబుగారుఅడిగితే నీవు పిరస్నాకు తప
లాడని చెప్పవలెను.

దొర—మేమిద్దరము వకడు తల్లికడుపుట్టినప్పుడు అన్నదమ్ము
లామని యేలాఅనవడి.

సీతా—ఏకెందుకు? సాక్షులను నేను చెప్పినలాగున పలుకనిస్తా. స్టేషనుమెంటులో మేముయిద్దరమూ సోదరులముకామని యింకారు చేసినాము. మనంయిప్పుడు అందుకువ్యతిరేకంగా వాదం చెయ్య గూడదు. వెనుకటి మునసబుగారు ఫష్టుహీయరింగుకోజున, వాదీప్రతివాదీ సోదరులగుదురా కారాఅని మొదటిసారంశము యేర్పర్చారు.

దొర—యిఖయిాసిక్తం. నేను సెప్పవలసింది సెప్పితాను.

సీతా—ఏకేమీాఫర్వాలేదు నీవ్యాజ్యం నీపక్షం చేయించే పూచినాది. సాక్షులు మీావ్రాల్లోవాళ్ళయితే బాగుండును.

దొర—మావూళ్ళోవాళ్ళు లక్షవరాలిచ్చినా, మేమిద్దరమూ అన్నదమ్ములు కామని పలుకరు.

సీతా—చేబియ్యం వీరయ్యా! నీవు మొదటినాక్షివి. యీాలాగా వీరిద్దరూ అన్నదమ్ములు కారని చెప్పాతున్నావుగదా? ఆసంగతి నీకు యేలాగు తెలుసునంటే యేమిచెప్పతావు.

వీర—తక్కిన రెండుమూపాయలూ చేతిలోపడవేస్తేకాని సాక్ష్యంపలుకను. తీరా సాక్ష్యంయిచ్చినతరువాత సొమ్ముయెగగెట్టిన మహానుభావులను యెందర్నో చూచినాను.

సీతా—దొరయ్యా! ఆరెండుమూపాయలూకూడా యిచ్చివెయ్యి—వీరయ్యా! ఇక నేనడిగినమాటకు జవాబుచెప్పు.

వీర—నేను చిన్నప్పటినుంచి వాళ్ళవూరికి మాబంధువులను చూచేనిమిత్తం వెళుతూ వస్తూవుండడంచేత యెరుగుదునంటాను.

సీతా—అలాకాదు. పదిరువత్సరముల క్రిందట వీరన్నతండ్రి పోయినప్పుడు నేను వాళ్ళవూళ్ళోనేవున్నాను. అప్పుడు వీరన్న పక్కడే కర్మచేసినాడు. దొరయ్య ముఖలఃబొట్టుపెట్టుకోలేదు. అందుచేతయెరుగుదునని చెప్పు. ఇదిజ్ఞాపకం వుంచుకుంటావా?

వీర—తెల్లవారిలేస్తే యాభై సాక్ష్యాలిస్తూ వ్యాజ్యాలలో దేవుళ్ళ దేముండాకొడుకును యీ రెండుముక్కలూ జ్ఞాపకం వుంచుకో లేనా?

సీతా—ఓరీ! దూదివెంకయ్యా! నీవు రెండో సాక్షివి. నిన్న తాగడానికి కావలెనంటే నీకూ మ్మనుందర్తిగానే యిప్పించివేసి నానుగదా? నేను బధువుణ్ని అనిచెప్పు. వీరయ్యగారితో చెప్పిన దాన్ని విన్నావుకదా? నీకు యిచ్చుపుయిప్పించిన జరీపాగా బంగారపు మురుగులూ జాగ్రత—అదుగో వాఙ్మూలాలువ్రాసే గుమస్తా. కాళ్ళ రామయ్యగారు వస్తూవున్నారు.

రామ—యీ వేళ మీవ్యాజ్యం సాక్షులవిచారణకు వస్తుంది. మునసబువారి సవారీ వీధిలో వచ్చినారు. రావడంతోనే ముందుగా మీవ్యాజ్యమే యెదట బెడతాను. నేమియిప్పిస్తారోసువండీ! వాఙ్మూలాలు వ్రాయడంలో చాలా సహాయం చేస్తాను.

సీతా—దొరయ్యా! నీవ్యాజ్యం అంతా వారుచేసేసహాయంలోవున్నది. సాక్షులవాఙ్మూలములలో రెండు దిట్టమయిన ముక్కలువేస్తే అప్పీలుకు వెళ్ళినా తీర్పు తిరిగిపోదు.

దొర—యీయన మునుపటి మునసబుగారు కారేమండి? ఆయన యెక్కడకు యెల్లారు?

సీతా—ఆయన సెలవుపుచ్చుకొని శ్రీరంగయాత్రకు వెళ్ళి నారు. ఈయన బందరునుంచి ఆక్టింగుగావచ్చినారు. బహునెమ్మదియినవారు. ఈయనపేరు శ్రీరామమూర్తిగారు.

[మునసబుగారువచ్చి బెంచియెక్కుచున్నారు.]

మున—రామయ్యగారూ! యీవేళ విచారింగువేసిన రెండు నెంబర్లు పయికితీసి ముందుగా నోకదాలనుంచు రెండుకేసుల

ప్లీడర్లనూ పిలిపించి విమర్శపెట్టండి. సారాంశము లియ్యవలసిన కేజులో రికార్డు నాచేతికిచ్చి, దానిలో ప్లీడర్లనుకూడా యిలా రమ్మనండి.

రామ—చిత్తము. యేమోయిబంట్రోతు? మునసబుగారి శెలవయిందని ప్లీడర్లనందరినీ యిలాపిలుచుకోనిరా.

[ప్లీడర్లు అయిదారుగురు వచ్చుచున్నారు.]

రామ—సూర్యనారాయణరావుగారూ! మీసాక్షులు హాజరుగావున్నారా? ఒక్కమాటు మీరిలాగునరండి. (అని స్తంభము చాటునకు తీసికొనిపోయి) యిదీ భూసంబంధమైనవ్యాజ్యం. పార్టీతో చెప్పి యేలాయిప్పిస్తారోనుమండీ. వాఙ్మూలాలు వ్రాయడంలో కావలసినంత సహాయంచేస్తాను.

సూర్య—శే నాపార్టీతో యిదివరకేచెప్పినాను. ఇందులో మునసబుగా రేమయినా రెండోపార్టీవద్దనుంచి పుచ్చుకొన్నారా? ఇంకా బేరం పరిష్కారం కాలేదని విన్నాను. నేనున్నువరదరాజుగారి ద్వారా బేరంపెట్టినాను.

మున—ఏమయ్యా! రామయ్యగారూ! సాక్షులువచ్చినారు ప్రమాణాలుచేయించండి.

రామ—చిత్తం. సీతాపతిరావుగారూ! మీసాక్షులుకూడా వచ్చి హాజరుగావున్నారుగదా?— నేనీకేజులో వాఙ్మూలాలు పుచ్చుకొంటాను. రెండవకేజులో తమరు స్వయంగా వ్రాస్తారుకాదాండి!

మున—అవును. సాక్షివాఙ్మూలములు మేము యీకేజులో స్వయంగా పుచ్చుకొంటాము. మీరు మీకేజుకానియ్యండి. సుబ్బారావుగారూ! లింగరాజుగారూ! మనము మనకేజు చూచుకొందాము రండి.

సూర్య—పుల్లయ్యా! నీవు వాదినిన్నీ ప్రతివాదినిన్నీ యెరుగుదువుగాదా?

సీతా—అబ్బె! అబ్బె! అబ్బె! ఇది లీడింగుక్వశ్చను. రామయ్య గారూ! ఇది అడగనియ్య కూడదు.

రామ—ఈప్రశ్న కేమీ అభ్యంతరం లేదు. అడగనియ్యవచ్చు-

సీతా—కాదుకాదు. కోర్టువారితో మనవిచేసిమరీవ్రాయండి.

మున—ఏమిటయ్యా? యిల్లాగిరిపోయేటట్లుగా కేకలు వేస్తూ వున్నారు?

రామ—మీరు వేరేవాజ్యాలం వ్రాసుకుంటూ వినడంలేదు. సీతాపతిరావుగారు లీడింగుక్వశ్చను—

మున—లీడింగు లేదు గీడింగు లేదు. తీర్పుచెప్పేవారం మేము వున్నాము. అడిగినప్రశ్నలన్నీ వ్రాసుకోండి.

సూర్య—ఏమండోయి రామయ్యగారూ! మీరు రెండోవ్యాజ్యంలో సాక్షి చెప్పినమాట వ్రాస్తూవున్నారు? అది యీసాక్షి చెప్పినమాట కాదు—పుల్లయ్యా! దొరయ్యా వీరన్నా యిద్దరూ అన్నదమ్ములేకదా?

రామ—ఆప్రశ్న మీరడగకూడదు. వారిద్దరూ యేమవుతారని అడగండి.

సీతా—బాగనయ్యా! చూచినావా? గుమాస్తాగారు మనకు యేలా సహాయం చేస్తూవున్నారో.

పుల్ల—వీరన్నా దొరయ్యాను యిద్దరూఅన్నదమ్ములవుతారండీ.

రామ—"వీరన్ననూ దొరయ్యనూ నేనుయెరుగుదును. వారిద్దరూ అన్నదమ్ములవుతారని విన్నాను" ఇంతేకదూ?

సూర్య—"విన్నాన" న్నమాట సాక్షి చెప్పలేదు. మీరామాట తీసివెయ్యవలెను.

రామ—వినకపోతే అతనేమి పుట్టుతూవుండగా దగ్గరనుండి చూచినాడా యేమిటి? అదంతావకటే. సూర్యనారాయణరావు

గారూ! మీరు ప్రతిస్వల్పహంశంలోను యిటువంటి అభ్యంతరాలు చెప్పకండి. కోర్టువారువింటే కోపపడుతారు.

సూర్య—ఇప్పుడు తగాదాపడుతూవున్న పందుంభూమి యెవరి హక్కు.

పుల్ల—పందుంభూమి నాండి? దొరయ్యది—

రామ—"తగాదాభూమి పందుమున్నా దొరయ్యదికాదు. వీరన్న హక్కు" అంతేనా నీయభిప్రాయము?— సీతాపతిరావు గారూ! మీరు క్రాసుయెగ్జామినేషన్ చేస్తారేమో చెయ్యండి.

సీతా—నీవుయెప్పుడయినా దొంగతనము చేసినావా? మరి యేమయినా—

సూర్య—ఇదివూరకే సాక్షిని అవమానపర్చడానికి అడుగుతూ వున్నారు. పబ్లీకునిదర్శనంలేనిదీయిటువంటిప్రశ్న అడగనియ్యకూడదు.

సీతా—పోనియ్యండి—పుల్లయ్యా! నిన్నీలాగు తప్పుసాక్ష్యం చెప్పుమనినీప్లీడరుగారు చెప్పినారుకదా?

సూర్య—పైకిబిళ్ళగోచీ పంగనామాలూ పెట్టుకొని పార్టీల సొమ్ము హరిస్తూ నీకుమల్లే నేను డబ్బుపుచ్చుకొని పార్టీలో తిరిగి పోతా ననుకొన్నావా?

సీతా—నీమర్యాదా నామర్యాద అందరికీ తెలుసును. నీలాగు నేనేమీ బోగందాన్ని వుంచుకో లేదు!

సూర్య—బోగంవాని పేరెత్తబోకు. ఇంకా యేమయినా నన్నంటే పడతాను గాని ఆడవాళ్ళసంగతిత్తేస్తే బాగాజరగదు. నీకుమల్లే నేనేమి గోడలు దూకడంలేదు.

మున—ఏమయ్యా! మీరిద్దరూ అలాపోట్లాడుతూ వున్నారు. కోర్టువారికి కోపంవస్తే కంటెంప్టు ఆఫ్ కోర్టుకిందపెట్టి శిక్షించి పోతారు సుమండీ. మెల్లిగామాట్లాడండి.

రామ—సీతాపతిరావుగారూ! ఇక మీ సాక్షినిపిలవండి.

సీతా—కోర్టువారు చిత్తగించవలెను. మా సాక్షి బహు ఘరానామనిషి. కూర్చో వడముకు సెలవిప్పించవలెను.

సూర్య-వీడు యే పెంటమీదపడితే ఆ పెంటమీద తిరుగుతూ, జూదాలపాకలకాడ తాగిపడివుంటాడండి. బట్టలు పడిదెకు తెచ్చుకొని ముఱుగులెక్కడివో యెరువు తెచ్చుకొని పెట్టుకొన్నాడు. వీణ్ని కూర్చో పెట్టకూడదు.

వెంక—మీరు కల్లుపాక కాడికి రాత్రిళ్ళు త్రాగడానికి వచ్చినప్పుడు, మమ్మల్ని మీరక్కడ చూచి—

సూర్య—ఛీఛీ. నోరుముయ్యి. నేను కోర్టువారితో మనవి చేస్తూవుంటే, మధ్య నీవుమాట్లాడుతావు! కోర్టువారుచిత్తగించినారా? సాక్షి యీలాగు మిగలమాటలు రానిస్తున్నాడో?

మున. సాక్షినికూర్చో పెట్టివాఙ్మూలముపుచ్చుకోండి. రామయ్యగారూ! ఇక యిలాగంటివేమీ కోర్టువారి నోటీసులోకి రానివ్వకండి.

సీతా—మీరు దొరయ్యను వీరన్నను యెఱుగుదువా? పొరపడి అన్నాను. యెఱుగుదురా?

వెంక—యెఱుగుదును. వాళ్ళిద్దరూ అన్నదమ్ములుకారు. దొరయ్య తండ్రిపోయి నప్పుడు వీరన్న మయిలబొట్టు పెట్టుకోలేదు—ప్లీడరుగారూ! మరచిపోయినాను— అతని తండ్రిపోయి యెన్నాళ్లయినదండీ?

సీతా—పదిసంవత్సరములక్రింద వీరన్నతండ్రి పోయినప్పుడు దొరయ్యమైలబొట్టు పెట్టుకోలేదు. కర్మ వీరన్న వక్కడుమాత్రమే చేసినాడు—రామయ్యగారూ! వ్రాయండి.

సూర్య—సాక్షి చెప్పేదిఒకటీ ప్లీడరుగారుచెప్పేది వకటీనా? రామయ్యగారూ! మీరు సాక్షి చెప్పినట్టు వ్రాయండి.

రామ—సాక్షి ఆయన చెప్పినట్టే చెప్పినాడు. నాకు యేమీ భేదం కనిపించ లేదు. కావలిస్తే మళ్ళీ చెప్పమందాము.

సీతా—నీవు—ఓస్! నీవనివస్తోవస్తుంది. మీకుతవ్వల పీరన్నకు ముఖ్యస్నేహితులు కారా?

రామ—అదిఇర్రిలివెంటు ప్రశ్న. మఱివకప్రశ్న వెయ్యండి. నేనీ పశ్న వ్రాయను.

సీతా—కోర్టువారు యీసంగతి నోటుచెయ్యవలెను. నేనీ ప్రశ్న అడిగితే గుమాస్తాగారు వల్లపడదంటారు.

మున—స్థలవ్యాజ్యముకు బంధువులయితే నేమి కాకపోతే నేమి? మీవ్యాజ్యముకు సంబంధించిన ప్రశ్నఅడగండి.

సీతా—మావ్యాజ్యానికంతా ఇదే ముఖ్యమైన ప్రశ్న. అడగ నియ్యకపోతే కోర్టువారు రికార్డులో నోటు చెయ్యవలెను. కోర్టువారీలాగున ముఖ్యమైన ప్రశ్న అడగనియ్యకపోతే ఇక నేనీసాక్షిని విమర్శే చేయించుకోను.

రామ—సూర్యనారాయణరావు పంతులుగారూ! మీరు క్రాసు నవాళ్ళు వేస్తారా?

సూర్య—వెంకయ్యా! నీవు దొంగసాక్ష్యమిచ్చినందుకు సబు మేజస్ట్రీటుగారు నెల్లాళ్లు వరకం వేసినారా? లేదా?

వెంక—నాకొక్కడికే నేమి? మహామహావాళ్ళకు వేసినారు. కాలంవస్తే యెవరికితప్పతుంది? వెనుకటి మునుసబుగారు మీకు జ్ఞాపకమా? వెయ్యలేదా?

సూర్య—అదుగో! అదుగో! ప్రతివాదితాలూకు మొదటిసాక్షి చేబియ్యం వీరయ్య యీసాక్షి చెప్పేది వింటూవున్నాడు. కోర్టువారు అవతలికి పంపించవలెను.

మున—ఇవాళ ఒక కేజూ మర్త్రైనదికాదు. మీ కేజు రేపు క్లోజుచేస్తాము. యీపాటిచాలించండి. [అని లేచుచున్నారు.]

---

౨ ప్రదేశము—కోర్టుహాలు.

---

[మరికొందరుప్లీడర్లు కూర్చుండియుండగా సీతాపతిరావుగారు పార్టీలు మొదలయినవారితో ప్రవేశించుచున్నారు]

సీతా— సోమయాజులు గారూ! మీరింత కాలమునుంచి ప్లీడరీ చేస్తూవున్నారుగదా? యింతలంచాలుపుచ్చుకునే మునసబును మీ రెక్కడయినా చూచినారా?

సోమ—యిదేమిలంచము? ఆజిల్లాలో జగన్నాథ-పంతులు గారున్నారు. ఆయన ఫస్టుమునసబీలో నాలుగులక్షలరూపాయలు సంపాదించి, పశువులు కడుగుతాగడానికికూడా వెండిగోలెములు చేయించినారు. వారింట్లో మొన్నపెండ్లిలో పార్టీలవల్ల నూర్రైవేల రూపాయల కట్నాలువచ్చినవి.

సీతా—ఆజిల్లాలో యేలావున్నదో కాని యిక్కడప్రజలు బహు క్షోభపడుతూ వున్నారు. మొన్న కొత్తూరువారి న్యాయమయిన వ్యాజ్యంలో లంచంయివ్వడానికి సొమ్ములేకపోతే మాన్యంఅమ్మించి నాలుగువందలరూపాయలు పుచ్చుకొన్నాడు. నాలుగురోజులక్రిందట శాపన్నకేజులో సాక్షులను కమ్మిట్టుచేస్తానని కోర్టులోపెట్టి బెదిరించి రెండువందలరూపాయలు పుచ్చుకొనివదిలిపెట్టినాడు. ఈవ్యవహారం చూస్తే పచ్చిఘోరకలిగావున్నది.

సోమ—వాటికన్నిటికీ యేమిగాని మీవ్యాజ్యం ఖరాయిషు యేమయినది?

సీతా—వరదరాజుగారి ద్వారా వాది వీరన్నదగ్గిర నూట యాభై రూపాయలు పుచ్చుకొని అన్యాయంగా భూమి ప్రతిపక్షం చెయ్యడానికి సిద్ధమయినాడు. ఇప్పుడు కోర్టుకు రావడంతోనే తీర్పు చెబుతాడు. మేముకూడా నూరు రూపాయలవరకూ యిస్తామని బేరం పెట్టినాము. అసలుభూమే రెండువందల రూపాయలకంటె యెక్కువ చెయ్యదు.

సోమ—మొన్న నేను ప్లీడరుగావున్న బత్తులవారి వ్యాజ్యంలో ఉభయపార్టీలదగ్గరనుంచీ సొమ్ము పుచ్చుకొని సగంభూమికి మాత్రమే తీర్పుయిచ్చి తక్కినసగమునకు దావాకొట్టివేసినాడు. ఇంకానయం మీవ్యాజ్యంలో ఇద్దరిదగ్గరా పుచ్చుకోలేదు.

సీతా—సాక్షికరూపాయలిస్తే ఖర్చులు లేకుండాచేస్తామని మాకు రాయబారం పెట్టినారు. సగంభూమిపోగా యాభై రూపాయల ఖర్చులదగ్గరనా? ఇవ్వనప్పుడు సాక్ష్యంలో నేనే చెప్పి రాప్పించినాను.

సోమ—అదుగో మునసబుగారి సవారీ వస్తూవున్నది. సిద్ధముగా వుండండి.

[మునసబుగారు ప్రవేశించుచున్నారు.]

మున—ఏమయ్యా! సీతాపతిరావుగారూ! మీ మొదటి సాక్షిని విమర్శ చెయ్యడం జరూరా? అతనివల్ల యేసంగతి రుజువుపరుస్తారు?

సీతా—అతనిసాక్ష్యం ముఖ్యంగా కావలెనండి. అతనివల్ల వాదిన్నీ ప్రతివాదిన్నీ వక్కతండ్రి బిడ్డలు కారనిన్నీ పృథగ్భాండాశనము చేస్తూ వేరేవేరే వున్నారనిన్నీ రుజువవుతుంది.

మున—ఇంతేనా? మరేమైనావున్నదా? మేమూ సాక్ష్యం [illegible]ము [illegible] ప్లీడరు [illegible] నికియిస్తే [illegible] సాక్ష్యా-
నికి భాగంయివ్వ[illegible]డా [illegible]?

సీతా—చిత్తము. ఇది కేవలము అక్రమమయిన వ్యాజ్యం. కోర్టువారు బాగాపరిశీలించి న్యాయం దయచేయించవలెను.

మున—రెండువందల రూపాయలు జీతం పుచ్చుకుంటూ మేము కోర్టుమీద కూర్చోవడం న్యాయం దయచేయడానికేగా మరియెందుకైనానా? మీరనేమాటలునుచూస్తే కోర్టువారన్యాయంచేస్తారనేటట్టు భావం తెలుతూవున్నది. కంటెంప్టు ఆఫ్‌కోర్టుకింద శిక్షిస్తాము సుమండీ.

సీతా—నేనుఅలాఅనలేదండి. న్యాయందయచేయించమన్నాను.

మున—అదుగో మళ్ళీ అమాటేఅంటారు? రామయ్యగారూ! ఈయనవద్ద కయిఫియ్యతు పుచ్చుకోండి.

సీతా—చిత్తము. కోర్టువారుఅగ్రహంమాని క్షమించవలెను.

మున—క్షమించడంలేదు క్షమించడంలేదు— వ్రాయవయ్యా. డిస్ట్రిక్టుకోర్టువారికి ఈప్లీడరునుబరతరఫుచెయ్యడానికి అర్జీవ్రాయండి.

సీతా—చిత్తము. చిత్తము.—

సోమ—ఊరుకోవయ్యా. కోర్టువారికి కోపంవస్తూవుంటే మళ్ళీ మాటాడుతారు.

మున—సోమయాజులుగారూ! మీరు నేనుచెప్పమన్నానని పేష్కారుమాస్తాతో చెప్పి జప్తువారంటు వ్రాయించి తెచ్చుకోండి. కంప్లయింటు తయారైన మీదట నిన్నటితారీఖు పెట్టి ఫయిలు వేయింతాము. దాఖలు కాగితాలబుక్కులో స్థలంవదిలిపెట్టుకొని నాలుగోగుమాస్తాతో చెప్పండి.

సోమ—చిత్తము. ముందుగా వారంటుపుచ్చుకొని ఆస్తిజప్తు చేస్తే తరువాత కంప్లయింటు మెల్లగా ఆలోచించివ్రాయవచ్చును.

మున—అలాకాదయ్యా! ఇక్కడంతా ఫితూరీకోరులువున్నారు. కంప్లయింటుకూడా నిన్నటితారీఖు పెట్టి రేపుకోర్టువేళకు సిద్ధము

చేయించండి.—సూర్యనారాయణ రావుగారూ! నిస్సంకోచముగా నేనుగూడ
హియరింగు చేయండి.

సూర్య—కోర్టువారికి విశదమయివున్న దానికంటె నేను హియరింగులో చెప్పేది యేమున్నదండి? ఐనా హియరింగు చెయ్యడం ఆచారంగనుక రెండుముక్కలు చెపుతాను. (హియరింగు)

"మావాదం పురాణాసాక్షులవల్ల పూరాగారుజువయినది. వాదివీరన్న బహుపెద్దమనిషి. కోటివరహాలిచ్చినా యెప్పుడూఅబద్ధం ఆడేవాడుకాడు. యీ వెధవ పందుంభూమికోసం అబద్ధపువ్యాజ్యం వేస్తాడాండి? అతనిమొఖం వక్కసారిచి త్తగిస్తే కోర్టువారే వ్యాజ్యం అతనిపక్షంచేస్తారు. ప్రతివాది వాదిహక్కు హరించవలెనని చూస్తూవున్నాడు. అతని ముఖంచూస్తేనే అతనివాదం అక్రమమయినట్టు కోర్టువారికి విశదమవుతుంది. అతనిసాక్షులందరూ ఫోర్జరీకోరులు; డబ్బుపుచ్చుకొని కూటసాక్ష్యం చెప్పినారుగాని వారి మాటలలో వాస్తవం యెంతమాత్రమూ లేదు. ప్రతివాదియిచ్చిన స్టేటుమెంటుకున్నూ సాక్షులు చెప్పిన సాక్ష్యముకున్నూ చాలాభేదంగావున్నది. ఈప్లీడరుగారుకూడా యిటువంటి అక్రమపుదావాలలో దిగేవారే. కాబట్టి పయిని చెప్పిన హేతువులన్నీ చిత్తగించి కోర్టువారు వాది పక్షంగా తీర్పు చెప్పవలెనని ప్రార్థిస్తున్నాను."

మున—ఏమయ్యా! వాదిప్లీడరుగారు చెప్పినదానికి వప్పుకుంటారా? లేక యేమైనా మీరుకూడా హియరింగుచేస్తారా? ప్రతివాది తరపున మీరుచేసేవాదం యేమున్నది? వూరుకోరాదా?

సీతా—నాహియరింగుచిత్తగిస్తే యావత్తునిజంకోర్టువారికివిశద—

మున—కోర్టువారికి యిదివరకే విశదమయివున్నది.

సీతా—(తనలో) వాదిదగ్గిర మాటయూ ఖైరూపాయలూ పుచ్చుకొన్నప్పుడే విశదమయినది. (పయికి) అయినా నాహియరింగు

చిత్తగించవలెను. నాహీరింగు సాంతముగా విన్నమీదట కోర్టువారి కేమితోచునో!

మున—తోచవలసిన దేమిటో యిదివరకే తోచినది. వృధా కాలయాపనం. అయినా కానియ్యండి.

సీతా—కోర్టువారు వుత్తరం వ్రాయడం మానివేసి శ్రద్ధగా వినవలెను. (హీరింగు) "వాదిన్నీ ప్రతివాదిన్నీ పక్కతండ్రిబిడ్డలు కారు. పినతండ్రి పెత్తండ్రిబిడ్డలు. వారితండ్రులే పంచుకొని విభాగాలైనారు. అంతేకాకుండా యీభూమి దొరయ్య స్వార్జితము; ఆ భూమికొన్న యిరవై సంవత్సరములనుంచీ ప్రతివాది భుక్తంలోనే వుంటూవున్నది. ఆరంగతి సాక్ష్యంవల్ల పూర్తిగా ఋజువైనది. వాదికి దానిలో హక్కు కలిగివుంటే చాలాకాలంకిందటనే వ్యాజ్యం తీసుకొని రావలసివున్నది. కాలనిబంధన చట్టప్రకారం పన్నెండేళ్ళలోగా వ్యాజ్యం తెచ్చుకోలేదు గనుక దీనికి కాలదోషం పట్టింది. అంతేకాకుండా వాది కింప్లయింటులో యీభూమి పెద్దలు సంపాదించిన దంటాడు. సాక్షి చెప్పటంలో ప్రతివాది కొన్నాడని—

ముం—ఏమిహీరింగు! ఎంతసేపుచెప్పినా పక్కముక్క అయినా వ్యాజ్యానికి సంబంధించినది చెప్పడంలేదు. ఈపాటి చాలించండి.

సీతా—ఇంకా ముఖ్యమయిన రెండుమూడంశములున్నవి—

మున—కోర్టువారికి విశేషతొందరయిస్తే జరుమానా వేస్తారు. (పెట్టెలో చెయ్యిపెట్టి వెదకును) రామయ్యగారూ! వుదయమున యీవ్యాజ్యంలో వ్రాసిన తీర్పు మీరు చూస్తూవుండగా నేకాదా యీ పెట్టెలో పెట్టినాను. కనబడలేదేమండీ?

రామ—వరదరాజుగారిదస్తూ తోవున్న చిత్తునుచూచి సాపు వ్రాయడంలో మీరొకవేళ పెట్టెలో వేయడం మరిచిపోయినారేమో ?

మున—లేదు లేదు. చిత్తు కాగితము చింపి వేసి తరువాత సాపు తీర్పు జాగ్రతగా యీ పెట్టెలో పెట్టినాను. ఇదుగో దొరికినది. మరి వక కాగితపు మడతలో దూరినది — సీతాపతిరావుగారూ! ఖర్చుల విషయమై మీ రేమీ యింకా ఆలోచించుకోలేదుగదా?

సీతా—చిత్తము. పార్టీతో చెప్పినాను. అతను వప్పకుండా వున్నాడు.

మున—అందుకోసమే చెప్పినాము. అప్పైని మీ యిష్టము. తీర్పు యిస్తాము వినండి. (అని చదువుచున్నాడు.)

"వాదిదాఖలు చేసిన కంప్లయింటున్నూ ప్రతివాది తాలూకు స్టేటుమెంటున్నూ ఉభయవాదులూ దాఖలుచేసిన దస్తావేజులున్నూ సాక్షివాఙ్మూలములున్నూ హియరింగు కాలమందు ఉభయప్లీడర్లూ చెప్పిన సంగతులున్నూ చిత్తగించడమయినది. ప్రతివాది తరపున వచ్చిన సాక్ష్యంలో వ్వరి తమాత్రమూ విశ్వసింపజాలదు. సాక్ష్య మిచ్చేటప్పుడు ఆసాక్షులనైఖరి చూడగా వాళ్ళు కూటసాక్షులయి నట్లు స్పష్టమయినది. అంతే కాకుండా కేవలం సాక్ష్యము నేనమ్మి తీర్పు చెప్పేపక్షమున పార్టీలకు అన్యాయం జరుగుతుంది. ఇక్కోటీకూడా ఆలోచించవలెను. వాద కంప్లయింటులో వ్రాసుకొన్న దానికంటే సాక్షి విరుద్ధంగా చెప్పినా, సాక్షి మోస్తరు చూస్తే అబద్ధంచెప్పేవాడు గా తోచలేదు. నేర్చుకొనివచ్చిన సాక్ష్యం అయితే తేడాలు లేకుండా వుంటవిగాని నిజమయినదానిలో వుండడం తటస్థించదు. వాదియాభై యేళ్ళు చెల్లినవాడు. ఇంతవయస్సు చెల్లినతరువాత అన్నగారి విషయంలో అన్యాయానికివడిగడుతాడని వూహించడానికి అవకాశం లేదు. కాబట్టి పయి బలము యివ హేతువులనుబట్టి వాది దావా ప్రకారం పసుంభూమిన్ని ప్రతివాది స్వాధీనంతప్పించి వాది అధీనం

ఆధీనం చెయ్యడమునకు తీర్పుచెయ్యడమైనది. ఖర్చులు''—ఇక మీరు వెళ్ళిపోవచ్చును.

సూర్య—ఖర్చులునూట తీర్పులో వ్రాయించినారు కారు.

మున—ఈరోజున యింటికాడ ఆలోచించి మీకిప్పించడం న్యాయమనితోస్తే మీపక్షంగాను, న్యాయం కాదనితోస్తే ప్రతివాది పక్షంగాను, రేపు కోర్టులో వ్రాసుకొనివచ్చి చెపుతాము—సీతాపతి రావుగారూ! నేనిందాకా చెప్పినసంగతి ఆలోచించుకోండి.

సీతా—చిత్తము. రేపువుదయాన్న యేసంగతీ బసలో మనవి చేస్తాను.

[అందరు వెళ్ళుచున్నారు.]

---

## తృతీయాంకము.

### ౧. ప్రదేశము—డిస్ట్రిక్టుకోర్టు ప్లీడరుగారి యిల్లు.

[తనపార్టీ దొరయ్యను వెంటబెట్టుకొని సీతాపతిరావుగారు ప్రవేశించుచున్నారు.]

సీతా—భాస్కరరావుగారూ! చలపతిరావుగారు వున్నారా? ఆయనకు వకఅప్పీలు కేజులో వకాల్తునామా యిప్పించడానికి పార్టీని తీసుకుని వచ్చినాను.

భాస్క—ఇప్పుడేవస్తారు కూర్చోండి. వకకేజులో నకళ్ళుదర ఖాస్తుచేస్తే, రికార్డుకీపరుగారు యెదటిపార్టీతరపున పదిరూపాయలు పుచ్చుకొని రికార్డులో దస్తావేజు లేదంటూవున్నారు. అది జరూరుగా కావలసివచ్చినది. మరి పదిరూపాయలు పారవేసిఅయినా ఆదస్తావేజ తీసుకురావలెనని చలపతిరావుగారు వారియింటికి వెళ్ళినారు.

సీతా—యీకోర్టు రికార్డుకీపరుగారిసంగతి బొత్తిగా అన్యాయంగా వున్నది. రూపాయినా చేతిలోఁ బడితేనేగాని కాగితం వూడి పడదు.

భాస్క—ఆయన తమలపాకులకట్ట కాడనుంచి లంచము పుచ్చుకుంటాడు. యెంతబీదవానినైనా పీడించి తుదకు రెండుడబ్బులైనా పుచ్చుకొని మరీ కాగితం బైటపెడుతాడుగాని వూరికే పెట్టడు. ఇంత యెందుకు? కోర్టులో తనతో సరిగా వుద్యోగం చేసేవాళ్లవద్దనూ బంధువులవద్దనూకూడా పనివచ్చినప్పుడు సొమ్ముపుచ్చుకోనిదీ పని చెయ్యడు. జమీన్ దారీవ్యాజ్యాలలో వందా రెండువందలూ పుచ్చుకొని దస్తావేజులు చింపివేస్తాడు. మొన్న నేను వక కేజులో యాభయిరూపాయలిచ్చి ముఖ్యమయినదస్తావేజు చింపివేయించినాను. అందుచేత మాపార్టీకి పదివేలరూపాయలు లాభం వచ్చినది. యెంతలేదన్నా రోజుకు పదిరూపాయలు కళ్ళచూడనిదీ ఆయన లేవడు. లంచం పుచ్చుకొని కటికముండావాఁడు వుండడంకన్న సొమ్ముపుచ్చుకొన్నా యీలాగు పనిచేసేవాఁడు వుండడం లాభమే కాని వొకొక్కప్పుడు నష్టం కూడా కలుగుతుంది.

సీతా—యీరొక్కపర్యాయం శ్రమపుచ్చుకొని వెళ్ళి నేనువచ్చినానని చెప్పి చలపతిరావుగారిని పిలుచుకునివస్తారా? మేమువచ్చి చాలాసేపయినది.

భాస్క—మీరిక్కడ కూర్చోండి. నేనువెళ్ళి యిప్పుడే తీసుకుని వస్తాను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

సీతా—దొరయ్యా! యీయన ప్లీడరుగారిగుమాస్తా. అతి వాగుతాడు. వకమాట అడిగితే పదిమాటలు జవాబు చెప్తాడు.

దొర—యీప్లీడరుగారికి యింగిలీసువచ్చునాండి?

సీతా—ఇంగ్లీషురాకపోతేనేమి? పనిమహాబాగా చేస్తారు. జమీందారీకేజులు చాలామట్టుకు యీయనకేవచ్చినవి. నీకెందుకు నీవ్యాజ్యంలో పనిఅంతా నేనుచేస్తానుకాదా?

దొర—మునసబు ఖర్చులైనా మనపక్షం చేసినారుకాదయ్యా! అడిగినసొమ్ము—

సీతా—తాళు యెవరో వస్తూవున్నారు.

[చలపతిరావుగారు గుమాస్తాతోకలిసి ప్రవేశించుచున్నారు.]

భాస్క—నేను వెళుతూవుండగా పంతులవారు దోవలోనే యెదురుపడ్డారు. మీరువచ్చి కనిపెట్టుకొని వున్నారని చెప్పి శీఘ్రంగా తీసుకునివచ్చినాను.

చల—(కూర్చుండి) సీతాపతిరావుగారూ! తమరు విజయంచేసి యెంతసేపయినది? కొంచెం మాట్లాడవలసిన పనివుండగా రికార్డు కీపరుగారియింటికి వెళ్ళి కార్యం బందోబస్తుచేసి వచ్చినాను

సీతా—ఇతనితమ్ముడు యితనిమీద యీ మునసబుకోర్టులో వ్యాజ్యం వేసినాడు. మునసబు లంచంపుచ్చుకొని అక్రమంగా వాది పక్షం తీర్పుచేసినాడు. యీ తేదీతో అప్పీలువాయిదా వెళ్ళిపోతుంది. మీరింటిలో వకాల్తునామా పుచ్చుకొని అప్పీలు దాఖలు చెయ్యవలెను. ఫీజుసంగతి నేను సామాన్యప్రసంగించి పరిష్కారముచేస్తాను.

చల—భాస్కరం! వకాల్తు నామా వ్రాయుమయ్యా.

సీతా—అక్కరలేదు నేనువ్రాయించితెచ్చినాను. దీనిమీద అంగీకరించినట్టువ్రాసి అప్పీలుము వాయిదా తయారుచేయుండి.

చల—భాస్కరం! ముందుగా సామాన్యసంగతులు వ్రాయమయ్యా. తరువాత అప్పీలుహేతువులు చెప్తాను.

సీతా—కిరాడ్డవక్కసొంచి తగిస్తారా? ఇది స్వసంబ ధర్మం. వ్యాజ్యం. పంచుంభూమిరావలెనని యితనిమీద తమ్ముడు వ్యాజ్యం వేసినాడు.

చల—రికార్డు వేరేనాడనక్కర లేదు. ఇదివరకు లక్షవ్యాజ్యాలలో పనిచేసినాను. రికార్డుచూడకుండా అప్పీలు హేతువులు వ్రాయలేనా?

సీతా—పోనీ జడ్జిమెంటైనా వక్కసారి చదువుతాను వినండి.

చల—అదీ అక్కర లేదు. సంగతులు మీరు చెప్పినారు చాలదా? వెనక హియరింగు చేసేటప్పుడు చూస్తాను. జడ్జిమెంటైనా చూడకుండా మొన్న వక కేజులో హియరింగు చేసినాను. వ్యాజ్యం నిముషములో నా పక్షమయినది.

సీతా—అందులో మీరు రేస్పాండెంటు తరపున వకాల్తునామా పుచ్చుకొన్నారా?

చల—అవును.—భాస్కరా! అప్పీలు హేతువులు చెపుతాను వ్రాయి. ౧ కిందికోర్టుతీర్పు కేవలం ప్రమాణాలమీద మొకద్దమా ఐవున్నది. ౨. కిందికోర్టులాగన్న క్విటీకన్ని విరుద్ధముగా వున్నది. ౩. వాదితరపున సాక్ష్యం యెంతమాత్రమూ రుజువు కాలేదు. ౪. నాతరపున ఘరానా సాక్షులవల్ల పూర్తిగా రుజువైనది. ౫. యీ వ్యాజ్యములో మునసబుగారు కేవలం పొరబడ్డారు. కాంబట్టి యీపయి హేతువులను చిత్తగించి కిందికోర్టుతీర్పు తిప్పివేసి వ్యాజ్యంఖర్చులతో అప్పీలెంటుపక్షం చేయించవలెనని ప్రార్థిస్తూవున్నాను.

సీతా—అప్పీలు మునాయిదా ఐనదిగనక ఇక మేము సెలవు పుచ్చుకొందుమా?

చల—ఇకమీరు వెళ్ళవచ్చును. హియరింగులో మీమనసు వచ్చినపని చేస్తాను.

దొర—(రహస్యముగా) సీతాపతిరావుగారూ! యీ ప్లీడరుగారు మహాఘట్టివారులాగు వున్నారు. వక్క కాగితమయినా చూడకుండా సిటికలో అప్పీలు తయారు చేసినారు.

సీతా—ఈయన బహుఘట్టివారు. ఇంగ్లీషుప్లీడర్లవడమే కాని వారుయింటికి వెళితే తిన్నగా మాటాడకేమాటాడరు. పనివరా వారి కంటే వీరేబాగా పనిచేస్తారు. యెటువచ్చీ వారు ఇంగ్లీషునవాలుగు ముక్కలు వాగుతారు. అయినాగానీ జడ్జీ వారిమాటలు వినడం వున్నదా? హీరింగుచేసినంతసేపూ చాతాతో గోళ్ళుతీసుకొంటూ కూర్చుండి చివరకు కిందికోర్టుతీర్పు ఖాయం చేసినామంటాడు.

చల—సీతాపతిరావుగారూ! మీతో వకసంగతి చెప్పడంమరిచి పోయాను. శిరస్తాదారుగారికి యింకుగోయేమయినా పదిరూపా యలసొమ్ము యిస్తేనే కాని మనకార్యం కాదు.

సీతా—అలాగేజాగ్రత పెట్టిస్తాను. మధ్యాహ్నం కోర్టువద్ద మాటాడుతాను. సెలవుపుచ్చుకొందునా?

(అని వెళ్ళుచున్నారు.)

౨. ప్రవేశము—డిస్ట్రిక్టుకోర్టు.

—:o:—

[వీరన్నయు అతనిప్లీడరు కామరాజుగారును ప్రవేశించుచున్నారు]

కామ—వీరన్నా! నీవ్యాజ్యం జడ్జీగారు రావడంతోనే నీ పక్షంచేస్తాను. సందేహములేదు. శిరస్తాదారుగారికి యిస్తామనివప్పు కున్న రూపాయలలో యిదివరకు యిచ్చిన యాభైరూపాయలూ పట్టుకునివచ్చినావా? దొరగారివద్దకు కాగ్డుచదివేగుమాస్తాకువప్పుకున్న పదిరూపాయలూ నీవుయిచ్చిన సొమ్ములోనుండి యిచ్చివేసినాను.

వీర—నేనంతసొమ్మిచ్చుకోలేనండి పాతికరూపాయలు దాఖలు చేసుకొన్నాను.

కామ—పెద్దమనుష్యులకు మాటయిచ్చినతరువాత మరివక లాగు చెయ్యడం క్రమంకాదు. వెధవసాయ్ము నీవు పాతికరూపాయల కోసం వెనుకతీస్తే, నిష్కారణంగా నీవ్యాజ్యం పాడవుతుంది. ముందుకూడా మనకు ఆయనవల్ల కావలసినకార్యం చాలావున్నది.

వీర—తమసిత్తం. ఇదుగోరూపాయలు.(అచ్చిుయిచ్చుచున్నాడు)

కామ—మీయన్న యిల్లేమో కాలిపోయిందనివిని మీవూరు వెళ్ళిపోయినాడని అతని ప్లీడరు చలపతిరావుగారు చెప్పినారు నిజమేనా?

వీర—మావూరినుంచి మనిషివచ్చినాడు. ఇల్లు కాలిపోయిన మాట నిజమే.

కామ—అదుగో దొరగారు వస్తూవున్నారు. ముందుగా మన వ్యాజ్యమే వస్తుంది. గుమ్మములో నిలుచుండి సలాంచెయ్యి.

[జడ్జీగారు ప్రవేశించి, బెంచిమీద కూర్చున్నారు.]

దఫేదారు—మాటాడకండి. దొరగారు జల్మానాయేస్తారు. యెవరోయిబంట్రోతు పంఖాలాగు.

[కోర్టుగుమాస్తా ఆనందరావు కొన్ని రికార్డులుపట్టుకొని] ప్రవేశించుచున్నాడు.]

ఆనంద—బంట్రోత్. చలపతిరావుగారినీ, కామరాజుగారినీ పిలువు. రా—డిస్ట్రిక్టు మునసబుకోర్టుఫయిలు అసలు నెం 76౽౭రు, యీ కోర్టుఫయిలు అప్పీలు నెం 32౭౬రు ప్రతివాది అప్పీలెంటు తిప్పల దొరయ్యతరపు ప్లీడరు చలపతిరావుగారు, వాది రెస్పాం డెంటు తరపు ప్లీడరు. కామరాజుగారు—హాజరువున్నారా?

కామ—చిత్తము. హాజరువున్నాము.

చల—(దగ్గరనున్న మరియొక ప్లీడరునుజూచి) నాయుడు గారూ! కామరాజుగారు దొరగారితో యింగ్లీషున చెపుతూవున్నది యీ కేజునుగురించేనా?

రాయు—అవును. మీ కేజులోనే హీరింగు చేస్తూవున్నారు.

చల—కోర్టువారితో నాది వొక్క మనవివున్నదండి. యీ కేజులో కామరాజుగారు చెప్పుతూవున్నది కేవలం అబద్ధమండి. కోర్టువారిని పోరబెడుతూ—

ఆనంద—ఊరుకోవయ్యా. మొదటిప్లీడరు హీరింగు చేస్తూవుంటే మధ్య మాట్లాడుతావు! దొరగారికి తెలుగు తెలియదు వూరుకోండి.

చల—యీ వ్యాజ్యం వట్టి దొంగవ్యాజ్యమండి. కేవలం విరోధంచేత వచ్చినది. కిందికోర్టులో మునసబుగారు బహు అన్యాయం చేసినారు. యేలినవారు న్యాయం—

ఆనంద—ఈపాటి హీరింగుచాలించి వూరుకోండి. దొరగారు తీర్పు వినిపించబోతూన్నారు.

చల—దొరగారేమిటో ఇంగ్లీషున సెలవిస్తూవున్నారు

ఆనంద—కిందకోర్టువారితీర్పునుతిప్పి వేయుడానికియేమీసబబులు కనుపడడం లేదు గనుక కిందికోర్టుతీర్పు ఖాయంచేసి ఉభయకోర్టుల లోనూ ఉభయువాదులకూ అయినఖర్చులు అప్పిల్లెంటు యిచ్చేలాగ కలందులకు తీర్పు చేసినామని సెలవిస్తూవున్నారు.

కామ—(వెలపలకువచ్చి చెట్టుకింద నెవరితోనో మాటాడు చున్న వీరన్ననుజూచి) వీరన్నా! దొరగారు వ్యాజ్యం మనపక్షం చేసినారు. నిర్ణయించుకొన్నఫీజు యిదివరకే యిచ్చివేసినావుగదా? యిక నాబహుమతి రావలెను. ఆమనిషి యెవరు? యేమి? వ్యాజ్యం గెలిచినదన్న సంతోషం లేకుండా అలాగు విచారంగా కనపడుతూ వున్నావు?

వీర—నిన్నరాత్రి మాయింట్లో దొంగలుపడి, వేరే మొగ దిక్కు లేకపోవడంచేత సర్వస్వాపహారం దోచుకొనిపోయినారని

వర్తమానం తెచ్చినాడు. నాకేమీ తోచకుండావున్నది. ఇప్పుడే మనిషితో వెళ్ళివచ్చి దర్శనంచేసుకొంటాను.

(అని వెళ్ళుచున్నాడు.)

---

### 3. ప్రదేశము — కేసవరగ్రామము.

[మునసబుకోర్టు బేటామీను దానయ్య వాదివీరన్నను వెంటబెట్టుకొని]
(ప్రవేశించుచున్నాడు.)

దాన — పాతికరూపాయలకు చిల్లిగవ్వ తక్కువయితే నేను పుచ్చుకోను. వెధపది స్త్రీగా స్త్రీజప్తులలో పుచ్చుకొంటాను యాభయి రూపాయలు.

వీర — దయచేసి యీపదిరూపాయలూపుచ్చుకొని కార్యం జరపరాకీ సెయ్యండి. బాబూ! బాబూ! యింకోతూరి మిమ్మల్ని సమాధానం చేసుకుంటాను.

దాన — ఈమాటలేమీ నాదగ్గర పనికిరావు. నీవుయిస్తానన్న పదిరూపాయలూ హెడ్డుగుమాస్తాకేపోతవి. నేను చెప్పినప్రకారం ఇచ్చుకోనిపక్షమున, రెండుదుబ్బుగోళ్ళయున్న రెండుబక్కగొడ్లనూ జప్తుచేసుకొని వెళుతాను దుబ్బుగోళ్లు అమ్మితే కోర్టుకు పట్టించుకు వెళ్ళడానికి ఐనకూలిలో నాలుగోవంతైనా రాదు. మేతఖర్చు కూలివాడిజీతముగాక ఈ బక్కగొడ్ల కాపలాక్రిందరోజుకొక్కంటికి ఆరణాల చొప్పున యాభయిరూపాయలైతే, అప్పుడు చచ్చినట్టు యిచ్చుకుంటావు.

వీర — బాబూ! బాబూ! మీరన్నట్టు డాకలుచేసుకుంటాను ఆలాసెలవియ్యకండి.

(అని సొమ్మిచ్చుచున్నాడు.)

దాన—నేను భోజనంచేసి ఫదిగంట లయినతరువాత జప్తుకు వస్తాను. బ్రాహ్మణయింట్లో రెండుకూరలతో వంటబాగా చెయ్యమని చెప్పి వచ్చినావా? మంచివి చిక్కనివి రెండు శేర్లు ఆవుపాలున్న అర్ధసేరు కమ్మని నెయ్యిన్నీ కూడా వేగిరం నీవు యింటికి వెళ్ళి పంపించు. నాకు పెందరాడే భోజనంచెయ్యడం అలవాటు; ఈలోగా కాళ్ళు కుడ్డడానికి వకమ కలవాణ్ణి ముందుగా పంపించు.

వీర—ఇప్పుడు ముందుగా జప్తుకు వెళ్ళకపోతే ఆస్తి చెపాయిస్తారు. నేనన్నీ జాగ్రత్తి పెట్టిస్తాను. మనం వకతూరి యిప్పుడే వెళ్ళి కొన్ని వస్తువులు జప్తుచేసుకొని వత్తాం.

దాన—కోర్టుహుకుంకు వ్యతిరేకం చెయ్యకూడదు. ఫదిఘంట లయితేనే కాని జప్తు చెయ్యడానికి వల్లపడదు. నీవు బసకు వెళ్ళి నేను చెప్పినట్టు జాగ్రత్తపెట్టించు.

వీర—సిద్ధం (అని వెళ్ళిపోయినాడు.)

---

౪. ప్రదేశము—ఆగ్రామములోనే ప్రతివాది దొరయ్యయిల్లు.

[ఉదయము ఎనిమిదిగంటలవేళ అయినా దానయ్య ప్రవేశించుచున్నాడు.

వీర—యెవరండీ మీరు మాయింటికివచ్చినారు?

దాన—(కోర్టు మొహరుతోవున్న కాగితము నొకదానిని పయికితీసి) యిదుగో వీరన్నకూ నీకూ జరిగిన వ్యాజ్యంలో వాదికయిన ఖర్చులనిమిత్తం నీఆస్తిజప్తు చెయ్యమని వారంటయినది.

దొర—అయితే ఇప్పుడేంచేస్తారండీ?

దాన—ఆడపిల్లల మెళ్ళల్లోవున్న పుస్తెలకాడనుంచీ జప్తుచేసి కోర్టుకు పట్టించుకొని వెళుతాను.

దొర—ఖరుసులమొత్తం చెపితే రొక్కం యిచ్చుకుంటాను. బాబూ! బాబూ! నాయింటిగుట్టు బైటపడెయ్యవద్దు.

దాన—ఆసొమ్ము పుచ్చుకోవడానికి కోర్టువారి హుకుంలేదు. నీ వ్యవసాయానికికూడా భంగం వచ్చేటట్టు కాడెడ్లూ మోకలూ పశువులుకూడా జప్తు చేసి తీసుకుపోతాను.

దొర—బాబూ! బాబూ! మీకేమయినా యిచ్చుకుంటాను. వాటినిమాత్రం వదిలి పెయ్యండి.

దాన—అలాగయితే తక్షణం పాతిక రూపాయలు తెచ్చుకో.

దొర—పాతిక రూపాయలు తెచ్చుకోలేను. పదిరూపా—

దాన—నాతో వేరే మాటాడవద్దు. నీ యింట్లో కనపడ్డ ఆస్తి అంతా యిప్పుడు జప్తు చేస్తాను.

దొర—సిత్తం. సిత్తం. తమ సెలవుప్రకారం డాఖలుచేసు కుంటాను. జప్తు సెయ్యకండి. (అని లోపలికివెళ్ళి సొమ్ము తెచ్చి యిచ్చుచున్నాడు.)

దాన—నీయింట్లోవున్న నగలూగిగలూ యిప్పుడే వేరేదాచుకో

[ఒగర్చుచు వీరన్న ప్రవేశించుచున్నాడు.]

వీర—బాబూ! మంగలాణ్ణి తీసుకొని జమలోకి యెళ్ళేటప్పటికి మీరు యిక్కడికి వెళ్ళినారని తెల్సి, గుండెలుకవుక పరుగెత్తుకొని వచ్చాను.

దాన—మంచిపని చేసినావు. ఇలారా. (అని చాటుకు పిలిచి రహస్యముగా) నీవువెళ్ళినతరువాత దొరయ్యయేమో ఆస్తి చపాయించడానికి ప్రయత్నంచేస్తూన్నాడని తెలిసి, నీవులేకపోయినా వెంటనేవచ్చి పూరిపుడకయినా అవతలికి తర్లకుండా జాగ్రత పెడుతూవున్నాను. అనుకొన్న ప్రకారం యిచ్చినతరువాత నేను స్వామిద్రోహం చేస్తాననుకొన్నావా?

దొర—గొప్పవారు మీరాలాగున యెందుకు సేస్తారు?

దాన—మాట అనుకొన్నతరువాత యెదటి వాట్టియించి లక్ష వచ్చినాయెప్పుడూ తిరిగిపోను. ఛీ! వెధవధనం గుడిసేటిముండగడి

స్తుంది. మాటప్రధానం. నీకార్యం అయినతరువాత వానికష్టంచూచి మరిఫదిరూపాయలు నిన్ను అడిగితే యిస్తావు. నీవు వెళ్ళి మధ్యవర్తిగా వుండడముకు కరణాన్ని పిలుచుకొనిరా.

వీర—సిత్తం. (అని వెళ్ళుచున్నాడు.)

దాన—దొరయ్యా! వేతేనని చెప్పి వీరన్నను పంపివేసినాను. అతను వచ్చేలోగా నుంచివస్తువులన్నీ అవతలికి చేరవెయ్యి.

దొర—నగలపెట్టెను తీసికొనివెళ్ళి సత్తెప్పగారియింట్లో పెట్టివస్తానండి. (అని పెట్టెను తీసుకొని వెళ్ళిపోవుచున్నాడు.)

[ఇంతలో మరల వీరన్న ప్రవేశించుచున్నాడు.]

దాన—ఏమోయి వీరన్నా! వక్కడివే వచ్చినావు?

వీర—కరణం వకపట్టాన వచ్చినాడు కాడండి. చివరకు రెండు రూపాయిలువప్పగొని బతిమాలి బయలుదేరతీసుకొచ్చినాను. దోవలో యెవరితోనో మాట్లాడుతూవస్తాయి పదమంటే నేను ముందుగావచ్చినాను.

దాన—మునసబుగారికి పట్టించుకొని వెళ్ళవలెను. మధ్యాహ్నానికి మంచి కర్పూరమువంటి ఆవునెయ్యి రెండుసేర్లు జాగ్రత్తచేయించగలవా?

వీర—మాయింట్లో లేదు వూళ్ళో కనుక్కుంటానండి.

[కరణము వెంకటరత్నము ప్రవేశించుచున్నాడు.]

దాన—కరణముగారూ! రండి. మీకోసమే చాలాసేపటి నుంచి కనిపెట్టుకొనివున్నాము. మీరు మధ్యవర్తులుగావుండి జాబితా తయారుచేయించవలెను.

వెం.క—వట్టి వెట్టిపని. నాకు దీనికేదీ పట్టేదిలేదు. ఘడియ కొక్కమాటు కోర్టుఅమీనువచ్చి 'జప్తు జప్తు' రమ్మంటోవస్తాడు. నాకు యిప్పుడు తీరుబడిలేదు.

దాన—మీరు ఆలాగనడానికి కోర్టుహారిపనా? లేక నాస్వంత పనా? మీరు తిరగబాటు చేసినారని రిపోర్టువ్రాస్తే, మాటవస్తుంది సుమండీ.

వెంక—నాకిప్పుడు రివిన్యూవ్యవహారంవున్నది వుండడానికి వల్ల కాదు. మీమనసువచ్చినట్లు రిపోర్టువ్రాసుకోండి. మీరువచ్చి సర్కారురివిన్యూపని ఆటంక పెట్టినారని బకీరు వ్రాస్తాను.

దాన—వీరన్నా సామానుయేమీ అవతలకు వెళ్ళకుండా నీవు జాగ్రతగాచూస్తూవుండు. నేనూకరణంగారూ వాకిట్లోకివెళ్ళిమాట్లాడి వస్తాము—కరణంగారూ! వక్కసారి వీధిలోకి దయచెయ్యండి. (అని వెళ్ళుచున్నారు.)

వెంక—ఇందులో మా కేయిగా యిప్పించడంవున్నదా? అంతా మీరే పుచ్చుకోవడమా?

దాన—నారయ్య ఆ స్తి జప్తు అక్కరలేకుండా సగముసొమ్ము చెల్లిస్తానన్నాడు. నేను వల్లపడదని బెదిరించినాను. మీసిఫారసు మీద రొక్కం పుచ్చుకోవడానికి నేనంగీకరించినట్టు నటిస్తాను. మీ రందులో నాలుగురూపాయలు రాబట్టుకోండి.

వెంక—కొత్తగా వూరినుంచి దిగివచ్చినవారు నిముషములో మీరే వందలూ యాభైలూ కొట్టుకుపోతూంటే, చిన్నప్పటినుంచీ గ్రామం కనిపెట్టుకునివున్న కరణంవాడికి నాకు వక్కనాలుగురూపాయలా? ముష్టి నాలుగురూపాయలు.

దాన—నేను పాంకాయీల ఆస్తికూడా జప్తుచేయిస్తానని బెదిరిస్తాను. మీరు సాధ్యమయినంత సొమ్ము రాబట్టండి. చెరిసగ మూ పుచ్చుకొందాము.

వెంక—ఉపాయాలోచన బాగావున్నది. రండి లోపలికి వెళు దాము. (అని వెళ్లుచున్నారు.)

దాన—దొరయ్యా! వేగిరం నీసామాను చూపించు. కరణం గారు జాబితా వ్రాస్తారు.

దొర—కరణముగారూ! ఎలాగయినా జప్తు లేకుండా చెయ్యలేరా?

వెంక—దొరయ్యా! ఇలా దగ్గిరగారా. (అని పిలిచి చెవిలో) పదిరూపాయలసొమ్ము అమీనావాడి చేతిలో పారవేసి వారంటు ముత్తం రొక్కం దాఖలు చేస్తాం. నీకు నామూషి రాకుండా నేను వాణ్ని పంపివేస్తాను.

దొర—నేను మొదట యిచ్చ్యబోతే రూల్సు లేదని పుచ్చుకున్నాడుకాదు.

వెంక—నీకెందుకు సొమ్ము తీసికోనిరా. నేను సమాధాన పరుస్తాను.

దొర—ఇప్పుడు తీసుకునివస్తాను. (అని లోపలికి వెళ్లుచున్నాడు)

దాన—ప్రతివాదిసొమ్ము యీ సెట్టిపల్లె యిళ్ళల్లో దాచినట్టు అనుమానంగా వున్నది. వెళ్ళి కనుక్కుందాము ఒక్కసారి వీధిలోకి రండి.

[అని యిద్దరును బయలు దేరి వెళ్ళుచున్నారు]

వెంక—ఏమోయి మద్దిపల్లె సత్తెప్పా! నీకోసం అమీనాగారు వచ్చినారు. ఒక్కపర్యాయం వీధిలోకిరా.

సత్తె—(లోపలినుండివచ్చి దండములుపెట్టి) యేమండి బాబూ!

వెంక—మీరేమో దొరయ్యగారిలూకు ఆస్తి కమ్మీపడిచి దాచినారని అమీనాగారికి తెలిసి, మీరాలందరి యిళ్ళూ సోదాచేసి జప్తు చేస్తామంటూవున్నారు. ఈ సెట్టిపల్లె పెద్దకాపులందరినీ పిలుచుకొనిరా.

సత్తె—సిత్తము. (అని నలుగురు కాపులను తీసికొనివచ్చుచున్నాడు.)

వెంక—ఏమోయి పెద్దకాపులు? దొరయ్య తనవస్తువులేమో మీయిళ్ళల్లో దాచినాడని, అమీనాగారు మీఆస్తి జప్తుచెయ్యాక మానమంటూవున్నారు. మీరేమి చెపుతారు?

కాపులు—మేమేమీ యెరగము, మమ్మల్ని రక్షించవలెను.

వెంక—మీపాడిమాటలు పనికిరావు. తలావక పదిరూపాయలూ యిచ్చుకుంటే వదిలిపెడతారు.

దాన—దొంగలు. వీళ్ళను వొక్కొక్కణ్ని పదిరూపాయలతో వదిలిపెట్టఁగూడదు. మనిషివక్కంటికి యిరవయి రూపాయలకు తక్కువవల్లపడదు.

వెంక—నామనవివిని నేనుచెప్పినట్టు అంగీకరించవలెను— ఓరీ! మీరు నూరుమాటాడక రూపాయలు వేగిరం తెచ్చుకోండి.

కాపులు—సిత్తము. (అనివెళ్ళి సొమ్ము తెచ్చియిచ్చుచున్నారు

దాన—కరణంగారూ! లోపలికివెళుదాము రండి.

(అని ఇద్దఱును దొరయ్యఇంటిలోనికి వెళ్ళుచున్నారు.

దొర—(సొమ్ము తెచ్చి కరణముచేతిలోపెట్టి) మీరేలాగైనా అనుగ్రహించవలెను,

వెంక—అమీనాగారూ! నాప్రార్థనవిని యీసొమ్మువుచ్చుకొని మీరెలాగైనా దొరయ్యను తేల్చండి.

దాన—కరణంగారు సిఫారసుచేస్తావున్నారు గనుక, పైని నాకు మాటరావడానికైనా వప్పుకొని వారంటుమొత్తం వుచ్చుకొని రసీదుయిస్తున్నాను. దొరయ్యా! నీవు కరణంగారిమాట మరచిపోకు.

వెంక—వూళ్ళోవాళ్ళము తెల్లవారిలేస్తే మాకువెయిపనులు వుంటవి. దొరయ్య ఇందులోగాకపోతే యెందులోనైనా నాకు నాలుగువరాలసొమ్ము ముట్టచెపుతాడు.

(కరణమును, అమీనాయును వెళ్ళుచున్నారు.)

---

## చతుర్థాంకము.

౧. ప్రదేశము—కేశవరగ్రామము; నారయ్యసావిడి.

[హెడ్డుకనిస్టేబిలును, మఱియొక కనిస్టేబిలును, నారయ్యయు ప్రవేశించుచున్నారు.]

హెడ్డుక—ఏమోయి నారయ్యా! మీయిల్లుకాలిపోయి యెన్నాళ్ళయినది?

నార—బాబూ! పదిదినా లవుతుందండి.

హెడ్డు—యేమీ? మీవూరికి నాలుగుకోసులలో పోలీసు స్టేషనువుంటూ వుండగా నాకు వర్తమానం చెయ్యకుండా యింత కాలము యెందుకు వుపేక్ష చేసి వూరుకున్నావు? నేరంకమ్మీచేసి నందుకు యిప్పుడు నీమీద చార్జి సీటుచేస్తాం జాగ్రత.

నార—(గడగడ వణఁకుచు) బాబూ! బాబూ! నేనప్పుడు వూళ్లో లేనండి. వ్యాజ్యానికి వెళ్లినాను క్షమించాలండి. (అని కాళ్ళ మీఁద పడుచున్నాఁడు.)

హెడ్డు—(కన్నెఱ్ఱచేసి కాలుతీసుకొని) వూళ్లో లేకపోవడం వుండడం నాకు జరూరులేదు. ఇదిసర్కారుహుకుమా మరివకటా? —ఏమోయ్ కనిస్టేబిల్! ఇతణ్ని స్టేషనుకు తీసుకువెళ్ళి కొట్లో పెట్టు. నేను రెండ్లో కేజు దర్యాప్తుచేసుకొని సాయంత్రానికివస్తాను.

నార—బాబూ! నన్ను వదిలివెయ్యండి. తమకేమయినా దాఖలు సేనుకుంటాను.

హెడ్డు—యేడిసినావు. మావుద్యోగం తాహతుకు నీవేమి యియ్యగలవు? మహాయిస్తే పదిరూపాయిలిచ్చేవు ఇరవైరూపాయ లిచ్చేవు. ఇంతేనా మరియేమైనావున్నదా?

దొర—చంద్రుడికొక్క నూలుపోగన్నాడండి. నామనవి సిత్తగించవలెను. పాతికరూపాయలు రొక్కం యిచ్చుకుంటాను. యేలాగైనా తమరు అనుగ్రహించి నాపరువు ప్రతిష్టలు నిలవబెట్టక తప్పదు.

హెడ్డు—వూరికే అఘోరిస్తూ వున్నావుగనుక వెల్లి వేగిరం రూపాయలు తెచ్చుకో. చచ్చిపోయిన అన్నగారికీ నాకూవుండే విహితాన్నిపట్టి నిన్ను వదిలివేస్తూ వున్నానుగాని ముష్టిరూపాయలు చూచికాదు సుమా?

దొర—అవునండి నేనెరగనా? బాబూ! యీవేళ యేలినవారు నాపరువు పోకుండా కాపాడినారు. (అని లోపలికి వెళ్ళి రూపాయలు తెచ్చి చేతిలోపెట్టుచున్నాడు.)

హెడ్డు—దొరయ్యా! యిఖనీవు వెళ్ళి హెడ్డుకనిష్టేబిలుగారి సెలవైందని మీవూరికరణాన్ని తీసుకునిరా. ఈలోగా నేను నీకేజు దర్యాప్తుచేసి కొట్టివేస్తాను. బొత్తిగా విమర్శచెయ్యకపోతే బాగా వుండదు.

దొర—సిత్తం. (అని వెళ్ళుచున్నాడు.)

హెడ్డు—ఓయీ! వెంకటస్వామీ! నీవంతురూపాయీపుచ్చుకొని వేగిరం దొరయ్య హాజరాయీలనందరినీ లాక్కురా. వాళ్ళవద్దకూడా యేమయినా తిటాలు పడుదాము.

[కనిష్టేబిలు యిద్దరుముగ్గురు కాపులతో మరల ప్రవేశించుచున్నాడు.]

కని—అయ్యా! ఇద్దరు పెద్దకాపులు వీధిలోకూర్చున్నవారే దూరాన్నుంచి నాకోటూ మొగ్గీతలగుడ్డాచూచి పారిపోయి లోపల దాక్కున్నారు. నేనెన్నిపిలిచినా బయటికి వచ్చినారు కారండి. ఆడవాళ్ళు యింట్లోలేరంటారు.

హేడ్డు—పోనీ వాళ్ళను వారంటుచేసి పట్టి తెప్పించి కోర్టులో పెట్టి మొత్తగా దంచితేనే కాని వాళ్ళరోగం కుదరదు — ఏమోయి కాపులు. మీకు దొరయ్యకు హంశాయీలు కాదా? ఆతనియిల్లు యేలాగు కాలిందో కారణం మీకు తెలుసునా?

కాపు—బాబూ! మాకేమీ తెల్దండి.

హేడ్డు—ఛీఛీ! మీరు తెలియదంటే పోతుందనుకొన్నారేమి? అతను వూళ్లో లేనప్పుడు మీరందరున్నూ చేరి విరోధంచేత యింటికి నిప్పుపెట్టి యేమీ యెరుగనివాళ్ళవలె గప్పుచిప్పుమనకుండా వూరుకున్నారు. నిజమంతా మాకు తెలిసిందిలే.

కాపు—మాకుగిట్టనివాళ్ళు తమతో యేమి సెప్పినారోగాని మేము యేదోషమూ యెరుగమండి.

హేడ్డు—మీరు యీలాగు నిజం చెప్పరు. సాక్ష్యం రుజువుపడి జయిలులోకి వెళ్లేటప్పుడు చెప్పతారు.

కాపు—మీపాదాలతోడు మాకేమీ తెల్దండి.

కని—అయ్యగారికేమయినాయిచ్చి కాళ్లాకాళ్లు పట్టుకుని సమాధానంచేసుకుంటే కుదురుతుందిగాని అదేపనిగా లేదు లేదంటే పోతుందిటోయి.

హేడ్డు—(జేబులోని నోటుబుక్కును పయికితీసి) మీపేర్లూ యింటిపేర్లూ చెప్పండి.

కాపు—మేమందరమూ కలిసి పదిరూపాయ లిచ్చుకుంటాము మామీది కేమీరాకుండా తేల్చివెయ్యాలనండి.

హేడ్డు—మీరింతమంది చేరి పదిరూపాయలా యిచ్చుకుంటారు? మనిషివక్కంటికి పదేసిరూపాయ లిచ్చుకోండి.

కాపు—బాబూ! మేమంతపట్టుకు తెచ్చుకోలేమండి. మొన్న నిష్కారణముగా కోర్టు అమీనావాడు బోలెడురూపాయలు దోచు

కొనిపోయినాడు. రేపటి జమాబంది ఖర్చుకింద కరణంగారు సొమ్ము తెమ్మంటూవున్నారు. ఈయేడు పంటలేమీ బాగా పండలేదండి.

హేండ్డు—మాకవేమీ తెలియవు. నేనేమో మొట్టమొదట పేరుపెట్టినాను. నేను అన్నతరువాత మరోలాగు పుచ్చుకోను.

కని—నామనవి చిత్తగించి తలావక అయిదురూపాయలూ యిచ్చుకుంటారు. ఆప్రకారం తమరనుగ్రహించాలెను.— ఏమోయి కాపులు? మీరు వెళ్ళి సొమ్ము తెండి.

హేండ్డు—అలాగు పనికిరాదు.

కని—(రహస్యముగా) మీ కెందుకు? మీరు సొమ్ము తెచ్చి నాచేతిలో పడవేస్తురూ. నేను మీమీదకేమీ రాకుండాచేస్తాను. (అని కాపులనుతీసికొని వెళ్ళుచున్నాడు)

---

## ౨. ప్రదేశము—వీరన్నయిల్లు.

[ హేండ్డుకనిస్టేబిలును, కనిస్టేబిలును, వీరన్నయుప్రవేశించుచున్నారు]

హేండ్డు—వీరన్నా! మీయింట్లో జరిగినచోరీ మీఅన్న దొరయ్య సలహామీద జరిగినట్టుతోస్తుంది. నీకూ అతనికీ విరోధంకాదా?

వీర—మాయింట్లో చోరీపోయినప్పుడు దొరయ్య వూళ్ళో కూడాలేడండి. వున్నా అతను అలాగంటిపని జరిగించేవాడుకాడు. వెనుక బాపిరాజుగారి కుట్రచేత మాయిద్దరికీ వివాదలు వచ్చినవి గాని యిప్పుడేమీ విరోధంలేదండి.

హేండ్డు—అయినా నీవు వ్యాజ్యం గెల్చుకొన్నావన్న యీర్ష్య చేత మీయింటి కతనే కన్నంవేయించి వుంటాడు.

వీర—నేను యీవ్యాజ్యం యేమిగెలవడమండి? భూమిఖరీదుకంటే నాకు పదిరెట్లుసొమ్ము ఖర్చయినది. అన్నా చాలాసొమ్ము ఖర్చు పోయినాడు. నిష్కారణంగాయిద్దరంకూడా పాడయిపోయినామండి.

హేడ్డు—ఆమాటలకేమి నేనడిగినదానికి జవాబుచెప్పు. మీ అన్నసలహా లేకపోతే మీయింట్లోనే దొంగలుపడడానికి కారణమేమి వుంటుంది!

వీర—మా యిరోదుల కట్రచేత యీవూళ్ళోవాళ్ళే యీపని చేసినారుగాని మరోవూరునుంచి దొంగలు రాలేదండి.

హేడ్డు—నీకెవనిమీదనైతే అనుమానంవున్నదో వాళ్ళపేర్లన్నీ చెప్పు.

వీర—సిత్తం. (అని తనకు విరోధులుగానున్న వారియొక్కయు, అనుమానమున్న వారియొక్కయు పెద్దజాబితాను వ్రాయించినాడు)

హేడ్డు—యిందరు మీయింట్లోపోయిన వస్తువులజాబితా వ్రాయించు.

వీర—ఇత్తడిచెంబు, కంచము, వెండిమొలతాడు—

హేడ్డు—ఉండు వ్రాసుకోనీ. (అని నోటుపుస్తకముతీసి పెన్ సిలుతో వ్రాయుచున్నాడు.) యిత్తడిచెంబు, కంచుకంచము, వెండిమొల తాడు, వెండికడియాలజత—

వీర—కడియాలజత లేదండి.

హేడ్డు—నీపెళ్ళానికి చేతికి కడియాలున్నవా? లేవా?

వీర—ఉన్నవికానండి, అవి అప్పుడు నాపెళ్ళాము చేతులను పెట్టుకొని పడుకున్నందున పోలేదండి.

హేడ్డు—పోకపోతేనేమి? పోయినట్టు వ్రాయించి అవినాచేతి కియ్యి. దొంగవస్తువులు పట్టుకోవడములో వీటితో చాలాపని వుంటుంది.

వీర—సిత్తము.

హేడ్డు—ఎవరింట్లోనయినా సోదాచేసినప్పుడు యేవస్తువులు నీవేనాయని యడిగితే అవి నీవయినా కాకపోయినా నీవే అని చెప్పు.

వీర—చిత్తము.

హేడ్డు—నీయింట్లోవున్న జేబులో యిమిడే రెండువస్తువులు నాచేతికిచ్చి జాబితాలో వ్రాయించు. సంశయిస్తావున్నావు నేను పుచ్చుకోనులే. వాటిపని అయినతరువాత నీవస్తువులు నీకేవస్తవి.

వీర—చిత్తము. (అని లోపలికివెళ్లి రెండుమూడు చిన్నవస్తువులను తెచ్చియిచ్చుచున్నాడు.)

హేడ్డు—ఓయీకనిస్టేబిలు! ఈబంగారపు బొగడలజత నీదగ్గర వుంచుకోని మేము సోదాచేస్తావున్నప్పుడు యెవరూ చూడకుండా యేపెట్టెలోనో బుట్టలోనో పడవెయ్యి.

క—అలాగుపడవేసి మనము సోదాచేసి దొరకలేదని వెళ్లిపోయేటప్పుడు పంచాని స్థలము సోదా చెయ్యలేదని నేనంటాను. మీరప్పుడందరిని యెదుటవుంచుకొని మరి వకరిచేత ఆస్థలం సోదాచేయిస్తే వస్తువుదొరుకుతుంది.

హేడ్డు—వీరన్నా! మీయింట్లో పోయిన వస్తువుల కిమ్మత్తు యేమాత్రంవుంటుంది?

వీర—సుమారు రెండువందరూపాయిలు ఖరీదుచేస్తవండి.

హేడ్డు—సొమ్మంతా తెప్పించి నీకిస్తే అందులో మాకేమియిస్తావు?

వీర—పదిరూపాయల సొమ్ము యిచ్చుకుంటానండి.

హేడ్డు—పోయినదానిలో సగంసొమ్ము యిచ్చుకోని పక్షమున నీకుపోయిన వస్తువులలో వొక్కటీదొరకదు.

వీర—చిత్తము. మీయిష్టప్రకారం చెయ్యండి.

[కరణము ప్రవేశించుచున్నాడు.]

హేడ్డు—ఏమండీ కరణంగారూ! యీదొంగతనంగురించి మీరు తహశీల్ దారుగారికిన్ని ఇనస్పెక్టరుగారికిన్నీ వ్రాసినబక్లీల్లు మాకు

రిఫరుచేస్తే నేను సాక్షినిమిత్తం వచ్చినాను. మాకనిస్టేబిలు ప్రతి రోజూ మీగ్రామంవస్తూవున్నాడా?

కర—ఏమో పదిహేనురోజులకు ఒకపర్యాయంవచ్చి కోడి పిల్లలు మొదలయిన మామూళ్ళు వసూలుచేసుకొని ప్రతిరోజూ వస్తూవున్నట్టు వక్కసారే బుక్కుమీద దస్కతుచేయించుకొని పోతాడండి.

హేడ్డు—దానికేమిగాని మనము పోదాము వెళుదాము. మరి యిద్దరిని మధ్యవర్తులనుకూడా తీసుకొనిరండి.

(అని అందరును వెళ్ళుచున్నారు.)

---

3. ప్రదేశము—ఒక కాపువానియిల్లు.

— — : o :——

[హేడ్డుకనిస్టేబిలు, కనిస్టేబిలు వీరన్న, కరణము, మరిఇద్దరు మధ్యవర్తులును ప్రవేశించుచున్నారు.]

హేడ్డు—(రహస్యముగా) ఇందాకా మనముసోదా చేసినవాడే నిజమయిన దొంగలు. పరేడు నన్ను చాటుకుపిలిచి తమర్ని వదిలి పెడితే నూరురూపాయలు ఇచ్చుకుంటానని చెప్పినాడు. అందుమీద నేనువాణ్ని మెల్లిగా మంచిమాటలతో బుజ్జగించి ఆస్తియెక్కడ దాచినారో అడిగినాను వాడికేమీ భయములేకుండా వదిలివేస్తా నని చెప్పినమీదట నాచేత ప్రమాణంచేయించుకొని దొడ్లో చింత చెట్టుక్రింద కొంతసొమ్ము పాతిపెట్టినట్టు చెప్పినాడు. వాడివద్దనుంచి నూరురూపాయలూ రాబట్టుకొని తరువాత దొడ్డితవ్వించి సొమ్ము పట్టుకొని వాణ్ని స్టేషనుకు తీసుకొనివెళదాము. నీకు మామూలు ప్రకారం నూటికి నాలుగువంతున సొమ్ము వచ్చినతరువాత యివ్వనులే.

కని—ఇక్కడి కాపుమాట యేమిచేతాము?

హేడ్డు—నీదగ్గరవున్న వస్తువులను నీవు బహుజాగ్రతగా యెవరూ చూడకుండా యేపెట్టెలోనైనా వెయ్యవలెనుసుమా. వీడు చాలాభాగ్యవంతుడట. వీడి యింట్లో చోరీఆస్తి దొరికినట్టు నేరంమోపి దిట్టంగా పుచ్చుకుందాము. మనమనుకున్నట్టు సాక్ష్యం పలికేలాగు యీవూళ్లోవాళ్ళను నీవు నలుగుర్ని కుదుర్చు. వాళ్ళకేమయినా నాలుగుడబ్బులు సొమ్ము ముట్టేటట్టు చేస్తామని ఆశపెట్టు. వాళ్ళందరు వప్పుకోకపోతే వాళ్ళనుకూడా యీకేజులో దూరుస్తామని బెదిరించు. వాళ్ళేవప్పుకుంటారు.

కని—మనం అడిగినంతసొమ్మియిస్తే వీళ్ళల్లో యెవళ్ళమీదనైనా తేల్చివేతామా?

హేడ్డు—ఆమాట తరువాత చూచుకుందాము. నేరంపట్టుకోకపోతే మనకు క్యారక్టరురాదు. డబ్బుపుచ్చుకోనికూడా "నీవువప్పుకుంటే తేలిపోతుంది మేము సహాయంచేస్తామని చెప్పి మేజస్ట్రీటుదగ్గర వప్పించి ఖయిదుచేయింతాము. లేకపోతే వీళ్ళను వదిలివేసి వుప్పరవాళ్ళనయినా యెవరినయినా పట్టుకుని వాళ్ళమీద సాక్ష్యంపలికించి జయిలులోకి తోయింతాము.

కని—వీళ్ళు మనంఅడిగినంత సొమ్మియిస్తే మీరు తరువాత సెలవిచ్చినట్టుచేస్తే బాగావుంటుంది.

హే—ఏలాగయినా చేతాము. మొన్న జేగురుపాడు గ్రామంలో జరిగిన చోరీకేజులో సొమ్ముపట్టుపడ్డవాణ్ణి వదిలివేసి, ఆవూళ్లోకరణానికి విరోధంగావున్న వకకాపువానిమీద కేజుదిట్టంగా రుజువుపలికించి సంవత్సరం శిక్ష వేయించినాను. మనవూళ్లోనే మరి వకకేజులో వెనుకటి హేడ్డు కనిస్టేబిలు నేరం పట్టుకోలేకపోతే నేనువచ్చి పూర్వంనామీద ఫిర్యాదుచేసినవాడు వకడు వూళ్లో

హేం—సుధ్యవస్తులు మీరుదగ్గిరవుండిచూడండి. (అవితాళము తీసి) ఓయీ కాపూ! (నీవుకూడా చూస్తావుండు.)

కాపు—అక్కరలేదు. తమరుతియ్యండి. మీరునన్ను అన్యాయం చేస్తారా యేమిటండి!

హేం—ఓయి వెర్రివాడా! మేము సర్కారు జీతంపుచ్చుకుంటూ నిన్ను అన్యాయం చేస్తామటోయి. చూచు (అని యొకనల్లంచుచీరె పెకితీసి) ఏమోయిసోదరన్నా! యీచీరె మీదేనేమో చూచుకో.

వీర—(అనుమానించి) యీచీరాండి?

హేం—అనుమానిస్తావేమి? నేను యింటికాడ సందేహించవద్దని చెప్పలేదా? ఇదిగో నీవు జాబితాలో వ్రాయించిగావు— సుప్రరంచుచీరెవకటి.

వీర—(ఇది నల్లంచుచీరండి)

హేం—అంచునల్లదైతేనేమోయి? ఇదిఆడవాళ్ళు కట్టుకునేది గనుక నీకు బాగా ఆనవాలు తెలియదు. నీభార్యకు చూపింతాము. అప్పటిదాకా సుధ్యవస్తులపరంగా వుంపించు.

కాపు—అయ్యా! యిది నాపెళ్ళానికి మూలఅత్తవారు మొన్న పెళ్ళిచేసుకొన్నప్పుడు పెట్టినారండి. కావలిస్తే వారిచేత యిప్పుడు రుజువిప్పిస్తానండి,

హేం—నీకువచ్చినష్టం లేదు. అదివేరేవుండనీ. నీదైతే తరువాత నీచీర నీకే యిప్పిస్తాము. తొందరపడకు.

వీర—ఇక యీవస్తువులలో నాదేదీ లేదండి. పెట్టె వేసివెయ్యవచ్చును.

హేం—(కోటుజేబులో కుడిచెయ్యిపెట్టి) బాగాచూచుకో, పెట్టెలో బట్టల అడుగున ఆమూల తెల్లగా కనపడుతూవున్నది. అది యేమిటో చూచినావా?

వీర—నా కేమీ కనపడడంలేదండి.

హే—ఓయి వెర్రిబాగులవాడా! నీవవతలవుండు. నేను చూపి స్తాను. (అని పెట్టెలో చేయిపెట్టి బట్టలలోనుండి యడుగునకుపోనిచ్చి కోకుచేతులలోనుండి కడియములజత జారిచి) అదుగో చూచి నావా? బట్టమడతలలోనుండి అడుక్కుపడేటప్పుడు యేలాచప్పు డయిందో. (అని తనచెయ్యిపయికితీసి) నీవీలాగువచ్చి మధ్యవర్తులను పియ్యనియ్యి.

మధ్య—(చెయిపెట్టి వస్తువుపయికితీసి) యిది వెండికడియాల జతండి.

కాపు—(రొమ్ముకొట్టుకొనుచు) ఇదినా పెట్టెలోకి యేలావచ్చిం దో నాకు తెలియదండి.

హే—నీవు యెరగకపోతే నీతాళం వేసివున్న పెట్టెలోకి యీ వస్తువు పరాయివాళ్ళు తెచ్చి వేస్తారాయేమిటి? నీవు వెయ్యకపోతే నీభార్య వేసివుండవలెను.

కాపు—యీ పెట్టెతాళంచెవి యెప్పుడూ నాపెళ్ళాంచేతికి యివ్వనండి. నామొల్లోనే కట్టుకుంటాను.

హే—వీరన్నా! యీవస్తువు నీదేమో చూచుకో.

వీర—నాదేనండి. నిన్నమీరడిగితే—

హే—తెలిసిందివూరుకో. నిన్న నేనడిగితేచెప్పి యీవస్తువు జాబితాలో వ్రాయించి గావు. మునకనిష్టేబిలవతలికి వెళ్ళినాడా యేమిటి?

వీర—కామల్సునండి.

హే—వస్తువొక్కటి పట్టుపడ్డదిగనుక యిక మనమువాగిట్లోకి వెళ్ళి మాట్లాడుదామురండి. (అని నడుచుచున్నారు.)

కని— (వీధిలోనుండివచ్చి) యీపత్తివిత్తులబుట్ట సోదా చేసినారా ?

కర—అందులో నేమీవుండ దక్కర లేదు.

హే—అయినాకానీ చూడనియ్యండి.

కాపు—కావలిస్తే నేను గుమ్మరించి చూపిస్తానండి.

హే—ఏదీ గుమ్మరించు చూతాము.

కాపు—(క్రిందగుమ్మరించి) యీబొమ్మసామును నాకు గిట్టనివాళ్లెవళ్ళో నాకొంపతియ్యవలెనని యిందులో వేసినారుకాని నేనేమీ యెరగనండి.

హే—నీవెరగకపోతే మాయమంత్రంచేత యిందులోకి వచ్చినవనుకొన్నావాయేమి?—వీరన్నా! యీవస్తువులు నీవేనా?

వీర—మావేనండి.

హే—ఓయి కనిష్టేబిల్ నీవీలాగురా. చెవిలోమాట. (అని రహస్యముగా) నేను యితణ్ని నీపరంగా వప్పగిస్తానుకాని వెనక వుండి దోవలో లంచంమాట్లాడి పరిష్కరించు. (బిగ్గరగా) యీవస్తువులితనియింట్లో పట్టుపడ్డవి గనుక ఇతణ్ని పట్టుకోకతప్పదు. నీవితణ్ని మనవూరుస్టేషనుకు తీసుకొనిపో.

[అందఱును వెళ్లుచున్నారు.]

---

## ౪. ప్రదేశము—తహశ్శీలుదారుకచేరి.

ఖయిదీలను తీసికొని యిద్దఱుకనిష్టేబిలులును, హేడ్డు కనిష్టేబిలును ప్రవేశించుచున్నారు.]

హే—ఓయి కనిష్టేబిలు ! నీవు తహశ్శీలుదారుగారు వచ్చేవరకున్ను ఖయిదీలను దూరముగా చెట్టుకిందపెట్టుకొనికూర్చో. మాటాడనియ్యకు.

కని—మంచిది. సలాం. (అని ఖయిదీలతో వెళ్ళుచున్నాడు.)

హేడ్డు—(రెండవ కనిస్టేబిలుతో) ఖయిదీలు మనం చెప్పే మన్నట్టు చెప్పేటట్టుగా బందోబస్తు చేసినావా?

కని—మీచిత్తంవచ్చినట్టు బందోబస్తు చేసినాను. మొన్న రాత్రి మనం వాళ్ళను కొల్లోపెట్టి కొట్టి దెబ్బలు తలచుకుంటే వెయి వరహాలిచ్చినా మరివకలాగున చెప్పరు. మనము చెప్పినట్టు రుజువు పడితే నిజం చెప్పినారని మేజస్ట్రీటుగారితో సిఫారసుచేస్తానని నమ్మకంపుట్టేలాగున చెప్పినాను.

హేడ్డు—పల్లెటూరివాళ్లు యేలాపడకుంటే అలాగే పడుతారుగాని, దొంగముండాకొడుకులు మనవూళ్లోవాళ్ళే మనకను కూలంగా పలుకుతామనినమ్మించి తీరా సబు మేజస్ట్రీటు గారి దగ్గరకు వచ్చి మరివక విధంగా చెప్పి నిన్నతిప్పి చూసిని పారిపోయినారు; మీదిమిక్కిలి హేడ్డుకనిస్టేబిలు కొట్టినాడని కూడా చెప్పినారు.

కని—ఈ కేసులో యీ దినం కే సబు మేజస్ట్రీటుగారివద్ద వప్పించి నాముగనుక యిక ఫర్వాలేదు.

హేడ్డు—యీ కాపును పట్టుకొన్నందుకు డబ్బుగలవాడుగనుక యాభై రూపాయలు దొరికినవి. అప్పుల్లో కోర్టుపాలుపడివున్న యిద్దరు కాపులనూకూడా పట్టుకుంటే మనకు చెరవక యాభయి రూపాయల సొమ్మియిచ్చేదే. కరణంవాడు వాళ్ళవద్ద యేమో పుచ్చుకొని పడనిచ్చినాడు కాడు.

కని—మన పట్టుకొన్న యీ మొకకలవాడికి శిక్ష అవుతుంది గాని యీ కాపు వకీలును కుదుర్చుకొన్నాడు. ఇతనిమాట నాకు సందేహంగానున్నది.

హేం—నాకు అలాగేవున్నది. ఆవకీలు మహాచెడ్డవాడు. ఈ వేళ ప్రొద్దున్నవచ్చి ఖైదీతో మాటాడవలెనని యేమో చెవులో చెప్పి

పోయినాడు. వుత్తరసాక్ష్యం కోరుకుంటాడట. లంచం యిచ్చి మేజస్ట్రీటు గుమాస్తానూ సబుమేజస్ట్రీటునూకూడా కడతాడు. మనము సాక్షులను తిప్పివెయ్యకుండా మాత్రం చూడవలెను.

కని—సాక్షులు ప్రొద్దుటినుంచి మళ్ళీ కనపడడంలేదు. తెల్లవాడుగట్ట యిదుగోవస్తామని వెళ్ళినారు.

హే—పిల్లలుగలవాఁడు యీయెరకలవాణ్ని పట్టుకోవడం కంటే మొన్నకొత్తగావచ్చి వూళ్లోదిగివున్న దొమ్మరివాళ్లలో వకణ్ని పట్టుకుంటే బాగావుండిపోను. వూళ్లోవాఁడుకాడుగనుక వాడి మీద సాక్ష్యంకూడా బాగావస్తుంది. పాపం యీయెరకలవాఁడి పెళ్ళాంబిడ్డలు మహా యేడుస్తూవున్నారు.

కని—వీణ్ని పట్టుకోవడమే బాగావున్నది. చోరీపోయినరోజున దొమ్మరివాళ్ళు ఆవూళ్లోలేరు. ఆరోజునే మనవూళ్ళో వాళ్ళు పంతులుగారియింట్లో ఆడినారు.

[డఫేదారు ప్రవేశించుచున్నాఁడు.]

హే—డఫేదారుగారూ! సలాముండి.

డఫే—సలాముండి. మీరేమయినా కేజుతీసుకొని వచ్చినారా యేమి? పడదలుంటే మామూలు యిప్పించాలసుమండీ?

హే—వానికేమి? తహశ్శీల్దారుగారు యింకా యెంత సేపటికి వస్తారు?

డఫే—వచ్చేవేళ అయింది. యిప్పుడేవస్తారు. ఇన్నాళ్ళూ యీపాటికే వచ్చేవారు. జమాబందీలో వుండడంచేత కొంచెం ఆలస్యంగా వస్తారు.

హే—కొత్తతహశ్శీల్దారుగారు మంచివారేనా?

డఫే—మహరాజు మహామంచివారండి. వెనక తహశ్శీల్దారు వచ్చినాఁడు వాఁడువట్టి కర్కోటకుడండీ. వాఁడువున్న నాలుగు

నెలలలోనూ నాకు జీతంరాళ్ళు కాక పైని వక్కదమ్మిడీ అయినా దొరికిందికాదండి. ఆదుర్మార్గుడు గుమాస్తాలకుకూడా వక్క పావలా దొరకనిచ్చినాడుకాడు. ఆ నాలుగు నెలలూ మేజస్ట్రీటు గుమాస్తా లబ్బున మొత్తుకున్నాడు. లంచం అడిగినాడని అతణ్ణి రెండుమాసములు సస్పెండుకూడా చేయించినాడు. వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ నాకుకూడా నాలుగణాలు జరిమానా వేసి మరీపోయినాడు.

హే—ఆ తహశ్శీల్దారుణ్ణి ఇక్కడనుంచి యెందుకు బదలాయించినారు! ఒక మద్దాయీని కొట్టినానని నామీందకూడా కేజు చెయ్యడానికి సిద్ధమయినాడు. సాక్ష్యం దొరక్కపోవడంచేత తప్పిపోయింది.

దఫే—హుజూరువాళ్ళకు నేమీ యివ్వకపోవడంచేత వాళ్ల కతనిమీంద మహా కోపంగావుండేది. తాను లంచంపుచ్చుకోక హుజూరుగుమాస్తాలకు తాలూకాలో నేమీ యిప్పించకపోవడమే కాకుండా సప్లయిఅయినా తిన్నగా చేయించేవాడు కాడు. కావలిస్తే డబ్బిచ్చి కావలసినవస్తువులు కొనుక్కోమనేవాడు. పదిహేను రూపాయల జీతంపుచ్చుకొనే రాక్క గుమాస్తా పెస్కున పన్నెండు జోయీల సవారీమీదవచ్చి నెలకు నూరేసిరూపాయలు ఖర్చుచేసుకుంటూ జమాబందీ అయి యింటికి వెళ్ళేటప్పుడు వెయ్యేసిరూపాయలు పట్టుకువెళుతాడు. ఏలాగూ సంపాదించకపోతే డబ్బు యేలాగు వస్తుంది? ఇప్పుడసలే సర్కారువారు సప్రకరీవఖరు చచ్చిపోయింది. నాచిన్నతనంలో కరణాలిని చింతచెట్లకు వేంచి కట్టికొడితే దిక్కూ-దివాణం లేదు. నేనప్పుడు నాలుగురూపాయల బంట్రోతుపనిలో వున్నాను. నాకు మామూలూ కావుళ్ళలో గ్రామం వకంటికి సాలుకు పదేసిరూపాయలు మామూలుండేది. ఇప్పుడు వాంతో పని

వుంటే యిస్తారుగాని లేకపోతే కరణాలవాళ్ళు మాట్లాడనయినా మాట్లాడరు.

హే—వెనుకటి తహశ్శీల్దారు బదిలీమాట చెప్పినావే కావు.

డఫే—అవును మరిచిపోయినాను. ఆలాగు అతనిమీద హుజూరు వుద్యోగస్థుల కందరకూ విరోధంవుండటంచేత మా తాలూకా గుమాస్తాలు నిత్యమూ ఆయనమీద ఆకాశరామన్న అర్జీలు కలక్టరుగారికి పంపిస్తూవుండేవారు. అందుమీద శిరస్తాదారు గారు దొరగారితో మాటాడి ఆయనను మన్యంలోకి పారవేయించినారు.

హే—ఇప్పటి తహశ్శీల్దారుగారు మంచివారేనా?

డఫే—బహుమంచివారు. ఈయనవచ్చినతరువాత మేజస్ట్రీటు గుమాస్తా యీ నాలుగు నెలలలోనూ వెయ్యిరూపాయలు సంపాదించి యిప్పుడు మంచి పెంకుటియిల్లు కట్టిస్తూవున్నాడు. ఈయన తానూ దిట్టంగా పుచ్చుకుంటాడు; ఇతరులకూ దొరికేటట్టుచేస్తాడు. నా మామూలు పావలా ముందుగా పెడితేనేకాని మనివర్జీలిచ్చుకొనే వాళ్ళి యెవళ్ళీ తహశ్శీల్దారువద్దకు పోనియ్యను. గుమాస్తాలకు మామూలు యిచ్చుకోకపోతే సముజాయిషీ కావలెనని హుకుం వ్రాసి పిలిపించి కరణాల్ని సొమ్ము యిచ్చేదాకా యీ వూళ్ళో పదిహేనేసిరోజులు పడవేసిపెడతారు. తహశ్శీల్దారుగారి దగ్గరకు చెప్పుకోడానికి వెళితే ఆయన బూతులుతిడతాడు.

[బంట్రోతు ప్రవేశించుచున్నాడు.]

బంట్రోతు—యీవేళతహశ్శీల్దారుగారుకచేరీకిరారట. యేమైనా కేజులు వుంటే రేపు హాజరుపెట్టుమన్నారు.

[అందరును వెళ్ళుచున్నారు.]

## పంచమాంకము.

### ౧. ప్రదేశము—తహశ్శీల్దారుకచ్చేరి.

[తహశ్శీల్దారును. మేజస్ట్రీటుగుమాస్తాయును, మరికొందఱును ప్రవేశించుచున్నారు.]

తహ—జేగురుపాడు కరణం శిరస్తాదారుగారి యింటికి పెరుగు కడవపంపించినాడేమో మీరు కనుక్కున్నారా?

గుమా—మన తాలూకాలో కరణాలు మహా పొగరెక్కి వున్నారు. వాళ్ళకు మన మాటఅంటే లక్ష్యమే లేదు. అందులోనూ జేగురుపాడుకరణం కేవలం దగాఖోరండి. అతను యేమిఅడిగితే అద్దిగో పంపిస్తానని మనవద్ద చెప్పి పోవడమే కాని తిన్నగా పంపించడండి.

తహ—మొన్న శిరస్తాదారు యింట్లో జరిగిన సంతర్పణకు అతను గస్తాయి మహాబాగా చేసినాడే పది కావిళ్ళు గట్టిపెరుగు పంపినాడు.

గుమా—తమకేమి పంపినాడో కానండి, అతను మొన్న వచ్చి నప్పుడు పుల్లలిబ్బందిగావున్నది తుమ్మచెట్టుకొట్టించి బండెడుపుడకలు పంపించమని మరీమరీ చెప్పినాను. ఇదుగో రేపుపొద్దయ్యానికి పంపిస్తానని పోయినాడు. నేటివరకు యింటికి రానే లేదు.

తహ—అలాగైతే అతనికి హుకుం వ్రాసి పిలిపించండి. పది సీమనోజులు యీవార్లో పడవేసి పెడదాము—ఎవరయ్యా? వాకిట్లో కేకలు వేస్తున్నారు.

గుమా—ఎవరో కచేరీలో ఫిర్యాదు దాఖలుచేసుకోవడానికి వచ్చినాడు. డఫేదారు మామూలు ఇవ్వకపోతే వడిగా కేకలువేసి అడుగుతూవున్నాడు. మరేమీ లేదండి.

తహ—ఇట్లూకేకలూ మానోటీసులోకిరాకుండా దూరంగా తీసుకొనిపోయి వచ్చేమామూలేమో నెమ్మదిగా రాబట్టుకోమనండి.

గు|రా—ఇప్పుడందరూ బొత్తిగా తెలుగుమీరిపోయినారు. బాగా త్తుకు పెడితేనేకాని యెవరూ యిచ్చేమామూలు తిన్నగా యివ్వరండి.

[ఒక కోమటి ప్రవేశించుచున్నాడు]

కోమ—మహాప్రభూ! నేను దుకాణంమూసుకొని పదిరోజుల బట్టీ తిరుగుతూవున్నానండి. నాసంగతి—

తహ—(తలయెత్తిచూచి) యెవడువీడు?

గు|రా—మొన్నతమతో మనవిచేసి వీధిలో పెంటవున్నదని సమనుచేసినది వీడికేనండి.

తహ—యీవూళ్లో కోమటివాళ్ళు మహావళ్ళువాచి దేవుళ్లాడుతూవున్నారు. కొద్దికాలంలోనే రోగం కుదురుతుందివుండండి. గాడిదకొడుకా! గుమస్తాగారివాకిట్లో భాగవతంఆడిస్తే రెండురూపాయలు వసూలిచ్చుకోలేక పోయినావురా?

గు|రా—నేను తహశ్శీల్దారుగారి వుత్తరువు|ప్రకారం ఆడిస్తూవున్నామనికూడా అంతరితోనూ చెప్పినానండి.

కోమ—యేలినవారు కోపంచెయ్యవద్దండి. నేను రూపాయలు యిచ్చుకోబడుతుందని రాకపోలేదండి. నాకొడుకుకి వంట్లోజబ్బుగా వుండి—

తహ—ఛీఛీ నోరుముయ్యి. చెప్పువుచ్చుకొని తన్నేవాడులేక పోతేను మీయింట్లో ఖాయిలాలు గీయిలాలు మహావస్తూవున్నవి. వెనుకటి తహశ్శీలుదారుదారుగారు దర్పం యెరగక మిమ్మల్నందరినీ చెరిపివేసినాడు.

కోమ—నేను రూపాయలు దాఖలుచేసుకుంటానని తరువాత గు|రాజుగారితో మనవిచేసినానండి.

గుర్రా—సవానుచేసి పట్టియీడిచి తెప్పించినతరువాత యిఖవన్ని రూపాయలుకూడా యిచ్చుకుంటానంటావు. మీకల్లా వుంగరాల వేళ్ళతో నెత్తిమీంద మొట్టేవాడు వుండవలెను.

తహ—గుర్రాజుగారూ! శివాలయములో రథానికి పది రూపాయలిచ్చుకుంటాడుగాని వీడి కేజుతీయించి కొట్టివేయించండి.

కోమ—పదిరూపాయ లిచ్చుకోలేనండి.

తహ—ఎవరోయిజంట్రోత్! ఈగాడిదికొడుకునితన్ని అవతలికి యీడ్చుకొనివెళ్లు.

గుర్రా—మేజస్ట్రీటు కేజు వకటివున్నది హాజరు పెట్టింతునాండి?

తహ—ఆచోరీకేజా? పిలువుమనండి.

గుర్రా—బంట్రోత్! నిన్నటి హేడ్డుకనిస్టేబిలును కేజు హాజరుపెట్టుమను.

[హేడ్డుకనిష్టేబిలును, ఇద్దరు ముద్దాయీలును, సాక్షులును ప్రవేశించుచున్నారు.]

హే—దణ్ణాలండి. యితను వీరన్న మొదటిసాక్షి. వస్తువులు పోయింది యితని యింట్లోనేనండి.

తహ—వీణ్ని యిక్కడవుంచి తక్కినసాక్షులను అవతలికి పంపించివెయ్యండి.

హే—చిత్తం. (తక్కినసాక్షులను పంపివేయుచున్నాడు.)

గుర్రా—ఓయిసాక్షి! ప్రమాణవచనము చెప్పతాను మళ్ళీ అను. (అని ప్రమాణము చేయించుచున్నాడు.)

హే—నీవు ముద్దాయీని యెరుగుదువా?

వీర—ఎరుగుదునండి.

హే—ఇతనియిల్లు సోదాచేసినప్పుడు మీతాలూకు చీరెవకటి పట్టుపడ్డదికాదా?

వీర—ఆచీరె మాదికాదండి.

హే—అతని పెట్టెలో కడియాలజత దొరికిందికాదా?

వీర—ఆకడియాలజత నేను చూచినప్పుడు పెట్టెలో లేదండి. తరువాత హేడ్డుకనిష్టేబుగారు పెట్టెలో చెయిపెట్టి వున్నదన్నారండి. ఈకడియాలజత హేడ్డుకనిష్టేబుగారు నన్నడిగి—

హే—చాలువూరుకో. అయ్యా! తహశ్శీల్ దారుగారూ! ఈ సాక్షి తిరిగిపోయినాడండి.

తహ—అవును మాకు తెలియును. యీవకీలుగారేదో యంత్రం వేసి తిప్పివేసినాడు. వకటో ముద్దాయి నేరస్థుడయినసంగతి మాకు రూఢిగా తెలియును. తప్పుసాక్ష్యం చెప్పినందుకు యితనికిశిక్ష వేస్తాము—హేడ్డుకనిష్టేబిలుగారూ! ఇప్పుడు ఇతణ్ని యేమయినా ప్రశ్నలువుంటే వెయ్యండి.

హే—ఈముద్దాయీ నీకేమయినా బంధువుడా?

వీర—మేమంతా కావలసినవాళ్ళమే నండి.

హే—అందుచేత నేనా నీవతనికి అనుకూలంగా చెప్పినావు?

వీర—నేను యిందులో యెరిగినసంగతేమో మనవిచేసినాను. అబద్ధమాడినదాకా నాకేమండీ?

హే—యిక రెండవసాక్షిని పిలుతునాండి?

తహ—ఏమయ్యా? వకీలుగారూ! మీరేమయినా సాక్షిని ప్రాసునవాళ్ళు వేస్తారా?

వకీ—ఈసాక్షిని నేనడిగేదేమీ లేదండి. రెండవసాక్షిని పిలిపించవచ్చును.

[ఒక కనిష్టేబిలు మొదటిసాక్షిని పంపివేసి రెండవసాక్షిని పిలుచుకొనివచ్చినది:ఎదట వాడుకప్రకారము గుమాస్తా ప్రమాణము చేయించుచున్నాడు]

హే—మేము వకటోముద్దాయి యిల్లు సోదాచేసినప్పుడు పెట్టెలో వీరన్న తాలూకు చీరదొరకడం చూచినావా?

సాక్షి—చూచినాను. ఆపెట్టెలోనే బట్టలఅడుగున కడియాల జతకూడా దొరికింది.

హే—మనము వెళ్ళిపోయేటప్పుడు ఏమిజరిగింది?

సాక్షి—పత్తివిత్తులగంప సోదాచేస్తే అందులో వీరన్నతాలూకు పోయిన యితడిబొమ్మ సామానులుకూడా దొరికినవి.

తహ—గుర్రాజుగారూ! యీసాక్షి నిజం చెపుతూవున్నాడు. ఆప్రకారముగా వ్రాయండి—వకీలుగారూ! క్రాసుయగ్జామినేషన్ చేసేటట్టయితే చెయ్యండి.

వకీ—ఆదొరికిన వస్తువులు వీరన్నవని నీకెట్లా తెలుసును?

తహ—ఉస్సి. అతను యెరుగుదునని చెపుతూవుంటే ఆలాగంటి బేజారు ప్రశ్నలు వెయ్యకయ్యా.

సాక్షి—వీరన్న నాకు బంధువుడుకనుక వారియింట్లోవుండే వస్తువులన్నీ నాకు తెలుసును.

వకీ—అతనియిల్లు సోదాచేసేటప్పుడు ముందుగా యీకనిస్టేబిలులు తమవద్ద యేమీ వస్తువులులేనంటూ యెవరికైనా సోదా చూపించి మరీ లోపలికి వెళ్ళినారా?

సాక్షి—నేను మొదటినుంచీ హాజరువుండి చూస్తూవున్నాను. కనిస్టేబిలులవద్ద వక్క వస్తువూ లేదు. పెట్టె తాళం తీసేతియ్యడంలో ఆవస్తువులు నేను కళ్ళారా చూచినాను.

తహ—ఏమయ్యా! అన్నీ యీలాగంటిప్రశ్నలే వేస్తూవున్నావు?

వకీ—ఆవూళ్ళో సోదాచేసినారన్న నాటికి క్రిందటిదినం రాత్రి యెనిమిది గంటలదాకా యిక్కడవుండి వకక్రిమినల్ కేసులోసాక్ష్యం

యిస్తూవున్నావే. తెల్లవారేసరికి ఆరుక్రోసులదూరమున్న అవూళ్లోకి యెట్లా వెళ్ళినావు?

తహ—రాత్రిభోంచేసి చల్లగా చీకటిలో నడిచివెళ్ళినాడు.— గుమాస్తాగారూ! ఆప్రశ్న వ్రాయకండి.

వకీ—నీవు పోలీసువారితరఫున యెన్నిక్రిమినల్ కేజులలో సాక్ష్యం పలికినావు? అన్నికేజులలోనూ నీవే హాజరువుండడానికి కారణమేమి?

తహ—అతను యాభయికేజులలో సాక్ష్యమిచ్చినాడు. మేమే యెరుగుదుము. అతను హాజరువుండి చూచినాడుగనుక యెరిగిన సంగతి సాక్ష్యం యిస్తూవచ్చినాడు. తంటాయేమివున్నది?

వకీ—తమకు ఫలహారంవచ్చినది. వక్క-సారి ప్రయివేటు రూములోకి విజయం చెయ్యవలెను.

తహ—మీరుకూడా రెండు అరిటిపళ్ళు పుచ్చుకొందురుగాని రండి.

(అని తహశ్శీల్దారును వకీలును వెళ్ళుచున్నారు)

గుర్రా—ఫలహారమూ లేదు, వాడిశ్రాద్ధమూ లేదు. ప్రొద్దున్న యీవకీలు నూరురూపాయలు యిస్తామని బేరంపెట్టినాడు. తహశ్శీల్దారు రెండువందల రూపాయలు తెమ్మన్నాడు. బేరంకుదిరినది కాదు. ఇప్పుడేదో ఫరిష్కారం చేసుకుని వస్తాడు.

హేడ్డు—సాక్ష్యం అయిపోయింది. ముద్దాయీ మేజస్ట్రేటువద్ద యిదివరకే యొకరారుపడ్డాడు ఇక యింకేమి చేస్తారు?

గుర్రా—యేమిచేస్తారో మీరేచూస్తారు. యజమానే రూపాయీ అర్థాలు చంపుచేసుకొంటూవుంటే యిక క్రిందివాళ్ళకు యేమి వొరుకుతుంది?

సే—వెనుకటి తహశ్శీల్దారుగారు లంచంపుచ్చుకొనేవాడు కాడుకదా? మీపని అప్పుడే బాగుండేదా?

గుర్రా—వాడు మరీచండాలపు ముండాకొడుకు. ఇక్కడవున్న నాలుగునెలలూను మమ్మల్ని వేపుకొనితిన్నాడు. తానూ లంచం తినేవాడుకాడు; తాబేదారులు తిన్నా సహించేవాడుకాడు.

సే—తహశ్శీల్దారుగారు వస్తూవున్నారు నూరుకోండి.

తహ—(ప్రవేశించి) మీరింకాసాక్షినేమైనా అడ్డుగవాళ్ళు వేస్తారేమో వెయ్యండి.

వకీ—నీవిందాకా సాక్ష్యం చెప్పినప్పుడు తాగివున్నావే.

సాక్షి—నేను తాగివుండలేదు.

తహ—అదుగో అబద్ధం చెపుతూవున్నావు. మేజస్ట్రీటువారు స్వయంగా చిత్తగిస్తూవుంటేనే అబద్ధమాడుతూవున్నావు.—తియ్యవయ్యా పినాల్కోడ్డు సెక్షన్ తియ్యండి. తాగి వళ్ళు తెలియకుండా వున్నందుకు శిక్ష వేస్తాము.

సాక్షి—లేదండి. లేదండి.

తహ—నిజంచెప్పావో క్షమిస్తాము. నీవు తాగివున్నావా లేదా?

సాక్షి—చిత్తం. తాగివున్నానండి.

తహ—గుమాస్తాగారూ వ్రాయండి. సాక్షి చెప్పినసంగతి,— వకటోముద్దాయి యింట్లో వస్తువులుపట్టుపడడం నీవుచూడలేదు కాదా?

సాక్షి—చూడలేదండి.

తహ—స్మారకం తప్పివుండడంచేత అలాగున చెప్పినానేకాని నేనుచూడలేదని వ్రాయండి.—రెండోముద్దాయి యింట్లోనా వస్తువులు పట్టుపడ్డవి?

సా—అవునండి.

తహ—ఇక సాక్ష్యం అక్కరలేదు. ఒకరు ముద్దాయిమీంద ఋజువుకాలేదుగనుక అతణ్ని విడుదలచేసి రెండో ముద్దాయిని జనరల్ డిప్టీకలెక్టరుగారివద్ద కమ్మిట్టుచేసినాము.

హెడ్డు—ముద్దాయి తమవద్ద నేరంవప్పుకున్నాడండి.

తహ—అతను బుద్ధిపూర్వకంగా వప్పుకోలేదు. ఏమోయి వెంకన్నా! నీవు మొన్న మావద్ద నిస్వబుద్ధిచేతనే నేరంవప్పుకున్నావా?

వెంక—లేదండి. నేనేమీ నేరంచెయ్యలేదండి. నేరంచేసి నట్టు వప్పుకుంటే క్షమించి వదిలిపెడుతారని కనిష్టేబుగారు చెపితే వాళ్ళనమన్నమాట లన్నానేకాని నే నిందులో యేమీయెరగను.

తహ—సరేబాగా నేవున్నది. నిన్ను విడుదలచేసినాముపో. మే మిారోజును కోర్టు ముర్తబుచేస్తాము. [అందఱును వెళ్ళుచున్నారు.]

---

## ౨. ప్రదేశము—డిప్యూటీకలెక్టరు కచేరీ.

[హెడ్డుకనిష్టేబిలు, ముద్దాయిలు, సాక్షులు, మఱి యిద్దఱుకనిష్టేబిలులు, ప్రవేశించుచున్నారు.]

హెడ్—డిప్టీకలెక్టరుగారు ఏ వ్యాళ్యైనయినా మనకేజు విచారిస్తారో మళ్ళియేవ్యాళయినా రమ్మంటారో.

వీర—యేమికేజోకాని తిరగలేక చచ్చిపోతున్నామండి. నేటికి పదిహేనురోజులనుంచి యీవూరునుంచిఆవూరూ ఆవూరునుంచియీ వూరుతిప్పుతూవున్నారు. పోయిన సొమ్ము రాకపోయినామాబాగుగాని యింతటితో వదిలిపెడితే వెళ్ళిపోదామని వున్నదండి. ఇంటికాడ పొలాలకు నీళ్ళులేక యెండిపోతూ వుంటవి. నేనువెళ్ళి డెల్టానూప రెండెంటుగారికి మామూలు యిచ్చుకుంటేనేకాని నీళ్ళుయివ్వరండి.

సో—ఆయనకు మీ వ్యాళ్ళోరహితులందరూ ప్రతిసంవత్స రమూ మామూలుయిస్తారా?

వీర—అది యివ్వకతప్పదండి. వకరు యివ్వకపోయినా నీరు వదలిపెట్టరండి. మేము అర్జీలుయిస్తూవుంటే యెప్పుడో వకప్పుడు అధాత్తుగా నీరువదిలిపెట్టి మేము కాలవ చేసుకోని నీరు పెట్టుకోవడానికి సిద్ధమయ్యేటప్పటికల్లా కాలవకట్టిపెడతారండి. కిందటి సంవత్సరం వెల్లాసూపరెండెంటు విస్తారంసొమ్ము యిమ్మని మరీ యిబ్బంది పెట్టినాడు. వడలేక అందరమూచేరి వదిరూపాయలసొమ్ము లాకు కళాసువాడిచేతిలోపెట్టినాము. వాడు రాత్రివేళ పంటకాలవ గట్టుకుబొక్క పెట్టి కాలవతెగిపోయిందని మరునాడురిపోర్టుచేసినాడు. కాలువగట్టువేసేలోపుగా మూణ్నాళ్ళ మావ్యాళ్ళవాళ్ళందరూ మనసువచ్చినట్టు నీళ్ళు పెట్టుకున్నారు.

[ఒక వకీలు ప్రవేశించుచున్నాడు.]

సో—ఏమండీ! మీ శేద్దినా కేజుల్లో వకాల్తుగామూ పుచ్చుకొన్నారా?

వకీ—అవునండి. వకచిన్నఫిర్యాదు చెయ్యడానికి నాలుగు మకాములనుండి తిరుగుతూవున్నాను. వకాల్తుగామూ పుచ్చుకొని ఫిర్యాదు దాఖలుచేసుకోకుండావున్నారు. డిష్ట్రిక లెక్టరుగారి బంధువుడొక వకీలున్నాడు. ఆయన దాఖలుచేస్తేనేకాని ఫిర్యాదు ఒకపట్టానపట్టరు.

సో—ఈయన లంచాపుచ్చుకుంటూరా?

వకీ—లంచం పట్టరుకానండి రహితులవద్దపుట్టిపది హేనురూపాయలు అమ్ముతూవుంటే వదిరూపాయలకాడికి ధాన్యం జట్టీపుచ్చుకుంటూరు. కూరలూకాయలూమాత్రం యిస్తేపుచ్చుకుంటూరు.

ఈయనకు వ్యభిచారం మహావిస్తారం. అందుచేత కొన్ని కేజీలలో కేవలం అన్యాయంచేస్తారు.

హే—మీరు తహశ్శీల్దారుకచేరీలో ప్రయివేటు వకాల్తీపని చేస్తారుగాదా?

వకీ—అక్కడా యీలాగే దేవుళ్ళాడుతూవున్నది. మీ కేజులో ముద్దాయీతరఫున పనిచేసిన వకీలుయందు తహశ్శీల్దారుగారికిష్టము. అతనే అయనకు లంచాలూ పంచాలూ మాట్లాడుతాడు. అంతేకాకుండా అతను తెనుగుఅక్షులు రెండుముక్కలూ చదువుకున్నాడు. ఆకచేరీలో యిద్దరు వాలంటర్లువున్నారు. వాళ్ళదస్తూరీని వుంటేనేకాని తహశ్శీల్దారుగారు మేజస్ట్రీటు అర్జీగానిరివిన్యూ అర్జీగానిపట్టరు. వాళ్ళు యెంతచిన్న అర్జీ అయినాగా రూపాయకు తక్కువైతే పుచ్చుకోరు. వాళ్ళు కచేరీగుమాస్తాలపనిఅంతావూరికేచేసి పెడతారు.

హే—అదుగో డిప్టీకలెక్టరుగారువీధిలోకివచ్చినారు. వీరన్నా! నీసంగతి పెళ్ళి మనవిచేసుకో.

వీర—అదుగోబంట్రోతు యీలాగే వస్తూవున్నాడు. డిప్టీకలెక్టరుగారేమో చెప్పగున్నట్టున్నారు.

[బంట్రోతు ప్రవేశించుచున్నాడు]

బంట్రో—డిప్టీకలెక్టరుగారు యెల్లుండి పెనవలిముకాములో మీ కేజు విమర్శిస్తామని సెలవు దయచేసినారు. సోమవారం పది ఘంటలకు మిమ్మల్నందర్నీ అక్కడహాజరు వుండుమన్నారు. అక్కడ పాకలువేయించవలసినదని యిదివరకే గ్రామమునసబు పేర హుకుం వ్రాయించినారట. పొండి. (అందరును వెళ్ళుచున్నారు)

---

## 3. ప్రదేశము—పొలములోనిపాక.

[డిప్యూటీకలెక్టరుగారున్, గుమాస్తాలు మొదలగువారును ప్రవేశించుచున్నారు]

కలె—ఎవరయ్యా! అక్కడ అలా అరుస్తూవున్నారూ?

గుమా—మనవాళ్లేమో పొలములోనుంచి దోవపెట్టి పయిరు నలగత్రొక్కి వేస్తూవున్నారని కాపులు మొత్తుస్తూవున్నారండి.

కలె—బంట్రోతునుపిలిచి గాడిదకొడుకులను చితకగొట్టుమను.

గుమా—చిత్తము.—ఏమోయి బంట్రోత్! వాళ్ళను దూరముగా సాగనంపిరా.

కలె—వీడెవడు యీమూలనిల్చుని కేకలువేస్తున్నాడు?

గుమా—వీడు బోయీలమేస్త్రీఅండి. తమరు పడవకాడినుంచి సవారీలోవచ్చినందుకు భత్యఖర్చు కావలెనంటూవున్నాడండి.

కలె—జమాదార్! యీలాంటివాళ్ళనందర్నీ లోపలికిరానిస్తూవున్నావు; వాణ్ని తక్షణం గెంటివెయ్యి. ఇంకొకపర్యాయం నీవు యిలాగంటివాళ్ళను లోపలికి రానిచ్చిన యెడల జరిమానా వేస్తాము సుమా?

జమా—చిత్తం మహారాజ్!—అరేభాంచోత్ అవతలికి ఫో.

కలె—మనము పడవమీదవచ్చినప్పటికీ, ఆచార్జీ వెయ్యక క్రమప్రకారం మయిలేజిన్ని భత్యాన్ని వేసి బిల్లుతయారుచేసి సొమ్ము వేగిరం డ్రా చెయ్యవయ్యా.

గుమా—చిత్తము. మనము యెక్కివచ్చినందుకు పడవవాళ్ళకేమైనా యివ్వవలెనాండి?

కలె—యేమీ అక్కరలేదు. మేము పడవయజమానితో మాట్లాడినాము. పడవ గుమాస్తాతో మనము ఫ్రాంకేవచ్చినట్టు

రిమార్కు వ్రాయవద్దని చెప్పు. అసలు మనము పడవమీద యెక్కి నట్లే చిఠాలో వ్రాయవద్దను.—జమాదార్! మేజస్ట్రేటు జవాబుని వీసుగారిని పిలువు.

జవా—అయ్యా! వస్తున్నానండి. (అని వచ్చుచున్నాడు)

కలె—మొన్నటి కేసవరం గ్రామం తాలూకు చోరీ కేసులో సాక్షులు మొదలయినవాళ్ళు హాజరువున్నారేమో కేక వేయించండి.

జవా—జమాదార్! వెళ్ళి కేక వెయ్యి.

జమా—అదుగో పరుగెత్తుకొని వస్తూవున్నారండి.

[హెడ్డు కనిష్టేబిలు మొదలగువారు ప్రవేశించుచున్నారు]

కలె—ఏమోయి సాక్షులు! మీరింత ఆలస్యంగా వచ్చినారు. కోర్టుయెదుట హాజరువుండనక్కర లేదూ? మీకు బొత్తిగా భయం లేకుండావున్నది. మీకు మనిషి వక్కంటికి రెండేసిరూపాయలు జరిమానా వేసినాము.

సాక్షు—మీరెక్కిన పడవతోనే మాపడవా బయలుదేరిందండి. మొదట సప్లయిగుమాస్తా మనిషివక్కంటికి పావలాచొప్పున రేటునిర్ణయించి మమ్మలిని పడవలో యెక్కించినాడండి. కొంత దూరం పడవ గోదావరిలోకి వచ్చినతరువాత పడవ గుమాస్తావచ్చి అర్ధరూపాయచొప్పున వసూలుచేసినాడు. తీరాలాకుదగ్గిరకు వచ్చేటప్పటికి అన్ని పడవలు వస్తేనే కాని తలుపులుతియ్యనంటూన అక్కడ కొంత ఆలస్యమయినదండి. తరువాత మకాములలో తాములాగే కళాసులు వేళకు హాజరులేక కొంత ఆలస్యమయినదండి. ఇక లాకు మయిలుదూరములో వుండగానే సగముమంది మనుష్యులను పడవలో నుంచిదింపి యెవరైనా అడిగితే మేము పడవలో రాలేదని చెప్పుమని గుమాస్తా సరంగూ మాఅందరితోనూ చెప్పిపెట్టినారు. ఆలాగు కళాసుతాలూకు బంధువుడికి యెప్పుడో పూనికే గదియిచ్చినారు

కారని, ఆకోపంచేత వేగిరం లాకుతలుపులు తియ్యక పడవ తనిఖీ చేస్తామని కొంతసేపు నిలిపి చివరకు వదిలిపెట్టినాడు. లాకు దాటిన తోడనే దిగిన మనుష్యుల నందఱినీ మళ్ళీ పడవలో యెక్కించుకొన్నారు. అప్పుడు మా గుడిసేటిది పడవ యెక్కడానికి వచ్చినందున మాపడవవాళ్ళూ మా వెనుకవచ్చిన పడవవాళ్లూ తమపడవలో యెక్కమంటే తమ పడవలో యెక్కమని పోటీలకువచ్చి చివరకు కేవులేకుండా మేము యెక్కిన పడవలోనే గుమాస్తాగదిలో కూర్చుండబెట్టుకొన్నారు. పడవలో గుడిసేటిది యెక్కడంచేత ఖులాసాపుట్టి తాడులాగేవాళ్లు బూతు 'అంబా' పాడుతూ లోపల చాలామంది సంసారస్త్రీలున్నా లక్ష్యముచేయక పడవను కొంచెము వడిగా లాగినారు. చీకటిపడ్డతరువాత గుడిసేటిదానికి యివ్వడానికి మధ్యమతరములలో యెక్కినవారి తాలూకు చిత్రాలో జనుకట్టకుండా వున్నసొమ్ము పంచుకోవడములో గుమాస్తా సరంగూ పోట్లాడి పడవ రెండుగడియలు కట్టిపెట్టినారు. అది అంతాఅయి పడవసాగించి గుమాస్తానూ సరంగున్నూ వకటువిడిచి వకరు గదిలోచేరి తంటాలు పడుతూవుండగా లాకుసూపరింటెండెంటు తాలూకు నలుగురు బంధువులకు గదిలో స్థలం యివ్వవలసినదని కళాసువకము తీసుకుని వచ్చినాడు. ఆగుడిసేటిదాని కెక్కడా ప్రత్యేకంగా గదిదొరకక హాలులో మనుష్యులను లేవదీసి టాపుమీదికి పంపి దాన్నక్కడ కూర్చుండబెట్టి లాకుసూపరింటెండెంటు బంధువులకు తమగది యిచ్చినారు. అలా యివ్వకపోతే అతనులాకులు పడవ తగిలిందని రేంజి ఆఫీసరుకు రిపోర్టువ్రాసి పడవతెరుగకుండా యిరవైరోజులు కట్టివేయిస్తాడట. ఈ అన్ని కారణముల చేతనూ మా పడవ యిప్పుడే వచ్చినది అండి. దిగుతూనే భోజనముసహితం చెయ్యకుండా పరుగెత్తుకొని వచ్చినామండి. హెడ్డు కనిష్టిబిలుగారు కూడా యిప్పుడే భోజనం

చేసి ఖయిదీలను తీసుకొని వస్తూవుండగా దోవలో కలుసుకున్నామండి. ఈసారికి జరిమానా మాపు చెయ్యవలెనండి.

కలె—మేము మాపుచేసేదిలేదు. మీరు యిందులో బుద్ధిపూర్వకంగా ఆలస్యం చేసినారు. మీకు యింకా జరిమానా యెక్కువ వెయ్యవలసినదే.

సాక్షు—లేదండి క్షమించవలెను. మొన్నమీరు-మకాములో యెల్లుండికి పెరవలి మకాములో హాజరు కావలసినదని సెలవిచ్చినారు. వెంటనే పడవయెక్కి నిన్న పన్నెండు ఘంటలకు రాజమహేంద్రవరములో దిగి వంటకూటియింట్లో తిన్నగా మెతుకైనా నోట్లో వేసుకోకుండా మళ్ళీ పడవయెక్కి దిగుతూనే కచేరీకి హాజరైనామండి. ఇందులో మా ఆలస్యం యేమీ లేదు.

కలె—అదుగో మేము ఘట్టిగా మీలోపంవున్నదంటే లేదంటూవున్నారు. మీకు నాలుగేసిరూపాయలు జరిమానా వేసినాము.

సాక్షు—చిత్తము మహాప్రభో. మా దేతప్పితే క్షమించవలెను.

కలె—జవాబులిపీసు గారూ! సాక్షులను ప్రమాణం చేయించి వాంగ్మూలాలు పుచ్చుకోండి. సబు మేజస్ట్రీటు ముద్దాయీని మళ్ళీ పట్టుకుని పంపించమని వుత్తరపు చేసినాము. ఆముద్దాయీ హాజరుగా వున్నాడు కాడండీ!

జవా—అయ్యా! ఇప్పుడు హాజరుగావున్నాడండి. వెనుక అందుచేతనే యీ కేజు నాలుగుమాట్లు పోస్టుపోనులు చేసినామండి.

కలె—మాకు మళ్ళ వేగిరం ఇంటికి వెళ్ళవలసివున్నది. సాక్షి వక్కంటికి లెఖ్ఖ రెండేసి ప్రశ్నలు వేసి అతిశీఘ్రముగా కేజు క్లోజు చెయ్యండి.

జవా—చిత్తము—ఓయికనిస్టేబిల్! మొదటిసాక్షిని యిక్కడ వుంచి తక్కినసాక్షులను అవతలికి పంపు.

(కనిస్టేబిలాప్రకారముగా చేయుచున్నాడు.)

జవా—(సాక్షిని ప్రమాణము చేయించుచున్నాడు.)

హే—వీరన్నా! ఈకాపుల్లు మనము సోదాచేసినప్పుడు అతని పెట్టెలో మీ కాలూగ సొత్తేమయినా దొరికినదా?

వీర—దొరికినది. వకచీర దొరికినది.

హే—ఇంకా యేమైనా దొరికిందా?

వీ—వెండికడియాలజత దొరికింది.

హే—తరువాత వెళ్ళిలో యేటప్పుడు—

వీర—పత్తివిత్తుల గంపలో బొమ్మసామానులు దొరికినవి.

వకీ—నేను క్రాసు యగ్జామిను చేస్తానండి.

కలె—నీకేమీ లా తెలియునువున్నాదనో వచ్చు.

వకీ—ఆబుమేజస్ట్రీటుగారివద్ద ఇచ్చినవాంగ్మూలం చిత్తగిస్తే యీ సాక్షియొక్క నిజం బయులపడుతుందండి.

కలె—చిత్తగిస్తాము—జవాబునివీసుగారూ! యీసాక్షి కమిట్టింగు మేజస్ట్రీటు వద్ద యిచ్చిన వాంగ్మూలం చదవండి.

జవా—(చదువుచున్నాడు.)

కలె—నీవక్కడ చీరె మీదికాదని చెప్పినావు. ఇక్కడమీదే అని చెపుతూ వున్నావు. ఇందులో యేదినిజము?

వీర—తరువాత నాపెళ్ళాన్ని కనుక్కున్నాను చీర మాదే నండి.

కలె చాలును. రెండువిధాలుగా సాక్ష్యం చెపుతూవున్నాడు. యీ సాక్షిని పహరాలోవుంచి రెండోసాక్షిని పిలువు.

[కనిస్టేబిలు రెండవసాక్షిని తీసికొనివచ్చుచున్నాడు.]

జవా—ఓయిసాక్షీ! ప్రమాణవచనములను చెపుతాను మళ్ళీ చెప్పు.

సాక్షి—చిత్తము. (అని ప్రమాణముమీద నెంతమాత్రము హెచ్చుతగ్గు లేకుండ కిందికోర్టులో చెప్పినట్లే సాక్ష్యము చెప్పుచున్నాడు)

కలె—మేము సాక్ష్యమంతా చిత్తగించగా, యీసాక్ష్యం యింతమాత్రమూ నమ్మతగ్గదైనదిగా కనుపడడంలేదు. మొదటి సాక్షి రెండుసార్లను రెండువిధాలుగా చెప్పినాడు. రెండవసాక్షి పట్టిక్రాగుబోతు. కనుక ఖయిదీలనిద్దరినీ విడుదల చేసినాము. తప్పుసాక్ష్యం యిచ్చినందుకు వకటోసాక్షికి మూడుమాసములు కఠినమైన ఖయిదుశిక్షను విధించినాము.

[అని తీర్పువ్రాసివినిపించి కోర్టు మర్తుబుచేయుచున్నారు.]

---

## ౮. ప్రదేశము—కలెక్టరుకచేరీపాక.

[స్టేంషనుకనిష్టేబిలు, వీరన్న, ఎఱుకలవాండు మొద లయినవారు కూరుచున్నారు.]

స్టేం—కలెక్టరుగారు బసకువెళ్ళినారు. పాపం నీకుగొప్పఆపద వచ్చింది.

వీర—(ఏడ్చుచు) యిదంతా మీమూలంగా వచ్చిందండి. నేను సబుమేజస్ట్రీటు గారివద్ద చెప్పినట్టే సాక్ష్యం పలుకుతానంటే ఆగాకాదని నామెడలువిఱిచి యిలా పలికించినారు. పోలీసువారితో వాకలాగు చెప్పి ముద్దాయివద్ద యేమోపుచ్చుకొని యిప్పుడు మరివక విధముగా తిరిగిపోయి చెపుతూవున్నాడని డిప్టీకలెక్టరుగారితో చెప్పి శిక్ష వేయిస్తామని మీరు నన్ను బెదరించకపోయినట్టయితే నేనీలా

గాన పలకలేనే పోదను. మీరు బుక్కులో వ్రాసినది యిదివేటప్పటికి నాకు భయంవేసి మీరు పలుకమన్నట్లల్లా పలికినాను.

హే—నీకుయిప్పుడు వచ్చినఫర్వాలేదు. శెషన్ కోర్టులో అప్పీలు చేయించి వారంరోజులలో విడుదలచేయిస్తాను.

వీరం—యేమి విడుదల చేస్తారో గాని యిప్పుడు జయిలులోకి వెళ్ళడం తప్పదుగదా అండి.

సాక్షి—జయిలులోకి వెళ్ళడంతోనే సరిపోతుందనుకున్నావా? నీవు డబ్బుగలవాడవు నీవుపడేపాట్లు ముందుచూడవలెను. నీవు పల్లెటూరివాడవుగనుక తెలియక హేడ్డుగారు పలుకమన్నట్లల్లా పలికినావుగాని నేను కిందికోర్టులో పలికినదానికంటె యిక్కడ వకటీకరం హెచ్చుతగ్గుగా పలికినానేమోచూడు. యిదివరకు లక్షపాఠ్యాలు పలికినాను. నేను సాధారణంగా మోసపోతానా? యింటికాడ హేడ్డుగారితో అనుకూలంగా పలుకుతాననే చెప్పినాను. తీరా కోర్టుకు వచ్చినవేలాగు పలుకవలెనో అలాగేపలికినాను.

వీర—బాబూ! నన్ను జయిలులో నేమిచేస్తారండి.

ఎఱు—నేను వక పర్యాయం జయిలులోపడి వచ్చినాను. చెప్పతాను విను.

హేడ్డు—ఆరి గాడిద కొడుకా! నీవు జయిలులో పడ్డమాట నాకు తెలిసిందే కాదు. తెలిసివుంటే ఓల్డు అఫెండరు, అని చెప్పితే డిష్ట్రిక్టు కోర్టులో నిన్ను తప్పకుండా శిక్ష వేస్తురు.

ఎఱు—పదిహేనేళ్ళకిందట నిష్కారణంగా యిప్పుడున్న కరణం తండ్రి నసకు యీతబెత్తాల పాణక వేగిరంఅల్లి పెట్టినానుకానని కోపంవచ్చి, అప్పుడువూళ్ళోయేదో దొంగతనం జరిగితే నామీద పెట్టి రెండేళ్ళు వరకం వేయించినాడండి.

వీర—(క్రిందుచూచుచు విచారముతో) అప్పుడు నీవేమి నాచినావో చెప్పు.

ఎఱు—నేను జయిలలోవున్న కాలంలో ఫోర్జరీచేసినందుకు వక కరణం ఖయిదులో పడ్డాడు. వార్డరులా బ్రాహ్మణ్ని వేపుకుని తిన్నారు. ప్రతివార్డరు వాడికీ నెలకు రెండేసి రూపాయలుమామూలు చేసినాడు. అది కండా మధ్యమధ్య వాళ్ళడిగినప్పుడల్లా యేమైనా యివ్వకపోతే పొగచుట్టవుందనీ నల్లమందువుందనీచెప్పి జయిలరు వద్దకు తీసుకునివెళ్ళి మాకోణంకట్రకు కట్టించి రెండేసిడజనులూ మూడేసిడజనులూ కొట్టించేవారు. అప్పుడున్న జయిలరుకు కూడాజీతం కొంచెము. అతనికేమైనా యిస్తే వార్డరులను కూకలువేసి వూరు కుండేవాడు. లేకపోతే యెవరికేపడితే వారిని డజను బాజీ కొయించేవాడు. అదికాక ఆబ్రాహ్మడివద్ద నెలకు జయిలరు ఫదిరూపాయలు ప్రత్యేకంగా పుచ్చుకునేవాడు.

వీర—డబ్బుపుచ్చుకుంటే పుచ్చుకునేవారుగాని, ఆబ్రాహ్మడికేమైనా సదుపాయంచేసేవారా?

ఎఱు—వాళ్ళడిగినట్టల్లా డబ్బిస్తే కావలసినంత సదుపాయం చేస్తారు. చుట్టత్రాగనిస్తారు; నల్లమందు రహస్యంగా తెచ్చి యిస్తారు; కఠినపని లేకుండా చులకనిపనిలో పెట్టి ధారవచ్చినప్పుడు మాత్రము పనిచేయిస్తూవుంటారు. డబ్బుయేమీ యివ్వకపోతే మట్టి తట్టలుమోయించడం మొదలైన కఠినమైన పనులలో పెట్టి తిన్నగా పని చెయ్యడంలేదని కొట్టిస్తారు.

వీర—పనిబొత్తిగా చెయ్యకుండావుండే సదుపాయంలేదా?

ఎఱు—విస్తారండబ్బుయిచ్చి డెస్సరును కట్టుకుంటేఖాయిలా అని ఆసుపత్రిలో పెట్టి బొత్తిగా పనిలేకుండాచేస్తారు.

వీర—ఇప్పుడు జయిలులోకి వెళ్ళడంతోనే మొట్టమొదట యేమిచేస్తారు?

ఎఱు—వెళ్ళడంతోటే కొంచెం జుట్టువుంచి తల సాపుసీదాగా గొరిగివేస్తారు. తరువాత సీబట్టలు మొదలయినవి తీసివేసి చహారా వేసి వాళ్ళబట్టలుయిచ్చి కాళ్ళకు సంకెళ్ళజోడు తగిలిస్తారు.

వీర—అన్నం యెవరువండి పెడతారు?

ఎఱు—యెవరో ఖైదీచేతనే వండించి పెడతారు. క్రొత్తగా వెళ్ళినవాళ్ళకు వెనుకటివాళ్ళుతిని వెళ్ళిపోయిన మూకుడుఇస్తారు. రోజూ ఆమూకుట్లోనే అన్నము తినవలెను.

వీర—ఇఖఃలాగైతే కులంపోతుంది—స్వామిగారూ! నన్నేలాగైనా విడుదలచేయించే సదుపాయంచేస్తురూ.

హే—నీకేమీ ఫర్వాలేదు. మీవాళ్ళకు వుత్తరంవ్రాసి యేమైనా వందరూపాయలు తెప్పించు. మేమే వకీలునుకుదిర్చి శెష్షన్‌కోర్టులో అప్పీలుచేయించి వక్కదెబ్బలో విడుదలచేయిస్తాము.

వీర—అస్సెస్సరులచేతులలో యేమైనాపెట్టి విడుదలఅయ్యే యెత్తు చెయ్యగలరా? మా అన్నగారు అసెస్సర్‌గావుండి రెండు కేజులలో రెండుఫదులు సంపాదించినాడు. సొమ్మిస్తే ఖైదీ నేరస్తుడు కాడనేవాడట. సొమ్మివ్వకపోతే ఖయిదీ తప్పకుండా నేరంచేశాడు శిక్ష వెయ్యమనేవాడట. జడ్జీ విమర్శచేసేటంతసేపూ బల్లమీద కూర్చుండి కునికిపాట్లుపడేవాడట.

హే—మీఅన్నకు అస్సెస్సరుపని వున్నదా?

వీర—మాఅన్నకు వక్కడికేకాదండి. మాగ్రామమునకు చుట్టుపట్లవున్న పల్లెటూళ్ళల్లో చదువురాని కాపులు ఇరవైమంది అస్సెస్సరులుగావున్నారు. వాళ్ళందరూ యేటా పాతికరూపాయలకు తక్కువలేకుండా సంపాదిస్తారు.

హే—అసలు కేజులలోనేకాని అప్పీలు కేసులలో అస్సెస్సర్లుండరు. అస్సెస్సర్లు వూరికే కూర్చోవడమేకాని వాళ్ళకు యేమీ తెలియదు. అందుచేత జడ్జీవాళ్ళమాటవినడు. ఐతే జూరీకేజులలో మాత్రము వినకతప్పదు. అలాగంటప్పుడు మీకాపులు జూరీలుగా పడితే వాళ్ళనుబెదరించి మేము ఖయిదీనేరస్థుడని చెప్పించి పట్టుదల కేజులలో శిక్షవేయిస్తాము.

వీర—ఐతే నామాట యేమిసెలవిచ్చినారు?

హే—అస్సెస్సరులకు లంచం అక్కరలేకుండానే మేము ఆకార్యం సరఫరాచేస్తాము. ఆఅస్సెస్సర్లకిచ్చేసొమ్ము నాచేతిలో

పెడుమా. కార్యంఅంతా నేను జాగ్రత పెట్టి నిన్ను వాగమురోజు లలో పిడుదలచేయిస్తను. కాంవతెగిపోయి పడవలు కట్టివేసినారు. మనమిప్పుడే బయలుదేరి రాజమహేంద్రవరం వెళ్ళవలెను.

వీర—ఇప్పుడేనాండి ప్రయాణము ?

హే—ఇప్పుడేప్రయాణము—ఓయికనిస్టేబిల్ ! ఖయిదీకి అర దండాలువేసి జాగ్రతగా తీసుకుపోండి. మేజస్ట్రీటు జవాబునీసుగారి వద్ద వారంటుతీసుకొని నేనున్నూ మీ వెనుకనే వస్తాను.

వీర—బాబూ! నాకరదండాలు వెయ్యకొండా తీసుకువెళ్ళండి. మీకుదణ్ణంపెడతాను.

హే—అరదండాలు వెయ్యడం సర్కారురూల్సు. వెయ్య కుండా తీసుకువెళ్ళడముకు వీలుపడదు.

వీర—అలాగైతే వూరుదాటేవరకైనా యీలాగు తీసుకు వెళ్ళండి. తరువాత అరదండాలు వేసుకుంటాను.

హే—సర్కారురూల్సుకు పబ్లికు వుద్యోగస్తుడనై వుండీ వ్యతి రేకం చెయ్యడం గొప్ప తప్పితం. అలావల్లపడదు.

వీర—నావద్ద భత్యఖర్చుకు తెచ్చుకున్న తాలూకు రెండు రూపాయలున్నవి. అవి యిచ్చుకుంటాను. వూరికే తీసికొని వెళ్ళండి. యీ వూళ్లో మా చుట్టాలువున్నారు. వాళ్ళుచూస్తే నాకు మహా పరువుతక్కువగా వుంటుంది.

హే—నీచెవుల బంగారుపోగులుకూడా యిస్తే ఇప్పుడు నీ మానుషం దక్కించి వూరు దాటిందాకా అరదండాలు లేకుండా తీసుకువెళుతాము.

వీర—అలాగే పుచ్చుకోండి. నా ఆబూరీమాత్ర దక్కించ వలెను.

హే.—ఓయికనిస్టేబిల్ పూ౯బైటదాకా ఇతణ్ని ఇలాగే తీసుకునివెళ్ళి అక్కడ పోగులజతె జాగ్రత్తగా వూడదీసి నేను వచ్చేదాకా నీవద్దవుంచి అరదండాలు తగిలించి కాలవగట్టుమీద నేరేడుచెట్టుక్రింద పెట్టుకుని కూర్చో. నేనింతలోవచ్చి కలుసుకుంటాను.

[అందఱును వెళ్ళుచున్నారు.]

సంపూర్ణము.

---

బాక్సు ప్రెస్, రాజమండ్రి.

# తిర్యగ్విద్వన్మహాసభ.

&

# మూషకాసురవిజయము.

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

**1950**

## ఈ నాటకమునందువచ్చు పాత్రములు.

—:o:—

కామధేనువు—మృతినొందినగోవు.

వత్సము—కామధేనువుబిడ్డ.

అశ్వపతి—కామధేనువు మిత్రుడు.

గోదేవి—కామధేనువు చుట్టము.

వృషభేంద్రరావు—కామధేనువు బంధువు.

మహేశ్వరుడు—కామధేనువు మిత్రుడు.

భైరవమూర్తి—కామధేనువు భృత్యుడు.

కొంక నక్కదీక్షితులు—ఒక సభాపతి.

రామబంధూశాస్త్రి—ఒక సభాపతి.

మార్జాలపంతులు—కామధేనువు భృత్యుడు.

గార్ధభేంద్రశాస్త్రి—కామధేనువు బంధువైన విద్వాంసుడు.

బక సోమయాజులు—ఒక సభాపతి.

వ్యాఘ్రావధానులు—ఒక సభాపతి.

వరాహభట్టు—ఒక సభాపతి.

ఆంజనేయశర్మ—ఒక సభికుడు.

మర్కటశాస్త్రులు—ఒక సభికుడు.

తిమ్మన్నచయనులు—ఒక సభికుడు.

మల్లుభట్లు—ఒక సభికుడు.

## మూషకాసుర విజయము.

మూషకభట్టరు—ఒక పందికొక్కు.

శశకపతిరావు—ఒక కుందేలు.

మూషికాంబ—మూషకభట్టరు భార్య.

# తిర్యగ్విద్వన్మహాసభ



కామధేనువును, వత్సమును.

## ౧౦౪ము — మహారణ్యపురము

[వృషభేంద్రరావుగారును, గోదేవిగారును, అశ్వపతిగారును, మహేశ్వరుడుగారును, ప్రవేశించుచున్నారు.]



అశ్వపతిగారు



గోదేవిగారు

అశ్వ—వృషభేంద్రరావుగారూ! మీరు అదేపనిగా దుఃఖపడి యేమి చెయ్యగలరు? వెయ్యేళ్ళు యేడ్చినా పోయిన కామధేనువు మళ్ళీ లేచిరాదు. మనమందరమూ దురదృష్టవంతులముగనుక కామధేనువునక కాలమరణము సంభవించినది. ఆసాధుత్వమూ, ఆధైర్యము ఆదానశీలత యేఆవుదగ్గరనైనా వున్నవా? కామధేనువుపాలు తాగి యెందరు బ్రతికేవారు! మనభైరవమూర్తి నేటివరకూ ఆవుపాలతోనే బ్రతికినాడుగదా? మార్జాలపంతులు ఆవుపాలతోనే బ్రతుకలేదా? యింకా యెందరు పాలుత్రాగేవారు? యెందరు పెరుగుతాగేవారు!

యెందరు మజ్జిగ పోసుకొనేవారు? యెందరు వెన్నతినేవారు? యెందరు నెయ్యితాగేవారు? యెందరు జున్నుతినేవారు? ఇదంతా మనకిప్పుడే స్వప్నమయిపోయింది. దుఃఖంమాని యిక మనం బ్రతికియున్నవారి గతి చూడవలెను. పాపము! పోయినతల్లిదగ్గరనుండి లేగదూడ యే ప్రకారం యేడుస్తూవున్నదో చూడండి, మీరాయన్న గోదేవిగారున్న దాన్ని నోదార్చి ఆదరించవలెను. యిప్పుడు బంధువులయిన మీకెంత దుఃఖముగావున్నదో స్నేహితులమైన మాకున్ను అంతకంటె యెక్కువ దుఃఖముగానే యున్నది.

గోదేవి—అయ్యో! దీనులకోరికలను కొనసాగించే కామధేనువు పోయినతరువాత మేము యెట్లా యేడవకుండా వుండగలము? యిక మమ్మలిని పోషించే దిక్కెవ్వరున్నారు? ఓకామధేనువా! నీగుణాలు తలుచుకుంటే దుఃఖం పొర్లిపొర్లివస్తూవున్నది.



వృషభేంద్రరావుగారు.

వృష—ఓకామధేనువా! లోకములో మమ్ము వంటరిగాళ్ళను చేసి పోయినావా! ఇదివరదాకా నీప్రాపుమాకు వుండడంచేత పెద్దపులులయినా మావంక తేరిచూడడానికి భయపడుతూవుండేవి. నీవు లేకపోవడంచేత నక్కపోతులుకూడా మమ్ములోకువచేస్తవిగదా!

మేషే—అశ్వపతిగారూ! నక్కలంటే జ్ఞాపకం వచ్చినది. బ్రతికి



వున్నంతకాలమూ లోకోపకారముగా పెరిగిన యీశరీరమును నక్కలపాలూ రాబందులపాలూ కానియ్యగూడదని మునుపటినుండీ మా మిత్రమయిన కామధేనువు మనతో యెప్పుడూ యీసంగతే చెప్పుచున్నూ వుండడం మీరెరుగుదురుగదా?

అశ్వ—అవును మనలో యిదిపెద్దమహాచారంగా వున్నది. మనంగౌరవించేశరీరమును మనకళ్ళయెదుట నక్కలూ రాబందులూ పీక్కుతింటూవుంటే యెట్లాసహించగలము? ఈకళేబరమును తప్పకుండా దహనమేచేయింతాము.

వృష—అవశ్యంగా దహనమేచేయింతాము!

గోదే—"గోబ్రాహ్మణేభ్యః" అన్నాడుగనుక, వెనుకచెప్పిన బ్రాహ్మలకే అగ్నిసంస్కారం జరుగుతూవుండగా ముందుగాచెప్పిన గోవుల కెందుకుజరగగూడదు?

వృష—మనక్షైరవమూర్తిన్నీ మార్జాలపంతులున్ను సభాపతులను తీసుకుని వస్తూవున్నారు. వారితోఆలోచింతాము.



భైరవమూర్తి గారు.

[భైరవమూర్తియు, మార్జాలపంతులును, కొంకనక్క దీక్షితుల
తోను రామబంధుశాస్త్రితోను, ప్రవేశించుచున్నారు]

కొంక — ఏమయ్యా! వృషభేంద్రరావుగారూ! రాత్రిపడుతూ వున్నా యింకా శవాన్ని అట్టేపెట్టుకుని కూర్చున్నారు? వెంటనే సమాధి ప్రయత్నం చెయ్యండి.

వృష — మావాళ్ళు దహనం చెయ్యవలెనని ప్రయత్నం చేస్తూ వున్నారు. సభాపతులకేమీ ఆక్షేపణ లేదుకదా?

కొంక — మాకు కావలసినంత ఆక్షేపణవున్నది. పూర్వాచార విరుద్ధమైన కార్యం చెయ్యకూడదు.



కొంకనక్క దీక్షితులు గారు.

రామ— దహనంచెయ్యడమంత ఆక్షేపణార్హమైనపని మరి వకటిలేదు. ఎక్కడనైనా మనుష్యులకు దహనమున్నదిగాని గో జాతికి దహన మున్నదా?



రామబంధుశాస్త్రిగారు.



మార్జాలపండితులుగారు.

అశ్వ— అయినా యీసంగతి సభాపతులందరూ వచ్చినతరువాత ఆలోచించి యేమిచెయ్యడానికీ నిశ్చయించేదాము.

కొంక— ఇది ఆసభాపతులతో ఆలోచించనక్కరలేదు. ఇందులో మేమే ప్రధానులము. వ్యాఘ్రభూపుగారున్ను యేమయినా సరే అంటాడు. మాతోకలిసేవాడు. వరాహంభట్లున్ను బకసోమయాజులున్ను యీవిషయంలో ధర్మనిర్ణయం చెయ్యడానికి అర్హులుకారు.

రామ— ధర్మశాస్త్రాలు చూచిననేను సిద్ధాంతంగా చెపుతూ వున్నాను. ఈవిషయంలో దహనకర్మ యెంతమాత్రమూ వల్లపడదు.

కొంక— రామబంధుశాస్త్రి ఆలాగుదృఢంగాచెపుతూవున్నాడు గనుక ఖననకర్మకు శవాన్ని ప్రేతభూమికి తీసుకొనివెళ్ళే ప్రయత్నం చెయ్యండి.

రామ— యీరాత్రి యేకర్మా చెయ్యగూడదు. ధర్మశాస్త్రం చూడవలెను. తక్కిన సభాపతులంతా వచ్చినతరువాత రేపుపుద

యాన్న అందరితోనూ ఆలోచించి మరీచేతాను. పెద్దలుంతావుండగా స్వతంత్రించి యేపని చెయ్యడమూ భావ్యంకాదు. శవాన్ని తెల్ల వారిందాకా అట్టే వుండనియ్యండి.

కొంక—తెల్లవారిందాకా పీనుగుతో జాగారంచెయ్యడం కష్టం. పాపంవాళ్ళను చిక్కుల్లోపెట్టక యిప్పుడే కార్యం కానియ్యండి. వృషభేంద్రరావుగారూ! వాగ్దానం సిద్ధంచేయించండి.

రామ—వృషభేంద్రరావుగారూ! మీరింత తొందర పడకండి. నేను యిప్పుడే చెప్పనున్నాను. తొందరపడి సభవారి ఆలోచనలేకుండా చేస్తే వాళ్ళ చిక్కుల్లో పడి పోతారు. శాస్త్రం చూడవలెను. ఆ సమయం స్వలాభం కోసం చెప్పుతూవున్నాను గాని పరమార్థంగా చెప్పడంలేదు.

కొంక—నీవ్వునీలాభంకోసమే చెప్పుతూవున్నావు గాని పర మార్థచింతతో చెప్పుతూవున్నావా? పీనుగు యింట్లోవుండగా వాళ్ళ దుఃఖం భరించడం మహాకష్టం, వృషభేంద్రరావుగారూ! అనవి తెలివితక్కువ మాటలువిని మోసపోకండి. నేను యెంతసేపైనా వుండగలను. తెల్లవారిందాకా అట్టేవుంచితే యింటివాళ్ళు కొంపలు చల్లనీయరు మిమ్మల్ని వేపుకుతింటారు. సందేహం లేదు శవం వుండకూడదు. సరంజాం చేయించండి.

రామ—చేయించకండి. నాలుగేకులకు! మోటతనం చెయ్యకు, అవతలశాస్త్రమూ చూడవలెను! నికొంకసక్కచేష్టలుమాని పెద్దలువచ్చిందాకా ఓపికపట్టు. ఘంటస్తనమే కాని నీకు శాస్త్రం యేమీ తెలియదు.

కొంక—ఓరి పండుకుంటా! పురోహితానికే యిదిపనికి మేకాని నీకు మాత్రం మహాశాస్త్రం తెలిసినట్టు దిలే. నీవు పీనుగులను పీక్కు తినే పక్షివుండాకోడుకవు. నామాటకడ్డంరాకు.

రామ—నీనక్కజిత్తులు నాకు తెలుసును. మాకేమీ లేకుండా అంతా నీనోట్లోనే పడ వేసుకోవలెనని చూస్తూవున్నావు. నీవెన్ని కూతలు కూసినా పెద్దలంతా వుంటూవుండగా నీగంతులుసాగవు. నీవుమాత్రం పీనుగులను పీక్కుతినే ముండాకొడుకవు కావా?

కొంక—నక్కనోటగడ్డకొట్టి అంతా నీవేమింగవలెనని నీవు చూస్తూవున్నావు. నాదేహంలో ప్రాణంవుండగా నాకు లేకుండా నీకు దక్కనిస్తానా? నేను పీనుగులను పీక్కుతినే ముండాకొడుకునా?

వృష—మీరుయిద్దరూ పీనుగులను పీక్కుతినేవారే. ఆ మాటలు యిప్పుడెందుకు వూరుకోండి. అవతలకుపోయి పోట్లాడుదురుగాని యిప్పుడుశవం బయటకు వెళ్ళే సాధనం చూడండి. యెవరి లాభంనిమిత్తం వారు చూచుకోక వుభయులూకూడా న్యాయం విచారించండి.

కొంక—మీరు సెలవిచ్చినమాట బాగావున్నది. వృషభేంద్రరావుగారూ! చెవులోమాట. (రహస్యముగా) శవాన్ని తెల్లవారిందాకా అట్టేపెడితే రేపుతానూ తనబంధువులూవచ్చి తినవలెనని ఆపక్షిముండాకొడుకు ప్రయత్నం. శవాన్ని రాంబందులు పీక్కుతిననిస్తే బహుపాపము. బ్రతికినన్నాళ్ళూ గొప్పగా బ్రతికిన కామధేనువును, చచ్చినతరువాత పక్షులనోట్లో పడనియ్యకండి. నేనూ మీచతుష్పాదకోటిలోవాణ్ని గనుక, నాకడుపునిండితే యిహానికీ పరానికీకూడా లోపంలేదు. అంతేకాకుండా బంధుపోషణఫలం లభిస్తుంది. ఈకామధేనువు శరీరం బ్రతికినప్పుడూ చచ్చినతరువాతనూ కూడా బంధుపోషణమునకే వుపయోగపడుతుంది. (ప్రకాశముగా) మీలో వాహకులుగా వుండేవారెవరో లెండి.

వృష—(తనలో) ఓనిశాచరుడా! నీమనసులో యెంతపాపవు వూహ వున్నదిరా!

రామ—మీరాపనిమాత్రం చేయించకండి. ఆముండాకొడుకు మీవద్ద నక్కవినయాలు కనపరచి తుదకు నమ్మించి మోసంచేస్తాడు. వీడికివంచకమన్న పేరు స్వభావంగానే వున్నదికదా? వృషభేంద్రరావుగారూ! నక్కరహస్యము. (అని చెవిలో) యీరాత్రిమీరు పాతిపెడితే తనబంధువులైన నక్కలను గాలిగింటిసీ తీసుకునివచ్చి పెల్లగించుకొని తినవలెనని వీడిప్రయత్నం. వీడిమాట సాగనియ్యకండి. అపవిత్ర శరీరం నక్కలనోట్లో పడడంకంటె మా వంటి మహాద్విజుల గర్భంలో పడితే పుణ్యమూ పురుషార్థమూవున్నది.

కొంక—నీవు కూసేదేమిటో బిగ్గరగాకుయ్యి. నీశాస్త్రీలూ గీస్త్రీలూ తీసుకొనిపోయి తుంగలో ప్రారదొక్కు. నామాటకు అడ్డంవచ్చి అస్టే యెగిరిపడుతూ వున్నావంటే గొంతుక కొరికివేస్తాను.

రామ—నేనుశాస్త్రం వున్నదంటూవుంటే, పిడివాదంతో మొండితనంచెయ్యడం నీకుధర్మంకాదు. అదుగో గార్ధభేంద్రశాస్త్రిగారు పరామర్శ నిమిత్తంకాబోలును వస్తూవున్నారు. ఆయనబహు పెద్దలు. శాస్త్రవిషయం వారిని అడుగుదాము. ఆవిభూతిధారణ యేమి? ఆశాంతముఖంయేమి? ఆయన కేవలం శివస్వరూపులు.

కొంక—నేనుగానా శివస్వరూపుణ్ణి.

వృష—ఆశాస్త్రుల్లుగారు మావారే. దహనవిషయంకూడా వారినే అడుగుదాము.

[గార్ధభేంద్రశాస్త్రులవారు ప్రవేశించుచున్నారు.]

రామ—శ్లో. శుక్లాంబరధరంవిష్ణుం। శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయేత్। సర్వవిఘ్నోపశాంతయే.

వృష—ఏమయ్యా! యీశ్లోకం చదివినావు.

రామ — నేను మహాసభ ప్రియున గార్ధభేంద్రశాస్త్రుల వారిని శ్లోకరూపముగా స్తుతిచేసినాను.

వృష — ఇది ఆయనస్తుతి యేసాగైనది?

రామ — ఏలాగైందో చెప్తాను. నాపాండిత్యప్రభావం చిత్తగించండి — శుక్లాంబరధరం = తెల్లనైనబట్టలు ధరించినటువంటిన్నీ, — గాడిదెలు చాకలివాళ్ళ వుతికిన తెల్లబట్టల మూటలు మొయ్యడం అందరికీ తెలిసిన హాంశమే కదా — విష్ణుమ్ — సర్వత్ర వ్యాపించివుండే టటువంటిన్నీ — గాడిద యేపెంటమీదపడితే ఆపెంట



గార్ధభేంద్ర శాస్త్రులవారు

మీద కనపడుతూ వుండడం ప్రతివారున్నూ యెరుగుదురు — శశివర్ణం = చంద్రునివంటి రంగుకలిగినటువంటిన్నీ — గాడిద చంద్రునివలె తెల్లగావుండడము ప్రత్యక్షమే — చతుర్భుజం = నాలుగు చేతులు కలిగినటువంటిన్నీ — అవిగో వెనుకటివి రెండూ ముందువి రెండూ కలిసి నాలుగు భుజములు — ప్రసన్నవదనం = కలకతేరిన ముఖం కలిగినటువంటిన్నీ — ఆముఖంచూస్తేనే గాడిదెముఖం శాంతమైనదైనట్టు స్పష్టమవుతూవున్నది — (గాడిదెను) సర్వవిఘ్నోపశాంతయే = సమస్తవిఘ్నములున్నూ శాంతించడం కొరకు — గాడిదె యెగురుగా రాకుండా వుండడమూ ఆసమయంలో వికారపు కూతలు కూయ్యకుండా వుండడమూనే విఘ్నశాంతికరము — ధ్యాయేత్ = ధ్యానిస్తూవున్నాను.

వృష — అంతా బాగానే చెప్పినారు కాని చివర క్రియలో మాత్రం చెడగొట్టినారు. ధ్యాయేత్తంటే ధ్యానిస్తూవున్నానని అర్థముగాదు, అదియేకాలమో యేపురుషమో సెలవియ్యండి.

కొంక—వాడికి క్రియలూ గ్రియలూకూడా తెలిసియేడిసిన వా? యేవో తొట్టిముట్టికూతలు నాలుగు కూసినాడు పోనియ్యండి.

రామ—"వో" అంటే "నా" రాని పశువువు నీవుకూడా ఆక్షేపించవలెనా? నోరు మూసుకో. వూరుకో. అర్థసారస్యము వట్టి చతుష్పాజంతువు నీకేమి తెలుస్తుంది? తప్పు చెప్పినా వొప్పు చెప్పినా శాస్త్రార్థ ద్విజాగ్రగణ్యులమైన మేము చెప్పవలెను.

కొంక—అర్థసారస్యంకాదు బ్రాహ్మణార్థసారస్యం నీకు తెలుసును. నేను చతుష్పాద జంతువునయితే నీవు ద్విపాదపశువువు. అందుచేతనూ నీవు నాలోనగమే కాని నాకంటె యెక్కువవాడవు కావు.

రామ—నేను కులంగలవాణ్ని మానంశకర్తఅయిన జటాయువు శ్రీరాములవారికి మహోపకారం చెయ్యడంచేత మాకులం వారికందరికీ రామబంధువులని పేరువచ్చినది.

కొంక—నేనునీకంటెనూ కులంగలవాణ్ని. మాపెద్దలు మృగరాజయిన సింహంవద్ద ప్రధానులుగా వుండేవారు. మాపూర్వులలో వకరు నీలికడవలోపడి మృగరాజ్యాధిపత్యం చేసినాడు. మీవాళ్ళు బిచ్చగాళ్ళు; మేము మహారాజులము.

రామ—నీమాటలకేమి ప్రమాణము?

కొంక—నీమాటలకేమి ప్రమాణము?

రామ—నామాటలకు రామాయణం ప్రమాణం.

కొంక—నామాటలకు పంచతంత్రం ప్రమాణం.

రామ—పంచతంత్రం ప్రమాణగ్రంథంకాదు.

కొంక—రామాయణ మంతకముందేకాదు.

రామ—శాస్త్రుల్గారూ! ఆరెండింట్లో యేదిప్రమాణగ్రంథమో పండితులుమీరు సెలవియ్యండి.

గార్ధ—నేను సత్యం చెప్పుతాను. మీరు యీవిషయంలో పోట్లాడకండి. మనుష్యకృతమైన పంచతంత్రంకంటె ఋషిప్రోక్తమైన రామాయణ మెక్కువ ప్రమాణము కాదష మరా?

కోక—ఈయన చతుష్పాదజంతువుగనుక మాబంధుకోటిలో వాడనుకుంటే ప్రతిపక్షులలో చేరి పక్షపాతం చేసినాడు. ఎంతచదువుకున్నా గాడిదెకు బుద్ధివుండదు. మాకు మావచనమే ప్రమాణంకాని యీగాడిదకూతలు ప్రమాణంకావు. నీతిశాస్త్రమైన పంచతంత్రంకంటె కేవల కావ్యమైన రామాయణం యెక్కువ ప్రమాణమనే యీగాడిదె యిప్పుడు నమస్కారార్హమైనది యేలాగయినది?

రామ—మనకు నమస్కారార్హమైనందుకు ఆశ్చర్యమేమున్నది? పూర్వం శ్రీకృష్ణమూర్తివారి తండ్రిఅయిన వసుదేవుని వంటివాడుకూడా కార్యకాండా వుండడానికి కాళ్లుపట్టుకుని గాడిదెకు నమస్కారం చేసినాడు.

గార్ధ—సరే యీకరకం బాగానేవున్నది. అశ్వపతిగారూ! ముందు కార్యంమాటయేమి ఆలోచించినారు?

అశ్వ—మనవారి కందరికీ యీ కళేబరము దహనముచేయించవలెనని అభిలాషవున్నది.

గార్ధ—ఆలాగే కానియ్యవచ్చును. ఇది సర్వోత్కృష్టంగా వున్నది.

రామ—గోవును దహనంచెయ్యడం లోకంలో యెక్కడనైనా వృద్ధాచారము వున్నదషయ్యా? పెద్దలుమీరే యీలాగు ఆచారవిరుద్ధమైనమాట సెలవిస్తారేమీ?

గార్ధ—ఆచారమా? ఆమాట మరిచిపోయినాను. ఆచారవిరుద్ధమైనకార్యం చెయ్యకూడదు, ఇప్పుడు ఖననమే కావలెనుగాని దహనంకూడదు,

కొంక — ఈవిషయంలో నిష్పక్షపాతముగా చెప్పినారు.

రామ — మాకు మరివక ధర్మశాస్త్ర సందేహంవచ్చింది. శవాన్ని యీ రాత్రే పాతిపెట్టవలెనో రేపటిదాకా వుంచవలెనో సెలవియ్యండి. నేను రేపటిదాకా వుంచవలెనంటూవున్నాను.

కొంక — నేను యిప్పుడే ఖననం కావలెనంటూవున్నాను. మీరు యిందులో నిష్పక్షపాతంగా చెప్పవలెను. వాడు పక్షిగనుక, వాడికి పక్షపాతము సహజము.

గార్ధ — నాకు పక్షపాతం యెందుకు? న్యాయం చెపుతాను. ఎప్పుడు చేసినా చెయ్యవచ్చును. ఇంట్లోవాళ్ళకు కష్టంగాతోస్తుందంటే, ఆపనియీరాత్రే చెయ్యవచ్చును. పెద్దలతో ఆలోచించవలెనంటే రేపటిదాకా వుంచనూవచ్చును. ఎలాగు చేసినా ఆక్షేపణ లేదు.

రామ — మీరు యీసంగతి శాస్త్రంచూచి చెప్పినారా! చూడకుండానే చెపుతూవున్నారా? కర్మలోచేరిన పనిగనుక మీరు బాగా ఆలోచించి మరీచెప్పవలెను. ఎక్కడనైనా సూర్యాస్తమానమయినతరువాత కర్మపుడుతుందండీ? ఒకవేళ కామధేనువుకు ప్రాణం కడపట్టిందేమో! తెల్లవారిందాకా కాక్కూడా చూస్తే యీలోగా ప్రాణం వచ్చేదీ లేనిదికూడా స్పష్టంగా తెలుస్తుంది.

గార్ధ — మీరు చెప్పింది బాగానేవున్నది. ధర్మశాస్త్రం చూడవలెను. సూర్యుడు లేకపోతే కర్మపుట్టదు.

కొంక — మీధర్మశాస్త్రజ్ఞానం మొత్తుకున్నట్టేవున్నది. కర్మపుడుతుంది అన్నీ పుడుతవి. శిష్టాచారంకంటె ధర్మశాస్త్రం మహా యెక్కువదా ఏమిటి? మేము అన్నిచోట్లా రాత్రిళ్ళే చేయిస్తూవున్నాము. సూర్యుడు రాత్రిళ్ళు అగ్నిహోత్రంలో ప్రవేశిస్తాడు గనుక అగ్నిహోత్రంవుంటే రాత్రికర్మకు యేమీఅడ్డంలేదు. శాస్త్రుల్లగారూ!

మీరు ఇలాగంటి తెలిసీ తెలియనిమాటలు చెప్పకండి. చచ్చినవాళ్ళు నేమిటి? పక్షిబ్రాహ్మణుడేమిటి? ఈ మాటయెవళ్ళయినా వింటేనవ్వుతారు. శవం నిండినయింట్లో వుండగూడదు. వేగిరం స్నానం చేయించండి.

గార్ధ—ఇప్పుడు దీక్షితులుగారు చెప్పినదీ నాకు సబబుగానే తోచుచున్నది. నేను ఏదీ నిశ్చయంగా చెప్పలేను శాస్త్రం యెలాగు చెప్పితే ఆలాగు చెయ్యండి. అదుగో సభాపతులు వ్యాఘ్రావధానులుగారూ, వరాహభట్లుగారూ, బకసోమయాజులుగారూ వస్తూవున్నారు. ఆలోచించి సభాపతులునలుగురూ ఏలాగు చెప్పితే ఆలాగు చేతాము.

[వ్యాఘ్రావధానులుగారును, వరాహభట్లుగారును, బకసోమయాజులుగారును ప్రవేశించుచున్నారు]



బకసోమయాజులుగారు.



వ్యాఘ్రావధానులుగారు.

అశ్వ—సభవారేరయ్యా? సభాపతులు ముగ్గురుమాత్రమే వచ్చినారు?

వ్యాఘ్రా— వెనకనుంచి వారూవస్తూవున్నారు. మర్కట జోస్యులుగారు పంచాంగం నిమిత్తం వెళ్ళారు. తక్కినవారూ వారితో నేవస్తారు.

రామ— ఈ ధర్మసందేహము బకసోమయాజులుగారి నడుగుదామా! ఆయన బహుతపశ్శాలి; అనేక యజ్ఞాలుచేసినారు; ఆయనతో సమానమైన ధ్యానము మరెవరికిలేదు, ఆయన మహాద్విజ శ్రేష్ఠుడు; కవిచక్రవర్తి.

కొంగ— మీవాడుగనుక వూరికే పొగడుతూవున్నావు. ఆయనాద్విజశ్రేష్ఠుడే; నీవూ ద్విజశ్రేష్ఠుడవే; ఆయన నీకంటెనూ ఘనుడు. నీవు చచ్చినవాటిని పీక్కుతింటూవుగాని ఆయన బ్రతికివున్న వాటినే గుటుక్కున మింగివేస్తాడు. యజ్ఞాలకేమీ లోపంలేదు. ఆయన తెల్లవారి లేచిందిమొదలుకొని నిత్యమూ మీనమేధాలు చేస్తూవుంటాడు, ఆయన ధ్యానమంతా చేపలను యేలాగుపట్టుకుందామా అనేకాని మరివకటికాదు. పక్షిగనుక ఆయనకూ నీవలెనే పక్షపాతం సహజమే.

రామ— వారిద్దరికీ విరోధం. సభవారు కొంగనక్క దీక్షితుల మాటలు విశ్వసించకండి.

కొంగ— వారిద్దరూ మిత్రులు. సభవారు రామబంధుశాస్త్రి మాట విశ్వసించకూడదు.

వరా— మీరిద్దరూ వూరికే యెందుకు కంఠశోషపడుతారు! సభవారు వస్తూవున్నారు వూరుకోండి.

రామ— కులం తక్కువవాడవు నీవా మమ్మల్ని మందలించే వాడవు! వోపందీ! అప్రయోజక వూరుకో.



వరాహశెట్టిగారు

వరా — కావలిస్తే నీవు కులంతక్కువవాడవు. నేను కేవలమూ ఆదివరాహ స్వరూపుడయిన విష్ణుమూర్తి సంతతివాణ్ని. ఓపక్షీ కానా! ఎగిరిపడబోకు.

కొంక — అలాబుద్ధి చెప్పు.

రాము — నీ నక్కజిత్తులు చాలించు.

[అప్పుడు ఆంజనేయశర్మయు, మర్కటజోస్యులును,
మల్లుభల్లును, తిమ్మన్న చయనులును,
ప్రవేశించుచున్నారు.]



ఆంజనేయశర్మగారు.



మల్లుభల్లుగారు.

అంజ—ఏమిటయ్యా! మీలో మీరే కేకలు వేస్తూవున్నారు? సభవారితో యేమయినా ఆలోచించడమూ పెట్టడమూ వున్నదా లేదా?

రామ—ఆంజనేయశర్మగారు యేళ్ళుగడచినవారు ధర్మ శాస్త్రవేత్తలు లోకవక్కటిలేదుకాని నాడు శ్రీరాములవారి నిమిత్తం లంకకాల్చివచ్చిన ఆంజనేయులవారి అవరావతారులు. "అయ్యా! ఆంజనేయశర్మగారూ! కామధేనువు చచ్చిపోయినది గదా! యీరాత్రి కర్మచేయించి శవాన్ని తీసుకుపోవచ్చునా?"

అంజ—(తనలో) యేలాగయినా మనకు లాభముదొరికే మార్గం చూడవలెను. (బిగ్గరగా) తీసుకుపోకూడదు.

కొంక—నావద్ద కోతిచేష్టలు చెయ్యక యిప్పుడు యెందుకు తీసుకు పోకూడదో చెప్పు?

అంజ—ఇప్పుడు తీసుకువెళ్ళినా రేపుతీసుకొనివెళ్ళినా ముందుగా ప్రాయశ్చిత్తం కావలెను.

మేషే—ఇదేమిటయ్యా! నీవువచ్చి కొత్తగొడవ తెచ్చి పెట్టినావు. లోకమంతా మెచ్చుకొనే కామధేనువుకు ప్రాయశ్చిత్తం యెందుకయ్యా.

అంజ—ఎందుకో నీకేమి తెలుస్తుంది? చిన్నప్పటినుంచీ ధర్మ శాస్త్రిలలో పుట్టిపెరిగిన మావంటివారికి తెలుస్తుందికాని కామ ధేనువు బ్రతికివున్న కాలంలో మహాపాతకంచేసింది కాబట్టి ప్రాయ శ్చిత్తం కాకతీరదు.

వృష—ప్రాయశ్చిత్తంమాట. చూచకుండామాగాని చేసిన పాపమేమిటో చెప్పు?

అంజ—కావలసినన్ని పాపాలున్నవి. కృతఘ్నులయిన మను ష్యులకు పాలు మొదలయినవి యివ్వడం మొదటిపాపం. మట్టుకో

వడానికైనా అర్హంకాని కుక్కకు పాలివ్వడం రెండో పాపం. విశ్వాస మన్నమాట యెరుగనిపిల్లికి పాలివ్వడం మూడోపాపం. ఈపాపాలన్నీ క్షమించినా ధర్మశాస్త్రానికి ప్రత్యక్షవిరుద్ధమయిన పశుగమన పాపం యేలాక్షమించడానికి వీలవుతుంది? ఆపాపం యెవరూ చెయ్యలేదన లేరుకదా? ఆపాపం చేసినందుకు యిప్పుడు దగ్గిరకూర్చుండి మోడుస్తూవున్న యీవత్సమే దృష్టాంతము. పశుగమనమే లేకపోతే యీదూడ యేలాగుపుట్టినది? కలియుగానికి ముఖ్యప్రమాణమయిన పరాశరస్మృతియొక్క దశమాధ్యాయములో

శ్లో. పశువేశ్యాదిగమనే మహిష్యుష్ట్రీ కపీం తథా
ఖరీంచ సూకరీం గత్వా ప్రాజాపత్యం సమాచరేత్.

అని వున్నది. కాబట్టి పశుగమన ప్రాయశ్చిత్తం ముందుగా జరగవలెను.

వృష—వోరి నీనోట్లో వుండువుట్టా! ఎన్నికారుకూతలు కూసినావురా నాలుగుపోట్లు పొడిచి నీడొక్క బద్దలుచేస్తునా?

అశ్వ—వోరీ నీధర్మశాస్త్రం కాలిపోనూ! యీకారుకూతలు పేలినందుకు నెత్తిపెంకు యెగిరేటట్టుగా తన్నుదునా?

మార్జా—(తనలో) నాకువిశ్వాసం లేదంటూవున్నాడు. యిందులో నేనువిశ్వాసం కలిగివుంటాను. (ప్రకాశముగా) ఓరి మర్కటాధమా! కావలిస్తే నీకు నేను ప్రాయశ్చిత్తంచేయిస్తాను.

శున—వోరి కోతిముండాకొడకా! నన్ను ముట్టుకోవడానికి అర్హంకాదంటావా? వీధిలోకిరా, నీకండలువూడదీసి నేనుముట్టుకోవడానికి తగినవాణ్ని అవునో కానో చూపిస్తాను.

అంజ—శాస్త్రుర్లుగారూ! ఆదార్జవ్యం చిత్తగిస్తూవున్నారా? వృషభేంద్రగావుగారున్ను, అశ్వపతిగారున్ను, గడ్డితినేమాటలంటూవుంటే వూరుకోవడం సభవారికి న్యాయమేనా?

గార్ధ—అశ్వపతిగారూ! వృషభేంద్రరావుగారూ! ఊరు కోండి. మనం కార్యవాదులం తొందరపడకూడదు. వారు ధర్మశాస్త్రం చూపిస్తూవుండగా మరివకలాగు అనడం భావ్యంకాదు. మనమందరమూ ధర్మశాస్త్రానికి బద్ధులమై వుండవలెను.

గార్ధ—ఆ పాపానికి ప్రాయశ్చిత్తమేమిటో సెలవిస్తారా?

ఆంజ—శ్లో. గోగామీ చ త్రిరాత్రేణ గామేకాం బ్రాహ్మణో దదత్.— అని దానికిందశ్లోకములోనే వున్నది.

రామ—అలాగయితే నేను మహాద్విజుణ్ని. యీ కామధేనువును సూర్యోదయం కాగానే నాకు దానంయిప్పించండి. అన్ని పాపాలూ పరిహారమైపోతవి.

మల్లు—దానం చెయ్యడం చచ్చినగోవునా బ్రతికినగోవునా?

రామ—ధర్మశాస్త్రవిషయం నీకేమీ తెలియదుగాని నీకొండముచ్చు చేష్టలుమాని నోరుమూసుకు వూరుకో.

వ్యాఘ్రా—బ్రతికివున్నగోవైతే దానం నాకివ్వవలెను. నేను పెద్దసభాపతిని.

రామ—నీకు సభాపతిత్వం యెవరిచ్చినారు?

వ్యాఘ్రా—నా చేతులు యిచ్చినవి; నా నోరు యిచ్చినది. అనాధలైన మీకు వలె సభాపత్యం నాకు పూర్వులనుంచి రావలసిన పనిలేదు. [illegible] వాణ్ని కాను. మహారాజు లాగు బ్రతికి వున్నవాళ్ళనే [illegible] ప్రాణ్యాల [illegible] చప్పి సభాపతిత్వము పొందినాను. [illegible] చిన్నమెత్తు తెలివిలేదు. నువ్వు [illegible] సభాపతిత్వం [illegible] కున్నాను. [illegible] సారిగా ఈ దరిదాపులకు రాకుండా కొరికివేస్తాను. (అని లేచుచున్నాడు.)

రామ—(తనలో) యితను బలవంతుడు. యితనితో పోట్లాడితే కార్యంలేదు. (ప్రకాశముగా) అపరాధంవచ్చింది క్షమించండి.

వరా—మనలోమనకు తగవులుకూడవు. మీరే అగ్రసభాపతులు. మేమందరమూ వప్పుకున్నాము. శాంతించి కూర్చోండి.

వ్యాఘ్రా—అలాగయితేసరే.

అశ్వ—మీరు యిందాకా చెప్పిన ధర్మశాస్త్రం మనుష్యుల విషయమా? తిర్యగ్జాతులవిషయమా?

అంజ—అందరివిషయమూను. లోకంలో మనుష్యులకు వక్క ధర్మశాస్త్రమూ పశువులకు వక్క ధర్మశాస్త్రమూ వుంటుందా! అందరికీ ఒక్కటే ధర్మశాస్త్రం.

మేషే—మీధర్మశాస్త్రం చచ్చినవాళ్ళవిషయంలోనా? బ్రతికివున్నవాళ్ళవిషయంలోనా?

అంజ—హాహాహా! మీరుకుశంకలు మహాచేస్తూవున్నారే! ఇది అందరివిషయంలోనూ. బ్రతికివున్నవాళ్ళు ప్రాయశ్చిత్తం చేసుకొమ్మంటే చేసుకోరుగనుక ముఖ్యంగా చచ్చినవాళ్ళవిషయంలోనే.

మేషే—అలాగయితే చచ్చినవాళ్ళచేత ప్రాజాపత్యవ్రతం యెట్లాచేయిస్తారు?



[illegible] శాస్త్రులుగారు.



తిమ్మన్న[illegible]లుగారు.

తిమ్మ—సభవారి యిష్టంవచ్చినట్లు చేయిస్తారు. అదంతా మీ కెందుకు? సభవారు యేమిసెలవిస్తే అదేమాకు ధర్మశాస్త్రం.

అశ్వ—సింహ శరభ గండభేరుండాదులైన వృత్తములు వృపేతుచేసి పూరుకోవడంచేత కోతులయొక్కా కొండముచ్చుల యొక్కా ఆటలుసాగుతూవున్నవి. మీమనసు వచ్చినట్లెల్లా చేయించ డానికి యిదినోరువచ్చిన చెవులపిల్లుల యిల్లనుకున్నారా? మేము యిద్దరమూ తలచుకుంటే యీదౌర్జన్యంచేసేవారిని డొక్కలు బద్ద లయ్యేటట్లుగా తన్ని పడపాడిచి వదిలిపెడుతాము.

వృష—తొందరపడకండి ఆంజనేయ శర్మగారూ! మీరు చెప్పిన ధర్మశాస్త్రంలో 'కపీం' అని వున్నది గనుక యిప్పుడీసభ వారి కందరికీ ప్రాయశ్చిత్తమక్కరలేదా? 'ఖరీంచ' అని వున్నది గనుక, గార్దభేంద్రశాస్త్రిగారికికూడా ప్రాయశ్చిత్తం కావలెను.' 'సూకరీం' అనికూడా వున్నందున, సభాపతులైన వరాహభట్లుగారి కీప్రాయశ్చిత్తం జరగవలసిన దే.

ఆంజ—(తనలో) పీళ్ళకు సంస్కృతం తెలియడం చాలా తంటాగావున్న దే. (ప్రకాశముగా) బ్రతికివుండగా మనకాసంగతి ఆలోచించవలసిన పనిలేదు. చచ్చిపోయిన తరువాత ధర్మశాస్త్రాలు తీసి, అందరినీ యిలాగే చేస్తాము. మగవాళ్ళు కావడంచేత తమకడు పులోనుండి పిల్లలు పుట్టరుగనుక వీరు మేమూ పాపం చెయ్యలే లేదంటారు. పక్క అబద్ధమాడితే అన్నీ చూసి పోతవి. గృహస్థులో జరిగేదానికి మనం యేమియీ యిలాగా పుచ్చుకోకూడదు.

వృష—ఇదివరదాకా వ్యర్థమైన ప్రయాసపడ్డారు. మేము మొట్టమొదట దహనవిషయంలో వేసిన ప్రశ్నకు సభవారివద్దనుంచి యేమీసమాధానం రాలేదు.

వ్యాఘ్రా—తగినన్ని దానాలుచేస్తే దహనం చెయ్య వచ్చును. మొదట వుత్క్రాంతి గోదానం చెయ్యవలెను. తరువాత వైతరిణీ గోదానం చెయ్యవలెను. సంచయనం నాడు వకగోదానం చెయ్యవలెను. దశాహంనాడు వకగోదానం చెయ్యవలెను. మాసికం నాడువకటిచెయ్యవలెను. ఈగోదానాలన్నీ నాకుయిప్పిస్తే యేప్రాయశ్చిత్తమూ అక్కరలేకుండా నేను దహనం చేయిస్తాను. ఏమయ్యా సభాపతులు మీ అభిప్రాయం చెప్పండి.

వరా—మాకుతగిన దానాలుయిప్పిస్తే మేమూ వప్పుకుంటాము.

బక—వరాహభట్లుగారితో నేనూ యేకీభవిస్తాను.

రామ—(రహస్యముగా) దీక్షితులూ! కోపమునుగుతూ వున్నది. మనం యిందులో వప్పుకోకూడదు. యేమైనాఅంటే వ్యాఘ్రావధానులు చంపివేస్తాడు.

కొంక—(రహస్యముగా) నాకూఅదేభయంగా వున్నది. అతనువక్కడు మనపక్షంలో చేరితే యెంతపనిఅయినా చేతుము. మేనమామను మార్జాలపంతులు అందులో వుండడంచేత వ్యాఘ్రావధానులు వాళ్ళలోచేరినాడు. ఇప్పుడాపక్షంలో చేరినా యితను ఇదివరకు అనేకగోమేధాలూ అశ్వమేధాలూ చేసినవాడే. మనమేదైనా మాయోపాయంపన్ని యీ కార్యం చెడగొడుదాము.

వ్యాఘ్రా—సభవారూరకున్నారేమి?

మల్లు—మాకుతగిన ఫలప్రదానాలు యిప్పిస్తే మేమువప్పుకుంటాము.

రామ—(రహస్యముగా) మించిపోతూవుంది. యేమైనా వుపాయం ఆలోచించినావా?

కొంక—మర్కటజోస్యులూ! మాట. (రహస్యముగా) ఇప్పుడు నక్షత్రం మంచిదికాదప్ నీవు అటుక పెడుమా. తెల్లవారిన తరువాత మరివక వుపాయం ఆలోచింతాము.

వ్యాఘ్ర—ఏమిటి మీరుమిద్దరూ [illegible] గుసగుసలాడుతూ వున్నారు?

కొంగ—ఏమీ లేదు. కర్మలు ఇప్పుడు సుసంపూర్తమగునా కాదా అని ఆలోచిస్తూయున్నాము.

వ్యాఘ్ర—మీఆలోచన తెగిందా లేక తెగనే లేదా?

మర్కట—తెగింది. యీరాత్రి నక్షత్రం బాగావున్నది కాదు.

వృష—దహనానికి మంచినక్షత్రమేమిటి? సభవారందరూ వప్పుకున్నపని వేగిరం కానియ్యండి.

రామ—నక్షత్రం మంచిదికానప్పుడు చేయించడానికి మేము వప్పుకోము.

కొంగ—నేనూ వప్పుకోను.

వృష—మీరు యిద్దరు వప్పుకోకపోతే యేమిటెండి.

గార్ధ—వృషభేంద్రరావుగారూ! మీరు సభవారితో వివాదపడకండి. వివాదపడితే అందరూవప్పుకున్న కార్యం సమ్మార్గంగా చెడిపోతుంది. (హాస్యముగా) యింతలో మాసిపోయిందేమిటి? ఈరాత్రి నాలుగు జాములు వోపికచేస్తురా. తెల్లవారిన తరువాత మేము తొలివచ్చి కానిద్దాంగదా. (ప్రకాశముగా) అయ్యా సభవారికి నమస్కారము యీరాత్రి మాత్రమే యీ [illegible] సభవారనుగ్రహించి వుదయమున్నే దయచేసి [illegible] సానుకూలం చెయ్యండి.

ఆంగ—అలాగైతే మేము [illegible] రేపువుదయాన్నే [illegible]. (అని బంధువులతో వెళ్ళుచున్నారు.)

గార్ధ—[illegible] శాస్త్రిగారూ! [illegible] మీరుపాత్రులు [illegible] చేయించడానికి [illegible] రేపువుదయాన్న పెందరాళే దయచెయ్యండి.

రామ—(రహస్యముగా) మన ప్రయత్నం తప్పిపోవడమువి వకటి తెచ్చిపెట్టకు. నీవు ధైర్యం చెప్పకపోతే ఈరాత్రి నాకు నిద్ర పట్టదు.

కోంక—మన ప్రయత్నం విఫలంకాదు. కావలసినంత నిద్రపో.

రామ—నీకడుపు చల్లగా! అలా కావలెనుగాదూ? శివాన్ని ముట్టుకున్నందుకు వీళ్ళను వెలివెయ్యవలెనని నేను రేపు కావలసిన్ని కారికలు తీసుకువస్తాను.

వ్యాఘ్రా—అందరమూ చేరివున్నాము గనుక రేపుదయం మళ్ళీ రావడంకంటె యీరాత్రే కర్మ చేయించవచ్చును.

గార్ధ—సభవారంతా వెళ్ళిపోయినారు. రేపుదయాన్నే చేయింతాము. సభవారు విజయం చేస్తూవున్నారు. రేపుదయాన్నే యెదిరి యెక్కకుండా దయచేసి, ఆపత్సముద్రంలో మునిగివున్న వీరిని యెలాగైనా గట్టెక్కించండి. (అందరూ నిష్క్రమించుచున్నారు)

# మూ ష కా సు ర వి జ య ము

రంగము—ఉల్లితోట.

[మూషకభట్టరుగారు ప్రవేశించుచున్నారు]



మూషకభట్టరు గారు.

మూష—(అంతట కలయజూచి) ఓహో! యీతోట యెంత రమ్యంగా వున్నది! గట్లపొడుగునా ముల్లంగిచెట్లు వెయ్యబడివున్నవి. వుల్లిమళ్ళలో మధ్యమధ్య పెరుగుతోటకూర మొక్కలు కోమలంగా పెరిగి నవనవలాడుతూ వున్నవి. కంచెలమీద బీరపాదులుపాకి వింతగా కాస్తూవున్నవి. పేరుకు యీపొలం కాపువాడిదంటారేకాని సమీపంలో కాపురంవుండడంచేత నిజానికి నాదేకాని వాడిదియెంతమాత్రమున్నూకాదు. యీబీరకాయలూ ముల్లంగిదుంపలూ మొదలయినవాటి నన్నిటినీ వాడికంటె నేనే యెక్కువగా అనుభవిస్తాను. కష్టంవాడిదీ ఫలంనాదీగనుక వాడు నాకోసం కష్టపడే నవుకరుకాని యజమానుడుకాడు. నాకోసం మళ్ళీకూరలు మొదలయినవి వెయ్యడానికి వాడవతలిపొలం యేలాగు దున్నివుంచినాడో! ఈపొలం యెండిపోయేటప్పటికి మళ్ళీ ఆపొలం సిద్ధం అవుతుంది. ఆదుర్మార్గుడు మాత్రం నేనుచేసేది దొంగపనిఅని తిడుతూవుంటాడు. తిట్టుకుతిట్టుకుని నోరునొప్పియెత్తి వాడేనశిస్తాడు. నూరుతిట్లయినా బొక్కెడు

కొట్టులు కావు. ఎక్కడనయినా తిట్లవల్ల చావడమూ దీవెనలవల్ల బ్రతకడమూ వుంటుందా? వాడు నాకమునుపే ఒక్కసారి నాలుగు మూలలకూ తిరిగి నాపొలమంతా చూసుకునివస్తాను. (అని నాలుగు అడుగులు నడిచి) ఆనాటను నెవరో వస్తూవున్నారు. ఇక్కడ నిలవబడకూడదు.

[అప్పుడు శశకపతి రాజుగారు ప్రవేశించుచున్నారు.]



శశకపతిరాజు గారు

శశ (తనలో) నేను నాపొలం చూచుకోవడానికి వచ్చినాను. యీతోటకూర మొక్కలు మహా మేపుగా పెరిగినవి. రేపటిదినం తెల్లవారేటప్పటికి నాబంధువులనందరినీ తీసుకువచ్చి వారికి యీ తోటకూర కాడలతో విందుచేసి ద్వాదశీ పారణా వనసంతర్పణా కూడాచేస్తాను. తోటమాలి వచ్చే వేళఅయింది, పొలమంతా చూచుకుని వేగిరం వెళ్ళిపోవలయును. (అని నిలుచున్నాడు.)

మూష— (సమీపమునకువచ్చి) అయ్యా! నమస్కారము.

శశ—(తేరిపారచూచి తనలో) కాళ్ళు యీడ్చుకుంటూ వచ్చి యీపందికొక్కగాడు నాకు నమస్కారం చేస్తావున్నాడు. వీడినమస్కారం పుచ్చుకోకుండా గంభీరంగావుండి వీడి ముందర నాగొప్పతనం అంతా కనపరచవలెను. (అని గర్వముతో బిగ్గరగా) నీవు యెవడవు? యీపొలంలోకి యెందుకు వచ్చినావు?

మూష—(తనలో) నేను పెట్టిన నమస్కారమయినా పుచ్చుకోకుండా యీచెవులపోతుకు యెంతగర్వంవచ్చింది? సాధ్యమయితే నేను యిప్పుడు వీడిగర్వ ప్రాయశ్చిత్తంచేసి వీణ్ని మరీ యింటికి పంపుతాను. (బిగ్గరగా) నేను వుదయాన్నే షికారువచ్చినాను. నాపేరు మూషకభట్టరటూరు

శశ—వంకరకాళ్ళ్యా నీవు నీకు షికారుకూడానా? నీకాళ్ళు సరి వకవిధగా వుపయోగించుకోగలవా?

మూష—(తనలో) వీడుముందుగా నాకాళ్ళమాటే యెత్తినాడు. [illegible] యెవరికిన్ని లేనిలోపాలు యెన్ని యెంచినా కోపంరాదు గాని వున్నలోపం యెంచితే తప్పకుండా వళ్ళుమండుకు వస్తుంది. వున్నమాటంటే వులుకువస్తుందన్న సామెత అందరూ యెరిగిందే. నావంకర కాళ్ళ మాటతలపెట్టినాడుగనుక యేలాగయినా వీడికి గర్వభంగంచేసి మరీపంపవలెను. (బిగ్గరగా) నావివంకర కాళ్ళు కానడానికి కంచెలు దూకితే నాకాళ్ళు యెవరూ విరగగొట్టలేరు. నాకాళ్ళు వేరేవిధంగా వుపయోగించుకోవలసిన అవసరంలేదు. యెంతగెడకర్రలాగువున్నా నీకాళ్ళకంటె నాకాళ్ళే యెక్కువవుపయోగంగాను అందంగాను వున్నవి. నీవునన్ను ఆక్షేపించనక్కరలేదు.

శశ—నీవు కంచెలు దాటకపోతే రాత్రిళ్ళు కన్నాలలోనుంచి యిళ్ళల్లో దూరడంచాత నీకాళ్ళు వంకరపోయినవి. యెవరికాళ్ళు యెక్కువ వుపయోగం అయిందీ నాలుగు అడుగులు పరుగెత్తితే తెలుస్తుంది.

మూష—అలాగే పరుగెత్తుదాం పందెం వెయ్యి. యేమేమి పందెము?

శశ—ఇప్పుడు బాగా వున్నది. నేను నీనుననువచ్చింది పందెం వేస్తాను. ఇప్పుడే పరుగెత్తుదాము రా. అన్నమాటకు నీవు తిరిగిపో కూడదు.

మూష—తిరిగిపోతే పరుగెత్తలేక నీవు తిరిగిపోతావుగాని నేను యెన్నటికీ తిరిగిపోను. ఇప్పుడు వరహావరహా పందెం. నేను తిరిగిపోతే రేపటినుంచి నన్ని పేరుతో పిలువవద్దు. చిన్నప్పటినుంచీ కందమూలఫలాలు భక్షిస్తూ తపస్సుచేసి యీ పొలంలోవున్న పందికొక్కులన్నిటికీ గురువునయి సంపాదించుకొన్న భట్టర్ బిరుదు నేటితో తీసి పారవేస్తాను.

శశ—నీవు వేసిన పందాన్యానకు నవ్వుకున్నాను. గాదెకింది పందికొక్కులాగు నీవు యెంతసంపాదించినా నీదగ్గర డబ్బువుండదుగనుక నీవు వక్కవరహా మాత్రమే పందెము వేసినావుగాని నేను వోడిపోతే నీకు పదివరహాలుయిస్తాను. యెక్కడనుంచి యెక్కడదాకా పరుగెత్తుదామో చెప్పు.

మూష—పొలంవాడు వచ్చేసమయం అయిందిగనుక పరుగెత్తడానికి యిదిమంచిస్థలంకాదు. అదుగో ఆదున్నినపొలంలో ఆకంచెకాడనుంచి యీకంచెదాకా పరుగెత్తుదాము.

శశ—అలాగయితే పరుగెత్తుదాము బయలుదేరు.

మూష — తొందరపడక కొంచెము సేపు తాళు. నేను నిన్న ఏకాదశి నిరహారం చేసినాను. ఇంటికి వెళ్ళి ద్వాదశిపారణ చేసి వస్తాను. మాయిల్లు ఇవతలికంచెలో వున్నది. నీవు అవతలకంచెదగ్గర వుండు. నేను భోజన చేసివచ్చి నిన్ను యిప్పుడే కలుసుకుంటాను. పందెం అక్కడనుంచే ఆరంభింతాము.

శశ — ఈవంక పెట్టి మళ్ళీరాకుండా పోయె మనేవు సుమీ. ఈలోగా నేనుకూడా ఫలహారంచేసివచ్చి నీకోసం ఆకంచె కాడ కనిపెట్టుకుని వుంటాను.

మూష — చాలలేక నీవుపారిపోతా వేమో కాని నేనుపారిపోను. అటువంటి చేష్టలు నావద్ద లేవు.

శశ — నీపందికొక్కు చేష్టలుమాని వేగిరంవెళ్ళిరా. మళ్ళీ వచ్చిన తరువాత కావలసినన్ని జంభాలువరకవచ్చును.

మూష — జంభాలు నావయిందీ నీవయిందీ తరువాత క్రియలో తెలుస్తుంది. వట్టిమాటలతో యేమిప్రయోజనము? మళ్ళీవచ్చి నీచేతనేనాతో పరుగెత్త లేననిపిస్తాను చూడు.

శశ — అట్టేవాగకపో. తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్ళు జడుస్తవా?

మూష — తినబోతూ రుచులెందుకు? అదీ తెలుస్తుంది. (అని తనయింటివంక నడుచుచున్నాడు.

శశ — ఇదుగో నేను ఫలహారానికి వెళుతూవున్నాను. నీవు వేగిరంరా. (అని వెళ్ళుచున్నాడు.)

మూష — (కొంచెముసడిచి యిల్లుచేరి) ఓసీ! ఓసీ! వేగిరం యెదురుగుండారా. ఈకలికాలంలో భార్యలు భర్తలకు యెదురు గుండా రావడమూ శుశ్రూష చెయ్యడమూ అంతాపోయి ది. ఈ కాలంలో పురాణాలలో చెప్పేమోస్తరు పతివ్రతలేరు.



మూషికాంబ గారు.

భార్య—(కన్నములోనుండి పైకివచ్చి) నేను మహాపతివ్రతను కానా? ఈ లోకంలో నాకంటె భర్తఆజ్ఞలో మెలగేవారెవ్వరున్నారు? మీరు ఎక్కడెక్కడా తిరిగివచ్చేటప్పటికి నేను సిద్ధంగా వుండి మీకు సమస్తోపచారాలూ చెయ్యడంలేదా?

మూష—నేను లోకంలోవాళ్ళమాట చెప్పినానుగాని నీమాట కాదు. నీవు తప్పకుండా పతివ్రతవే. మొగుడు చెప్పినట్లు చేసే నీవంటి యిల్లాళ్ళు కొందరు వుండబట్టే యీ కలియుగం నిలిచివున్నది. నేను ఒక్కపని చేసుకొని వచ్చినాను. అందుచేత నాకు [illegible] కావలెను.

భార్య—ఏమి చేసుకొనివచ్చినారో చెప్పండి. నా చేతనయినపని నేను చేస్తాను.

మూష—అదిమరేమీ గొప్పపని కాదు. నేను ఒక చెవులపిల్లితో కూడా పరుగెత్తడానికి పందెం వేసివచ్చినాను. పందెం మనం గెలిస్తే మనకు పదివరహాలు వస్తవి. ఆ చెవులపోతుకు తానేమో నాకంటె మహావేగంగా పరుగెత్తగలనని యెంతో గర్వము. ఇలా గర్వపడే వాళ్ళు బుద్ధిహీనులుగాని తెలివిగలవాళ్ళు కారు. మనం ఒక మహేంద్రజాలం చేసి దాన్ని యేలాగయినా గెలవవలెను.

భార్య—మీకు యేమి మతిపోయిందా యేమిటి? పొట్ట యీడ్చుకుంటూ కదలలేని పుట్టపందికొక్కు యెక్కడ? మేఘాలమీద యెగసిపోయే కుందేలుతో పరుగెత్తడం యెక్కడ? యీనాడో మీకు యేమీ పిచ్చియెత్తలేదుకదా?

మూష—నోరుమూసుకో. భార్య భర్తమాటకు యెదురాడకూడదు. నోరెత్తక నేను చెప్పినట్టు చెయ్యి. పురుషులు చెప్పినట్లు చెయ్యడం కులస్త్రీలకు ధర్మంగాని లేనిపోని ప్రశ్నలు వెయ్యకూడదు. పురుషుల వ్యవహారాలూ రాచకార్యాలూ ఆడవాళ్లకు మీకు యేమి తెలుస్తవి?

భార్య—మీరన్నట్లు నాకేమీ తెలియవుగాని—

మూష—నోరుముయ్యి. నా యెదుట భయంలేకుండా మళ్లీ మాట్లాడుతావు! నేనుయిప్పుడు చెప్పినట్లు నీవు చేస్తావా! చెయ్యవా! నా ఆజ్ఞ వినకపోతే యీకత్తి యిప్పుడు నీపీపుమీద విరుగుతుంది.

భార్య—మీ ఆజ్ఞ వినకుండా వుండడానికి గుండెలున్నవా? ఏమి ఆజ్ఞాపిస్తారో ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞకు బద్ధురాలనయి చేతులు కట్టుకొని చేస్తాను. మొగుడు భార్యను గోదావరిలో దూకుమంటే దూకవలెను.

మూష— ఓప్రియురాలా! ఈనాగటి చాళ్ళలోపడి యీకంచెదగ్గిరనుంచి ఆకంచెదాకా మేము పందెంవేసి పరుగెత్తుతాము. నీవు యిక్కడ దాగివుండి ఆకుందేలు పరుగెత్తుకొని రావడంతోటే చటుక్కున పయికివచ్చి నేనేముందువచ్చినానని అంటూవుండు. అతను మళ్లీ పరుగెత్తుమంటే మంచిదని నాలుగడుగులు పరుగెత్తి కుందేలుదాటిపోయినతరువాత వెనుకనిలువబడు. రూపం చూస్తే నాకూ నీకూ భేదం తెలియదుగనుక ఆకుందేలుగాడు నీవే నేనను కుంటాడు. అప్పుడు పందె మనంగెలుస్తాము. అదుగో కుందేలు కంచెవద్దకుపోతూవున్నది. నీవు కనపడకుండా దాక్కొనివుండు. ఈ

గోనా నీకూనాకూ శోకం తెలియకుండా వుండడానికి నా మొగాన్ని వున్నట్టే నీవు కూడా మొగాన్ని నామాలు పెట్టుకొని శ్రీవైష్ణవుని వలెవుండు.

భార్య—అలాగే వుంటాను. (అని వకనాగటిచాలులో దాగు కొనుచున్నది)

మూష—ఓ ప్రియురాలా! సరిగా నేను చెప్పినట్టు చెయ్యవలెను సుమా. నేనా కుందేలువద్దకు వెళుతూవున్నాను. (అని నడచు చున్నాడు)

[అప్పుడు శశశపతిరావు మరల ప్రవేశించుచున్నాడు]

శశ—ఓ మూషకభట్టాచార్యా! ఈ కాస్తదూరము నీవెంత సేపు నడిచినావు. నీవు పందెం గెలిచే లక్షణం ఆరంభములోనే కన పడ్డది. నీకోసం నేను యెంతో సేపటినుంచి ఎదురుచూస్తూవున్నాను.

మూష—నేను పరుగెత్తలేక మెల్లిగా నడిచినా ననుకున్నావా యేమిటి? తల్చుకుంటే నీకంటె పదిరెట్లు వేగంగా పరుగెత్తగలను. నేను పదవృత్తిన్నవాణ్ని గనుక భోజనం చెయ్యడంతోటే పరుగెత్తడం దేహారోగ్యానికి మంచిది కాదని మెల్లిగా వెళ్ళవలెనని నడిచివచ్చినాను. నీవు ఆమాత్రం గ్రహించలేకపోయినావు.

శశ—నీవా డిక్కాలు కేలుగాని మన నేనుచన్న పందెం ప్రకా రము పరుగెత్తడామా వస్తావా?

మూష—ఇప్పుడే వస్తాను. పరుగెత్తవలసిన స్థలమేదో నీకు తెలుసునా? సరిగా ఆకంచెమీదవున్న బీరపాదువద్దకు పరుగెత్త వలెను.

శశ—మంచిది. సరేనా? పరుగెత్తవస్తావా? ఆరంభించు. (అని వాయువేగ మనోవేగమున పరుగెత్తుచున్నాడు)

మూష—ఇదిగో ఆరంభించినాను. (అని నాలుగడుగులు వేసి నాగటిచాలులో నడచి స్వస్తముగా కూరుచుండి) అహగో! అప్పుడే

కంఠేలుగాడు వీరపాన దగ్గరకు వెళ్ళినాడు? నాపెళ్ళాము కక్కడ సిద్ధంగా వుండి నేను చెప్పినట్లు చెయ్యవచ్చును. వీడు నామాయలో పడిపోతాడు.

శశ—ఇదిగో నేను పరుగెత్తుకొని వచ్చినాను.

భార్య (మూ పకాంబ)-నీకంటె ముందుగానే నేను వచ్చినాను.

శశ—(ఆ ద్చర్యపడి తనలో) ఇదియేమి? ఇంద్రజాల మహేంద్ర జాలముగా వున్నది? (బిగ్గరగా) ఓమూషకభట్టరా? మళ్ళీపరుగెత్తుదాముగా. వక్క మాటుతో నాకు నమ్మకంలేకుండా వున్నది.

భార్య—మంచిది అలాగే పరుగెత్తుదాము.

శశ—ఇదిగో బయలు దేరుతూవున్నాను. (అని మూనుపటికంటెను వేగముగా పరుగెత్తుచున్నాడు)

మూష—అదుగో శశకపతిగాడుమళ్ళీ యిటు కేసి పరుగెత్తుకొని వస్తూవున్నాడు. నాభార్య వాణ్ణి మోసంచేసింది. అది పతివ్రత అయినందుకు సందేహము లేదు.

శశ—ఈ సారైనా నేను ముందుగ వచ్చినాను.

మూష—(పైకిలేచి) లేదు. ఇక్కడికీ నేనేముందుగా వచ్చినాను.

శశ—(......) పిడివద్ద దేమొ్యా మంత్రం వున్నదాయే మిటి? ఇ పెద్దమోసముగా కనుపడుతూవున్నది (బిగ్గరగా) ముఖ్యంగా మూడుసార్లు పరీక్ష చెయ్యవలెను. ఇంకొకమాటుకూడా పరుగెత్తుదాముర.

మూష—నీవెన్ని సారులు పరుగెత్తుదామంటే అన్నిసారులే పరుగెత్తుదాము. లక్షసారులు పరుగెత్తినా నాకు వచ్చనభయంలేదు.

శశ—అలాగైతేరా. (అని పరుగెత్తి) ఈసారైనా నేను ముందుగా వచ్చినానా లేదా?

భార్య—(పయికిలేచి) లేదు. నాకంటె నీవు వేయిరెట్లు వెనుక వచ్చినావు.

శశ—ఈవాక్యసారీకుండా పరుగెత్తు. మొదట బయలుదేరిన స్థలానికి మళ్లీ వెళుదాము. ఈసారియినూ నేను వోడిపోతే నీవు గెలిచినట్లు ఒప్పుకుని పదివరహాలూ యిచ్చి వెళ్ళిపోతాను. (అని పరుగెత్తి) ఇప్పుడు నీవుముందా నేను ముందా?

మూష—నేనేముందు. నాపదివరహాలూ నాచేతిలో వేసి యింటికి యేడుస్తూ వెళ్ళు. ఇప్పటికైనా నన్నాక్షేపించినందుకు నీకు గర్వభంగం అయిందా? ఇకముందెప్పుడూ యెవరినీ ఆక్షేపించక యీపరాభవంతో బుద్ధితెచ్చుకో.

శశ—ఇవుగో వరహాలు పుచ్చుకో. (అని యిచ్చి వెళ్ళిపోవు చున్నాడు)

మూష—(భార్యావద్దకు మెల్లగా నడిచివచ్చి) ఓప్రియురాలా! నన్ను నీవు గెలిపించినావు. ఇది నాకు ప్రథమవిజయం. ఈపదివరహాలతోనూ నీవు నగలు చేయించుకో. భార్యాభర్తలు ఐకమత్యంగా వుంటే యెప్పుడూ యిటువంటి లాభాలువస్తవి.

భార్య—నాకు నగలక్కరలేదు. ఈవరహాలతో మీఅప్పులు తీర్చుకోండి. ప్రొద్దెక్కినది. యింట్లోకి వెళుదామురండి.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు)

సంపూర్ణము.

---

వాణీ ముద్రాక్షరశాల, రాజమండ్రి—1950.

శ్రీ

# మహారణ్యపురాధిపత్యము.

గ్రంథకర్త:-

కందుకూరి వీరేశలింగము పంతులు

పదవకూర్పు.

ప్రకాశకులు:
హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము.
1950

## ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

సృగాలమహారాజు — నీలిగూనలోఁబడి యరణ్యరాజ్యము సంపాదించిననక్క

జంబుకేశ్వరశాస్త్రి — సృగాలమహారాజున కాంతరంగికమంత్రి.

కుక్కుర సోమయాజులు — అంతర గిక సేనాపతి.

| | |
|---|---|
| శునకాచార్యులు.<br>సారమేయశ్రేష్ఠి.<br>భషకచయనులు<br>గ్రామసింహదాసు | } ఆంతరంగిక సభికులు. |

వృకేశ్వరరావు పంతులు — అంతరంగిక న్యాయాధిపతి.

సింహసార్వభౌముఁడు — ప్రధానమంత్రి.

వ్యాఘ్రేశ్వరరావు — సేనాధిపతి.

| | |
|---|---|
| భల్లూకేంద్రుఁడు.<br>హరిణావధానులు.<br>శశకశాస్త్రి<br>మహిషేశ్వరుఁడు. | } ప్రకృతివర్గము. |

# మహారణ్యపురాధిపత్యము.

రంగము: మహారణ్యపురము.

[సృగాలమహారాజుగారు ప్రవేశించుచున్నారు.]



సృగాలమహారాజుగారు

సృగా— (తనలో) అందరూ పడుకున్నారుగదా అనికోళ్ళ గుడిసెలో యిట్టేదూరేటప్పటికి యిండిగెదాని మొగుడు నాకోసం మేలుకొని కాచివుండి కాలయముడిలా మీదపడి కఱ్ఱతో చాన కొట్టినాడు. నావంటిమీద రెండుదెబ్బలుపడడంతోటే నావెంటవచ్చి వాకిట్లో నిలిచివున్న జంబుకేశ్వరశాస్త్రి ప్రాణాలు దక్కించుకొని వెనుకవాడు వెనుకనేపాఱిపోయినాడు. ఆయీడిగె గాడిదకొడుకు కొట్టిన దెబ్బలచేత వొళ్ళంతా తేలుకుట్టినట్టు మండుతూవున్నది. వెనుకనుంచి వాడుతరుముకుని వస్తూవున్నాడనే భయంచేత పాఱి పోతూముందుచూడక నీలిగూనలోపడ్డాను. తెల్లవారిలేచినతరువాత యిదిరెండోగండము. ఇదంతాచీకటితప్పు చేసినందువల్ల వచ్చిన ఫలము. అయినా నేడుమహాసుదినం. నాభార్యయొక్క మాంగళ

నాగాత్రిబలంచేతనూ నాతల్లికడుపు చలువచేతనూ నేడు రెండుగండాలూ గడచి సుఖంగా బయటపడ్డాను. నీళ్ళగూనలో పడకుండా నీలిగూనలో పడడంచేత నావంటికి విచిత్రమయిన రంగువకటికూడా పట్టుకున్నది. ఈరంగువచ్చిన మహత్మ్యంచేత యేదోవకవుపాయం ఆలోచించి గ్రామాధిపత్యమో మహారణ్యాధిపత్యమో సంపాదించడానికి ప్రయత్నం చేయవలయును గాని వెనుక జరిగినదానికి విచారించకూడదు. నాపుణ్యంవల్లనూ నాబుద్ధిబలము వల్లనూ నాకీఅరణ్యరాజ్యము సంపాదన అయ్యేపక్షానికి నేను కేవలం సింహాన్నే అవుతాను. అదుగో మనజంబుకేశ్వరశాస్త్రి వస్తున్నాడు. అతనితో కూడా ఆలోచింతాము.

[అప్పుడు జంబుకేశ్వరశాస్త్రి ప్రవేశించుచున్నాడు]



జంబు కేశ్వర శాస్త్రి

జంబు—(తనలో) నాస్నేహితుడు రాత్రిచచ్చినాడే అనుకున్నాను. ఇదుగో మళ్ళి బ్రతికివచ్చినాడు. ఇఖముందయినా రాత్రిళ్ళుబయులుదేరి యెవళ్ళగుడిసెలలోనూ దూరకుండా బుద్ధి వచ్చేటట్టుగా యీడిగవాడు దుడ్డుకఱ్ఱపుచ్చుకుని వెముకలు విఱుగ

కొట్టినాడు. (బిగ్గరగా) ఓహోహో! సృగాలమహారాజులంగారికి నమస్కారము. తెల్లవారినదాకా యెక్కడా కనపడకపోతే స్వర్గానికి విజయంచేసినారనుకొన్నాను. మళ్ళీ బ్రతికివచ్చినారా?

సృగాల—(తనలో) వీడుస్వర్గానికి వెళ్ళమంటూవున్నాడు. మనవుపాయంలో స్వర్గానికి వెళ్ళడమనేదికూడా యేదయినా పెట్టవలెను. (ప్రకాశముగా) నీవన్నట్టునేనీరాత్రి స్వర్గానికి వెళ్ళవలసినవాణ్ణేకాని నేను యీలోకంలో చెయ్యవలసినగొప్పకార్యం యేదోవుండి, నీఆశీర్వచనబలంచేత బ్రతికి తల్లికడుపున మళ్ళీపునర్జన్మం యెత్తినాను.

జంబు—నిస్సందేహముగా పునర్జన్మమే యెత్తినావు. వాడు రాత్రిచీకట్లో కటికకర్ర పుచ్చుకుని గొడ్డునుబాదినట్టు బాదినప్పుడు చాకిబండమీద బట్టలువుతికినట్టు దబుకూదబుకూ దెబ్బలువినబడేటప్పటికి నావళ్ళంతా రణకంపరమెత్తి మీదిప్రాణాలు మీదపోయినవి. అప్పుడు నేను యేలా పారిపోయినానో యెలాప్రాణాలు దక్కించుకొన్నానో నాకేహాశ్చర్యముగా వున్నది. చేరువను నిలుచుండి విన్నవాడికి నాకేయిలాగువుంటే నోళ్ళారా దెబ్బలు తిన్నవాడికి నీకు యేలాగువుండిందో. ఆదెబ్బలచేత నీకాళ్ళులును నీవొళ్ళంతా కమిలి యీలాగనల్ల పడిపోయింది.

సృగా—నీవు వట్టి పిరికివాడవు. నాకాదెబ్బలువకలక్ష్యమా? ఇదివరకు లక్షసారులు వీటితాతదెబ్బలు తిన్నాను. అలవాటుచేత నావొళ్ళు గట్టిపడిపోయింది. ఈ అనుభవంచేత యీసారి రాత్రిళ్ళు చేసేపనిలో బహుజాగ్రతగా వుంటాను, వోర్వలేనివాళ్ళు యిదిపాపకార్యమంటారుగాని సుఖం బ్రతికివుండగానే అనుభవించకపోతే యిక చచ్చినతరువాతనా అనుభవించడం? మనసుఖంచూచి వోర్వలేక గిట్టనివాళ్ళు యేడుస్తూవుంటే మనం సుఖంపొంది సంతోషిస్తూ

వుందాము. నావొళ్ళు నల్లపడడం దెబ్బలచేత నేనా నీవనుకున్నావు! కాదుకాదు. దైవం అనుగ్రహించి నామేలుకోసరమే నేను కోరకుండానే యీనీలవర్ణం నాకనుగ్రహించినాడు. నేను దీనితో మహారాజును కావలెను. నాకు లక్ష్మియెత్తుకోవలెను.

జంబు—నిన్ను మొట్టముకటనే లక్ష్మియెత్తుకున్నది. యిఖనీ సహవాసం నాకక్కరలేదు. నీతోకూడా తిరుగుతూవుంటే నీదెబ్బల లక్ష్మి నాకుకూడా యెత్తుకుంటుందేమో! నీకుదైవం అనుగ్రహించిన నల్లరంగును గురించి నాకుకాస్త చెపుతావా వెళ్ళిపోతాను.

సృగా—తొందరపడబోకు. ఈవేషంచేత నాకు అరణ్యారాజ్యంవస్తే నిన్ను మంత్రిని చేస్తాను. ఈరం[illegible] నాకుమాత్రమే కాకుండా నీకుకూడా లాభంవున్నది. అందుచే నాకు నీసహాయం అవశ్యంగా కావలసివున్నది.

జంబు—నాసహాయంమాట తరువాత చూచుకుందాముగాని ముందుగా నీరంగుమాట చెపుదూ.

సృగా—రాత్రిచీకట్లో దెబ్బలుతిని పరుగెత్తుతూ తొందరలో కళ్ళుకనపడక ఫ్యాక్టోరీవారి నీలిగూనలో తల్లకిందుగాపడి మునిగిపోయినాను. అయితే నాఅదృష్టంచేత గూనలో నీలిరసమునిండాలేక అడుగునమాత్రమే ఉండడంచేత వొళ్ళంతాతడిసినా వెంటనే లేచి పయికిరావడానికి ప్రయత్నంచేసినానుగాని ఆగూన నుయ్యిలాగు లోతుగా వుండడంచేత పయికిరాలేక తెల్లవారినదాకా దానిలోనే జాగారంచేసినాను. నిన్నటిరాత్రి యేకాదశిగనుక యేకాదశినాడు జాగారంచేసినఫలం పూరికేపోదు.

జంబు—అవును పూరికేపోదు. రాత్రియేకాదశి గనుకనే యీవాడిగవాడుకూడా రామభజన చేసుకుంటూ మేలుకుని వున్నాడు. అక్కడ యేకాదశిఫలం నీప్రతిఅవయవానికిన్నీ కలిగిందికదా!

ఇక్కడకూడా నీలిగూనలకు కావలివుండేగుడిసెలో వెనుక నీవుమారి పోయిన పగ మనస్సులో పెట్టుకొని జాగారఫలంచావకొట్టలేదుగదా!

సృగా—ఆమాత్రం తప్పించుకోవడానికి నాదగ్గరవుపాయం లేదనుకున్నావా సుమిటి? నేనుచేసే దౌర్జన్యాలకు నావుపాయాల చేతనే తప్పించుకుని వస్తూ కులంవారిలో పెద్దగా వేషం వేసుకుని తిరుగుతూవున్నాను. నీవుచూచినంతవరకు నాకుమల్లె వేషాలు వేసే వాడున్ను మాయలు చేసేవాడున్ను వుపాయాలు పన్నేవాడున్ను మరియెవరయినా నీకంటికి కనపడ్డారేమో చెప్పు.

జంబు—మీరు చెప్పినమాట సత్యమే కాని రాత్రి నీలిగూనలో నుంచి యెట్లా తప్పించుకున్నారో సెలవియ్యండి.

సృగా—వెనుక చేసిన ద్రోహానికి కావలివాడువస్తే చంపి వేస్తాడని తెలుసుకుని నేనుముందుగా వాడువచ్చేటప్పటికి వూపిరి బిగపట్టి కాళ్ళుబిగడదన్ని చచ్చినట్టుగా కుండలో అడ్డముగా బడి వున్నాను. అప్పుడు వాడువచ్చిచూచి పాడునక్క తనంతటనే చచ్చిందనుకుని సంతోషించి, అక్కడికీ కోపంతీరిక నన్నుపయికిలాగి వెనుక కాళ్ళురెండూ చేతపట్టుకుని గిరగిరతిప్పి చావుమని కంచెఅవ తల గిరవాటు వేసినాడు. నేను ఆదెబ్బతో మూర్ఛపోయి తెలివి రావడంతోనే మళ్ళీవెనుకతిరిగి చూడకుండా పారిపోయివచ్చినాను.

జంబు—నీవు మహా అదృష్టమంతుడవు.

సృగా—నాఅదృష్టం యిప్పుడు బ్రతకడంలోలేదు: ముందు రాజ్యాధిపత్యం సంపాదించుకోవడంలో వున్నది. దీనిలో నీసహాయం తప్పకుండా కావలెను. నాకురాజ్యం రావడంతోనే నిన్నుతప్పకుండా నామంత్రిని చేసుకుంటాను. నన్నురాత్రి దేవతలు స్వర్గలోకానికి తీసుకొనివెళ్ళి సమస్త మృగరాజ్యానికీ నన్ను అభిషేకంచేసి ఈ నీల

వర్ణం అనుగ్రహించినారని నీవు మృగాలన్నిటితోనూ చెప్పి నమ్మించి వాటిని నన్ను కొలిచేటట్టు చెయ్యవలెను.

జంబు—ఈమాట నేను చెప్పగానే సింహాలూ మొదలయిన వారందరూ నమ్ముతారా? నక్క యెక్కడ! దేవలోకం యెక్కడ! అని నన్నాక్షేపించరా?

సృగా—అదంతా నీకెందుకు? నేను చెప్పినట్టుచేన్తూ. నీవు యీమాట వాటిచెవులో వేస్తే తరువాత పనిఅంతా నేనేచేస్తాను. ఇప్పుడు నేనే స్వయంగా వెళ్ళి యీపనిఅంతా నేనేచేస్తానుగాని నాగార వానికి లోపంవస్తుందని వకటీ వాళ్ళంతా నొప్పలుగా వుండడంచేత వకటీ సంశయిస్తూవున్నాను.

జంబు—ఈమాటలు చెపితే సింహాదులు నన్ను చంపివేస్త వేమోనని నాకుభయంగా వున్నది.

సృగా—నీకువచ్చినభయం యేమీలేదు. నీకంతభయంగా వుంటే నీవు ముందుగా మనకు బంధువులయిన కుక్కలవద్దకిన్ని తోడేళ్ళవద్దకిన్ని పోయి నేనుచెప్పిన స్వర్గలోక వృత్తాంతం వాటితో చెప్పి నమ్మించి వాటిని నావద్దకు తీసుకునిరా. అదంతా నేనేచేస్తాను. నీవునిజంమాత్రం యెవరితోనూ చెప్పకూడదుసుమా. చెపితే నీ మంత్రిత్వం పోతుంది జాగ్రత.

జంబు—నేను ఆలాగుచేస్తాను.

[అని యిద్దరును నిష్క్రమించుచున్నారు]

## ౨. రంగము—మహారణ్యపురము

[జంబుకేశ్వర శాస్త్రి గారును, కుర్కుర సోమయాజులు గారును, శునకాచార్యుల వారును, సారమేయ శ్రేష్ఠి గారును, భషక చయనులుగారును, గ్రామసింహ దాసుగారును, వృకేశ్వర రావు పంతులుగారును ప్రవేశించుచున్నారు]

జంబు—[illegible] స్వాములారా! నిన్నటిరాత్రి వక వింత జరిగింది విన్నారు కాబోలు?

కుర్కు—ఏమిటండీ? [illegible] నులయిన సృగాల మహా రాజుగారూ వున్నవాట అస్తమించారే. నిన్న [illegible] యజమానుడూ మళ్ళీ యేకోళ్ల గుడిసెలో [illegible] రాత్రి దెబ్బలుతిన లేదుగదా? యివే రాత్రిజరిగేవింతేను. [illegible] యున్న పట్టపగలు పల్లెవాళ్ల యింట్లోదూరి మొగవాళ్లు [illegible] కొట్టవచ్చేటప్పటికి ప్రాణాలు దక్కించుకొని పారిపోయినాడట.

జంబు—రాత్రి జరిగింది [illegible] మోసము వింతకాదు. రాత్రి మనసృగాల మహారాజుగారిని దేవతలు స్వర్గానికి తీసుకుని వెళ్లినారు.

శున—అలాగయితే నేటితో పీడ విరుగడ అయింది. యింటింటికీ తిరిగి తిండి తినడమూ, దెబ్బలు పడడమూ, మాయలు పన్ని తప్పించుకుంటూ వుండడమూ, అందరినీ మోసంచేస్తూ వుండడమూ, అన్నీ నేటితో సమాప్తమైనవి. పాపం! అతను అకాత్తుగా చావడం చూస్తే యెవళ్ళో [illegible] పొడవడంచేత చచ్చినాడనుకుంటాను. [illegible] సాధారణంగా యిటువంటి దుర్మరణమే సంభవిస్తుంది.

జంబు—మీరంతా భ్రమపడుతూవున్నారు. నాయజమాను డు చావలేదు. అతడు నిన్నరాత్రి నిజంగానే బొంబెతో స్వర్గానికి వెళ్ళి తిరిగీవచ్చినాడు—అతన్నీ—



శునకాచార్యులవారు

శున—చాలు! ఈపాటి నీమాటలు చాలించు ఇవన్నీ నక్క టుక్కులు. నక్క యెక్కడ! స్వర్గలోకం యెక్కడ! స్వర్గానికి వెళ్ళిన వారు మళ్లీవచ్చినారంటే యెవరు నమ్ముతారు? నీమాటలకర్థము నీయజమాను డెక్కడనో చావదెబ్బలుతిని చచ్చినవాడే మళ్ళీబ్రతికి వచ్చినాడని కాబోలును!

జంబు—కాదు కాదు. స్వర్గాన్నుంచి వచ్చినతరువాత నా యజమానుణ్ని నేను ప్రత్యక్షంగా చూచి మాట్లాడివచ్చినాను. అతనికి దేవతలు విచిత్రమయినవర్ణం దయచేసినారు. నేను కళ్ళారా చూచిన తరువాత యెలా నమ్మకుండావుంటాను?

శున—ఇదంతా యెవరినో మోసం చెయ్యడానికి వేసిన వేషం. నీ యజమానుడు తలలుమార్చేవాడు. నీయజమానుడితో నేను మాట్లాడినప్పుడల్లా యింటికి వెళ్ళిన తరువాత నాయెప్పటితలే నాకువున్నదో కొత్తదిగ్యేమైనా మార్చినాడో అని మాగుంటలోవున్న నీళ్లల్లో నీడచూచుకుంటాను. సృగాలమహారాజు కథలలో చెప్పేటనే మాయలమారి మల్లయ్య వంటివాడు.

శుక్ర—అయ్యా! ఆకథ నేనేకీ మేమందరమూ వింటాము చెప్పండి.

జంబు—ఆకథ తరువాత విందురుగాని ముందుగానాకథంతా విని నన్ను పంపి వేస్తురూ.

శుక్ర—నీకథలు మాకుయెప్పుడూ వున్నవే. కాస్తనేవు తాళవన్నును. ఆచార్లుగారూ! మీరుచెప్పవలసినకథ సెలవియ్యండి అందరమూ వినడానికి వేడుకపడుతూవున్నాము.

శునక—ఆలాగయితే మిక్కిలీ క్లుప్తంగా చెవుతానువినండి, ఒకవూళ్ళో మంచి కండపుష్టిగలవాడున్ను సోమరిపోతున్ను అయిన మాయలమారి మల్లయ్య అనే గొల్లవాడు వకడు వుండేవాడు. అతను సుఖంగాతిని యింట్లో కూర్చొని ప్రతివారినీ మోసంచేసి జట్టీలు తెస్తూవుండడంచేత యింట్లో వాళ్ళు వక్కరోజు తిండికి సేరు బియ్యమూ వండుకోవడానికి వక్కకుండా మాత్రంయిచ్చి యింట్లో నుంచి వాణ్ని వెళ్ళగొట్టినారు.

---



[illegible]

సార—వాడు ఎక్కడికి పోయినాడు?

శున—పల్లెల్లో పూరెల్ల అనుమానంగా వున్నందున ఎండను పడి నడిచిపోయి రెండుగ్రామములకు నకవ్వారు చేసి, అప్పట్లో మొదటి వీధిలోవున్న వకయింట్లో ప్రవేశించి, ఆయింటిముసలావిడను తాను తెచ్చినబియ్యం వారుండులో వేసి అన్నం వండిపెట్టుమని బతిమాలుకొన్నాడు. ఆవిడ బియ్యం ఎక్కువగావున్నవని వాటిలో పావుసేరు బియ్యంతీసి తక్కినవని కుండతో అన్నం వండి తెచ్చి వడ్డించబోయేటప్పటికి వాడుసంగతి కనిపెట్టి "ఆగుఆగు" అని కేకలు వేసినాడు.

కుక్క—తరువాత యేమిజరిగింది?

శున—ఆ కేకలువిని ఆవిడ వడ్డించక మానివేసి నిలుచుండగా, ఆవిడను చూచి "అమ్మా! వడ్డించండి. నేను ఆగుమన్నది మిమ్మల్నిగాదు, మీరేమో యింకుండలో కొంచెం బియ్యంతీసుకున్నారని కుండ చెప్పవచ్చేటప్పటికి, ఆమాత్రపు భాగ్యానికి నాతో చెప్పవలెనా అని కుండను ఆగుమన్నాను ఈకుండకు దివ్యజ్ఞానం వున్నది." అని చెప్పెను.

జంబు—వాడు వుపద్రిదుగావున్నాడే.

శుక—ఆమాటలు వినగానే తనకోడలు యింట్లో బియ్యం దొంగిలించి పళ్ళూ మొదలయినవి కొనుక్కోవడం చెపుతూవుంటుం దని ఆకుండ యెలాగైనా సంపాదించవలెనని బుద్ధిపుట్టి ముసలిదితన వద్దవున్న నాలుగురూపాయలూ యిస్తాననిన్ని కుండను తనకు యివ్వవల సినదనిన్ని బతిమాలుకోవడాని కారంభించెను. దివ్యజ్ఞానంగల కుండను వదిలిపెట్టడానికి తనకు యిష్టంలేకపోయినా ఆవిడయందుకలిగిన అనుగ్రహంచేత కుండనుంవ్వడానికి వప్పుకున్నట్టునటించి, ఆవిడ వద్దనున్న నాలుగురూపాయలు పుచ్చుకుని కుండ నావిడకంటగట్టి తనమోసం వెంటనే తెలియకుండా వుండడానికి మాఖపాదివారం నాడు కుండను పూజచేసికర్రిపుచ్చుకుని చెప్పుమనికొట్టవలసినదనిన్నీ, కుండచెపుతానని చెప్పినప్పటినుంచీయింట్లో జరిగేసంగతులన్నీ చెపుతూ వుంటుందనిన్ని, చెప్పి నమ్మించి వాడు తనదారినిపోయెను.

జంబు—తరువాత కుండసంగతి యేమయింది?

శుక—ఏమవుతుంది? మాఖపాదివారం వచ్చేవరకూ కని పెట్టుకునివుండి పూజచేసి చెప్పుచెప్పుమని కుండను కొట్టేటప్పటికి కుండపగిలిపోయింది. అప్పుడామె యేడుస్తూ జరిగినమోసం కొడు కుతో చెప్పుకొని అఘోరిస్తే వాడు మోసగాణ్ని వెతికిపట్టుకోవ డానికి బయలుదేరినాడు.

జంబు—మాయలమారిమల్లయ్య యీలోపుగా యెవరినైనా మోసంచేసినాడా?

శుక — కావలసినంతమందిని మోసంచేసినాడు. వాడికి మోసంచెయ్యడమే జీవనము. ఆముసలిదాన్ని మోసంచేసి నాలుగు రూపాయలూ కాజేసి వాటితో వకగొర్రె పొట్టేలునుకొని పొరు గూరికి వెళ్ళేటప్పటికి పెద్దవర్షమువచ్చి తడిసి యేమిచెయ్యడానికి

తోచక వీధిలో వకకోమటిదుకాణంవద్ద మోదులాగున తడుస్తూ గొర్రెపోతుతో కూడ నిలువబడెను. అదిచూచి కోమటి లోపలికి రాకుండా వానలోనిలువబడ్డావు నీకుచలిలేదా అనిఅడుగగా వాడు నెమరువేస్తూవున్న గొర్రెపోతును చూపించి యిది యిట్లాచలి అంతా నమలివేస్తూవుండగా నాకు చలియెక్కడవుంటుందని చెప్పి లోపలికి పోకుండా అక్కడనే నిలవబడ్డాడు.

జంబు — ఈయంత్రకూడా మోసం చెయ్యడానికి కాబోలును!

శున — అందుకు సందేహం యేమివున్నది? ఆమాటలువిని కోమటిసెట్టికూడా భ్రమపడి విశేషం పెద్దకుటుంబంగలవాడు కావడంచేతనూ, శీతకాలంలో ప్రతియేటా ముప్పయి నలభయిరూపాయల బట్టలు కావలసివస్తూ వుండడంచేతనూ తాను యెలాగయినా ఆగొర్రెపోతును గంపాదించవలెనని వాణ్ని బతిమాలుకొని లోపలికి తీసుకొనివచ్చి మంచిమాటలుచెప్పి తుదకు పదివరహాలిచ్చి గొర్రెపోతునుకొని తానే ఘట్టివాణ్నని సంతోషించెను. మల్లయ్య వెనుకటిలాగుననే మోసం వెంటనే బయలుపడకుండా వుండడానికి వకతంత్రింపన్ని మాఘపౌర్ణమినాడు గొర్రెను పూజచేసి చలిని మింగుమని అడిగితే తరువాత మింగుతూవుంటుందని వాడికాపూజావిధానం వుపదేశంచేసి సొమ్ముపుచ్చుకుని, రాత్రి ఆకోమటియింట్లోనే వివిందారగించి మరునాడు మరివక వూరికి నడిచినాడు. తరువాత కోమటికూడా మోసంతెలిసికొని వాణ్ని వెతకడానికి బయలుదేరినాడు.

జంబు — మల్లయ్య యీలోపుగా యెవరినైనా మోసంచేసినాడా?

శున — లక్షమందిని మోసంచేసినాడు. పదివరహాలూ బట్టకొంగున కట్టుకొని బొడ్డులో దోపుకొని అడివిమార్గాన్ని మరివక వూరికి వెళుతూవుండగా దోవలో వక వెలుగుబంటివచ్చింది. దాన్ని

చూచి భయపడి వాడు వక తాటిచెట్టు చాటుకు వెళ్ళేటప్పటికి వెలుగు బంటికూడా రెండోవైపునుంచివచ్చి తాటిచెట్టును కౌగిలించుకొన్నది. వాడు వుపాయశాలిగనుక వెలుగుబంటియొక్క రెండుచేతులూ తన రెండుచేతులతోను గట్టిగా భల్లూకవు పట్టుపట్టి వదలక, అది వకవైపుకువస్తే తానువకవైపుకు వెళుతూ యిద్దరూ చెట్టుచుట్టూ తిరుగుతూ వున్నారు. ఈలోగా వకసాహేబు నాలుగువందల వరహాల దస్తుపట్టుకుని గుర్రంమీదయెక్కి ఆదారిని వెళుతూ ఆతమాషాచూచి నిలువబడి అది యేమిటని అడిగినాడు. మఱుమాయల మారి అయిన మల్లయ్య తడుపుకోకుండా వుపాయం ఆలోచించి, అది జాంబవంతుని సంతతి అయిన వెలుగుబంటి అనిన్ని, అది ప్రతి దినమూ తాళప్రదక్షిణాలవల్ల నూరువరహాలు పెడుతూ వుండును దనిన్ని, యిప్పటికి పదివరహాలు పెట్టిందనిన్ని, తక్కిన తొంభయి వరహాలున్ను యింకొక ఘంటసేపటిలో పెడుతుందనిన్ని, యీభల్లూకాన్ని తానుతపస్సుచేసి సంపాదించినాననిన్ని, చెప్పినాడు. సాహేబు వచ్చి చూచేటప్పటికి తిరిగిన బడలికచేత వెలుగుబంటికి విరోచనం కావడమున్ను మల్లయ్యబట్ట విడిపోయి పదివరహాలున్ను దానిలో పడివుండడమున్ను జరిగివుండడంచేత వాడిమాటలు సాహేబుకు బహునిదర్శనంగాను నమ్మకంగాను కనబడ్డవి.

జంబు—అప్పుడేమిజరిగింది?

శుక—ఏమిజరుగుతుంది? మరివక మోసం జరిగింది. అటువంటి వెలుగుబంటిని బలవంతంగానైనా పుచ్చుకోవలెనని సాహేబు దాన్ని తనకిమ్మని అడగగానే సాహేబు వద్దనున్న నాలుగువరహాలనూ కిందపడ్డవరహాలనూ గుఱ్ఱమునూ పుచ్చుకొని వెలుగుబంటి చేతులు రెండూ గట్టిగా పట్టుకొమ్మని సాహేబుకు వప్పగించి తానా గుఱ్ఱమెక్కి బ్రతికిపోయినానని వాడు వాయువేగంగా కంటికి కన

పడకుండా పారిపోయినాడు. పాతవాడుపోయి కొత్తసాహేబువచ్చి తగులుకుని తిప్పడానికి ఆరంభించేటప్పటికి వెలుగుబంటి రొమ్మంతా కొట్టుకునిపోయి తక్కినవరహాలు పెట్టకుండానే చచ్చిపోయింది. అప్పుడు సాహేబు మోసపోయినానుగదా అని తెలుసుకొని మోసగాణ్ని వెతుకుతూ కాలినడకను బయలుదేరినాడు.

జంబు—కథ బహుతమాషాగా వున్నది

శున—తరువాతి కథవింటె యింకాతమాషాగా వుంటుంది. మల్లయ్య అక్కడనుంచి పోయి కొన్ని వరహాలు మార్చి మంచి బట్టలు మొదలయినవి కొనుక్కొని తాను గొప్పషావుకారున్నాని వేషం వేసి వకబోగందాని యింటికివెళ్ళి రాత్రి దానితో సుఖించి, అది నిద్రపోయిన తరువాత తాను లేచి దొడ్లో కట్టిపెట్టివున్న తనగుర్రమువద్దకి వెళ్ళి దాని లద్దెలో తనవద్దనున్న వరహాలన్నిటినీ పొదిగి వచ్చి తెల్లవారిజామునసే దానిన్ని లేపి దాన్ని గుర్రపుశాలలోనికి రహస్యంగా తీసుకుని వెళ్ళి లద్దె కడిగించి దానిలోవున్న వరహాలను చూపించి దానికి తనగుర్రముయొక్క మహిమనువర్ణించి చెప్పి ప్రతిదినమూ యీప్రకారంగా గుర్రము వరహాలలద్దె వేస్తుందని దానికి నమ్మకంపుట్టించి తనగుర్రాన్ని దానికి రెండువేలవరహాల కంటగట్టి లేచిపోయినాడు.

జంబు—ఈప్రకారంగా ప్రతిదినమూ మోసంచేస్తూవుంటే మోసపోయినవాళ్ళు యెవళ్లూ అతణ్ని పట్టుకోలేకపోయినారా?

శున—ఆకథ చెపుతానువిను. ఈనలుగురు తాలూకు మనుష్యులూ వెతుకుతూపోయి అందరూ వకచోట చేరి ఆనవాళ్ళు చెప్పుకుని తమరినందరినీ మోసముచేసినవాడు వక్కడే నని తెలుసుకుని వాణ్ని పట్టుకోవడానికి దేశసంచారంచేస్తూ వకపట్నంలో అతాత్తుగా వాణ్ని నడివీధిలో పట్టుకున్నారు. వాళ్ళను దూరంగాచూడ

గనే మల్లయ్య యితః వాళ్ళు తన్ను వదిలిపెట్టరని కనుక్కొని తక్షణం వుపాయం ఆలోచించినవ్వాడూ యెదురుగుండా పోయి వాళ్ళను కౌగలించుకొని స్నేహితులారా! మిమ్మల్ని యెన్నాళ్ళకు చూస్తినని యింటికి రమ్మని వారిని పిలుచుకొని పోయినాడు. వాడు మోసంచేసి సంపాదించిన సొమ్ముతో ఆవూళ్లో వక మంచియిల్లుకొని మరివకవూరినుంచి తన భార్య అని వకగుడిసేటిదాన్ని తెచ్చి దానితో ఆయింట్లో కాపురం వున్నాడు. ఇప్పుడీస్నేహితుల నందరినీ దీసుకొనిపోయినది దాని యింటికే.

జంబు—మల్లయ్య యిప్పుడుకూడా వీళ్ళనుమళ్ళీ మోసం చేస్తాడా?

శున—యేమిచేస్తాడో చూడు. వారినందరినీ యింటికి తీసుకుని వెళ్ళి వాకిట్లో కూర్చుండబెట్టి లోపలికిపోయి భార్య కేదో ఉపదేశంచేసి వక దుడ్డుకఱ్ఱ చేత బట్టుకొని వెలుపలికివచ్చి నలుగురి స్నేహితులనూ లోపలికి పిలుచుకొనిపోయి భార్యతో మనవారికి పిండివంటలతో విందు చెయ్యవలెనని చెప్పెను. పిండివంటలు చెయ్యడానికి డబ్బు యెక్కడవున్నదని భార్య విసుక్కొనెను. వారందరూ చూస్తూవుండగా వాడు కర్రి పుచ్చుకొని భార్యను కొడిచెను. కొడవగానే అది కిందపడి మూర్ఛపోయెను. అప్పుడు వాడు వారందరూ వద్దువద్దంటూవుండగా కర్రియొక్క రెండో చివరతో భార్యను మళ్ళీ కొడిచెను. ఆపోటు కొడవగానే భార్య చివాలున లేచి వొళ్లోనుంచి వెయ్యివరాల మూటతీసి మొగుడిచేతిలో పెట్టి బజారులోకి వెళ్ళి పిండివంటకు సామాగ్రి తెమ్మని ప్రార్థించింది. ఆ అద్భుతం చూచి వాళ్ళంతా విస్మయపడ్డారు.

జంబు—నాకుం యిది వింతగానే వున్నది.

శున—వింతగానే వుంటుంది. ఇదంతా వాడు లోపలికి

వెళ్ళినప్పుడు భార్యతో ఆలోచించి దానివొళ్లో వెయ్యివరాలమూట పెట్టి యివతలికి వచ్చినాడు. అమాయికులయి వీళ్లాసంగతి కనిపెట్టలేక వాడేమో గొప్ప మహానుభావుడనిన్నీ తమ లోపంచేతనే తమ కార్యం ఫలించిందికాదనిన్నీ నిశ్చయించి తామేలాగయినా యీ కర్రను సంపాదించవలెనని అందరూ వాడి కాళ్ళమీదపడి కర్రను తమకు కొన్నిమాసములు యెరువు యివ్వవలసినదని ప్రార్థింపగా వాడెంతో కష్టముమీద వొక్కొక్కరికి నెలరోజులు కర్ర యెరువు యివ్వడానికి వప్పుకుని మొదటివైపుతో పొడిస్తే చచ్చిపోతుందనిన్నీ రెండోవైపుతో పొడిస్తే వరహాలమూటతో లేచి వస్తుందనిన్నీ వారికా రహస్యమంతా వుపదేశంచేసి పంపివేసినాడు.

జంబు—తరువాత వాళ్ళ యింటికాడ యేమి జరిగింది?

శుక—వాళ్లు యిళ్ళకువెళ్ళి కర్రతో భార్యలను పొడవడానికారంభించగానే మూర్ఛపోవడానికి వరహాలమూటతో లేచి రావడానికి బదులుగా మొగుళ్ళను తిట్టి పొరుగువాళ్ళతో చెప్పి అల్లరి చెయ్యడానికారంభించినారు. అప్పుడు వాళ్ళందరూ తెలివితెచ్చుకుని యిదంతాకూడా పెద్ద మోసమని నిశ్చయించుకున్నారు.

జంబు—ఈ మోసం తెలిసినతరువాత వాళ్ళు యేమిచేసినారు?

శుక—యేమిచేస్తారు. తమ తెలివితక్కువకు సంతోషించి, అంతరూకలిసి కూడాపలుక్కుని, యిక వాడితో మాట్లాడకూడదనిన్నీ మాట్లాడితే మళ్ళీ మోసం చేస్తాడనిన్నీ యేర్పరచుకొని, వకరి యింట్లోవున్న భోషాణము నలుగురూ నెత్తిమీద పెట్టుకొని పోయి వాడియింటికి వెళ్ళి వాణ్ణి భోషాణంలో పెట్టి తాళంవేసి సముద్రంలో పడవెయ్యవలెనని నిశ్చయించుకున్నారు.

జంబు—అలా చేసినారా?

శున—కొంతవరకు చేసినారు. వారందరూ భోషాణం పట్టుకొని పోయి వారి గుమ్మంముందర దింపి లోపలికి పోయేటప్పటికి మల్లయ్య వాళ్ళను చూచి 'అన్నలారా' అని కాగలించుకో వచ్చినాడు. వాళ్ళు మాట్లాడకుండా వాణ్ణి పట్టుకొని బలవంతంగా భోషాణంలో పడవేసి తాళంవేసి నెత్తిమీద పెట్టుకొని మహావేగంగా సముద్రంకేసి పరుగెత్తుకొని పోయినారు. వాడు లోపల కూర్చుండి 'వద్దువద్దు' అని కేకలు వెయ్యడానికి మొదలుపెట్టినాడు.

జంబు—వాళ్ళు వాడిమాటలు విన్నారా?

శున—మోసపోయివున్న వాళ్ళు యెందుకు వింటారు? వాళ్లు వాడి అరుపులు లక్ష్యపెట్టకుండా వూరి వెలుపలదాకా పెట్టె మోసుకొనిపోయి, అలసటవచ్చి పెట్టెను కింద దింపి దాహం నిమిత్తం సమీపంలోవున్న యింటికి వెళ్ళినారు. వాళ్ళు వెళ్ళగానే గొర్రెలమందను తోలుకుని ఆదారిని పోతూ వద్దువద్దనే కేకలు విని వక గొల్లవాడు పెట్టెవద్ద నిలువబడి యేమిటని అడిగెను. పెట్టెలోనుంచి వాడు మంచి చక్కని పదహారేళ్ళ పిల్లను తనకిచ్చి బలవంతముగా వివాహం చేస్తామంటే తాను వద్దంటూవున్నావనిన్నీ యీ పెట్టెలో యెవరుకూర్చుంటే వారికే ఆ పిల్లనిస్తారనిన్నీ చెప్పెను. అప్పుడు వాడు తనకు పదహారేళ్ళ భార్య దొరుకుతుందని ఆశపడి తన గొర్రెలమందను వాడికిచ్చివేసి తానందులో కూర్చుండడానికి వప్పుకుని, వాళ్ళు తాళంచెవి పెట్టెనేవుంచి వెళ్ళినందున పెట్టె తాళంతీసి మల్లయ్యను వదిలివేసి తానందులో కూర్చుండి వద్దువద్దని యథాప్రకారంగా కేకలువేస్తూవుండెను. మల్లయ్య వాణ్ణి లోపలపెట్టి మళ్ళీ పెట్టెవేసి గొర్రెలమందను తోలుకుని యింటివంక నడిచెను. ఇంతలో దాహానికి వెళ్ళినవాళ్ళు తిరిగి వచ్చి పెట్టె మోసుకునిపోయి సముద్రములో లోతుగా పారవేసినారు.

తిరిగి భూలోకానికి పంపివేసినారు. దేవతా వర ప్రభావంచేత ఇతని వంటికి దివ్యమైన తేజస్సువచ్చింది. మీతోడు, నేను అబద్ధంఆడితే నరమాంసం తినే నిశాచరుణ్ని అయినట్టే.



కుక్క—కసాయివాళ్ల గార్డ్.

కుక్క—వూరికే వట్టిపెట్టుకోకు. లోకంలో వొట్లూ సత్యాలూచేసేవాళ్ల మాటలు మంచివాళ్ళెవరూ నమ్మరు.

జంబు— నావొట్లూ మాటలూ అటువంటివి కావు, నేను పరీక్షాణపూర్వకంగా చెపుతాను. నేనుచెప్పేదంతా సత్యం. సత్యం కానిది యేమీ చెప్పను. అబద్ధమాడితే శిశుహత్యచేసినట్టే. మృగాల మహారాజు నిజంగా మనకందరికీ రాజయినాడు.

భషక—అలాగయితే మనము సింహాలసేవ వదిలివేసి యిక నక్కపోతుకొలువు చెయ్యవలెనుగాబోలును?

జంబు—భషకచతురులుగారూ? నక్కపోతని యెక్కడనో వెనుకటిమాట సెలవిస్తారేమి? అతడు మృగరాజ్యానికి రావడంచేత

యిప్పుడు సింహామే అయినాడు. ఏమండీ గా్రిమసింహదాసుగారూ ? మీరు వూరుకుంటారేమి? యిందులో న్యాయం సెలవియ్యండి.

గా్రిమ—సింహానికిగల పైడితేజస్సూ గుణగౌరవమూ నక్కపోతుకు వెయ్యిరంగులు వేసుకున్నా వెయ్యిరాజ్యాలు వచ్చినా రావు. లోకంలో సహజగుణం యెవరికైనా విడుస్తుందా? ఎంత రాజ్యమువచ్చినా సింహము సింహామే నక్కపోతు నక్కపోతే. సృగాలమహారాజు వెరుకటిగుణాలు మానడనుకుంటాను.

జంబు—ఈవిషయంలో మీరుయెవ్వరూ తిన్నగా ఆలోచించడంలేదు. యెవరికైనా చిన్నతనంలోవుంటే అల్లరిచేష్టలు పెద్ద పెరిగిన తరువాతకూడా వుంటునంటే? రాజ్యం రావడంతోటే ఆగాజ చిహ్నాలూ, ఆగుణగౌరవమూ, ఆకీర్తిప్రతాపములూ, అన్నీ సహజంగావస్తవి. కేవలం విష్ణుఅంశ వుంటేనేకాని రాజుకాడు. 'నావిష్ణుః పృథివీపతి' అన్నవాక్యం మీరువిన్నదికాదా? విష్ణుఅంశాసంభూతుడు గనుకనే మన సృగాల మహారాజుగారివద్ద కృష్ణలీలలు అనేకం వుండడం తటస్థించింది. అతను విష్ణువు యొక్క హాంశ అయినందుకు యీవొక్క నిదర్శనమూ చాలదా ?

భమక—విష్ణునిహాంశ అయినా శివునిహాంశ అయినా మరి యెవరి హాంశఅయినా లోకంలో దుర్మార్గుడికి అధికారం రావడంతోనే ప్రజలకు చాలా యిబ్బంది కలుగుతుంది. అందరూతనచుట్టూ తిరుగుతూవుంటే దుష్టుడికి తానే గొప్పవాణ్నని గర్వంపట్టుకుని కళ్ళుమీదికివస్తవి.

జంబు—రామరామ? మన సృగాలమహారాజు విషయంలో అటువంటి పాపపు మాటలు అనుకోరాదు. అతడి వినయమూ నవ్వు మొఖమూ తేనెమాటలూ మీరుయెరుగరా?



భషక దళపతులుగారు

భషక—అవన్నీ సగం. వినయాలుగాని నిజమయినవి కావు. ఆ మాయలన్నీ మాకు తెలుసును. అతనినోరు మాట్లాడుతూవుంటే నొసలు వెక్కిరిస్తూవుంటుంది. నాలిక బెల్లంలాగు వుంటుందిగాని హృదయంమాత్రం కత్తెరవంటిది. అతని తేనెమాటలునమ్మి యిది వరకు యెందరు మోసపోయినారు, కారు?

జంబు—ఆయన విరోధులు వారికేఅలాగు అంటారుగాని మీరుప్రత్యక్షంగా చూడనిదీ చెప్పేదుమాటలు విశ్వసించరాదు. అతడు బహు దొడ్డవాడు, చిన్నప్పటినుంచీ సహవాసంచేస్తూవున్న మాకు తెలుస్తుందిగాని ఆయనసంగతి యితరులకు యేమి తెలుస్తుంది? కావలిస్తేనన్ను అడగండి - ఆయన గుణవర్ణన చేస్తాను. ఆయన శక్తిసామర్థ్యాదుల చేతనూ, గుణమహిమచేతనూ యీ అరణ్యరాజ్యానికి కాదుగదా త్రిలోకాధిపత్యానికయినా తగిన

వాడు. కావలిస్తే యీసంగతి నేను యేసభకురమ్మంటే ఆసభకు వచ్చి ప్రమాణంచేసి చెపుతాను.

గ్రామ—సభలలోకి వెళ్ళి ప్రమాణాలు చేసేవాళ్ళమాటలు నమ్మరాదు. నీవు వెయ్యిచెప్పినా శృగాలమహారాజు మంచివాడవుతాడంటే నేనునమ్మను. పుర్రెనుబుట్టినబుద్ధి పుడకలతోగాని పోదు.

జంబు—తినబోతూ రుచులెందుకు? ఆయన యిప్పుడు మనకందరకూ రాజవుతూ వున్నాడు గనుక, ఆయన గుణసంపత్తి యిక మీరందరూ స్వానుభవంచేతనే తెలుసుకుంటారు. వృకేశ్వరరావు పంతులుగారూ! మీరు యిటుఅటు చెప్పకుండా మౌనంవహించి వూరుకున్నారేమి? శృగాల మహారాజుగారి విషయంలో మీఅభిప్రాయంయేమిటి?



వృకేశ్వరరావు పంతులుగారు

వృకే—ఆయనకు మృగరాజ్యాధిపత్యం వచ్చేమాట నిశ్చయమేనా?

జంబు-అవును నిశ్చయమే. దేవతలు వరంయిచ్చిన తరువాత వారిమాట తప్పిపోవడంకూడా వుంటుందా? సింహం మృగరాజు కావ

డంకంటే మన బంధువుడయిన నక్క మృగరాజయితే మనకు చాలా లాభాలువుంటవి.

శున — బంధువుడు అంటూవున్నావు. మనబంధుత్వం పూర్వోత్తరమేమిటో కాస్త చెపుతావా?

జంబు — అన్నీ యెరిగివుండీ సమస్తమూ తెలిసినవారు మీరే యేమీ యెరగనట్టు యిలాగు సెలవిస్తారేమి? జంతుశాస్త్రంలో కుక్కలున్ను నక్కలున్ను తోడేళ్ళున్ను నక్కజాతిలో వన్నమాట మీరు చదువలేదా? మనజాతిలోవాడు వక్కడు గొప్పగావున్నా మనకందరికీ మహాగౌరవము. కాబట్టి మీరందరూ కృషిచేసి దేవతలిచ్చిన రాజ్యపదం మీరు నిలుపవలెను.

వృకే — సృగాలమహారాజు రాజ్యంవల్ల మనకు యేవో లాభాలు వున్నవన్నవే, అవి యేమిటి?

జంబు — సింహం రాజ్యచేస్తూవుంటే మనంయెక్కడా వూరు పేరూ లేకుండా అడగివున్నాము. మనబంధువుడైననక్క రాజ్యానికి రావడంతోటే మననామరూపాలు బయలుపడుతవి. మనం ప్రముఖుల మవుతాము. అతనివద్దమనముంతాకుంగం చేస్తూవుంటే గొప్ప గొప్పవాళ్ళుసమేతూ మనను ఆశ్రియించి చుట్టూ తిరుగుతూ వుంటారు. మనకార్యాలు అనేకాలు మనం సులుభంగా నెరవేర్చుకోవచ్చును.

శున — సృగాలమహారాజు రాజయితే మనంమంత్రులం కావడం నిశ్చయమేనా?

జంబు — ఎంతమాత్రమున్ను సందేహంలేదు. దానికినేను పూచీపడుతాను. శునకాచార్యులుగారు మనకందరికీ గురుపీఠం

గనుక, ఆయనకు సేనాధిపత్యం వస్తుంది. మనకందరికీకూడా మన మన సామర్థ్యాలకు తగినట్టుగా గొప్పవుద్యోగాలువస్తవి.

సార—గొప్ప వుద్యోగాలన్నీ మనకేవస్తే సింహ శార్దూలాదులపని యేమవుతుంది?

జంబు—వాళ్ళకు దూర దేశాలలో యేమైనా అధికారాలిప్పించి వాళ్ళపోరు చల్లార్చుతాము. మనంమాత్రం సన్నిధానవర్తులమయి అంతరంగిక సభికులమై మంత్రిత్వంచేస్తూ వుందాము. అప్పుడు సింహశార్దూలాదులు కూడా మనఅనుగ్రహం కోరి యెప్పుడూ సముఖంలో వుండేవాళ్ళం మనంయేమిచేసిపోతామోఅని మనకు లంచాలు పంపుతూ వుంటారు.

సార—వాళ్ళు మనకుపంపే లంచాలు యేమివుంటవి?

జంబు—అలాఅనవద్దు. లక్షవుంటవి. మనంఇకముందు భోజనంనిమిత్తంకూడా కష్టపడనక్కరలేదు. సింహాలూ పులులూ తాము చంపిన మృగాలలో కొన్నిటిని మనకు నజర పంపిస్తూవుంటే మనం ప్రత్యేకంగా వేటాడడం అక్కరలేకుండా కాలిమీద కాలు వేసుకొని సుఖజీవనం చెయ్యవచ్చును.

గ్రామ—ఇదంతా బహుబాగావున్నది. మనం అవశ్యంగా సహాయంచేసి సృగాల మహారాజుకు రాజ్యం స్థిరపరచవలెను. అప్పుడు యిదివరదాకా మనచేతనే సేవచేయించుకుంటూవున్న సింహాలూ మొదలైనవి మనకేసేవచేసే స్థితిలోకివస్తవి. యిలాగు యెల్లకాలమూ శ్వవృత్తిలోపడియేడుస్తూ వుండడంకంటె మహారాజభోగం వక్కరోజు అనుభవిస్తే చాలదా? నిజమయిన సింహంవచ్చి గ్రామసింహాన్ని అనుసరిస్తూవుంటే యెంతగౌరవంగా వుంటుంది?

జంబు—బుద్ధిమంతులుగనుక గ్రామసింహదాసుగారు నిముషంలో నిజంకనిపెట్టి కార్యనిశ్చయం చేసినారు. వారిమాటకు మనం

యెవ్వరమూ అడ్డము చెప్పకుండా అందరమూ యెవరిచేతనయినపని వారు చెయ్యడానికి పూనుకోవలెను.

శున— ఇందులో మనం చెయ్యవలసిన పని యేమిటి?

జంబు—మనమందరమూ ప్రతిఅడివికీ వెళ్ళి చూచినమృగాలతో నల్లా సృగాలమహారాజును రాత్రి దేవతలు స్వర్గలోకానికి తీసుకునివెళ్ళి మృగరాజ్యాని కభిషేకంచేసి అనేకవరాలు యిచ్చినారనిన్నీ, దేహానికి నీలమేఘచ్ఛాయ ప్రసాదించినారనిన్నీ, యీదినం మొదలుకుని మీరందరూ సృగాలమహారాజును రాజుగా అంగీకరించి అతని ఆజ్ఞానువర్తులయి సంచరిస్తూవుండవలెననిన్నీ, చాటిరావలెను.

శున—ఇదెంతపని? ఈపనివక్క నిముషంలో చెయ్యవచ్చును.

కుర్కు—తొందరపడగూడదు. మనంయేసంగతీ బాగాఆలోచించుకుని సాధక బాధకాలు విచారించుకుని మరీచెయ్యవలెను. తొందరపడితే కార్యంకాదు.

జంబు—కుర్కురసోమయాజులుగారూ! యిందులో నీకుక్కబుద్ధి పోనిచ్చుకున్నావుకావు. తీరాఅందరూ వప్పుకున్న కార్యానికి వెంటనే కాకుండా నీవుమధ్యవిఘాతాలు తెచ్చి పెడుతూవున్నావు.

కుర్కు— నీనక్కబుద్ధి నీవుపోనిచ్చుకున్నావుకావు. బాగా ఆలోచించుకోకుండా నీనక్క వినయాలూ మాయమాటలూనమ్మి అందరూమోసపోయి గోతిలో పడుతారనుకున్నావా? గోతులు తవ్వడం నక్కలకు సహజం.

జంబు—ఛీఛీ! అట్లా మొఱగకు. మేముగోతులలో పడ్డవాళ్ళకు పయికితీసే వాళ్ళముకాని గోతులలో పడదోసేవాళ్ళము కాము.

కుర్కు—ఛీఛీ! పిచ్చికూతలుకుయ్యకు. మళ్లీమాట్లాడితే గొంతుక కొరికివేస్తానుచూడు.

జంబు— రాజుగారితో చెప్పి నిన్నుయేమిచేస్తానో చూడు. పక్కనుచూచిన వాడల్లా వేటకాడే అవుతూవున్నాడు!

శున— మీరుపూరికే పోట్లాడకండి. బాగా ఆలోచించుకునే కార్యంచేతాము. మనం సృగాలమహారాజువద్దకువెళ్ళి, దేవతలు ఆయనకిచ్చినవరాలు మొదలయినవన్నీ కనుక్కొని తరువాత యేమిచెయ్యవలెనో సిద్ధాంతంచేసుకుందాము రండి.

కుక్క—అదిబాగావున్నది.అలాచేతాము రండి.

(అందరూనిష్క్రమించుచున్నారు)

---

3. రంగము—సృగాలమహారాజ గృహము.

---

(సృగాలమహారాజును, జంబుకేశ్వరశాస్త్రియు ప్రవేశించుచున్నారు)

సృగా—జంబుకేశ్వరశాస్త్రీ! నీమాటలవల్ల మనవారికందరికీ నిశ్చయముగా నమ్మకముకలిగినదా?

జంబు—నిస్సందేహంగా కలిగింది. వారందరూ మిమ్మల్ని మృగరాజునుగా అంగీకరించి యీ శుభవార్తను సింహాది సమస్త మృగములకూ వెల్లడించి రావడానికికూడా వప్పుకున్నారు. ఆ పని నిమిత్తమే వారు బయలుదేరబోతూవుండగా మధ్య కుక్కరసోమయాజులు అడ్డంవచ్చి వాళ్ళు వెళ్ళకుండా చెడకొట్టినాడు. అందరూ వప్పుకున్న కార్యానికి విఘాతం కలుగచెయ్యడం నాకు ధర్మంకాదని నేను యేమో చెప్పబోయేటప్పటికి కన్నుమిని నామీద బడి కాట్లకుక్కలాగు కరవవచ్చినాడు.

సృగా—ఆ కుక్కలకొడుకు యెప్పుడూ మనకార్యానికి అడ్డంవస్తూనే వుంటాడు. నా రాజ్యకాలంలో వాణ్ని యేమిచేయిస్తానో చూడు. పదిమందిలో నా మంత్రివైన నిన్ను అవమానం చేసిన

వాణ్ణి పూరికే పోనిస్తాననుకొన్నావా? నీవు మంత్రివన్న మాట వాళ్ళతో చెప్పినావా?

జంబు—చెప్పలేదు. చెపితే వాళ్ళకందరికీ ఓర్వలేనితనం హెచ్చవుతుంది. అందులోనూ కుర్కురసోమయాజులు నాకు మంత్రిత్వం వచ్చిందంటే మరీ కళ్ళల్లో నిప్పులుపోసుకుంటాడు. వాడివి మిక్కిలి పాపిష్టికళ్లు. మీకందరికీ గొప్ప ఉద్యోగాలవుతవనీ, రాజాస్థానంలో అంతరంగిక సభికులవుతారనీ, మాత్రం చెప్పి వాళ్ళకు ప్రోత్సాహం కలిగించినాను.

సృగా—మంచిపనిచేసినావు. ఆ విషయంలో నీవు చెప్పకోక పోవడమే మంచిది. నాలుగురోజులు ఓపికపట్టు కుర్కుర సోమయాజులను యేమిచేయిస్తానో నీవేచూస్తావు. పూర్వం అక్కడా యిక్కడా తెగమొరిగి రాత్రిళ్ళు నాకార్యం చెడగొడుతూ వచ్చినవాడూ, ఇంటివాళ్ళను లేపి నాకు రెండు మూడుస్థలాలలో దెబ్బలు తగిలించినవాడూ, వీడే. మన రాజ్యకాలంలో శిక్షలుపొందే వాళ్ళల్లో కుర్కురసోమయాజులే మొదటివాడవుతాడు. మన శత్రువుల నందరినీ సాధించడానికి యిప్పుడు మంచి సమయం వచ్చింది. చిట్టచివరకు మనవాళ్ళందరూ యేమినిశ్చయం చేసినారు?

జంబు—తామందరూ స్వయంగా మీదగ్గరకు వచ్చి మీతో మాట్లాడడానికి నిశ్చయించుకున్నారు. అదుగో దూరాన్నుంచి వాళ్ళందరూ వస్తూవున్నట్టున్నారు.

సృగా—అవును వస్తూయున్నారు. నీవు వాళ్ళకు కనపడకుండా వెనుక గోతిలో దాక్కో. వాళ్ళందరిచేతా వప్పించే నీకు మంత్రిత్వం యిప్పిస్తాను. వాళ్ళముందర వకవేళ నిన్ను నేను దూషించినా నిజమనుకోకుమా. ఎదుటివాళ్ళను వశపరుచుకోవడానికి కార్యసాధకుడు యెన్నయినా మాయలు పన్నవలెను. నీవు

నాకు ఆ ప్రకోటిలోవాడవు. నీవు యెరుగవుగాని నా మనస్సులో నిన్ను ప్రాణంకంటె యెక్కువగా చూసుకుంటాను. ఇక నీవు వెళ్ళు.

జంబు—ప్రధాన మంత్రిత్వంమాత్రం నాకు తప్ప మరి యెవ్వరికీ యివ్వకూడదు సుమండీ. మీరు వాళ్ళముందర నన్ను యెన్నిమాటలన్నా నేను మీమీద మనసులో కోపించుకోను.

(అని వెళ్ళుచున్నాడు.)

సృగా—ఇప్పుడేలాగయినా మాయలుపన్ని వాళ్ళనందరినీ మన వలలో పడవెయ్యవలెను. కుర్కురసోమయాజులు వక్కడూ మాత్రం సాధారణంగా మాయలలో పడేవాడుకాడు. అయినా వాణ్ని కూడా నా బుద్ధిబలంచేత లోపరుచుకొంటాను. నా శరీరం యొక్క విచిత్రమయిన యీవర్ణం చూచినతరువాతకూడా వాళ్ళు నేను రాజును కాలేదంటారా?

[అప్పుడు కుర్కురసోమయాజులును, శునకాచార్యులును
సారమేయ శ్రేష్ఠిగారును, భషకచయనులు
గారును, గ్రామసింహ దాసుగారును,
వృకేశ్వరరావు పంతులుగారును,
ప్రవేశించుచున్నారు.]

శు—అదుగో—సృగాలమహారాజు వక్కడూ కూర్చుని వున్నాడు. అతనికి దేవతలు ప్రసాదించిన యీ కొత్తవర్ణం బహు విచిత్రంగా వున్నది. ఇతడు మృగరాజయినందుకు సందేహాము లేదు.

కుర్కు—మనం పయిరంగులుచూచి భ్రమపడకూడదు. అతనితో మాట్లాడితే యిప్పుడు అన్నీ తేలుతవి.

సృగా—(లేచి యెదురుగా వెళ్ళి) రాజబంధువులందరూ వస్తూ యున్నారు దయచెయ్యండి. కుర్కురసోమయాజులుగారూ! మీరు

దయచెయ్యడంచేత యీ రోజున నా గృహం పావనమయింది. ఇదివరదాకా యెవ్వరూ ఆదరించేవారు లేక నిగురుగవిసిన నిప్పులాగు అణిగివున్నారుగాని మీరందరూ మంత్రిపదానికి అర్హులైనవారు. మీకు యిప్పుడు దైవానుగ్రహంవల్ల మంచిదినాలు వచ్చినవి. ఇఖ మీశక్తి సామర్థ్యాలు లోకానికి వెల్లడిఅవుతవి. మీవంటి నిజమయిన సామర్థ్యంగలవారు యెప్పుడో వకప్పుడు గొప్పస్థితికి వచ్చి ప్రసిద్ధికెక్కుతారుగాని, అశక్తులలాగు యెల్లకాలమూ అణిగి వుండరు.

కుర్క—(తనలో) ఈవంచకుడు నక్కవినయాలు కనపర్చి ముఖస్తుతులు మహాచేస్తూవున్నాడు. వీడిమాటలు యెంతతియ్యగా వున్నా వీడి కడుపులో పుట్టెడువిషం వున్నది. (బిగ్గరగా) మీకు మృగరాజ్యం వచ్చినందుకు మేమందరమూ బహు సంతోషిస్తూ వున్నాము.

మృగా—మీకంటూ లేమి మనకనండి. ఈరాజ్యం మీదే కాని నాది కాదు. నాకిప్పుడు ఈ ప్రపంచసుఖాలమీద విరక్తిపుట్టిపోయింది. వెనుకటి నడతంతా మానివేసి ముముక్షుడనయి యోగివలె వుండవలెనని నేను యిప్పుడు యోగాభ్యాసం చేస్తూవున్నాను. నిన్నరాత్రి దేవతలు నన్ను స్వర్గానికి తీసుకునివెళ్ళి బలవంతంగా మృగరాజ్యాధిపత్యానికి అభిషేకంచేసినప్పుడు లోపలనాకు యెంత యిష్టం లేకపోయినా మీ నిమిత్తంఅంగీకరించినాను. పేరుకు నేను రాజునయినా రాజ్యంచేసేవారంతా మీరే. నిజంచేత ఈరాజ్యం మీదేకాని నాదికాదు. మీరు అగ్నిహోత్రంలో వకకాలూ మంచిగంధంలో ఒకకాలూ పెట్టి సర్వజన క్షేమకరంగా పాలనము చెయ్యవలెను. నాకు లభించిన రాజ్యం మీ స్వాధీనంచేస్తూవున్నాను.

శున—మాకు అధికారంవస్తే పూర్వపు మహానుభావులను మరిపించి న్యాయంగా పరిపాలన చేస్తాము మీకీర్తి—

సృగా—వస్తేగిస్తే అని సందేహం పెట్టకండి. ఇదుగో నా రాజ్యమంతా మీకే వదిలి వేస్తూవున్నాను. యెవరు యేవుద్యోగాలలో వుంటారో మీలోమీరే నిర్ణయం చేసుకుని ప్రజలనుబిడ్డలలాగు పరిపాలన చెయ్యవలెను.

శున—మీకీర్తి మూడులోకాలలోనూ వ్యాపించేటట్టుగా పరిపాలనం చేస్తాము. ప్రజాసౌఖ్యంమాట మీరు మాతో పదేపదే చెప్పవలసిన పనిలేదు. మీ యేలుబడికాలంలో ధర్మం నాలుగు పాదాలు నడుస్తూవుంటే చూచి సుఖస్తూవుండే ప్రజలు యీ కలియుగంలో కృతయుగం వచ్చినదని సంతోషిస్తారో లేదో త్వరలో మీరే చిత్తగిస్తారు. కేవలశివావతారమయిన కాలభైరవుడి సంతతివారము మేము స్వప్నావస్థలోనైనా అక్రమానికి లోబడుతామా?

సృగా—నాకానమ్మకంవున్నది. మీరుయెప్పుడూ యీగకాలంత అక్రమానికి లోబడరు. అందుచేతనే నేను యీరాజ్యమంతా మీస్వాధీనం చేస్తూవున్నాను. మీరు అక్రమంగా నడిస్తే మాత్రం నాకు ... విచిత్రవర్ణం దయచేసిన మహానుభావులు దేవతలు చూచి సహిస్తారా? మీకుమాత్రం ఆసంగతి తెలియదా?

కుక్క—(తనలో) తనకు దేవతలబలంవున్నదనీ తనకు వ్యతిరిక్తంగా నడిస్తే నష్టంవస్తుందనీ వీడు సూచనగా తెలియచేస్తూవున్నాడు. వీడికి అకస్మాత్తుగా యీరంగురావడంచూస్తే దేవతలు వక వేళ యిచ్చివుంటురనే తోస్తుంది. వీడు యీమధ్య అభ్యాసం చేసిన యోగ మహిమచేత దేవతలకు వీడిమీద అనుగ్రహం వచ్చిందేమో! (బిగ్గరగా) మీరు యేమిపుణ్యం చేసుకున్నారోకాని బహుకాలం తపస్సుచేసిన ఋషులకుసమేతూ ప్రత్యక్షంగాని దేవతలు మీకు నిముషంలో ప్రత్యక్షమయినారు.

స్పృగా—వారు ప్రత్యక్షం కావడం వారికి నామీద కలిగిన నిర్హేతుక జాయమాన కటాక్షంచేతనే కాని — యొక్క శక్తిసామర్థ్యముల చేత కాదు. వారు కొంత కాలమైన తరువాత వచ్చి మీకందరికీ కూడా దర్శనం యిస్తామని సెలవిచ్చినారు. ఈసారి వారు భూమి మీదికి విజయం చేసినప్పుడు మంత్రిశిఖామణులయిన మీకందరికీ వారి దర్శనం చేయిస్తాను. మీరు యెవ్వరెవ్వరేయేవుద్యోగాలు కోరుకుంటారో నిర్ణయం చేసుకోండి. లేకపోతే సింహాసనులువచ్చి తరువాత నాకు కొందరయిస్తారు.

సార—శునకాచార్యులవారు మనకందరికీ గురుపీఠము. ఆయనను ప్రధాన మంత్రిగా చేస్తే బాగావుంటుందనుకుంటాను.

వృకే—ఆయన వైదిక విషయాలలో అసామాన్య ప్రజ్ఞగల వారయినప్పటికీ లౌక్యవిషయాలలో విస్తారం అనుభవం గలవారు కారు. కాబట్టి ప్రధానితనం మరివకరికి యిస్తే బాగావుంటుందని తోస్తుంది.

స్పృగా—కుక్కుర సోమయాజులుగారికి యిస్తే బాగావుంటుందేమోనని నేననుకుంటాను. ఆయన ధైర్యస్థయిర్యములు గలవాడు, న్యాయప్రవర్తన గలవాడు, లౌక్యానుభవంకూడా విస్తారంకలవాడు అయినా కానీ నేనుచెప్పినానని ముఖమూటపడక మీయిష్టంవచ్చిన వారికే యివ్వవచ్చును. కుక్కుర సోమయాజులుగారు నిష్కారణంగా నాకేమో తనమీద మనస్సులో ద్వేషంవున్నదని భ్రమపడుతారుగాని నాకాయన మీదవుండే గౌరవమూ ప్రేమా మరియెవరి మీదనూ లేనుసుమండీ. నేను యింతమందిలో ప్రమాణంచేసి దైవ సాక్షిగా చెపుతాను. నామాటనమ్మండి.

కుక్క—అవును మీకు నామీద పరిపూర్ణానుగ్రహం వున్నది. మీమనసులో వున్నది కనపరచడానికి యిదివరదాకా

సమయం రాక వూరుకున్నారు. ఇప్పుడు కనపర్చడానికి ఆరంభించి నారు. అయినా కానీ మంత్రిస్థానానికి నేను తగినవాణ్ని గాను. నా సామర్థ్యం నాకు తెలియదుగనుక నా? మీరందరూ ఆలోచించి ఆ పని మరివకరికి యివ్వవలెను.

వృకే—మరియెవరికి స్తే బాగావుంటుంది? జంబుకేశ్వర శాస్త్రిగారికి యివ్వవచ్చునా? లోకంలోవున్న నక్కజిత్తులన్నీ ఆయన వద్దనే వున్నవి. ఆయన రాజ్యతంత్రం నడపడానికి బహుసమర్థుడు.

వ్యా—అతనిమాట తరువాత ఆలోచింతాముగాని దక్కిన వుద్యోగాలుముందుగా కానియ్యండి. మంత్రిత్వం వద్దంటూవున్నారు గనుక సేనాధిపత్యంముందుగా కుర్కుర సోమయాజులుగారికి స్తాము. ఆయన్ను అడిగితే కాదు వద్దంటూనే వుంటారు. అటువంటి శక్తిమంతుణ్ని మనం సంస్థానంలో గొప్పవుద్యోగములో వుంచకుండా వుండకూడదు. ఆయనను అవశ్యంగా ఆపనికి నియమింతాము.

సారం—స్వాముల మహారాజుగారు చెప్పినది సర్వోత్తమంగా వున్నది. శౌర్యధైర్యాదులలో కుర్కుర సోమయాజులుగారిని మించినవారు లేరుగనుక సేనాధిపత్యం వహించడానికి యింతకంటె సమర్థులు మరియెవ్వరూ వుండరు. మేమందరమూ ఇందు కంగీకరించినాము.

వ్యా—తథాస్తు (తనలో) ఇప్పటికి నోరుకలవాణ్ని వకణ్ని కట్టుకున్నాము.

ఇకమీద మనకు వ్యతిరేకంగా యేమీ పని చెయ్యడు. మన ప్రభుత్వం స్థిరపడ్డ తరువాత వీణ్ని నిముషంలో యేదోమిషమీద శిరశ్ఛేదం చేయించి పీడ వదల్చుకోవచ్చును.

భస—న్యాయాధిపత్యం యెవరికి యిస్తారు?

మృగా—వృకేశ్వరరావు పంతులుగారు ఆ పనికి తగినవాడు. అయినా వుద్యోగాలు యిచ్చేవారు సభవారుకాని నేనుకాను సుమండీ. సభికులు మీరు మీమనసు వచ్చిన వారికి యివ్వవచ్చును.



గ్రామసింహం దాసుగారు.

గ్రామ—న్యాయాధిపత్యం వృకేశ్వర రావుగారికి యివ్వ వచ్చును. మేమంతా అంగీకరించినాము.

మృగా— ఆలోచనచెప్పి రాజ్యకార్యం నిర్వహించడానికి ఆలోచన సభికు లెవరు? ఆలోచన సభికులన్న పేరేకాని నిజంగా పరిపాలకులే వారు. దేవతల మాటలు తీసివెయ్య రానుగనుక నేను పేరుకు మాత్రం రాజుగావుండి సమస్తమూ అంతరంగ సభికులకే వదలివేసి వూరికే సాక్షిగా చూస్తూవుంటాను.

గ్రామ—ఇదివరకే మమ్మలినందరినీ సభికులని పిలుస్తూ మళ్లీ సభికు లెవరంటా రేమి?

సృగా—తథాస్తు. మిమ్మలినందరినీ సభికులుగా గ్రహించి రాజ్యమంతా మీస్వాధీనం చేసివేసినాను. ఇక పరిపాలనాభారము నామీద తప్పిపోయింది. ఇంకా మంత్రిపదంమాత్రం యెవరికీ యివ్వనేలేదు.

భస—అందరి పనులు అయిపోయినవి. ఇకవక్క జంబుకేశ్వరశాస్త్రి మాత్రమే మిగిలివున్నాడు.

సృగా—అతడికి యివ్వడమయితే నాకు యిష్టంలేదు కాని ప్రస్తుతం మరివకరు యెవరూ లేకపోవడంచేత కొన్నాళ్ళతణ్ణి మంత్రినిగాచేసి చూతము. ఇప్పుడు మరియెవ్వరికైనా పెద్దామంటే వకసింహానికయినా వ్యాఘ్రానికయినా యివ్వవలెను. అటువంటివాళ్ళు మంత్రిత్వానికివస్తే మీమీదకూడా అధికారం చెయ్యడానికి ప్రయత్నంచేస్తారు. వకసారి అధికారంయిచ్చిన తరువాత తీసివెయ్యడం బహుకష్టం. మీకులోకువయినవాడున్ను మీరుచెప్పినట్లు వినేవాడున్ను జంబుకేశ్వర శాస్త్రికేయిస్తామా మరియెవ్వరికయినా యిస్తామా? మీక్షేమం నిమిత్తమే నేను మిమ్మలిని అడుగుతూ వున్నాను. మీయిష్టంవచ్చినట్లుచేస్తాను. నేను చెయ్యడం యేమిటి! కావలసినట్లు మీరేచేసుకోండి.

గ్రామ—లోకువయినవాడు జంబుకేశ్వరశాస్త్రినే మంత్రినిగా చెయ్యడానికి మేమందరమూ వప్పుకున్నాము. యికముందు జరగవలసిన పనియేమిటి?

సృగా—పనియేమున్నది? మీరందరూ కదిలి సింహములూ పెద్దపులులూ మొదలయిన సమస్తమృగాలవద్దకూ వెళ్ళి దేవతలు నావిషయంలో జరిగించిన అనుగ్రహాన్ని చెప్పి మీరాజ్యం మీరు స్థిరపరచుకొని నేటినుంచి సింహాలు మొదలయిన వాటిమీదఅధికారం దస్తేట్లు చేసుకోవలెను. అది మీకార్యంగనుక మీరు

శ్రద్ధవహించి చేసుకోవలసిందే కాని యిందులో నా కార్యం ఆవగింజంతయినా లేదు.

గ్రామ—అవును మీమిప్పుడే పోయి దేవతలు అరణ్యరాజ్యానికి మిమ్మలిని చక్రవర్తినిగా చేసిన సంగతి సమస్తాటవులలోనూ చాటి వస్తాము. కుక్కరసోమ రాజులుగారూ! రండి. శునకాచార్యులు గారూ! దయ చెయ్యండి. సారమేయ శాస్త్రి గారూ! రండి. భషకచయనులుగారూ! లేవరేమి? వృకేశ్వరరావు పంతులుగారూ! సెలవు పుచ్చుకోండి. (అని వారందరును నిష్క్రమించుచున్నారు.)

సృగా— (తనలో) దొంగవుద్యోగాలిచ్చి వీరందరినీ మాయలోపడవేసినాను. రాజ్యం నా స్వాధీనపడగానే నా ప్రభావం చూపుతాను. అందాకా కొంచెమోపికపట్టి ఆగివుండవలెను.

(అని నిష్క్రమించుచున్నాడు.)

---

౪. రంగము:—సృగాలమహారాజు సభామందిరము.

[సృగాలమహారాజును, జంబుకేశ్వరశాస్త్రియును ప్రవేశించుచున్నారు.

సృగా—ఓయీ! జంబుకేశ్వర శాస్త్రీ! నా నేర్పుచేత యెట్లా వాళ్ళంతటవాళ్ళే నిన్ను మంత్రినిగా కోరుకొనేటట్టు చేసినానో చూచినావా? ఇప్పుడు నీకు సంతోషముగావున్నదా?

జంబు—దేవరవారి దయవుంటే నాకు సంతోషానికి యేమి తక్కువ? కావలసినంత సంతోషముగావున్నాను. కుక్కరసోమరాజులు మొదలయిన వాళ్ళంతా యెక్కడకు వెళ్ళినారు?

సృగా—మనపట్టాభిషేక మహోత్సవం సమస్తారణ్యాలలోనూ చాటించి సింహాలు మొదలయిన మృగాలన్నిటినీ మనసేవకువప్పించి తీసుకురావడానికి వెళ్ళినారు. వాళ్ళుతప్పకుండా సింహాలు మొద

లయినవాటిని మన పాదసేవకులనుగా చేస్తారు. ఇక మనకు మృగ రాజ్యం స్థిరపడ్డట్టే నేను మృగరాజునయినాను.

జంబు—మీాకు మృగరాజ్యం స్థిరపడగానే నాకు మంత్రిత్వం కూడా స్థిరపడ్డట్టే. రాజుకు తగినమంత్రిని దొరికినాను.

మృగా—అవునుగాని నీకు మంత్రిత్వం దొరికిందని గర్వంతో నిక్కి విర్రవీగక మహావినయం కలిగివుండవలెను. కొంతకాలం వరకూ నీమీాద నాకు మంచిపేరు వున్నట్టు తెలియకూడదు, అందరికీ లోబడి నీవు అణిగిమణిగివుండవలెను. కొన్నాళ్ళయ్యేంతవరకు భృత్యుడవై తలలో నాలికలాగువుంటే మన రాజ్యం స్థిరపడ్డతరువాత కావలసినంత అధికారం చెయ్యవచ్చును.

జంబు— అలాగే చేస్తాను. తరువాత నాకెక్కువ మీారే చేస్తారు.

మృగా—రాజ్యం లేనప్పుడు నీవు యిదివరకూ నా మంత్రిత్వం చెయ్యడం చెయ్యడంకాదు. నిమంత్రిత్వ సామర్థ్యం యిక కనపడవలెను. ఇంతకాలానికి నేను మృగరాజునయినాను. అంటే నేను యిప్పుడు సింహాన్నయినానన్న మాట. సింహాన్నయినప్పుడు నాగౌరవానికి తగినట్టుగా నారాణీకూడా సింహమే కావలెనన్నమాట నీకు తెలిసినదే కదా? కాబట్టి యిదినీవు మనస్సులో వుంచుకోవలెను. మనలోమాటయిది. అప్పుడేయెవ్వరితోనూ వెల్లడిచెయ్యకుమా. పూర్వం నహుషమహారాజు యింద్రత్వానికి వచ్చినప్పుడుకూడా యిలాగంటి కోరికే కోరినట్టు పురాణాలలో విన్నట్టు జ్ఞాపకం. ఇందులో యేమీాతప్పితంలేదు. ఈకోరిక మీారాజులకు తగినరాజచిహ్నాలువుంటే మీాకూ గౌరవంగా వుంటుందన్న వుద్దేశ్యంతో కోరినదే కాని కామంచేత కోరింది కాదనుకుమా.

జంబు—అవును మీారు యెప్పుడూ మాగౌరవము కోసమే చూస్తావుంటారు. ప్రజల మేలుకోర్చి వారిగౌరవంకోసం చూచే

రాజు కొరకడం బహుదుర్లభం. మీరు ప్రజలు చేసుకొన్న భాగ్యం
చేత పరశ్రేయస్సహానంగల రాజులు లభించినారు.

సృగా—ఇక యీప్రసంగం చాలించు. అదుగో కుక్కుర
సోమయాజులూ మొదలయినవారు వస్తూవున్నారు. వారు వెళ్ళిన
కార్యం కాయయిందో పండయిందో కనుక్కోవలెను.

జంబు—పండే అవుతుంది. నేను మంత్రినయివుండగా
కార్యం విఫలంకావడంకూడానా?

[అప్పుడు కుక్కురసోమయాజులును, శునకాచార్యులును, సారమేయ
శ్రేష్ఠియు, గ్రామసింహదాసును ప్రవేశించుచున్నారు.)

సృగా...(లేచి యెదురుగావెళ్ళి) ఓమంత్రివరులారా! సభా
సదులారా! దయచెయ్యండి.

కుక్కు—మృగరాజులు మీరు మాకింత గౌరవం చెయ్య
వలసినపనిలేదు. మృగరాజయిన సింహముకు మేము యిదివరదాకా
యేగౌరవం చేస్తూవున్నామో యింతటినుంచి మేము మీకా గౌరవం
చేస్తూవుండవలెను.

సృగా—నేను రాజనమిటి? నిజానికి యీరేరాజులూ. నేనే
సేవకున్నని. మీరుమాత్రి గ్రామసింహులు కారా? అయినాకానీ
మీరందరూ ప్రార్థిస్తూవున్నారు గనుక సింహాలు మొదలయిన
వుత్తమ మృగాలవల్ల మంత్రులున్ను సభికులున్ను అయిన మీకు
గౌరవం కలిగేనిమిత్తం వాళ్ళయెదుట నేను వూరికే రాజచిహ్నాలు
ధరిస్తాను. మీరు వెళ్ళినకార్యం యేమిచేసుకొనివచ్చినారు?

గ్రామ— పండించుకొని వచ్చినాము. దేవతలప్రసాదం
యెప్పుడయినా విఫలం అవుతుందా? సింహశార్దూలాదులు దేవర
వారి సందర్శనం నిమిత్తం మేము యిప్పుడేవస్తాము, మీరుముందు
గాబోయి వర్తమానంచెయ్యమంటే మేమువచ్చినాము. వారు
యీపాటికి బయలుదేరివుంటారు.

సృగా—ఈ గౌరవమంతా మీ దేకాని నాదికాదు. ఆహా! నేమి నాభాగ్యము! నాబంధువులు సింహములచేత కొలువుచేయించు కుంటూవుండగా నూచేవుణ్యాం నాకు లభించింది! నేనిప్పుడు కృతా ర్థుణ్నయినాను. ఈకుక్కరిసోమ గూజులుగారు వద్దన్నారు కాని ఈయన ప్రధానమంత్రి అయి యీయిందరి వైభవమంతా అనుభ వించదగినవారు ఇప్పుడు మనమంత్రిఅయిన జంబుకేశ్వరశాస్త్రి మీకందరికీ పరమభృత్యుడయి నడుచుకునేవాడే గనుక యిప్పుడూ మీ కేమీలోపం లేదు.

కుక్క—మీరు చేసిన గౌరవానికి నేనర్హుణ్ని కాను. నేను వకరిచాటున వొదిగివుండి జీవనం చెయ్యవలసినవాణ్ని కాని స్వతం త్రించి అధికారం చెయ్యవలసినవాణ్ని కాను. మీమాట మీరరా దని అంగీకరించినాను గాని యీ సేనాధిపత్యాని కయినా నేను తగినవాణ్ని కాను.

సృగా—అతిస్తోత్రం చెప్పుకోవడానికి యిష్టంలేక మీరు యిలాగంటూ వున్నారే కాని చిన్నప్పటినుంచీ మీతో కలిసి మెలసి వున్నవాణ్ని మీశక్తి సామర్థ్యాలు నాకు తెలియవా? అయినా యిప్పుడు వక్కటిమాత్రం ఆలోచించ వలసివున్నది. సింహశార్దూ లాదులు చిరకాలంనుంచి స్వతంత్రం వహించి యితర జంతువుల మీద అధికారం చేస్తూవుండడానికి అలవాటుపడ్డవి. వాటికి వక్క మాటుగా యితరులకు లోబడడం అంటే బహుకష్టంగా వుంటుంది. అందులోనూ నాబంధులయిన మీరు మంత్రులుగానూ సభికులు గానూవుంటే వాటికి కళ్ళమంటగా వుంటుంది. కాబట్టి కొంతకాలం మీరు తడుముగా వాటికళ్ళ పడకుండా, మీఅధికారానికి క్రమక్ర మంగా అలవాటుపడ్డదాకా అవివచ్చినప్పుడు మీరుకొంచెం తొలగి వుంటూవుండవలెను. ఇది ముఖ్యముంకోసమే చెపుతూవున్నాను.

సుమండీ. అవి క్రూరజంతువులు. కార్యం మించినతరువాత మనం యేమనుకున్నా కూడిరాదు. వాటియెదుట మీరు భయభక్తులు కనపఱిచి నాకు పరమవిధేయులయి చేతులు కట్టుకొని నిలువబడవలెను. అవి వెళ్ళగానే తరువాత మిమ్మలిని నేను నెత్తిమీద పెట్టుకుంటాను. ఇలాగన్నానని మీరు మనస్సులో మరివకవిధంగా అనుకోవద్దు. ఇదంతా మీ క్షేమంకోసమే చేస్తూవున్నానని ముందుగానే నేను ముమ్మాటికీ చెప్పుతూవున్నాను. వాటిముందర మీమంత్రిత్వంమాటా యితర ప్రయోగాలమాట మీరు యేమీ తలపెట్టగూడదు.

జంబు—మేమందరమూ యేలినవారికి సలవుకు బద్ధులమయి మీ ఆజ్ఞ శిరసావహించి నడుచుకుంటాము. అదుగో సింహేంద్రాదులు వస్తూవున్నారు.

[అప్పుడు సింహసార్వభౌముడును, వ్యాఘ్రేశ్వరరావును,
భల్లూకేంద్రుడును, హరిణావధానులును, శశక
శాస్త్రియు, ప్రవేశించుచున్నారు.

సృగా—(తనలో) నేనిప్పుడేలాగయినా వీటిని వలలో పడవేసి స్వాధీనం చేసుకోవలెను. ఇవి లోపడితే నాకు రాజ్యమంతా దక్కినట్లే. (అనిచేతులు జోడించుకొని యెదురుగా వెళ్ళి) ఓమృగసార్వభౌములారా! మీకు నమస్కారము.



సింహసార్వభౌముడు.

సింహ—మీరిప్పుడు మాకు రాజులయినారు. మీకు మేమే నమస్కారము చెయ్యవలెను. మీకు దేవతలు మృగరాజ్యం యిచ్చిన మాట కుక్కురసోమయాజులు మాకు చెప్పినాడు. అతడు యెప్పుడూ అసత్యం పలికేవాడు కాడుగనుక, అతనిమాట విశ్వసించి మేమందరమూ మీదర్శనానికి వచ్చినాము. మీశరీరం రంగు చూడడంతోటే అతనిమాటలసత్యం మరింత స్పష్టమయింది.

మృగా—నాపురాకృతపుణ్యంచేత నాయందు దేవతలకూ మీకూ కూడా అనుగ్రహం వచ్చింది. ఈకుక్కురసోమయాజులు మీరుచేసిన శ్లాఘనకంతకూ తగినవాడు. యెంత నిదర్శనమూ కనపడకపోతే అతడు వకరు చెప్పినమాట నమ్మేవాడు కాడు. ఓసింహసార్వభౌమా! పీఠమును స్వీకరించండి. ఓ వ్యాఘ్రేశ్వరా! ఈవున్నతాసనంమీద కూర్చుండండి. శుభల్లూకేంద్రా! దయచెయ్యండి.

సింహ—రాజులు మీరు సింహాసనముమీద కూర్చున్నతరువాత మేము కూర్చుంటాము. ముందుగా మీరు కూర్చుండవలెను.

మృగా—నేను రాజునేమిటి? దేవతలమాట తీసివెయ్యరాదని నేను ఘోరికే రాజనామం ధరిస్తానుగాని—(తనలో) ఏదోమిష

చెప్పి యిప్పుడు వీళ్ళందరినీ పంపి వెయ్యవలెను. (ప్రకాశముగా) జంబుకేశ్వర శాస్త్రి! కుక్కుటసోమయాజులుగారూ! మీరు వృషభయులూ వెళ్ళి శరభేంద్రరావుగారిని వక్కసారిదర్శనంయిమ్మన్నానని మనవిచేసిరండి. ఓశునకాచార్యులుగారూ! మీరు తక్కిన యిద్దరినీ వెంటబెట్టుకొని వెళ్ళి సింహసార్వభౌములు మొదలయినవారు విజయంచేసి మీకోసం యెదురుచూస్తూవున్నారని గజేంద్రాదులను వెంటబెట్టుకునిరండి. శీఘ్రముగా రండి.

జంబుకేశ్వరాదులు—చిత్తము. (అని వెళ్ళుచున్నారు)

మృగా—ఓసింహసార్వభౌమా! వ్యాఘ్రేశ్వరా! మీరుదయచేస్తేనేకాని నేను కూర్చోను. వూరికేనేను పేరుకు రాజునేకాని యీ రాజ్యమంతా యిఖముందున్న మీదే. యిదివరకు రాజ్యంచేస్తూ వున్నట్టే యిఖముందుకూడా యీసింహసార్వభౌములే రాజ్యం చెయ్యడం నా అభీష్టం. దేవతలమాట తీసివెయ్యకుండా మీకందరికీ యిష్టంవుండి కూర్చోమంటే నేను వూరికే సింహాసనంమీద కూర్చుంటాను.

సింహ—దేవతలఆజ్ఞను మీరన్యధాకరించరాదు. వారి ఆజ్ఞను చెల్లించడం మాకందరికీకూడా ముఖ్యకర్తవ్యం. మీరీ అరణ్యరాజ్యభారం వహిస్తే మీతరఫున మేము సమస్తకార్యాలూ నిర్వహిస్తాము.



వ్యాఘ్రశ్రీరావు

వ్యాఘ్రి—మీరవశ్యంగా సింహసార్వభౌములు చెప్పినట్లు చెయ్యవలెను. ఈయనమాట మనం యెవ్వరమూ దాటకూడదు.

సృగా—మీ వృధయుల ఆజ్ఞ మీరడానికి భయపడతాను గనుక మీయిష్టానుసారం చెయ్యడానికి వప్పుకున్నాను. ఆలాగయితే యీసింహ సార్వభౌములు ప్రధానమంత్రిపదం వహించి సమస్త రాచకార్యాలూ స్వతంత్రంగా నిర్వహిస్తూ వుండవలెను. శ్రీకృష్ణుల వారు పేరుకు వుగ్రసేనుణ్ని సింహాసనంమీద కూర్చోపెట్టి రాజ్య భారమంతా తామెలా వహించినారో మీరూ ఆలాగే వహించవలెను.



భల్లు—వారు ప్రధానమంత్రిగా అంగీకరించి మీ అభీష్ట ప్రకారమే జరిగిస్తారు. వారు వృద్ధుడుగా అటువంటి గొప్పగౌరవానికి యితరు లెవరయినా అర్హులవుతారా? ఇక సేనాధిపత్యం యీ వ్యాఘ్రేశ్వరరావుగారికి యివ్వాలెను. ఆయన అరణ్యంమీద దండు యెత్తినారంటే వైరులందరూ తల్లడిల్లుతూవుంటారు. ఆయన ధాటికి ఆగేవారు లోకంలో యెవరూ లేరు.

సృగా—(తనలో) ఈసమయంలో యెలాగయినా కుక్కుర సోమయాజులమీద పిళ్ళకు అయిష్టం పుట్టేటట్టుచేసి వాణ్ని యెలాగయినా శీఘ్రంగా వదల్చుకోవలెను. వాడున్నంతవరకూ మన రాజ్యం స్థిరమని నమ్మివుండరాదు. నీలిగూనసంగతి వాడికి యే మాత్రం తెలిసినా నిజం బయలపెట్టి మనకొంప దీస్తాడు. (బిగ్గరగా) అవశ్యంగా వ్యాఘ్రేశ్వరరావుగారే సేనాధిపత్యం వహించడం నా కోరిక. సేనాధిపతిగా వుండడానికి ఆయనకంటె అర్హులు లోకంలో యెవరూవుండరు. కాని—ఆయనే మనకు సేనాధిపతి.

వ్యాఘ్రే—ఏమో చెప్పవచ్చి "కాని" అని వూరుకున్నారు. అదేమో చెప్పండి. నేను సేనాధిపతిగా వుండడానికి మీకేమయినా అభ్యంతరం వున్నదా?

సృగా—దైవసాక్షిగా చెపుతాను. నాకేమి అభ్యంతరం లేదు. వక్క సంగతి చెప్పవచ్చి యెందుకని మానివేసినాను. పోనియ్యండి, ఆసంగతి యిప్పుడు తలపెట్టకూడదు. అతడూ మన శాస్త్ర కోటిలోవాడే.

వ్యాఘ్రే—ఆసంగతి యేమిటో, అతడేమిటో, అవశ్యంగా చెప్పవలెను. మీరిప్పుడు చెప్పకతీరదు.

సృగా—మీరింత నిర్బంధపెడుతూ వున్నారుగనుక విధిలేక చెప్పవలసి వస్తూవున్నది. కుర్కుర సోమయాజులు నాకుపరమాప్తుడు. అతనివంటి సత్యసంధుడూ, ఉత్తమశ్లోకుడూ లోకంలో మఱియెవడూ లేడు. సేనాధిపత్యం చెయ్యడానికి తనకు కొంచెం అపేక్షవున్నట్టు నాముందఱ అతను సూచనగా కనపరచినాడు. అంతేకాని మఱియేమీ లేదు. మీకు సేనాధిపత్యం యిస్తామంటే అతనూ సంతోషిస్తూవప్పుకుంటాడు. ఈమాట మళ్ళీ అతనికి తెలియనిచ్చేరు సుమండీ. అతడు బహుదొడ్డవాడు.

వ్యాఘ్రే—(తనలో) మనమీదికి పోటీకి వచ్చినాడుగనుక కుర్కుర సోమయాజులపని పట్టించవలెను. (బిగ్గరగా) ఎంతమాత్రమూ తెలియనియ్యను. మీకుయిష్టంవుంటే కుర్కుర సోమయాజులనే సేనాధిపతినిగా చెయ్యవచ్చును.

సృగా—మిమ్మలిసప్పుడే సేనాధిపతినిగా చేసినాను. అతనితోటి మీకేమిటి? మీకీయధికారంవచ్చిందంటేఅతనికిమాత్రం మరి వకవిధంగా వుంటుందనుకున్నారా? మీరుమనసులో యేమీపెట్టుకోవద్దు.



హరిణావధానులు

హరి—కుర్కుర సోమయాజులు బహువొడ్డవారు. **వీరు** వున్నారంటే ఆయన ఆకోరిక కోరివుండరు.

వ్యాఘ్రి—అవును. అతడు మంచివాడని నేనూ యెరుగుదును. అతనువున్నా నాకూ ఇష్టమే.



శశశాస్త్రి

శశ—మీకు సేనాధిపత్యం వచ్చినదంటే కుక్కుర సోమయాజులుగారు బహిష్కరించి తనను పురోహితా బలవంతపెట్టి యిస్తామన్నా పుచ్చుకోరు.

సృగా—అందుకు సందేహంలేదు. ఈభల్లూకేంద్రుడిగారిని ధర్మాధికారినిగా నియమింతామా?

వ్యాఘ్రి—అవశ్యంగా నియమించవచ్చును. ఇప్పుడు పుద్యోగ నియామకా లయినవిగనుక రేపు మళ్ళీ సభ చేయుదాము.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

---

## ౫. రంగము—మహారణ్యపుర బాహ్యప్రదేశము

[శునకాచార్యులును, గ్రామసింహదాసును, సారమేయశ్రేష్ఠియు, జంబుకేశ్వరశాస్త్రియు ప్రవేశించుచున్నారు]

శున—మనరాజుగారిస్థితి యేమీబాగావున్నదికాదు. అడవులన్నీతిరిగి, మృగాలన్నిటితోనూ చెప్పి, తనరాజ్యం నిలపడానికి

మనమే ముఖ్యకారకులమయినప్పటికీ యేకార్యంలోనూ మనఅలో చన కొంచెమయినా లేకుండా కృతఘ్నుడయి మనవందరినీ నీచసేవ కులను చూచినట్టు మిక్కిలి నీచంగా చూస్తూవున్నాడు.

గాని య—నీవేమో ఆలోచనా పాలోచనా అని మాటలు చెపుతూ వున్నావు. ముందుగా మనప్రాణాలమాట ఆలోచించు. ఏ నిమిషములో యే దుష్టుడితో చెప్పి రహస్యంగా యెవరితల తీయ్యమంటాడో యెవరికి తెలుసును? ఆయన పయికి కనపరిచే నక్క వినయాలనూ దొంగ ప్రేమనూపట్టి చూస్తే కుక్కుర సోమయాజులు గారిని యిలాగు చంపిస్తాడని యెవరయినా కలలోనైనా అనుకున్నారా? రేపు మనగతీ అంతేఅవుతుంది. మనరాజుకు అంగిట బెల్లమూ ఆత్మలో విషమూ అని అందరూ యెరుగుదురు.

సార—దీనివిషయంలో తప్పకుండా మనం యేమయినా వుపాయం ఆలోచించవలెను. ఈ దుర్నయంచూస్తూ వూరుకుంటే మనప్రాణాలు దక్కవు. నేను కుక్కురసోమయాజుకు వచ్చింది రేపు మన ప్రాణంమీదికే వస్తుంది. నక్క కుక్కురసోమయాజులనే కాదు, మహీధరుణ్ని కూడా రాత్రి యెవ్వరో చంపివేసినారు. వాళ్ళతలలు యిక్కడనే పడివున్నవి. ఈవిషయంలో ప్రధానమంత్రి గారు జంబుకేశ్వరశాస్త్రిగారు మీరేమంటారు?

జంబు—నా ప్రధానమంత్రిత్వం యేడిసినట్టేవున్నది. సింహసార్వభౌముడు వచ్చినప్పుడాయనతో నీవే ప్రధానమంత్రివని చెప్పి నాచేత ఆయనకు అన్ని పనులూ చేయిస్తాడు. ఆయన వెళ్ళిన తరువాత నేను యిదేమిటయ్యా అని అడిగితే, "నిజమయిన ప్రధాన మంత్రివి నీవే. నాలుగురోజులు ఓపికపెట్టి పనిచేస్తూవుండు తరువాత నీకు బహిరంగంగానే మంత్రిత్వంయిస్తాను" అని సర్దిచెప్పతాడు.

నా మంత్రిత్వం వక్కదానిలోమాత్రం కనబడుతూవున్నది. ఎవ్వరూ లేకుండా చూచి నన్ను రహస్యంగా పిలిచి "నీకు ప్రధానమంత్రిత్వం యిచ్చినానుగదా! మృగరాజయిన నాకు తగిన రాణీని తీసుకుని రావా!" అని తనకు ఆడసింహాన్ని తీసుకురమ్మంటాడు, ఇవన్నీ చెప్పుకుంటే సిగ్గులచేటు. మీతోగనుక చెపుతూవున్నాను. ఇప్పుడు రాజుగారివద్ద మీ అందరి సభికత్వమూ యేలాగున్నదో నా మంత్రిత్వమూ అలాగేవున్నది.



సార—చచ్చినాకానీ [illegible] తల జీవకళ పుట్టిపడ వీరరసం యెలా వొలుకుతూవున్నదో చూడు. ఇటువంటి సుజనుణ్ని చీకటిలో చంపించడానికి యేలాగున మనసువచ్చిందో! అతని మరణం సంగతి విని సృగాలమహారాజు యీరోజుతో ప్రపంచమంతా మునిగిపోయినట్టు వెక్కి వెక్కి యేడుస్తూ, అటువంటి మంచివాడు పోయినతరువాత తనకిక రాజ్యం చెయ్యడానికి యిష్టం లేనట్టు నటిస్తూ వున్నాడు. పయికి దొంగ వేషాలు వేసి యెంత యేడిచినా ఇది తప్పకుండా మనరాజు పనేకాని మరివకరిది కాదు.

శున—అందుకు యెంతమాత్రమూ సందేహం లేదు. రాజ్యం వస్తేమాత్రం మునుపటి అల్పబుద్ధి పుడకలతోగాని పోదు. వీడివద్ద

ఎన్ని నక్కజిత్తులైనా వున్నవి. నోరునవ్వుతూవుంటే నొసలు వెక్కిరిస్తూ వుంటుంది.

గ్రామ—అవును, వీడుచేసినమోసాలు మనం చిన్నప్పటి నుంచీ యెరుగుదుము. యీగిప్పుడిన్నీ మనం బుద్ధిభ్రమసి మధ్య మధ్య గోతులలో పడుతూవుంటాము. మనం యెండలోపడి అడవులూ కొండలూ తిరిగి పెద్దపులులనూ సింహాలనూ తీసుకునివచ్చి పాదాక్రాంతులను చేసినపాపం చేత తుదకు మనకే మోసంవచ్చింది. నాలుగురోజులు రాజ్యం రావడంలోనే తానేమో మహారాజయి నట్టూ మనమంతా తనకేమో పాదసేవకులమయినట్టూ మనను చూస్తే మాట్లాడనేమాట్లాడడు. చెవిటివాడివలె మనంచేసే మనవి వినిపించుకోడు. వాయురోగం వచ్చినవాడివలె తల ఆడిస్తాడు.

సార—అవును. నీవు చెప్పినదంతా నిజం. దుష్టరాజుకున్ను సన్నిపాతజ్వరం వచ్చినవాడి కిన్నిలక్షణాలు వకటేవిధంగావుంటవి. ఇప్పుడు జరిగినదానికి విచారించిన ఫలంలేదు. ఇకముందు మన ప్రాణాలకయినా మోసం రాకుండావుండే సదుపాయంచూడవలెను.

శున—నాబుద్ధికి వకటే వుపాయం కనబడుతూవున్నది. సృగాలమహారాజును రాజ్యాన్నుంచి తొలగించి యెప్పటి నక్కను చెయ్యడం తప్ప రెండోవుపాయం కనబడడంలేదు.

గ్రామ—అవునుగాని ఆపనియిప్పుడు మనకు సాధ్యంకాదు. సింహాలూ వ్యాఘ్రాలూ పరమభృత్యులయి సేవచేస్తూవుండగా నాలుగుకుక్కలూ నక్కలూచేరి యెలా సింహాసన విహీనుణ్ని గా చెయ్యడం సాధ్యమవుతుంది? సమయంవచ్చినదాకా కనిపెట్టుకొని వుండి స్వయంకృతపరాధం అనుభవిస్తూ సమస్తమూ దైవానికి వదలిపెట్టి వూరుకుంటే దుష్టుడు తానుచేసిన దోషంవల్ల తానే నశిస్తాడు. లోకంలో దుర్మార్గం యెల్లకాలమూ సాగదు. సత్పురుషు

ఆకు హానిచేస్తూ యిటువంటి దుర్మార్గాలు చెయ్యడంవల్ల తనగొయ్యి తాను తవ్వుకోవడమే కాని మరివకటి గాదు. చూస్తూవుండు వీడు మన కళ్ళముందరనే తాను తవ్వుకొన్న గోతిలో తానే పడి చస్తాడు. మహిషేశ్వరుడువంటి నిర్దోషులను వూరికే హింసిస్తే, ఆపాపం కట్టి కుడుపకుండా వూరికే పోతుందా? చూడు, ఆ మహిషే శ్వరుడి తలచూస్తే యెలా జాలివేస్తూవున్నదో! ఇటువంటి మాయా మర్మమూ యెరుగనివాడి దుర్మరణంచూస్తే యెవరికి జాలిపుట్టదు?



సార—నీవు చెప్పినమాటలు సత్యమేకాని, దుర్మార్గుడు తనంతటతానునశించేవరకూ చూస్తూవూరుకోరాదు. చూస్తూ వూరు కుంటేయీలోగామనకే ద్రోహంచేసి మరీచస్తాడు. కాబట్టి సాధ్య మయినంతశీఘ్రంగా దుష్టుణ్ని అణిచివేసేమార్గం చూడవలెను. బాగా ఆలోచిస్తే వుపాయం దొరకకుండా వుండదు. మన అందరి లోకి జంబుకేశ్వరశాస్త్రి మహాబుద్ధిమంతుడు. అతడు పూర్ణంగా తలుచుకుంటే మంచి వుపాయం దొరక్కపోదు. ఇతని సహాయం వుంటే మనకు తప్పకుండా కార్యసిద్ధి అయినట్టే.

జంబు—నేనూ అదే ఆలోచిస్తూవున్నాను. తొందరపడ గూడదు. బాగా ఆలోచించిచేస్తే మనవుపాయం రామబాణంవలె అమోఘంగా పట్టుకోవలెను. నేను వక్క రహస్యం విన్నాను. అది మన కార్యసిద్ధికి పనికివస్తే పనికిరావచ్చును.

సార — నీవు బుద్ధియందు అపర బృహస్పతివి. అప్పుడే నీబుద్ధికి మంచి వుపాయమేమో తగిలింది. నీవు విన్న రహస్యం యేమో కొంచెం చెప్పు.

జంబు — మరి యేమీ లేదు. నాడు వీడి వంటికి పట్టుకున్న నీలిరంగు దేవతలూ యివ్వలేదు యెవ్వరూ యివ్వలేదట. వీడా రాత్రి కన్నుగానక ప్యాక్టోరీ నీలిగూనలో పడితే రంగు పట్టుకున్న దని కోళ్ళనిమిత్తం తిరుగుతూ కంచెలోవుండి చూస్తూవున్న నా బంధువుడొకడు రహస్యంగా చెప్పినాడు.

గ్రామ — అది తప్పకుండా నిజమే అయివుంటుంది. అందుకు సందేహంలేదు. వీడిఇల్లు వల్ల కాదు కానూ! యీనక్కపోతు యెంత మోసము చేసిందిరా! వృధాగా వీడి కుతంత్రంవల్ల యింతమంది బుద్ధిమంతులున్నూ ప్రముఖులున్నూ యిట్టే మోసపోయినారు. యీసంగతి తెలిస్తే సింహాలూ పెద్దపులులూ యీ అవమానం సహించి వూరుకోవు.

జంబు — కేకలువెయ్యక మెల్లిగా మాట్లాడు. చెట్లకి కూడా చెవులువుంటవి. మనసంగతి కొంచెం గ్రహించి యేపక్షిగాడైనా వెళ్ళి చెవ్వలో వేస్తే దానికి తగినతంత్రం యేదోపన్ని తనకున్నూ యీ వర్తమానం చెప్పిన నా బంధువుడికిన్నీ విరోధమని సాక్ష్యం తెచ్చి రాజద్రోహం చేసినాడని తల తీయించివేస్తాడు. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదువా?

సార — వాడు అంతపని చేసేవాడే. ఈ కుట్రలో మన మంతా చేరివున్నామని మన్నందరినీకూడా కలిపి దలలు తీయించినా తీయించవచ్చును. కాబట్టి మన కార్యం యెవ్వరికి తెలియకుండా రహస్యంగానే సాధించుకోవలెను. ఇప్పుడు దేవతలంటే జ్ఞాపకం వచ్చింది. కుక్కురసోమయాజుల మరణం యెలాగు జరిగిందంటే

దేవతలో దయ్యములో చేసివుంటవిగాని యిది భూలోకంలో వారు చేసింది కాదని యిందాకా సృగాలమహారాజు చెప్పినాడు. ఇది తన మీద అనుమానం తప్పించుకోవడానికి అన్నమాటకాని మరివకటి కాదు: నాకు యిప్పుడు తోస్తూవున్నది. వీడు స్వర్గలోకంలోకి వెళ్ళిన మాట అబద్ధమయి వీడి కీనిలిరంగు నీలికూనలోనే కలిగినట్టయితే దేవతలూ దెయ్యాలూ స్వర్గమూ అంతా అబద్ధమే. నక్కయెక్కడ దేవలోకమెక్కడ నః మనం మొట్టమొదటనే అనుకున్నీ బుద్ధి భ్రమించి తుదకు మాయలో పడిపోయినాము. జంబుకశాస్త్రీ! నీవాలోచించిన వుపాయమేమో కొంచెంచెప్పుమూ.

జంబు—మరేమీలేదు. ఇప్పుడు రెండుపనులు జరగవలెను. మొట్టమొదట నీలవర్ణం నీలికూనలో పడడంచేత వచ్చిందేకాని స్వర్గలోకంలోకి దేవతలు తీసుకువెళ్ళి యిచ్చిందికాదని సింహశార్దూలాదుల కన్నిటికి నమ్మకంగా తెలియవలెను. రెండోది సింహాసనం రావటంచేత మునుపువున్న నక్కగుణాలుతప్ప కొత్తమహిమ నేమీ రాదన్నట్టు వాటికన్నిటికీ బోధపడవలెను.

సార—మొదటి సంగతి యెవరిచేతనయినా చెప్పించవచ్చును గాని కొత్తగా మహిమవచ్చిందీ రానిదీ దృష్టాంతపూర్వకంగా యెట్లా చెప్పగలము? ఆపనిమాత్రం సాధ్యంకాదు.

జంబు—సాధ్యంకాకేమి? ప్రయత్నంచేస్తే అన్నీ సాధ్యం అవుతవి. ఈ మంత్రాంగమంతా నాకు వదిలిపెట్టండి. యెంతటి అసాధ్యకార్యమయినా నేను విశ్వప్రయత్నంచేసి సాధిస్తాను. దానికి నాకు వకవుపాయం తోస్తూవున్నది.

సార—ఏమిటో యేమిటో వేగిరంచెప్పు విన్నదాకా నా మనస్సు యేమీ తోచకుండా తొందరపడుతూవున్నది.

జంబు—అదియేమీ గొప్పకార్యంకాదు. ఆపనినాచేతిలోనే వున్నది. సింహాలూ శార్దూలాలూ అన్నీవచ్చి కొలువుచేస్తూ సభ

తీర్చివున్న కాలంలో నేను యెదురుగా కూర్చుండి కుయ్యడానికి ఆరంభిస్తే స్వభావము యెవరికీ మారదుగనుక నాతో సృగాల మహారాజుకూడా అరుస్తాడు. అప్పుడు సింహాలు మొదలయినవాటికి యిది వెనుకటి నక్కే కాని దీనివద్ద విశేషం యేమీ లేదని తెలియక పోదు. తెలిసిన తరువాత అటువంటి వుత్తమమృగాలు నక్కదినం సేవ చెయ్యడానికి వప్పుకోవు.

గ్రామ—ఇది మహాబాగావున్నది. ఇంతకంటే మంచివుపాయం లోకంలో యెక్కడావుండదు. దీన్ని తప్పకుండా యీరాత్రి ప్రయోగించవలెను. వేళుదాముకండి.

సార—ఈవుపాయం సర్వోత్తమంగా వున్నది.

శున—ఇది దివ్యమయిన వుపాయం. ఆలస్యం అమృతం విషం అన్నారు గనుక మన గ్రామసింహదాసుగారు చెప్పినట్టుగా యీ సాయంకాలమే యీవుపాయం ప్రయోగించవలెను.

జం బు—శుభస్య శీఘ్రం అన్నారు అలాగే చేతాము రండి.

(అందరును నిష్క్రమించుచున్నారు)

---

౯. రంగము—సృగాల మహారాజుసభ

[సృగాల మహారాజును, సింహసార్వభౌముడును, వ్యాఘ్రేశ్వర రావును, శునకాచార్యులును, జంబుకేశ్వర శాస్త్రియు, గ్రామసింహదాసును ప్రవేశించుచున్నారు]

సృగా—ఓసభికసార్వభౌములారా! కుక్కుర సోమయాజుల దుర్మరణవార్త వినడంచేత నాకు యీదినం సభ చెయ్యడానికి యెంతమాత్రమూ మనస్కరించకుండా వున్నది. అతడు మహాసత్య సంధుడు; న్యాయమార్గావలంబుడు; లోకోపకారి; పరదార ధనా

పేక్ష లేనివాడు, అటువంటి పరమ సుహృత్తుపోయిన తరువాతకూడా నాప్రాణాలు పోనందుకు నాకెంతో విచారంగావున్నది.

వ్యాఘ్రే—మీరాశ్చర్యే విచారించవలసినపని లేదు. లోకంలో యెవరికీ దేహం స్థిరంకాదు. మీరు సిద్ధసంకల్పులు. అటువంటి పరమసుహృత్తు పోయిన తరువాత ... లోకంలో వుండడానికి మీకు నిజంగానే యిష్టం లేకపోయినట్టయితే మీకోరిక శీఘ్రం గానే సిద్ధిస్తుంది. మీకు దేవతల అనుగ్రహంకూడా చాలావున్నది గదా! మిమ్మల్ని తమలోకానికి తీసుకుని వెళ్ళరా?

సృగా—(తనలో) ఈవ్యాఘ్రేశ్వరుడి మాటలుచూస్తే యేదోవిధంగావున్నవి. యెవరయినా దుర్మార్గులువెళ్ళి మనమీద చాడీలు చెప్పి అతని మనస్సు విరుగ చేసివుండరుగదా? రాత్రినిద్ర పోతూవుండగా కుక్కుర సోమయాజులను చంపించిన మాట యెవ రయినా చెప్పియుందురా? నేను నీలిగూనలోపడి రాజ్యంసంపాదించు కొన్నమాట చెప్పియుందురా? ఏమిచెప్పినాసరే. నాబుద్ధిబలంచేత శత్రువుల కట్టాలన్నీ సూర్యుడు మంచును విడగొట్టినట్టు విడగొట్టి వేసి తిరిగివాళ్ళకే యెవోతట్టాలు తెస్తాడు. న్యాయంగా వెళ్లే వాళ్ళకు వక్కటేమార్గం కాని నాకులక్షమార్గాలు వున్నవి. (బిగ్గ రగా) వ్యాఘ్రేశ్వరుడు గారూ! మీరు సెలవిచ్చినమాట సత్యం. నాకు దేవతల అనుగ్రహం పరిపూర్ణంగా వున్నది. వారికటాక్షం నామీద పూర్ణంగావున్న సమయంలో నే నామిత్రులకూ ఆశ్రితు లకూ యేదో వుపకారం చేస్తాను. నేనుచేసేది క్రియచేత కనపరచ వలసిందే కాని మాటలచేత కనపరచకూడదు. ఇప్పుడు మంచి తరుణం తటస్థించినది గనుక కుక్కుర సోమయాజులకు దేవేంద్రు డితోచెప్పి మహాయజ్ఞాలుచేసిన సోమయాజులకు సమేతూ దుర్లభ మయిన స్వర్గలోకవాసం శాశ్వతంగా యిప్పిస్తాను. కుక్కుర సోమ

యాజుల మరణంమూలంగా నాకనోటికి మెతుకులుపోలేదు. మన స్సులో యేమో పిచ్చియెత్తినట్లున్నది. నేటికి సభచాలింతాము.

వ్యాఘ్రే—దేవరవారిమాటలుచూస్తే నేడు తమరు కుర్కుర సోమయాజులకోసం స్వర్గలోకానికి విజయం చేసేటట్టువున్నది. ఇది వరకే చాలా కాలం కిందటనే మాకందరికీకూడా దేవతాసందర్శనం చేయిస్తామని వాగ్దానంచేసివున్నారు. ఇప్పుడయినా చేయిస్తారా?

సృగా—ఇటువంటి విచారసమయంలో అటువంటి కోరిక కోరడం న్యాయంకాదు. కావలిస్తే మీకు మరివకప్పుడు దేవతా సందర్శనం చేయిస్తాను.

వ్యాఘ్రే—అలాగయితే యిప్పుడు మీరువక్కరే స్వర్గ లోకానికి విజయం చేస్తారా? మీప్రధానమంత్రి గారినికూడా తీసు కునివెళుతారా? వెనుకటవలెకాకుండా యిప్పుడు మీరు రాజవేషం తో స్వర్గలోకానికి వెళుతూ వున్నారు గనుక మంత్రిసహితంగా వెళితే యెక్కువమర్యాదగా వుంటుంది.

జంబు—నేనా? నేనా? నేనీయునతో స్వర్గానికి వెళ్ళను. ఈ లోకంలోనే వుంటాను.

వ్యాఘ్రే—ఇప్పుడు నిన్నెవ్వరు స్వర్గలోకానికి తీసుకుని వెళుతామన్నారు!

జంబు—ఇప్పుడు మీరు సృగాల మహారాజగారిని ప్రధాన మంత్రితోకూడా స్వర్గలోకానికి వెళ్ళుమన్నారు. నేను ప్రధాన మంత్రిని గనుక నేనురానన్నాను.

సృగా—నీవు ప్రధాన మంత్రివిగావు, యేమంత్రివీగావు. సింహసార్వభౌము లంతటివారు ప్రధాన మంత్రులయి యెదుట కూర్చుండి వుండగా నలుగురిలోనూ సిగ్గులేకుండా ప్రధానమంత్రినని లేచి చెప్పడానికి నీకునోరుయెట్లా వచ్చిందిరా! మాట్లాడకకూర్చో.

జంబు—మీరు యిదివరదాకా నేనే ప్రధాన మంత్రినని నాతో చెపుతూ శునకాచార్యులూ మొదలయినవారందరి ముందరనూ నాకు మంత్రిత్వం యివ్వలేదా?

సృగా—ఓరి నిర్భాగ్యుడా! ఆదంతా నీవు నిజమే అనుకున్నావా యేమిటి? నాకు మంత్రిత్వం కావలెనని నీవు అంటూవుంటే నీ తెలివి తక్కువ చూచి నిన్ను సంతోషపెట్టడానికి పూరికే వేళాకోళానికి నీకు మంత్రిత్వం యిచ్చినానంటే అదీ నీవు నిజంగానే నమ్ముతూ వున్నావా? లోకంలో యెంతటి పిచ్చివాళ్ళయినా వుంటారు.

శున—ఆలాగయితే కుక్కుటసోమయాజులుగారికి సేనాధిపత్యమూ, మాకందరికీ సభికత్వమూ, యిచ్చినమాటకూడా అబద్ధమేనా?

సృగా—అంతా అబద్ధమే. ఇది అంతా కేవలనాటకము. మీ పరువుకు నిజంగా మీరా వుద్యోగాలకు తగుదుమే అనుకున్నారా? వూరికే ప్రొద్దుపోవడానికి యెవరూ లేనప్పుడు మిమ్మలినందరినీ పిలిచి వకడు మంత్రి అనిన్నీ, వకడు సేనాధిపతి అనిన్నీ కొందరు సభికులనిన్నీ పేర్లుపెట్టి బొమ్మలాటలాగు ఆడిస్తూవుంటే, ఆ వినోదం అంతా నిజమేనని మీరు మాత్రం నమ్మినారా? నాటకంకూడా నిజమని నమ్మే బుద్ధిహీనులు లోకంలో యెవరయినా వుంటారా?

గ్రామ—మేము మంత్రులుకావడం మొదలయినదంతా నాటకమయితే మీరు రాజుకావడంమాత్రం నాటకంకాదా? నాటకంలో వక వేషం అబద్ధమయితే వక వేషంమాత్రం నిజమవుతుందా? అయితే అంతా అబద్ధమేకావలెను.

సృగా—మీ బంధువుడయిన కుక్కుటసోమయాజులు పోవడముచేత మీకందరికీ మతిపోయి పిచ్చిమాటలంటూ వున్నారు. మీరు యిప్పుడు యిళ్ళకుపోండి తరువాత వచ్చి మాట్లాడుదురుగాని.

నేను గనుక మీపిచ్చిమాటలకు సహించినానుగాని మీరు ఈవాళ్లు తెలియకుండావున్న స్థితిలో సింహసార్వభౌముడూ మొదలయిన వారిని యేమయినా అన్నారంటే ప్రాణాలమీదికివస్తుంది. వేగిరం వెళ్ళండి.

గ్రామ—మమ్మల్ని అవమానపరచిన తరువాత మీగుట్టు నేముమాత్రం బయలుపెట్టమా? నీలిగూన — నాకెందుకు! నేను చెప్పను.

సింహ—నీలిగూన యేమిటి? యేమిటో చెప్పు చెప్పు.

గ్రామ—నాకెందుకు నేనుచెప్పను. నిజమో అబద్ధమో అది నేను విన్నమాటగాని చూచినమాట కాదు.

వ్యాఘ్ర—(రహస్యముగా సింహసార్వభౌమునితో) నాతో కళ్ళారా చూచిన ముసలినక్క వకటి ఈ స్మృగాలాధముడు రాత్రి యెవళ్ళ గుడిసెలోనో దూరడంచేత వాళ్ళు తరుముకునివస్తే ప్యాక్టోరీ నీలిగూనలో పడ్డాడనిన్నీ అందుచేత వంటికి రంగుపట్టుకుంటే స్వర్గానికి దేవతలు తన్ను తీసుకునివెళ్ళి అభిషేకం చేసినారని వేషం వేసి మననందరినీ మోసంచేసినాడనిన్నీ, చెప్పినది. నాకందుమీద మహాకోపంవచ్చి పీడితాళం పట్టింతామనే యిప్పుడువచ్చినాను.

సింహ—(రహస్యముగా వ్యాఘ్రేశ్వరునితో) నీవుతొందర పడబోకు నిలకడమీద నిజం బయలుపడకపోదు. మనంచేసే కార్యం నిదానించి మరీ చెయ్యవలెను.

సృగా—ఓసింహసార్వభౌమా! చిత్తగించినారా? వీళ్ళంతా నేటిదినం యేదో కుట్రపన్ని ఆలోచించుకొని వచ్చినారు. దుర్మార్గులు ఓర్వలేనితనంచేత యేమిచేసినా మీవంటిసన్మార్గులు వాళ్ళమాటలు నమ్మరు. కుక్కుర సోమయాజుల మరణవార్త విన్నప్పటినుంచీ నా మనస్సు నిప్పులలో పొర్లించినట్టు మండుతూవున్నది. హత్యచేసిన

కూ)రులను పట్టుకోవడానికి నాశాయశక్తులా ప్రయత్నంచేస్తూ వున్నాను. నాకుకొంత రూఢిసమాచారమే తెలిసింది. దాచడం యెందుకు! ఇప్పుడు మీయెదుటనే చెప్పివేస్తాను. ఆహత్యచేసినవాడు యీగ్రామసింహదాసట. జంబుకేశ్వరశాస్త్రి, శునకాచార్లూ, మొదలయిన దుష్టులందరూ, కమ్మకుదార్లట. అన్నీ రేపు తెలుస్తవి. రేపు మీయెదుటనే సాక్షివిమర్శ చేయిస్తాను.

జంబు—(తనలో) ఓరిపాపాత్ముడా! యెంతటియెత్తు యెత్తినావురా! ఈకోజంతొపనిచేసి వీడు లంచాలిచ్చీ బెదరించీ వుద్యోగా లిప్పిస్తానని ఆశపెట్టి మాయమాటలుచెప్పి మోసంచేసి కాళ్ళుపట్టుకుని బతిమాలుకుని కావలసినంతమందిని దొంగసాక్షులను కుదురుస్తాడు. ఈలోగానేమనం వీడిగుట్టు బయలపెట్టకపోతే రేపు మన ప్రాణాలు దక్కవు. (బిగ్గరగా) ఇందులోనేను యేదోషమూయెరగను. ఈయనను దేవతలు తీసుకునివెళ్ళలేదనిన్నీ, నీలిగూనలోపడితే యీరంగు పట్టుకున్నదనిన్నీ, పొదలోవుండిచూచిన నాబంధువుడు చెపితే యెరక్కపోయి వీరితో అన్నాను. ఆమాటలు రాజుగారికి యెలాగోతెలిసి నామీద పగపట్టినారు. ఈయన నాకు మంత్రిత్వం యిచ్చినావనిచెప్పి సింహాల భార్యలనూ వ్యాఘ్రాల భార్యలనూ తీసుకురమ్మంటే నాచేతకాదన్నానని యీయనకు నామీద లోపల ఆగ్రహమండి.

సృగా—ఈతుచ్ఛుడుపేలే ప్రేలాపన పెద్దమనుష్యులు మీరంతా వింటూవున్నారుగదా? తనకుతంత్రం బయలపడ్డదని వీడు యివన్నీ కల్పించినాడు. యీ కుక్కలూ నక్కలూ కూసుకుంటే పెద్దమనుష్యులు యెవరయినా నమ్ముతారా? నావంటి ఘరానాగల వారున్నూ గొప్పదర్జాలో వున్నవారున్నూ యిటువంటి తుచ్ఛపు పనులు చేశారంటే యెవరునమ్ముతారు?

వ్యాఘ్రి—(తనలో) వీడిమాటలుచూస్తే నాకువొళ్ళు మండుకుని వస్తూవున్నది. వీడిగొంతుకకాయ కొరికిపారవేస్తాను. వీడికి నిలువల్లా అబద్ధమే. వీడు మొదటినుంచీ మోసాలచేతనే జీవిస్తూ యిప్పుడు యీస్థితికివచ్చినాడు. దుర్మార్గం యెల్లకాలమూ సాగనియ్యకూడదు. మృగరాజంతటివాడికికూడా వీడివంచనవల్ల నక్కపోతుకు సేవచెయ్యవలసిన అవస్థవచ్చింది! (బిగ్గరగా) ఓశృగాలరాజా! నిన్ను దేవతలు స్వర్గానికి తీసుకొని వెళ్ళినమాట నీవు ఋజువుపరచవలెను. లేకపోతే నీరాజ్యం పోవడమేకాకుండా యింత మందిని మోసంచేసినందుకు నీకు తగిన శిక్షకూడాచేస్తాము.

సృగా—ఆమాటన్నారు బాగావున్నది. అదెంతసేపు? నిజమయిన సంగతి నిముషంలో స్థాపనచేసుకుంటాను. రేపటిదాకా వాయిదాయిస్తే ముప్పయిమూడుకోట్ల దేవతలనూ మీయెదుట నిలువబెట్టి వారిచేత మీకు సత్యంయిప్పిస్తాను. (తనలో) ఈగండం యిప్పుడు తప్పిపోతే యీరాత్రియెక్కడికైనా పారిపోతాను. బుద్ధిమంతుడికి యెక్కడకు వెళ్ళినా లోపంవుండదు. పేరుమార్చి కొత్త వేషంవేస్తే మళ్ళీ కావలసినంతమందిని మోసం చెయ్యవచ్చును.

వ్యాఘ్రి—అలాగయితే రేపటిదాకా నిన్ను విడువకుండా మేమందరమూ నీవద్దనేవుంటాము. దేవతలను పిలిపించు.

సృగా—మీరు యిప్పుడు మీయిళ్ళకువెళ్ళి యీరాత్రి సుఖంగా నిద్రపోయి తెల్లవారినతరువాతరండి. మీరువచ్చేలోగా దేవతలనందరినీ యిక్కడ సిద్ధముగావుంచుతాను. నాయందు మీకీ అపనమ్మకంయెందుకు? నేను జిహ్వాపడిపోయినా, అబద్ధమాడుతానండీ? దేవతలు రాకపోతే నామహిమలు మీకు ప్రత్యక్షంగా కనపడడంలేదండీ? దేవతానుగ్రహంలేని వట్టినక్కకు యిటువంటి తేజస్సు వస్తుందంటే యెవరయినా నమ్మతగివుంటుందా? దేవతా

ప్రసాదంచేత నాకు వెనుకటి నక్కగుణాలన్నీపోయి నిజమయిన మృగరాజ లక్షణాలన్నీ వచ్చినవి. ఈసత్యం అనుభవంచేత మీాకే తెలుస్తుంది. నాకిప్పుడు సెలవియ్యండి. ఈరాత్రి యిందమంత్రం పురశ్చరణచేసి తెల్లవారేటప్పటికి దేవతలనందరినీ మీాకు దాసులను చేసి మీాగుమ్మాల యెదుట నిలువపెడుతాను. మంత్రజపానికి రహస్యస్థలం కావలెను.

గ్రామ—(రహస్యముగా) జంబుకేశ్వరశాస్త్రీ! వీడేమో తన వెనుకటినక్కగుణాలన్నీ పోయినవంటూవున్నాడు. ఇదేసమయం నీవు వెనుక చెప్పినట్టుగా వాడికేసితిరిగి కుయ్యడానికారంభించు.

జంబు—(రహస్యముగా) ఇదుగో నేనూఆప్రయత్నంలోనే వున్నాను. వీడు యెలాగయినా నాయుమాటలుచెప్పి యీారాత్రి తప్పించుకుని పారిపోవడానికిచూస్తూయున్నాడు. నేను పోనిస్తానా? నాశక్తి చూడు. (అని మోరయెత్తి సృగాలమహారాజువంక తిరిగి కూయ నారంభించుచున్నాడు.)

సృగా—(తనలో) ఇప్పుడెన్నిమాటలూ చెప్పినా నాకు జాతి స్వభావం మళ్ళించుకోవడానికి శక్యంకాకుండావున్నది! (అని జంబుకేశ్వరశాస్త్రి కభిముఖుఁడై బిగ్గరగా కూయుచున్నాఁడు)

వ్యాఘ్రే—ఇప్పుడు యెన్నిబడాయలు కొట్టినా వీనినక్క చేష్టలు విడువనందుకు యిదే నిదర్శనముగావున్నది. ఇఖనేను దీని మీాదికి దుమికిచంపుతాను.

గ్రామ—శునకాచార్యులూ! వ్యాఘ్రేశ్వరుడు నోరు తెరచుకొని సృగాలమహారాజుమీాదికి యెలాగు దూకడానికి ప్రయత్నం చేస్తూవున్నాడో చూడు,



శున—అయిపోయింది. సృగాలమహారాజతని నోట్లోపడ్డాడు. తలవేఱుగానూ మొండెం వేఱుగానూ పడిపోయినవి.

వ్యాఘ్రి—ఓసింహసార్వభౌమా! మనము శత్రుసంహారముచేసి యికముందు యిటువంటిమోసం యెవ్వరూ చెయ్యకుండా అందరికి బుద్ధివచ్చేటట్టు చేసినాము. వెళుదామురండి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

సంపూర్ణము.

బాక్సు ప్రెస్, రాజమండ్రి—1950.

# ప్రహ్లాద నాటకము.

గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:
హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము.
1950

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

హిరణ్యకశిపుఁడు:—రాక్షసరాజు.

విప్రజిత్తి:—హిరణ్యకశిపునిమంత్రి.

శంబరాసురుఁడు:—హిరణ్యాక్షుని కుమారుఁడు.

అలంబసుఁడు<br>దుర్ముఖుఁడు } రాక్షసభటులు

దితి:—హిరణ్యాక్ష హిరణ్యకశిపులతల్లి.

నారదుఁడు:—బ్రహ్మఋషి.

లీలావతి:—హిరణ్యకశిపునిభార్య.

ప్రహ్లాదుఁడు:—హిరణ్యకశిపుని కుమారుఁడు.

ఇంద్రుఁడు:—దేవరాజు.

వరుణుఁడు<br>కుబేరుఁడు<br>యముఁడు } దిక్పాలకులు.

బృహస్పతి:—దేవగురువు.

జయంతుఁడు:—దేవేంద్రుని కుమారుఁడు.

జమదగ్ని<br>భరద్వాజుఁడు } ఋషులు.

చిత్రరథుఁడు:—గంధర్వుఁడు.

చండామార్కుఁడు:—శుక్రపుత్రుఁడు; ఉపాధ్యాయుఁడు.

త్రిలోచనుఁడు<br>కాలనాథుఁడు } బడిబాలురు.

నృసింహమూర్తి:—నరసింహరూపమున నుద్భవించిన విష్ణువు.

మునులు, ద్వారపాలకుఁడు, పాములవాఁడు మొ.

---

# ప్రహ్లాదనాటకము

## ప్రథమాంకము

### రంగము—సభామందిరము.

(పీఠముమీఁదఁ గూర్చుండి హిరణ్యకశిపుఁడును, విప్రజిత్త్యాది మంత్రులును, కింకరాది భృత్యవర్గములును, పరివారమును ప్రవేశించియున్నారు.)

విప్ర—ఓహిరణ్యకశిప మహారాజా! దేవరవారు సెలవిచ్చినది సర్వజన శ్లాఘాపాత్రముగా నున్నది. మీరు సత్వరముగా యుద్ధయాత్ర వెడలి ముల్లోకములును జయింపవలసినదే.

హిర—ఓయివిప్రజిత్తీ! బుద్ధియందు బృహస్పతినిమించిన నీవంటి మంత్రియొక్క మంత్రబలమును, వీరాధివీరుఁడయిన హిరణ్యాక్షునివంటి తమ్మునియొక్క బాహుబలమును, సహాయములయియుండఁగా నాకీముల్లోకములనే కాదు సహస్రలోకములనయినను జయింపఁగలుగుట యెంతపని?

విప్ర—దేవరవారి మొగముముందఱ శ్లాఘింపవలసినది కాదు. కాని, తలఁచుకొన్నయెడల అసహాయశూరులయిన దేవరవారొక్కరే కోటిలోకములయిన క్షణమాత్రమున గోటమీటివేయసమర్థులు. ఏదీ మీరుదండయాత్ర వెడలిరన్న వార్త చెవినిబడినప్పుడు నిద్రాహారములు

మానిపరిశీలింపక యేయింద్రులును గింద్రులును దేవర యెదుర ప్రతి ఘటించి నిలుతురో మాత్రము. మీతమ్ముఁడు హిరణ్యాక్షుఁడును నిరుపమానమైన పౌరుషము చేత మీకు గోరంతయు తీసిపోవువాఁడు కాఁడు. అతని పేరు తలంపునఁ జాటినమాత్రమున భూపాలకులమాట యేటికి సమస్తదిక్పాలకులును గుండెలు తల్లడిల్ల వడవడ వడఁకుచుందురు. మీయాజ్ఞయైనచో, యతఁ డొక్కఁడే దండెత్తి యరనిమేషములో సమస్తలోకపాలురనుగొని తెచ్చి మీపాదాక్రాంతులను జేయఁగలఁడు.

హిర—అతని శౌర్యసంపద అంటువంటిదే. నాయెడలఁగల భ్రాతృస్నేహముచేత భూమిని చాపగా చుట్టుమన్నను వెనుకదీయక, అసాధ్యములయినను నిమిషములో సాధ్యములు చేయఁగలఁడు. అటువంటిశూరాగ్రేసరుని బలదర్పములు సహకులోడయియుండఁగా, ఒక్క మూఁడులోకముల జయించిన మనకేమి ప్రతిష్ఠరాఁగలదు? చతుర్దశలోకములను గెలిచినను మనకేమి పౌరుషము? ఆహా? బుద్ధిహీనుఁడయిన బ్రహ్మదేవుఁడు మనవంటి అసాధారణ విక్రమధౌరేయులు పుట్టుదురని యెఱిఁగి అనంతకోటి లోకములను చేయఁడయ్యెనుగా?- అవునోయి శంబరకుమారా! ఆబ్రహ్మదేవుని బుద్ధిహీనతను గూర్చి నీవేమి తలఁచెదవు?

శంబ—(తనలో) ఆహా! రాజుల మానకెన్నఁడును మేర లేదు గదా? యోగులు మూఁడుమూరల భూమి లభించినను సంతుష్టి పొంది యుందురు; రాజులు మూఁడులోకములు లభించినను సంతుష్టి పొందరు. (ప్రకాశముగా) ఓ దేవా! ముదిమి వచ్చినప్పుడెంతవారికిని మతులు నిలువవు గదా? బ్రహ్మదేవుఁడు లోకపితామహుఁడయిన పరమవృద్ధుఁడగుటచేత ముందు దేవరవంటి శౌర్యధురీణు లుద్భవింతురన్న ఆలోచన లేక లోకకోటులను సృష్టింపమరచియుండును. ఆకులవృద్ధుని మరపు మన్నించి

మనమిప్పటి కీ స్వర్గమర్త్యపాతాళలోకములు మాటితోనే తృప్తి నొందవలయును.

హిర—ఓయిముగ్ధుఁడా! కశ్యపవంశమునఁబుట్టి యిట్టినిండిన సభలో నాముందర ఎంతపౌరుషహీనమయినపలుకు పలికితివి! నీతండ్రి హిరణ్యాక్షుఁడీమాటవిన్న తానెంత చిన్నపోవునో! సింహముకడుపున లేడిపిల్లపుట్టినట్లు అంతపౌరుషశాలికడుపున నీవంటి సాధుచిత్తుఁడుపుట్టుట సాధ్యమగునా? "అసంతుష్టా ద్విజానష్టా సంతుష్టా ఇవపార్థివా" అన్నవాక్యమును నీవు వినియుండలేదా? కుమారకా! ఉన్నదానితోనే రాజులు తృప్తినొందవలెనన్న నీమాటవిన్నచో, ఇప్పుడు రాజనీతి నభ్యసించుచున్న నీతోడి రాకుమారులు నవ్వరా!

శంబ—ఓశౌర్యనిధీ! ముల్లోకములతో సంతుష్టి పొందవలెనన్నమాత్రముచేత నాయందు పౌరుషమునకు కొంతగలదని లేశమును భావింపఁబోకుము. మనకులమునకు మూలపురుషుఁడయి, కశ్యపునకు పితామహుఁడయి, మీకు ప్రపితామహుఁడయి, నాకు ప్రప్రపితామహుఁడయిన బ్రహ్మదేవునియొక్క లోపమును వెల్లడిచేయఁగూడదని అతనియందలి గౌరవముచేత నట్లంటినే కాని, ఆబ్రహ్మదేవుఁడే అన్యుఁడయ్యెనా మీరు బుద్ధిహీనుఁడని వట్టిమాటలతో సరిపెట్టితిరి కాని నేనయిననో నిజముగా నాకార్యములచేతనే ఆముదివేల్పునకు బుద్ధి చెప్పియుందును. "నీచోవదతినకురుతే నవదతికురుతేసజ్జనః" అన్న ఆర్యవచనము తాము విన్నదేకదా? నీచులు చెప్పుదురు గాని చేయరు. సజ్జనులు చేసి చూపుదురుగాని చెప్పనే చెప్పరు. నాభుజవీర్యము, శౌర్యము, ధైర్యము, కార్యము వచ్చినప్పుడు మీరే చూచి మెచ్చుకోవలెనుగాని నేనిప్పుడు చెప్పనొల్లను.

హిర — ఔరా! కుమారకా! నాకు బుద్ధి వచ్చినట్లు ప్రత్యుత్తరము చెప్పితివిరా! నీబంధు వాత్సల్యమునకును సౌశీల్యమునకు నేను పరమానంద భరితుఁడనయినాఁడను. దితి కన్నకొడుకునకెన్నఁడయిన విక్రమహీనుండు పుట్టనేర్చునా? నేనిప్పుడు నీపౌరుషవాక్యములను బట్టి లేడికడుపుననే సింహముపిల్ల పుట్టినదని సంభావించెదను. అయ్యో! ముద్దుకుమారుని కర్ణరంజకములయిన ప్రతాపోక్తులువిని సంతోషించుటకిప్పుడు హిరణ్యాక్షుఁడు లేకపోయెనుగా!

(అప్పుడు ద్వారపాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ద్వార — మహాప్రభూ! నమస్కారము. అలంబసుఁడురొప్పుచు పరుగెత్తుకొనివచ్చి దేవరవారితో ఏదో అవ్యవధానముగా మనవిచేయ వలసినపనియున్నదని మొగము వ్రేలవేసుకొని గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు వాకిట నిలిచియున్నాఁడు. సెలవయ్యేనేని, ఏలినవారి సన్నిధానమునకు వానినితీసుకొనివచ్చెదను.

హిర — వెంటనే తీసుకొనిరమ్ము.

ద్వార — చిత్తము మహాప్రభూ! (అని పోవుచున్నాఁడు.)

హిర — విప్రజిత్తీ! ఇప్పుడలంబసుని విచారమునకు కారణ మేమయియుండును? మనకేమి కీడుమాట వినవలసి వచ్చునోకదా! యెందుచేతనో కాని యిప్పుడు నాయెడమకన్నును భుజమును అదరుచున్నవి. అలంబసుఁడీయుదయకాలమున మనహిరణ్యాక్షుని వెంట వేటకయి పోయినవాఁడు. అడవిలో ఘాతుక మృగములచేత నాతమ్మునికేదయిన అపాయము కలిగియుండదుకదా!

విప్ర — మృగమాత్రముచేత హిరణ్యాక్షునకు హానికలుగునని దేవరవారు స్వప్నావస్థయందునుతలఁపకుఁడు. ఒక్కఘాతుకమృగము కాదు; ముప్పదిమూడుకోట్లదేవతలొక్కమొత్తముగావచ్చి మీఁదబడి

నను సీతమ్మని సిగపువ్వు ద్రెంపఁజాలరు. గొఱ్ఱెపిల్ల కోపదీపితంబగు సింహమును వధింపగలిగి నప్పుడును, లేడిపిల్ల బొబ్బలిడు బెబ్బులిని మ్రింగఁజాలినప్పుడును సీతమ్మని ఘాతుకమృగమునొకవేళనొప్పింపఁ గలుగునేమో కాని అందాకకలుగనేరదు.

హిర—అట్లయిన, క్రూరులయిన దేవతలు సమయము వేచి ఘోరారణ్యములో ఒంటిగా సంచరించుచున్న నాతమ్ముని జ్ఞాతిద్వేషముచేత చుట్టుముట్టి చిక్కుపఱిచి యుందురేమో!

విప్ర—ఎలుకపిల్ల లొకపదిలక్షలువచ్చి పయినిబడినను గండుపిల్లిని బంధింపఁజాలునా? పిఱికిపందలయిన దేవతలెక్కడ? శౌర్యనిధియైన మాతమ్ముడెక్కడ? వారు మాతమ్ముని జిక్కుపరచుటెక్కడ? మాతమ్మునకు సాయంకాలమునకు కావలసినంత వేటమాంసముతో సుఖముగా నింటికి వచ్చిచేరును. మీకు లేనిపోని వ్యసనము పెట్టుకోకుఁడు. అలంబసుఁ డెవ్వనిచేతనో తన్నులుతిని దేహమునొవ్వ నేడ్చుచు దేవరవారితో మొఱ్ఱపెట్టుకొనుటకయి వచ్చియుండును.

అలం—(ప్రవేశించి శోకగద్గదస్వరముతో) స్వాస్వాస్వామీ! ననమస్కారము. ఏలినవారి—(అని వడఁకుచున్నాడు)

హిర—అలంబసా! మాకడనీ వేమియుభయపడకమాబంటవై నీకెవ్వ రేయపాయము చేసినారో చెప్పు. మాపాలసేవకుఁడయిన నీ మనస్సునొప్పించి నేఁడుయమపురమునకు దారిచేసికొన్నవాడెవ్వఁడు?

అలం—(భయోత్కంపముతో) చెప్పుటకునోరాడదు. ఏమని చెప్పుదును? ఓపాపపుదైవమా! ఈపిడుగువంటి దుర్వార్తను ఈ మహారాజుగారి చెవినివేసి హృదయము పగిలింపను నన్ను ముందుగా నానొసటనె వ్రాసిపెట్టితివా?

హిర—ఓయీ! అప్రియవార్త చెప్పవలసివచ్చునని శంకింపక జంకుమాని చప్పున చెప్పివేయుము. నీవు చెప్పక ఆలశ్యము చేసినకొలఁదిని మామనస్సునందు సంతాప మధికమగుచున్నది.

అలం—(పాదములమీఁదబడి) అనవిలో తమసోదరునితోఁ గూడ ప్రాణములు విడువక రాతిగుండె వహించి నిర్భరమయిన యీశోకవార్త నింతదూరము తీసికొనివచ్చి మిమ్ముఁగూడ దుఃఖసముద్రములో ముంచునంతటి పాపమునకొడిగట్టుకొన్న పాపాత్ముఁడనయిన నన్ను పాపమనక సంహరించి నామనోవేదనము పోఁగొట్టుము.

హిర—హా! భ్రాతా! హా! లోకైకవీరా! హా! అసహాయశూరా! నీవింతబలముగలవాఁడవయ్యును మహాసైన్యమధ్యమున దిక్కుమాలి యేకాకివయి ప్రాణములువిడువవలసినవాఁడవయితివా? ఘోరశత్రువులు వెనుకపాటునపాపులవలెపైఁబడి చేయూఁతనీకగదలతోను ఖడ్గములతోను నిన్నుపడనడిచినప్పుడు అన్నయనన్ను తలఁచుకొని యెంతవిలపించియుందువో? అట్లుమరుపాటున పడుటగాక శత్రువులు నీయెదురనిలిచి ధర్మయుద్ధము చేసియుందురేని, లక్షలైనను కోట్లయినను మదపుటేనుఁగు కాలిక్రింద చీమలను నలిపినట్లు నలిపివేసియుండవా? నీశౌర్యప్రాభవము నేనెఱుఁగుదును. ఏమరుపాటునవచ్చి చుట్టుముట్టినను నీవెందఱినో మట్టుపెట్టి భూమికిబలిపెట్టక ప్రాణములువిడిచియుండవు. అలంబసా! నాముద్దుతమ్ముని ద్రోహముచేసి చంపిన పాపాత్ములెవ్వరో ముందుగా వాక్రువ్వుము. ఆచంపిన దుష్టాత్ముఁడు ప్రళయకాలరుద్రుఁడైనను వానిని నాచేతులకసితీఱఁ బొట్టచీల్చి చంపి భూమిమీఁద రక్తనదులను ప్రవహింపఁజేసి, వానిభార్యల కన్నీటితో నాసోదరునకుదకప్రదానము చేసినదాఁక నాకోపము దీఱదు.

శంబ—(ఏడ్చుచు) అలంబసా! నాతండ్రిని పొట్టబెట్టుకొన్న యాదురాత్ముఁడెవ్వఁడో వేగిరము చెప్పుము. వాఁడు చేపవలె నీటిలో

చొచ్చినను, తాబేలువలె కాలు చేతులు ముడుచుకొని కొండక్రింద నడఁగినను పందివలె గుహలు దూఱినను వెదకిచంపి నాతండ్రి ఋణము తీర్చుకొనెదను.

అలం—అయ్యా! ఒక్కమాయపంది యెక్కడనుండియో బాణమువలె వచ్చి మీఁదబడి కొమ్ముతోఁ బొడిచి మీతండ్రిని నేల పాలు చేసినది.

హిర—పందియేమి? సోదరుని పొడిచి పడవేయుట యేమి! అట్లుజరగదు. ఇవి వట్టి మతిమాలిన మాటలు.

అలం—దేవర పాదములతోడు. నామాట రూఢిగానమ్ముడు. నడికొండవలె ఒక యడవిపంది యెక్కడనుండియో ఆకస్మికముగా వచ్చి మీసోదరునిమీఁదపడి వజ్రాయుధముకన్నను వాఁడియైన కొమ్ముతో కొట్టగా నేను నాకనులార చూచినాను. ఆదెబ్బతో హిరణ్యాక్ష మహారాజు నేలమీఁదవిఱుచుకొనిపడి, కొండనుండిపాఱు సెలయేఱులవలె దేహమునుండి రక్తధారలుకార విలవిల తన్నుకొన సాగెను. అది యెక్కడిపందియో కాని సామాన్యపు పంది కాదు.

విప్ర—ఈమూఢుఁడు తప్పత్రాగి వచ్చి తప్పుడుమాటలు వదరుచున్నాడు. మీరు వీనిమాటలు పాటిగాఁ బట్టఁబోకుడు.

హిర—వీనికన్ను లెఱ్ఱగా నున్నవి; శరీరమువడఁకుచున్నది; మాటతడఁబడుచున్నది. వీఁడుత్రాగివచ్చినట్లె నాకునుతోఁచుచున్నది.

ద్వార—(ప్రవేశించి) స్వామీ! మన యువరాజుగారితో వెళ్ళిన దుర్ముఖుడువచ్చి దేవర సమ్ముఖమున విన్నవింపవలసినదేదో యున్నదని వాకిట నేడ్చుచు నిలవఁబడి యున్నాఁడు.

హిర—వానిని శీఘ్రముగా తీసికొనిరమ్ము.

అలం—నామాట నమ్మరేని నాకంటెముందుగా బయలు దేఱిన యీ దుర్ముఖుని నడుగుఁడు. ఆమాయ వరాహముపోటుచేత

మొదలు నరికిన తరువువలెనే మీసోదరుఁడు నేలకూలఁగానే వెంట నున్న భృత్యులందఱును రాతిమీఁదకొట్టిన గాజుపెంకులవలె నానా ముఖముల చెల్లాచెదరై ప్రాణభీతిచేత పాఱిరి.

దుర్ము—(ప్రవేశించి) స్వామీ! నమస్కారము. మాప్రభువు హిరణ్యాక్షమహారాజు.........(అని యేడ్చుచున్నాఁడు)

శంబ—హా! తండ్రీ! (అని పీఠముమీఁద సోలుచున్నాఁడు)

హిర—నేను వినలేను, హిరణ్యాక్షున కెంతముప్పు సంభవించినది; అతఁడు మాపిరితోనున్నాఁడా? హా! సోదరుఁడా! (అని మూర్ఛపోవుచున్నాఁడు)

విప్ర—(శైత్యోపచారము చేయుచున్నాఁడు)

అలం—(దుర్ముఖు నీవలకులాగి రహస్యముగా) దుర్ముఖా! నీవుభయపడి నాకంటె ముందుగానే పరుగెత్తుకొనివచ్చితివే. ఇంత జాగేల చేసితివి?

దుర్ము—(ఏకాంతముగా) నేను నీవలెభయముచేత పరుగెత్తుకొని పోలేదు. నాయేలినవారికి సంభవించిన విపత్తును ముందుగా హిరణ్యకశిపమహారాజుగారికి నివేదించి యీప్రభువునక్కడకుతీసుకొని పోవలెననికొంతదూరము పరుగెత్తుకొనివచ్చితిని. కాని యేలినవారట్టి దురవస్థలో నుండఁగా విడిచివచ్చుట భృత్యధర్మము కాదని, యింతలో మరలతలఁచుకొని, 'నాస్వామిప్రాణములుగొన్న సూకరాహముచేతచచ్చి స్వామితోడ స్వర్గలోకసుఖమైనను అనుభవింపపోవలెను' అను నిశ్చయముతో నేనుమరల వెనుకకుపోయితిని. ఆపాడు పంది యెక్కడమాయమయ్యెనో కాని యెంతవెదికినఁ కనఁబడలేదు.

అలం—(రహస్యముగా) నీవు పాఱుఁబోతవయి ఆపందితల నఱకలేకపోయితివిగాని, నేనాపందితలను నాచేతిలోనియీఖడ్గముతో

ఒక్క వేటున రెండు ఖండములుగా ఖండించి స్వామియెడ ఋణ
ముక్తుఁడనయి నీకంటె ముందుగానే ప్రభువువారికీ వార్త తెచ్చి
విన్నవించినాఁడను.

దుర్మ—నీవు నఱికినప్పు డాపంది జీవముతో నున్నదా?

అలం—అది ఘన హిరణ్యాక్ష మహారాజుగారి యీటెపోటు
తిని కాబోలు నేనువచ్చుతోవలో చచ్చినట్లు కదల మెదలక పడి
యున్నది. కాని నేనీకత్తితో నఱకఁగానే కదలి మొండెమొక
ప్రక్కకును తలయొక ప్రక్కకును పోయినది.

దుర్మ—(రహస్యముగా) సరిసరి! ఆపంది మేముప్రొద్దున
వేటాడి పొగడచెట్టుక్రింద చంపిపడవేసినదే. నేనిప్పుడు వచ్చి
నప్పుడు దాని తలనఱికి యుండగా చూచి, ఆపని యెవ్వరు చేసి
యుందురా అని సందేహపడితిని. అది నీపనియైనట్లిప్పుడు తెలిసినది.
నీవు చచ్చినపందిని నఱికినపోటుబంటవు.

అలం—మెల్లగామాటాడు. ప్రభువులు మూర్ఛతేరుచున్న
ట్లున్నారు.

దుర్మ—నేనింతకంటె మెల్లగా ఏకాంతమాడలేను. నన్నెవ్వ
రైన మెల్లగా మాటాడుమని బోధించినపక్షమున, నిద్రపొమ్మని
భేరీని జోకొట్టినట్లగును.

అలం—నీవిప్పుడు మఱింత బిగ్గరగా మాటాడుచున్నావేమి
పాపము! ఊరుకో వారికి వినబడునేమో! నేను చచ్చినపందిని పొడ
చిన పోటుబంటనయితే, నీవు పందిపాఱిపోయిన తఱువాత తఱుము
కొంపోయిన పెద్దబంటవుకావా!

విప్ర—ఓతాగ్రుబోతులారా! మీరు మీలో నేమో గుస
గుస లాడుచున్నారు. రాజుగారికి తెలియవచ్చుచున్నది. వృథా
శ్రమ కలుగచేయక, నిజముగా హిరణ్యాక్ష మహారాజు వరాహమ్ము
చేతనే సంహరింపబడెనేమో చెప్పుడు.

అలం—నా ప్రమాణపూర్వకముగా వరాహముచేతనే చంప
బడినాడు.

దుర్మ—వరాహముచేత చంపబడుట సత్యమే.

హిర—(మూర్ఛ తేరి నిట్టూర్పువుచ్చి) హా! తమ్ముడా!
సింహశరభముల నవలీలగా చంపినవానికి చెవులపిల్లిచేత చావవలసిన
గతి పట్టినదిగదా! హా! నాముద్దుతమ్ముడా! నిన్ను బాసి నాప్రాణము
లెట్లునిలుపుదును?

శంబ—హా! తండ్రీ! తొడమీద కూర్చుండబెట్టుకొని తల
నిమిరి నన్నెవ్వరింక ముంము ముద్దుపెట్టుకొందురు? నాకిక రాజ
నీతులు బోధించి బుద్ధులుచెప్పువారెవ్వరు? నాశరీరమించుకంత
నొచ్చిన వేయివిధముల పరితపించి మందులు మాకులు వేసి నన్నిక
ఆదరించువారెవ్వరు? హా! తండ్రీ! హా ప్రియజనకా! దిక్కుమాలిన
నన్నును నాతల్లిని నీ వెవ్వరికొప్పగించి పోయితివి?

హిర—ఓశంబరా! ఇంక మాతండ్రిని నేనెట్లు తేనేర్తును?
తండ్రిపోయిన బిడ్డలను మిమ్ముజూచి దుఃఖమెట్లు సహింపనేర్తును?

విప్ర—ఓమహారాజా! శంబరాములనోదార్చి వానికి బుద్ధి
చెప్పి దుఃఖముడుపవలసిన మీరే యీప్రకారముగా వావిడిచి
యేడ్చుచు తండ్రిపోయిన బిడ్డలను మఱింత అడలఁబెట్టుట మీవంటి
వివేకులకు తగునా? మీకుగల ధీరత్వ మిప్పుడెక్కడకు పోయినది?
ఆపదలు వచ్చినప్పుడే ధైర్యము లేకపోయినయెడల, ఆధైర్యము
మఱియెప్పటికి? పోయినవారి నిమిత్తమయి అజ్ఞానివలె చింతించుట
మీకుతగునా? ఎక్కడితమ్ములు? ఎక్కడియన్నలు? ఎక్కడిబంధువులు
ఏటిలో కొట్టుకొనిపోవు కట్టెలవలె కాలవశముచేత నొకచోట
కూడుకొని కొంతదూరము కలిసియుండి కాలవశముచేత మరల
విడిపోవుచుందురు. కాబట్టి పోయినవారికయి చింతపడవలసిన
పనిలేదు. మీతమ్ముని సంహరించినవాడు మాయావరాహ

రూపుడయివచ్చిన కేవల విష్ణుమూర్తిగాని మఱియొకడు కాడు. సామాన్యవరాహమున కెప్పుడును హిరణ్యాక్షునిబోలిన జగద్విఖ్యాత సత్త్వుని వధించునంతటిబలము కలుగనేరదు. మనము శివభక్తులమగుట చేత ద్వేషముపూని మనరాక్షసకులమును విష్ణుడెప్పుడును బహువిధమాయోపాయములచేత వెదకి చంపుచుండును. చేతనయినచో నీవాతనిపగసాధించు ఉపాయము చింతింపుము.

హిర—అవునోయివిప్రజిత్తీ! నీవుతత్వమును బహుచక్కగా కనిపెట్టినావు. నాతమ్ముని మట్టుపెట్టినపాపాత్ముడు తప్పక విష్ణుడే. సందేహము లేదు. (రోషముతో) మగటిమికలవానివలె ఎదుటనిలిచి యుద్ధముచేయక పందివలెచాటునుండివచ్చి పొడుచుట విష్ణువునకేమి పౌరుషము! నాయెదుటబడక అదృశ్యుడయి యిప్పటికిబ్రతికిపోయి నాడుగాని, ఒక్కసారి నాకన్నులయెదుటబడినపక్షమున విష్ణునిగిష్ణుని నాకత్తికి బలియియ్యనా? అదిగో అంతఃపురములో పుత్రమరణవార్త తెలిసికాబోలును మాయమ్మ దితిదేవి పుత్రశోకముచేత బొమ్మమోదుకొని విలపించుచు సభామందిరమువంక వచ్చుచున్నది.

[అప్పుడు దితి ప్రవేశించుచున్నది]

దితి—హా! పుత్రకా! హా! తండ్రి! నీతల్లిని నన్ను దుఃఖముల పాలుచేసి యీలోకమును విడిచిపెట్టి నీవుమాత్రము స్వర్గలోకసుఖమనుభవింపపోతివా? ప్రాణసమానుడైన కొడుకుపోయెనని వినియు నాప్రాణములు బొందిని బాయకున్నవి! నేనెంత కఠినచిత్తురాలను! పిడుగువంటి యీదుర్వార్త నాచిత్తము సోకియు గుండెలు పగులకున్నవి! ఓయీశ్వరుడా! నీవు నాగుండెలు రాతితోనో యినుముతోనో చేసియుందువు. నేనింకనుఎటువంటికష్టములుచూడనోచితినో, యింతటి యాపదవచ్చియు బ్రదికియున్నాను. అన్నా! హిరణ్యాక్షా!

ఈనీకొడుకులను నీతున్నను నన్నును ఎవ్వరి కప్పగించిపోయినావు ! మాకుదిక్కెవరు!

హిర—అమ్మా! నీవు శోకముమాని ఊరకుండుము. చచ్చిన వానికయి వగచిన కార్యమేమి? నీవు వేయేండ్లు దుఃఖపడినను పోయిన కొడుకు మరల లేచిరాడు. ఈ బ్రతికియున్నవారిని చూచి దుఃఖము ద్రింగికొమ్ము. ఎక్కడనుండి వచ్చెనో అక్కడికిపోవుట ప్రాణికోటి నైజము. ఎవ్వరును శాశ్వతముగా బ్రతుకువారు లేరు. మనమును ఎప్పుడో ఉన్నట్లేయుండి ప్రాణములు విడుతుము. అందఱికిని చావు సామాన్యమేయయినను, అజ్ఞానముచేత మనమేమో చావనివారమైనట్లు చచ్చినవారి నిమిత్తమయి యేడ్చుచుందుము. ఓ వెఱ్ఱితల్లీ! నీవు పోయిన కొమారుని తలంచుకొని యేడువవలసినపని యేమున్నది? ఎన్నాళ్లుబ్రతికినను చావెప్పుడయినను ఉన్నదే. భూమిమీద జన్మమెత్తినతరువాత రాజయినవాడు యుద్ధభూమియందు వైరివీరులను నిర్వక్రపరాక్రమముతో గెలువనయినను గెలువవలెను; లేదా ఱొమ్ము గాయములతో చచ్చి వీరస్వర్గమునైనను పొందవలెను. నీకొడుకు బ్రతికిన దినములలో సకలరాజులను ఘోరయుద్ధములో జయింపను జయించెను; కడపట ఱొమ్ముగాయముతోచచ్చి వీరస్వర్గమును చూఱగొనెను. ఈ రెండును పొందినవానినిమిత్తమయి నీవేల ఖేద పడియెదవు? అమ్మా! నీవుశోకముమాని అంతఃపురములో శోకించుచుండు నీకోడండ్రకు శోకోపశమనము చేయుము.

దితి—నాయనా! హిరణ్యకశిపా! నీమాటలచేత నాదుఃఖము శాంతిపొందినది. అయినను కారణమేమో తెలియదుకాని నామనస్సులోని పరితాపమడఁగకున్నది. పుత్రశోకముస్వాభావికము. ఎంత తీసి వేసికోవలెనని ప్రయత్నముచేసిననుపోదు. ఎప్పుడును చావనికొడుకులను కనుటకయి అదితియేమితపస్సుచేసినదో! నాయనా! కోడండ్ర

దుఃఖమును మాన్పుటకయి నేనంతఃపురమునకు పోయెదను. నీవును శంబరాదికుమారులను వెంటబెట్టుకొనివచ్చి నీతమ్మునికి దహనాది సంస్కారములకు ప్రయత్నింపుము. (అనివెళ్ళుచున్నది.)

హిర — విప్రజిత్తీ! హిరణ్యాక్షుఁడు పోవుటచేత నాకిప్పుడు కుడిభుజము పడిపోయినట్లున్నది. నేనిప్పుడసహాయుఁడనయి తెక్కలు తెగిన పక్షివలె నయినాడను. మాఅమ్మయిప్పుడుతపస్సుమాటజ్ఞాపకముచేసినది. తపస్సుచేత సాధింపరాని కార్యము లేవియులేవు. పూర్వము మనపెద్దలుతపస్సుచేసియేసర్వార్థసిద్ధులనుపొందినవారు. నేనిక ఈహిరణ్యాక్షుని ఉత్తరక్రియలుజరపఁగానేమందరగిరికితపస్సునిమిత్తమైపోయెదను. నేను తపస్సిద్ధిపొందివరములనుగైకొని వచ్చినమీఁదట మనము సమస్తశత్రువులను సాధింతము. నేను తపస్సునకు పోయియుండుకాలములో నారాజ్యభారమునంతను ఈశంబరునియందు నిలిపెదను, నీవిప్పిత్తనికి సహాయుఁడవై నేనులేని లోపము లేశమును లేకుండ రాజకార్యభారమును నడపెదవా!

విప్ర — దేవరవారి యనుగ్రహముండఁగాయేవిధమయినలోపమును రాదు. మనశంబరుని మీరూ బాగాఁజూచుకొనుచుమీరుస్వయముగా ఉండి చూచుకొనుచున్నట్లే రాజ్యభారమునునిర్వహించెదను.

హిర — ఇంట చాలాలు లీలావతి యుండుననుమా! దేవినెట్లాదరించి వాని మోగదుఃఖమామె లేశమును పొందకుండునట్లు విచారించెదవో?

విప్ర — దేవిగారిని మాకన్నతల్లినిగాభావించుకొని, వారికిసమస్తోపచారములను నడపించుచు, మాచేతనయినంతవరకు మీరులేని లోపమేదియు కనఁబడకుండఁ జేసెదను.

హిర — శంబరకుమారుఁడురాజకార్యములందంతగా అనుభవశాలి కాఁడు. సామదానాద్యుపాయము లెవ్వరియం దేప్రకారముగా

ప్రయోగించవలెనో యీతనికి చక్కగా బోధించి, మంత్రివై యుండి యీ సమస్తకార్యములును నడిపింపుము—ఓశంబరా! నీవీవిప్రజిత్తి యాలోచనయందు గౌరవముంచి, నేను తపస్సుచాలించి, మరల వచ్చుపర్యంతమును ఇతని యాలోచనప్రకారము నడుచుచుండుము.

శంబ—దేవరయాజ్ఞను శిరసావహించి చేసెదను.

హిర—ఓయివిప్రజిత్తీ! దేవతలెప్పుడును మనకు విద్వేషులు. ఆగర్భశత్రువులనుండి ఉపద్రవమేమియు పుట్టకుండ నీవప్రమత్తుడవయి యంతఃపురమును రాజధానిని సహస్రముఖముల రక్షింపుచుండవలయునుజుమీ! యేమో చెప్పితినని అశ్రద్ధచేయక నీవుబహు జాగరూకుఁడవయి యుండవలెను.

విప్ర—ఈసంగతి దేవరవారు నాకు వేరే శలవియ్యవలెనా! నేనొక కన్నప్పుడును దేవతలమీఁదనే వేసియుంచెదను. వారికి విష్ణుదేవుఁడు పాలకుడు. అతఁడెప్పుడేమి మోసముచేయునో యని మాత్రము నామనస్సు సందేహపడుచున్నది.

హిర—విష్ణువు పేరుచెప్పిన నాయొడలు మండుచున్నది. అతనిని రూపుమాపి నాసోదరుని చంపినపగ సాధించువఱకు నాకు నిద్రపట్టదు అతనిని చంపుదమన్నను రూపము కనఁబడదు; వెదకుదమన్నను ఉన్నస్థలము తెలియదు. అతఁడు యజ్ఞములయందును, స్వాధ్యాయములయందును, బ్రాహ్మణులయందును. ఋషులయందును, విష్ణుభక్తులయందును, ఉండునని చెప్పుదురు—ఓ రాక్షసులారా! మీరిప్పుడే నాయాజ్ఞను శిరసావహించిపోయి యజ్ఞములు పాడుచేసి, తపస్సులు చెఱిచి, స్వాధ్యాయములు దగ్ధముచేసి, బ్రాహ్మణులనుజంపి, మానులను భంగపరచి, విష్ణుడొక్కసారిగా నశించునట్లు భూమియంతయు కోలాహలము చేసిరండు పొండు.

దుర్ము—చిత్తము మహాప్రభూ! (రాక్షసులందఱును పోవుచున్నారు)

శంబ—(తనలో) క్రోధావేశముచేత పరవశులయియున్నవారికి ఉచితానుచితవివేక ముండదుగదా! పాపము! ఈయన తనతమ్ముఁడు చచ్చెనన్న కోపముచేత నిష్కారణముగా సాధువులను బాధచేయ బంపుచున్నాఁడు.

హీర—ఓయీ! శంబరా! మీతండ్రికి ప్రేతసంస్కారము చేయవలెను. మనము పోదము రా. విప్రజిత్తీ! నీవుకూడవచ్చి కావలసిన పరికరములను సిద్ధముచేయింపుము.

విప్ర—చిత్తము. (అందఱును పోవుచున్నారు)

---

## ద్వితీయాంకము

రంగము—సభామందిరము

(అలంబుసుఁడును, దుర్ముఖుఁడును ప్రవేశించుచున్నారు)

అలం—ఓరీ దుర్ముఖా! మొన్న దేవేంద్రుడు మన మహారాజుగారు తపస్సునకు వెళ్ళినకాలములో మనపట్టణముమీఁదికి దండెత్తివచ్చి నగరుముట్టడిగొని, రాణిగారిని చెఱగొని పోయినప్పుడు నిన్నుఁ జంపినారన్నారే నిజమేనా?

దుర్ము—నేను చావలేదు. బహురాక్షసులు ఘోరయుద్ధము చేసి చచ్చినప్పుడు శూరాగ్రేసరులలో నన్నొక్కనినే దేవతలుచంపలేకపోయినారు. అంతఘోరయుద్ధము జరిగినప్పుడు శంబరవిప్రజిత్త్యాదులకయినను కాయములనిండ గాయములుతగిలినవి కాని నాశరీరముమీఁద ఒక్కగాయమైనను తగులలేదు. ఇది మహావిచిత్రము కాదా!

అలం—ఈవిచిత్రమున కేమిగాని నీవిప్పుడు చచ్చినావో లేదో నిజముగా చెప్పు. నేనిప్పుడునీతో పరియాచకమాడుచుండ లేనుసుమా. అబద్ధమాడిన పక్షమున మనప్రభువు పాదములతోడు నిజము చెప్పు.

దుర్ము—నేను నిజముగానే చావలేదు. కావలసిన పక్షమున ఈసంగతి న్యాయసభలో వేయి ప్రమాణములుచేసి చెప్పఁగలను. నిన్ను చంపుకొన్నట్టు సత్యముగా నేను చావలేదు. నీయెదుట నేను ప్రత్యక్షముగా నిలుచుండి మాటాడుచు స్వయముగా చెప్పుచుండఁగా నామాట నీవేల నమ్మకున్నావు?

అలం—నీమాటయందు నాకు నమ్మకము లేదు. నీవీవఱకబద్ధములాడి నన్నన్నిసారులో మోసముచేసినావు. ఈమాటలుకూడా పెనుమోసమయియే యుండును. నీ వెక్కడను కనఁబడలేదు. చచ్చితివని నాతో విరోచనుఁడు చెప్పినాఁడు. అతఁడెప్పుడును కల్లలాడువాడు కాఁడు. నేనతని మాటనే విశ్వసించెదను.

దుర్ము—నీకు నామాటయందు నమ్మకము లేకపోయిన యెడల, నా దేహముతడవిచూచి ప్రత్యక్షముగా తెలిసికొమ్ము. అక్కడికిని నమ్మకము పుట్టనిపక్షమున పదిమంది రాక్షసులకు లంచమిచ్చి ప్రమాణముమీఁద సాక్ష్యమిప్పించెదను.

అలం—(దుర్ముఖుని దేహము తడవిచూచుచు) ఇది పిశాచ దేహము కాదుగదా? ఇది నిజమయిన దేహమే అయిన పక్షమున చావకపోయినప్పటికిని యుద్ధములో గాయములుతగిలియుండవలెను. గాయములు లేవుగనుక ఇదినిశ్చయముగా మాయదేహము. ఇది కేవలము రాక్షసమాయ. సందేహము లేదు. నీవుచచ్చినమాటయేకసిద్ధాంతమే.

దుర్ము—నాఅద్భుత సామర్థ్యముచేత గాయములుతగులకుండ విచిత్రముగా తప్పించుకొన్నానని నీతో నేనిప్పుడు చెప్పలేదా?

అలం—ఎట్లు తప్పించుకొన్నావు?

దుర్ము—కోతులగుంపుతో కలసి యొక చెట్టుమీఁద కూరు చుండి నాసహాయము కావలసివచ్చినప్పుడుదిగివచ్చి దేవతలను ఖండ ఖండములు చేయవలెనన్న యుద్దేశముతో ఎవరెవరేలాగున యుద్ధము చేయుచున్నారో చూచుచున్నాను. దేవదానవులు లక్షమంది నేనున్న చెట్టువద్దకువచ్చినను, ఆమందలోనన్ను పెద్దగద్దెరగానిగాభావించినారే కాని నన్నొక్కరునుఆనవాలుపట్టలేకపోయినారు. ధూళిపయికిలేచుట చేత ఎవరెవరేలాగున యుద్ధముచేసినారో యెవరుచచ్చినారో తెలిసి నదికాదు గాని, యుద్ధముతీఱి సందడి యడఁగినతరువాత దేవతలు నిర్మూలమైనారని, రాక్షసులకు విజయముకలిగినదని సంతోషించుచు దిగివచ్చినాను. అప్పటికప్పుడే దేవతలు లీలావతీదేవినిచెఱగొని పాఱి పోయినారనివిని, నాకు మహాకోపమువచ్చి దేవతలనందఱిని నాకోపా గ్నికి పూర్ణాహుతి చేయవలెనని భోజనమయినతోడనే బయలుదేఱి మహావేగముగా తఱుముకొనిపోయినాను. నేనువెనుక వచ్చిపోదునని నాకు జడిసికాఁబోలును దేవతలొక్కరును నాకంటఁబడక కాకులవలె ఆకాశమార్గమునఎగిరిపోయి స్వర్గములోదూఱి ప్రాణములుదక్కించుకొన్నారు. నాసహాయము పొందకపోవుటచేత మనరాక్షసులకు పరా భవము కలిగినదే కాని నేనున్నయెడల అనుకులకపజయముకలుగదు. చూడు. ముందు నేను హిరణ్యకశిప మహారాజుగారితోపోయి దేవ తలు మనల నవమానపఱిచిన ఋణము వడ్డీతోకూడ కక్కించివారి నెట్లు బాధపెట్టెదనోచూడు.

అలం—అయ్యో! హిరణ్యకశిప మహారాజుగా రన్నతోడనే జ్ఞప్తికివచ్చినది! తపస్సుచేసి వరములుపొంది వేంచేయుచున్నహిరణ్య కశిప మహారాజుగారిని ఎదుర్కొనితోడుకొనితెచ్చుటకయి మనవిప్ర

జిత్తిమొదలయినవారు వోవునప్పుడు సన్నీసభామంటపమునలంకరించి పీఠములను వేయనియమించినారు. అదిగో వాద్యముల మ్రోత వినఁబడుచున్నది. వారు వేంచేయుచున్నట్లున్నారు. వేగిరము పీఠములను తగిన స్థలములలో వేయవలెను.

దుష్ట—నన్ను నీకీపనిలో సహాయము చేయుమని పంపినారు. అడిగినపక్షమున, ఈయలంకారాలమంతయు నేనే చేసితినని మనవి చేయుమూ. నాకువచ్చెడు బహుమానములో సగము నీకిచ్చెదను. (అని యిద్దఱును పీఠములను సవరించుచున్నారు.)

(అప్పుడు హిరణ్యకశిపుడును, విప్రజిత్తియు, శంబరుఁడును, మొదలగువారును వచ్చి పీఠములపై కూర్చున్నారు.)

హిర—(పీఠముమీఁద కూర్చుండి) ఓయీ! విప్రజిత్తీ! నీవు కూర్చుండుము. శంబరాసురా! నా చేరువ వచ్చి కూర్చుండుము.

విప్ర—మహాప్రసాదము.

హిర—మాతపోవృత్తాంతము త్రోవలో నారంభించియు, ప్రసంగాంతరముచే చెప్పలేదు. ఇప్పుడు వినుము. మేము మందరపర్వతాగ్రము చేరినకథ విన్నావుగదా?

విప్ర—విన్నాను. తరువాతివృత్తాంత మానతియ్యవలయును.

హిర—నే నా పర్వతాగ్రమున ఒంటికాలితో బొటనవ్రేలి మీఁద నిలువబడి ఱెప్పవాల్పక సూర్యునివంక తేఱిపారఁ జూచుచు, ఊర్ధ్వబాహుడనయి, కొంతకాలము జలాహారుఁడను, కొంతకాలము వాయుభక్షకుఁడను, కొంతకాలము నిరాహారుఁడను, అయి పరమ నిష్ఠతో ఘోరతపస్సు చేసితిని.

విప్ర—దేవర వారు పరమదారుణముగా మహోగ్రతపస్సు చేసినారు. ఇట్టి దారుణోగ్రతపస్సును మున్నెప్పుడును ఎవ్వరును చేసియుండరు.

హిర — అట్టితపస్స్వియను ఏయుగంబులను జేసియుండరు. నేనునిశ్చలతపోసమాధినుండఁగా నా దేహమంతయుపుట్టలుపెట్టి మేదో మాంసములు చెదలు తినిపోయినవి; నాజడలగుంపులలో పిట్టలుగూళ్ళు కట్టినవి; చెవులలో చెట్లు మొలచినవి. నాతపోవహ్నిముల్లోకములను ముంచుకొనఁగా దేవతలు భయపడి బ్రహ్మదేవుని యొద్దకుపోయి మొఱ్ఱలు పెట్టుకొనిరఁట.

శంబ — దేవతలెప్పుడును పరులతపస్సులకు విఘ్నముచేయు దుస్వభావులే. తమకు వెలితికాఁబోలును మావిషయములో తామట్టి పనిని మానుకొన్నారు.

హిర — కార్యము లేకపోయినదిగాని ఆ దుష్టులు తమ ప్రయత్నమును మాత్రము మానలేదు. వారు కనకాంగియనెడి యప్సరసను సింగారించి, ఆటలచేతను పాటలచేతను తేనెమాటలచేతనునన్నువలపించి, నాతపస్సు చెఱిచిరమ్మని పంపిరిగాని, ఆయప్సరసవచ్చి నా నిగ్రహశక్తిని కన్గొనుచుండి, నన్ను సమీపించి భీతిపొంది తన వచ్చిన వారికే మరల స్వర్గముననుపోయి,నన్ను మఱులుకొల్పుటన చేతఁగాదని చెప్పివేసెనఁట! ఈసంగతి బ్రహ్మదేవుఁడు నాకు వరములిచ్చినప్పుడు చెప్పినాఁడు.

విప్ర — దేవరవారు బ్రహ్మదేవునిచేతఏయేవరములను పొందినారో వినుటకు నామనస్సులో కుతూహలమగుచున్నది. దేవరవారనుగ్రహించి నన్ను కృతార్థుని జేయవలయును.

హిర — దేవతల ప్రార్థనలచేతనుఁ గాబోలును బ్రహ్మదేవుఁడు భార్యాసమేతుఁడయి నేను తపస్సుచేయుచున్న మందరగిరికివచ్చి నా తపస్సుకు మెచ్చి, కరుణాకటాక్షవీక్షణముచేత తనకమండలదివ్యోదకము నాశరీరముమీఁద ప్రోక్షించి,వజ్రశరీరుఁడనయి కన్నులువిచ్చి

చేతులుజోడించికొని వినయ భయభక్తులు ముప్పిరిగొనఎగుటనిలువఁ బడియున్న నన్ను తన చల్లనిచూపునఁజూచి, నాధైర్యస్థైర్యాదులను తపోనిష్ఠను బహువిధముల శ్లాఘించి, కోరినకోరికలిచ్చెదనడుగుమని యానతిచ్చెను.

శంబ—ఆహా! పితామహుఁడు భక్తవత్సలుఁడుగదా!

హిర—ఆకరుణానిధి తన చల్లని కరపల్లవములతో నామేను నిమురుచు వరములడుగుమనిన, నేనును భక్తిపూర్వకముగా ప్రణామంబుచేసి ముకుళితకరములుఁడనై బహువిధముల స్తుతించి, ప్రసన్నుఁడయియున్న యాహిరణ్యగర్భునిముఖమునదృష్టినిలిపి, భూమియందును జలమునందును, అగ్నియందును, వాయువునందును, ఆకాశమునందును రాక్షసులచేతను దేవతలచేతనునరులచేతనుమృగములచేతనుపాముల చేతను పక్షులచేతను శస్త్రాస్త్రములచేతనుచావులేనిబ్రతుకును, యుద్ధముల నెదురులేనిశౌర్యమును లోకపాలకుల నతిక్రమించి త్రిభువన విజయముపొందుశక్తియు, కోరితిని. భక్తజనమనోభీప్సితార్థ ప్రదాతయైన యావిధాత కోరినవరములన్నియు నిచ్చి, నన్నుదీవించి, తాసంతర్హితుఁడయ్యెను.

విప్ర—ఇప్పుడు మేమందఱమును ధన్యుల మయినారము. ద్రోహులయిన యాదేవేంద్రాదుల గర్వమడఁచి వారియైశ్వర్యము నపహరించి మన పగతీర్చుకొనుట కిప్పుడుగదా సమయమువచ్చినది!

హిర—హిరణ్యాక్షుని వరాహమయి వధించిపోయినవైరము సాధింప ముందుగా విష్ణుమూర్తిని వెదకి సంహరింపవలెను. మాతల్లిగారును, అంతఃపురమున లీలావతిదేవియు, కుశలులయి యున్నారు కదా! మేము తపశ్చరణమునకు పోవునప్పటికే లీలావతి గర్భవతియైయున్నదే. మాకావల పుత్రలాభము కలిగినదా? పుత్రికాలాభము కలిగినదా?

విప్ర—అందఱును సుఖులయి యే యున్నారు కాని—

హిర—(తుళ్లిపడి) కాని, యేమిటి? నేను లేనిసమయములో విరోధులెవ్వరైన మఱియెవ్వరికైన ఏమయిన అపకారము చేసినారా యేమి?

విప్ర—దేవరవారు తపశ్చరణమునకు పోయినతరువాత అకస్మికముగా దేవేంద్రుఁడొకనాఁడు తనసేనలతో మనపురము మీఁద దండువిడిసినాఁడు.

హిర—ఆహా! యేమీ యింతతడవును చెప్పకుంటివి! ఉన్న కన్నులుచాలవని గౌతముఁడు తనకు వేయి కన్నులిచ్చినను దేవేంద్రుఁడింకను కన్నుగానకున్నాఁడేమి? హిరణ్యకశిపుని ప్రతాపానలమును కొంచెముకాలములోనే చవిచూచి యింద్రుఁడు తన మదాంధకారమును విడువఁగలడు. అటుతరువాత నేమిజరిగినది? మీరందఱును సేనలను వెన్నుకొనిపోయి దుస్సహమయిన మహాయుద్ధము చేసి దేవతలను చీకాకుపఱిచియుందురు.

విప్ర—మేము ఘోరయుద్ధమే చేసినారము కాని దేవరవారు సమీపమునలేని దురదృష్టముచేత మనవారు నిరుత్సాహులుకాఁగా శత్రువులు మనసేనల నతిక్రమించి ప్రాణముల కాశపడక పోరెడుశంబరకుమారాదులగు మాబోంట్లను లక్ష్యముచేయక లోపల ప్రవేశించి నగరు కొల్లపెట్టుకొనిపోయిరి.

హిర—అక్కటా! హిరణ్యకశిపుని శరీరములో ప్రాణములుండఁగానే మనరాజధాని కెటువంటి దుర్యోగముపట్టినది! పట్టణము పరులపాలయి అవమానము తటస్థించిన తరువాత, ఇఁక నా పౌరుషమెందుకు?

విప్ర—ఇంద్రాదులు మనకుచేసిన పరాభవమింతే కాదు—ఓ శంబరా! నేను చెప్పలేను. ఆపయిసంగతి నీవు విన్నవింపుము.

(అని దుఃఖము నభినయించుచున్నాడు.)

శంబ—(కన్నుల నీరు వఱదగొనఁ దీనముఖముతో) ఆ అప్రియవార్తను విన్నవింప నాకు నోరెట్లాడును? స్వామి సంరక్షణముచేయ నేరక శత్రువులకొప్పగించి యూరకున్న పాపాత్ముడనయిన నేను హృదయము రాయి చేసుకొని ఆపాపపుమాటకూడ చెప్పవలెను. నాతల్లి లీలావతీదేవిని దేవతలు తమపట్టికి — (అని సగముచెప్పి శోకముతో) ఇఁక నేను చెప్పలేను.

హిర—హా! నాహృదయేశ్వరీ! నేనుబ్రతికియుండఁగా నీ కెంతవైపరీత్యము ప్రాప్తించినది! హా! హా! సాధ్వీమణీ! వినయవతీ! నిన్ను క్రూరులయి శత్రువులు చెఱగొనిపోయిరా? అయ్యో! ఇంకను నే నెట్టిపాపపుమాట విననలయునో! ఆదురాత్ములు నిన్నుఁగొనిపోయి నామీఁద ద్వేషముచేత నీప్రాణములు గొనరుగదా? ఇంత దారుణవృత్తాంతము చెవినిబడియు ప్రాణములు నిలుపుకొనున్నాను. ఆహా! నాది యెంత మొండిబ్రతుకు! ఓలీలావతీ! ఓప్రాణేశ్వరీ! నీభర్త నిమీఁద ప్రేమచే పిలుచుచున్నను పలుకకున్నావేమి? నన్నేల యెడబాసితివి? ఓపతివ్రతాశిరోమణీ! నీవు ఈ వట రాజునకు భార్యవుగాక యేబీదవానికి భార్యవైనను, ఇటువంటి ఘోరాపదలు లేక సుఖముగా బ్రతికిపోదువే. నిర్భాగ్యుఁడనైన నాకేల భార్యవైతివి? (అని రౌద్రాకారముతో లేచి) ఓయీ శపథప్రతిజ్ఞ! నాప్రతిజ్ఞ వినుము. బ్రహ్మేంద్రాదులడ్డమువచ్చి కావఁబూనినను, నాప్రాణవల్లభ లీలావతియు వచ్చి నాపాదములమీఁదఁబడి కన్నీరు మునిసి వేఁడుకొన్నను, నేనింటలేనప్పుడు దొంగవలెవచ్చి నాయిల్లాలిని పరమసాధ్విని అపహరించిన ఆ పరమనీచుని దేవేంద్రుని పుత్రమిత్రకళత్రసహితముగా నే నంతము నొందించెదను. వంటయింట

కుందేలు నాచేతఁబడక దాఁటింక నెందుఁబోఁగలవాఁడు! ఆ విప్ర మహీసురుఁడు పరకాంతను నిండుచూలాలి నెవ్వఁడుత్సాహపెట్టికొని పోఁగనో, అప్పుడే చచ్చినవాఁడు. ఈ నెలకడ చనులోపల నేనూతాని గర్వసంహారము చేయనియెడల, నేను బ్రహ్మవలన పొందినవరములు వరములుకావు: నాపేరు హిరణ్యకశిపుఁడుకాఁడు; నేను కశ్యపుని పుత్రుఁడను కాను.

విప్ర—దేవర కింతయాగ్రహము వచ్చినదిగనుక, ఇంద్రునకు నిశ్చయముగా చావుమూడినది. "వినాశకాలేవిపరీతబుద్ధి" అన్నట్లు, ఆత్మవినాశకాలము సమీపించినదిగనుక నేఆదుర్మదాంధునకు నీపట్టపుదేవిని చెఱఁగొనిపోవు దుర్బుద్ధిపుట్టినది. కుడిచికూరుచుండి సుఖముగా బ్రతుకలేక కండక్రొవ్వెక్కి, గుహలోనిద్రించుచున్న సింహముమీసములులాగ సాహసించినవానికి వెంటనే తత్ఫలము కట్టి కుడువక ఊరకపోవునా?

హిర—విప్రపుత్రా! ఈవరకే ఆపాపాత్ముఁడు స్త్రీహత్యకూడ ఒడికట్టుకొని యుండునేమో!— ఓప్రాణనాయకీ! ఆమూలదైవము నీకు పగవారిచేత బలవంతపుచావుకూడ పెట్టియుండఁడుగదా!

శంబ—తండ్రీ! నాతల్లిలీలావతీదేవినిమిత్తము మీరింతపరితపింపవలసిన పనిలేదు. ఆమె క్షేమముగానున్నది. మీమనస్సు నాపెనిమిత్తము నిష్కారణముగా ఆయాసపెట్టఁబోకుఁడు. దుర్ణయుఁడయిన యింద్రునకుబుద్ధిచెప్పి చూలాలయియున్న దేవిగారినివిడిపించి నారదుఁడు తనయాశ్రమమునకుఁ గొనిపోయి,ఆదరించి, ఆమహాపతివ్రతను పుత్రరత్నముతోఁగూడ సురక్షితముగ కాపాడుచున్నాఁడు.

హిర—నారదాశ్రమముననే మాకుపుత్రజననముకూడ కలిగినదా! అట్లయిన ఆదేవగాయకుని మనమాస్థానమునందు వీణపాటకునిగా నుంచుకొందము.

విప్ర:—అతనికి చక్కని బ్రతుకుతెరువు కల్పించినారు. అట్లు చేయుట నారదునకు పరమానుగ్రహముకదా? అదె మన మాటలోనే నారదుఁడును దేవిగారిని, మీపుత్రతిలకమును వెంట బెట్టుకొని మన యాస్థానమునకువచ్చుచున్నాఁడు. అతనికి నూఱేండ్లు పూర్ణాయుస్సున్నది.

(అప్పుడు నారదుఁడును, లీలావతియు, కొమారుఁడును ప్రవేశించుచున్నారు.)

నార:—దిగ్విజయమస్తు! చింతితకళ్యాణ సమృద్ధిరస్తు! ఓ మహారాజా! ద్వారపాలకుఁడు నన్ను వెనుకకు లాగుచున్నాఁడు. యమపాశములవంటి వీని బాహుపాశములనుండి నన్ను విముక్తుని చేయుఁడు.

హిర:—ఓరీ ద్వారపాలకా! నీకిదె యొక్కసారిగా నాజ్ఞ యిచ్చుచున్నారము. ఈ నారదుఁడు మన సభాభవనమున కెప్పుడు వచ్చినను నీవడ్డపెట్టక మన భృత్యులతోడిపాటుగా నతనిని రానిచ్చుచుండుము. మునులలో మనకీతఁడు విశ్వసనీయుఁడు.

ద్వార:—మహాప్రసాదము.

హిర:—ఓహో! ఏమి నాభాగ్యము! లీలావతిదేవి నాకిప్పుడు నేత్రోత్సవముచేయుచున్నది! ఓ ప్రాణేశ్వరీ! నిమిషముక్రిందట నీ నిమిత్తమై శోకబాష్పములు విడిచినకన్నులతోనే యిప్పుడు ఆనంద బాష్పములు విడుచుభాగ్యము లభించినది. ఏమి నీవింత చిక్కి యున్నావు? ఇంతకాలము దయమాలి నిన్ను వియోగదుఃఖముల పాలుచేసి పోయిన నాకు దూరస్థురాలవై యుండియు, దైవరక్షణము చేత సుఖముగా నున్నావుగదా? ఓ హృదయేశ్వరీ! నీచల్లనిచేయి నా ఱొమ్మునమోపి నా దేహతాపమడపుము. (అని చేయిపట్టుకొని చేర దీసి అర్ధాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొనుచున్నాఁడు.)

లీలా:—ఓ ప్రాణేశ్వరా! నాశరీరముదూరముగానున్నను హృదయము మాత్ర మెప్పుడును మీకు దూరముగానుండ లేదు. అయ్యో!

ఘోరతపస్సులచేత శరీరమును దుఃఖపెట్టి పెద్దకాలమునకు గృహాము
నకు విజయంచేసిన దేవరవారి కుపచారశతములచేత దేహము చల్ల
చేయలేకమీఁదిమిక్కిలినిర్భాగ్యురాలనయిన నేనుమీకుసంతాపమును
కూడకలుగఁజేసితినిగదా? ఓప్రాణవల్లభా! మీరుక్షేమముగా మరల
వచ్చితిరా? మీవియోగదుఃఖముచేత ప్రాణములుపోవలసినవేళయి
నను, ఈనారదుఁడు ప్రతిదినమును మీక్షేమసమాచారమునుచెప్పుచు
క్రొత్తయాశను పుట్టించుచువచ్చుటచేత నాయాశాబంధమేబొందిలో
ప్రాణము వెడలకుండ నిలిపినది. దేవరవారి పునర్దర్శనమగుటచేత
నాసహానమువలని ఫలమిప్పుడు కలిగి నేత్రసాఫల్యమయినది. ఓయి
కుమారకా! చిరకాలమునకు చూడఁగలిగిన నీతండ్రికి మ్రొక్కుము.
(అని తండ్రికాళ్ళమీఁద పడవేయుచున్నది.)

హిర—(కొడుకును లేవనెత్తి ముద్దుపెట్టుకొని) దీర్ఘాయుష్య
మస్తు! సామ్రాజ్యమస్తు! ఓచిన్నికుమారా! నన్నుగన్నతండ్రీ! లెమ్ము
లెమ్ము. నీవుఅల్లారుముద్దుగా ప్రాకుచుండగాను, తప్పటడుగులుపెట్టు
చుండఁగాను, విద్దెములుచేయుచుండఁగాను, వచ్చిరాని ముద్దుపలుకులు
పలుకుచుండగాను, కన్నులు చల్లగాచూచి సంతోషించుటకు నేను
నోచుకోనైతినిగదా? అట్లయినను, ఓతండ్రీ! నిన్నిప్పుడు చూడగానే
నాకన్నులుచల్లపడి, నీగాత్రము సోఁకుటచేత నాశరీరము సంతోష
పులకితమగుచున్నది. నీవంక చూచినకొలఁదిని నాకంతకంతకు హృద
యాహ్లాద మధికమగుచున్నది. గనుక, నేఁటినుండి నిన్ను ప్రహ్లాదు
నని పిలిచెదను. (అని తొడమీఁద కూరుచుండఁబెట్టుకొని, మేనునిమిరి
నిమిరి, బుగ్గముద్దుబెట్టుకొనుచున్నాఁడు.)

లీలా—ప్రాణనాథా! మనకీపుత్రభిక్షపెట్టి యిట్టి ఆనందము
కలుగఁజేసినది యీనారదులు, వారిమేలునుమనముమఱవఁగూడదు,

ఈతని నామకరణ మహోత్సవకాలమున నారదముని సత్కరింప వలయును.

హిర—మనమవశ్యముగా సత్కరింతము (నారదునివంకఁదిరిగి) ఓయీ! నారదా! నీవింకను నిలువఁబడియేయున్నావా? యీపీఠము మీఁదఁగూర్చుండుము. (భార్యవంకఁదిరిగి) ఓప్రాణేశ్వరీ! ఇంద్రుఁడు నీకుఁజేసిన పరాభవమును నీవలన వినఁగోరుచున్నాను.

లీలా—ఓప్రాణవల్లభా! అప్పటినాయవస్థతలఁచుకొన్న ఇప్పటికి నా దేహము కంపమెత్తుచున్నది. ఆయింద్రుఁడు దండెత్తివచ్చినసమాచారము మీకీవఱకే యీవిప్రజిత్త్యాదులు విన్నపము చేసియుందురు గదా? అతడంతఃపురమును ప్రవేశించునప్పటికి వ్యాఘ్రమునుగన్న ఆడులేడివలె బెదరి ఆపాదమస్తకము చెమ్మటపట్ట, దేహము గడగడ వడఁక, నేనొక తలుపుచాటున డాఁగి నిలువఁబడినాను.

హిర—ఆహా! మహారాజపత్నీ! నీకిటువంటి దురవస్థ సంప్రాప్తమయినది! అటుపైని.

లీలా—ఆదుష్టాత్ముఁడు వజ్రాయుధమునుపట్టుటచేత కాయలు కాచిన మోటుచేతితో నామృదుహస్తమునుపట్టుకొని యీవలకీడ్చినాఁడు. అంతవఱకు నేనెఱుఁగుదును. ఆపైని నేమి జరిగినదో నాకు తెలియదు. మూర్ఛ తేఱి నేనుకన్నులువిచ్చుచునప్పటికినారదుఁడు నాయెదుటనుండి నా పరిచారము చేయుచు, ఇంద్రుని మందలించుచున్నాఁడు. తదనంతర వృత్తాంత మీయన నడుగుఁడు.

హిర—ఓయీ! నారదా! ఆయింద్రుని దౌష్ట్యమంతయు నీవేమి మఱుఁగుపఱచక ఉన్నది యున్నట్లు చెప్పుమా.

నార—నాకు తెలిసియున్నంతవఱకు దాచక చెప్పెదను వినుఁడు. మీరిట్లు దారుణ తపస్సుచేయుచు అస్థిచర్మావశిష్ట దేహముతో

ముక్కనూతిరి లేక, స్థాణువువలె నుండగా చారులు చూచిపోయి నీవు చచ్చితివని యింద్రునకు విన్నవించిరి, అంతనతఁడు నీప్రాపున లేని మూకరాకన్న రాక్షసులను సంహరించుట కదే సమయమనుకొని తక్షణమే దండయాత్ర బయలు దేరినాఁడు.

హిర—హిరణ్యకశిపుఁడు కాలధర్మము నొందెననియే యింద్రుఁడు నానగరిమీఁదికి దండెత్త సాహసించెనుగాని, లేనిపక్షమున ఇంద్రునికట్టి చొరవ యెక్కడనుండివచ్చును? నా పేరువినబడిన దేవలోకములో సహితము గర్భనిర్భేదము కాదా? ఆపయిసంగతి కొంత విన్నాఁగము దేవినెత్తుకొనిపోయినతరువాత నేమిజరిగినదో చెప్పు.

నార—అతఁడు లీలావతిని రథముమీఁద పెట్టుకొని, ఆకాశమార్గమున ఎగయునప్పుడు దేవి దేహము తెలియకయే కాఁబోలును "ఓ నాథా! ఓ రాక్షససార్వభౌమా! దిక్కుమాలియున్న నీభార్యనైన నా మానమును కాపాడుము" అని పలవించినది.

హిర-ఓ దేవీ! ప్రాణేశ్వరీ! అడలఁబోకు. ఇదిగో నిన్ను కాచుటకయి నేనువచ్చుచున్నాను. ఓరీ! ఇంద్రా! హిరణ్యకశిపుని ముందర నీ వెటుబోయెదవురా? నిలువు నిలువు; ఈ భల్లమున నీతలడొల్ల వేసెదను (అని లేచుచున్నాఁడు)

నార— దేవా! ఇప్పుడింద్రుఁడిక్కడలేఁడు. దేవి విలపించిన విధమున నేను చెప్పినాను.

హిర—అలాగునా? దేవివిలాపము నా చెవిసోకఁగానే నా దేహము పరవశమయి పయిమాట చెవినిజొరక నిజముగా దేవేంద్రుఁడు నాకన్నులయెదుట కట్టినట్లే కనఁబడినాఁడు. అందుచేత నేను లేచినాఁడను. నారదా? తరువాత నేమిజరిగినది?

నార—నే నాఁడుదాని యేడుపువిని జాలిపడి, ఆపన్నివారణముచేయువలెనని నా యాశ్రమమునుండి బయలు దేరివచ్చి, నిండుగర్భ

ణితోనుండి దేహము తెలియక యేమేమో పలవరించుచున్న లీలావతిని ఇంద్రుని రథముమీఁదఁ జూచితిని.

హిర—ఆహా! ప్రాణనాయకీ! నీహృదయమప్పుడెంత సంక్షోభపడియుండెనో! ఆదుండగీని దుండగములు విన్న నాశరీరము మండుచున్నది. నారదా! కానిమ్ము.

నార—"ఓయియింద్రా! పతివ్రతాశిరోమణియైన పరస్త్రీని తెచ్చుట ధర్మముకాదు. ఒక్క వీరపతివ్రతయొక్క కన్నులనుండి జారిన నీటిబొట్లన్నియు అన్ని అగ్నికణములయి నీకులమునుదహింపవా? నా బుద్ధివిని యీరాక్షసరాజు భార్యను విడువుము" అని నేను బుద్ధి చెప్పితిని. అందుకతఁడు శత్రుశేషముండఁగూడదు గనుక, హిరణ్యకశిపుని కడుపున పుట్టినవాఁడు వానికంటెను మహోగ్రసత్త్వుఁడు కావచ్చునని యెంచి పుట్టినతరువాత శిశువునుమాత్రము చంపి వదలిపెట్టవలెనని యీమెను తెచ్చితినేకాని నేను మఱియొక ద్రోహము తలఁచుకొనలేదని ప్రత్యుత్తరమిచ్చెను.

హిర—ఓరా! ఆక్రూరుఁడు కడుపులోనున్న నిర్దోషియైన యీశిశువునుచంపి నన్ను పుత్రశోకమునకూడ ముంచదలచుకొన్నాఁడుగా? ఆపాపఫలమతడు త్వరలోనే యనుభవింపఁగలఁడు. నారదా! అందుమీఁద నీవేమన్నావు?

నార—'ఓయింద్రా! నీవు రాక్షససామ్రాజ్ఞమునిరాణిని తెచ్చి లోపవుపనిచేసితివి. ఆరాక్షసేంద్రుఁడు సామాన్యుడనుకొన్నావా? రేపే తపఃప్రభావముచేత దుర్లభవరములు పొందివచ్చి త్రిజగత్సంహారము చేయఁడా? ఎంతపనిచేసితివి! ఆడుదానిని తెచ్చుట మహాపరితాపమని యెంచితివా? తండ్రిబలవంతుడయినను కొడుకుబలహీనుడు కావచ్చును; జనకుఁడు గుణహీనుఁడయినను పుత్రుఁడు గుణవంతుఁడు గావచ్చును.

తండ్రిచేసినదోషమునకయి పుత్రకుని దండించుట క్రూరకర్మము గాని రాజధర్మము కాదు. చంపుటకయి గర్భములోనున్న నోరులేనిశిశువు నీకేమిఅపకారముచేసినాడు? ఈపాపకర్మమునకొడిగట్టిలోకనిందపాలు కాకుము" అని నయమున భయమున బోధించి యొప్పించి నీవిభుఁడు వచ్చినదాఁక నాయొండను తలదాచుకొమ్మని యీమానవతిని మా ఆశ్రమమునకు వెంటబెట్టుకొనిపోయి భద్రముగా సంరక్షించితిని. ఆ మహేంద్రుఁడు లీలావతిని నాకప్పగించు నప్పుడు "మీయాజ్ఞనుల్లఘింప రాదనియీపుఁడతినివిడుచుచున్నానే గాని రాక్షసాధీశ్వరుని దోర్దర్పము నకు వెరచి కాదుసుఁడీ! నాచేత వజ్రాయుధముండఁగా లక్ష రాక్షసాధ్యక్షులు వచ్చినను నేను భయపడను" అని చెప్పి మఱి విడచినాఁడు.

హిర — ఆహా! ఏమియాతనిగర్వము! నేను స్వర్గమునుజొచ్చి నప్పుడీమాటలు మఱచిపోక జ్ఞాపకముంచుకొమ్మనుము. నీవుచేసిన పని మంచిదేకాని లీలావతీదేవిని వెంటనే తీసుకొనివచ్చి మాశంబరాదులకు ఏలయొప్పగించినావు కావు?

నార — ఈయుబలక్షేమముకోరియే మీరువచ్చినదాఁక ఇందు తీసుకొనిరాక మాఆశ్రమముననే యీపావనిని పుత్రసహితముగానుంచి కాపాడినాను. నేనట్లు చేయకుండినయెడల నీశత్రువులు నీవులేని సమయముల పలుమారు దండెత్తి వచ్చి అలజడిపెట్టుచు వచ్చినచో ఉపద్రవ మధికముగా నుండునుకదా!

హిర — ఔరౌరా! ఇంద్రుడెంత ద్రోహము చేసినాఁడు! నా సవతితల్లిపుత్రుఁడయినందున కీలాగునఁ జేయవలసినదే. ఏమి యీఅన్నదమ్ముల శత్రుత్వము! ఎవ్వరిని నమ్మినను నమ్మవచ్చును గాని జ్ఞాతిని మాత్ర మెన్నఁడును నమ్మరాదు. కాని యెడల 'జ్ఞాతిశ్ఛేదనకిమ్మ' నెడిమాట యూరకేపుట్టినదా? జ్ఞాతియున్నయెడల, అగ్నిహోత్రము లేకయేదగ్ధముచేయును. కాబట్టినీదేవజాతి జ్ఞాతిపురుగునుపోరులేకుండ

రూపుమాపెదను. ఔనోయి విప్రజిత్తీ! నిన్నొకటి అడుగమరచి
పోయినాను. మదాంధుఁడయిన యింద్రుడు దండెత్తివచ్చినప్పుడు
దిక్పాలకులుకూడ వచ్చినారా?

విప్ర—కేవలము వచ్చుటమాత్రమే కాదు పరాభవ దుఃఖితు
లయియున్న మనశంబరాదులను ఎన్నెన్నో కారులుకూడ ప్రేలినారు.

హిర—ఏమేమి! మిడుతలు మహోగ్ర దవానలము మీఁద
పడి మూడ నెంచినవిగా? మనలను దిక్పాలకులు కాక మరియెవ్వరా
క్షేపింతురు? వారాడిన దుర్భాషలిప్పుడు మఱవకుందురుగాక! మన
మింద్రలోకమునకు పోవునపుడు త్రోవలో ముందుగా ఈదిక్పాల
కుల పొగరే అడఁతము.

విప్ర—వారికండకొవ్వడఁచవలెను. వారు మిక్కిలి మిడిసి
పడుచున్నారు.

హిర—ఓయీ నారదా! తండ్రులెప్పుడును కొమాళ్ళు బుద్ధి
మంతులు కావలెననియు, శౌర్యవంతులు కావలెననియు, దీర్ఘాయు
ష్మంతులు కావలయుననియు, కోరుచుందురు. ఈప్రహ్లాదుఁడు నీయొ
ద్దనున్నప్పుడు బుద్ధికలిగి యుండెనా? ఈతఁడు రాజనీతి నభ్యసించి,
అస్త్రవిద్యయందసమానుఁడయి. నిజప్రతాపముచేత తనతల్లిని పరా
భవపఱిచిన దేవేంద్రాదులను సంగరరంగమున భంగపఱచి యేలు
చుండగా కన్నులపండువుగాఁ జూచెడుభాగ్యము నాకెన్నఁడులభించునో!

నారద—నీకొమారుఁడు బహుబుద్ధిమంతుఁడు. ఆటలయందైనను
ఎన్నఁడును బొంకియుండఁడు; దీనులనుజూచినవారిని కావపరితపించు
చుండును; తోడిబాలురతన్ను నిష్కారణముగా నొప్పించినను వారికి
బుద్ధిచెప్పునే కాని వారిమీఁద కోపపడఁడు; తల్లిదండ్రులను గురువులను
దైవముగా భావించుకొనుచుండును. వేయిమాటలేమిటికి! సమస్త

సద్గుణములును సంక్షోభవించి వచ్చినీకొడుకును ఆశ్రయించినవని చెప్ప వచ్చును. నీకు పుత్రుఁడయినవాఁడు శౌర్యవంతుఁడగునాయని సందేహ పడవలెనా? సింహముకడుపున పిల్లిపిల్ల యెప్పుడును పుట్టదు. ఈతఁడు ప్రతాపమున నిన్నుమించినవాఁడే కాఁగలఁడు.

హిర—కొమాళ్ళట్లయినప్పుడేకదా తల్లిదండ్రులకు మనోరథ పరిపూర్తియగును. ఓపుత్రకా! నీవీయరివర్గము నెప్పుడు నిర్జించెదవు?

ప్రహ్లా—నేనీవఱకే జయించినాను.

హిర—వీఁడు శత్రువిజయమనఁగా నేమో తెలియని పసిబాలుఁడయ్యును, జయించినంతమాట చెప్పినాఁడు. వీఁడు నిశ్చయముగా శత్రువులను జయించినట్లే సంతోషించెదను. తండ్రీ! నీశత్రువిజయమునకు సేనలు కావలెనా?

ప్రహ్లా—నేను సేనలు లేకయే గెలువఁగలను.

విప్ర—ఆహా! ఏమి యీబాలుని అసహాయశూరత్వము! పువ్వుపుట్టగానే పరిమళించునుగదా!

హిర—పుత్రకా! దీర్ఘాయుష్మంతుఁడవుకమ్ము. నీవంతటివాఁడవు కావలయునని యే నాకోరిక. ఓవిప్రజత్రీ! దేవలోకముమీఁదికి దండెత్తుటకయి సైన్యములను సిద్ధపఱుపుము. మేము జననీజనకుల వద్దకుపోయి వారి యాశీర్వాదమును పొందివత్తుము. మనరాకవిని ఆనందించుచుండెడి నీయత్తగారికి కొడుకుకోడకూడ మ్రొక్కి దీవెనలందుకొనుగాని రమ్ము.

లీలా—ఓప్రాణనాథా! నేను యింతకుముందే దేవరవారిని ఈకోరిక కోరవలెనని అభిలషించితిని. మీరు మిత్రులతో సల్లాప సుఖము ననుభవింపుచుండగా నడుమ రసభంగము చేసినయెడల మీచిత్తము కేమితోచునోయని సంకోచించి ఊరకున్నదానను.

హిర—అట్లయిన అంతఃపురమునకు పోవుదములెమ్ము. విప్రచిత్తీ! ప్రభువులారు రేపే దేవతలను శిక్షించుటకయి దండయాత్ర వెడలుదురని సేనానాయకుల కాజ్ఞాపింపుము.

విప్ర—మహాప్రసాదము. మనరాక్షససేనలను దేవతలమీద దండెత్తనోచిన దినమేకదాపండువు? వారీమాటవిన్న అపరిమితోత్సాహులయి పెండ్లికిపోవునట్లు సంతోషింతురు.

హిర—నారదా! నీవు రేపుమావెంట వత్తువుగాని నేటికుండు నిలువుము.

(అని అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

ద్వితీయాంకము

౧ రంగము — స్వర్గము

[ఇంద్రుడును, వరుణుడును
తివారమును, అగ్నియు, [illegible]

ఇంద్రు—ఓయివరుణదేవుడా! మేము పిలుచుచున్నదని పిలువ పంపినను, దిక్పాలకులలో మీరిద్దఱు మాత్రమే వచ్చినారు. తక్కిన వారేమయినారు? వారికి నామాట యిందింత అలక్ష్యమేమి?

వరు—దేవా! వారు మీయాజ్ఞయందు అనాదరముచేత రాక పోయియుండరు. రాకపోవుటకు వారికేదో విపత్తుసంభవించియుండును. బ్రహ్మచేతవరముపొంది శౌర్యగర్వముచేత మూర్ఖుడయి హిరణ్యకశిపుడు దిక్పాలకులపట్టణములమీదికి దాడివెడలి వాడసవిన్నాను. ఆ దురాత్మునిచేతిక్రిందబడి వారెట్టి దుఃఖములననుభవించుచున్నారో!

వారందుచేతనే యేలినవారిదర్శనమునకు రాకపోయియుందురు. మా పట్టణమునూరాదికి ఆ దుష్టరాక్షసుఁడు దండెత్తి వచ్చుచున్నాఁడని చారులు వచ్చి చెప్పినను, సింహాసనమునిలువక భార్యాపుత్రులను మహాసముద్రములో విడిచి నేను తమసెలవయినదనిపరుగెత్తుకొనివచ్చినాను.

ఇంద్రు—నీస్వామిభక్తికి సంతోషించినాము. ఆఖలుఁడెంత దుర్ణయకార్యమును చెప్పితివాఁడు. ఇంతకు వచ్చినతరువాత వాఁడికి మన పట్టణములమీఁదికిని రాకమానఁడు. ఓయీ కుబేరా! బ్రహ్మదేవుఁడు వానికి దేవతలకు దుర్జయుఁడగునట్లుకూడ వరము నిచ్చినాడుగా?

కుబే—మనస్సాక్షియైనవాని తపోవహ్నికి భయపడినవాఁడు కోరినవరమునిచ్చి మరల బ్రతికింపుమని మన మేపోయి బ్రహ్మదేవుని ప్రార్థించినప్పుడు, అతఁడిచ్చియుండునా? ఆవరప్రభావము చేతనే మహాసాహసముతో ప్రళయకాలరుద్రునివలె తేజీవాఁడరాక లోకపాలకుల పట్టణములమీఁదికి దండువెడలినాఁడు. వాఁడు నిర్ఋతినిజయించి, అలకాపురమునూరాదికి వచ్చుచున్నాఁడని దూతలు వచ్చి చెప్పఁగానే ఆలుబిడ్డలను నామిత్రుఁడయిన శివునివద్దదాఁచి దేవరవారియొద్దకు పరుగుపరుగున వచ్చినాను. నానవనిధులును ఈపాటికి రాక్షసాధీశ్వరునిపురము చేరియుండును. అర్థములేనివాని బ్రతుకువ్యర్థముకదా? అదిగో యముఁడు వచ్చుచున్నాఁడు. అతఁడు మన కేమయిన విశేషవార్తలు తెచ్చియుండును.

[యముఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఇంద్రు—ఓ యమధర్మరాజా!

యము—ఓ మహేంద్రా! ఇఁక నన్నా పేరుతో పిలువకుము. ఇప్పుడు యమునిపాలిటికిని పెద్దయముఁడొకఁడు బయలుదేఱినాఁడు,

ఇంద్రు—ఏమి! నీవంతనిసుకుదలతో మాటాడుచున్నావు? నీవుక్షేమముగా నున్నావా?

యము—పిడిగుద్దులతో దేహమంతయు బలిసి, పిసెగుద్దుల ప్రభావముచేత ఒక్కొక్క అవయవము రెండేసిలయి, ఈప్రకారముగా మోచేతికి దెబ్బతగిలినవానివలె సుఖమనుభవించుచున్నాను. నేనీవర కెప్పుడును పరులను శిక్షించుచుందునేగాని పరులచేత శిక్షపొంది యెఱుంగను. ఏకాలమున కెవ్వరి కేగతిబట్టునో యెవ్వఁడెఱుఁగును? ఆదుష్టరాక్షసుఁడు పొడిచిన మోకాటిపోట్లచేత శరీరమంతయు తేలు కుట్టినట్లు నొచ్చుచున్నది: నన్నుపయోగామధేయునిగానైనను చేయక బ్రహ్మదేవుఁడు నిర్దయుఁడై దక్షిణదిక్కునకేల ప్రభువునుగాఁ జేసెను?

ఇంద్రు—ఆహిరణ్యకశిపుడు మీలోకమునకు దండెత్తినాడా!

యము—శ్రీహరీ! (అని చెవులు మూసికొని) నేను వినలేను. ఆ పాపాత్ముని పేరు నాయెందరతలపెట్టఁబోకుడు. ఆపేరు విన్నమాత్రము చేత నా దేహమిప్పుడు తురలకంపమెత్తుచున్నది. (అనివడకుచున్నాడు)

ఇంద్రు—ఓయమధర్మరాజా! భయపడఁబోకు భయపడఁ బోకు. ఆ పేరుమరచిపో.

యము—నిన్న నప్పాతకుఁడు పెట్టినబాధ తలఁచుకొనఁగా, వేయిజన్మములెత్తినను వానిపేరికఁ నాకు మఱవునకు వచ్చునట్లుకనఁ బడదు. నిన్నటినుండి యేపని చేయఁబోయినను నాకువాఁడేతలఁపునకు వచ్చుచున్నాఁడు. భోజనమువద్ద కూరుచుండునప్పటికి వానిరూపము ఎదుటకనఁబడిముద్దలోపలికిపోయినదికాదు. పరుండవలెనని మంచము చేరి కన్నులు మూసికొనునప్పటికి దయ్యమువలె వాఁడువచ్చి చెంత నిలువబడినట్లాయె లేచియుంచమునుదిగివచ్చి తెల్లవాఱినదాఁక నిద్రపట్టక పడవలో జాగరమునుచేసినాను. దేవరవారివద్దకువచ్చితిమి: ఖముతీర్చుకో

వలెనని బయలు దేఱఁగా త్రోవపొడుగునను వాఁడు నన్ను వెంబడించి తఱుముకొని వచ్చుచున్నట్లేతోఁచి, చీమచిటుక్కుమన్న అదరిపడుచు వచ్చితిని. మూలిగెడు నక్కమీఁద తాటిపండుపడ్డట్లు నగము దూరము రాగానే, ఒకతాటితోటలో వానిసేనలే నాకు ప్రత్యక్షమై మీఁది ప్రాణములు మీఁదికిపోయి నడవ కాళ్ళురాక భయజ్వరము తగిలి తమ దర్శనము చేసికోవలెననెడి యుత్సాహముచేత ఎట్లో శరీరమిక్కడికి చేరవేసినాను.

ఇంద్రు:—అయ్యో! వాఁడు మనపట్టణముమీఁదికి వచ్చుచుండ లేదుగదా? ఇఁక స్వర్గమున కేమిపాట్లు సంభవించునో! ఓయీ! అంతకా! వాఁడును వాని సేనలును నీపట్టణములో ప్రవేశించి యేమి చేసినారు?

యము:—చేయవలసినదెల్లను చేసినారు. పట్టణము ఏనుఁగు తిన్న వెలగపండువలె నయినది. ముందుగా విప్రజిత్తివచ్చి లెక్కలు వ్రాయుచున్న చిత్రగుప్తునిచూచి, ఏమివ్రాయుచున్నారో చూపుఁడని వారిచేతిలోని లెక్కలను బలవంతముగా ఊడఁదీసికొని తాటాకులు తిరుగవేసి, లెక్కలలో నాకు పాపమెందుకు వ్రాసినారని వారికంటిమీఁద ఒక్కగుద్దు గుద్దినాఁడు. ఆగుద్దుతో చావుతప్పి కన్ను లొట్టపోయి చిత్రగుప్తులావలికి పోయినారు. ఆక్రూరాత్ముఁడు మరల వారిని రాక్షసకింకరులచేత ఈడిపించి తెప్పించి వారు వ్రాసిన లెక్కలు వుట్టున చింపివేసి, రాక్షసులందఱును పుణ్యాత్ములయినట్టు క్రొత్తలెక్కలు వ్రాయునట్లు నియమించి, రాక్షసుని కెవ్వఁడైనను పాపము వేసినపక్షమున మీఁదొక్క బద్దలుచేసెదనని చెప్పి, వాఁడు ముందుకు సాగి పోయినాఁడు.

ఇంద్రు:—చిత్రగుప్తుడు ఆలాగే వ్రాసినారా?

యము:—వచ్చినట్లు వ్రాసినారు. వ్రాయకపోయినపక్షమున వారి దేహములో నున్నమాన కేమికలుగునా? ఒక్క అక్షరము హెచ్చుతగ్గు వ్రాసినయెడల రాక్షసకింకరులు వారిని దంచి పిండి పెట్టుదురు.

ఇంద్రు:—తరువాత నేమిజరిగినది?

యమ:—తరువాత శంబరుఁడువచ్చి వారిలెక్కలు పరీక్ష పట్టినాఁడు కాని, అతఁడు కొంచెము మంచివాఁడు గనుక, దేవతలకు పుణ్యమెందుకు వేసినారని కోపపడి తీసివేయించి, ముందుకు నడిపెను. అతని వెనుక రాక్షసు లొక్కరొక్కరే వచ్చి, నాకెంత పుణ్యము వేసినావు నాకెంతపుణ్యము వేసినావు చెప్పుమని యడుగుచు పదిమందిచేరి నాకు ముందుచెప్పు నాకు ముందుచెప్పుమని తొందర పెట్టుచు ఇంత యాలస్యమేమని యొకఁడును, నేనుండఁగా వానికేల ముందుచెప్పినావని యొకఁడును, నన్నుచూచి లేచినావు కాదేమని యొకఁడును, నాకుమర్యాద చేయు నే లేదని యొకఁడును, చిత్రగుప్తులను తలయొక చెంపకాయకొట్ట మొదలుపెట్టిరి. రెండుగడియలసేపు వారిదౌడలు రణభేరులవలె మోగి, బూరెలలాగ పొంగి, భయము చేత తొలగిపోయి సఖ్యము చేసికోవలెనని కాఁబోలును తమ స్థానము బాసి రెండుదౌడల పండ్లను ఒక్కచోట నోటిలో గుంపుగా చేరినవి.

ఇంద్రు:—అయ్యో! పాపము! చిత్రగుప్తుల కెంతటివిపత్తు సంభవించినది!

యము:—ఒక్క చిత్రగుప్తులకే కాదు. రాక్షసాధీశ్వరుఁడుసభలో కూరుచున్న తరువాత మాపురములోనివారి కందరికిని బోసి నోళ్ళైఅయిపోయినవి. ఎవ్వరైనఁ గొంద అదృష్టవంతులైన పక్షమున

వారు యేకదంతులయినారు. రాక్షసభటులుకొట్టినదిప్పనకాయలవలన మాభటులకొకరికిని తలమీఁద వెండ్రుకలు లేవు. మీరొకవింతవిన్నారు కారుగదా? నేనుత్రోవలో వచ్చునప్పుడు బట్టతలవాఁడుకనఁబడినను బోసినోటివాఁడెదురుపడినను మావారేమో అని నేను పరామర్శ చేయబోవుచువచ్చినాను. చూడు నాతలమీఁదకూడ వెండ్రుకలు లేవు. (అని కిరీటము తీసి తలతడవుకొని) నాతలమీఁద వెండ్రుకలు కనబడు చున్నవి. నేను నేనుగానేమో!

ఇంద్రు—(నవ్వి) ఏమోయి యమధర్మరాజా! నిన్ను నీవే యెఱుఁగనట్టు మాటాడుచున్నావు. అదుష్టునిభయముచేత మనసు చెదిరినది కాఁబోలును.

యము—కొండితల కానపోవుటచేత నిజముగా నేనుయముం డను కానేమో అని సందేహము కొనుచున్నది. నేనేయముడనయిన పక్షమున, నెత్తిమీద అన్ని దెబ్బలు తగిలిన తరువాత ఇంకను కొంబ్రులుండును గా? మీరే ధర్మసందేహము తీర్చవలెను.

ఇంద్రు—సందేహముమాట తరువాత చూచుకొందముగాని, తరువాత జరిగిన సంగతి చెప్పుము?

యము—తరువాత సంగతియేమున్నది? ఉక్కుతునియలువంటి రాక్షసులు పలువురువచ్చి సింహాసనములమీఁద కూరుచుండియున్న మునులను పితృదేవతలను చేయిపట్టుకొని యీడిచివైచి తామాసింహా సనములమీఁద కూరుచున్నారు. అప్పుడు బ్రతికిపోయితిమిగదా అని తలలు తడవుకొనుచు నిలుచున్న పితృదేవతలను చూచి మఱికొందఱు రాక్షసులు, "వీరినివిడువకూడదు. రౌరవాదినరకములలో పడ వేయ వలె" నని పడగెంటుచు రాక్షసరాజు వెంటపెట్టుకొనిపోయిరి. ఒక్క నిమిషములో రౌరవాదినరకములలో ఉన్న రాక్షసులకందఱకును

విడుదల ఆరంభమాయె, వారిస్థానమువపిత్రు దేవతలకునరకలోకనివాస ప్రాప్తికలిగినది. అటుతరువాత రాక్షసులను నరకలోకములో వేసిన నేరమునిమిత్తము మాకుశిక్షలారంభమయినవి. అటుతరువాత మా దేహములమీఁద పుట్టిన పిడుగుల చప్పుళ్ళ మీకు స్వర్గములో విన బడియేయుండును. పితృలోకరాజ్యసుఖమికచాలును. ఇఁక నాయెత్తు ధనము గ్రుమ్మరించినను నేను పితృలోక పరిపాలనమునకు ఒప్పు కోను. ఇది నిశ్చయము.

ఇంద్రు—మనదూతలెవరో వచ్చుచున్నట్లున్నారు. చూడు ఆవచ్చువాఁడు చిత్రరథుఁడులాగున నున్నాఁడు.

[చిత్రరథుఁడు ప్రవేశించుచున్నాడు]

చిత్ర—ఓత్రిలోకాధీశ్వరా! నమస్కారము. మనపురమునకు యోజనదూరములో హిరణ్యకశిపుఁడు సేనలతో నిలిచియున్నాఁడు. వెనుకపడినవారువచ్చి కలిసికొన్న తరువాతవచ్చిఅమరావతీనగరము నకు ముట్టవేయునట్లు తోఁచుచున్నది.

యము—రోఁకటిపోటుపడ్డట్లు, నానెత్తిని దెబ్బలమీఁదనేదెబ్బలు వ్రాసి పెట్టినట్లున్నవి. ఈసారి మంగలివా డక్కరలేకయే నాతల నున్నపడును. నాకు స్వర్గమునకు వచ్చినను గ్రహచారము తప్పినదికాదు. ఏమిచేయుదును?

కుబే—చుట్టమయి చూడవచ్చిన దయ్యమయిపట్టుకొన్నట్లు, మహేంద్రునిచూడవచ్చిన నన్ను రాక్షసులు పట్టుకొని మర్దింతు రేమో! ఏమిదిక్కు?

వరు—ఊరువిడచి పొరుగూరికి వచ్చినను పూనినకర్మము మానదన్నట్లు నాకేమిపాట్లు రానున్నవో!

ఇంద్రు—ఓదిక్పాలకులారా! మీరేమియు జడియవలసిన పని లేదు. ఆపదవచ్చినప్పుడు బుద్ధిమంతులైనవారు దానిని తప్పించుకొను ఉపాయ మాలోచించవలెను గాని ఒకరిమొగము లొకరుచూచు కొనుచు తెల్లపోయి యుండరాదు. మీరందఱు బహుబుద్ధిమంతులు. మీమనస్సులు చెదరనియ్యక కొంచెముసేపాలోచించి మన మిప్పుడేమి చెయ్యవలెనో చెప్పుఁడు.

యము—నాపట్టణము మాత్రమే కాక నామనస్సు కూడ ఏనుఁగు త్రొక్కిన తామర కొలనువలె పాడయియున్నది. నాకిప్పుడేమియు ఆలోచన తోఁచదు. తక్కినవారి నడుగుఁడు.

వరు—ఇక్కడనున్నవారిలో బుద్ధివైభవముచేత బృహస్పతిని మించినవారెవరును లేరు. అతని ఆలోచనవిని ఆయన మాటప్రకారము మన మందరమును నడుచుకొందము.

కుబే—ఔను. ఈమాట యుక్తముగానున్నది.

ఇంద్రు—ఓబృహస్పతీ! మీబుద్ధిబలముచేతనే యింతకాలమును మేమేయాపదలను పొందక సుఖముగానున్నాము. మనపట్టణముమీఁద ఘోరరాక్షసుఁడు దండెత్తివచ్చుచున్నాఁడు. ముందు చేయవలసినపని యేమో సెలవిండు. ఇఁక మాటలకవకాశము లేదు.

బృహ—నాబుద్ధికిచూడఁగా వానితోయుద్ధముచేయుట కార్యముగా కనఁబడదు. ఆరాక్షసేశ్వరుఁడు బ్రహ్మదేవునిచేత దుర్లభములయిన వరములనుపొంది పరులకజేయుఁడయి యున్నాఁడుగనుక మనమవశ్యముగా యుద్ధమున పరాజయము నొందుదుము. ఓడిపోయిన తరువాత హానిచేపొందెడు పరాభవమును అవమానమును పదిరెట్లు హెచ్చుగానుండును. నేనుచెప్పవలసిన ముఖ్యాంశము చెప్పితిని. పిమ్మట మీయిష్టమువచ్చినట్లు చేయుఁడు.

ఇంద్రు—మనము పరాజితుల మగుదుమని నిశ్చయముగా తెలిసినప్పుడు యుద్ధమునకు పోవుటకంటె బుద్ధితక్కువ మరియొకటి లేదు. నాకుచూడఁగా మనమిప్పుడా రాక్షసుని మంచిమాటలతో సమాధానపరిచి సంధిచేసికొనుటయే ముఖ్యకార్యముగా తోఁచు చున్నది. అయినను మనవారిలో ఈపని నిర్వహింపగలవారు మీ రొక్కరుతప్ప నాదృష్టికి అన్యులెవ్వరును కనఁబడకున్నారు. కాఁబట్టి మీరు శిష్యవాత్సల్యముంచి మనజయంతునికూడ మీవెంటఁబెట్టు కొని రాక్షసరాజున కెదురుగాపోయి, కానుకలు సమర్పించి మా టాడవలసిన రీతిగామాటాడి; అతని నాగ్రహముడిపి, స్వర్గము లోనికి తీసికొనివచ్చి కడిదలుకుదిర్చి అంతఃపురి నెలకొల్పుడు. అట్లైనచో వాత అప్పటికిపోలినట్లు చూచుకొందము.

బృహ—దేవకార్యము నిమిత్తమయి స్వర్గమంత్రిములో ఉఱుకుమన్నను ఉఱికెదను. కాఁబట్టి నేనవశ్యముగా పోయి నాచేత నయినట్లెల్లను ప్రయత్నముచేసి రాక్షసాధీశ్వరుని ప్రశాంతుని చేసె దను. అటుపయిని వానిచిత్తము మీభాగ్యము. మనవారికిఁ దక్కడ ఇచ్చకములాడుచు, ఆరాక్షస రాజువద్దచనవుగా తిరుగు చున్నాడు గనుక, అతడు మనకు కొంతసహాయము చేయవచ్చును. అయినను నీనిమిత్తమయి నాకు పరితాపము కలుగుచున్నది. నీకిఁక సేవకవృత్తియేకాని దొరతనము కొంచెమైనను సాగదు. వజ్రాయుధ మును పట్టెడు చేతులతో కాళ్ళుపట్టవలయును; హంసతూలికాతల్ప ములఁ మీఁద మోపెడుపాదములతో పల్లకులవెంట పరుగులెత్తవల యును; కొట్టు తిట్టుమను మాటలు మఱచిపోయి 'అయ్యా' 'చిత్తము' అనుమాటలు నేర్చుకొనవలయును. హా! ఇంద్రభోగమనుభవించెడు మహాభోగివి నీవు సేవకవృత్తి కెట్లుసహింపగలుగుదువు? హా! విధీ! ఎంతచేసితివి!

ఇంద్రు—మీరు నా నిమిత్తమయి విచారింపఁబోకుఁడు. ఏ యెండకాఁ గొడుగు పట్టవలెను. ఎప్పటికిని కాలమొక్క రీతిగా నుండదు. అత్తకాలము కొన్నాళ్ళును కోడలికాలము కొన్నాళ్ళును వచ్చును. ఇంతవఱకును మనకు సుఖకాలము; ఇఁకను కష్టకాలము వచ్చుచున్నది. అనుభవించి తీఱవలెను. మీరు వేగిరము విజయంచేసి కార్యసాఫల్యము చేసికొనిరండు.

బృహ—జయముగా మనము వెళ్లుదము రమ్ము.

(అని యుద్ధమును పోవుచున్నారు)

ఇంద్రు—ఓ మునీశ్వరులారా! ఇంకొక నిమిషములో రాక్షసరాజిక్కడకు వచ్చును. అప్పుడు మీరీ వేషములతో నున్నపక్షమున వాఁడు చంపును. మీరు భుజములయందలి శంఖచక్రములను శ్రీగంధము చిక్కఁగా పూచి మాఁపుకొనుఁడు; ముఖములయందు నామములను దీసివేసి విభూతిపట్టెలు పెట్టుఁడు; తులసిపూసల తావళములు దాఁచి రుద్రాక్షమాలలు ధరింపుఁడు.

జమ—ఓ మహేంద్రా! మాకు శివకేశవులిద్దఱును సమానులే. నేము నే చిహ్నములు ధరించిన ధరింతుము. ఏ దేవుని గొలిచినను గొలుతుము. లోకములో మూఢభక్తిగలవారు కొందఱు తమకీసమభావము లేక విష్ణుభక్తులను చూచిన శివభక్తులును, శివభక్తులను చూచిన విష్ణుభక్తులును, ద్వేషించుచు, మానుషస్వభావమును మఱచి, తామే యధికులము తామే యధికులమని తగవులాడుచు, నిజమయిన భక్తియు సత్యమును దయాళుత్వమును లేక, బాహ్యచిహ్నములను మాత్రము ధరించి వానినిమిత్తమయి పోరాడుచు, తాముకొలిచిన చిల్లర దేవతను కొలువనంతమాత్రముచేత శమ దమ దయా సత్యశౌచాది సమస్తసద్గుణ సంపూర్ణులయిన పుణ్యశీలురనైనను

పరమ శత్రువులనుగా భావించి ప్రేమానుబంధమును కోసివేసి బహువిధముల బాధలుపెట్టుచు రాక్షసకృత్యములు చేయుచుందురు. మేము మోక్షగాములమగుటచేత లోకమునిమిత్తము మేమే దేవతలను కొలిచినను, పరమార్థమునిమిత్తము సకలాంతర్యామి అయిన పరమాత్మునిని ఒక్కనినే హృదయములయందు నమ్మియుందుము.

ఇంద్రుఁడు—మునీంద్రా! ఈరాక్షసులు మీరు చెప్పిన మూఢాత్ములలోనివారు. వీరు శివభక్తులయి విష్ణువును నిష్కారణముగా ద్వేషించుచు, దురభిమానము కలవారయి శివభక్తులు కానివారినందఱిని దయాదాక్షిణ్యములు లేక సకలహింసలను పెట్టుచుందురు. వీరిలో నొకఁడు విష్ణునామము చెవిసోఁకునని చెవులకు ఘంటలు కట్టుకొని తిరుగుచున్నాఁడు; మఱియొకఁడు విష్ణుభక్తుఁడగపడునేమోయని కన్నులకు గంతలుకట్టుకొన్నాఁడు. వీరెంత యజ్ఞానులో చూచినారా?

జమ—వీరొక్కరే కారు. ఇటువంటి యజ్ఞానులు సమస్తమతములలోను ఉందురు. ఆలోచనలేక వంశక్రమాగతమైన మతమునందును ఆచారములయందును దురభిమానము కలిగి, సత్యము నెఱుఁగకొల్లకుండుట జనసామాన్య స్వభావము. ఎక్కడనో ప్రాజ్ఞులు కొందరుమాత్రము ఏమతమువారిని ద్వేషింపక సత్యమెక్కడనున్నను గ్రహింపుచు, సదాచారముల నవలంబించుచు, సత్యము శాంతము భూతదయ మొదలగు సమస్తసద్గుణములును కలవారయి, తమ్ము ద్వేషించువారినికూడ ప్రేమించుచు, అజాతశత్రువులయి లోకోపకారమే పరమవ్రతముగా పూనియుందురు. అట్టిమహానుభావులు మాత్రమే పరమేశ్వరునియొక్క సంపూర్ణానుగ్రహమునకు పాత్రులయి, శాశ్వతసుఖ మనుభవింతురు.

ఇంద్రు—మునీంద్రా! తాళుము. ఏదో కోలాహలము వినబడు చున్నది. రాక్షసరాజు వచ్చుచున్నట్లున్నాఁడు. మీరందఱును సింహాసనములుదిగి తగిన సత్కారము చేయవలెను.

(అప్పుడు హిరణ్యకశిపుఁడు, విప్రచిత్తి, శంబరుఁడు మొదలయిన రాక్షసులను తంబుగ కట్టుకొని నారదుఁడును, వారివెనుక బృహస్పతియు ప్రవేశించుచున్నారు.)

హిర—(కోపముతో సభకలయఁజూచి) ఆదురాత్ముఁడయిన యింద్రపశు వెక్కడ నున్నాడురా?

ఇంద్రు—(వల్లెవాటుగానున్న ఉత్తరీయము నడుమునకు చుట్టుకొని) స్వామీ! ఇదిగో మీదాసుఁడు వచ్చుచున్నాఁడు. నేను మీవాఁడను. నాకభయమిచ్చి రక్షింపుఁడు. (అని పాదములమీఁద పడుచున్నాఁడు.)

హిర—(తల యెడమకాలితో త్రోసివైచి) ఓరీకుత్సితా! నీవందిన సిగయు అందకున్న కాళ్ళును పట్టుకొనియెదవు. నీవెంత వేఁడినను మాకు నీమీద దయరాదు. ఓరిదురాత్మా! అవివేకీ! నాఁడు నారదునితో "నాచేతవజ్రాయుధముండఁగా లక్ష రాక్షసాధ్యక్షులు వచ్చినను నేను భయపడను" అన్న కండక్రొవ్వు నేఁడయిన అడఁగినదా? లెమ్ము. పాదములమీఁదనుండి లెమ్ము. నీవు నాపాదములు ముట్టఁతగవు.

ఇంద్రు—(లేచి చేతులు జోడించుకొని) దేవర వారిప్పుడు సెలవిచ్చినట్లు నాయందవగుణము లెన్నియైననుఉన్నవి. నేను కుత్సితుఁడను. దురాత్ముడను. నేనవివేకినగుదును. నేరిచియో నేరకయో నేనుచేసిన నేరములుక్షమించి, కూరుచుకొనిరాక మీ రేకోపపడినపక్షమున నాకిఁక దిక్కెవ్వరు? మన మొక్కతండ్రిబిడ్డలము. అన్నదమ్ములము. మనలోమనమే యింత దుర్మాత్సరముపూని తగవులాడుచున్న యెడలపరులుమనలను వేలెత్తిచూపరా? మనకదిచిన్నతనము కాదా?

హిర—ఓరీ! నీవిప్పుడు చెప్పిన బంధుత్వమంతయు లీలావతీ దేవిని చేయిపట్టియీడ్చి యింద్రలోకమునకు తీసికొనివచ్చినప్పుడేమై పోయినదిరా? ఈవెఱ్ఱిమునులు నిన్నొకపెద్దనుచేసి పొగడుటచేత నీవు విఱ్ఱవీఁగి విశ్వము తెలియలేక కండక్రొవ్వెక్కియున్నావు. అట్టి వ్వెల్లను నేఁడు ద్రొక్కించెదను? చూడు.

ఇంద్రు—స్వామీ! నిగ్రహములేమి? ఈయొక్క తప్పును సైపుము. ఇఁకమీఁదట నేనేమయిన చేసిన నీయిచ్చవచ్చినట్లు నన్ను శిక్షింపుము. నేనట్టియపరాధినైనను దాసుఁడనని మీపాదములు చేఁతిని గనుక దయతో రక్షింపదగును. అవల మీచిత్తము.

హిర—ఓరీ! వివేకహీనా! నీదయకుకోరిన బృహస్పతి మొదలయినవారు నీతప్పును సైరింపవలయునుగాని సైరించినదాఁక మాకేమిరా? నీయిచ్చకములుమాని రాజ్యమువిడిచి యెందయిన పొమ్ము.

ఇంద్రు—శరణన్నరక్షించుటవీరధర్మము. మీరుమహావీరులు, నేను మీదాసుఁడను; శరణార్థిని. నామీఁదకోపముంచక రక్షింపుఁడు రక్షింపుఁడు. దేవరాజ్యమువిడిచి తొలఁగుమని సెలవిచ్చుటకీరాజ్యమెవరిది? నేనెవఁడను? మేమందఱము మీవారముకామా? కావలసినపక్షమున, ఈదేవరరాజ్యమునుకూడ దేవరవారేపుచ్చుకొని నేఁటి నుండి మీపాద సేవకుని నన్ను భార్యాపుత్రసహితముగా పోషింపుడు. ఇంతటినుండిదైత్యులను దేవతలనుకూడమీరేయేలుచు, మీసేవకుఁడ నయిన నాకు మీచిత్తమువచ్చిన పనియేదో నియోగింపుఁడు. ఈ దిక్పాలకుల కందఱికిని కూడ మనసువచ్చినపని పెట్టుఁడు.

హిర—(ఇంద్రుని పీఠముమీఁద కూరుచుండి) ఓరియింద్రా! మీరందఱును నాచేతిలోనివారే. రేపీమంత్రులతో నాలోచించి పిమ్మట మీవిషయమయి మాయిచ్చవచ్చినట్లు చేసెదము. నీవిప్పటికి దెబ్బలులేక బ్రతికిపోయినావు. మాయెదుటదూరముగానిలువబడుము.

విప్ర—ఓరీ! దుర్ముఖా! ఊరక చూచుచు నిలుచున్నా వేమిరా? ఈదిక్పాలకులను మునులను ఆవలకీడ్చి మనవారికి పీఠములను చోటుచేయుము.

దుర్ము—చిత్తము. (అని దిక్పాలకులను మునులను పడ గెంటుచున్నాఁడు.)

మునులు—ఇదిగో పీఠములను మీకుసమర్పించి మేమే తొలఁగుచున్నాము. మమ్ము బాధింపకుఁడు నమస్కారము. (అని తొలఁగి అక్కడక్కడ నొదుగుచున్నారు.)

దిక్పా—మమ్ముకొట్టకుఁడు. మేమిదె పీఠములను విడిచి వచ్చుచున్నాము. (అని వడఁకుచు దిగివచ్చి క్రిందనిలుచున్నారు.)

[విప్రజిత్తి, శంబరుడు—పీఠములమీఁద కూర్చుచున్నారు]

విప్ర—ఓరీ దుర్ముఖా! ఈదిక్పాలకులందరును మనకడ్డముగా నిలుచున్నారు. వీరిని ప్రక్కలకు తొలఁగించుము. ఓరీ! అలంబసా! ఆ మునులను చేతులు జోడించుకొని నిలువఁబడుమనుము.

దుర్ము—తొలఁగుండి. (అని త్రోయుచున్నాఁడు.)

అలం—చేతులు జోడించుఁడు. (అని చేయిపట్టుకొని విఱుచుచున్నాఁడు.)

హిర—ఓరీ! ఇంద్రా! ఆమూట మోచుకొని వచ్చువాఁ డెవఁడురా?

ఇంద్రు—స్వామీ! అతఁడగ్నిహోత్రుఁడు. భూలోకమునందు బ్రాహ్మణులు యజ్ఞములుచేసినందున దేవతలనిమిత్తమై హవిర్భాగములను తెచ్చుచున్నాఁడు.

(అప్పుడొకమూటపట్టుకొని, అగ్నిహోత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

హవిర్భాగములు దేవతలకేమి? ఆ హవిర్భాగములు మాకిటు తెమ్మను.

ఇంద్రు—అగ్నిహోత్రా! నీ వా హవిర్భాగములను తీసికొని పోయి హిరణ్యకశిప మహారాజుగారికి సమర్పింపుము.

అగ్ని—చిత్తము. (అనితీసికొనిపోయిసమర్పించుచున్నాఁడు.)

హిర—(మూటవిప్పి కొంచెము నోట్లోవేసికొని)-ఛీ! ఛీ! ఈ హవిర్భాగములు చప్పగా ఏడిచినట్టేయున్నవి. (అని మూట పార వేసి, అగ్నిహోత్రుని మొగముమీఁద నుమియబోవుచున్నాఁడు.)

అగ్ని—(మొగమునకు చేయడ్డము పెట్టుకొని) స్వామీ! కృతార్థుడనయినాను.

హిర—ఓరీ! అగ్నిహోత్రా! భూలోకమునందు యజ్ఞములలో సంకల్పమేమని చెప్పుచున్నారురా?

అగ్ని—శ్రీపరమేశ్వర ప్రీత్యర్థమని చెప్పుచున్నారు మహాప్రభూ!

హిర—అట్లు కాదు. ఇఁకముందు శ్రీహిరణ్యకశిప ప్రీత్యర్థమని సంకల్పము చెప్పించుము. అట్లు చేయకపోయినయెడల నీనిపుచర్మమొలిపించెదనుసుమా, జాగ్రత్త.

అగ్ని—చిత్తము, చిత్తము.

హిర—మేము దిక్పాలకులకందరికిని పనులు చెప్పుచున్నాము. ఓరీఅగ్నిహోత్రా! నీవుమాకు వంటలవాడవుగానుండుము. ఇప్పుడే నీవుపోయి మేము వచ్చులోపలస్నానమునకు నీళ్ళు కాచుము పో.

అగ్ని—మహాప్రసాదము. (అనిపోవుచున్నాఁడు.)

హిర—ఓరీ! వరుణా! నీవుమాకు నీళ్ళుకావళ్ళు మోచువాడవుకమ్ము. నీవిప్పుడే అగ్నిహోత్రుని వెంటపోయి స్నానమునకు నీళ్ళు సిద్ధముచేయుము పొమ్ము.

వరు—చిత్తము (అని పోవుచున్నాఁడు)

హిర—ఓయి కుబేరా! మా యిష్టదైవమయిన ఈశ్వరునకు నీవు సఖుఁడవుగనుక నీకు మంచిపని పెట్టెదము. నాయింటవెచ్చము తెత్తువుగాని నీవుమాతో నుండుము.

కుబే—మహాప్రసాదము.

హిర—ఓయీ! విప్రజిత్తీ! నీవు వాయుదేవుని మనవీధులు తుడుచుటకు నియమించి, తక్కిన దిక్పాలకులకు కూడ నీయిష్టము వచ్చిన పనులు చెప్పుము.

విప్ర—దేవరవారు సెలవిచ్చినట్లు చేసెదను.

హిర—(యమునివంక చూచి) చలిజ్వరము వచ్చినవానివలె వడఁకుచున్న, ఆమూల నొదిగియున్నవాఁ డెవఁడురా?

యము—స్వామీ! నేను దండధరుండను మీ దాసుఁడను.

హిర—నీవు దండధరుఁడవా? నీవు యమలోకమునుండి మా కంటె ముందుగా వచ్చితివే. ఓవిప్రజిత్తీ! వీనిపేరు సార్థకమగునట్లుగా వీనిచేతికొక కఱ్ఱనిచ్చి వీనిచేత మనపశువులను కాపించుము.

విప్ర—చిత్తము.

హిర—ఓయీ నారదా! నీవొక్కసారి తంబురశ్రుతి చేసి, ఒక్క గీతమును పాడుము.

నార—చిత్తము. (అని తంబురశ్రుతి చేయఁబోవుచున్నాఁడు)

హిర—నీచేతకాదు. నేను శ్రుతిచేసి చూపెదను. తంబుర యిమ్ము తే. (అని పుచ్చుకొని టింగుటింగున మీటి బిరడత్రిప్పి తీగ త్రెంపుచున్నాఁడు) నారదా! ఈతంబుర మంచిది కాదు. దీని నెవఁడు చేసినాఁడో వాని పిలువఁ జెప్పుము. పట్టితెప్పించి వానిచేఁ గట్టెబద్దలు చేయించెదము. (అని తంబుర నిచ్చుచున్నాఁడు)

నార—చిత్తము. (అని తంబుర పుచ్చుకొన్నాఁడు)

హిర—తావళముతిప్పుచు, ఏమేమోగొణుగుచు, వ్రేలు గడ్డములతో మూగవాండ్రలాగున నిలుచున్నారు. ఈముద్దలును ఎవరు?

ముని—మేము మహర్షులము మహాప్రభూ!

హిర—మీరిప్పుడు చేసెడిదేమిటి?

ముని—మేము జపము చేసికొనుచున్నాము.

హిర—ఎవరిని గురించి.

ముని—పరమేశ్వరుని గురించి.

హిర—ఛీ. ఛీ. వెఱ్రిలారు. ఇంకముందు మీరట్లు చేసినపక్షమున గుండెలు బద్దలుచేయించెదను. ఇంకమీరు చేయఁబోయెడు జపము హిరణ్యకశిపునిగూర్చి చేయుఁడు. మీకు కావలసినవరములు మేమే యిచ్చెదము.

ముని—చిత్తము స్వామీ!

హిర—మహర్షులు మీరెంతమందిరా?

ముని—మే మేడుగురము మహాప్రభూ!

హిర—సప్తమహర్షులా? సరిసరి; సంఖ్యకు చక్కఁగానే కుదిరినారు. ప్రక్కకుముగ్గురేసిచొప్పున మీలో ఆరుగురు మాపాలకీపట్టి మిగిలినవాఁడు కాగడాపట్టుఁడు. వేగిరముపోయి పల్లకిని సిద్ధముచేసికొనిరండు. మేమిప్పుడు నందన వనమునకు పోయెదము.

ముని—చిత్తము. (అని పోవుచున్నారు)

హిర—ఓరీ యింద్రా! రేపు మేముపోవునప్పుడు మాతోఁటలో వేయించుటకు నందనవనములోని కల్పవృక్షములన్నిటిని తీసికొనిపోవలెను. దేవతలను త్రవ్వి సిద్ధముగానుంచుమను. మాతోఁటలోని క్రీడాసరస్సునందునాటించుటకయి మానస సరస్సులోని బంగారు కమలములను దుంపలతోసహా పెల్లగించి యుంచుమని చెప్పు.

ఇంద్రు—చిత్తము. ఈస్వర్గ మేలాగునది. సమయాజ్ఞప్రకార ముగ చేసెదను.

హిర—నీవద్దనున్న అమృతభాండము మా విడిదికిపంపి విప్ర జిత్త్యాదులకు పదిలముగా ఒప్పగించుటకయి జయంతుని నియమించి మేము మాపురమునకు తీసికొనిపోవుటకయి కామధేనువును, ఉచ్చై శ్రవమును, ఐరావతమును, నూవాకిటిముంగల చెట్లకుకట్టించి సిద్ధ ముగా నుంచుమని చెప్పు.

ఇంద్రు—చిత్తము. దేవరసెలవిచ్చినట్లెల్లను చేయించెదను. ఓ జయంతా! నీవును బృహస్పతియు పోయి ప్రభువువారిప్పుడు నియమించిన పనులనెల్లను చేయింపుడు.

(బృహస్పతియు జయంతుఁడును పోవుచున్నారు.)

హిర—నారదా! నీవు ముందుగాపోయి సమస్తమహర్షులు వీధిలోపల్లకిని ఉంచినారోలేదో చూడుము. ఓయీ! విప్రజిత్తీ! నీవు విడిదికిపోయి కామధేనువు మొదలయినవి వచ్చినతరువాత ఒప్పగిం చుకో. మేము శంబరునితోఁగూడ నందనోద్యానమునకుపోయెదము.

విప్ర—చిత్తము. (అని నారదునితోఁగూడ పోవుచున్నాఁడు.

హిర—ఓరీ! దుర్ముఖా! అలంబసా! మీరిద్దరును ఈయింద్రుని మీావశములో నుంచుకొని మా వెనుక నడిపించుకొని తీసికొని రండి. మేము నందనవనమునకు పల్లకిలో పోయెదము.

దుర్ము—మహాప్రసాదము.

హిర—ఇంద్రుఁడు పాఱిపోవునుసుమా! పదిలముగా తీసికొని రండి. మనమూాటలేవైన ఉన్నపక్షమున వీనినెత్తి నెత్తి మోపించు కొనిరండు. (అని శంబరుని వెంటబెట్టుకొని పోవుచున్నాడు.)

దుర్మ—(ఇంద్రుని చేయిపట్టిలాగుచు) ఉండు వెళ్లెదవు. ఈరాత్రి నీవు మాయింటికి రంభను పంపవలెనుసుమా. నాకు మంచి యిల్లు సిద్ధము చేయించినావా?

ఇంద్రు—మీ సెలవుప్రకారము చేసెదను.

అల—(రెండవచేయి పట్టుకొని లాగుచు) రంభతో తమందరి యున్నారు? రంభను మనుష్యులకిచ్చుటకు పంపించవలెను మహారాజా?

ఇంద్రు—స్వర్గములో రంభ ఒక్కతెయున్నది. నీకు ఊర్వశిని పంపెదనులే.

అల—నాకూర్వశి పనికిరాదు. ఈసారి మాప్రభువుగారితో బ్రహ్మలోకమునకు వెళ్లినప్పుడు స్వర్గములోని వారిని దర్శించి రంభలనుగా ఎందుచేత చేయలేదో బ్రహ్మదేవుని ప్రశ్నించెదను. యజ్ఞములు చేసినవారికి రంభాసంభోగము దొరుకునని చెప్పుకొందురు. ఆ రంభ యిదేనా?

ఇంద్రు—ఇదే.

అల—నాకు తెలియకుండ ముందుగా ఆనందపు గాడిదకొడుకులు రంభను వారనుభవించుచున్నారా? ఇంటికిపోయినతరువాత స్వర్గములో నున్న సోమయాజుల నందరిని నాకప్పగించుము. ఇకరంభ పేరు తలపెట్టకుండ ఒక్కొకనినే పట్టుకొని మొత్తగా దంచి వదలిపెట్టెదను.

ఇంద్రు—చిత్తము. ఆలాగున చేసెదను. మీయిల్లు సోమయాజుల మయము చేసెదను.

దుర్మ—అమృతమంతయు మారాజుగారికే పంపెదనని యొప్పుకొన్నావే. నాకెక్కడినుండి అమృతము తెచ్చెదవు? నాకమృతము పోయకపోయినపక్షమున క్రోవపాదుకునను దంచి రాజుగారిదగ్గరకు పోవునప్పటికి నీదేహము పిండిచేసి వదలిపెట్టెదను.

ఇంద్రు:—అమృతము ముందుగా నీకు పోసినతరువాతనే రాజుగారికంపెదను.

అల:— ఇప్పుడు మా రాజుగారికనే గౌరవము చేసినావు కాని నాకు మర్యాదచేసినావు కాదుగదా? ఈసంగతి మఱచిపోకు. నిన్ని రాత్రి కొట్టులో పెట్టి రేకు మణగకొట్టెదను.

ఇంద్రు:—ఈతప్పు క్షమింపుము. ఇంక ముందు రాజుగారికంటె ముందుగా నీకే పెద్దరికము చేసెదను.

దుర్ము:—అలంబసా! మనము వేగిరము పోకపోయినయెడల ప్రభువుగారు కోపము చేయుదురు. మనబట్టలమూట ఈయింద్రుని నెత్తిమీద పెట్టి వీనిని వెంటబెట్టుకొని పోదము రా.

(అని యందఱును పోవుచున్నారు.)

---

## చతుర్థాంకము

---

రంగము:— హిరణ్యకశిపుని సభాభవనము.

అల:—దుర్ముఖా! మనమహారాజుగారిప్పుడు మూడులోకములను జయించినారు. యక్ష, పన్నగ, గరుడ, కిన్నర, కింపురుషాది సమస్తదేవతలును భృత్యులయి ప్రభువారిని సేవించుచున్నారు. దిక్పాలకు లందఱును తమదిక్కులనువదలి నీవేదిక్కని మనరాక్షససార్వభౌముని నే కొలుచుచున్నారు. మూడులోకములయందునుగల ప్రశస్తవస్తువులన్నియు మనపురము చేరినవి. మనమందరముపోయి యజ్ఞ

ములు చెరచి, మునులను బాధించి విష్ణుభక్తులను వెదకిచంపి, విష్ణు పేరు లేకుండ రూపుమాపివచ్చినారము. మనరాజుగారికి మఱియేవిధమయిన విచారమును లేదుగాని కుమారుని విషయమయిమాత్రము కొంచెము మనోవ్యథ పట్టుకొన్నది.

దుర్ము:—అలంబవా! ఏమీచెప్పవు? కొమారుని విషయమయి యేమిమనోవ్యథ? మీరు స్వర్గమును కొల్లకొనివచ్చినతరువాత నేనిన్ని దినములక్కడనే రంభనిమిత్తమై కనిపెట్టుకొనియుండి స్వర్గమునుండి నేటిప్రొద్దుననే వచ్చుటచేత నాకీలోకమేక్రొత్తగానున్నది. నాకిక్కడి సంగతులేవియు తెలియవు. మీ వెనుక నేవచ్చుచున్నానని చెప్పి మిమ్ము మోసపుచ్చి యింతికాలము స్వర్గములోనున్నను తుదకు నాకు రంభ యొక్క ముఖదర్శనమయినను లభించినదికాదు. మనరాజుగారు స్వర్గముమీదికి దండెత్తివచ్చినారని విని, తనకెక్కడమానభంగము వచ్చునో యని జడిసి రంభ యెవ్వరికిని తెలియకుండ ఆత్మహత్య చేసికొన్నదఁట? ఇది మహారహస్యము. నీవీసంగతి యెవ్వరితోను చెప్పకుమా. నేనీమాట మొట్టమొదట నమ్మక నన్ను దేవతలు మోసముచేసియుందురేమో యని తలఁచి యింతకాలమక్కడ సహస్రాక్షుడనై యుండి చెట్లు పుట్టలు రాళ్ళు రప్పలు సమస్తమును శోధించి చివరకు వారిమాటసత్యమనినమ్మి బయలుదేఱి వచ్చినాను. నన్ను మోసపుచ్చుటకు దేవతలకు గుండెలున్నవా? వారు సత్యమే చెప్పినారు. రంభ యెక్కడను కనఁబడలేదు. అందుచేత రంభ నిమిత్తమయి వచ్చిన సోమయాజులనందఱిని చావమోఁది రంభా సంభోగము దొరికినంత సంతోషమును పొంది వచ్చినాను.

అలం—సోమయాజుల విషయమై నేను చేయదలఁచుకొన్న పనిని నీవే చేసివచ్చినావు గనుక, నాకు పరమానందముగానున్నది.

దేవతలు నిన్నిట్టే మోసముచేసినారుగదా! రంభ చావదు. దేవతలకు చావులేదని నీకు తెలియదా? రంభ ఆత్మహత్య చేసికొన్నదన్న నీవెట్లు నమ్మినావు? రంభయిల్లు గంధర్వవీధిలో కొట్టకొనమున్నదే, నీవా బంగారుమేడను వెదకినావా?

దుర్మ——అయ్యో! నేనిండ్లమాటే మఱచిపోయినాను. నే నేయిల్లును వెదకలేదు. మనము బాల్యమిత్రులమయియుండఁగా, దేవతలకు చావులేదన్నమాట యింతవఱకును నాకుచెప్పినావుకావుగదా? ఇంతమిత్రద్రోహముచేసినావుగనుక, నేను తెచ్చుకొన్న వస్తువులలో నీకొక్కటియునియ్యను. ఆహా! దేవతలు నన్నింత మోసముచేసినారు! నేనుపోయి వారిని శిక్షించిరావలెను. ముందుగా మన ప్రహ్లాదునికథ నాకుచెప్పు. ఆకథ విని నేను స్వర్గమునకుపోయెదను. నేను స్వర్గమునకు దారి మఱచిపోయినాను. నీవే చెప్పవలెనుసుమా! మఱచిపోక తరువాతచెప్పు.

అలం——నేనిప్పుడే చెప్పెదను. తరువాత నేను మఱచిపోయిన యెడల, మరలమిత్రద్రోహముచేసినానందువు. ఇప్పుడే తిన్నగావినుము. మరలచెప్పుచున్నపక్షమున నాకీచెప్పినశ్రోవరాదు. నీవిక్కడనుండి తిన్నగాపయికిలేచి, ఆకాశమార్గమున పదియోజనముల దూరము పోగిరి, అక్కడనుండి తూర్పునకుతిరిగి, పడమరకుమరలి, నూటిగాదక్షిణము చేరి, ఉత్తరపుదిక్కుకేసినడచి, అక్కడనుండి తిన్నగా మోచేతవంపుగా మూలకుపోయి పయికెక్కి క్రిందికిదిగి, వాయువ్యమూలచేరి, ఆగ్నేయమూలనుండి యీశాన్యమూలకువంగి, నైరృతిమూలను విశ్రాంతిపొంది బయలుదేఱి, అక్కడనుండి ముక్కుకునూటిగా పయికెరిగినపక్షమున తిన్నగా రాజవీధినిపడి కాళ్ళు నొప్పులెత్తువఱకును నడిచినసరిగా రంభయొక్క పెరటిగుమ్మముచేరుదువు. ఇఁక రెండవవారి నడుగవలసినపనిలేదు. నీవు రంభాసంభోగముచేసి వచ్చునప్పుడు నా

కమృతమును తీసికొని రావలెనుసుమా. అప్పుడు రేఖుంబగళ్ళు ప్రభువుగారితో ఉండవలసివచ్చుటచేత మరల ఇంద్రునిచూచి అమృతము తెచ్చుకొనుట కవకాశము చిక్కినది కాదు.

దుర్మ—స్వర్గములోని అమృతపుకుండనే యిక్కడికు పట్టుకొనివచ్చెదను. ఇప్పుడు నీవుచెప్పిన స్వర్గమార్గమువార్తను నామనసున పట్టలేదు. ముందుగా ప్రహ్లాదుని సంగతి చెప్పు. స్వర్గముమాట తరువాత చూచుకొందము.

అలం—అట్లయిన వినుము. మా మహారాజుగారి పుత్రుడు తల్లిదండ్రులుపిలిచినపలుకక తనలోనే యేమోమాటాడుకొనుచు ఆడుచు, పాడుచు, నవ్వుచు, చేతులుజోడించుకొని నమస్కరించుచు, ఆనందించుచు, తలుపుగాపరధ్యానముతో నుండగాచూచి, హిరణ్యకశిపు మహారాజుగారు చిన్నపోయియుండి, పిల్లకు నేదో దృష్టిదోషమో భూతము సోకినదో యని విచారించి, ఆతడప్పుడప్పుడుతల్లిదండ్రుల వద్దకుపోయి ప్రేమతో పలుకుచు ముద్దులుచూపుచు నచ్చుచుండుట చేత మరల కొంత సంతోషము తెచ్చుకొని, విద్యచెప్పంగాని యీ చిన్నిపాపడు మతిమంతుడు కాడని నిశ్చయించి, గురుపుత్రులగు చండామార్కులను రప్పించెను.

దుర్మ—తల్లిదండ్రులెప్పుడును పుత్రులు సివేకసంపన్నులైన పరమానందభరితులగుదురు; కొడుకులు జడులయిన పక్షమునచింతాక్రాంతులయి తక్కినసుఖముల నన్నిటిని దుఃఖములుగా నెంచుకొందురు. ఆహా! లోకములో కొడుకుల మీద పితృమాతృబంధ మెంతయధికమయినది? శుక్రాచార్యుని పుత్రులను పిలిపించినతరువాత రాజుగారేమి చేసినారు?

అలం—చండామార్కులురాగానే రాజుగారు వారికి నమస్కారము చేసి తగినపీఠములమీద కూరుచుండ నియోగించి, అంతః

పురముసుండి కొడుకును పిలిపించి, నాయనా రమ్మని చేరఁదీసి తొడ
మీఁద కూరుచుండఁ బెట్టుకొని జుట్టుదువ్వుచుఁ "లోకములో చదు
వెఱుఁగనివాఁడు మూఢుఁ డగును; విద్యనేర్చిన పక్షమున సదసద్వి
వేకముకలిగి పండితుఁడగును. కాఁబట్టి, తండ్రీ! నీ వీ గురువులవద్ద
విద్యనేర్చుకొమ్ము" అని, గురుకుమారులవంక చూచి "ఓ గురుపుత్రు
లారా! వీఁడు విద్యాగంధములేని హేతువుచేత రాక్షసవంశమునకు
సహజమైన ప్రతాపగుణ మేమియులేక, అడవులలో తపస్సులుచేయు
మునులవలె శాంతాత్ముఁడయి కనఁబడుచున్నాఁడు. మన్నుతిన్నపాము
వలె మందుఁడయియున్న వీనిని మీవెంట తీసికొనిపోయి విద్యా
భ్యాసము చేయించి కన్ను తెఱపి నీతిశాస్త్రకోవిదునిచేసి రక్షిం
పుఁడు" అని చెప్పి కొమారుని వారికొప్పగించెను.

దుర్మ—వారేమి చేసినారు?

అలం—వారు రాజుగారివలన సత్కారములుపొంది సెలవు
పుచ్చుకొని, బాలకుని తమయింటికి తీసికొనిపోయి, అక్షరాభ్యాసము
చేయించుటకయి మునుగా గురువులు "ఓం నమశ్శివాయ" యను
పదేశింపఁగానే ప్రహ్లాదుఁడు "ఓం. నమోనారాయణాయ" అని
చెప్పెనఁట?

దుర్మ—శివశివా! ఎంతపాపపుమాట వినఁబడెను! నోరెఱుఁ
గని పసిబాలునకీదుర్బోధ యెవరుచేసినారో? ఆపాపాత్ముని పేరిఁక
నాయెదుట ఉచ్చరింపఁబోకు.

అలం—విష్ణునామము లేకుండ నేను కథ యెట్లు చెప్పఁగలను?
ముందుకథ అంతయు ఆపేరుతోనే యున్నది.

దుర్మ—అట్లయిన నాకు ఇఁక నీ వేమియు చెప్పనక్కఱలేదు.
నీవుచెప్పఁబోయెడి దంతయు నాకు తెలిసిపోయినది.

అలం—ప్రహ్లాదుఁడు గురువులేమి చెప్పినను చదివెట్టక, విష్ణు నామము పాటగా పాడమొదలు పెట్టినాఁడట!

దుర్మ—ఛీ! ఛీ! మాటాడకు. ఆపాపు పేరు నా చెవిని వలదన్నను, పడనీయమానక నామతిచెడఁగొట్టుచున్నావు. మఱచిపోయినాను. నేనిప్పుడిక్కడి కెందుకు వచ్చినానో చెప్పఁగలవా?

అలం—నే నెందు నిమిత్తము వచ్చినానో కూడ పరాకుపడినాను. నే నేపనిమీఁద వచ్చియుండును?

దుర్మ—నీపని మఱచిపోతే పోయినావుగాని నాపనియేదో చెప్పు. నీకేమి? చెప్పినపని నేను చేయకపోయినపక్షమున రాజుగారు నన్ను చంపివేయుదురుసుమా. నేను దెబ్బలుతినలేను. వేగిరము చెప్పు.

అలం—నేనువచ్చినపని నీవు చెప్పిన పక్షమున, నీవు వచ్చిన పని నేనూహచేసి చెప్పెదను. నీవు చెప్పనిది నేను చెప్పుటకు నేను మాత్ర మంత వెఱ్ఱివాఁడ ననుకొన్నావాయేమి? నేను దెబ్బలు మొదలే తినలేను.

దుర్మ—నీ వీ సభాభవనములలో ప్రహ్లాదునికథ చెప్పుటకు వచ్చినావు.

అలం—నీవు వినుటకువచ్చినావు. ఏమీ! ఇదిసభాభవనమా? అట్లయిన నేనువచ్చినపని నాకు జ్ఞప్తికివచ్చినది. నాకు దెబ్బలు తప్పిపోయినవిలే. ప్రహ్లాదుని చదువు పరీక్షచేయుటకయి రాఁబోవుచున్నాము గనుక సభాభవనములో పీఠములు వేయుమని రాజుగారు నన్ను పంపినారు. ఇది నేనుప్రతిదినమును చేసెడు పనియే అయినను నేనెంతలో మరచిపోయినానో చూచితివా? ఒకానొకప్పుడెంతటి బుద్ధిమంతులకయినను, మఱపుండును. "ప్రమాదో ధీమతామపి" అని మాగురువుగా రెప్పుడును చెప్పుచుండెడివారు.

దుర్మ—నా దెబ్బలంతకుమునుపే తప్పిపోయినవి. 'చదువు పరీక్ష' అన్నతోడనే నాపని నాకును స్మరణకు వచ్చినది. నన్ను చండామార్కులను శిష్యసహితముగా వెంటఁబెట్టుకొనిరమ్మని రాజుగారే పంపినారు. నేనుపోయి తీసుకొనివచ్చెదను. అయ్యో! నావంటి బుద్ధిమంతునకు కూడ మఱపుకలిగినదికదా? (అని పోవుచున్నాఁడు)

అలం—నేను పీఠములను వేసెదను. వీధిలో కలకలము వినఁబడుచున్నది. రాజుగారు వచ్చుచున్నారేమో!

[హిరణ్యకశిపుఁడును, లీలావతియు ప్రవేశించుచున్నారు]

హిర—ఓరీ! అలంబసా! నీవింకను పీఠములు తిన్నగా వేసినావు కావేమిరా? నీకు భయభక్తులు లేనట్టున్నవే. (అని పీఠముమీఁద కూరుచున్నాఁడు)

అలం—స్వామీ! దేవరవారియెడ నాకున్న భయభక్తులు మఱియెవ్వరికిని లేవు. నాకున్న భయముచేతనే చేతులు వడఁకి పీఠములు తారుమారులయినవి. చేతులుజోడించుకొని వంగినిలుచున్న యీ వాలకము చూచినమాత్రముననే నాభక్తి యేలినవారికి విశదము గాఁగలదు.

హిర—ఏడిచినావులే. ఈ వక్కణవినయములుమాని తిన్నగా నిలుచుండు. దేవీ! నీవీపీఠముమీఁద కూరుచుండుము. మనము ప్రహ్లాదుని గురువులయింటికి పంపివేసి చిరకాలమయినది. వానినిగురువులు కఠినశిక్ష చేసినట్టు నాకు రాత్రి స్వప్నమువచ్చి నామనస్సెంతో పరితాపపడినది. అప్పటినుండియు వానిని చూడవలెనని నాబుద్ధి వానిమీఁదికిపాఱి తెల్లవారినదాఁక నిద్రపట్టినదికాదు. నాధ్యానమంతయు వానిమీఁదనే యుండుటచేత తెల్లవాఱుజాముననే యొకభటుని లేపి గురువులవెంట ప్రహ్లాదుని తీసికొనిరమ్మని పంపినాను. ఇంతకాలమును

గురువులేమి బోధించినారో, బాలుఁడేమి నేర్చికొనెనో మనమిప్పుడు పరీక్ష చేయుదము. కొడుకులవిద్యాబుద్ధులు చూచి సంతోషించుటకంటె తల్లిదండ్రుల కధికసంతోషము మఱియొకటియుండునుగదా?

లీలా—ప్రాణనాథా! మనముద్దుకుమారుని నడబాసియెంతో కాలమాయెనది. అప్పటినుండియు నాప్రాణములన్నియు వానిమీఁదనే యున్నవి. వాఁడు విద్యాబుద్ధులు నేర్చికొనుచున్నాఁడన్న ధైర్యముచేతనే యింతకాలము నిమిష మొకయుగముగా సహించఁగలిగితిని గాని వాని ముద్దుమొగము చూడక నేనిఁక నొక్కదినమయినను తాళలేను. అందుచేతనే ప్రహ్లాదుని నొక్కసారి పిలిపింపుఁడని దేవరవారితో మనవిచేసినాను.

హిర—వానిని తీసుకొని రమ్మని నేను రెండవసారి మర్ఖునిఁగూడ పంపినానే! వాఁడును పోయినదే పోక అయినాఁడు. చండామార్కులు శిష్యునితీసికొని యీవఱకే వచ్చియుండవలసినది. అదిగో వారు వచ్చుచున్నట్టున్నారు. వారికంటె ముందుగానే మన విప్రజిత్తియు వచ్చుచున్నాఁడు. విప్రజిత్తీ! వచ్చికూరుచుండుము.

విప్ర—చిత్తము. (అని కూరుచున్నాఁడు)

[అప్పుడు చండామార్కులును, ప్రహ్లాదుఁడును గూర్ఖునితోఁ బ్రవేశించుచున్నారు]

లీలా—అదే నాముద్దుకుమారుఁడు నాకు కన్నులపండువు చేయుచున్నాఁడు. (అని చేతులుచాఁచి కుమారుని కౌఁగిలించుకొని ముద్దు పెట్టుకొనుచున్నది)

హిర—గురువులకు నమస్కారము. పీఠములమీఁద దయచేయుఁడు.

చం—నిరంతర కల్యాణసమృద్ధిరస్తు. (అని కూరుచున్నారు)

లీలా—ప్రహ్లాదా! నీతండ్రిగారు నీవిద్యామహిమను చూచి

సంతోషింపవలెనని కడువేడుక పడుచున్నవాఁడు. నీవు నేర్చిన విద్య చూపి వారికానందము కలుగఁజేయుము,

హిర — ప్రహ్లాదా! నాతండ్రీ! ఒకసారి నాతొడమీఁద కూరుచుండి నాకు ముద్దిమ్ము. (అని చేరదీసి తొడమీఁదకూరుచుండఁ బెట్టుకొని బుగ్గలు ముద్దుబెట్టుకొని జుట్టునిమురుచు) నాయనా! నీతల్లి నీచదువుచూడవలెనని ముచ్చటపడుచున్నది. నీవేమేమి చదివినావో నీగురువులేమేమి నీతిశాస్త్రములు నీకు నేర్పినారో చెప్పి, నీవు చదివిన వానిలో నొక్కపద్యము చదివి, యేదీ దానియర్థము చెప్పుమా చూతము.

ప్రహ్లా — తండ్రీ! నేను చదివినచదువు లెన్నియైన యున్నవి. నాకు గురువులెన్నియైనను చెప్పినారు. చదువులన్నియు వట్టి నిస్సారములు. సకలశాస్త్ర సారమయిన చదువు వేరొకటియున్నది.

హిర — నాయనా! నీవు సకలశాస్త్రములుకూడ గ్రహించినావుగా? ఏదీ నీవెఱిఁగిన సారాంశము? నేనుకూడ గ్రహించి సంతోషించెదను చెప్పు.

ప్రహ్లా — ఓదానవేంద్రా;

గీ. ఏను నేర్చిన సారాంశ మిదిగో వినుము—
సారహీనము లిహలోక సౌఖ్యతతులు;
సారమొక విష్ణుభక్తియె సత్యముగను;
కడమవన్ని యసారముల్ పుడమిమీఁద.

హిర — (తనలో) అహా! ఏమి నాపుత్రుఁడు కులాచారవిరుద్ధమయిన విష్ణువినుతిచేయుచున్నాఁడు! (ప్రకాశముగా) నాయనా! నీకిది బుద్ధికాదు. విష్ణునిస్తుతించుట మనరాక్షసకులములో తప్పు. నీవు తెలియక యీ వఱకేమి చేసినను చేసితివిగాని యిఁకముందెప్పుడును నాకు

విరోధమయిన విష్ణుని పేరు తలపెట్టకుము. మన వంశములోలేని విష్ణుభక్తి నీకెందుకు! అదిమాని కావలసినపక్షమున శివుని ప్రస్తుతింపుము.

ప్రహ్లా—

సీ. విష్ణుభక్తితో వినుతింపఁగా లేని
జిహ్వాజిహ్వయె గొడ్డుజిహ్వగాని
పురుషోత్తమునిఁ బ్రేమఁ బూజింపఁగా లేని
చేయిచేయియె మొండిచేయి కాని
యచ్యుతుఁ బ్రీతితో ధ్యానింపఁగా లేని
మనసుమనసె కొయ్యమనసుగాని
నారాయణునిఁ గూర్చి నారయఁగా లేని
బుద్ధిబుద్ధియె మంకు బుద్ధిగాని
దేవదేవుని నిర్మలసేవ లేని
జన్మజన్మయె దురితంపు జన్మ కాని
పరమపావన పరిశుద్ధభజన లేని
నరుఁడు నరుఁడె తా వెడఁగు వానరుఁడుఁగాని.

హిర—పుత్రకా! నీవాక్యము నాకిప్పుడు కర్ణములకు శూలమై నాటుచున్నది. అతిపాపాత్ముఁ డెవ్వఁడో యిప్పుడు నీమనస్సులో నావహించి యున్నందున, నాయెదుట వినరానిపలుకులు పలుకుచున్నావు. ఆవిష్ణుఁడు మనకు శత్రుపక్షమువాఁడు. మన మహా పాపాత్ముని పేరెప్పుడును స్మరింపరాదు. నాబుద్ధివిని విష్ణు స్మరణము మానుము. (విప్రజిత్తివంకఁ జూచి) ఓయీ విప్రజిత్తీ! విన్నావా మన ప్రహ్లాదుని విపరీత సంభాషణము! బాలకులేమియు నెఱుఁగరు. ఎవ్వరేమను మన్నను వానినట్లందురుగాని మంచియు చెడ్డయు విచారింపఁజాలరు. నోరెఱుఁగని వీని కెవ్వరో దుర్బోధచేసి విష్ణుభక్తిని గట్టిగా

మనసునపట్టించినారు. అంతేగాని వీనికిబుద్ధి లోపల పుట్టినదికాదు. నీ వేమితలంచెదవు?

విప్ర—తెలియనివానిని జేసి యీ బాలకున కెవ్వరో నీతి మాలినవారు తప్పక యీదుర్బోధచేసియుందురుగాని యిది యీపసి పాపనికి తనంతపుట్టినబుద్ధి కాదు.

హిర—(కన్నులెఱ్ఱచేసి గురుపుత్రులవంకఁజూచి)ఓబ్రాహ్మణ బ్రువులారా! నీతిశాస్త్ర పారంగతుని జేసెదమని చెప్పి నాకుమారుని మీయింటికిఁ దీసికొనిపోయి యీపాడువిష్ణుభక్తినా యిన్నాళ్ళును నేర్పినారు? మీ రీ బాలకుని నేమో నీతికోవిదుని చేయుదురని భ్రమ చేత గురుపుత్రులని నమ్మి మీకొప్పగించినందుకు మీ రీపసిబిడ్డనికి రాక్షసాంతకుఁడయిన విష్ణుని వినుతింపుమని చెప్పి మంచినీతి నేర్పినారు. ఈపసిపాపనికీలాగున శత్రుపక్షములు బోధించుట మీకుతగునా? నిజముగా బ్రాహ్మణ వేషధారులయియున్న కిరాతులుగాని మీరు గురువులు కారు.

చండ—ఓరాక్షససార్వభౌమా! మామీఁద కోపపడఁబోకుము. మేము నీక్షేమమునుగోరెడు గురుపుత్రులము కాని శత్రులము కాము. అట్టి మేమెప్పుడయిన నీపుత్రునకు శత్రుపక్షములు చెప్పుదుమా? మీపాదములతోడు. వీనికి విష్ణుభక్తితనంత నేకలిగినది కాని యొకరుచెప్పి పెట్టినదికాదు. ఓమహారాజా! మాయెడ లేశమాత్రమును తప్పులేదు. మమ్ము మన్నింపుము. నీకొమారుని చేష్టలునాశిష్యులెఱుఁగుదురు; వారినడిగి తెలిసికొమ్ము. (అనిప్రహ్లాదునివంకఁజూచి) ఓకుమారకా! చూడఁబోయిన నీవింత లేవు. మేము చెప్పినశాస్త్రములోని ముక్క యొక్కటియైనను చెప్పక, విష్ణుని బాఁతివలె పొగడి యీసభలో మహారాజుగారిముందర మమ్ము తలలువంచుకొనునట్లు చేసి

నావు. ఇటువంటిమంచిశిష్యుఁడు దొరకినతరువాత మాకుఁగలవంతులు రాక యెట్లుమానును? విద్యచెప్పిన గురువులకు నీవు పేరును ప్రతిష్ఠయు చక్కఁగా తెచ్చినావు. అన్నా! నీతండ్రివద్ద విష్ణుకథలు చెప్పక మేము చెప్పిననీతులు చెప్పుమని ప్రోవపాదుగునను బోధచేసినందున మంచిపని చేసినావు.

హిర — ఓగురుపుత్రులారా! జ్ఞానమెఱుఁగనియీపసిబాలకుని మీరెందుకు కసరెదరు? గురువులు శిష్యులను మంచిమాటలచేత తమకు లోఁబఱుచుకొనవలెనుగాని కోపపడఁగాదు. వీనికెవ్వరో దురాత్ములు దుర్బోధచేసియున్నారు. మీరూరకుండుఁడు. నేను బుజ్జగించి యడిగెదను. (కుమారునివంకతిరిగి) నాయనా! గురువులు చెప్పనియీబుద్ధులు నీకెవ్వరు చెప్పినారు? నీకీదుర్నీతులు మనసున పట్టించినవారెవ్వరో వారిపేరు చెప్పుము. నేనిప్పుడే వానినిపట్టి శిక్షించెదను.

ప్రహ్లా — తండ్రీ! దుర్లభమయిన యీవిష్ణుభక్తి ఒకరుచెప్పినంతమాత్రముచేత వచ్చునా! ఆజగదీశ్వరునియొక్క నిర్హేతుకజాయమాన కటాక్షముచేతనే నాకు హరిభక్తియను నిధానములభించినది. అహా! యేమిభాగ్యము!

గీ. విష్ణుభక్తికంటెను విష్ణునిమతికంటె
నెక్కుడయినట్టి ధర్మమిలయిలను లేదు
భాగ్యవశమున నాకిది పట్టుపడియె
విబుధులకు దుర్లభంబైన విష్ణుభక్తి.

హిర — (కోపముతో) ఓరీ! కుమారకా! నీవు రాక్షసకులమున పుట్టియు కులాచారమును విడిచి నాసమ్ముఖమునఁగూడ రాక్షసకులమునకు శత్రువయిన దుర్జనునివిష్ణుని సంస్మరించుచు నాబుద్ధినివివకున్నావు. ఓరీ పితృద్రోహీ! జనకునియాజ్ఞనుమీఱికులాచార విరుద్ధ

మయిన విష్ణునామస్మరణము చేయుటకు నీకు తగునా! నీవింతటనైన బుద్ధితెచ్చుకొని విష్ణుభక్తి విడువని పక్షమున, నిన్నిప్పుడు పట్టి శిక్షించెదను సుమా !

ప్రహ్లా—ఓతండ్రీ! క్షణభంగురమయిన యీశరీరమును మీ రెన్ని బాధలు పెట్టినను, నాహృదయముమాత్రము శాశ్వతానంద ప్రదాతయయిన యాపరమేశ్వరునినుండి మరలనేరదు.

గీ. తండ్రి ! నీయాజ్ఞ యెనవోఁ దడవు లేక
 ప్రాణమైనను నిచ్చెదభక్తితోడ;
 చెలఁగి మఱియేమిచెప్పినఁ జేయువాఁడ
 విష్ణుభక్తినిమాత్రమే విడువఁజాల.

హిర—ఓరీ! కులద్రోహీ! నీవింక నాతోడమీఁద కూడ చుండఁదగవు. పో. పో. (అని క్రిందికిపడఁద్రోచి) ఓరీ! దుర్ముఖా! ఓరీ! అలంబసా! ఈపాపాత్ముఁడు మేమెంత చెప్పినను తన మార్గమును మానకున్నాఁడు. వీఁడు శిక్షలచేతఁగాని మంచిమాటలచేత చెప్పినట్టు వినఁడు. మీరు వీనిని పట్టికొట్టుఁడు పొమ్ఁడు; అప్పుడు వీనికి విష్ణుఁడెవఁ డడ్డమువచ్చునో చూతము.

దుర్మ—మహాప్రసాదము. స్వామీ! దేవరయాజ్ఞ శిరసా వహించి చేసెదము.

హిర—ఏమీ ? మీరు మొద్దులలాగున కదలకున్నారేమి ! వీఁడు దండనముచేతఁగాని మంచి మాటలచేత చక్కఁబడఁడు. తన్నుఁడు; పొడువుఁడు.

[దుర్ముఖుఁడును, శంబరుఁడును ప్రహ్లాదుని తన్ని, గ్రుద్ది పొడిచి బాధించుచున్నారు.]

ప్రహ్లా—ఓదీనశరణ్యా! ఓజగదీశ! ఓభక్తవత్సల! ఓప్రసన్న రక్షక! (అని స్మరించుచు నిశ్చలుఁడుగా నున్నాఁడు.)

లీలా—(మగనితో రహస్యముగా) ఓ ప్రాణనాథా! ఈపసి బాలకుని రాక్షసులిట్లు క్రూరచిత్తులయి ప్రహరించుచుండఁగా కన్న కడుపగుటచేత నేను చూడఁజాలకున్నాను. వారెంతకొట్టినను వీని మొగమున దీనభావముగపడదు. అట్లయినను నామనస్సుమాత్రము వేఁడిపాలలోఁబడ్డ బల్లిలాగున పరితపించుచున్నది. వీనికి మనము మిత్రత్వముననే బుద్ధిచెప్పవలెనుగాని యీపసిబాలకుని యెడల మనము శత్రుత్వము సాధించ తలఁచుకోరాదు. నామనవి చిత్తగించి యీబాలకుని సామవచనములచేతనే బుద్ధిచెప్పి సాధునిచేయు నట్లను గ్రహించి యాజ్ఞాపింపుఁడు.

హిర—(రహస్యముగా) ఓ ప్రాణేశ్వరీ! నాకుమాత్రము వీని యందుపగయున్నదా? వీనిశ్రేయస్సునుగోరియే బాలుఁడు నిష్కారణముగా చెడిపోవునని నకుమున భయమున బుద్ధిచెప్పవలసి వచ్చినది. పుత్రకుని రాక్షసులకప్పగించి పయికి నేనెంతగంభీరముగా గూరుచున్నను, వానినికొట్టెడు దెబ్బలన్నియు నాదేహముమీఁద పడినట్లుండి లోపల నామనస్సెంతో బాధపడుచున్నది. అయ్యో! నాకెంత కష్టమయిన యవస్థతటస్థించినది! నేనేమిచేయుదును? ఏమిచేయుటకును తోఁచకున్నది. (అని దుఃఖమభినయించుచున్నాఁడు.)

విప్ర—(వారియభిప్రాయము తెలిసికొని రాజుతో రహస్యముగా) ఓరాజేంద్రా! ఇతఁడుమీకుఁబుత్రుఁడుగాని పగవాఁడు కాఁడుగదా? మీకీబాలునితోడి దేమి? కొంతకాలముపోయిన వీనికే బుద్ధివచ్చును. మీరింక నిగ్రహములుమాని పుత్రుని ననుగ్రహింపుఁడు.

దుర్మ, అలం—(బాధ నభినయించుచు నిలుచుండి) ఓరి బాలకా! నిన్ను కొట్టికొట్టి మాచేతులునొచ్చుచున్నవిగాని నీకుకంట తడిరాదు; లేశమయినను భయముగపడదు; విష్ణుభక్తిని విడిచెదనని

తండ్రివైనను శరణుచొరవు; రక్షింపుమని తల్లివద్దకైనను పాఱిపోవు. ఇదియేమో మహామాయగానున్నది. నిన్నుకొట్టిన దెబ్బలచేత మాకే ళ్ళన్నియు పడిపోయినవి. మేమింకకొట్టలేము. (అని చేతులు నలుపుకొనుచు, బాధపడుచు బాలునివిడిచి దూరముగా నిలుచున్నారు.)

ప్రహ్లా—(చేతులు జోడించుకొని కన్నులుమూసుకొని తల పైకెత్తి) ఓవిష్ణూ! ఓపరమపురుషా! ఓయాపద్బాంధవా! ఓదీనశరణ్యా! నాకెన్నికష్టములు వచ్చినను నాహృదయము మాత్ర మెప్పుడును నీభక్తికైంకర్యాదులనుండి తొలగకుండునట్లు చేయుము. నాబుద్ధియెల్లప్పుడును ధర్మమునందును, సత్యమునందును, నీధ్యానమునందును, నీయాజ్ఞలయందును తగిలియున్నట్లు కటాక్షింపుము. నే నేకార్యమును చేయబూనినను మనుష్యుల యంగీకార సంతోషాదుల నిమిత్తము చేయక నీప్రీతినిమిత్తమే చేయుచుండునట్లుచేయుము. ఓభక్తవత్సలా! నే నీ యిహపరలోకములలోని సమస్తసుఖములను వైభవములను త్యజింపవలసి వచ్చినను, నాకత్యంత ప్రియములైన పదార్థములలో నెల్లను ప్రియతముఁడనయిననీయొక్క కరుణాకటాక్ష సంపాదనకొఱకు వానినన్నిటిని సంతోషపూర్వకముగా విడుచునట్టి ధైర్యోత్సాహములను నాకనుగ్రహింపుము. ఓపరమకృపాళూ! ఈలోకమంతయునన్నొక్కసారిగా నెదిర్చిబాధపెట్టబూనినను, నాచిత్త మణుమాత్రమును నిన్నువదలి చలింపకుండునట్లు చేయుము. నాకు నీయాజ్ఞలకంటెను, సత్యముకంటెను, ధర్మముకంటెను, ప్రాణము లధికప్రియములుగా నుండకుండునట్లు మన్నింపుము. ఓజగదీశ్వరా! నేనీలోకములోని మోహాదిబంధములకు వెఱచి నీపాదారవిందములు శరణుచొచ్చుచున్నాను. ఓభక్తభయార్తినివారకా! నాకభయహస్తమిచ్చి రక్షింపుము. ఓయనంతకరుణాకరా! అసత్యము, అహింస, చౌర్యము, కాపట్యము మొదలయినపాపములలో నొక్కటియు నాదరికి చేరకుండు

నట్లు కాచి రక్షింపుము. నాహృదయమునంతయు శోధించి దానియందు నాకు తెలియకుండ దాగియున్న దుష్టచింతలను, దుర్బుద్ధులను, దురాలోచనలను, దుర్వాంఛలను దూరముగా తొలఁగద్రోయుము. నేను బ్రతికినదినములు వ్యర్థముకాక నీభక్తికైంకర్యములయందు వినియోగ పడునట్లు ప్రసాదించి, నాకు నన్ను ప్రేమానుబంధముచేత నీతోలంకె వేసికొని యెప్పుడును నిన్ను విడిచి పోకుండునట్లు కాపాడుచుండుము. ఆపదలయందును, సంపదలయందును, సుఖములయందును, దుఃఖములయందును, రోగమునందును, ఆరోగ్యదశయందును, నిత్యకృత్యములయందును, కాలోచితకార్యములయందును, సమస్తవ్యాపారముల యందును, నన్ను నీయాశ్రయము విడువకుండునట్లు చేయుము. నీభక్తులను, సన్మార్గవర్తులను, లోకోపకారశీలురను ప్రేమించి సేవించునట్లు చేసి నాజన్మసాఫల్యము చేయుము. మనోవాక్కాయ కర్మలచే నీభజనము మానకుండునట్లు చేయుము. ఓపాపవిమోచకా! ఓదయాస్వరూపా! అజ్ఞానముచేత నన్ను హింసింపబూనిన నాతండ్రి మొదలయిన వారిని పితృవాత్సల్యము చూచి వీరి యజ్ఞానము బాపి, వీరి హృదయములు నీభక్తియందును సత్కార్యములయందును తగులునట్లాశీర్వదింపుము. వీరికి జ్ఞానదానము చేసి వీరిమనస్సులను దురభిమానమునుండియు దుర్మార్గమునుండియు మరలించి, తుచ్ఛములైన యిహలోకసుఖములకంటె వీరికి పరలోకసుఖ మెక్కువగా తోచునట్లు చేయుము. ఓదీనదయాళూ! నానిమిత్తమై వీరేదుర్గతిని పోకుండునట్లు కటాక్షింపుము. ఓభక్తజనానందసంధాయకా! నన్నెల్లవారును విడిచిపెట్టినను నీవుమాత్రము చేయివిడువక సదా నాహృదయమును కాయకుండుము.

[అని కన్నులుఁ దెఱచుచున్నాడు.]

హిర—(తనలో) ఓహో! ఉన్మాదములో సహితము వీఁడు విష్ణుభక్తిని నామీఁది ప్రేమను విడువకున్నాఁడే! (ప్రకాశముగా) ఓరీ

దుర్ముఖా! బాలునిజోలికి పోక మీరు దూరముగా తొలగుండి— ఓయి పుత్రకా! నిష్కారణముగా నామనస్సున కాయాసము కలుగఁజేసి నీవేలక్రిశనుపడియెదవు? ఇఁకనైనను నాబుద్ధివిని విష్ణుని స్మరింపకుండుము. నేను నీకభయ మిచ్చెదను—ఓగురుపుత్రులారా! మీరీ బాలకుని మరల మీవెంటఁగొనిపోయి కాలవిద్య చెప్పి, నయమున భయమున బహువిధోపాయములచేత వీనిమతిమగలించి నిస్మార్గమునకుద్రిప్పుఁడు. మామనస్సేమో వ్యాకులముగానున్నది. మేమంతఃపురమునకు పోయెదము మీరుపొండు.

చండా—చిత్తము ఓరాక్షసేంద్రా! మేమున్నియుపాయముల చేతను నీపుత్రునకుబుద్ధి చెప్పి మా చేతనయినన్ని పాట్లుపడిచూచెదము. ఆవల వీని యదృష్టము.

హిర—మీరు మీచిత్తమువచ్చినట్లు చేయుండి. పొండి.— దేవీ! మనమంతఃపురమునకు పోదముగమ్మా. విప్రజిత్తీ! నీవుకూడా లెమ్మూ. (అని భార్యాపంక్తి సహితముగా నడుచుచున్నాఁడు.)

దుర్ము—ఓగురువర్యులారా! మీకు నమస్కారము. నేఁటికి మీరుపాయముగా శిక్షను తప్పించుకొన్నారు. ఇఁకనైనను మీరీ బాలకునకు దురోధఁబుచేయక మంచిబుద్ధి చెప్పుఁడు. ఈసారిమామహారాజుగారు ప్రహ్లాదునకు మాఱుగా మిమ్మును మాకప్పగించిన పక్షమున గురువులమని మమ్ము నెపపెట్టవలసిన పని లేమునుండీ. ముందుగానే చెప్పుచున్నాను. మా చేతి కోపడిన తరువాత మీరు ప్రహ్లాదుని వలె తేలికగా తప్పించుకొనిపోలేరు.

చండా—ఓరిదుర్మార్గుడా! నీవు మాముందటఁ బ్రహ్మచారి చేష్టలు చేయుచున్నావేమిరా! అధిక ప్రసంగము చేసినపక్షమున నిన్ను శపించెదముసుమా.

దుర్మ — స్వామి! నేనుమా వంశాచారమునే చేయుచున్నాను. నేను బ్రహ్మచారిని; నాతండ్రి బ్రహ్మచారి; నా తాత బ్రహ్మచారి; సృష్ట్యాదినుండియు మాపూర్వులందఱును బ్రహ్మచారులే. అందు చేతనే నేను బ్రహ్మచారిచేష్టలుచేయుచున్నాను. కులాచారమెన్నటి కిని మీఱరాదని మావంటివారికి గురువులు మీరానతిచ్చిన ధర్మమే కదా? గురువులు మీరే యాగ్రహముచేసినయెడల, శిష్యులము మేము తాళఁగలమా? క్షమింపుఁడు. నాగునితప్పు దండముతో సరి. (అని చేతులు జోడించుచున్నాఁడు.)

చండా — పెండ్లిలేదుగనుక నీవు బ్రహ్మచారి వయినావుగాని, నీతండ్రి మొదలయినవారెట్లు బ్రహ్మచారులైనారురా?

దుర్మ — స్వామి ! గురువులకు తెలియని దేమున్నది? అది దేవరహస్యము. ఎవ్వరితోను చెప్పఁగూడదు. తగిన శుశ్రూషచేసి గురుదక్షిణయిచ్చిన పక్షమున, ఆరహస్యము ముందు నాశిష్యులకుప దేశముచేసెదను. ప్రభువువారింటికి వేంచేయుచున్నారు. మేము వారి వెంటఁబోవలెను. అలంబుసా! రమ్ము. (అని వానిని లాగుకొని పరు గెత్తుచున్నాఁడు.)

చండా — ప్రహ్లాదా ! మనముకూడ మనయింటికి పోదము రమ్ము. నీతండ్రి విష్ణువును బోధించునని వేదములను శాస్త్రములను తగులఁబెట్టించినాఁడు; పురాణములను కాల్పించినాఁడు. ఇఁక నీవాతని పేరు తలపెట్టక మాగురూపదేశమునమ్మి గురుసేవచేత నీతిమంతుడ వయి వర్ధిల్లుము.

[అని చెప్పుచు ప్రహ్లాదుని తీసికొనిపోవుచున్నాఁడు.]

## పంచమాంకము.

### ౧. రంగము—గురుగృహము

[ప్రహ్లాదుఁడును, చండామార్కులును, త్రిశోకన, శాలనాభాది శిష్యులును కూరుచుండి యున్నారు.)

చండా—ఓప్రహ్లాదా! నీకు దేనిచేతను బుద్ధిరాకున్నది. నేనేమి చేయుదును? నీ వెంత చెప్పినను వినక విష్ణుభక్తియే పరమార్థమనిపట్టు పట్టికూరుచున్నావు. రాజనీతి మోసమనుచున్నావు. ఇది నీకుతగదు. మామాటవిని బుద్ధిమంతుఁడవయి విష్ణుభక్తినివిడువుము.

ప్రహ్లా—ఓగురువర్యులారా! మాతండ్రిగారిని బట్టిన వెఱ్ఱియే మీకును బట్టినదేమి? మతావేశముచేత యుక్తాయుక్తముల నాలోచింప లేకున్న మానాయనగారి మాటలను బట్టుకొని ప్రాజ్ఞులయిన మీరును విష్ణుభక్తివలదని బోధించుచున్నారేమి? ఇదియేమిపాపము! పండితులయ్యును మీరెంత యజ్ఞానులుగా కనఁబడుచున్నారు! మీరు రాక్షసులకు పురోహితులయినంత మాత్రముచేత తుచ్ఛసంపదనమ్మి ముక్తిప్రదాతయైన పరమేశ్వరుని మఱచిపోవుట మీవంటి వివేకులకు తగునా? ఈవిషయమున మీవివేక మెక్కడకుపోయినది? వంశక్రమాగతమైనవాఁడయి జగద్వ్యాపియైన విష్ణుని కొలువులేక చెడిపోవఁదలచుకొన్న మాతండ్రిగారివలెనే మీరును చెడిపోకుఁడు.

చం—ఔరా! ప్రహ్లాదా! గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన దన్నట్లు నీవేమాకాబుద్ధి చెప్పవచ్చినావా? ఓరీ! ప్రౌఢుఁడా! మొన్న పుట్టినవాఁడవు. నీవు మాకే వేదాంతవాక్యము లుపదేశింపఁబోయెదవు. చాలుచాలు ఇంతటితో నీచపువు చాలించి మేము చెప్పిన నీతిశాస్త్రములు చింతనము చేయుచుండుము. మేమింకలో భోజనముచేసి మరల

వచ్చెదము. కాఁజెడ్డఁకోతి వనమెల్ల జెఱచినదన్నట్లునీవు చెడ్డదిగాక బుద్ధిమంతులయిన యీ రాక్షసబాలకుల మతులుకూడ చెడఁగొట్టు చున్నావు. వీనికి నీగాలిసోఁకి విష్ణునిమీఁదికిమనసుపోవుచున్నట్టున్నది.

(అని వెళ్ళుచున్నాఁడు.)

ప్రహ్లా—ఓత్రిలోచనా! మన గురువులిప్పుడు మధ్యాహ్నిక కర్మానుష్ఠానము నిమిత్తము గృహమునకు విజయముచేసినారు. వీరెంత సేపు చెప్పినను ధనార్జనమునకును తుచ్ఛసుఖములకును తగిన మార్గములను చెప్పుదురే కాని శాశ్వతసుఖమునకనుకూలమయినపరమార్థమును లేశమును బోధింపరు. నిన్న నీవును కాలనాభుఁడును చేరి పరమేశ్వరుని గురించియు నిత్యసుఖమును గూర్చియు నన్ను కొన్ని ప్రశ్నలు వేసినారే. ఇప్పుడుత్తరము చెప్పెదము వినియెదరా?

త్రిలో—ఓరాజకుమారా! సంతోషపూర్వకముగా వినియెదను. మీయుపదేశమును వినుటకునిమిత్తమేయింతవఱకునుమనగురువు లెప్పుడు పోయెదరాయని తొందరపడుచుంటిమి. వారిప్పుడు లేరుగనుక శీఘ్రముగా సెలవిండు. ఇంతకంటె మనకుమంచిసమయముదొరకదు.

కాల—ఓమహారాజపుత్రా! నిన్న తమరు విష్ణుపదమున కర్థము సెలవిచ్చెదమని చెప్పినారు. ఇంతలో గురువుగారు వచ్చుట చేత చెప్పలేదు. ఇప్పుడు సెలవిచ్చెదరా?

ప్రహ్లా—అవశ్యముగా చెప్పెదను. విష్ణువనఁగా 'సర్వవ్యాపి' అని యర్థము. సమస్తలోకములను సృజించి దయతో కాపాడుచు మన లోపలను వెలుపలను సమస్తలోకములయందును వానిపయిని అంతటను వ్యాపించి నిండియున్న భగవంతునకు విష్ణువనిపేరు. అతఁడు రూపములేనివాఁడు; ఆద్యంతములేనివాఁడు; నిత్యుఁడు; సర్వవ్యాపి; సర్వజ్ఞుఁడు; సర్వశక్తుఁడు; సత్యజ్ఞానానందస్వరూపుఁడు; దయామ

యుఁడు; పరిశుద్ధుఁడు; దోషరహితుఁడు; సమస్తకళ్యాణగుణ పరిపూర్ణుఁడు; మోక్షప్రదాత.

కాల—మాటిమాటికి మీరువిష్ణుభక్తిని బోధించుచుందురే. ఆభక్తివలన ప్రయోజనమేమి?

ప్రస్లో—మనకు సమస్తప్రయోజనములును సమస్త సుఖములును భగవద్భక్తి వలననే కలుగును. అట్టిభక్తి లేకపోయినయెడ మనుష్యుఁడెప్పుడును నిజమైనసుఖమును పొందనేరఁడు. మనముసమస్తవస్తుప్రదాతయైన పరమేశ్వరునే నమ్ముకొనియుండి ఆయనయాజ్ఞలను సదా చెల్లించుచు, ఆయన భక్తులయెడలను ఆయన ప్రేమించుసమస్త భూతకోటుల యెడలను ప్రేమగలవారమయి, మనముచేసెడిసమస్త కార్యములనుభగవత్ప్రీతికయి చేయుచు, ఆయనపాదారవిందధ్యానము విడువక యుక్తముగాప్రవర్తించుచున్నపక్షమున, భగవదనుగ్రహము వలన మనకు నిత్యానంద పదవి దొరకును. లోకములో సమస్తజీవులును కోరునది ఆనందమేకదా! అందఱును సుఖమునేపొందవలెనని కోరుచున్నను, నిజముగా సుఖము పొందువారు కొందఱేయుందురు.

కాల—ఎందుచేత?

ప్రహ్లా—ఎందుచేతనా? నిర్మలాంతఃకరణముతో భక్తజనానంద సంధాయకుఁడయిన పరమ విష్ణుని త్రికరణశుద్ధిగానమ్మి కొలువకపోవుటచేత హృదయమునందు నిశ్చలమయిన భక్తిలేక, ఆయనను నోటితో స్మరించినంత మాత్రముచేత ఫలములేదు; ఆయన సృష్టించి రక్షించుచున్న భూతకోటియందు దయగలిగి సత్యశౌచ పరోపకారాదులు విడువక, మాటలచేతనేగాక కార్యములచేతఁ గూడ భగవదాజ్ఞలను చెల్లించనిపక్షమున బాహ్యవేషములన్నియు నిరర్థకములు. సత్య శమ దమ దయా దాక్షిణ్యాదులు లేనియెడల, శరీరమున ధరించిన తులసిపూసలు మొదలయినవి మోతచేటుగాని

మోక్షదాయకములు కావు. నిత్యమయిన సౌఖ్యానందములను పొందు టకై నిష్కళంకమయిన భక్తిగలిగి వాక్కుచేతను మనస్సుచేతను కార్యముచేతను భగవత్ప్రీతికరముగా నడుచుకొనవలెను. భూమి మీఁద మన దేహములు నిత్యములుకావు. అవిక్షణభంగురములు. ఉన్నట్టుండి మనమెప్పుడో యీ దేహములను విడువవలసినవారమగు దుము. మనకన్నుల యెదురనే మనతోడివారలెంతమంది కాలము చేసినవారుకారు? దేహము లనిత్యములగుటచేత దేహముతో సం బంధించిన విషయసుఖములును నిమిషభంగురములయి యుండును. కాబట్టి ప్రత్యేకముగా విషయసుఖముల నిమిత్తమే పాటుపడువారి కెప్పుడును పూర్ణసుఖము కలుగదు. ఈయింద్రియసుఖములు మృగ ములకును మనకును సామాన్యములే. అట్టితుచ్ఛసుఖముల నిమిత్తమే మనము కాలము గడిపినయెడల మృగాదులకంటె మనకేమి యాధి క్యము రాఁగలదు? అదిగాక ఆహారస్త్రీసంభోగాదులయందు మృగా దులకు లేనికష్టములును రోగాదులును మనకెక్కువగా నుండుటచేత, పరమార్థచింతలేక కేవల విషయసుఖాసక్తులయిన వారిబ్రతుకు మృగాదుల జీవనముకంటెను నికృష్టమయినదని చెప్పవచ్చును. ప్రపంచములోని సృష్టికోటిలో మానుషజన్మ ముత్తమమయినది. మనశ్రేష్ఠత యుక్తాయుక్తజ్ఞానమునలనను, ధర్మచింతవలనను, పరోపకార శీలవలనను, భక్తికైంకర్యములవలనను కలిగినది కాబట్టి మనమా శ్రేష్ఠత్వమును నిలుపుకోఁదలఁచినపక్షమున, అల్ప ములైన శరీరసుఖములకంటె నిత్యమయిన మనయాత్మ సుఖమును ప్రధానముగా చూచుకొనుచు, భూతదయ కలవారమయి ధర్మమా ర్గము తప్పక సంచరించుచు, భక్తజనప్రమోద సంధాయకుఁడయిన యాపరమపురుషుని యనుగ్రహమునకు పాత్రులము కావలెను.

కాల—ఆపరమపురుషుఁడయిన విష్ణునకు మనమీఁద దయ యెట్లు వచ్చును? అయిన విషయమున మనమేవిధముగా నడుచుకొన

వలయును? ఏవ్రతములు నేయవలెను? మన మనుసరింపవలసిన భక్తి మార్గము లేవి? నాయందనుగ్రహించి చెప్పుడు.

ప్రజ్ఞ—ఆ పురుషోత్తమునియందు భక్తి గలిగి ఆయనయాజ్ఞలను మీఱకవర్తించుటవలనను, స్వార్థపరత్వమునువిడిచిభగవత్సృష్టిలోని సమస్తజీవులయందును దయగలిగి పరార్థశీలురమగుటవలనను, భగవత్కటాక్షము మామీఁద వచ్చును. లోకములో నెలియనివారనేకులు తమప్రవర్తన మెట్లున్నను, భగవన్నామోచ్చారణము వలనను పూజలవలనను తాముపాపవిముక్తులై మోక్షమును పొందుదుమని భ్రమించుచున్నారు. అట్టివారెండమావులయందుదాహముతీర్చుకొన ప్రయత్నించువారు. తన్ను ముఖస్తుతిచేయుచున్నంతమాత్రము చేత, సదాతనయాజ్ఞల నుల్లంఘించి తనకు ప్రేమాస్పదులైనయితర పుత్రాదులయెడ కల్లలాడి వారిని మోసముచేసి బాధించుచుండు కొమారునియందు న్యాయబుద్ధిగల తండ్రి కెన్నఁడైనదయకలుగునా? అప్రకారముగానే న్యాయస్వరూపుఁడయిన యీలోకపితకును తన్ను స్తుతించినంత మాత్రముచేత తనకు ప్రేమాస్పదమయిన యీలోక కుటుంబమునెడల న్యాయముగా ప్రవర్తింపనివానియం దనుగ్రహము పుట్టదు. తనకార్యములచేత మనస్సునకు నొప్పికలుగఁజేయుచు నోటిచేత తండ్రివిషయమున స్తుతిపాఠముచేయుట పితృభక్తియెట్లుకాదో, అట్లే భగవంతుని కప్రియమగునట్లుగా లోకవిషయమున న్యాయము తప్పి ప్రవర్తించుచు భగవన్నామస్మరణము చేయుటయు భగవద్భక్తి కానేరదు. కాఁబట్టి నీతిమార్గమునసంచరించుచు త్రికరణశుద్ధిగా పరమేశ్వరుని సేవించుటయే విష్ణుభక్తియగును. అట్టిభక్తిచేతనే సమస్తకళ్యాణగుణములును కలుగును. అట్టిసద్భక్తి మనకు బాల్యమునందే పట్టుపడవలెనుగాని యేండ్లుముదిరి రాగద్వేషాదులచేత మనస్సుచెడి జాతిమతాదుల యందలి దురభిమానములు బలపడిన తరువాత పట్టు

పమటకష్టము. అట్టిభక్తి కైంకర్యాదులచేతసంపాదింపవలసిన భగవదనుగ్రహమును బొందుటకై వ్రతములు, క్రతువులు, జపములు, ఉపవాసములు, ఉప్పిడులు, ఏమియునక్కరలేదు. మనలను సృజించి క్షేమించుచుండుటచేత పరమప్రేమమును, మనసుఖభోగములకువలసిన సమస్తమును ప్రసాదించియుండుటచేతకృతజ్ఞతను, మనలనుపాలించు ప్రభువగుటచేత పరమవిధేయతను, న్యాయస్వరూపుడగుటచేత పరమవిశ్వాసమును, సర్వశక్తుఁడై సమస్తకళ్యాణగుణ పరిపూర్ణుఁడగుటచేత పరమగౌరవమును, భగవంతునియెడల కనఁబఱుచుచు మనయాత్మనే యాశ్వరార్పణముచేసి మనకాయన కీడో మేలో యేది యనుగ్రహించిన అదే పరమానుగ్రహముగా భావించుకొనుచు ఎన్ని కష్టములువచ్చినను భగవత్ప్రీతికరమయినకృత్యమునువిడువక పరమసంతోషముతో చేయుచుండవలెను. దేహప్రాణములను భగవదర్పితముచేసితృప్తివహించునంతటిపరమభక్తి కలిగినప్పుడే మనకు బ్రహ్మానందము కలిగి, మనము శాశ్వతమోక్షపదవి నొందుదుము. నిశ్చలమైన విష్ణుభక్తియొక్కటి కుదిరెనా, సమస్తసద్గుణములునుతమంతనే వచ్చిచేరును. భగవంతునియెడలహృదయపూర్వకమైన భక్తికలిగిన యెడల, నీతిమార్గముతొలగి సంచరించుటయే యసాధ్యము. కాలము మనదికాదుగనుక, యౌవనగర్వముచేతకన్నుగానక కామాంధులమై సంచరింపకముందే, ముదిమివచ్చిరోగాదులాశ్రయించి కఫశ్లేష్మాదులచేత దేహస్మృతి తప్పకముందే, మనమట్టి సంపూర్ణభక్తిని పొంది మోక్షసామ్రాజ్యమును చూరగొనుటకై ప్రయత్నింపవలెను.

త్రిలో—ఓప్రహ్లాదా! నీయొక్క వచనామృతముచేత మేము మహానందపదవిని పొందినారము. ఇంత చిన్నతనములోనీకిట్టి దివ్యబోధ యెట్లుకలిగినదాయని మా కాశ్చర్యమగుచున్నది. ఇఁకముందు మేమంతరమును ఛాందసవిషయములనుబోధించెడి గురువులనువిడచి

నిన్నీమాకు గురువునుగాఁ జేసికొనెదము. మాకుమరమగురుఁడవయి జ్ఞానోపదేశముచేసి మాకెన్నడును తఱుగని యానంద పదవిని సమకూర్పుము.

ప్రహ్లా—నేను మాతల్లితోఁగూడ నారదాశ్రమమున నున్న కాలములో నారదమహాముని నాకీజ్ఞానోపదేశముచేసినాఁడు. ఆయన దివ్యోపదేశము నాలేఁతమనస్సులో శిలాక్షరమువలెనాటుకొని,అప్పటి నుండియు నామనస్సు భగవంతునియందు లగ్నమయిపోయినది. నా మనస్సు బ్రహ్మానందపరవశమయియుండుటచేత నాదేహమునకువేయి బాధలుచేసినను నామనస్సునకునాటవు. నాకెక్కడఁజూచినను పరబ్రహ్మము నిండియుండినట్లు తోఁచి పరమానందము కలుగుచున్నది. ఆహా! ఏమినాభాగ్యము!

కాల—ఓప్రహ్లాదా! మన కులాగతమయిన శివమతమునందు నీకాదర మెందుచేత తప్పిపోయినదో వినవలెనని మాకు వేడుక కలుగుచున్నది. మాయందనుగ్రహించి చెప్పెదవా?

ప్రహ్లా—అప్పుడే నారదుఁడు మనవారారాధించు లింగము యొక్కయు పానవట్టముయొక్కయు స్వరూపమును నాకు వివరించి చెప్పినాఁడు. వానిస్వరూపమిప్పుడు మీవద్ద వివరించి చెప్పఁగూడదు. ఆరెండును వేనినుచ్చరించిన మనవారిప్పుడు బండబూతులనిభావించెదరో యట్టిపురుషునియొక్కయు స్త్రీయొక్కయు రహస్యావయవములు సుమా. ఆసంగతి విన్నతోడనే నామనస్సు లింగార్చనము నుండివిముఖమయినది. అదె మనగురువులు వచ్చుచున్నారు.

[అప్పుడు చండామార్కులు ప్రవేశించుచున్నారు.]

చండా—ఓరీతిరిలోచనా! కాలనాభా! మీపాఠములు చదివినారా?

త్రిలో — ఇఁక మీపాఠములు మాకక్కర లేదు. మీరొక్క-నాఁడును మాకు మంచిచదువు చెప్పలేదు. ఇంతవరకు ప్రహ్లాదుఁడు మాకు విష్ణుభక్తిని నేర్పినాఁడు మాకదే కావలెను.

కాల — మేమిఁక మీచదువు వినము. మీచదువు మీవద్దనే యుంచుకొనుఁడు. మాకక్కర లేదు. మాకీప్రహ్లాదుఁడే గురువు.

చండా — ఓరి ప్రహ్లాదా! ఎంతపని చేసితివిరా? ఇప్పుడు నా ప్రియశిష్యులుకూడా నామాటవినకుండ చేసితావుగా! నీవు చేసిన దుర్నయమిప్పుడేపోయి మీతండ్రిగారితో చెప్పి నిన్నేమి చేయించెదనో నిమిష మోపికపెట్టు. (అని కోపముతో పోఁగా, అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## ౨. రంగము — హిరణ్యకశిపుని సభాభవనము.

---

[హిరణ్యకశిపుఁడును, విప్రజిత్తియు, చండామార్కులును, అలంబుసుఁడును, దుర్ముఖుఁడును ప్రవేశించుచున్నారు.]

హిర — (కోపముతో) ఏమేమీ? రాక్షసబాలకులుకూడ ప్రహ్లాదునిమతమే యనుసరించుచున్నారుగా! గురుపుత్రా! ఇంకొకసారిచెప్పు. వీఁడు నాకు శత్రుఁడు కాని పుత్రుఁడు కాఁడు. శుద్ధమైన యీ రాక్షసవంశమను చందనవనములో వీఁడు విషవృక్షమువలె పుట్టినాఁడు. దేహమున దుర్మాంసమువలె పుట్టిన యీకులద్రోహిని ఖండించి రాక్షసకులము నిర్దోషముగా చేయవలెను.

చండా — ఈచెడుగును కొడుకనిచూడక చంపించవలసినదే. ఇప్పుడుగోరంతకు వచ్చినది. రేపు కొండంతకు రాకమానదు. నేడు రాక్షసబాలకు లయినారు. రేపురాక్షసవృద్ధులే విష్ణుభక్తులగుదురు.

ఇఁక నుపేక్ష చేయుక రోగమింకనుముదిరి యసాధ్యము కాకమును పే తగిన చికిత్స చేయవలెను.

హిర — ఈ పాపాత్ముని నా కేవిధముగా రూపుమాపుటకును ఉపాయము తోఁచకున్నది. వీని ప్రభావ మేమో కాని వీఁడేవిధమున చావకున్నాఁడు. మందో మంత్రమో వీనివద్ద నేమున్నదో తెలియరాకున్నది. వీనిని నేనీవరకు ఏనుగులచేత త్రొక్కించినాను; శూలములతో పొడిపించినాను; సముద్రములో ముంచినాను; పర్వతముల మీఁదనుండి త్రోయించినాను; ఇటువంటి మారణోపాయములను పాతికెన్నిటినో చేయించినాను. దేనివలనను కార్యము లేకపోయినది. ఇంకొకవిచిత్రము చూచినారా! నేనెన్నిబాధలు పెట్టించినను నేను చేసిన నిగ్రహములను పరులతో చెప్పకొని యొక్కనాఁడును నన్నునిందింపఁడు. కోపమైనను చూపఁడు. వీనిశాంతతకుమాత్రము మనమద్భుత పడవలసినదే.

చండ — ఒక్కవిష్ణుభక్తి తప్ప నీకొమారునియొద్ద వెదకినను మఱియొక దుర్గుణ మగపడదు. ప్రాణాంతమువచ్చినను అసత్యమాడఁడు; తనవిరోధులమీఁదనయినను ప్రేమ చూపఁడు; తన్నునొప్పించువారిపైనైనను పరుషవాక్యము నోటరానీయఁడు; తన్ను మేమెన్ని విధముల శిక్షించుచున్నను, మాయెడల వినయభయభక్తులు తక్కువ కానీయఁడు. ఇంతమంచివానికీపాడువిష్ణుభక్తి యెట్లు పుట్టినదాయని చింతపడుచున్నాము.

హిర — వాని నింకొకసారి యీసభకుపిలిపించి, విష్ణుభక్తి విడుచునోలేదో యిదే కడపటిసారి ఖండితముగా నడిగి ఇంకను తన బుద్ధి విడువకున్న పక్షమున వానినేవిధముననయినను సంహరింతము.

చండ — వీనిని సంహరించుటకు నాకిప్పుడు రెండుపాయములు తోఁచుచున్నవి. మనయువచ్చునప్పుడు వాకిటనిలచియున్న పాముల

వాండ్రవద్ద గ్రొత్తగాపట్టిన తక్షకజాతి క్రూరసర్పమున్నదట. దాని చేత కఱిపించినయెడల బాలుఁడు తప్పక ప్రాణములు విడుచును. అప్పటికిని చావక బ్రతికినపక్షమున మే మభిచారహోమము చేసి, అగ్నికుండమునుండి కృత్తియను శక్తిని పుట్టించి దానిచేత నిమిష ములో చంపించెదము.

హిర—అట్లుచేయుఁడము. మనస్సులో సహజమయిన పుత్ర వాత్సల్యమపుడపుడుపుట్టి నన్ను బాధించుచున్నను, మతాభిమానము చేత మోహపాశమును కోసివేసి దానిని చంపుటకే యిప్పుడు నిశ్చ యము చేసికొన్నాను. అలంబసా! సంగీతశాలలో లీలావతీదేవి కొమారునికి బుద్ధిచెప్పుచు కూర్చుండియున్నది. నీవక్కడకుపోయి మాసెలవైనదని ప్రహ్లాదునిక్కడకు తీసికొనిరమ్ము.

అలం—చిత్తము మహాప్రభూ! (అని నాలుగడుగులు నడిచి) దేవా! అదిగో! కుమారుని వెంటఁబెట్టుకొని దేవిగారేయిక్కడకు వచ్చుచున్నారు.

(అప్పుడు ప్రహ్లాదుని ముందుంచుకొని లీలావతి ప్రవేశించుచున్నది.)

హిర—దేవీ! రమ్ము కూరుచుండుము. (అనిపీఠమును చూపు చున్నాఁడు)

లీలా—పుత్రకా! ఇఁకనైనను నామనస్సును మఱింత ఖేద పెట్టక పితండ్రిగారు పొమ్మన్న మంచిదారిని పొమ్ము.

ప్రహ్లా—అమ్మా! నేనెప్పుడును మంచిదారినే పోయెదను. నానిమిత్తమై నీవు ఖేదపడకుము—ఓతండ్రీ! నీకు నమస్కారము— ఓగురులారా! మీకు నమస్కరించుచున్నాను. (అనిచేతులుజోడించు చున్నాఁడు)

హిర—ఇప్పుడు నిన్ను నేనేమని యాశీర్వదింపను? ఎందు కయినను మంచిది. పుత్రకా! సుఖశాంతిరస్తు!

చండా—మేమును రాజుగారి శ్రోవనే త్రొక్కెదము. సుఖ శాంతిరస్తు.

హిర—కుమారా! ఇంతసేపు కష్టపడి నీతల్లి చేసిన హితబోధ చేతనైనను నీమనసు తిరిగినదా? ఇంకను మునుపటివలె నేయున్నదా?

ప్రహ్లా—నామనస్సెప్పుడును శ్రీమహావిష్ణుని పాదారవింద ధ్యానమునుండి మరలదు. ఓతండ్రీ! నీకు సర్వాంతర్యామి యయిన విష్ణుదేవునిమీఁద వృథా ద్వేషమెందుకు? నీకువరములిచ్చి నిన్నింత వానిగాజేసిన బ్రహ్మదేవునకు అతఁడు జనకుడుగదా! నీవంటిఘనుఁడు సాత్వికుఁడయి విష్ణునికొలవక తామసుఁడయి చెడతగునా! ఆమహాను భావున కొకరిమీఁద ద్వేషమున్నదా? అతఁడు భక్తవత్సలుడు. సత్ప్రవర్తనము కలిగి మనోవాక్కాయ కర్మలచేత సత్యము తప్పక స్వార్థపరులుకాని భక్తాగ్రేసరుల నందఱను ఆయన మన్నించును. ఆయన మన్ననగలవారి కెన్నఁడును తఱుగని మోక్షసామ్రాజ్యము లభించును. ఎంతకాలమున్నను నీకీ రాక్షసరాజ్యపద శాశ్వతము కాదు గనుక చిన్నవాఁడనని నాప్రార్థనదీసి వేయక నీవాపరమాత్ముఁడయిన విష్ణుని శరణము వేఁడుము.

హిర—ఓరి దుర్మతీ! నీకింకను శాపరమడగలేదా? నీకంత కంతకు వెఱ్ఱి ముదురుచున్నది. పఱగడపందియైవచ్చి నీపినతండ్రిని చంపినాఁడన్న యభిమానమయినను లేక సిగ్గువిడిచి నీవావిష్ణునిబంటువలె సేవించుటయే కాక, నన్నుకూడ ఆపాపకర్ముని శరణు వేఁడుమనుచున్నావుగా! ఎంతమాటాడితివి?

ప్రహ్లా—నాపినతండ్రినిఅతఁడుచేసిన పాపమేవరాహరూపమున వచ్చి చంపినదికాని విష్ణుడు చంపలేదు. ఆ మహామహులకు రాగద్వేషము లెక్కడివి? ఓతండ్రీ! విష్ణుదేవునకు దేవతలు చుట్టములయి రాక్షసులు కాకపోయినారా?

హిర—ఓరీ! కూళబాలకా! ఎంత ప్రేలెదవురా? నీ నాలుక వ్రయ్యలుగాను! నీదురుక్తులు చాలించుము. (అని కోపముతో లేచివచ్చి తన్నుచున్నాఁడు.)

ప్రహ్లా—శ్రీహరీ!

హిర—(కన్నులెఱ్ఱఁజేసి) వీఁడు హరిగిరియని యింకను మొఱుగుచున్నాఁడు. అలంబసా! నీవుపోయి వాకిటనిలుచున్న పాములవాండ్రను లోపలికి తీసికొనిరమ్ము. ఆ కాలసర్పము ఘోరవిషజ్వాలలతో కఱచినప్పుడు విష్ణుని ప్రభావమును వీనిభక్తియు నేమగునో చూతము.

అలం—చిత్తము. తీసికొనివచ్చెదను. (అనిపోవుచున్నాఁడు.)

లీలా—(దీనవాక్యములతో) ఓకుమారా! యమకింకరులవలె రాక్షసకింకరులు నీమృదుశరీరమును జేరి పాములచేత కఱిపించి బాధించుచుండఁగా చూచి నేనెట్లు సహింపఁగలుగుదునురా? నిన్ను గట్టిగా పట్టుకొని బతిమాలుకొనెదను. నాతండ్రీ! నీతల్లి ప్రార్థనను విని యింకనయినను విష్ణుభక్తిని విడిచి నీతండ్రిగారి కోరిన ప్రకారము చేయుము. నీవెప్పుడును నామాట తీసివేయువాఁడవు కావు. ఈ యొక్క విషయములో మాత్రమింత పట్టుదల పట్టెదవా? నీపంతము చాలును.

ప్రహ్లా—తల్లీ! నీవు మఱియేమి యాజ్ఞాపించినను శిరసావహించి చేసెదనుగాని, నిరంతర పరలోకసుఖమునకు భంగమువచ్చెడి యీ విషయములో మాత్రము మీమాట వినఁజాలను. ఈలోకములో మీరు కలుగఁజేసిన యీదేహమును కావలసినపక్షమున మీకు సమర్పింప సిద్ధముగానున్నాను. దీనిని మీరు మీయిష్టమువచ్చినట్లు చేసికొనుఁడు. ఇఁక ముందు లేక, ఈజన్మమునకు వెనుకను లేక, నడుమకొంత కాలము తల్లిదండ్రులుగా నటించిన మీనిమిత్తమై, ఇప్పుడును వెనుకను ముందును అనంతమయిన సర్వకాలమును తల్లియుదండ్రియు రక్షకుఁ

డును పాపవిమోచకుడును సుఖదాతయు భయత్రాతయు సమస్తము నైన యీజగదీశ్వరుని నేనెట్లు విడువఁగలను? నాఆత్మానందముతో సంబంధింపక భగవదాజ్ఞకు వ్యతిరిక్తముకాని సమస్తవిషయముల యందును నే మీఆజ్ఞను శిరసావహించిచేసి నాదేహసుఖముల నన్నిటిని విడువుమన్నను విడుచుటకు సంసిద్ధుఁడనయియున్నాను.

లీలా — పుత్రకా! నీప్రాంతఫల మిట్లుండఁగా, నేనేమిచేయ గలను? నీవు నాకడుపున బుట్టిన దోషముచేత మనసుపట్టలేక, అఁడ వానిని గనుక దుఃఖపడియెదను. నీవేమో మహావైభవముతో సమస్తసంపదలనుపొంది సుఖించుచుండగా చూచి సంతోషించు భాగ్యము లభించునని యెదురుచూచుచున్న నాకు నీదురవస్థచూచిన మనసెట్లు పుత్రశోకముపాలు గాకుండును?

ప్రహ్లా — అమ్మా! నీవు నానిమిత్తమై చింతఁబొందఁబోకుము. ఆ జగదీశ్వరుఁడు నన్నేమి చేయఁదలఁచుకొనెనో యట్లు కాఁగలదు. నన్నా పద పెట్టుచున్నారని నాయనగారిని మాత్ర మెప్పుడును దూషింపఁబోకుము. నేను నీకు పుట్టనేలేదనుకొని నన్ను మరచిపొమ్ము. అంతఃపురమునకు పొమ్ము.

లీలా — ఓప్రాణనాథా! కన్నకడుపగుటచేత మనసు నిలువక మీకొక్క. చిన్నవిన్నపము చేయుచున్నాను. నేనుమిమ్ము వేఁడుకోరిక యెన్నఁడును కోరినదానను కానుగనుక, యీయొక్క ప్రార్థనమాత్ర మంగీకరించి వీనిని ప్రాణముతో విడిచిపెట్టుఁడు. ప్రాజ్ఞతరానికొడుకు మీఁద మీ కాగ్రహ మెందుకు? ఈసంపదలు లేకపోయినను ప్రాణమున్న పక్షమున వీఁడు బలుసుకూర తినియైనను బ్రతుకఁగలఁడు. క్షమించి విడిచిపెట్టుఁడు. వీనిని మీయొద్దనుంచుకొనుట కిష్టములేని పక్షమునఁ వీని నడవులకయినను పంపివేయుఁడు: లేదా దూరదేశములకయినను పంపివేయుఁడు. (అని కాళ్ళమీఁద పడుచున్నది.)

హిర—ఓప్రాణేశ్వరీ! నీవు మరియేమిచెప్పినను విందునుగాని నేను యీమాటమాత్రము వినను. లెమ్ము పాదములమీఁదనుండి లెమ్ము. (అని లేవనెత్తును) వీఁడు మనకు శత్రుఁడుకాని, పుత్రుఁడు కాఁడు. వీని శిక్షను చూడతగకుపొమ్ము.

అలం—(పాములవానితో ప్రవేశించి) స్వామీ! ఇదిగో! పాములవానిని తీసికొని వచ్చినాను.

లీలా—నేనీ పాపకర్మమును చూడఁజాలను. నాదెప్పుడును దుఃఖపడవలసినబ్రతుకయిపోయినది. అంతఃపురమునకుపోయి, అక్కడనే విలపించెదను. (అని రెండడుగులు నడిచి) నాకు నడువ కాళ్ళు రాకున్నవి. (అని పోవుచున్నది.)

పాము—సామీ! దండాలు.

హిర—ఓరీపాములవాఁడా! నీవద్ద మంచి పాములున్నవటరా?

పాము—యేలినవారి సిత్తంవచ్చిన పాములుండాయిసామీ (పెట్టిమూఁతతీయుచు) యీనాగుపామును నిన్ననే కోటప్పకొండలో పట్టుకున్నాము. దీనివిసం సోకితే యేనుగులు పీనుగులయిపోతాయి సామీ! నాపాములపెట్టెలోదు. నేనబద్దాలాడను మాప్రభో.

హిర—ఓరీ! నీ వెప్పుడయిన నిదర్శనంచూచినావురా?

పాము—నీదరిసినమా? యిదివరకు నేనెప్పుడూ సెయ్యలేదు. ఇదే సెయ్యడం.

హిర—మాదర్శనముకాదు. నిదర్శనము.

పాము—నీదరిశనంరాదు? నిదర్శనమా! అదేంటో నాకు తెలియదు.

హిర—ఓరిభ్రష్టా! నీకు నిదర్శనమన్న మాటే తెలియదురా! నిదర్శనమురా నిదర్శనము.

పాము—నిదర్శనమా? తెలిసింది. తెలిసింది. మేము తిరిగే అడవుల్లో యెక్కడా మాకా మెకం యిదివరకు కళ్ళపడలేదు. బాబూ!

హిర—ఓరిని ర్భాగ్యుడా! అదిమృగముకాదు. నిదర్శన మనగా దృష్టాంతము. ఇప్పుడు తెలిసినదా!

పాము—బాబూ! మీరు బలేబలేమాటలు యేస్తున్నారు. ఇప్పుడునాకు తెలిసింది. దృష్టాంతమంటే నుప్పికాముసుష్టుపాకు. దాని కింత లేసి కాయలుంటవి. (అని వ్రేలితో చూపుచున్నాడు.)

హిర—ఈమూఢుని కేమాటలును తెలియకున్నవి. అలంబసా! మాయభిప్రాయమును నీవు వీనితో విప్పిచెప్పు.

అలం—ఓరీ! "ఈపాము ఏనుగును చంపగా నీవెప్పుడైనను దాఖలాచూచినావా?" అని నిన్ను రాజుగారడుగుచున్నారు.

పాము—డాఖలా? డాఖలా? లచ్చసారులు సూచినాము. బిచ్చపులచ్చలు లచ్చలేంలెక్క? డబ్బయిపదకొండుసార్లు సూశాం. నెల్లాళ్ళకింద వొక్కొక్కకాటేసేటప్పటికి యేనుగులమంద మందంతా చచ్చిపోయింది. వొక్కయేనుగని లెక్కయేంటి? దీన్ని రెణ్నెల్లు కాచి యెరమింగివున్నప్పుడు పట్టుకున్నాము.

హిర—ఓరీ పాములవాడా! ఈపాముచేత బాలకుని కరపించు—ఓరీ! అలంబసా! దుర్ముఖా! ఈబాలకుని మీరిద్దరును కదలకుండగట్టిగాబట్టుకొనుడు. ఓరీ! ప్రహ్లాదా! నీవికనైన నను విష్ణుభక్తిని మానెదవా? ఈవిషసర్పముచేత కరిపింపుచున్నావా?

ప్రహ్లా—ఈవిషసర్పముకంటె క్రూరములయిన పాపసర్పముల నుండి సహితము కాపాడి నాకాత్మరక్షణము దయచేయగలిగినలోకేశ్వరుడు పెనుప్రాపయియుండగా, దేహమాత్రమును బాధించెడి

యీపాములు నన్నేమిచేయఁ గలవు ? మీచిత్తము వచ్చినట్లు చేయింపుఁడు.

హిర—(పండ్లుపటపటకొఱికి) ఓరి మొండీ! ఏమి నీకండ్ల క్రొవ్వు!—దుర్ముఖా! మీరింకను పట్టుకోరేమి? ఓపాములవాఁడా! ఈపాముచేత కరిపించుము.

పాము—(చిత్తం అని, అలంబస దుర్ముఖులు పట్టుకోనఁగా పాముచేత కరపించుచున్నాఁడు.)

అలం—పాముచచ్చినది. ప్రహ్లాదునకువిషమెక్కలేదు. పాము కఱవనప్పటివలెనే నిర్భయముగా నున్నాఁడు.

హిర—ఓచండామార్కులారా! మీరు లోపలికిపోయి, అభిచార హోమముచేసి వేగిరము శక్తిని పుట్టింపుఁడు.

చండా—నిమిషములో మేము శక్తినిపుట్టించి తీసికొని వచ్చెదము. అప్పుడుగానిప్రహ్లాదుని పొగరడఁగదు. (అని పోవుచున్నాఁడు)

హిర—అలంబసా! ప్రహ్లాదుఁడు పాముకరచినను చావ లేదుగా! ఏమి యీఆశ్చర్యము!

అలం—ప్రహ్లాదుఁడుచావలేదు పామేచచ్చినది. ఈపాములఁ వాఁడొకవేళ చచ్చినపామునే తెచ్చినాఁడేమో! అవునవును. వీఁడునాగ స్వరముచేతనుమంత్రశక్తిచేతనుపాముకదలికరచివదేకాని, నిజముగా వీఁడు ప్రాణములేని పామే తెచ్చినాఁడు. వీనిని శిక్షించవలెను.

పాము—బాబూ! ముసలాణ్ని, నేను సిచ్చలకు తాళలేను. నావరాలకెత్తుకెత్తుపాము నిముసంలోసచ్చింది. అదిసంపినా చచ్చేది కాదు. యేంసేతునుసామీ! నేను తెచ్చింది సచ్చినపాం కాదు. రచ్చించండి. వాకిట్లో ఈమారాజులందరూ సూశారు.

దుర్ము—నీది చచ్చినపాము కాదా? అలాగయినపక్షమున, ఈ పాము చచ్చుటకు ప్రహ్లాదుని దేహములోనే విషమున్నది. ఖలులకు

నిలువెల్లను విషమేఅని పెద్దలు చెప్పుదురు. వెనుక రాజుగారు ఖలుఁడయిన యీ బాలకుని శిక్షించుచున్నప్పుడు నేనెఱుఁగక కలవినాను. నాకెక్కడ విషమెక్కునో? ఏమిబుద్ధి? ఏమిచేయుదును?

అలం—మానిసికాటునకు మందులేదు. నీవంటివాఁడొకఁడు రాజుగారి చెవి కొఱికినపక్షమున, నావంటివారు నూరుగురు చత్తురు.

దుర్మ్—అయ్యో! నరవిషమునకు మందుమాత్రమే కాక మంత్రమును లేదటు! నేను మీఁదటికి పెండ్లి చేసుకోఁబోవు భార్యకు దిక్కులేకుండ చచ్చిపోదును కాఁబోలు!

అలం—దుర్ముఖా! విచారపడఁబోకు. విషమెక్కెడుపక్షమున, ఎనిమిదిజాములలోనే యెక్కును నీవు ప్రహ్లాదుని కరిచి బహు దినము లయినది. గనుక నీవిప్పుడు చావవు. బెంగపెట్టుకొనకు. ప్రహ్లాదుఁడు విషముగలవాఁడు కాఁడు.

దుర్మ్—నేనెట్లు బెంగపెట్టుకొనకుండఁగలను! ఈపాములవాఁడు చచ్చినపాము కాదని చెప్పినప్పటినుండియు నాకింకొకభయము కలుగుచున్నది. ఈనుసలిగాడిదకొడుకు త్రాగివచ్చి ప్రహ్లాదుని కాలను కొసి నాకాలు కరిపించినాఁడేమో! అవును. నన్నే కరిపించినాఁడు. నా కాలు తిమ్మిరెక్కుచున్నది. నా దేహము వడకెత్తుచున్నది. అలంబనా! వేపాకు తెచ్చిపెట్టు తియ్యగా నుండునేమో చూచెదను. విషవైద్యునికొఱకు పరుగెత్తు. దిక్కుమాలినవానికి నాకు విషవైద్యము చేయించు ప్రాణదానము చేసినపక్షమున నీకు బహుపుణ్యము వచ్చును. పరుగెత్తు పరుగెత్తు. (అని కూలబడుచున్నాఁడు)

అలం—నీకాలికి కాటులేదు. భయపడకు.

దుర్మ్—నా కాలిని కాటులేదా? నీతల్లికడుపుచల్లగా; నీఅత్త కడుపు చల్లగా వర్ధిల్లుము. ఈశుభవార్త చెప్పి నాప్రాణములు నీవు నిలువఁబెట్టినావు. నాకన్నియు గండములేవచ్చి నామంచితనముచేత తప్పిపోవుచున్నవి. నేనదృష్టవంతుఁడను గనుక, నాకు కష్టములు కొండలలాగునవచ్చి మంచులాగున విడిపోవుచున్నవి.

అలం—ఓ మహారాజా! నాకు భయమగుచున్నది. మన చండామార్కులు నెత్తియెత్తినవానివలె కేకలు వేయుచు పరుగెత్తుకొని వచ్చుచున్నారు. ఇంత వేగముగా పిచ్చియెత్తుట కతనిని వెఱ్ఱికుక్క కఱచినదేమో! భూతము సోకింది. నా దేహము కంపమెత్తుచున్నది. అదిగో భూతము. భూతము. (అని పారిపోవుచున్నాఁడు)

మర్కు—అయ్యో! వెఱ్ఱికుక్క కాటుకు మందులేదు. ఏమి చేయుదును? ఎందుచొత్తును? (అని లేచిపోవుచున్నాఁడు)

చండా—బ్రాహ్మణుని చంపను చంపను. (అని పరుగెత్తుకొని వచ్చి ప్రవేశించుచున్నాఁడు)

విప్ర—స్వామీ! వెఱపింపఁబోయి మీరే వెఱచివచ్చిరా రేమయా? తొందరపడక సంగతి చెప్పుఁడు.

శక్తి—ఓరీ! పాపాత్మా! నన్ను విష్ణుభక్తునిమీఁద కెందుకు పంపినావురా? నాడు నిన్నిప్పుడే పట్టి మ్రింగెదను.

(ఇట్లు కేకలు వేయుచు శక్తి ప్రవేశించుచున్నది)

హిర—(నిశ్చేష్టుడై సింహాసనముమీఁద కూరుచున్నాఁడు)

చండ—ఈశక్తి నా వెంటఁబడినది. విప్రశక్తి పీఠమునుండి కదలఁడు. మహారాజుగారు నిశ్చేష్టితులై యున్నారు. నీవే దిక్కు ప్రహ్లాదా! దిక్కుమాలిన బ్రాహ్మణుని నన్ను రక్షింపుము. (అని ప్రహ్లాదుని వెనుకకు పోవుచున్నాఁడు)

విప్ర—భయభ్రాంతులయినవారికి మతిపోవునుగదా! ఈ బ్రాహ్మణుఁడు మావంటి మహావీరులనందరిని విడిచి బాలుఁడయిన ప్రహ్లాదుని మఱుఁగు చొచ్చుచున్నాఁడు.

శక్తి—ఏఁడీ? ఏఁడీ? బ్రాహ్మణుఁడు. వస్తాక్కు నన్ను హరిభక్తునిమీఁద ప్రయోగించినందుకు, వ్యాఘ్రము మేకపిల్లను నమలినట్లు తల నాపండ్లసందున పెట్టి పటపట నమలెదను.

ప్రహ్లా—నేను నిజమయిన విష్ణుభక్తుఁడనయిన పక్షమున, ఈ బ్రాహ్మణుఁడు రక్షింపఁబడుఁగాక!

శక్తి—ఈపరమభాగవతోత్తమునిదయవల్ల బ్రతికిపోయినావు. నిన్నువిడిచితిని. పో. (అని పోవుచున్నది)

హిర—(కన్నులు విప్పిచూచి) ఈకలకలమేమి?

విప్ర—శక్తివచ్చి ప్రహ్లాదుని చంపకయే పాఱిపోయినది. అమ్మవారినిచేయఁబోగా రాకాసి అయినట్లు గురుపుత్రులనే బ్రింగ బయలుదేఱినది.

హిర—అయ్యో? ఈసంక్షోభములో తప్పించుకొని శక్తిపాఱిపోయినదిగదా! ఆహా! ఎంతప్రమాదమునుసంభవించినది! ఓరీప్రహ్లాదా! ఓరిమూర్ఖ! నీవింకను విష్ణువు విష్ణువనియే పలవించుచున్నావు. నీవిష్ణువెక్కడ నున్నాడురా!

ప్రహ్లా—గీ. ఎచ్చటనున్నాఁడు శ్రీవిష్ణుఁడిప్పుడంచు,
అసురనాయకా! నన్నునీవడుగనేల?
అఖిలవిష్టపాంతర్యామియైనయతఁడు
లేనిచోటేది గలదయ్య పూని వెదక ?

హిర—(తలతడవుకొనుచు పరధ్యానముతో నున్నాఁడు.)

విప్ర—ఓమహారాజా! మీరాలాగున తల తడవుకొనుచున్నారేమి ?

హిర—ఓయీ! విప్రజిత్తి! ఇప్పుడుచూచుచుండఁగానేకన్నులుమూతపడి నాకుపాముకల యొకటివచ్చినది. నాకు తలలేనట్లు దుస్వప్నమయినది. అందుచేత నామనసిప్పుడు కలఁగియున్నది. ఓరీప్రహ్లాదా! విష్ణుఁడిప్పుడెక్కడ నున్నాడన్నావు?

ప్రహ్లా—గీ. ఎచటనున్నాఁడు శ్రీవిష్ణుఁడిప్పుడంచు,
అసురనాయక! నన్నునీవడుగనేల ?
అఖిలవిష్టపాంతర్యామియైన యతఁడు
లేనిచోటేది గలదయ్య పూని వెదక ?

అన్నాను.

హిర—విష్ణుఁడంతటను ఉన్నాఁడుగా? ఏఁడి యీస్తంభమున నుండుమను. (అనిలేచి చేతిఖడ్గముతో స్తంభమునుకొట్టి) నీవిప్పుడీ స్తంభమున విష్ణుని చూపకపోతివేని ఈఖడ్గముతోనే నీతల సహస్రఖిన్నములు చేసెదను.

ప్రహ్లా—గీ. అఖిలజగముల నిండియున్నట్టి ఘనుండు
స్తంభమున నుండఁడే సభాస్థలినినిపుడు?
దనుజనాయక! యీ స్తంభముననుగూడ
నిశ్చయంబుగ నున్నాఁడు నెమకిచూడు.

హిర—ఈ స్తంభములోనున్నాఁడా! ఉన్నయెడల పయికివచ్చి చాటుమాని పోటుబంటయిహిరణ్యకశిపుని యెదుట నిలువుమను. సింహముకపిల్లను చంపినట్లు విష్ణుని గిష్ణునికూడ నేనీవాడిగోళ్ళతో పొట్టచీల్చి చంపివేసెదను. హిరణ్యాక్షుని పందివయి చంపిపోయిన పాపాత్మా! నీకేపౌరుషమున్నయెడల పురుషసింహుఁడవయి నాయెదుట నిలిచి నీమగతనము కనఁబరుపుము. నిన్నొక్క నిమిషములో పరమపదమునకంపి నాతమ్ముని పగ తీర్చుకొనెదను.

(అప్పుడు విష్ణుఁడు నరసింహమూర్తియయి స్తంభము బద్దలుచేసికొని బయలుదేరి ప్రత్యక్షమగుచున్నాఁడు.]

నర—ఓరీ రాక్షసాధమా! నోటికివచ్చినట్లు దురాలాపములు పెక్కులు పేలుచున్నావు. తాలఁగక నిలువుము. ఈనూర్యుడస్త మించులోపల నీనోరడఁచి నిన్నును నీతమ్మునివద్దకు పంపెదను. నా భక్తుని నీవు నిష్కారణముగా హింసింపుచుండగా చూచి యింతకాల మోర్చి యూరకుంటిని. ఇఁక సహింపను.

హిర—సహింపక నీవేమిచేయగలవు? నేనాయింద్రుని మద మడఁచినప్పుడు నీవెక్కడకుపోయితివి? యముఁడుమొదలయిన దిక్పాలకులను బాధించునప్పుడేమయినావు? నేనువయికుంఠమునకు దండెత్తినపుడు నీవెందుదాఁగినావు? ఈబుద్ధియింతవఱకునునీకెక్కడికిపోయినది? ఓహో! నేడుగదానాకుపండువు! నాతమ్ముని చంపినప్పటినుం

డియు నేను నీనిమిత్తమై వెదకుచుండఁగా, ఈ ప్రహ్లాదుని మూలమున నైనను నేటి కాలమునకు నాకంటఁబడినావు. ఓరీ! ప్రహ్లాదా! నిన్ను మెచ్చుకోవచ్చును. నీవు దీర్ఘాయుష్మంతుఁడవుకమ్ము. నాసోదరుని చంపిన పగ సాధించుటకయి యెన్నాళ్ళు వెదకినను కానరాని యీ మాయగానిని నిమిషములో గాకన్నులకుచూపి నాకు మహోపకారము చేసినావు. ఇదె పిడుగువంటియీపిడికిటిపోటుతో నాపుణ్యవశముచేత దొరికిన యీవిరోధి శిరస్సు సహస్రఖండములు చేసెదను. కుందేలు వంటయిల్లు చొచ్చినది. హిరణ్యకశిపునియెదుట వీడికనెట్లుతప్పించు కొని పోఁగలఁడు? (అని నృసింహునిమీఁదికి నడుచుచున్నాఁడు.)

నర—ఓరీదుష్టాత్మా! యముఁడు మొదలయినవారిని బాధ పెట్టితిననిగర్వపడకుఁ. నీవీవఱకు యముని పెట్టిన బాధయంతయువడ్డితో గూడ నేఁడుతీర్చుకొనును. యమలోకమునకు ప్రయాణము కట్టుము. ఇదెనీడొక్క బద్దలుచేసి, దుష్టులు కొంతకాలము ప్రబలు లయియున్నను కడపట దురంతమునొందుదురన్న సత్యమును నేను లోకమునకు వెల్లడించెదను. (అని హిరణ్యకశిపుని పట్టుకొని చాటున కీడ్చుకొనిపోవుచున్నాఁడు.)

విప్ర—అయ్యో! నేనెంతపాపాత్ముఁడను! హిరణ్యకశిపుని వధనుగూడ చూడవలసిన వాఁడనయినాను. నృసింహమూర్తి తా నన్నంతపనియుచేయుచున్నాఁడు. అదిగో సింహద్వారమువద్ద ఘోరా కారుఁడయి నృసింహమూర్తి హిరణ్యకశిపునిపైకెత్తిపట్టి తనవాఁడి గోళ్ళతో పటపటధ్వనులువుట్ట పొట్టచీల్చుచున్నాఁడు. హిరణ్యకశి పుని పనితీరినది. హా మహారాజా! రాక్షసకులమునకు నేఁడెంతదుర్యో గము పట్టినది! (అని దుఃఖమునభినయించుచు) అదిగో నృసింహుఁడు రాజకళేబరమును భూమిమీఁదఁ బడవైచి, రక్తముతోతడిసిన శరీ రముతో ఈవంకకే మహారోషముతో వచ్చుచున్నాఁడు. ఇక్కడ నున్నపక్షమున నన్నుకూడ చంపకవిడువఁడు. నేనుపాఱిపోయెదను.

(అని పఱుగెత్తుచున్నాఁడు.)

(అప్పుడు నృసింహమూర్తి మరల ప్రవేశించుచున్నాఁడు.)

నృసిం — ప్రహ్లాదా! నీభక్తికిమెచ్చి ప్రత్యక్షమయినాఁడను. నీవు తలవంచుకొని సిగ్గుపడుచున్నా వేమి? నీవు పోయినతండ్రినిమిత్తము చింతపడకుము. దుర్మార్గుల కెప్పుడును లోకములో నిటువంటిదుర్మరణమే సంభవించును. నిన్ను హింసబెట్టిన రాక్షసబాధ నేఁడు తొలఁగినది గదా? ఇఁక నీవే యీ రాక్షసరాజ్యమునకధిపతివయి ప్రజాక్షేమకరముగా పరిపాలనము చేయుచు సుఖింపుము.

[అప్పుడు దిరుమణి నామములు ధరించుకొని, తులసీతావళములతో అలంబకుఁడును, దుర్ముఖుఁడును ప్రవేశించుచున్నారు]

అలం—(వచ్చుచు దుర్ముఖునితో) మనమిప్పుడు వీరవైష్ణవులవలె నున్నాము. ఈ వేషములు చూచి మనము నిజముయినభక్తులమనుకొని నృసింహదేవుఁడు మనలను తప్పక మన్నించును.

దుర్ము—(నమస్కరించి) స్వామీ! మీదాసులము. వైష్ణవులము. ఆదురాత్ముని మాటవిని ప్రహ్లాదుని బాధించితిమని మమ్ము సంహరింపక దీనులమై మీపాదములు చేరిన మమ్ము రక్షింపుఁడు. ఇదె మాపెరటిలో గాచిన వెలగపండ్లను కానుకగా తెచ్చినాఁడను స్వీకరింపుఁడు.

నృసిం—మీకభయమిచ్చినాఁడను. ఇఁకముందుమీరు బుద్ధిగలిగి బ్రతుకుఁడు. మాకీకానుక లక్కర లేదు. మేమొక్క హిరణ్యకశిపుని శిరస్సు కానుకగానే తృప్తినొందుదుము.

దుర్ము—(తనలో) అట్లైన నీవీవెలగపండు బట్టలో వేసిశిరస్సని చూపి యీ దేవునిమాయచేసి సంతోషపెట్టెదను. (తాను తెచ్చిన వెలగపండును బట్టలో వేసిచూపుచు) స్వామీ! అట్లయినచో హిరణ్యకశిపునిశిరస్సునే మీకు సమర్పించెదను. ఈకానుక నందుకొనుఁడు.

అలం—(దుర్ముఖునితో) ఓరీ! ఇంతచిన్నది హిరణ్యకశిపుని శిరస్సన్న నమ్మఁడు. నేను తెచ్చిన కొబ్బరికాయను బట్టలో వేసి హిరణ్యకశిపుని శిరస్సని సమర్పించెదను.

దుర్ము—(అలంబసునితో) నీదిమాత్రము మన రాజుగారిశిర స్సంతయున్నదా? నీవట్లు చెప్పినపక్షమున స్వామివారు నేనసత్య మాడినాననుకోరా? నీవూరుకో; ఇదిరాజుగారి శైశవావస్థలోని శిరస్సు నేను సంపాదించినానని చెప్పెదను.

అలం—(దుర్ముఖునితో) నీవే ఊరుకో. ఇది రాజుగారి బాల్యావస్థలోని శిరస్సు. నేనే సంపాదించినానని చెప్పెదను. మన రాజుగారు పెద్దవారయి నేఁటిదాఁక బ్రతికియుండఁగా చిన్ననాటిపుర్రె నీకెట్లువచ్చినది? నాదందువో విశ్వామిత్రసృష్టి.

దుర్ము—(అలంబసునితో) నాది బ్రహ్మసృష్టి.

ప్రహ్లా—(చేతులుజోడించుకొనినిలువఁబడి ధ్యానముచేయుచు)

ద్విపద. జయజయసర్వేశ! జయపాపనాశ!
జయజయగతపాశ! జయస్వప్రకాశ!
నిరతంబు నామది నీభక్తినుండి
మరలకుండగఁజేసి మన్నింపవయ్య;
దయయు సత్యంబును దప్పక, నీకుఁ
బ్రియమైన కార్యముల్ ప్రేమమీఱంగ
సతతంబు భువిలోన సలిపెడుబుద్ధి
నతులొనరించెద నాకియ్యవయ్య;
నీదుభక్తులయెడ నిత్యంబునాకు
నాదరమొదవెడు నట్లొనరించి
జనులనెల్లను భాతృసములనుగాఁగ
వనితలఁ దోఁబుట్టువులుగాఁగ
భావించుకొనుచుండి వారి క్షేమంబు
భావంబులోఁగోరి పనిచేయునట్లు
నాకుఁబ్రసాదింపు, న్యాయస్వరూప!

ప్రాకటధర్మంబు పాయకుండంగ
నీతిమార్గంబున నియమంబుతోడ
నేలతీ నేఁజరియించెదునట్లు
వరములునాకిమ్ము వాత్సల్యమూనను
వరదయాకర! భక్తవరద! లోకేశ!
త్రికరణశుద్ధిగా, దేవాదిదేవ!
సకలార్తిహార! నీకుఁజాల మ్రొక్కెదను.

నృసిం—(ప్రహ్లాదుని చేతులతో దువ్వుచు) వత్సా! నీవుకోరిన వరము లన్నియు నిచ్చినాఁడను. పరమభాగవతోత్తముఁడవై వర్ధిల్లుము. మీయీసభాసదులకుఁగూడ నొక్కహితోపదేశముచేసి, అంతర్హితుల మయ్యెదము.

సీసమాలిక.

శ్రీమహావిష్ణుఁడ సింహముఖంబునునరరూపమునుదాల్చికరుణతోడ, భక్తునిగావంగ వచ్చితినిటకు వినరయ్య జనులార వీనులలర, దుద్దునామము పెట్టి తులసిపేరులుదాల్చి మ్రొక్కుమాత్రన మీకు ముక్తిలేదు, నాపాదభక్తులై ననుదృప్తుఁజేయఁగఁ దలఁతురేనియు మీరు తెలియ వినుఁడు, ముందుగామీరలు భూతకోటులయందుదయ గల్గిసత్యంబు తప్పకెపుడు, కామాదులజయించి కరుణాప్రపూర్ణులై పరవంచనములేక పరవనితల, తోడఁబుట్టువులట్లుఁ దోడిమానవులను సోదరులట్లను జూచుకొనుచు, నీతిమార్గంబున నిత్యాదరముతోడ మీరెల్ల నిరతంబు మెలఁగవలయుఁ, జిత్తశుద్ధిలేనిసేవచే నింతయు, ఫలములేదుగాన భక్తితోడ, నన్నుఁగొలుచుచుండి నాకుఁదృప్తినొనర్చు పనులసలిపిముక్తిపదవి గనుఁడు. (అనియంతర్హితుఁడయ్యెను.)

---

బాప్స ప్రెస్, రాజమండ్రి—1950.

శ్రీ

# సత్యహరిశ్చంద్రనాటకము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగముపంతులు

పదకొండవ కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము.

1950

# ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

ఇంద్రుఁడు—దేవరాజు

బృహస్పతి—దేవగురువు

జయంతుఁడు—దేవేంద్రుని కొమారుఁడు

వశిష్ఠుడు, విశ్వామిత్రుఁడు, అగస్త్యుడు, గౌతముఁడు, అత్రి, కశ్యపుఁడు, వామనుఁడు } మహర్షులు

జాబాలి—మార్కండేయుని శిష్యుడు

గాలవుఁడు—హరిశ్చంద్రుని వేడుక చెలికాఁడు

హరిశ్చంద్రుఁడు—అయోధ్యాపురాధీశుఁడు

చంద్రమతి—హరిశ్చంద్రుని భార్య

లోహితాస్యుఁడు—హరిశ్చంద్రుని కొమారుడు

సత్యకీర్తి—హరిశ్చంద్రునిమంత్రి

భద్రుఁడు, పాలకుఁడు—భటులు

మాతెతలు—విశ్వామిత్రుని వనపాలకురాండ్రు

జనమిత్రుఁడు, కామపాలుఁడు—అయోధ్యాపురపౌరులు

నక్షత్రకుఁడు—విశ్వామిత్రుని శిష్యుఁడు.

దంతఘాతకుఁడు—విశ్వామిత్రప్రేరితుఁడగు రాక్షసుఁడు

కపాలకుండలుఁడు—పిశాచరాజు (భేతాళుఁడు)

కాలకౌశికుడు—చంద్రమతిని వెలకుగొన్న కాశీపురబ్రాహ్మణుడు

కలహకంటకి—కాలకౌశికుని భార్య

వీరబాహువు—ప్రేతభూమికధికారి

వీరదాసు—వీరబాహువు హరిశ్చంద్రుని కొనఁగిన మాఱుపేరు

మధుదాసుఁడు—వీరదాసుని యనుచరుఁడు

భీషణుఁడు, తామ్రాక్షుఁడు—కాశిరాజుభటులు

ప్రతాపచంద్రదేవుఁడు—కాశీపురాధీశుఁడు

శివుఁడు—కైలాసపతి

పార్వతి—శివుని భార్య

శ్రీ

# సత్యహరిశ్చంద్రనాటకము

## ప్రథమాంకము

శా. శ్రీకళ్యాణగుణాకరుండు త్రిజగత్సేవ్యుండు నిత్యుండు సు
శ్లోకుం డాద్యుఁ డతీంద్రియుండు పరమేశుం డప్రమేయుండు లో
కైకాధారుఁడు సర్వశక్తుఁ డమలుఁ డాద్యంతశూన్యుండు ప్రే
మైకస్థానుఁ డునైన దేవుఁ డిడు మీ కత్యంత సౌభాగ్యముల్.

సూత్ర—(తెరవంక జూచి) ఓయీ! స్థాపకా! మీ యలంకారము పూర్ణమయినపక్షమున నీవొక్కసారి యిటురమ్ము.

నటు—ఇదిగో వచ్చినాడను. ఈ సేవకుని కేమియాజ్ఞ?

సూత్ర—ఈ రాత్రి మనమేమో వీరిని వినోదపెట్టుదుమని విని యీసభవారందఱును మననాట్యశాలకు విజయంచేసి చకోరపక్షులు వెన్నెలనిమిత్తమయి యాసపడి చూచుచున్నట్లు మనవంక నెల్లచూచుచున్నారో చూడు. ఈ వేసవికాలపు సెలవులలో నొక యపూర్వనాటక మాడి పురజనులను సంతోషపెట్టెదమని యీవరకే ప్రకటన చేసి యున్నాము గనుక, మనమిప్పు డాలస్యము చేయక యీనూతన హరిశ్చంద్రనాటకమును ప్రయోగించి వేడుక చూడవచ్చిన వీరి డెందముల నానందింపఁ జేయుదము.

నటు—సరిసరి! చక్కఁగాఁ జెప్పినారు. నాటకప్రయోగమునందు బాలప్రాయులమయిన మన మెక్కడ? స్తనశల్య పరీక్ష చేసెడి యీమహాసభ్యులహృదయరంజన మెక్కడ? ఈమహాసభను సంతోషపెట్టగలవా రెంతటి శక్తిమంతులు కావలెను!

సూత్ర—గుణగ్రహణైకపారీణులైన వీరికడ మన మింత మాత్రమును భయపడవలసిన పనిలేదు. ఆటపాటలయందు మన యొద్ద నెన్నిలోపములున్నను వానిని పాటింపక ముగ్ధజనసమాదరణ పరాయణులయిన వీరు మనయందలి వాత్సల్యాధిక్యముచేత మన గుణలేశములనే మెచ్చి సంతోషపడుదురు సుమా. అట్లుగాక వీరొ కవేళ మన లోపములను జూపినను మన కది శ్రేయస్కరమే యగు ను. ఎట్లన—

క. రసికులు కానిమనుష్యులు
పొసఁ గస్వీకరించి మెచ్చి పొగడుటకంటెన్
రసికు లగువార లారసి
పస లేదని తెగడుటెంతొ వాసియొసంగున్. 2

నటు—అదిసరేకాని కాళిదాసాది మహాకవులచేత రసవంత ము లయిన మృదు మధుర వాగ్గుంభనలతో రచియింపఁబడిన రమ్య తరములయిన ప్రాచీన గీర్వాణనాటకము లనేకము లుండగా, నేట తెలుగు మాటలతోఁ గూర్పఁబడిన యీ నవీననాటక మిప్పుడు వీరి మనసుల కెట్లెక్క గలదు!

సూత్ర—మనమీవిషయమునను శంకింపవలసినపనిలేదు. ప్రౌఢకావ్యములరుచి మరఁగిన నవరసరసికులకు నహితము బాలుర ముద్దుమాటలు హృదయ రంజకములు కాకుండవుసుమా! అదిగాక, యభిజ్ఞులైనవారెప్పుడును సారస్య మెందున్నను గ్రహించి యాద రింతురుగాని యిదిపురాతన మనియు నాలోచింపరు. అందుచేతనే కవికులసార్వభౌముఁడయిన కాళిదాసుఁడు మాళవి కాగ్నిమిత్రమను నాటకరాజము నందుఁ బూర్వము,

ఉ. ప్రాఁతది యన్నకారణముఁ బట్టియెసర్వము మేల్మిఁజెందునే?
నూతనమన్న హేతువున న్యూనతఁజెందునెక్రొత్తవన్నియున్

.ఖ్యాతిగనుత్తముల్గుణము నారసి మంచి గ్రహింతురెప్పుడున్
భ్రాంతవె మంచి వందు రవిమర్శితఁ గేవల మూఢమానవుల్ 3

అని చెప్పియుండలేదా? ఇది కాళిదాసాదుల మహా నాటకరత్నముల వలె నంత మనోహరముగా నుండకపోయినను నిత్యసత్యవ్రతము చేతఁ బ్రఖ్యాతి చెందిన శ్రీహరిశ్చంద్ర మహారాజచంద్రుని పవిత్ర చరిత్రముగుటచేతఁ దత్కథామృతపానమునందలి యపేక్ష చేతనైనను సభవారు దీనినంగీకరించి యాదరింపకపోరు. లోకములో సత్పురుషుల కర్ణములకు నీతికథాశ్రవణముకంటె మధురమయినది మఱియొకటి యుండదుగదా?

నటు—మీరిప్పు డెప్పటిదో కృతయుగవార్త సెలవిచ్చుచున్నారు. మీరన్నది పూర్వకాలపుమాట గాని యీకలికాలములో నీతివాక్యములయందు బద్ధాదరులగువారెవ్వరున్నారు?

సూత్ర—నీవు బుద్ధిమంతుఁడవే కాని యీవిషయములో నీబుద్ధి భ్రమసిపోయినది. ఇదియెంత కలికాలమయినను నీతి యిప్పటికిని మొదలంటఁ జావలేదు. ధర్మస్వరూపుఁడయిన భగవంతుఁడు పయినుండి పరిపాలించుచున్నంత వఱకును లోకములో నీతియెప్పుడును నిర్మూలము కానేరదు. దుర్నీతియెంతప్రబలముగా నున్నను నీతియే యెల్లప్పుడు బ్రజల యుల్లములమీఁద రాజ్యము చెల్లించుచుండును. అవివేక ప్రేరణముచేత నీతివర్తనమును గొందఱు విడిచినంత మాత్రమున దానిమహిమ యెక్కడపోవును.

ఉ. తామిల నీతిమార్గమును దప్పిచరించెడువారుకూడ నీ
భూమిజనంబు తమ్మెపుడు ప్రోజ్జ్వలనీతిపథానువర్తులం
చేమెయి నెంచనట్లునటియింతురు వేషముపూనిభూమిలో
నోమహితాత్మ! చాలదెయిదొక్కటె నీతిబలంబుచాటఁగన్. 4

నటు—మీరు నీతిమార్గప్రభావము నెంతగావర్ణించుచున్నను, నాప్రత్యక్షానుభవమునుబట్టి చూడఁగా లోకములో దుర్నీతియే యధికసంఖ్యాకుల మనస్సులను లోఁ బఱచుకొని యధికారము చెల్లించుచున్నట్లు కనఁ బడుచున్నది.

సూత్ర—నీవన్నట్లు దుర్నీతి యెంతదూరము వ్యాపించి యెందఱిని తానిమార్గము పట్టించుచున్నను, అది దొంగవలె నడఁగి యుండి చాటునఁ బనిచేయ వలసినదే కాని బహిరంగముగాఁ దల యెత్తుకొని యెప్పుడును నిర్భయముగాఁ జరింపనేరదు.

చ. వినుపగలీశ్వరుం డిడిన వెల్తురులోఁ దలసూపనోడి మూ
లనడఁగి రాత్రిఁ జీఁకటి మెలంగెడుక్రూరమృగంబుకైవడిన్
దనబయవేళయందు సహితమ్ముబయల్పడలేక చాటునన్
బనియొనరించుఁ జూ వెఱయభావముతో నవినీతియెప్పుడున్. 5

ఇంకొక్కవింతవినుము. అంతరంగమున దుర్నీతికి దాసులయి దాని కనవరత శుశ్రూష చేయువారు సహితము బహిరంగముగా దుర్నీతిని సేవింపనొల్లక నీతినే గౌరవించి భూషించుచు, తమ్మెవ్వరయిన నీతిమాలిన వారని పలికినంత మాత్రమున వారిమీఁద మండిపడు చుందురు. ఇందువలననే నీతియొక్క పూజ్యతయు గౌరవాధిక్య మును నీకు వెల్లడి యగుచుండలేదా? అదిగాక యెంతటి నీతిమాలిన పరమ నీచులకయినను నీతియందును నీతిమంతుల యందును గౌరవ మును ప్రేమయును బరమాదరమును నుంచుట సహజ గుణముగా నున్నది.

సీ. అగౌరవాదుల కారయ ధర్మంబె కారణంబియ్యెలఁ గాదె మేని
దీర్ఘ కాలముక్రిందదివి కేగియున్నట్టి రాముని నాధర్మరాజుని పుడు

దేవసన్నిభులఁగ భావించి పూజింప వారిసచ్చరితల గారవింప
మహిమీఁదవారలుమనకుజేసిన యట్టియుతులోపకార మేదైన
మనము రావణు దుర్యోధనునిఁగరంబు [గలదె!
దూషణమునరించి ద్వేషింపఁ దొల్లివారు
మనకు నపకార మిమ్మహీమండలమున
నెప్పుడైనను జేసిరే యించుకైన? 6

ఉ. సీతవిపత్తులంబొరలి చేడ్పడెనన్నపు డార్తి చెందగా,
సీతమహోపకారమిటఁ జేసినదేది జగజ్జనాళికిన్?
తాన్మతలమందు శూర్పణఖ కష్టపరంపర చెందెనన్నచోఁ
జేతములంజెలంగ నదిచేసినదేది మహాపకారమున్? 7

లోకములో నెప్పుడును స్థిరమయిన గౌర వాదరములకు జనుల సుగుణ సుచరితలు పాత్రములగునుగాని యవిలేని కేవలధనాధి కార సంపదలు కావుసుమా!

గీ. గుణవిహీనుఁడు సామ్రాజ్య గురుతఁగన్న
వసుధవానికి స్థిరగౌరవంబు రాదు;
ధరణిఁబోపలదారిద్ర్య దశగన్నఁ
గలుగు గుణవంతునకె స్థిరగౌరవంబు. 8

నటు—మీరిప్పుడువచ్చిన కార్యమును మఱచి ధర్మోపన్యాసములు చేయుచున్నారు. ఈసభవారో, కాలహరణమున కోర్వలేక త్వరపడుచున్నారు. నన్నిప్పుడు పిలిచిన కార్యముసంగతి తలఁపున నిలుపుఁడు.

సూత్ర—ఓహో! నేనిప్పుడు ధర్మప్రసంగాదర పరవశుఁడనయి ప్రస్తుతకరణీయమును మరచిపోయితినిగదా! ఇదిగో చూడుము.

ఉ. ఇంద్రసమానభోగులు కవీంద్రులు విత్తపతుల్బుధుల్
సాంద్ర యశస్కులై యిచటసభ్యులునిండి చెలంగఁగాహరి

శ్చంద్రుని గూర్చివింతగఁ బ్రసంగము చేయుచు నుండినట్టి దే
వేంద్ర సభాగృహంబుగతి నీసభ శోభిలుచున్న దెంతయున్.9

ఇఁక వేగిరము పోయి మన యపూర్వ నాటక ప్రయోగముచేత మన మీ సభారంజన ప్రయత్నము చేయుదమురమ్ము.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.

---

రంగము—ఇంద్రసభ.

[సుధర్మాసనంబునఁగూరుచుండి దేవేంద్రుఁడును, జయంత బృహస్పతి ప్రభృతి ప్రకృతివర్గమును, వరుణ కుబేరాది దిక్పాలకులును, అత్రిగౌతమాగస్త్య వశిష్ఠ వామదేవ కశ్యప నారద విశ్వామిత్రాది మహర్షులును ప్రవేశించుచున్నారు.]

ఇంద్రు— (బృహస్పతివంకఁజూచి) ఓయాచార్యోత్తమా! ఏమి యీమధుర్యము! రచియించినప్పుడు మీరెంత యానందము పొందియుంటిరో కాని మే మిప్పుడీవాచస్పత్య నీతిశాస్త్రమును కర్ణరసాయనముగా వినుచున్నకొలఁదిని క్రొత్తచవులుపుట్టి మాకర్ణములు చరితార్థములగుచున్నవి.

ఉ. భూతలమందు స్త్రీలయెడ, బుణ్యవివాహములందు ప్రాణమున్
భూతియు మానముం జెడెడుపొందున, గోద్విజరక్షణార్థముం
నీతియటంచుబొంకుమని నేర్పినశుక్రుని నీతినవ్వి, స
న్నీతిగ మెచ్చిరిమ్మునులు నీకృతిలోని విశుద్ధనీతినిం. 10

చెవులొగ్గి ఆమహర్షులు మహాదరముతో విన వేచి యున్నారు. ఏదీ తరువాత పద్యమును జదువుఁడు.

బృహ—ఓమహేంద్రా! ఇటువంటి యపూర్వదివ్యసభలోఁ ద్రిలోకాధినాథులైన దేవరవారును, కేవలధర్మశాస్త్రకారులయిన జడదారులును విని యీపరికారముగా శ్లాఘించుటచేత నాగ్రంథ మిప్పుడుగదా పావన మయినది! ఇఁక నేను నీతిశాస్త్రప్రణేతలలో ధన్యతముఁడను. ఇదె యీపైపద్యమును జిత్తగింపుఁడు.

చ. కులసతిబాసినన్, సుతుఁడుకూలిన, నాపదలెన్నివచ్చిన త
న్నలమిన, మానభంగమయినన్, సిరిపోయిన, రాజ్యమూడినం

వెలులుత్యజించినన్, మదకసింగొని ప్రాణముతీయవచ్చినం,
బలుకఁగరాదుచూ వెఱణుమాత్రమసత్యముమర్త్యుఁడెప్పుడున్ 11

వశి—ఓహో! ఈనీతివాక్యము దేవతా శ్రేష్ఠులును శిరసా వహించి శ్లాఘింపఁ దగియున్నదిగదా! మేలు! ఇట్టి నీతివాక్య రత్నముల కాకరమైన యుత్తమశాస్త్రమునురచియించిన మహానుభావుడు దేవగురుఁడనిపించుకొనుటకుఁ దగినవాఁడే.

విశ్వా—(తనలో) ఏమీ! ఈముదిబ్రాహ్మణుఁడు బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేయఁజాలిన నేనును, అఖండ తపోమహిమచేత నొక్కొక్కఁడే యీలోకముల నాకులపఱుపఁ జాలిన యీమహర్షిసత్తములును, ఉండఁగా మమ్మెవ్వరిని గణనచేయక తపోగర్వముచేత తానేఘనుఁడయినట్లు సభలోముందుగా మాటాడి మాయెడ దిరస్కారభావము చూపుచున్నాఁడు! మాపూర్వవైరమునుబట్టి యీతని మాటయన్న నాదేహము భగ్గునమండుచున్నది. ఈసభ చాలించెడి లోపల నేనేదో మిషకల్పించి యీతని గర్వభంగము చేసెదను. (అని తలయూఁచుచున్నాఁడు)

ఇంద్రు—జయంతా! ఏమి యీబృహస్పతిపుణ్యము! అధ్యాత్మవిద్యాగరిష్ఠుఁడైన యీవశిష్ఠుఁడును సకల మహర్షి సమక్షమ్మున నీతని నిట్లుశ్లాఘించుచున్నాఁడు. ఏదీ నీవిందాఁకమందాకిని యందలి పొందామరాకులోఁ బొదివి తెచ్చిన యాసుందర మందార ప్రసూన దామ మిటుతెమ్ము. నేనది యీబృహస్పతి కంఠమునవైచి దానిని సార్థకపఱిచెదను.

జయ—ఇదిగో మందారమాల. ఈతనిమెడ నలంకరింపఁ గలుగుటకిది తప్పక యేదో గొప్పసుకృతము చేసికొన్నది. (అని పుష్పమాల తండ్రిచేతి కిచ్చుచున్నాఁడు.)

ఇంద్రు—(పుచ్చుకొని బృహస్పతి మెడలో వేయుచు) ఓగురుసార్వభౌమా! మీ రిప్పుడు చదివినపద్యమునకుఁ ద్రిలోకాధిపత్యము నిచ్చినను మీయోగ్యతకుఁజాలినదిగానుండదు. అయినను భక్తిపూర్వకముగా నిచ్చెడి యీపుష్పదామమును శిష్యవాత్సల్యముతో నంగీకరించి యీగ్రంథరచనచే మీ కాచంద్రార్కముగాఁ గలుగఁబోయెడు ధవళకీర్తికి సూచకముగాఁ గంఠమున ధరింపుఁడు.

బృహ—త్రిలోకాధిపతులయిన దేవరయంతటివారు సమస్త లోక పాలదత్తోప సిరగ్రహణ ప్రశస్తములయిన దివ్యహస్తములతో స్వయముగాఁ బుష్పమాల మెడను వేసి సేవించెడి యసాధారణ గౌరవమునే నేనిప్పుడు పొందుచుండఁగా నాకుఁ ద్రిలోకాధిపత్యమేల కావలెను! నా యందలి మీ నిర్హేతుకజాయమానకటాక్షముచేత నేను జరితార్థుఁడ నయినాను.

ఇంద్రు—ఎదుటజెప్పిన ముఖస్తుతిగాఁ దోఁచునేమో కాని యేసత్కారము జేసిన మీయర్హతకుఁ దగియుండునో నేనూహింపజాలకున్నాను. మీరుచెప్పిననీతి వాక్యము సర్వజన సమాదరణీయమయినదే కాని దాని నాదరించుట మాత్ర మెవ్వరికిని పూర్ణముగా సాధ్యముకాదని నాకుం దోఁచుచున్నది.

బృహ—లోకములో నసాధ్యమయిన నీతిని విధించుటవలనఁ బ్రయోజనమే లేదు. శాస్త్రమున విధింపఁబడు ధర్మ మెప్పుడును సర్వజనాదరణ సాధ్యముగానే యుండవలయును. దేవరవారు సెలవిచ్చినట్లుగా లోకములో నీతు లుపదేశించు వారివలె ననుష్ఠించు వారంతగాఁ గానరాక పోవుచుండుటనుబట్టి తమ కట్టి సందేహము పుట్టుటకు హేతువయినది. కాని, విమర్శతోఁ జూడఁగా నేనిప్పుడు సత్యవిషయమున విధించిననీతి యాచరింప మనసుగలవారి కందరికిని బరమసాధ్యమే కాని యసాధ్యమెంతమాత్రమునుగాదు. అయినను

నీతులుచెప్పుటవలె నడుచుకొనుమాత్ర మంత సులభముకాదని నేనె
రుఁగుదును.

చ. పరులకు నీతులంగఱపువారలు లక్షలుఁ గోట్లు నుండ్రు; రెం
డరసినలక్షలోఁ బదువురైనను నుండరు చెప్పినట్ల యా
చరణమొనర్చువారు; బలశాసన అయ్యుపదేశమట్ల యా
చరణయుఁ దేలికై తగిన, స్వర్గముకాదె సమస్తభూమియుఁ? 12

ఇంద్రు—ఓగురువర్యా! నాచిన్న విన్నపంబొకటి చిత్తగింపుడు.

చ. పరుఁవురుకారు, భూతములపై మణిలక్షకు నొక్కఁడైనఁగ
వెదకఁగ గష్టముల్పొడరు వేళను సత్యముతప్పకుండువాఁ
డొదవునొ బొత్తిగానొదవఁడో యని సంశయమయ్యెడిన్మదిఁగ
వదలకసత్యమేయెపుడుఁ బల్కుట దుష్కరమంచు నెంచెదఁగ. 13

ఓమహర్షులారా! మీయభిప్రాయమేమి? నాయభిప్రాయము సరి
కాదని తోఁచినపక్షమున త్రికాలవేదులయిన మీ రెఱుఁగనివారు
ముల్లోకములయందును లేరుగాన వెనుక చన్నవారిలోఁగాని యిప్పు
డున్న వారిలోఁ గాని నిరంతరసత్యవాక్యధురీణుఁడయిన నీతివిద్యా
పారీణుఁడెవ్వఁడయిన మీ బుద్ధికి గోచరుఁడగునేని వ్రేలు మడఁచి
యొక్కని పేరు చెప్పుఁడు.

అగ—(క్రిందఁజూచుచు నేలవ్రాయుచున్నాఁడు)

గౌత—(మీఁదుచూచుచు నాలోచించుచున్నాఁడు.)

అత్రి—కశ్యపునిముఖమువంకఁ జూచుచున్నాఁడు)

కశ్య—వామదేవునికి కనుసైగ చేయుచున్నాఁడు)

వామ—(నారదునిఁగోఁకుచున్నాఁడు.)

నార—(వశిష్ఠునితోఁజూపి) నీవుత్తరమిమ్ము (అని తలయెగుర
వేయుచున్నాఁడు)

వశి—(ముందునకు జరుగుచున్నాఁడు.)

విశ్వా—(తనలో) ఏమి యీతని సాహసము! తపోమహిమ చేత ముల్లోకముల నల్లలనాడింపఁగల మేముండఁగను నిటనుండఁగా మరల నితఁడేయిప్పుడును దానేమో చెప్పవలెనని ముందుకు జరుగుచున్నాఁడు.

నార—(ఋషులవంకఁజూచి) ఈమహేంద్రుఁడు మీవలనఁ దనప్రశ్నకుత్తరము గానక తహతహ పడుచున్నాఁడు. ఓవశిష్ఠా! తక్కినవీరివలె నీవు నములక జపసమయమునందు మాత్రమే కాక యీసభయందునుమౌనముద్ర ధరియించియున్న వీరి కందఱికిని సిగ్గు వచ్చునట్లుగా నీవే వేగిర మేదో చెప్పు.

విశ్వా—(తనలో) ఏమి యీనారదుఁడు మమ్మెత్తిపొడుచుచున్నాఁడు!

వశి—ఓ దేవాధీశ్వరా! నీవడిగినరీతి జగన్నుతుఁడయిన నిత్యసత్యవ్రతుఁడొక్కఁడిప్పుడు నాకన్నులకుఁ గట్టినట్టు పొడకట్టుచున్నాఁడు. ఎప్పటివానినో యిప్పుడు చెప్పనేల? ఈవర్తమాన కాలమందున్న మహాత్ముని నే చెప్పెదను వినుము.

వామ—(ఋషులతో రహస్యముగా) ఇప్పుడితఁడు మనలో నెవ్వనిపేరైనఁ జెప్పునేమో!

గౌత—(తనలో) నాపేరు చెప్పిన బాగుండును.

ఇంద్రు—వశిష్ఠా! అట్టియాడితప్పని పురుషరత్నము పేరుగా నోచినపుణ్యాక్షరము లేవో నాచెవుల వేసి కర్ణోత్సవముచేయుము.

వశి—భూకాంత కలంకారమన సౌందర్యరాశియై సమస్తప్రశస్తవస్తుసంపదల చేతులనునిస్తులంబయి యోధజనాసాధ్య మయిన యయోధ్యానగరము ముక్తిదాయకములయిన సప్తపురముల లో నగ్రగణ్యమయి భూలోకమున నున్నసంగతిమీ రెఱిఁగినదే కదా!

ఇంద్రు—మేమది యెఱుఁగుదుము. అదిమాకాప్తులయినకోసల దేశాధీశ్వరులకు రాజధాని,

వశి—ఈపుణ్యపురమున కధీశ్వరుఁడయి, అనన్యసామాన్య విక్రమధురంధరుఁడై, సకలసద్గుణబంధురుఁడయియున్న హరిశ్చంద్రుడనుసార్వభౌముఁడు తన యపార్య శౌర్యముచేత సప్తద్వీపములను జయించి, రాజాధిరాజయి, అవక్రపరాక్రమంబున భూచక్రమెల్ల నేకచ్ఛత్రముగాఁ బాలించుచున్నాఁడు. అతఁడుస్వచ్ఛకీర్తులయిన షట్చక్రవర్తులలోను బ్రథమ గణ్యుఁడు. అగణ్యపుణ్యుఁడు ఆటల యందును బొంకెఱుఁగని పరమసత్యనిరతుఁడన్న లోకములో నతఁ డొక్కఁడే.

విశ్వా—(తనలో) ఆహా! మా క్షత్రియ వర్ణములో వర్ణనీయుడయిన యటువంటిసత్యశీలుఁ డున్నాఁడని యింద్రసభలో వర్ణించుటచేత నేనిప్పుడు గర్వపడుచున్నాను. అట్టిసత్యవ్రతాదరణ పరాయణులు మా క్షత్రియకులమునందుఁ గాక మఱి యెందుందురు? బ్రహ్మర్షినయినను దొంటికులాభిమానము నన్నిప్పటికిని విడువకున్నది గదా! ఈ చక్రవర్తిమూలమున మా రాజవంశముకీర్తి కెక్కినదని లోపల నేనెంతపరమానందభరితుడనై యున్నను, బ్రహ్మ విద్యాధురంధరుల మయిన మేమిందఱ మిక్కడనుండఁగా మమ్మెవ్వరిని లక్ష్యము చేయక యీతఁడు స్వతంత్రమువహించి మేమందఱమును జేతకాని వార మయినట్టు తాను ముందునిలిచి పలికిన యవమానముకూడ నా మనస్సు నొకమూల వేధించుచున్నది. ఇప్పు డీతని గర్వసంహారముచేసి నాపూర్వవైరమును సాధించుటకు సాధనమేమున్నది?

నార—ఓవశిష్ఠా! నీవే నామనస్సువచ్చిన వాడవు. తామే సర్వజ్ఞులమని విఱ్ఱవీఁగుచుండెడి యీవిశ్వామిత్రాదుల గర్వమంతయు నడఁగి వీరికి సిగ్గువచ్చునట్లుగాఁ జెప్పినావు.

విశ్వా—(తనలో) ఏమీ! ఈనారదుఁడు కూడ మొదల నా పేరే యెత్తుచున్నాఁడు! ఇంతకు వచ్చినతరువాత నిఁక నూరకుండఁ

గూడదు. ఈనారదముని కుటిలవాక్యముకన్నను నాపూర్వవైరమే యీబ్రాహ్మణుని బరాభవింపుమని నన్ను వేయివిధములఁ బ్రేరేపించుచున్నది. కాని నా కుపాయముమాత్రము తోఁపకున్నది.

ఇంద్రు—ఓవశిష్ఠా! ఆరాజు కొంతవఱకు సత్యసంధుఁడే కావచ్చునుగాని నీ విప్పుడాతని నత్యధికముగా వర్ణించుచున్నావేమో యని నాకు సందియము తోఁచుచున్నది.

వశి—నేఁజేసిన దతివర్ణనకాదు. ఆమహారాజుయొక్క సత్యసంధతకు నావర్ణనము చాలనిదయ్యెను గదాయని నాకు సిగ్గగుచున్నది.

విశ్వా—(తనలో) ఇప్పు డీయింద్రుఁడొక యుపాయము తోఁపించి నాకుమార్గదర్శియగుచున్నాఁడు. నేనాహరిశ్చంద్రుఁడు సత్యసంధుఁడు కాఁడని వివాదము పెట్టుకొని యీతనిని బరాభవించెదను. అదిగాక నేనిప్పుడీతని వచనమును బూర్వపక్షముచేసి చెర్చపెంచుటచేతఁ గూడ హరిశ్చంద్రుని సత్య నిత్యతయే సిద్ధాంతమయి మారాజవంశమున కంతకును మఱింత వన్నెయు రావచ్చును. కాఁబట్టి నేనిప్పుడు సంకోచింపవలసిన పనిలేదు. (ప్రకాశముగా) వశిష్ఠా! ఇంతకుమున్ను నీవీపురందరుని ముందఱ నేమన్నావు? పరాకుగావిన్నాను. నీవిప్పు డెవ్వనినో నిత్యసత్యవ్రతుఁడని కైవారము చేసినావే వానిపేరేదీ, యింకొకసారి చెప్పుము.

వశి—వినవిష్టమున్నచో నామహామహుని పేరు మనపాపపరిహారమగునట్లుగా నీక వేయిమాఱులు చెప్పుమన్నను చెప్పెదను. జగద్విశ్రాంతయశస్సాంద్రుఁడగు నారాజచంద్రుని పేరు హరిశ్చంద్రుఁడు, హరిశ్చంద్రుఁడు, హరిశ్చంద్రుఁడు.

నార—ఓవిశ్వామిత్రా! మునిజనవరిష్ఠుఁడయిన యీవశిష్ఠుఁడు దేవసభామధ్యమున నిర్భయముగా ముమ్మాటికిని హరి

శ్చంద్రుఁ డని చెప్పుచున్నాఁడు. ఇఁక నీచేత నగునేని హరిశ్చంద్ర సార్వభౌముఁడు సత్యవాక్య ధౌరేయుఁడు కాఁడని సాధింపుము.

ఇంద్రు—(తనలో) ఓహో! ఇతఁ డెప్పుడును గలహప్రియుఁడుకదా! కలహ విద్యావిశారదుఁ డయిన యీనారదుఁడు వీరికి కోపమెక్కించి యొండొరులను బురికొల్పుచున్నాఁడు. ఇతనికిఁ గలహమున్న పక్షమున వేఱే భోజన మక్కర లేదు. అందుచేతనే కలహ భోజనుఁ డన్న పేరితనికి సార్థకముగాఁ జెల్లుచున్నది.

విశ్వా—ఏమేమీ! అఖర్వరాజ్య గర్వాంధుఁడయి కన్ను గానకున్న యీహరిశ్చంద్రునా యీమునులెల్ల వినుచుండ జంకులేక నీవు నాముందఱ సత్యసంధుఁడని పేర్కొనుచున్నావు? ఇంద్రుని యెదుట మహాసభలోఁ బ్రజ్ఞలకయి యీరీతిగాఁ గల్లలేలయాడెదవు? ఉగ్గుపాలనుండియుఁ బరవంచనమే కులవిద్యగా నభ్యసించెడి రాజు లెక్కడ? సత్యవాక్యము లెక్కడ? చాలు ఇంతట నూరకుండుము. ఈమాట లెవ్వరయిన విన్న నవ్విపోదురు. మారాజవంశమునఁ బుట్టిన హరిశ్చంద్ర మహీకళత్రుని చరిత్రమును నాకంటెను నీ వెక్కువ యెఱుఁగుదువా? (అని కన్నులెఱ్ఱచేసి చూచుచున్నాఁడు)

ఇంద్రు—(తనలో) అయ్యో! ఇతఁడు కోపమునే ప్రధానముగాఁ జూచుకొనుచున్నాఁడు కాని మఱియేమియు నాలోచింపకున్నాఁడు.

వసి—తాటాకుల చప్పుళ్ళకుఁ దోఁడేళ్లు బెదరవు. సూర్యవంశపు రాజులకెల్లను కులగురువైన వశిష్ఠుముందఱనా నీబింకములు కనఁబఱచెదవు? ఇఁక నీబెదరింపు లటుండనిచ్చి న్యాయమునకురమ్ము. ఆడితప్పనివాఁడన్న లోకములో నాహరిశ్చంద్రుఁ డొక్కఁడే. నీవాతని నొక్క రాజసామాన్యుఁ డనుకొనుచున్నావే కాని సాధుకీర్తి మైన యీచక్రవర్తి మహాత్త్వము నించుకంతయు నెఱుఁగకున్నావు.

విశ్వా—కొలువులో నీవిచ్చకములకయి కల్లలాడుటయే కాక యెఱుఁగమని మాయందజ్ఞానమునుగూడ నారోపించుచున్నావుగా! సరిసరి! నీమాటలవలననే యిక్కడ నీగుట్టంతయు బట్టబయలయినది. నీవు మొదటినుండియు సూర్యవంశపు రాజులకెల్లను బురోహితుఁడవయి వారిసొమ్ము తినుచుండుటచేతనే చీకుకుఁ జేవకల్పించి నీవిశ్వజాతనిని బట్టువలెఁ బొగడుచున్నావు. ఇందున్నవారిలో నీస్తోత్రపాఠములు విని మోసపోవు వారెవ్వరును లేరు. ఇంతటివాఁడు లేఁడని యీమహాసభలో నిన్నందఱును మెచ్చుకొందురని కాఁబోలు, నీవీ కల్లప్రజ్ఞలు ప్రకటించుచున్నావు. పిలువని పేరంటముగ నీకింత శోషణ మెందుకు? నీవే ప్రత్యుత్తరము చెప్పుమని సన్నిపురందరుఁడేమయిన బొట్టును గాటుకయుఁ బెట్టి పిలిచి ప్రార్థించినాడా? మహాతపోధనులైన యీమునులందఱు నూరకుండఁగా ముందువచ్చి చెప్పుటకు నీ కీయహంకారమేల? నీపలుకు లీ శచీధవుని చెవులకుఁ జవిగానుండిన నుండనిమ్ము. మాకుమాత్రము హాస్యాస్పదములుగా నగపడుచున్నవి. పురోహితత్వముచేయు నీవే కాని యీరాజును మేమెఱుఁగమా! నీవూరక గోరంతలు కొండంతలుచేసి యేల కొనియాడెదవు?

ఉ. చిక్కనిపాలుఁ బాయసముఁ జేరల నిండ ఘృతంబు, జుఱ్ఱుచున్
జక్కెర రుచ్యభక్ష్యములె సారపుమాంసపుఁ గూరలున్ సదా
మెక్కుచుఁ గ్రొవ్వి సంపదల మిక్కిలి ద్రుళ్లెదు మేదినీపతుల్
నిక్కముతప్పరంట ధరణింబరిహాసపుమాట యోఁజుమీ.

వశి—(కోపదృష్టితోఁ జూచుచు) ఓయీ! విశ్వామిత్రా! వినుము. సభలో నెవ్వరయిన నొకధర్మసందేహ మడిగినప్పుడు తెలిసినవారుండి సదుత్తరమీయకుండుట ధర్మము కాదుగనుక, ఇప్పు డీయింద్రుఁ డడిగిన ప్రశ్నకు నీఁటుచెప్పక యొకరిమొగము

లోకరు చూచుకొనుచు మీరందఱు నూరకుండఁగా నెఱఁగినవాఁడ నగుటచేత నే నుచితోత్తరము నిచ్చినాఁడను. పైత్యరోగిజిహ్వకుఁ బంచదారయుఁ జేఁదయినట్లు నిర్నిమిత్తద్వేష వివశుఁడ వయియున్న నీదృష్టికి నేను త్తరము చెప్పుటయు దప్పిదముగానే కనఁబడుచున్నది. ఈవిధముగా వ్యర్థప్రలాపము లేల ప్రేలెదవు? సముద్రము లంఘించిన హనుమంతుని ముందర నా కుప్పిగంతులు? నీప్రతాపములు నాముందు సాగిరావు. గరుత్మంతునితో నూఁగఁబిచ్చుకలను సాటి తెచ్చునట్లు నీవివ్వ డాసంతత సత్యార్గవర్తి యయిన హరిశ్చంద్రచక్రవర్తిని సామాన్య రాజన్యాధములతో సరిపోల్చుచున్నావు. లోకములోని రాజలోకము నెల్లను గైకొన్నను వారి నందఱిని కలిసి యాతని సత్యములో సహస్రాంశ మయిన నుందురా?

ఉ. సందియ మింత లేక బలశాసన దివ్యసభాంతరంబునం
దందఱు నాలకింప విస వర్ణ్యముగాని యసత్యవాక్యాలఁ
నిందయొనర్చె దీవు ధరణీధవచంద్రుని; నింతమాత్ర నే
యిందలివారు మెచ్చుదురె యిప్పుడు నిన్నిటఁ? దాపసాధమా! 15

ఉ. ఎంతయుఁ బాతకం బొడవు నిట్టిదురుక్తులు వించు నున్న; నే
డింతటితోనె యానృపకులేశ్వరు సూనృతవాఙ్మహత్త్వ మా
వంతయులోపముం గనునె? యారయ వించుక నైన; దీవనా
క్కింత త్వదీయనైజగుణమే యిట వీరి కెఱుఁగవచ్చెదుర్, 16

విశ్వా—(పటపట పండ్లుకొఱుకుచు)

ఉ. క్రొవ్వి, వశిష్ఠ! యేమిటికిఁ గొవ్వున నోరికివచ్చినట్లుగా
నివ్వశిఁ బ్రేలెదీవు? వినుమే నల గాధిసుతుండఁ జుమ్ము; న
న్నెవ్వనిఁగాఁ దలంచి తపుడే మఱపొందితె నన్ను? వంతమే
యివ్వడి వచ్చెనేని, చలియించున కౌశికుఁ డల్లబ్రహ్మకున్! 17

ఓవశిష్ఠా! తొల్లిపంతము వచ్చినప్పుడు నీసుతశతమును గృ తాంత నిశాంతమునకుఁ బంచిన విశ్వామిత్రునిగా న న్నెఱుంగుము.

మ. ఒకరాజాధము నిప్పుడీ విచట నెంతో పెద్దగా జేసి మా
నకవర్ణించెదు సత్యసంధు డనుచున్నాప్రేమాల; చాల్చాలు; నూ
రకయాయాస పడంగ బోకు, మిక విశ్రాంతిం దగంబొందుమా;
యకటా! స్తోత్రము చేయు లే కలసి తత్యంతంబు నీ విద్యోడన్.

చ. జలనిధి గ్రుక్కఁగొన్న మునిసత్తము డల్లయగస్త్యు డుండ, న
ఖులు హరికిన్ సహస్ర మొడగూర్చిన గౌతము డీతడుండ, ని
ర్మలమతి నేను నుండ, నిట మమ్ము గణింపక నీవువశ్రితో
బలుకఁగనేల? మేటివె తపంబున నందరకన్న నీవిటన్? 19

(సభవారివంక దిరిగి)

శా. సందేహం బొకయింత లేము వినుఁడీ చర్చింప గాలోకమం
దెందున్; లేడు విశుద్ధసత్యనిరతుం డీమాట ముమ్మాటికే
నందున్; కాదనఁ జాలు మేటిమగఁ డెవ్వైనం గలండేని, నా
ముందేఁడీ యిట నిల్చి పల్కు మనుడీ ప్రోద్దామధైర్యంబునన్.

వశి—(లేచి ముందుకువచ్చి పండ్లుకొఱకుచు) ఓసభాసదు లారా! వినుండు. ఆత్మస్తుతియు బరనిందయుఁ ననర్హము లేయైనను నేనిప్పు డీ బాలిశుని మూలమున నన్ను నే నించుక చెప్పకోవలసి వచ్చినది. తపశ్శక్తియందలి మాయిద్దరి తారతమ్యములను మీ రందఱు నెఱుగ బూర్వమా బ్రహ్మదేవుడే నిర్ధారణ చేసియున్నాడు గాన దానధికుడ నని యిప్పుడెంత త్రుళ్ళిపడుచున్నను జగత్ప్రఖ్యాత మయిన యా విషయమయి నేనిక్కడ జెప్పవలసిన పనిలేదు. ఈ దురాత్ముడు సభలో నన్ను నిష్కారణముగా నపహసించి దూషిం చుచు ధర్మదేవతాపరావతారు డని చెప్పదగిన యాహరిశ్చంద్రుని

శక్కసక్కములాడి నిందించుచున్నాడు. ఆబోతు అంకెవేసినదని సింహ మెప్పుడయిన బెదరునా?

మ. వినుఁడీ, సభ్యులు! మీరు నాపలుకు లీ విశ్వంబు తార్మాణుగా
జనినన్ సూర్యుడు నగ్ని చల్లపడినన్, సంద్రంబు లొత్తుక్కమ్మడిన్
జనముల్ భీతిల నెండిపోయిన, హరిశ్చంద్రుండు సత్యంబు వీ
ర్మని తప్పం డని నిల్చి పల్కెడ నిదే మీరంద ఱాలింపగన్.

చ. పరసతులెల్ల తల్లులు, స్వభావ గుణంబులు ధర్మవర్తనల్
పరమసుహృత్తు సూనృతము, బంధుచయంబు జగజ్జనంబు స
త్కరుణ విభూషణంబు, గనుదంచిత శాంతత విత్త, మట్టియా
నరపతి స్వప్నమందయిన నవ్వుల కయినను గల్లలాడునే?

ఇంద్రు—(నారదునితో రహస్యముగా) ఓ దేవమునిపుంగవా! నీవంతకంతకు గోపములు రూపములు దాల్చినట్లు రౌద్రమూర్తులయి మత్సరము హెచ్చనొకరినొకరు నిందించుకొనుచున్నారు. వీరియాకారములు చూడఁగా నాకు భయ మగుచున్నది. నీ వేలాగుననైన వీరి నిప్పుడు వారించి శాంతచిత్తులం జేయుము.

నార—(ఇంద్రునితో రహస్యముగా) మనము వారించినను వీరిప్పుడుప్రశాంతులగువారు కారు. ఈమునివృషభు లిద్దఱును గోపావేశముచేత దేహములు తెలియక బలిసి క్రొవ్వియున్న యాఁబోతులవలె అంకెలుఁ వేయుచు నొకరిమీఁద కొకరు దుముకుచు, గయ్యమునకుఁ గాలు ద్రవ్వుచున్నప్పుడు మనము వలదన్న మరలుదురా! ఎవ్వరికో యొకరికిం బరాభవము సంభవించినతరువాత మనప్రార్థన మక్కఱలేక తమంతనే వీరూరకుందురు. అయినను సమయము చూచి యీవిశ్వామిత్రుని శాంతస్వాంతునిఁ జేసెదను.

విశ్వా—(వసిష్ఠునివంకఁ దిరిగి) ఓరీ దురాత్మా! అసత్యవాక్యములను బొంగడుటకు నీకొక్క నాలుక చాలదు. నీ నాలుక లిప్పుడు వేయి కావలెను.

ఉ. చాలును జాలు డస్సితివి; సభ్యులు మెచ్చి రయారె నీదు వా
చాలత; యూరకుండు మిఁక; చప్పిడిమాట లివేల! నేను నే
లీలలఁ జిక్కు వెట్టి యవలీలఁ ద్రిశంకునిపట్టిచేత నే
వేలు మ్రొక్కు తెల్లి యనిపించెదఁ; బన్నిద మేమి! చెప్పుమా.

మ. చని నీ విప్పుడు తిన్నగా నలహరిశ్చంద్ర క్షమాధీశునిం
గని ధైర్యావ్యయతుఁ జేయు మాతనిని నీ గర్వోక్తుల న్మాని, నీ
ఘనశక్తిం గొనియాడువాఁడ నటుపై కౌశ్మీరభర్త ధైర్యంబుతో
నఖమాత్రంబును బొంకకుండిన మదీయానూనయత్నంబునన్.

వశి-మ. అవురా! యేమిప్రతాపవాక్యములు! మాయల్సేయు దే నీవుభూ
ధవునిం దేవుఁడె ధైర్యవంతునిగఁ దొల్తం జేసెఁ బుట్టించుచో;
నవనిం గ్రొత్తగ నొక్కఁడేల యిఁకఁ జేయుం ధైర్యధారేయుగా
అవలీలం జని చేత నైన నసృతం బాడింపుమా యాతనిన్. 25

ఉ. నీవును నిన్నువంటియవినీతులు వేఁకొకకోటి కూడి యీ
భూవలయంబునం గలుగుబూటకముల్ మటుమాయ లింద్రజా
లావళు లెన్ని పన్నిన, మహాపద లెన్ని ఘటించినన్, నృపుం
గేవలమిథ్య యింత పలికింపఁగ మీతర మౌనె యెప్పుడున్? 26

శా. వేయేండ్లు త్తలక్రిందు లైన, విను మావిశ్వంభరాధీశ్వరున్
మాయ ల్పన్ని యసత్యమీవు పలికింప న్లేవు; నిష్కారణం
బాయాసంపడ నేల! మానుకొనుమీ వ్యర్థప్రయత్నం బటుల్
సేయంగా మదిఁగోల్పడేని, త్వరలో సిద్ధించు నీ కోటముల్. 27

(సభవంకఁ దిరిగి ఓ సభ్యులారా!

మ. వినుఁడీ నాప్రతిజ్ఞ; యీతఁ డలయుర్వీనాథు బొంకింపఁగ
ల్గినచో, నేను గులంబులోన వెలియై, లీలన్ శిరస్సంతయున్
మునుమట్ట న్గొఱిగించుకొంచును, దపోముఖ్య క్రియ ల్మాని, లో
కనుమానింపక వీధులందు ఖరవాహానం బెక్కి యూరేగెదన్. 28

విశ్వా—(సభవంక దృష్టి నిగిడించి)

ఉ. వింటిరె యీదుకుక్తులను? వేలుపులార! మునీంద్రులార! నా
వంటిమహాతపోధనుఁడు పంతము పట్టిన, నొక్కమర్త్యునిన్
బంటుతనంబు మానిచి యబద్ధములం బలికించు టెంత? నేఁ
గంటున నానృపాధమునిఁ గష్టము పెట్టి, కలంతు స్వాంతమున్.

చ. అతఁడొకపట్టునన్ మృషల నాడక యుండిన, రాజ్యమంతయుం
జతురతఁ గొల్లువుచ్చి, ఘనసంతదల న్హరించి నెయ్యపున్
సతి నెడఁబాపి పుత్రకునిఁ జావఁగ, జేసి, కులంబు కూల్చి, పె
న్వెతలను బెట్టి ధైర్యమును వేయివిధంబుల రూపు మాపెదన్.

ఉ. ఇంచుకయేనతఁడు చలియింపక బాధల కోర్చి నిల్చినన్
మంచుమలన్ జలాశనతమై బహుకాలము నిష్ఠ నిల్చి యా
ర్జించిన యాతపస్సున నరేంద్రునకర్ధము ధారపోసెదన్?
వంచనకాదు; నేఁ బ్రతిన పట్టితి నిందఱ సమ్ముఖంబునన్. 31

నార—ఓ విశ్వామిత్రా! కోప ముపసంహరింపుము. అఁబో
తును అఁబోతును గ్రుమ్ములాడి నడుమ లేగకాళ్లు విఱుగగొట్టినట్లు
మీలో మీరు పంతములుపట్టి నిష్కారణముగా హరిశ్చంద్రుని
బాధింపఁ బూనినా రేమి? ఇది మీకు బుద్ధికాదని చెప్పి యీ మహేం
ద్రుఁడు మీ యిరువురకలహములను వారింపు మనుచున్నాఁడు.

విశ్వా—(కోపముతో) ఏమేమీ! ఈ యింద్రుఁడు శరీరము
నిండ వేయికన్ను లున్నను స్వపర తారతమ్యమునుగానఁజాలకున్నాఁడు!

నన్ను శాంతింపుమని చెప్పుటకీ శచీకాంతుఁ డెంతటివాఁడు! ఈతని యాజ్ఞకు లోఁబడుటకు నే నీతని సేవకుఁడను గాను. స్వర్గము చుట్టును దిరిగి నిత్యమును వీణవాయించుచు ననుసరించెదు నీవును ఎల్లప్పుడు నిల్లు కాచుకొని దీవించి యాశ్రయించు బృహస్పతియును, ఈతని యాజ్ఞ వినవలెను గాని స్వచ్ఛందవిహారుల మయిన మే మేలవిన వలెను! ఈ వెడఁగు మును లందఱును తన్నొక పెద్దఁ జేసి వెఱ్ఱిస్తుతులు చేయుటచే నింతలోనే తలక్రొవ్వి యితఁడు తారతమ్యపరిజ్ఞాన మెఱుఁగఁ జాలకున్నాఁడుగా! తనభార్యయెడ మహాపరాధము చేసినను సహించి యూరకుండుటకు నే నానోరుమాలిన గౌతముఁడ నను కొన్నాఁడేమో! కాదని చెప్పుము. వెనుక నేను స్వర్గమునకుఁ బంపిన త్రిశంకు నీతఁడు దుర్నీతుఁడయి క్రిందికిఁ బడద్రొబ్బినప్పుడు క్షమించి యూరకున్నదాని కిది ఫలము కాఁబోలును! ఆ యవమానశల్యము నామనస్సున నాటియున్నది. మఱచిపోలేదని యింద్రునకు నీవు స్మరణకుఁ దెమ్ము.

గౌత—నేనిఁక నిట నిలువఁగూడదు. (అని చివాలున లేచి పోవుచున్నాఁడు)

కశ్య—(మునులను సైగచేసిపిలిచి) ఓ తాపసోత్తములారా! ఈ తామసుఁడు వెడఁగులమని మనలనందఱను నిందించుచున్నాఁడు. దుష్టున కెప్పుడును దూరముగాఁ దొలఁగవలెను. మన మిచోటు పాయక మన మొకటియు నీతఁడొకటియు ననుచున్న పక్షమున వివాదము పెరిఁగి యన్యోన్యశాపములవఱకును వచ్చును.

వామ—అవును. మీరు సెలవిచ్చినది సత్యము. వేగముగా మనమిక్కడనుండి తరలుటయే మంచిది. ఈతనికిఁ దగినవాఁడొక్క మనమువ్యాసుఁడే. అతఁడిప్పు డిక్కడ లేఁడు. పోదము రండు.

(అని ఋషులు నిష్క్రమించుచున్నారు)

వశి—(తనలో) ఈమునులందఱు లేచిపోయిన తరువాతఁ గూడ నేనిక్కడనుండి యీమూఢుని కోపవచనములు వినుచున్న పాప మొదవును. నేనును మా యాశ్రమమునకుఁ బోయెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

ఇంద్రు—(తనలో) ఇతఁ డతిమూర్ఖుఁడు; పరమకోపి నన్నిప్పుడు శపించినను శపింపవచ్చును. మూర్ఖుల కెప్పుడును గోపము ముక్కుమీఁదనే యుండును. ఈతని కోపమునకు వెఱచి మునులందఱును లేచిపోవుచున్నారు. ఇక్కడ నేనొక్కఁడను జిక్కుపడితిని. మంచిమాటలతో నేలాగునైనను నేనీతని నిప్పుడు మెల్లఁగా వదల్చుకోఁ గలిగితినా తలతడవి చూచుకొనెదను. (ప్రకాశముగా) స్వామీ! నారదుఁడు దేవరవారి ప్రభావమెఱుఁగక యేమో విన్నవించినాఁడు. మిమ్మాజ్ఞాపించుటకు నేనేపాటివాఁడను! దేవర యీ సేవకున కేదయిన నాజ్ఞ యిచ్చినపక్షమున, శిరసావహించిచేయుట కిదిగో సిద్ధముగా నున్నాఁడను. దేవరవారు హరిశ్చంద్రుని సత్యసంధతకు మెచ్చి మీ తపస్సులో సగమాతని కనుగ్రహించినయెడల దేవరవారికిఁ బ్రీతికరముగా నుండునేని నేనును యథాశక్తికి హరిశ్చంద్రునిఁ బదునాలుగు మన్వంతరములు నాయర్ధాసనంబున నిలిపి దేవరయనుగ్రహమునకుఁ బాత్రుఁడ నయ్యెదను.

విశ్వా— విశ్వామిత్రుఁ డొక్కనిజక్కఁగాఁ బరిశోధించిఁ మెచ్చి సత్యసంధుఁడని నిర్ధారణము చేసినప్పుడ తత్సత్కారమాతఁడే చేయవలెనుగా సత్కరించుటకుఁ బరు లెంతవారు! ఈదేవతాధము లెంతవారు! వీరికి నాథుఁడవైన నీవెంతవాఁడవు! ఏబహుమానము చేసినను నేనే చేయవలెను. కాఁబట్టి నీ విప్పుడు చెప్పిన పదునాల్గుఁ మన్వంతరములును నేనే యాతనిని భూమినేలించి మఱి పదునాలుగు మన్వంతరములు కూడ నేనే నీయర్ధాసనమునం దారాజును నిలిపె

దను. నీవు నీగర్వమును విడిచి దాసుఁడ ననుచున్నందున నిన్ను క్షమించినాఁడను. ఇఁక నీవు నీచింతామణిపీఠమును సిద్ధముగానుంచి మాయాజ్ఞను వేచియుండుము.

దేవతలు—ఉన్నట్టుండి యీతనికోప మిప్పుడు మనవంకఁ దిరుగుచున్నది. మనముకూడ శీఘ్రముగా మునులు చూపినమార్గమునే పట్టుదము. (అని నిష్క్రమించుచున్నారు)

ఇంద్రు—(తనలో) ఈమూర్ఖుఁ డిక్కడనుండి మనల శపింపకుండ లేచిపోవువఱకును, ఈతఁ డేమిచెప్పినను నౌనని తలయూఁచుచుండవలెను. (ప్రకాశముగా) స్వామీ! దేవరయాజ్ఞను శిరసావహించి చేసెదను. నేను తెలియనివాఁడను; మూఁడుమాఱులు కాలుతప్పులువచ్చెను. అజ్ఞానముచేత నేనన్నదాని మఱచిపోయి, మీయిచ్చవచ్చినన్నాళ్ళు హరిశ్చంద్రుని స్వర్గమున నిలుపుఁడు.

నార—ఓవిశ్వామిత్రా! మాచినావా? భూలోకమున హరిశ్చంద్రుఁడు చేయఁబోవుచున్న రాజసూయయాగములో హవిర్భాగములు తెచ్చుకొనుటకై కాఁబోలును సభలోనున్న దేవతలందఱును విజయం చేయుచున్నారు. ఇఁక నింద్రుఁడు నక్కడకే పోఁదలఁచినట్టున్నది. అధ్వర్యులును, ఉద్గాతలును, హోతలును, బ్రహ్మలును గాఁగోరి కాఁబోలును మనతోఁ జెప్పకయే ఋషులందఱును దేవతలకంటె ముందుఁగా బరుగెత్తుచున్నారు.

విశ్వా—నారదా! నీవుచక్కఁగా స్మరణకుఁ దెచ్చినావు. నే నిప్పుడాయజ్ఞమునకుఁ బోయి హరిశ్చంద్రుని విశేషవిత్తమడిగిపుచ్చుకొని మాయచేసి భంగింపఁదగు ప్రయత్నములో నుండవలెను. (చూపునలుఁగడలఁబఱపి) అదుగో దూరమున దర్భాసనములు మడఁచి చంకఁబెట్టుకొని యొకరుపోయినత్రోవ నొకరుపోక మును త్రొక్కులుపడ గెత్తుచున్నారోచూడుము. వారివెనుక దేవతలును భయము

చేత మాటిమాటికి వెనుకతిరిగి చూచుచుఁ బరుగెత్త కాళ్ళురాక మెల్లఁగా నడుచుచున్నారు. ఈపిఱికిపందలందఱు నాకు వెఱచి పారిపోవుచున్నారు కాని యజ్ఞమునిమిత్తము కాదు. నాకోపమునకు దిక్పాలకులును దేవతలును మునీంద్రులునే యిట్లు వడవడవడఁకుచు నిలువలేక పాఱిపోవుచుండఁగా నిఁక మనుష్యమాత్రుఁడైన హరిశ్చంద్రుఁ డెంతవాఁడు? నేనిప్పుడ మర్త్యలోకమునకుఁ బోయి హరిశ్చంద్రుని బొంకించి నాచిరకాలశత్రువైన వశిష్ఠుని పరాభవమును శీఘ్రముగాఁ జూడవలెను పోదము రమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## ద్వితీయాంకము

[రాతిపైఁగూర్చుండి మార్కండేయుశిష్యుఁడు జాబాలి కనఁబడుచున్నాఁడు.)

జాబాలి—(తనలో) మాగురువుగారు నన్ను సాహోదసరస్సునకుఁబొమ్మని పంపినారు. నేనిక్కడకు వచ్చునప్పటి కెదుట రెండు దారులు కనఁబడుచున్నవి. ఇం దేదారి సాహోదమునకుఁ బోవునో తెలిసికొనఁజాలకున్నాను. ఏపుణ్యాత్ముని నైన నడుగుదమనంటినా యీనట్టడవిలో మనుష్యసంచారమే కానరాదు. ఏమిబుద్ధి? (ముందువంక చూపు నిగిడించి) అదిగో దూరమున నెవ్వఁడో బ్రాహ్మణుఁడు కుంటుచు వచ్చుచున్నాఁడు? అతని నడిగి తెలిసికొనెదను.

(అప్పుడు రాజుయొక్క వేడుకచెలికాఁడయిన గాలవుఁడు, కఱ్ఱ చేతఁ బట్టుకొని మెల్లఁగా నడచుచు ప్రవేశించుచున్నాఁడు.)

గాల—(నిట్టూర్పువిడిచి తనలో) అయ్యో! వేటగాండ్ర మాటలు నమ్మి మోసపోతినిగదా! మొదలే నానీడను జూచి నేను జడిసికొనెడు ధైర్యశాలిని; ఆమీఁద రాజుగారీటెతోఁ బొడిచి చంపినపులిని జూచి హృదయము చెదరియున్నాను. అట్టి నన్ను దిగవిడిచి యాకిరాతులు రాజుగుఱ్ఱము వెంట మునుపరుగెత్తుటచేత వాండ్రను కలిసికొనలేక వెనుకపడి దారితప్పి యీప్రకారముగా వనచరుఁడనయి యిందుఁ దిరుగుచున్నాను. ఈరాళ్ళలో నడచుటచేత కాళ్ళు బొబ్బలెక్కినవి. అంతేకాక కురుపుమీఁద తేలుకుట్టినట్లు కుడికాలిలో ముల్లుకూడఁ గ్రుచ్చుకొని వేధించుచున్నది. బ్రాహ్మణుఁడ ననియైనఁజూడక భక్తిమాలిన ఘాతుకమృగ మేది యేపొదలోనుండి వచ్చి పాపముకట్టుకొనిపోవునో యని నాకు భయమగుచున్నది. జన్మమెత్తినతరువాత జ్వరమువచ్చినప్పుడైన నొకపూట భోజనము మానియెఱుఁగని సుకుమారుఁడనైననేను రాత్రినుండి తిండిలేక శుష్కోపవాసముచేయుచున్నాను; కడుపు వెన్నంటుకొనిపోయినది; కన్నులు గుంటలుపడినవి. నాయరణ్యరోదనము విని నాకిక్కడ సమాచారము చెప్ప వారెవ్వరున్నారు? నాపుణ్యవశముచేతఁ బూర్వముచూచియున్న సారోదసరోవరమార్గమునకు వచ్చియున్నాను. ఈయడవిలో నిడుములుగుడుచుచు పరిభ్రమించుచుండుటకంటె రాజజాడ తెలియకపోయినయెడల సారోదముమీఁదుగా దిన్నగ మాయూరికి దారితీసి యింటికిఁబోయి నాభార్యతో నాకష్టములు చెప్పుకొని మరలఁ బ్రజలలోనైన బడెదను. అదిగో ముందెవ్వఁడో ఋషికుమారుఁడొకఁడా శిలాతలముమీఁదఁ గూర్చుండి నావంకఁ జూచుచున్నాఁడు. అతనికి రాజజాడ యేమయినఁ దెలియునేమో పోయి యడిగెదను.

జాబా—ఓబ్రాహ్మణోత్తమా! నమస్కారము. నీవెఱిఁగిన పక్షమున సారోదసరస్సునకు దారిచూపి నాకు మాగురువుగారివలని చీవాట్లు తొలఁగించి పుణ్యముకట్టుకొమ్ము.

గాల—ఓఋషికుమారా! నమస్కారము. నాకు హరిశ్చంద్ర మహారాజుగారి జాడ కొంచెము చెప్పినపక్షమున నీకు సారోదము నకు దారిచూపెదను. మీగురువులెవరు? సారోదమునకు మిమ్ముఁ బంపినపని యేమి?

జాబా—నీవెవరిజాడ నన్నడిగితివో వారిపనిమీఁదనే బోవు చున్నాను. నేను మార్కండేయశిష్యుఁడను. నన్నందఱు జాబాలి యందురు. మా తపోవనమిక్కడకు మిక్కిలి సమీపముననున్నది. ఇంతకుముందే హరిశ్చంద్రమహారాజుగారు దూరముగా నశ్వమును దిగి పాదచారులయి మాయాశ్రమమును బ్రవేశించి మాగురువుగారి వలన నతిథిసత్కారమును బొందినారు. వారిరువురును మాటాడుచో గురువుగారు నన్నుఁబిలిచి, యీరాజుగారు వేఁటతమకముచేతఁ బరి వారమును వెనుకవిడిచి వరాహము వెంట నొంటిగా ముందువచ్చి నారు. నీవుపోయి సారోదమువద్ద నీరు నిలువనియమించివచ్చిన చంద్రమతి మొదలయినవారిని సపరివారముగా సిద్ధపటమునకు వెంటఁ బెట్టుకొని రమ్మని సత్యకీర్తితోఁ జెప్పుమని చెప్పినారు. నీవేల హరి శ్చంద్రుని వెదకుచున్నావు?

గాల—నేనాహరిశ్చంద్రమహారాజుగారి చెలికాఁడను. నా పేరు గాలవుఁడు. నేనును రాజువెంటనే బయలుదేఱి దారితప్పి కుడుగులజాడనుబట్టి యింతవఱకు వచ్చినాను. ఇక్కడ వాళ్ళెంగో గాడ తెలియరానందున నెటుపోవుటకును దోఁచక నాకు దారి చెప్పెడు పుణ్యాత్ము లెవ్వరయిన దొరకుదురాయని చింతించు చుండఁగా, వెదకఁబోయిన తీఁగ కాళ్ళకు జుట్టుకొన్నట్టు భాగ్య

వశమ్ముచేత నీవు నాకంటఁ బడినావు. నాపాలిటి భాగ్యదేవతయే నిన్నిక్కడకుఁ బంపినది కాఁబోలును.

జాబా—ఆహా ! ఏమి యీరాజురూపరేఖావిలాసములు ! అతనిని జూచినప్పుడు విలాసార్థముగా భూమిమీఁద విహరింప వచ్చిన యింద్రుఁడో చంద్రుఁడో యని నేను భ్రమపడినాను.

గాల—ఆయన దర్శనమువలనఁ గృతార్థుడవైన నీకు బతివ్రతాశిరోమణియైన చంద్రమతి సౌందర్యమును సందర్శించుభాగ్య మెప్పుడయిన లభించినదా?

జాబా—అట్టిభాగ్యమింకను నాకన్నులకు లభింపలేదుగాని, సృష్టియారంభించినతరువాత నేఁటికాలమున కిట్టి యనన్యసామాన్య లావణ్యమూర్తులయిన యీదంపతులను సృజింపఁ గలిగితినిగదాయని బ్రహ్మదేవుఁడు తననిర్మాణచాతుర్యమునకుఁ దానే గర్వపడుచున్నాఁ డని మాగురువుగారు చెప్పుచుండఁగా వినెడుభాగ్యము నాకర్ణము లకుమాత్రము లభించినది. అందొకరూపమును జూడనోచి నాకన్ను లింతకుమునుపే సగము పావనములయినవి కాని యింకొక నిమిష ములో నీసాయముచేత రెండవరూపమునగూడఁ గాంచిపూర్ణముగా ధన్యములు కావచ్చును.

గాల—అందుకు సందేహములేదు. అందఱును మహాసౌంద ర్యశాలులని చెప్పుకొను రతీమన్మథులొకవేళసరివచ్చిన వత్తురేమో కాని నేను జూచినంతవఱకీలోకములోఁ జక్కనిచుక్కలని పేరుపొం దిన వారెవ్వరును మారాజదంపతుల కాలిగోరునైనను బోలరు.

జాబా—సరిసరి! ఈరాజుసౌందర్య మెక్కడ! కందర్పా గుల సౌందర్య మెక్కడ! ఈయన రూపమునకు మన్మథునిరూపమునకును హస్తిమశకాంతరమున్నదట! చిరకాలజీవు లగుటచేత మాగురువుగారా రతీమన్మథులను శివుని నేత్రాగ్ని వెలువడని కాలమునుండి యెఱుఁగుదురు, మాయీాళ్ళీమ

మునకు వచ్చినవా రెవ్వరైనఁ జంద్రమతీ హరిశ్చంద్రులను రతీమన్మథులతోఁ బోల్చినప్పుడు మాగురువుగారు కోపపడి రూపమునుబట్టి చూడఁగా రతీమన్మథులు వీరిపాదములకు దాస్యముచేయుటకైన నర్హులు కారని యానతిచ్చుచుందురు.

గాల—అట్లయిన నిఁక నిశ్చయముగా జయంతవసంతాదులకు సౌందర్యగర్వభంగ మగును.

జాబా—సందేహ మేమి? వీరిమూలమునఁ దాము సౌందర్యవంతులన్న ఖ్యాతిపోయినదని సిగ్గుపడి రతీమన్మథు లిప్పు డెవ్వరికంటను బడకున్నారు. చంద్రమతి సోయగమును విని రంభ యంతటిది తలవంచుకొన్నదఁట! ఇఁకఁ దక్కిన యప్సరస స్త్రీలమాట చెప్పనేటికి?

గాల—అవును వారిచక్కఁదన మచ్చరలనైనఁ జిన్నవుచ్చఁ దగినదే. కాని నేనిప్పుడు వారిని శరీరసౌందర్యమున కంటెను గుణసౌందర్యముకొఱ కధికముగా గౌరవించెదను. ఈదంపతు లిరువురును కేవలరూపముచేతనే కాక గుణములచేతఁ గూడ నిరుపమానశోభాపరిపూర్ణులుసుమా.

జాబా—నీవురూపమునకంటె మీరాజుగారి సద్గుణములనే హెచ్చుగా మెచ్చుకొనుచున్నందున మీరాజుసత్కార్య మేదియైన నేను వినఁగోరెదను.

గాల—మొన్న మారాజుగారుచేసిన రాజసూయయాగమునకుమీగురువులును వేంచేసి యుండిరిగదా?

జాబా—అవును మాగురువుగారాయజ్ఞవైభవమంతయు వేనోళ్ళఁ బొగడినారు. దేశదేశములనుండి దక్షిణలనిమిత్తమై రాకపోకలుచేసెడుబ్రాహ్మణులకప్పుడు రాత్రిందివములు గగనమార్గములే రాజమార్గములయినవి. నీవు దాతృత్వవిషయమును చెప్పఁబోవుచు

న్నావు గాంబోలును. అదిచెప్పనక్కర లేదు. అప్పటి దానధారాప్రవాహములచేత నూరిబయులం జిన్న యేరులు పాఱినవని కన్నులారా జూచిన ఋషులే సెలవిచ్చినారు. ఆతండర్థుల కిచ్చిన ధనకనకరత్నరాసులనుజూచి యీభూమిలో నింతధనమున్న దాయని మునులందఱు నత్యాశ్చర్యపడినారు.

గాల—యజ్ఞకాలమునూట యటుండనిమ్ము. యాజ్ఞానంతరమునగూడ విశ్వామిత్రుడువచ్చి యజ్ఞార్థము యాచింపంగా విశేషవిత్తములేని యసమయమయినను వచ్చినయర్థిపుంగవుని సంతుష్టాంతరంగునిం జేయుటకై యూరకపంపుట కిష్టములేక యేనుగుమీఁద నెక్కి మనుష్యుఁడు నిలుచుండి రత్న మెగమీటినంతయెత్తు ధన మాతనికి దానమిచ్చిరి.

జాబా—ఆహా! ఏమి యౌదార్యత్వము! అంత ధనము విశ్వామిత్రుఁడును శిష్యులును మోచుకొని పోఁగలిగిరా?

గాల—వా రాధనమును దీసికొనిపోనే లేదు. కావలసినప్పుడు వచ్చి పుచ్చుకొందునని చెప్పి విశ్వామిత్రుఁ డాధనరక్షణభారమును మారాజుమీఁదనే మోపిపోయినాఁడు.

జాబా—సరిసరి. ఇప్పుడునీవలన విన్నదానికిని మాగురువుగారన్నదానికిని సరిపోయినది. ఏదోకపటోపాయముచేత నీరాజుగారిని మోసపుచ్చుటకయి విశ్వామిత్రుఁ డీ తంత్రము పన్నినాఁడుకాని నిజముగా ధనము కావలసి యీపనిని చేయలేదు. అతనికి ధనమే కావలసియుండినయెడల యజ్ఞదినములలో సమయమున కేలరాకుండును? ఇచ్చినప్పుడే యేల తీసుకొనిపోకుండును? అతఁడు మీరాజు నేలాగునైన బొంకింతునని ప్రతిజ్ఞ పట్టియున్నాఁడఁట! ఇది యాతనికృషికంతకు కారణము.

గాల—విశ్వామిత్రుఁడు కాఁడుకదా వేవురువిశ్వామిత్రులొక్కసారిగా వచ్చి వేయేండ్లు తలక్రిందుగాఁ దపస్సు చేసినను మారాజు నొక్కయసత్యమును బలికింపలేరు. విశ్వామిత్రుఁడు మహాతపశ్శాలియనివిందుమే. యట్టివాఁడు తనకు ధనమిచ్చినదాతయెడల నంతటిద్రోహము తలంచునా?

చ. తన కుపకారమున్ సలుపుదాతయెడం గరముం గృతఘ్నుఁడై
మని యతఁ డెగ్గుచేసినను, భూమిపయింగదు డస్సియాఁకటన్
వనరుచుఁ జెట్టు చేరఁ జని బాగుగ నీడను విశ్రమించి పం
డ్లను దిని యమ్మహీజ మొకటం దెగఁగొట్టు కిరాతుఁ బోలఁడే.
దయారసవిశిష్టులయిన మునిశ్రేష్ఠు లంతటిపనికి సాహసింతురా?

జాబా—మనబ్రాహ్మణోత్తము లెంతటికైనను సాహసికులే. పూర్వము బ్రాహ్మణులు నృగమహారాజువద్ద దానముగొని యాతనినే యూసరవల్లివగునట్లు శపింపలేదా? ఆసంగతి యటుండనిమ్ము. మీరాజు సకలసద్గుణ సంపన్నుఁడని చెప్పుచున్నావుగదా సప్తవ్యసనములలో నొక్కటైన యీఁవేటయందేల యాసక్తుఁడయ్యెను?

గాల—మారాజు కేవలవినోదార్థముగా వేఁటకు రాలేదు. భూమి యీవిధముగా నకస్మాత్తుగా లెక్కలేని జంతువు లొక్కసారిగాఁ బుట్టి యెల్లయెడలను దామే యయితోఁటలు దొడ్లు పయిరులు పంటలు పాడుచేయుచున్నవని కాపులువచ్చి మొఱ్ఱపెట్టుకొనఁగా ఘాతుకమృగబాధ తొలగించి ప్రజాసంరక్షణముచేయుట రాజధర్మమగుటచే మారాజుగారిప్పుడు జనక్షేమముకొఱకే వేఁట తలపెట్టినారు.

జాబా—ఇటువంటి సమయములయందు వేఁట దుర్వ్యసనమని నేను నిందింపను గాని యిన్నిజంతువు లాకస్మికముగాఁబుట్టుట చూడఁగా నాకిది విశ్వామిత్రసృష్టిగాఁ దోఁచుచున్నది.

గాల—నేనట్లు భావింపను. మనుష్యమాత్రుఁడయిన యొక ఋషి యెక్కడ? జంతుసృజనయెక్కడ? ఈమాట నమ్మనర్హముగా నుండలేదు.

జాబా—పూర్వమొకసారి బ్రహ్మతో బ్రతిఘటించి సృష్టికిఁ బ్రతిసృష్టి చేయఁగలిగిన మహానుభావుఁ డీజంతుసృష్టి చేసినాఁడన్న వింతయేమున్నది? (పరువంకఁజూచి) అయ్యో! మనము మాటల పరాకున వచ్చినకార్యమును మరచి యాలస్యము చేయుచున్నాము గదా! అంతకంత కెండ యెక్కుచున్నది. నాకు శీఘ్రముగా సారోద మునకు దారిచూపి పుణ్యమునఁ బొమ్ము.

గాల—ఇదేమార్గము. నీవు తిన్నగాఁ బొమ్ము. నే నీమార్గ మునఁ బోయి మారాజును గలిసికొనెదను. ఇదేమి యీమార్గమున కడ్డముగాఁ జమురొలికియున్నది! దొప్పలతో నెయ్యికొనిపోవునప్పుడు మీ తాపసకుమారు లెవ్వరో దారిపొడుగుననొలుకఁబోసియుందురు.

జాబా—ఇది చమురొలుకుట కాదు. రాజుగారి యీపోటు తిని పాఱిపోయిన యడవిపంది కడుపులోనుండి కాఱినక్రొవ్వు. నీకా పందియడుగులు కనఁబడుచుండలేదా? ఇదియేమి? అముందు చూడుము. దారికడ్డముగా రక్తప్రవాహములు కాఱఁగా నేటుతిన్న వ్యాఘ్ర మెట్లు కాలీడ్చుకొనుచు మెల్లఁగా నడిచి ప్రక్కయడవిలో దూఱినజాడ కనఁబడుచున్నదో! నీవు పోయినకొలఁదిని కుప్పలుగాఁ గూలియున్న క్రూరమృగములను జూచి మీరాజుగారి మృగయా విహార సామర్థ్యమునకు సంతోషించెదవు.

గాల—చాలును. నాకిప్పు డామృగములపేరు చెప్పినదేహము కంపమెత్తుచున్నది. నేనాదారిని నిఁక నొంటిగాఁ బోలేను. నేను నీతోడ నేవచ్చి తరువాత రాజుగారినిగలిసికొనెదను. పోదమురమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము

రంగము—విశ్వామిత్రాశ్రమోపాంతవనము

[హరిశ్చంద్రుఁడును, చంద్రమతియు, లోహితాస్యుఁడును, సత్యకీర్తియు, గాలవుఁడును, భటులగు భద్రుఁడును పాలకుఁడును ప్రవేశించుచున్నారు]

లోహి—(చేయి చాఁపి వ్రేలితోఁ జూపుచు) నాన్నగారూ! ముద్దులమూటకట్టుచున్న యీ లేడిని నా కాడుకొనుట కయి పట్టి తెచ్చి పెట్టరా?

హరి—కుమారా! సర్వవిధముల నేను దానిని నీకిప్పుడు జీవముతోనే పట్టియిచ్చుటకుఁ బ్రయత్నించెదనుగాని, అది యొకవేళ పట్టుపడకపోయినయెడల నావాఁడిబాణముతో దానిప్రాణమునుగొని నీ వాడుకొనుటకయి దానిచర్మమునైనను దెచ్చియిచ్చెదను. ఓ గాలవా! నాధనుర్బాణములు నిటు తెమ్ము.

చంద్ర—ఓ ప్రాణేశా! వేఁటాడియాడి యలసియున్న మీ రిప్పు డీపిల్లవాని మాటలనుబట్టి యీ లేడివెంట మరల వ్యర్థప్రయాస మేల పడెదరు? కొంచెము సేపిట విశ్రమింపుఁడు.

హరి—ఓ ప్రాణేశ్వరీ! అట్లుగాదు. ఎంతో ముచ్చటపడి బాలకుఁ డింతచిన్నకోరికను గోరినప్పుడు చేతిలోనున్న యీపనిచేసి నేను వీనిముద్దుల్లు చెల్లింపకుండఁగలను? నేను దీని నింతలోఁ బట్టి తెచ్చి, అనాయాసముగా వీనికోరిక తీర్చెదను.

లోహి—మీ రలసియున్నయెడల నేనే యీ లేడిని బట్టుకొనెదను లెండి. మీ రిక్కడ నుండుఁడు. (అని ముందుకు నడువఁబోవుచున్నాఁడు)

సత్య—ఓ లోహితాస్యా! నిన్ను మెచ్చవచ్చును. నీపితండ్రి బిడ్డ వగుటకుఁ దగినమాట చెప్పినావు. లోకములోఁ బువ్వు పుట్టినతోడనే పరిమళము తెలియవచ్చునుగదా!

క. ఘనపంచాస్యముకడుపున
జనియించినపిల్ల కూడ సమదగజంబున్
గనుఁగొన్న బయికి దుముకఁగఁ
జనఁ జూచును గాదె సహజసాహస గరిమన్.

హరి—(చేయి పట్టుకొనిలాగుచు) కుమారకా! ఈసాహసము చాలును. నీవిఁక నిలువుము. నేనుబోయి యీ కురంగమును గొని వచ్చెదను. (అని గాలవునివంకఁ జూచుచున్నాఁడు)

గాల—మీశరశరాసనము లిప్పుడే యిచ్చెదనుగాని, పేద బ్రాహ్మణుఁడను నన్నుమాత్ర మొక కంటఁజూచి మతిబాణమును విడువుము. నా ఋణఫణములను నేను వచ్చునప్పుడింటివద్ద నా భార్యతోఁ జెప్పియైనను రాలేదు.

హరి—ఓయీ! మహాశూరుఁడా! భయపడఁబోకు. లేడి యీ సుందర మాకందపాదపసమీపమునముందువైపున నున్నది కాని నీవైపున లేదు. అదిగో—

ఉ. కెంపులచాయ మేనఁ దులకింపఁగ, వాలు వజ్రకాంతులన్
నింపఁగ, జెక్కుచాలుహరి నీలములన్ హసియింపఁగా, మెడన్
సొంపుగఁ ద్రిప్పి యీకడను చూచుచు, పచ్చిక నల్లమేయుచున్
బెంపుదులేడి యోయనఁగ భీతిలకున్నది చూడు గాలవా!

గాల—అట్లయిన నివిగో బాణములనుబాణాసనమునుబుచ్చుకొని యీదిక్కున నీ మనసువచ్చునన్ని మృగములను వేఁటాడుము. నేనిప్పు డన్నమాట మిత్రోత్తముఁడవైన నీకు బ్రహ్మహత్యామహాపాతకము వచ్చునన్న సంకోచముచేతనే కాని నా ప్రాణభీతిచేతఁ గాదుసుమా. ఏమి యీ లేడి మనలను జూచియు బెదరిపాఱక నిశ్శంకముగా నిలుచున్నది. ఇఁక నీవు పోయి చేయిచాఁచి దానిని బట్టుకోవచ్చును. ఇది మాంసభక్షణముచేయుని మావంటి జీవదయాపరు

లయిన బ్రాహ్మణులుండుచోటు కాఁబోలును! కాకున్న నీపిల్ల లేడి
యిట్లు నిర్భయముగా మనమాటలు వినుచు నిలువఁబడదు.

హరి.—నీవన్నది సత్యమే. అదిగో చూడుమా పయిదేదో
తప్పక యొక ఋష్యాశ్రమమే. [దుక్;

మ. అదె యాలింపుము దూరమందు శ్రుతివాక్యంబుల్ విన న్వచ్చె
జటలం దోఁచెడు హోమధూమచయమూచాయందగంజూడుమీ;
యిదె యీవఁకను మోదుగుల్సమిధలెంతేఁ ద్రుంపఁబ్రామోళ్ళయ్యె;న
ల్లదె దర్భల్ కదుఁగోయ సిప్పుడిపుడే యానేల మోసెత్తెడున్.

కానిమ్ము. ఈహరిణము నన్ను దూర మలయించి తీసికొనిపోకుండ
నేనిప్పుడే మెల్లగాఁబోయి పట్టికొనెదను. (అని పొంచితాఁకుచు
ముందువఁక మెల్లఁగానడుగు లిడుచున్నాఁడు.) గాలవా! చూడు
మనమిప్పుడు తన్నుఁ బట్టవచ్చుచున్నామని తెలిసికొని కాఁబోలును
చెంగుచెంగున దాఁటుచు నడుమనడుమ మనవంకఁ దిరిగి బెదరి
చూచుచు లేడి యెట్లు పరుగెత్తుచున్నదో!

సీ. పేరెముల్ వాఱుచుఁ బెద్దదాఁటుల బయల్ కాళ్లఁజాడించెడుఁ
గరముఁజూడు। ఖురములనుదరంబు గోఁకుకొంచును బ్రక్కలెగ
యరోఁజుచుసిల్చెనిపుడుచూడు। మెఱుఁగు మెఱసినట్లు మీఁదఁ
దళుక్కని పల్లమున నడంగెఁబయిని జూడు। మరలనిట్టటు నిక్కి
మనవంక మెడద్రిప్పి బెదరి చూచెడు లేడి యదిగో చూడు

గీ. నోట గడ్డిపోచలతోడ నురుఁగు జాఱ
మింటఁ గొమ్ములు చిమ్మెడు మీఁదఁ జూడు
తోఁక జాడించి క్రమ్మఱ పీఁక తోడఁ
బరుగువాఱెడుఁ గనుఁగొమ్ము బయలిమీఁద.

ఆ లేడి మనము చూచుచుండఁగానే యింతలోనే యెంతదూరము
పాఱిపోయెనదో! నేనిప్పుడు శీఘ్రముగా వెంబడించి యించుక సేపు

లోన దాని నలఁగుంచి పట్టి తెచ్చి యీ బాలకుని సంతోషపెట్టెదను.
(అని విల్లును బాణములను చేతఁబూని పరుగెత్తుచున్నాఁడు.)

గాల—అమ్మా! రాజుగారు నన్నిక్కడ దిగవిడచిపోయెగుటచే, వారు భూతదయాపరులన్నమాట నేఁటికి సత్యమయినది. వారిఁక నన్నిలేళ్ళను జంపినను జంపనిండు. నే నదృష్టవంతుఁడను. మిట్ట మధ్యాహ్నవేళ నేనీయెండలోఁబడి కాళ్లుమండ నోరెండ నెత్తిమాడ ధైర్యముపీడ హృదయమదర కాళ్ళు వెనుకకీడ్వ బరుగెత్తి వచ్చి నెత్తురు త్రావెడి యేపులివాతను బడక నాతల్లికడుపు చలువచేతను నాభార్యమంగళసూత్రబలముచేతను నేఁటికిఁ దప్పించుకొని వచ్చి నాను.

చంద్ర—ఓభూసురోత్తమా! నీకూరాలాపములు కొంచెము చాలింపుము. దూరమున రాజుగారి కంఠస్వరమువలె వినఁబడు చున్నది.

హరి—(తెరలో)

చ. కరమును దప్పెనాఁడ; కనుగందెను దేహము జిహ్వయెండెడుఁ:
చరణము లెత్తవాలె; వదనమ్మునఁ జెమ్మట గ్రమ్మె; నింతలో
దొరకదు జింక; యింకఁ గడుదూరము నేఁ బరుగెత్తఁజాల; నీ
శరమునఁ గూల్చువాఁడ నిమిషంబున నీహరిణంబు నిక్కొడన్.

చంద్ర—(గద్గదస్వరముతో) ఓసత్యకీర్తి! అలసితివన్న ప్రాణ వల్లభుని బలుకులు ములుకులవలెఁ జెవులకు సోఁకి తామరాకులోని నీరువలె నాయుల్లము తల్లడిల్లుచున్నది. నన్నిప్పుడు కొనిపోయి హృదయేశ్వరుని చరణసన్నిధానమునఁ జేర్పుము. (అని కన్నీరు విడుచుచున్నది)

సత్య—అమ్మా! కన్నీరు తుడుచుకొని నీహృదయము పదిల పఱచుకొమ్ము. నీవు కేవల స్త్రీస్వభావముచేతను భర్తగారియెడలఁ

గలప్రేమావేశముచేతను మనసుచెదరి దిగులొందుచున్నావే కాని యిప్పుడు ప్రభువువారికి వచ్చినభయమేదియు లేదు. అత డీపాటికి లేడిని యమపురికిఁబుచ్చి మరల వచ్చుచుండును.

గాల—అదిగో మరల నామిత్రునిమాట వినవచ్చుచున్నది. మీరు సంతడి చాలించి వినుండి.

హరి—(తెరలో) ఆహా! మనుష్యుఁ డెంతటి క్రూరకర్ముఁడు! కలలోను బరులకెన్నఁడును కీడుతలఁచి యెఱుఁగక మహారణ్యముల యందు మునులవలె నాకలములుతిని కేవల వన్యాహారములతోనే శరీరధారణము చేసికొనుచు దినములు పుచ్చెడిలేళ్ళ యంతటి సాధుమృగములనుగూడ వేడుకకయి నిష్కారణముగా మారణము నొందించుచున్నాఁడు!

ఉ. నాదుశరంబులేడితొడ నాటినయట్ల తదార్తనాదముల్
నాదుహృదంతరంబునను నాటిశరంబయి, నగ్గలం చెదుర్;
పేదమృగంబు కన్గొనలవెంబడిఁ బాఱెడు బాష్పబిందువుల్
ఖేదముపెంచి నాకనుల క్రేవల నశ్రుల జాలుకొల్పెడున్. 7

చంద్ర—ఇప్పుడు నాహృదయము కుదుటఁబడినది. నా హృదయ వల్లభుఁడు పరిజాపీడాకరములయిన ఘాతుక మృగోత్కరముల నేకాని యీవఱకెన్నఁడును మృగయాసక్తుఁడయి వినోదార్థముగా దయనీయములయిన సాధుమృగములను బాణముపూని వేసి యెఱుఁగనివాఁడగుటచేతఁ దానీయేణమును బాణముపాలుచేసి నందుకుఁ జింతనొందుచున్నాఁడు. ఆహా! నాప్రాణేశ్వరుని హృదయ మెప్పుడును నవనీతకోమలముకదా.

గాల—తాళుఁడు నాచెవులకెవ్వరిదో మఱియొకమాట వినఁబడుచున్నది!

(తెరలో విశ్వామిత్రశిష్యుఁడు.)

ఓరాజా! తప్పించుకొని పోతిననుకొనకుడి రాజ్యగర్వముచేత దేహముఁ గ్రొవ్వి నీ వాశ్రమమృగమును గొట్టినమాట నేనిప్పుడేపోయి యనుష్ఠానమయిన తరువాత మాగురువులయిన విశ్వామిత్రుల వారితో నివేదించి నిన్నేమిచేయించెదనో చూడు.

చంద్ర—(భయముతో) ఈమాటలు విన్నను విశ్వామిత్రుని దలంచుకొన్నను నా చిత్తము స్వాయత్తముకాక తత్తరిల్లుచున్నది. ఈవిశ్వామిత్రుఁడు కోపులలోఁ బరమకోపి. ఆశ్రమమృగమును గొట్టినందున కేమిశపించునో! అన్నిటికి నీశ్వరుడేయున్నాఁడు. కానున్నది కాకమానదు, మించినదానికి వగచిన ప్రయోజనమేమి!

సత్య—(ఆలకించి) ప్రభువువారు వేంచేయుచున్నారు. వారి మాట యీచేరువనే వినఁబడుచున్నది.

హరి—(ప్రవేశించి) దెబ్బతినిపడక లేడియుఁ దపోవనములోఁ దూఱి యదృశ్యమయినది. మునికుమారుఁడును నేనెంతబతిమాలుచు వెంబడించినను నామాటవినిపించుకొనక కోపముతోఁ దొలఁగిపోయినాఁడు. నిష్కారణముగాఁ జేజేత ద్రాఁచుపాము నలగించి గొడవ తెచ్చుకొన్నాఁడను. ఏమికీడు మూడునో, ఆశ్రితాభయప్రదాతయైన యీశ్వరునిమీఁదనే భారమువేసి యాతనినే సర్వమునకు నమ్ముకొనియుండెదను. (అనుకొనుచు వచ్చుచున్నాఁడు)

చంద్ర—(ఎదురుగాఁబోయి) ఓప్రాణేశ్వరా! మీరు సుఖముగావచ్చి మరల నాకన్నులు చల్లపఱచితిరా! మీరెంతోవడదాఁకి బడలి లేఁతతోటకూరకాడవలె వాడుపాఱి యున్నారు. మొగము కందగడ్డవలెఁ గందిపోయినది. క్షణకాల మీచిగురాకుసెజ్జను విశ్రమింతురుగాని రండి (అని చేయిపట్టుకొని తెచ్చుచున్నది)

హరి—(స్పర్శసుఖము నభినయించుచు) ఓమనోనాయకీ! ఆహా! ఏమి యీ స్పర్శసుఖము! నీకరసంస్పర్శనముచేత మంత్రించి

వట్లుగా నాయీయాగమంతయు క్షణములోఁ బోయినది! నీకర పల్లవమే యిటుసోఁకి నామేను చల్లపఱచి యపూర్వసుఖము నిచ్చు చుండఁగా నిఁక నాకీచిగురాకు పానుపేల?

చంద్ర—అయ్యో! నాప్రాణవల్లభుల దేహమున కెంత చెమట పట్టినది! హృదయేశ్వరా! మీచూపులును ముఖభావమునుజూడఁగా మీస్వాంతమం దేదోచింతగదిరి యున్నట్లున్నది. మీ రేలాగుననో కనఁబడుచున్నారు. వాడియున్న మీ యంగముల నొక్కింతసేపీ మెత్తనిపాన్పుపయిఁ జేర్పుఁడు.

హరి—ఓప్రియురాలా! నీహస్తస్పర్శనముచేత నాశరీర తాప మడఁగినట్లేనీవచ నామృతవర్షముచేత నాహృదయతాపమును శాంతించుచున్నది. నీమాట దాటరాదు గనుకఁ గొంతసే పీ పల్లవ తల్పమునందు నామేనువాల్చెదను. (అని కూరుచున్నాఁడు.)

చంద్ర—మీ దేహమునందలి యీ చెమ్మటసోనలు చూడఁగా నెండకాఁకచేత మీ దేహసువర్ణము కరఁగి పాఱుచున్నదో యన్నట్లు కనఁబడుచున్నది. ఈపైటచెఱఁగుతోఁ గొంచెము విసరుదునా? (అని విసరుచు) ఏమి! పద్మగంధ మిప్పుడు గుప్పున ముక్కునకు గొట్టి ఘ్రాణేంద్రియమునకు విందుగొలుపుచున్నది! ఈగాలియెక్కడనుండి వచ్చియుండును?

హరి—ఈమందమారుతమా తామరకొలఁకునుండివచ్చినది. ఆహా! చెమ్మటలోఁ దొప్పతోఁగియున్న యీయంగముల కెంత చల్లఁగా సోఁకి, యపారసుఖము నిచ్చుచున్నది! మనము మణి మందిరములలో హంసతూలికాతల్పములయందు శయనించి పన్నీరు చిలికిపట్టి శైత్యపీవనలతో విసరించుకొనుచున్నను మధ్యాహ్నవేళ నెప్పుడయిన గాలి మనకింతహాయిగా సోఁకినదా? ఇట్టిగాలి ననవ రతము ననుభవించెడి యీవనచరులు చేసికొన్నభాగ్యమేభాగ్యము.

ఉ. రాజులు దివ్యసౌధముల రమ్యసుశయ్యలఁ బండి తామె యు
వ్యాజసుఖోన్నతుల్ గనుదు మంచును గర్వముపొందుచుండినన్,
సాజముగాఁ బనుల్ సలిపి సల్పి శ్రమంపదుబీద లొందుని
ర్వ్యాజపు గాలిసౌఖ్యమున నబ్బునె వారికి షోడశాంశమున్? 8

చంద్ర—వారివలె నేఁడు మనముసు గష్టజీవులమయితిమి గాన మన కీసుఖము లభించినది.

హరి—సందేహ మేమి? కష్టపడినతరువాత ననుభవించుసుఖ మెప్పుడు నధికసంతోషజనకముగా నుండును. దానికి దే నిదర్శనము.

ఉ. ఎండను మార్గము న్నడిచి యెంతయు డస్సినయట్టిపాంథుడే
నిండుసుఖంబు పొందఁగను నేర్చును జల్లని చెట్లనీడలన్
మెండుగఁ గాయకష్టపడి మేనను జెమ్మట పట్టియున్న యా
తం డొకఁడే కనం గలుగు ధారుణిలోపల గాలిసౌఖ్యముల్. 9

చంద్ర—ఓప్రాణేశ్వరా! ఈప్రకారముగానే భూమిలో నాపదల తరువాతవచ్చు సుఖములుగూడ నధికానుభవయోగ్యములుగా నుండునేమో?

హరి—(కొంచెము భయపడినవానివలె నగపడుచు గద్గదస్వరముతో) సుఖాధిక్యము నిమిత్తమయి బుద్ధిపూర్వకముగా నాపద లెవ్వరును గోరుకొనకుందురుగాక! (అనిజిచ్చపడి చూచుచున్నాఁడు)

చంద్ర—ఓప్రాణవల్లభ! అదియేమి? ఆపదయనుపేరు నా నోటినుండి వెడలఁగానే మీరు భయపీడితులవలెఁ గంపించినారు! మీచూపులేమో యిప్పుడు వింతగా నున్నవి. మీమనసు చెదరియున్నట్లు మీ ముఖచిహ్నములు చెప్పకచెప్పుచున్నవి. మీభయహేతు వేమో నేనించుక యడుగవచ్చునా?

హరి—ఓప్రాణేశ్వరీ! నాహృదయము తెలిపెదవినుము. నే నిప్పుడు తలుముకొనిపోయినది విశ్వామిత్రునియాశ్రమ మృగమఁట!

నీవిప్పు డాపదయని పేర్కొనఁగానే నాకామృగవార్త మనస్సునఁ దట్టి నేను దానిని గొట్టినందునకయి చిప్పులేక మండిపడెడి యా తాపసుఁ డేమియాపదలఁ బెట్టునోయని నాహృదయమున బెదరు గదిరినది.

చంద్ర—మీరు భయపడవలసిన పనిలేదు. ఎఱుఁగక చేసిన దానికి విశ్వామిత్రుఁడుమాత్ర మేమిచేయును? విశ్వామిత్రుఁడు మహాతపస్వి కాఁడా? నాయెడ నపరాధము వచ్చినదని యున్నది యున్నట్లు చెప్పి క్షమింపవేఁడినప్పుడే సైరణ వహింపఁడేని, ఇఁక నాతపస్వితన మెందుకు?

హరి—కార్చిచ్చువచ్చి చుట్టుకొన నున్నప్పుడు నిప్పు నీళ్ళవలెఁ జల్లగానుండునని చెప్పిన నెవ్వరికూరట కలుగును? నీవుచెప్పెడి యాశాంతిపరులయిన ఋషులు వేరు; విశ్వామిత్రుఁడు వేరు. నిప్పయినను జల్లపడవచ్చునుగాని విశ్వామిత్రుఁడుమాత్ర మెప్పుడు శాంతుఁడు కాఁడు. అతఁడు చండకోపి. అతనిపేరు విన్న ఫాలాక్షుఁడును సంచలించును. నీవాతని కోపస్వభావ మెఱుఁగవు ముగ్ధురాల వౌటచే ధైర్యము వహించుచున్నావుగాని యెఱిఁగి యెఱిఁగి నేనెట్లు మన స్థయిర్యము నిలుపుకొనఁగలను!

సత్య—ఓరాజేంద్రా! దేవరవారు మిన్నువిఱిగి మీఁదబడినను జలింపని ధైర్యశాలులే. ఇప్పుడిట్టి పేదమాటలేల యాడెదరు? ఇట్టి సమయములోఁ బిఱికిగుండెగల యబలలకు ధైర్యము చెప్పవలసిన మీరే వారికిదిగులు పుట్టించినచో నిఁక మాకుదిటము చెప్పువా రెవ్వరు? మీరు మీసహజధైర్యమును మరలఁ దెచ్చుకొనుఁడు. ఋషుల వచనములే కఠినములు గాని మనస్సు లెప్పుడును మృదువులుగానే యుండును. ఒకవేళ విశ్వామిత్రుఁడు కఠినచిత్తుఁడై కోపమెత్తి నిన్నిమిత్తముగా మిమ్ము విపత్తులపాలు చేయుననుకొన్నను, మీరప్పుడే

కదా ధైర్య మవలంబింపవలెను! దైవమాయ యేమోకాని యీ లోకములో జనుల కాపదలు వచ్చుననుకొనుచుండునప్పు డుండుభయ ములో సహస్రాంశమయినను నిజముగా విపత్తు వచ్చినప్పు డుండదు.

గీ. అందుచేతనె జగతిలో సకలజనులు
నాపదలచేతఁ బొందెడు వ్యథలకన్న
నాపదలువచ్చు నన్నభయంబుచేత
శతగుణములెక్కువగఁ గాంత్రు వెతల నెపుడు. 10

హరి—మీ రిప్పుడేమో యీబయలితో మాటాడుచున్నా రు. మీమాటలను వేనిని నాచెవులు వినకున్నవి. నాకన్నులు మూఁతలుబడుచున్నవి. నాయింద్రియములు నాకు వశములుగాక యెక్కడికో పరుగువాఱుచున్నట్టున్నవి. విశ్వామిత్రుఁడు వచ్చి కోపము చూపకమునుపే యీయింద్రియములవలెనే మనమును పాఱిపోదమా?

చంద్ర—నిద్రచేతను గాఁబోలును మీరు జోగుచున్నారు. ఎండలో బడలివచ్చిన మీయవయవములు విశ్రాంతిఁగోరుచున్నవి. మీరు విశ్వామిత్రునిమాట మఱచిపోయి క్షణకాలము నాతొడ తలగడఁగాఁ జేసికొని యీశయ్యమీఁద శయనింపుడు. (అని పాన్పు మీఁదఁ జేర్చుచున్నది)

హరి—హృదయము కలఁగియున్నవారికి నిద్రరాదని చెప్పు దురు. నాకంటి కిప్పుడేమో నిద్ర కూరుకొనివచ్చుచున్నది. నన్ను జోకొట్టి నిద్రపుచ్చుటకోయనఁ గోయిలలును తుమ్మెదలును మధుర స్వరముతో జోలలు పాడుచున్నవి. నాచిత్తశాంతికయి యీశ్వరుఁ డంపిన దూతవలెవచ్చి యిప్పుడీనిద్ర నన్నెదార్పఁ జూచుచున్నది. నేనొక్కనిమిషము నిద్రించి యామనోవేదనను మఱచిపోయెదను. (అని చంద్రమతి తొడమీఁద శిరస్సిడి పరుండి నిద్రపోవుచున్నాడు)

చంద్ర—ఓహో! నిద్రయెంతదొడ్డది! నాప్రాణనాథుఁడు మహావ్యాకులదశలోనుండ మాంపాలిఁటి భాగ్యదేవతవలెఁ బ్రసన్నమయి దుఃఖోపశమనము చేయుచున్నది. ఏమి యీ యాశ్చర్యము! దివ్యభవనములయందు బంగరు తూగుటుయ్యెలలో హంసతూలికా తల్పముమీఁద బరుండినప్పుడును రాజకార్యచింతాపరత్వముచేత నే వేళను గన్ను మూయకుండునా మనోవల్లభుఁ డిప్పు డీచెట్టునీడలో గటికినేలను జిగురాకులమీఁద నెంతలో గన్నుమూసినాఁడు!

సత్య—అమ్మా! నిద్రసుఖ మెఱుఁగ దన్నమాట మీరు వినియుండ లేదా?

గీ. ధనికుల గృహంబులందు నిద్రావధూటి
హంసతూలికాతల్పంబులందుఁ దాను
నిలువనొల్లక బీదలనెలవు చేరి
కటిక నేలనె సుఖయింపఁగనమె మనము?

గాల—అమ్మా! నాకితఁడు చెప్పినది స్వానుభవసిద్ధము. ధనికులైన మా పొరుగువారు పట్టెమంచములమీఁదను పట్టుపరుపులమీఁదను బరుండి చోరభీతిచేత నిద్రపట్టక పొరలుచుండగా, ధనములేని నేను మా నులకమంచముమీఁద మేనుచేర్చుటయే తడవుగా గుఱ్ఱుపట్టి హాయిగా నాదమఱచి నిద్రపోవుచుందును. ఆవల నా చెవిలో నాలుభేరులు మ్రోగుచున్నను నాకు మెలఁకువరాదు. నాగుఱ్ఱు మీ రెప్పుడును వినలేదుగదా! ఏల వినకుందురు? మంచమెక్కి మాయింట గుఱ్ఱుపట్టితినా మీయింట మీరు నిద్రమేలుకొనవలసినదే.

చంద్ర—ఓయీ! నీయతిభాషిత్వము కొంతసేపు కట్టిపెట్టుము. ఓ సత్యకీర్తీ! అదియేమో కాని నాచిత్తము చేయిపెట్టి కలఁచినట్లు వ్యాకుల పడుచున్నది. ఈ నట్టడవిలో మా కేమికీడు మూడనున్నదో!

సత్య—అమ్మా! దంపతులు మీరిరువురును భగవదనుగ్రహము కలవారు. మీరితరుల కెప్పుడును గీడుచేసి యెఱుఁగరు. మీకే కీడును రాదు. విశ్వామిత్రుఁడు మీకొక యెగ్గుతలఁచినను, చిరకాలముండక మీకది యీశ్వరకటాక్షమువలన సూర్యునిముందు మంచు విడి పోవునట్లు విడిపోవును.

హరి—(ఉలికిపడిలేచి) ఓ బ్రాహ్మణోత్తమా! నా కిరీటము తన్నకు తన్నకు. నే నపరాధిని గాను (అని వడఁకుచున్నాఁడు)

చంద్ర—(వీపుచఱచి) ఓ ప్రాణనాయకా! భయపడకుము. మీకేదో పీడకల వచ్చినది కాఁబోలును. ఈశ్వరుఁడు మీకీదుస్స్వప్న ఫలము కలుగకుండఁ జేయునుగాక.

హరి—ఔరా! బ్రాహ్మణుఁడు నన్నెంత తన్ను తన్నెను. నాతలయంతయు నొచ్చుచున్నది. ఈబ్రాహ్మణుఁడు నన్ను సింహాసనమునుండి పడఁద్రోచి రాజ్యమంతయు నపహరించి, పురము వెడల నడఁచి, ఈ యడవిలో నన్నెంత లేసిబాధలు పెట్టినాఁడు! ఓయీశ్వరా! నీవే దిక్కు నన్ను రక్షింపుము.

చంద్ర—ప్రాణేశ్వరా! ఇందుఁ బరులెవ్వరును లేరు. భయపడఁబోకుము. ఇది కలకాని సత్యముకాదు. కలలోఁదోచినయర్థము లెప్పుడయిన సత్యమగునా? మీరు తెలివితెచ్చుకొని మా మొగముల వంకఁ గన్నులువిచ్చిచూడుఁడు. నేను మీ ధర్మపత్నిని జంద్రమతిని. వీఁడు లోహితాస్యుఁడు. ఈతఁడు మీమంత్రి సత్యకీర్తి. మేమందఱమును మీ యొద్దనే యున్నాము.

హరి—(కన్నులువిచ్చిచూచి) స్వప్నములు సత్యములు కావుగాని యిప్పుడు ప్రత్యక్షముగా జరిగిన యిదిమాత్రము స్వప్నము కాదు. అతఁడు తన్నిన తన్నుచేత శిరస్సింకను నొచ్చుచున్నది. మీరందఱు నిక్కడ నుండఁగనే యెంతలో నయోధ్యకుఁబోయి సింహా

సనమును గోలుపోయి, అడవులలో నిడుమలుపడిచి మరల మిమ్ముం జతని గలసి కొన్నాను! ఆబ్రాహ్మణుఁడు కోపముతో నన్నిన్నియాప దలఁ బెట్టియుఁ గట్టకడపట నా సింహాసనము నాకు విడిచియే పోయి నాఁడు.

సత్య—ఓమహారాజా! మీ రిప్పుడు చెప్పినదంతయు మీరు కలలోఁ గన్నవార్త. ఇంత యల్పకాలములో మీ కెంత పెద్దకలవచ్చి నది! ఇఁక మీరీకలను మఱచిపొండి. దీనినే మరల మగలఁ దలిప్ప తలపోయుచున్నయెడల, మీ మనస్సునకు లేనిపోని చింతకలుగును.

హరి—ఇది స్వప్నమా? నిజముగా జరిగినట్టే యున్నదే! (తలతడవుకొనుచు) నన్నతఁడు తన్నలేదా? ఇదికల కాదు. నిజము గానే యతఁడు నా కిరీటమును తన్నినాడు.

చంద్ర—అయ్యో! నా హృదయేశ్వరుని హృదయము చెదిరి పోయినది. ఈ మనోవ్యధ మాన్పుట కేదియుపాయము? ఇందెవ్వ రయినఁ గర్ణరసాయనముగా సంగీతము పాడఁగలవారయిన నున్న యెడల, నా ప్రాణవల్లభుని మనస్సు కలంక కొంత దీఱునుగదా?

సత్య—ఇది మహారణ్యము. శ్రావ్యముగా ఝుంకారములు చేయు మధుపాంగనలుతక్క నిక్కడ సంగీతము పాడువా రెవ్వరుం దురు? మన యాస్థానమందలి గాయకు లెవ్వరును మనవెంట రాలేదు.

గాల—ఎవ్వరును రాకపోనేల? సంగీతశాస్త్ర ప్రవీణుఁడను నేనే వచ్చియున్నాను. నే నిప్పుడు నా యపూర్వ సంగీతముచేత మనస్సు కలఁకతీర్చి నా మిత్రుని దేర్చెదను. గాంధర్వస్వరమును పరిహసింపఁ జాలిన నాగాత్ర మాధుర్యమును జిత్తగింపుఁడు. (అని పాడుచున్నాఁడు.)

క. కలలో గాంచిన యర్థము
లిలలో సత్యములుకావు హితమిదివినుమా

కలలోన వరుసలాడినఁ

గలుగున గాయంబు లెందుఁ గాయము నందున్?

ఓ సభ్యులారా! నా గాత్రమెట్లున్నది?

సత్య—ఎట్లుండవలెనో యట్లున్నది. అర్థాంతరముచేత నీ వన్నట్లు గాంధర్వస్వరమే.

హరి—ఈగాలవుని పాటవలన మనస్తాపముపోయి నాకిప్పుడు కొంత స్వస్థత గలిగినది. ఇంతవఱకును మీరు చెప్పినమాటలు నా చెవిని చొరనే లేదు. ఓహృదయేశ్వరీ! మీరింతకు ముందేదో యన్నారే, అదియేమి?

చంద్ర—ను రేమియును లేదు. దేవరవారిమనస్సు కలతఁ దీర్చుటకు హృదయరంజకముగా గానముచేయువారెవ్వరయిననుండిన బాగుండుననుకొన్నాము.

హరి—ఓమధురభాషిణీ! నీవుచెంతనుండి మాటాడుచుండఁగా వేఱుగసంగీత మేలకావలెను? నాకు నీమాటలేసంగీతము. అపయిని పాటపాడి నవ్వించుటకు సంగీతశాస్త్రపండితుఁడు గాలవుఁ డొకఁడు మనయొద్ద నున్నాఁడు.

గాల—అట్లయిన నిప్పుడిక్కడ నిద్దఱుపాటకు లున్నారు.

పాల—ఓమహాప్రభూ! శుభమగుఁగాక! మాతంగాంగనలఁట! ఇద్దఱుముద్దియలు యాచనార్థమువచ్చి, యిచ్చట చెట్టునీడను నిలిచి పాటలుపాడి వినోదింపఁ జేయఁగలమని విన్నవింపుమను చున్నారు. సెలవయ్యెనేని వారిని గొనివచ్చెదను.

హరి—వారిపాటలచేతనైన నా మనసులోని యారాటము తొలగునేమో! పాడింతము తీసికొనిరమ్ము.

[ఇద్దఱు మాలెతలు ప్రవేశించుచున్నారు.]

మాలె—(చేతులుజోడించి మ్రొక్కి) ఓరాజసార్వభౌమా! దేవరవారికి మేలగునుగాక! ఇంతకుముందప్పుడప్పు డేలినవారినుగుణ

సురూపాదులను శ్రవణానందముగావిని సంతోషించుచుండుటయే కాని కన్నులపండువుగా సందర్శించి యానందించు భాగ్యమీవఱ కెన్నఁడును లభింపలేదు. మీదివ్యసుందరవిగ్రహములు మాకన్నుల నిండఁ గూడఁ గాంచుటచే నేఁడు కదా మేము భూమిమీఁద జన్మ మెత్తినఫలము పొందఁగలిగితిమి! మాకన్ను లిప్పుడు ధన్యము లయినవి. మేము చేసినపుణ్యము మఱి యెవ్వరును జేయలేదు.

హరి—(సత్యకీర్తితో రహస్యముగా) ఓమంత్రిపుంగవా! దృష్టి మిఱుమిట్లు గొలుపుచున్న యీమందయానలసుందరాకారమును జూచినను వీనులకు విందులుగొలుపు మృదుమధురవచోరచనా చమత్కారములు విన్నను వీరు విహారార్థముగా ధారుణి కవతరించిన లక్ష్మీసరస్వతులో, గానకళాకౌశలమును జూపవచ్చిన రంభోర్వశులో, రూపముధరించి సంచరించుచున్న పంచసాయకుని సమ్మోహనవిద్యలో యన్నట్లున్నారు గాని మాతంగకాంతలుగా నెంతమాత్రమును లేరు.

ఉ. వా తెఱ లల్లకెంపులకు వన్నియ వెట్టగ, ముద్దుమోములుం
బ్రాఁతిగఁ బూర్ణిమాశశికి వంకలు దిద్దఁగ, నవ్వు చంద్రికా
వ్రాతము తెల్విఁ బెంపఁ, గనుపట్టెద రింతులు నల్లరూపునన్
జేతన దాల్చి క్రమ్మరెడు చెల్వపు నీలపు బొమ్మలో యనన్.13

మానవజాతిలో నిట్టిలావణ్యవతులను మన మెన్నఁడయినఁ జూచి యెఱుఁగుదుమా?

సత్య—ఒక్కమానవజాతిలోనే కాదు గంధర్వకామినులలోఁ గూడ వీరిని బోలిన యందకత్తెలుండుట దుర్లభము. వీ రలంకారములు లేకయే నిసర్గమనోహరాకారములతో నెట్లు ప్రకాశించుచున్నారో!

హా—స్వభావచారుమనోహరశరీరముల కలంకారము లక్క ఱయే లేదు.

చ. తళుకు మెఱుంగు పోయఁగవుఁడావిశరీర మలంకరింపఁగా
వలయునె రత్నభూష లవి వట్టి వికారము లౌను గాక! మిం
చులకు మెఱుం గిడ న్వలెనె? శుద్ధసువర్ణము పూఁతఁ గోరునే?
యిలపయి రంగిడన్ వలెనె యింద్రధనస్సునకింత యేనియున్? 14

ఓసత్యకీర్తి! సర్వసంగపరిత్యాగు లయినయోగులకును భ్రమలు పుట్టించు వీరి యసమానరూపకళావిభ్రమములు చూడఁగా విశ్వామిత్రుఁడే తనతపోబలముచేత వీరిని సృజించి మనలను వంచించుట కయి యిట్లు పంచి యుండునేమో యని యించుకసంశయ మంకురించుచున్నది. ఇది యాసంయమి చేసినమాయ యయియుండదు కదా?

సత్య—ఓరాజేంద్రా! మీ రిఁక విశ్వామిత్రునిపేరు మఱచి పోవలెను. అప్పుడు లేడిని గొట్టినప్పటినుండియు విశ్వామిత్రుఁ డేమి చేయునో యన్నభయము మీమనస్సునబట్టి విడువక యన్యచింత పోఁగొట్టినందున మీకిప్పుడు సర్వమును విశ్వామిత్రమయముగానే తోఁచుచున్నది. మీరింతకుముందు నిద్రయందును విశ్వామిత్రునే చూచి యదరిపడి లేచితిరి. ఇప్పుడు మేలుకొని యుండియు విశ్వామిత్రునే పలువరించుచున్నారు. మీరొక్కసారి యిటు తిరిగి యించుకసేపు వీరిపాట యాలకింపుఁడు.

మాలె—ఓభూలోకదేవేంద్రా ! అర్థు లడిగిన దానిని లేదనక యిచ్చెడుదొడ్డదాత లని దేవరవారి నెల్లవారును వేయినోళ్ళ శ్లాఘింపఁగా చెవులు చల్లఁగావిని, మీవలన మాయభిమతార్థసిద్ధి యగు నన్నయాశతో మిమ్మిట వేఁడవచ్చినారము. మేము నృత్త గానవిద్యలయం దించుక ప్రవీణురాండ్రము. రసికజనశిఖామణు

లయిన యేలినవారు మావిద్య కొంచెము చిత్తగించి మాయభీష్ట మును దీర్చి మమ్ము సంతోషపెట్టి పంప ననుగ్రహింపవలెను.

హరి—లోకములో గానరసమునందు బాలవృద్ధము నాదరము లేనివారెవరుందురు? భువిలో సంగీతశ్రవణమునందుఁ జవిలేనివా రొక్క చెవిలేనివారే. ఏనీమీరొక్క మంచిరాగము నాలాపన చేసి మీకు వచ్చిన గీతము నొకదానిని వీణెమీఁద జక్కఁగాఁ బాడి మాకు గర్ణోత్సవము చేయుఁడు.

మాలె—(వీణెలు శ్రుతిచేసి మీటుచుఁ గంఠ మెత్తి పాడుచున్నారు.)

ద్విపద. నాయక! నీమీఁద నాదుచిత్తంబు
పాయక యెప్పుడుఁ బగలునురాత్రి
చిరకాలమందుంటి చిక్కి వేరూని
మరలించుకొన్నను మరల దే మందు?
కనికర మొదనుంచి కావుము నన్ను;
నను నిట్లు కలఁచుట న్యాయంబుకాదు.
మనుజులు కొందఱు మహిమీఁదఁ దమకె
ధన మున్న దనియు సౌధము లున్న వనియు
సిరు లున్న వనియును జెలు వున్న దనియుఁ
బరువ మున్న దనియుఁ బట్టరానట్టి
గర్వాతిశయమునఁ గన్గాన లేక
యుర్విపై మావంటియువతీజనంబు
వెతపెట్టఁదురు వారివేఁడికో ల్విఁక
ఎల్లరు భూమిలో నేదుజేనలకై
యుల్లపు దధికారు లంత్యకాలమున,
తలఁ గట్టుకొని పోము ధరణిలో దేది;

యిలమీఁద నటువెన్క నెల్లవారలము
సములమే యాదుము సత్యంబుసుమ్ము.
సమయంబు మించినఁ జాలఁ జింతించు
కార్య మేమియు లేదు; కావున వేగ,
ధైర్యంబు విడనాడి తాళంగ లేక
ఘనసాహసమునకుఁ గడఁగకమున్న
ననుఁ బ్రోవు మో ప్రాణనాయక! నీవు.
కడసారి ప్రార్థింతుఁ గాంతుతో నిన్ను;
విడువకు విడువకు విడువకునన్ను.
ఆఁడువా రను రన్న నవనిలోపలను
గీ డెంతవారికిఁ గెరలక కల్గు.
చెప్పితి మున్మాఱు చేయు మేదైనఁ
దప్పిఁక నామీఁదఁ దగదు ద్రోయంగ.

హరి—ఓహో! పీఁపాట యెంత ముచ్చటగా నున్నది!

చ. జిలిబిలిపాట లంగుళులఁ జిమ్మెడుతంత్రులసుస్వరంబుతోఁ
గలసి చెలంగె; హస్తముల గాజులచప్పుడు తాళమానమై
చెలఁగెను; లోచనాభినయచిహ్నము గీతములోని భావముం
దెలిపె; మనోజ్ఞమై లయను దెల్పె బదాభినయంబు చక్కఁగన్. 16

ఈగానరస మచ్చటి మొత్తృను జిగురింపఁ జేయుచున్నను సంతోషాంకురము లేక మోడువాఱియున్న నాయుల్లమును బల్లవింపఁ జేయ లేకున్నది.

సత్య—(తనలో) ఏమి! రాళ్ళుకరఁగెడి యీమనోహర సంగీతమువలనను రాజుగారి మనస్సు దుఃఖమును మఱచిపోకున్నది! ఇఁక నే నిందలి కథాంశమునకు దింపి మఱపించెదను. (ప్రకాశముగా) ఓరాజేంద్రా! ఈగీతమునందలి నాయిక వాక్యములను జిత్తగించినారా!

హరి—ఇవి చాతుర్యముచాలని ముగ్ధనాయికయొక్క యప్రౌఢవాక్యములుగానున్నవి. ఈనాయికయొక్క యీప్రార్థన నాకుఁ జూడఁగాఁ బ్రియుని మరులు కొల్పుటకంటె నిట్టితుచ్ఛసుఖములనుండి మరలుకొని ధర్మమునే చూచుకొమ్మని నాయకునకు వైరాగ్యములు బోధించుచున్నట్టు కనఁబడుచున్నది. తనువులు శాశ్వతములుకావన్న యీ హెచ్చరిక విశ్వామిత్రుఁ డెన్ని బాములు పెట్టినను ధర్మమును మాత్రము విడువవలదని నాకును హితబోధ చేయుచున్నది. ఇప్పుడు నామనస్సు వీరి పాటనుండి విముఖమగుచున్నది. ఓసత్యకీర్తీ! తగిన సత్కారముచేసి వీరిని బంపివేయుము.

సత్య—మనస్సులో దీర్ఘవిచారమున్నప్పుడు సర్వమునసహ్యముగానే తోఁచును.

హరి—అవు నది సత్యమే. నామనస్సులోపలనే పరితాపముండి నన్ను బాధించుచున్నప్పుడు బాహ్యము లయినవస్తువులు నా కెట్లు సంతోషమును బుట్టింపఁగలవు? దుఃఖమునందు వస్తుగుణములను వ్యత్యస్త పఱిచెడు యద్భుతశక్తియేదో యున్నది సుమా! అట్లు లేక పోయినయెడల నాకింతవఱకును హృదయరంజకముగానున్న యీవస్తుజాలమంతయు నిప్పుడింతలోనే యేల యసహ్యమగును? కర్ణరసాయనమయిన గానరసమేల చెవులకు రుచియింపక పోవును? ఆహా! దుఃఖము బ్రహ్మసృష్టిని మార్చి నాకుఁ గ్రొత్త సృష్టిని జేయుచున్నది! ఓసత్యకీర్తీ! వీరికి రత్నభూషణాదులు బహుమానమిచ్చి వేగిరము పంపివేయుము.

మొదటిమాతె—ఓసీ! ఈవింత చూచినావా? ఈరాజు రూపమునుజూచినప్పటినుండియు నామనస్సు నాకు వశముగాక సంచలించుచున్నది. అందుచేతనే చేతనముల నచేతనములను జేయవలసిన నాపాట యిప్పు డీరాజుమనస్సున కెక్కినదికాదు.

కొండవమాలె—నీమనస్సుచలించినదే కాని నిన్ను విడిచిపోయి నదికాదు. ఇఁక నామనస్సో నన్నిప్పుడే విడిచి నాలోపల నిలువక పరుగువాఱి పాటపాడినఁతసేపును రాజుమీఁదనే యున్నది. నేనిప్పు డేమి పాడితినో యే నెఱుఁగను.

సత్య—ఓగోసంగిపడుచులారా! ఇవిగో కాంచనాంబరాభరణములు రాజుగారనుగ్రహించి దయచేయుచున్నారు. వీనిని బుచ్చుకొనుఁడు.

మాలె—ఓమంత్రిచంద్రా! మేమీభూషణముల నొల్లము. ఈమండువేసవికాలములో దుస్సహమయిన యాతపముచేత మా దేహమంతయు లోపలను వెలుపలనుగూడ దహించుకొనిపోవు చుండఁగా మాకిప్పుడీయలంకారములెందుకు? బాహ్యతాపమయిన నించుక శాంతించుటకు మీ రాజుగారి శ్వేతచ్ఛత్రము నిచ్చినను గొంత తలదాఁచుకొని సంతోషించెదము.

సత్య—ఓరాజేంద్రా! ఈమాలపడుచ లిప్పుడు కోరరాని కోరికలను గోరుచున్నారు. ఏమి చేయుదము?

గాల—మంత్రివైన నీకాలోచన తోఁపనిపక్షమున వీరిని నాకప్పగింపుము. చెఱినాలుగు లెంపకాయలు బహుమాన మిప్పించి, వీరు ముం దెవ్వరి నిట్టికోరకలు కోరకుండఁ జక్కఁజేసి సాగనంపె దను. వీరికి బాహ్యతాప మడఁగవలెనఁట! నేను జేసెడి యుప చారముచేత బాష్పవర్షము కురిసి యన్నితాపములును దీఱును. అయ్యో! నేను వీరిని దాఁకగూడని బ్రాహ్మణుఁడ నయిపోతినిగాని, కాకపోయినయెడల వీ రీపాటి యిల్లాంద్రకేశఖండనమహోత్సవము నాటి రాగములు తీయుచుఁ బరుగెత్తి యిల్లు ద్రొక్కఁజూడరా!

హరి—ఓయి వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! తప్పుచేసినప్పటికిని స్త్రీల యెడలఁ గోపముచూపరాదుసుమా. నీ వూరకుండుము. నేను ఖండి

మాటలతో వీరిని సమాధానపఱిచి సంతోషపెట్టి పంపివేసెదను. (అని మాలెతలవంకఁ దిరిగి) ఓకాంతలారా! మీరజ్ఞానముచేత నడుగరాని వస్తువడుగుచున్నారు. యాచకులెప్పుడును రాజులను ఛత్రచామరము లడుగరాదు. ఇయ్యఁదగిన మఱి యేవస్తువునయిన వేఁడుఁ డిప్పించెదను.

మాలె—అట్లయిన మేము మఱియొక వస్తువునే వేఁడెదము లెండి. ఈపయితాపమును మే మేశీతలవస్తువులచేత నయినను బాపుకోఁగలము. అడఁచుకొన్నను నడఁగక 'పయికిఁ' బొంగివచ్చెడి మాయంతస్తాపమును నీదయారసవృష్టిచేతఁ గాక మఱియెట్లు వారించుకోనేర్తుము! నిన్నుఁ జూచినప్పటి నుండియు మాహృదయములలో బెరుఁగుచున్న దురాపమయిన మన్మథతాపము పోవునట్లుగా మాకొక్కసారి నీచల్లని కౌఁగిలిదయచేయుము.

హరి—హరిహరా! (అని చెవులుమూసికొని) పాపము శమించునుగాక! ఔరా! ఏమి వీరి కండ కావరము! ఈచండాలాంగనలు యౌవనమదముచేతఁ గన్నుగానక కండక్రొవ్వున నోర నుడువరాని పాపపుఁ గోరికలను గోరుచున్నారు. వీ రసలేపరకాంతలు. అమీఁద మాట్లను ముచ్చటింపను గూడని చండాలాంగనలు నా మనస్సు స్వప్నమందయినఁ బరసుందరులమీఁదికిఁ బోవునా? ఇఁక వీరితో మాటలాడినదోషమువచ్చును. పాకము మఱింత ముదురకమునుపే వీరినిక్కడనుండి సాగనంపింపవలయును. ఓసత్యకీర్తీ! ఉచితానుచితపరజ్ఞానము లేక తప్పఁద్రాగి నోరికివచ్చినట్లు కారులు పేలుచున్న యీమదవతులను మనభటులచేత మాయెదుటనుండి సాగఁ దోలింపుము.

సత్య—దేవరవారి సెలవుప్రకారము చేసెదను. ఓభద్రా! ఓపాలకా! మీరిద్దఱు నూరక చూచున్నారేమి? సురాపానవికార

ముచేత శరీరములు మఱచి యస్వతంత్రప్రలాపములు చేయుచున్న యీ తుచ్ఛకాంతలను దక్షిణమూవలికి గెంటివేయుఁడు.

పాల—మేమును దేవరవారి యాజ్ఞకొఱకే యెదురు చూచుచున్నాము. ఓ చండాలులారా! గుండెబెదరులేక రాజుగారి నిట్టిదుండగపుఁగోరికలు కోర మీకెట్లు నోరువచ్చినది? ఇఁక మీరిక్కడ నోరెత్తినపక్షమున నేనీ కత్తితో మీనాలుకలు కోసెదను. లేచిపొండి.

(అని కొట్టుచున్నాఁడు.)

భద్రు—సంకోచము లేక వెఱ్ఱిపోకలు పోవుచున్న యీనీచురాండ్రమదము నేనడఁచెదను. (అని కొట్టుచున్నాఁడు.)

చంద్ర—ఓసత్యకీర్తి! ఈయబలలవీపులమీఁదబడిన దెబ్బలు నాహృదయము మీఁదఁ బడినట్టు తాఁకి నామనస్సు నొప్పించుచున్నవి. ఈబాధ నేను సహింపలేను. భటులను వెంటనేవారించి యజ్ఞానముచేత ననరానిమాట లన్నయీకన్నియలను గొట్టకుండఁ జేయుము.

హరి—ఓమంత్రివరా! దిక్కుమాలిన యీయాఁడువారిని జేయిచేసికొని నొప్పించుట నేను జూడలేను. నేనువీరిని దృష్టిపథమునుండి తొలగింపు మంటినే కాని యిట్లు దయమాలి చబుకులపాలు చేయుమనలేదే. సమయమువచ్చినప్పుడు శత్రురాజులమీఁద మన ప్రతాపముఁ జూపవలెనుగాని యిట్టి యబలలమీఁదనా చూపుట? ఎదిరింపఁజేతకాని మానవతులను మొత్తుటకో నీవీరభటుల కేమి పౌరుషమున్నది?

ఉ. అర్థులమీఁదఁ జూపనగునా? తనశూరత వీరుఁ డెందుఁ బ్ర
త్యర్థులమీఁద యుద్ధసమయంబునఁ జూపఁగఁ జెల్లుగాక! సం
వర్ధితదీక్షవృత్తములపైఁ దనశక్తి మహాబలుండు తా
నర్ధిని జూపుఁగాక యడుగంటినతీఁగెలమీఁదఁ జూపునే!

మ. అలుగం గాంతల యూరుయుగ్మములు మత్తారిభ హస్తంబులే!
లలనాపాంగనిరీక్షణంబు లరిరాడ్భాతోగ్రబాణంబులే!
తిలకింప న్విరిబోండ్లకన్బొమలు శత్రుత్యాగ్నపచాపంబులే!
వల దీక్రొవ్విరిబోండ్ల నంట; నిపు డీబంట్ల న్నివారింపుమా.

సత్య—ఓవీరభటులారా! వీరి నావలకు గెంటుఁడని నేను నియోగింపఁగా మీరు మీశూరత్వమంతయు నీయాఁడువారిమీఁదనే కనఁబఱుచుచున్నారేమి? ప్రభువువారు కోపపడుచున్నారు. వీరిని గొట్టక విడువుఁడు.

పాల—ఓమంత్రిపుంగవా! రాజుగారిమనస్సు కలఁగియుండుట చేత వారికాగ్రహము తెప్పించి చిత్తమును జింతనుండి మరలింప వలయునని యిట్లు చేసినారమే కాని యాఁడువారిని జేయిచేసికొని కొట్టుటకు హరిశ్చంద్రునిబంట్లమయిన మేముమాత్ర మంతక్రూర చిత్తులమా?

మాలె—(ఏడ్చుచు) ఓరాజధమా! నీవాఁడుతోడునఁ బుట్ట లేదా? కిరాతుఁడవా? యాచింపవచ్చిన మావంటిపువ్వుకోమలులను గొట్టుఁడని యీయమకింకరులవంటి క్రూరులను గరుణమాలి నియోగింప నీకు నోరెట్లు వచ్చినది? మాశెత్తని దేహములు దెబ్బలచేత నెట్లు కందినవో చూడు. మాకొప్పులు వీడి యీనేలమీఁద, పువ్వు లెట్లు చిందినవోచూడు. ఓదయావిహీనా! ఇప్పుడయిన నీకన్నులు చల్లపడినవా? ఆఁడువా రుసురుసురని క్షోభపడినఁ దగ్ధులము కక్క కడుపక యూరకపోదు. మమ్ము బిడ్డలవలె జూచుకొనుచున్న విశ్వా మిత్రునికి నీదుర్ణయమును నివేదించి నిన్నేమిచేయించెదమోచూడు ఇంకొక్కనిమిష మోపిక పెట్టుము. (అని వెడలిపోవుచున్నారు)

హరి—ఓసత్యకీర్తి!

ఉ. కొప్పులుపీడ, మోములనుగ్రొంజెమరింతయుఁగూడ, బాష్పముల్
కుప్పలు గూరి యూరి కనుఁగొల్కుల జాలుగ నోడ, నయ్యెడ
ళొప్ప తొలంగివాడ గపు నొక్కట నల్లల నాడఁ జేడెలా
చొప్పునఁ జూడు పోయెదరు శోకము రూపము తాల్చినట్లుగన్.

నిష్కారణముగా స్త్రీలను గొట్టించి మనము పాపమునకొడి గట్టుకొన్నాము. ఇట్లాడువారి నేడిపించిన క్షోభము మనకుఁదగులక పోదు. వారు విశ్వామిత్రునిగూడ బేర్కొనుచున్నారు. నాకిదియంతయు నేదో కపటనాటకముగాఁ గనఁబడుచున్నది. కాని సత్యము వలె లేదు. ఋష్యాశ్రమములెక్కడ? చండాల స్త్రీలుండుటెక్కడ?

సత్య— దేవరవారూహించినది యథార్థము. తపోవనముల యం దెక్కడను మాతంగాంగన లుందురని యీవఱకెన్నఁడును విని యుండలేదు. నాకుఁ జూడఁగా వీరేదో కపటము మనస్సులో నుంచుకొని యీప్రకారముగా వేషములు వేసికొని వచ్చినట్లుగాఁ దోఁచుచున్నారు కాని నిక్కంపుమాలెతలుగాఁ దోఁచరు.

చంద్ర— ఇదియేమో నాకును మహేంద్రజాలముగానే యున్నది. మనము భూతభూమికి వచ్చియుండలేముగదా? లేక విశ్వామిత్రుని మాయలైయుండునా? తాళుఁడు మేఘగర్జనమువలె దూరమున నెవ్వరిదో గంభీరఘోషణము వినవచ్చుచున్నది.

హరి— (ఆలకించి) మాలెతలమాటలు విని దురాగ్రహము చేత మండిపడుచు మనయీఁదికి వచ్చుచున్న విశ్వామిత్రుని కోపవాక్యమువలెనున్నది వినుండి.

అందఱు— (చెవిలొగ్గి వినుచున్నారు)

(తెరలో)

శా. ఏమేమీ! తనబంట్లచేత మిము రాజీరీతి మొత్తించెనా!
యీమాధుండు తపఃప్రభావమును నావంతేనియు న్నన్నవి

శ్వామిత్రుం డెలియం డీకం డెలియు నస్మచ్ఛండకోపాగ్నిచే
భీమోద్యత్ప్రళయాగ్నిమీఁద శలభం బేమూఁక నుంకించెనే! 2

సత్య—అవు నతఁడు విశ్వామిత్రుఁడే. నూఱెతలుపోయి నే
ములు చెప్పి కూతనిని దీసికొనివచ్చుచున్నారు. ఓరాజేంద్రా! మీర
ధైర్యము వహింపవలసిన సమయమిది. దూరభీరుతయు నాసన్నధీ
తయు మహాత్ములకు సహజగుణములు.

చంద్ర—ఓప్రాణనాథా! గాధేయుఁ డెట్టికోపప్రకంపమాను
డయి మనదిక్కునకు వచ్చుచున్నాఁడో చూచితిరా? మీరించుకయు
నఁచలింపఁగూడదు.

హరి—ఓసత్యకీర్తి! ఆవంకం జూడుము.

మ. కనుల న్నిప్పులు రాల నద్దెరలు రూక్షప్రౌఢి నీక్షింపుచున్
ఘనదండాగ్రముతోడఁ బల్మఱును వీఁక న్నేల తాటింపుచున్
వనదుష్టిక్రియఁ బుస్తు దీయుచు జటాభారంబు తూఁగాడ గ్ర
క్కున నేతెంచెనుఁ జూడు మాతఁ డదిగోఁ గోపంబు హాహాం
నా 2

అతఁడు మనమీఁదఁ గోపము చూపకమునుపే మనమిప్పుడెదురుగా
బోయి భక్తిఁజూపి శాంతచిత్తునిఁ జేయుదము. తద్ద్వారమున
కోపాగ్నిని శాంతిజలముచేతనే యార్పవలయును.

చంద్ర—సలసలఁగాఁగుచున్న చమురులోఁబోసిన చల్ల
నీరువలెనే మనశాంతవచనములు కోపపరవశుఁడయి యున్న యా
తాపసుని మఱింత మండఁజేయునేమో! అయినను మనము శాంత
విడువరాదు. శాంతాత్ములయెడఁ గోపముచూపి యాతఁడే దుష్టుఁడ
కానిండు. మన మెదురుగాఁ బోయి పాదాక్రాంతుల మగుదము.

విశ్వా—(ప్రవేశించి పండ్లు పటపటకొఱుకుచుఁ గన్ను
లెఱ్ఱచేసి) నీకంద్రనిమిత్తమెంతో కష్టపడి నాతపస్సు ధారపో

క్రొత్తగా స్వర్గమును నిర్మించి నీజనకునికి బొందితో స్వర్గ మిప్పించిన మేలునైనం దలంపక యిప్పు డెంతపని చేసితివిరా? ఓరికృతఘ్నుండా! (అని చేతిలోని యక్షమాలను గ్రిందఁబడవైచి కాలు నేలఁజఱచు చున్నాడు)

హరి—(ఎదురుగాఁబోయి పయిబట్ట మొలకుఁజుట్టుకొని సాష్టాంగపడి) ఓమునిసార్వభౌమా! నమస్కారము.

విశ్వా—(తల కాలితో తన్ని) ఓరిపాపీ! ఈవఱకుఁజేసినది చాలక యిప్పుడు నీశిరస్సుమోపి నాపాదములనుకూడ నంటుచేయు చున్నావేమిరా? తొందరపడకు. నీవుచేసిన పాపఫల మిప్పుడే యనుభ వించెదవు.

హరి—స్వామీ! దేవరవా రింతయాగ్రహముచేయుటకు దాసునియెడ నేమితప్పువచ్చినది? నవరత్నఖచితమయిన యీకఠిన కాంచనకిరీటము సోఁకి దేవరవారి మృదుపాదము నొచ్చినదేమో యని చింతిల్లుచున్నాను.

విశ్వా—ఓరిద్రోహీ! ఇప్పు డొక్కపాదముమాత్రమే కాదు నీదుశ్చరిత్రముచేత నాసర్వాంగములును నొచ్చుచున్నవి. నీవు మా యాశ్రమమృగమును నొప్పించితివన్న దుఃఖముతోనే కోపాగ్నిరగుల నీకిదిబుద్ధి కాదని చెప్పవచ్చుచుండఁగా నింతలో గోలుగోలున నేడ్చుచు దారిలో వీరెదురుపడి గోరుచుట్టుమీఁద రోకలిపోటు వేసినట్లు తమ్ముఁగొట్టించితివన్న పిడుగువంటి దుర్వార్తను నాచెవుల వేసి రాఁజు చున్న నాకోపాగ్నిని భగ్గునమండఁజేసినారు. ఆశ్రమమృగముల హింసించు దుర్బుద్ధి నీకేలపుట్టినది? ఇల్లునోరు లేని సాధుజంతువులను తపోవనములుమాటి సంహరింపుమని నీకునీగురుఁడుపదేశించినాఁడా?

ఉ. రాజులు మున్ను వేఁటలకురారె? మదించినదుష్టజంతులన్
దేజముచూపి కానలను దీవ్రశరంబుల రూపు మాపరే?

యాజననాథు లేయెడల నాశ్రమభూములు చొచ్చినీవలెన్
నైజమదోద్ధతిన్ మునివనంబుల సాధుమృగాళిఁ గూల్చిరే!

హరి — ఓతాపసోత్తమా! ఈవిషయమున నే నేపాపము నెఱుఁగను. బాల్యచాపలముచేత వీఁ డాడుకొనుటకయి నన్నా లేడిని బట్టియిమ్మని వేఁడఁగా సామాన్యకురంగ మనుకొని తఱిమితినే కాని నేనప్పుడది యాశ్రమమృగ మని యెఱుఁగను. ఎఱుఁగక చేసిన యీయపరాధమును క్షమింపుఁడు.

విశ్వా — మృగమును గొట్టుటయున్న నెఱుఁగక చేసితి వని బొంకితివి. వేఁడవచ్చిన యీనిరపరాధిను లయినకన్నియలను గొట్టించిన యపరాధము నేమని బొంకెదవురా? నీకీచక్రవర్తిత్వమువచ్చుట యడవులలోఁ గందమూలాదుల నేఱుకొని తిని బ్రదుకు మావంటి సాధులను బాధించుకొఱకా? శిరీషపుష్పకోమలు లయినయీముద్దరాండ్రను కఱకుకశలతో మోఁదు మన నీకు నోరెట్లువచ్చెను.

హరి — ఓమునీంద్రా! ఇఁక మాటలెందుకు? నేను జేసిన వన్నియు నపరాధములే నేనపరాధములు లక్ష చేసినను శరణంటిని గనుక నన్ను మన్నింపుఁడు. శరణన్నమాత్రమున శత్రునకైన నభయమియ్యవలెను. తన్ను నఱకవచ్చినవారికిఁ గూడ వృక్షము నీడనియ్యదా? ఓదయామయా! శాంతింపుము, శాంతింపుము.

విశ్వా — శాంతిపరు లయినయాఋషులు వేఱు; మేము వేఱు. మమ్ము వారివలెఁ దలంపకుము. నీవు చంకదుడ్డును శరణార్థియు ననుచున్నావు. ని వింక లక్ష చెప్పినను నీమీఁద మాకు దయరాదు. నాదుర్వారకోపాగ్నికి నిన్నిప్పుడు మిడుతనుజేసెదఁజూడు.

గాల — ఓబీదతాపసీ! మారాజు వెఱ్ఱివాఁడయి బతిమాలుకొన్న కొలఁదిని నీవంతకంతకు బిఱ్ఱబిగిసి మిట్టెక్కుచున్నావు. దయా

లేకములేని ఈ నీ తపమెందుకు? జప మెందుకు? దమ మెందుకు? స్వాధ్యాయ మెందుకు? కాల్పనా.

చ. అరయఁగ నంత రాత్మను దురాగ్రహపాపమునుండి పాపి సు
స్థిరమతి నిష్కళంకముగఁ జేసినఁ గాక, జపంబు వల్కలాం
బరములు, మౌనమున్, జడలు, వహ్నులుఁ, గృష్ణమృగాజినంబు
లున్
బురుషుఁ దపస్వి చేయునె? సమూలము నమ్మగుఁగాక యన్నియున్.

సత్య—ఓగాలవా! పెద్దల నట్లనరా దూరకుండుము. ఋషులు మాటలలోఁగాకను జూపినను గ్రియలలోఁ జల్లదనమునే కనఁబఱు తురు. వీరి పలుకులు వజ్రకఠినము లయినను హృదయములు నవ నీతకోమలములు.

గీ. కఠినముగ ముందు కోపవాక్యంబు లన్న
ఋషులు మేలునె చేయుదురు రెండుఁ బిదప;
మొదల మేఘంబు లుఱిమినఁ బిదప వవియె
వానకురిపించు గాదె యీవసుధమీఁద. 24

విశ్వా—ఓరీ! విప్రాధమా! మమ్ము దయ యెఱుఁగని క్రూరులమని చెప్పసాహసించుచున్నావుగా! మాకోపమునకు బ్రహ్మ రుద్రాదులయినను దలంకుచుండఁగా నీవెంతనిర్భయముగా మమ్ము నిరాకరించుచున్నావురా? మాక్రోధవహ్నిని నీవును జవిమాతువు గాని నిమిషము తాళుము.

గాల—క్రౌర్యము మీవంటి మునివ్యాఘ్రములు చూపినప్పటివలె వ్యాఘ్రములు చూపినప్పుడంత బాధాకరముగా నుండదు. వేఁడుకొన్నను నిరపరాధులమీఁద దయరాదేని, నిర్దయుఁ డయిన యామనుష్యుఁడు కేవల క్రూరమృగమే. కాదు, కాదు. క్రూర మృగమే వానికంటెను సహస్రగుణములు శ్రేష్ఠమయినది. నీ బెద

రింపులకు జడియుటకు నేనడవిలో ముక్కుమూసుకొని కూరుచుండెడు వశిష్ఠుడనుగాను. నన్నెవ్వనిగా భావించుచున్నావు? నీకంటెను బది రెట్లెక్కువ నేర్చిన యాస్థాన పరిహాసకుఁడను జుమా నేను.

హరి—మునిచంద్రా! తాను బరిహాసకుఁడనని యీ బ్రాహ్మణుఁడే చెప్పుకొనుచున్నాఁడు. అట్టి పరిహాసకు నవ్వులాట మాటలను మీరు పాటిగాఁబట్టి రోషము చూపఁదగదు. కాలకూటవిషాగ్నినిమించెడు మీ కోపానలమునకు బ్రహ్మేంద్రాదులును దాళఁజాలరన, మేమేపాటివారము? మీవంటిఘనులు పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రము వేయుదురా? కొడుకు లెప్పుడయిన బుద్ధిలేక తప్పుచేసినచో, తండ్రి శిక్షచేసి రక్షింపఁడా? ఇఁక మీకు దయవచ్చునందాఁక మీ పాదములనుండి లేవను. నన్ను నీటముంచినను పాలముంచినను దేవరదే భారము. (అని మరల పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

చంద్ర—ఓమహాత్మా! మా రక్షణభారము మీది. ఈతప్పు బుద్ధిపూర్వకమైనది కాదు. ఎఱుఁగక చేసినతప్పును మీవంటిసత్వగుణప్రధానులయిన మునిసత్తములే క్షమింపకపోయినయెడల మఱి యెవ్వరు క్షమింతురు?

విశ్వా—(శాంతతతో) ఓరాజేంద్రా! పాదములమీఁదనుండి లెమ్ము. ఋషులకెప్పుడును దీర్ఘకోపము గూడదు. నీవిప్పుడు పశ్చాత్తాపముగలవాఁడవయి భార్యాపుత్రులతో మా పాదములమీఁదఁబడి యింతగాఁ బ్రార్థించుచున్నావు గాన నీదీనత్వమును జూచి కరుణించి నీయపరాధముల నన్నిటిని మఱచిపోవుచున్నాము. నీకు మాయెడల నిజమైనభక్తి యున్నయెడల, నీవుచేసిన యపరాధమునకుఁ బ్రాయశ్చిత్తముగా మాకూఁతులైన యీమాలెతలను వరించి మాకు మనఃప్రీతిచేయుము. నిన్నిప్పుడు క్షమించెదము.

హరి—(చేతులు జోడించి నిలిచి) సర్వధర్మవిధులయిన దేవరవారికి నేను ధర్మములు చెప్పునంతటివాఁడను గాను. ధర్మతత్త్వములన్నియు మీకుఁ గరతలామలకములయి యుండును. లోకములో మీరెఱుఁగనిధర్మములు లేవు. అట్టి సకలధర్మవేత్తలయిన మీరే ధర్మవిరుద్ధమయిన యీపని చేయుమని నియోగించుట యర్హమగునా నామనసుకనిపెట్టవలెనని మీరిట్లానతిచ్చి యుందురు. కానివర్ణాశ్రమ ధర్మపరిపాలన పరులయిన తమరిటు మనఃపూర్తిగాఁ బనిచియుండరు.

విశ్వా—ఏమి? నీవేమాకిప్పుడు ధర్మోపదేష్టవుగా, గనఁబడుచున్నావు! నీకుమాకంటెను ధర్మము లెక్కువ తెలియునుగా? నీవు సుఖపడఁగోరుకొనేని, అన్యచింతమాని వీరిని వరింపుము. మామాట దాటక వీరి నిప్పుడు చేపట్టితివా, నీతండ్రికివలెనే నీకును బొందితోనే స్వర్గలోకసుఖమును గలిగించెదము.

హరి—ఓమునివర్యా! ధర్మబాహ్యమయిన కార్యమును గురువు విధించినను జేయఁగూడదని మీవంటిపెద్దలు చెప్పుదురు. ఇఁక నామనోనిశ్చయమును వినుఁడు. కాలధర్మమును మీఱి పొందు స్వర్గసుఖముకంటెను ధర్మమార్గము నవలంబించుట చేత లభించెడు నరకదుఃఖమయినను నాకుఁ బరమప్రియము. నాకున్న రాజ్యమును సర్వసంపదలను విడువుమన్నను విడుతునుగాని ధర్మముమాత్రము నేనెన్నఁడును విడువఁగలవాఁడను గాను. మీరింక నన్నేమి చేసినను జేయుఁడు. ఇదిగో నాయర్థమును దేహమును మీయధీనములు.

విశ్వా—నీప్రతిజ్ఞకు మేము సంతసించినారము. నీవు సత్యసరస్వతివి. నీవిప్పుడన్నమాట తప్పఁగూడదు. ఏదీ నీరాజ్యమును ధనమును సర్వమును మాకు ధారపోయుము. మేమింతటితోఁ దృప్తి పొంది యాశ్రమమునకుఁ బోయి రాజ్యసుఖమునయిన ననుభవింపుచుండెదము.

హరి—(చంద్రమతివంకఁజూచుచున్నాఁడు.)

చంద్ర—ఓప్రాణేశ్వరా! మీరనుమానింపక వెంటనే మీ రాజ్యమునుమిగిలిన సర్వస్వమును యాచకోత్తముఁడయిన యీముని సత్తమునకు ధారాదత్తముచేయుఁడు. మీధర్మపత్నినయి యుండి నేనుమాత్రము మీసత్యమునకు ధర్మమునకును భంగము కలిగింతునా!

హరి—ఓమునిచంద్రా! ఈభూమి మొన్నమొన్నటిదాఁక మీ కేలి నిస్సారమని విడిచిపెట్టినదేకాని క్రొత్తదికాదు. దీనిని మరల ననుభవింపవలెనని మీకుఁ గోరికపుట్టినయెడల మీ రాజ్యమును మీరు మరల గ్రహించి నన్నుఁగృతార్థుని జేయుఁడు.

విశ్వా—నీ చమత్కార వాక్యము లింతటితోఁ జాలును. ఈ తేనెమాటలకు మోసపోవువారిం దెవ్వరును లేరు. ఇఁక జాగు చేయక ముందుగా నీసర్వసామ్రాజ్యమును మాకు ధారపోసి తరువాత మఱి మాటాడుము.

హరి—పాత్రదానముచేత నేను ధన్యుఁడనగుచున్నాను. ఇదిగో స్వీకరింపుఁడు. గాలవా! ఉదకకలశ మిటు తెమ్ము.

గాల—(ఇచ్చుచున్నాఁడు)

హరి—(పుచ్చుకొని) అస్మత్సకలసామ్రాజ్య ధనకనకవస్తువాహనాని శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ధారాపూర్వకం బ్రాహ్మణాయ తుభ్య మహం సంప్రదదే నమమ. (అని చేతిలో ధారపోయుచున్నాఁడు)

విశ్వా—(గ్రహించి) ఓరాజేంద్రా! నే నిప్పుడు కొంతవఱకు సంతుష్టాంతరంగుఁడయినాను. మీశరీరములయందున్న యీయాభరణములుకూడ నీవు మాకిప్పు డిచ్చిన సర్వస్వములోనివే గనుక నీ యలంకారములును నీభార్యాపుత్రుల యలంకారములునుగూడ నిప్పించి మమ్ము సంపూర్ణసంతోషులఁ జేయుము.

హరి——నేను ధన్యుఁడ నగుచున్నాను. ఇవిగో పుచ్చుకొనుడు. (అని తీసియిచ్చుచున్నాఁడు)

చంద్ర & లోహి——(తమనగ లిచ్చుచున్నారు)

విశ్వా——(పుచ్చుకొని) ఇది యంతయు సరేకాని మేమయోధ్యకుఁ బోయిన తరువాత నీమంత్రులు మొదలయినవారు మమ్ముఁ జేరనీక తఱిమి రాజ్యమియ్యకపోయిన యెడల, మేమేమి చేయఁగలము? నీ విప్పుడు మాతోఁగూడ స్వయముగా వచ్చి రాజ్యము మాకిప్పించి తరువాత నీయిచ్చవచ్చినచోటికిఁ బొమ్ము.

హరి——స్వామీ! అంతకంటెను నాకుఁ గార్యమేమున్నది? మీచిత్తమువచ్చినట్లు చేసెదను. పట్టణమునకుఁ బోవుదము విజయంచేయుఁడు. (అందఱు నిష్క్రమించుచున్నారు)

---

## తృతీయాంకము

రంగము——అరణ్యమార్గము

[చంద్రమతీ లోహితాస్య సహితముగా హరిశ్చంద్రుఁడును, జనమిత్రుఁడు కామపాలుఁడు మొదలయిన పౌరులును ప్రవేశించుచున్నారు]

హరి——ఓపౌరజనులారా! ఈయరణ్యమార్గములయం దింకను మీరెంతదూరము నాతోవచ్చెదరు? నాప్రార్థన విన మీరిక్కడనుండి మరలుఁడు.

జన——(కన్నుల నీరు పెట్టుకొనుచు) ఓ మహారాజా! చిన్ననాఁడు కన్న తల్లిదండ్రులను మఱచిపోయి తల్లియుఁ దండ్రియు నాట్ట

ములును సమస్తమును మాకు నీవే యనుకొని, కలలోను గష్టము లన్నమాట యెఱుఁగక చిరకాలమునుండి మేము తల్లిచాటుబిడ్డల వలె మీపాలఁబడి సుఖంపుచున్నాము. అట్టిమే మిప్పు డెట్లు మిమ్ము విడిచి మరలి పోగలము? మేమును మీపాదసేవ చేయుచు మీవెంటనే వచ్చెదము.

కాము—ఓసార్వభౌమా! అనాథులమయిన మమ్మెవ్వరికొప్పగించిపోయెదవు?

చ. తడవుగఁ జిల్కలం బెంచి దారుణలీలను గండు బిల్లికిన్
గడపట నప్పగించి చనుకైవడి, మమ్మిటు లింత కాలముల్
గొడుకులకన్న నెక్కుడుగఁ గూరిమి నారసి మీరిప్పుడీ
చెడుమునివాతఁద్రోచినఁ జెల్లునె నిర్దయవృత్తి నక్కటా!

చ. నిలువఁగ నీడయుఁ గుడువనిచ్చుచుఁ దియ్యనిపండ్లనిచ్చి, గా
డ్పులకును నెండవానలకుఁ బ్రోపయి ప్రాపయియున్నవృక్షముల్
దొలఁగిన మేష మేని ధృతిదూలక పక్షులు నిల్వఁ జాలునే?
పలుకు లిఁకేల? దిక్కఱిన పక్షులమే యయినార మియ్యెడన్.

ఇన్ని నాళ్ళును గష్టపాటన్న నెట్టిదో యెఱుఁగక మీచాటున బ్రతుకుచున్న గంగిగోవులవంటి మమ్మీ మురాగ్రహశీలుఁ డయిన మునిశార్దూలునిపాల విడిచిపోవ మామీఁద మీకింతకరుణయేల లేకపోవలెను?

హరి—ఓపౌరజనులారా! మిమ్ము నేనుదయలేక విడుచుచున్నానని మీరెప్పుడును స్వప్నమందును జింతింపఁబోకుఁడు. ఈ విశ్వామిత్రుఁడు తపోధనులలో నెల్లను బరమపవిత్రుఁడు; విశుద్ధచరిత్రుఁడు. ఈమునిసత్తముని మహత్త్వ మెఱుఁగనివారగుటచే మీరీలాగునఁ దెలియనిమాటలుపలుకుచున్నారు. ఈతఁడుపూర్వముచిరకాలము సకలజనరంజకంబుగాఁ బ్రజాపాలనము చేసినమహానుభావుఁడు. ఈయన

సత్పరిపాలనముచేత మీరును ముందత్యల్పకాలములోనే యనంత సౌఖ్యమున ననుభవింపుచు నన్నుమఱవఁగలరు. నిర్విచారముగా మీరు మీయిండ్లకుఁబొండు.

జన—అకారణముగా రాజ్యమంతయుఁబుచ్చుకొని, నగలప హరించి, కట్టుబట్టలతో నరణ్యములకు సాగనంపి, మీవంటిపరమ సాధువులకే యింతలేసియపకారములుచేసిన మహాత్ముఁడు మమ్ము మాత్రముసంరక్షించి మాకుపకారము చేయునన్న మే మెట్లునమ్మ గలము? గోహింసకు సంకోచింపని క్రూరవ్యాఘ్రము మేఁకలనుమేపి కాపాడునా! మాకీవట్టిభ్రమలు కల్పించి యడియాసలు పెట్టక మమ్ము మీవెంటఁ గొనిపొండు.

కామ—ఓ మహారాజా! సాధుబాధకు వెనుదీయని యీయన దయాగుణమును మావద్దఁ జెప్పఁబోకుము. మీధనకనక వస్తువాహ నాదులకు క్రూరచిత్తుఁడయి కయికొన్న యీతనికి దయయెక్కడిది? సర్వసంగపరిత్యాగినని యడవులలోఁ దపస్సు చేసెడి యీతని కీ యిహలోకసంపద లేలకావలసి వచ్చెను?

చ. ఒనరుగృహాదిభోగములు యోగములే? ప్రతివృత్తివేల్ప నిం
ధనములె యాధనంబులు? రణన్మణిభూషలు వేదఘోషలే?
మొనసినపూవుఁదోఁటలు తపోవనవాటులె? రాజ్యమాజ్యమే?
మునికి నివేల భూవిభవముల్? వెత పెట్టఁగఁ గాక సాధులన్. 8

హరి—ఓపౌరులారా! పెద్దలను మీరట్లనఁగూడదు. మహా త్ముల చిత్తవృత్తులు మనవంటివారికి విదితములు కావు. మమ్ముఁ గృతార్థులను జేయఁదలఁచియో వారిధనకనకాదిసంపదలు స్వీకరించిరి కాని, ముముక్షువు లయిన తమకుఁగావలసి కాదు.

క. జనకులు నగ లిడఁ గొడుకుల
కును జెవుల న్నొప్పి యెత్తఁ గుట్టించుగతిన్

నను ధన్యునిఁ జేయు నయా
ఘనుఁడును గష్టములు నాకుఁ గల్పించుఁ జుఁడీ. 4

ధనముపోయినప్పుడే పురుషుని యోగ్యతలు లోకములోఁ దెలియఁబడును. కాఁబట్టి నాధన మాతఁడు గ్రహించుట నామేలుకొఱకే. ఇఁకముందు నేను మీకండఱకును నాస్వచ్ఛగుణముతో నగపడుదును.

చ. వినుఁడు ధనంబు భీరులను వీరులఁ గాఁగను దోఁపఁ జేసెడున్;
ఘనతరబుద్ధిమంతులఁగఁ గన్పడఁ జేయును బుద్ధిహీనులన్;
బనుపడఁ దోఁపఁ జేయు గుణవంతులఁగా గుణహీనులన్; సదా
జనులను మోసపుచ్చి ధనసంపద చిత్తము మత్తుగొల్పెడున్. 5

ఇట్లు మోసము చేయని దొక్క బీదతనమే.

చ. కనకము శుద్ధ మాటయును గల్మషదూషిత మాట తిన్నఁగా
ననలముచేతనే యెఱుఁగ నయ్యెడుక్రైవడి, భూమిలోపలన్
జనుఁడు విశుద్ధుఁ డౌటయు నిజంబుగఁ దాఁ గలుషాత్ముఁ డౌటయున్
వినికిడి చేయు స్పష్టముగ బీదతనంబె జగజ్జనాళికిన్. 6

జన—దేవరవారు సెలవిచ్చినట్లు పేదవారిని మంచివారినిగఁ జేయలేకపోయినను మంచివారినిసహితము చెడ్డవారినిగాఁదోఁపించెడి దుర్గుణ మొకటి బీదతనమునందుఁగూడ నున్నది. కాఁబట్టి బీదతన మెప్పుడును మంచిదనరాదు.

చ. సిరులు తొలంగినన్ సఖులు చేరరు; చేరవ రారు బంధువుల్;
కరముఁ దిరస్కరించుఁ గులకాంతయు; లోకులు సద్గుణంబులన్
సొరిదిని దుర్గుణంబులుగఁ జూతురు; పేదరికంబుకంటెఁ దా
మరణమె శ్రేయ మంచుఁ బలుమాఱును నేమదిలోఁ దలంచెదన్. 7

క. జీవించినంత కాలముఁ
దా వేదనలన్ ఘటించు దారిద్ర్యమిలన్;
చా వన్న నొక్క నిమిషమె
యీ వేళను బాధ పెట్టు నవనీజనులన్. 8

హరి—నీవన్నమాట కొంతవఱకు సత్యమే కాని పామర జనులవలన గౌరవము పోవు నని బీదతనము వచ్చినంతమాత్రముచేత నెవ్వరును సిగ్గు పడవలసిన పని లేదు. లోకములో ధనికుఁ డన్న స్థిరమయిననీతిసంపద గలవాఁడే కాని చంచల మయిన కాంచన సంపద యున్నవాఁడు కాఁడు. బీదవానియొద్దనున్నను ధనికునియొద్ద నున్నను నీతి యెప్పుడును నీతియే. దానిగౌరవము దానిదే.

ఉ. నీతికి హేమభూషణమణిప్రకరంబుల వన్నె రాదిలన్;
నీతికి వన్నె పోదు ధరణిన్ వెలమాలినచింపిగుడ్డలన్;
నీతికి గౌరవం బెపుడు నిల్చుఁ జుమీ సహజంబుగానె; వి
ఖ్యాతిగ నీతివర్తనము నందఱు మానక యుండఁగావలెన్. 9

ఈరీతిగా బీదతనము వచ్చినందుకు నేను లేశమును జింతపడనుగాని ఇఁక నతిథులును నభ్యాగతులును మునుపటివలె నావలన సత్కారమును గానక శూన్యమయిన నాగృహమును జూచి యుస్సురని పోవలసినవా రగుదురుగదా యని మాత్రము విచారపడుచున్నాను.

జన—ద్యూతాదులచేతఁ గాక యోగ్యదానముచేత ధనము కోలుపోయిన మీరంతగాఁ జింతిల్లవలసిన పనిలేదు.

క. సరి లేని దానమహిమన్
సిరులం బోఁగొట్టుకొన్న శ్రీమంతుఁడొగిన్
ధరలోన సానఁ బట్టిన
వరరత్నముఁ బోలి మిగుల వన్నెకు నెక్కున్. 10

అయినను దారిద్ర్యము మిక్కిలి దుస్సహమయినదే. అందులోను గష్టపడి సుఖపడవచ్చునుగాని సుఖపడి కష్టపడుట మిక్కిలి దుర్భరము. కటకటా! మహారాజపదవినుండి నిరుపేదతనము నొంది మీరీకష్టముల నెట్లు సహింపఁగలుగుదురు? ఋషివేషముననున్న క్రూరచిత్తుఁ డయిన యాకిరాతుఁడు నిర్నిమిత్తముగా మీకిట్టిపాట్లు తెచ్చిపెట్టెనుగదా!

హరి—ఓజనమిత్రా! నీవు విశ్వామిత్రుని బరోక్షమున నిందింపఁ బోకుము. ఆమహర్షి యే యిప్పుడిక్కడఁ బ్రత్యక్షమయిన పక్షమున మీ గతి యేమి గావలసియుండును?

(తెరలో విశ్వామిత్రుఁడు)

ఉ. పోకుర పోకు మెచ్చటికిఁ బోయెదు మమ్మిటు మోసపుచ్చి? నీ
వాకలుపాత్మ! నిల్వు మిట నొక్కనిమేషము; పోయినంత నే
నీకనువైన దక్కఁగను నేర్చునె బ్రాహ్మణవిత్తమారి దో
షాకర! విప్రవిత్త మపహర్తలఁ జంపుఁ జుమీ విషాభమై. 11

జన—విశ్వామిత్రుఁడు రౌద్రాకారముతో నిక్కడకే వచ్చుచున్నాఁడు. నేనిప్పు డన్నమాట విని యుండఁడుగదా!

హరి—ఓపౌరులారా! విశ్వామిత్రునికంటఁబడకమునుపే మీరు దాటిపొండు. మీ వ్యర్థప్రయత్నములు మాని యిల్లు చేరి సుఖింపుఁడు. పొండు.

జన—ఇడుములు గుడువుఁ డని విధి మానొసట వ్రాసిపెట్టగా, మే మెట్లు పోకుండఁగలము? అమ్మా! చంద్రమతీ? మేము పోయి వచ్చెదము. మమ్ము మరచిపోకుము. ఇన్నాళ్ళును మిమ్ము మాకన్న తల్లివలెఁ జూచుకొని మీ చల్లదనముచేత మీచాటున సుఖించుచుంటిమి. దైవమోర్వలేక మాకిప్పుడా భాగ్యము లేకుండఁ జేసినాఁడు. (అని యేడ్చుచుఁ బౌరులు పోవుచున్నారు.)

[అప్పుడు విశ్వామిత్రుఁడును శిష్యుఁడగు నక్షత్రకుఁడును బ్రవేశించుచున్నారు.]

విశ్వా-ఉ. పోకుర పోకు మెచ్చటికిఁ బోయెదుమమ్మిటుమోసపుచ్చి? నీ
వాకలుపాత్మ! నిల్వుమిట నొక్కనిమేషము; పోయినంత నే
నీకనువైన దక్కఁగను నేర్చునెబ్రాహ్మణవిత్తమారి దో
షాకర! విప్రవిత్త మపహర్తలఁ జంపుఁజుమీవిషాభమై 12

నేను మఱియెవ్వఁడను గాను! విశ్వామిత్రుఁడను జుమీ! నాసొమ్ము నీకు దక్షిణ దనుకోకు.

హరి—ఓమునికులతిలకా! ఇదియేమి? నేను నాసామ్రాజ్యమును వస్తువాహనములును సమస్తమును మీకే సమర్పించి పట్టపగలు కట్టుబట్టలతో లేచివచ్చుచున్నను మీధన మపహరించినాఁడనని నావెంటఁ బడుచున్నారు!

విశ్వా—ఏమీ! ధనరాజ్యమదాంధత! నాఁడు మాకు యజ్ఞార్థము ధనమిచ్చిన మాటకూడ నీవప్పుడే మఱచిపోయినావుగా! ఆధన మప్పుడు మేము నీయొద్దనే, యునిచిపోలేదా? మాధనమును మరల మాకప్పగింపక పాఱిపోవుట నీకు న్యాయమగునా? మేము పరాకుపడినను నీవు మాకు స్మరణకుఁ దేనక్కఱలేదా?

హరి—ఓమునిసార్వభౌమా! లేనిపోనియప్పు నామీఁదబెట్టి యన్యాయముగా నన్నిట్లు చిక్కులుపెట్టుట మీకు ధర్మముకాదు. మీయజ్ఞమునిమిత్తము నేనిచ్చెదనన్నసొమ్ము మీకింతకు మునుపప్పగించిన ధనములోనే యున్నది.

విశ్వా—ఏమిరా! నీకండక్రొవ్వు! నీవన్యాయమున కొడిగట్టి యెదురుకెదురు మేమే న్యాయము తప్పినవార మయినట్లు చెప్పుచున్నావు! నీవు మొన్న యరణ్యములో నీవద్దనున్న సర్వస్వమును నాకు దానమిచ్చి నప్పుడు దానవాక్యములో నే నప్పుడు దాచనిచ్చినధనము తక్కఁ దక్షిణదానినిమాత్రమే యిచ్చినానని చెప్పినావా? ఈధనము నిమిత్తమయి నీ వేల బొంకులుపలికెదవు? ఇంతకన్న నాకు దానమే యియ్యలేదని చెప్పరాదా? నీవట్లు బొంకినపక్షమున నీవద్ద నేను దాఁచుకొన్నధనమంతయు విడిచిపెట్టుటయే కాక నేఁడు నీవద్దగైకొన్న రాజ్యమునుగూడ నీకిచ్చివేసి నేనీ గోచిపాఁతతో లేచిపోయెదను.

హరి—ఓమునీంద్రా! ఈరీతిగా విపరీతార్థకల్పనముచేసినచో నే నేమియు మీయెదుట బదులు చెప్పఁజాలను. మీకుఁ బుచ్చుకొనుట న్యాయమని తోఁచినపక్షమున మీధనమునుమీకునాతలతాకట్టుపెట్టియైనను, నెలదినములలో సమర్పించెదను. అంతేకాని ప్రాణము పోయినను నాజిహ్వ యసత్యమెప్పుడును బలుకదు. నాతండ్రి సత్యవంతుడు; సత్యమే నా కతఁడు విడిచిపోయిన ముఖ్యదాయము. జంగమస్థావర రూపమయిన నాపితృధన మంతయుఁ దృణప్రాయముగా మీకు విడిచితినిగాని మీవంటివారు పదివేలువచ్చి యాచించినను పీడించినగూడ సత్యరూపమయిన యీపితృ ధనమును నేను విడువఁ గలవాడను గాను.

విశ్వా—మేమిన్ని మాటలవారముగాము, మాకు న్యాయముగా ధనమురావలసియే యున్నది. మేము శాంతిధనుల మయిన మునుల మగుటచేత నిన్ను నిర్బంధించి క్రౌర్యము చూపలేము. నీవు కోరినట్లు ముప్పది దినములును గడు విచ్చినారము. మా శిష్యులలో నెల్లను సదాచారుఁడయినయీమునికుమారుని మీవెంటఁ బంపుచున్నాము. మాధనము నీ వీతనిచేత నిచ్చి పంపివేయుము.

నక్ష—ఓగురువర్యా? నాబత్తెముమాట చెప్ప మఱచిపోయినారు.

విశ్వా—నేనుజెప్పనక్కర లేదు. ఉచితజ్ఞుఁడై నయీతఁడే నిన్నుసంతోషపెట్టును.

హరి—ఓమునిసార్వభౌమా! అనుగ్రహించి మమ్మింతటితో విడిచిపెట్టుము. మితిదినములలోపల మీ ధనమును మీకు సమర్పించుకో లేకపోయినయెడల మమ్మువిక్రయించియైన మీరుమీవిత్తము రాబట్టుకోవచ్చును.

విశ్వా—నీ వేది చెప్పినను దానికెల్లను మే మొప్పుకొను చున్నాము. ఈబాలుఁడు నా ప్రియశిష్యుఁడు; ఈతని పేరు నక్షత్రకుఁడు. ఇతఁడు కొంచెము కోపస్వభావుఁడు. మీరు వీనిపరుషభాషణములకు కోపపడక కూడఁగట్టుకొని రావలెను. ఇతఁడు బహుసుకుమారుఁడు; ఎన్నఁడును మార్గాయాసమున కోర్చినవాఁడు కాఁడు. వేళపట్టున వీనికన్నపానాదు లిచ్చి వీనిని మీ రెట్లాదరించెదరో! నేను బోయి వచ్చెదను. (అని విశ్వామిత్రుఁడు బోవుచున్నాఁడు.)

హరి—ఓ మునికుమారా! నీవు ముందు నడువుము. మన మిప్పుడు బయలుదేఱి యీమార్గంబునఁ గాశీకాపురమునకుఁ బోవుదము. ఓ ప్రాణేశ్వరీ! నామూలమున నీ కెంతదురవస్థ తటస్థించినది! అగర్భశ్రీమంతురాల వయిన నీ విప్పు డీకటికి నేలను ముండ్లలోను నడువవలసినదాన వయినావుగదా? (అందఱు నడుచుచున్నారు.)

చంద్ర—ఓ ప్రాణనాథా! నా నిమిత్తమై మీ రెంతమాత్రమును విచారింపఁబనిలేదు. మీతో నుంటచే నాకిక్కడ సుఖముగానే యున్నది. మహారాజ్యభోగ మనుభవించిన మీ రిట్లు దివ్యభవనములు విడిచి మహారణ్యములలో సంచరించుచు నెట్లు కష్టపడఁగలరా యని మాత్రము నామనస్సు ఖేదపడుచున్నది.

హరి—(కన్నీరు నించుచు) పరిచారికాశతములు సేవ చేయ, సదా యంతఃపురములయందుండి, ఎండకన్నును నెఱుఁగకుండెడి నీది కాని నా దేమికష్టము? నీవు నాతో నెక్కడనుందువో నాకదే దివ్యభవనము; నీవు లేనిచోటే నాకు మహారణ్యము.

చ. అనవరతంబు ప్రాణపదమైనపదార్థముఁ గూడి యుండినన్
వనమును మందిరం బగు; విపత్తులు సారసుఖప్రదంబు లౌ
తనప్రియవస్తువున్ విడిచి దవ్వుగ నుండెడివాని కాప్తసంపదల్
వినుసుఖ మియ్యఁజాలవు భువిం దనప్రాణమె భారమౌఁజుమీ.

అయ్యో! నీకష్టములకుఁ దోడు నాకష్టములనిమిత్తమయి కూడ దుఃఖపడుచున్నావుగదా!

సీ. పికనాదముల కింత భీతిల్లిపఱచెడు
పులులయార్పుల కెట్లు నిలిచెదీవు?
విరిదోఁటలో నింత విహరింప నలసెడు
నట్టడవుల నెట్లు నడచెదీవు?
శశికాంతములపైన చరణముల్ కందును
మొనరాళ్ళపై నెట్లు మోపెదీవు?
పసిఁడిమేడలమెట్లపయి నెక్కనోడెద
విచటిమెట్టల నెట్టు లెక్కెదీవు?

గీ. అలరుదీఁగె యింత తొలఁకఁద్రోయఁగ లేవు
పాఱుపాదల నెట్లు దూఱెదీవు?
కేళిశుకముఁ దడవు కేలఁ దాల్పఁగ లేవు
కొడుకు నెటు వహించి నడతు వీవు? 14

కటకటా! ఈశ్వరునకును మనమీఁద దయలేదు కాఁబోలును!

చంద్ర—ఈశ్వరునకు మనమీఁద దయయున్నదని మన సంరక్షణనిమిత్తము కత్తులును గటారులును దెచ్చి యిచ్చునా? మనయెడల నాతని కనుగ్రహ మున్నందుననే మన కాతఁడు నీతిపథమునుండి మరల మంచిబుద్ధిని దయచేసినాఁడు. ఆబుద్ధిని యెప్పుడును మన మాయుధముగా నుంచుకొని ప్రవర్తించితిమా రాళ్ళమీఁదఁ బరున్నను సుఖనిద్ర పొందుదుము. ఓప్రాణవల్లభా! ఇవి కష్టములని తలఁచి యేల చింతిల్లెదరు? ఈశ్వరుఁడు మనకు మనస్థైర్య మున్నదో లేదో పరిశీలించుటకయి యేర్పరచిన శోధనలే కాని యివి వేఱు కావు.

హరి — అవు నవును. నీవు చెప్పినది పరమసత్యము. ఆపదలు లేని సుఖదినములయందు మనుష్యుని యోగ్యతను దెలిసికొనుట కవకాశ ముండదు.

ఉ. ఆపద లొక్కటం దగులునప్పుడె ధీరుఁడు సుస్థిరుం డగున్;
కాపురుషుండు కష్టముల గాసిలి నిల్వక సంచలించెడున్
దాపునఁ దీవ్రమారుతము దందడి ముట్టిన, బెండు నిల్వగా
నోపక పాఱుచో నిలిచి యుండవె గ్రావము లుసుస్థిరంబులై! 15

నక్ష — మీరు మహాపండితులవలె ధర్మోపన్యాసములు చేయుచుఁ బెండ్లినడకలు నడుచుచున్నారు. నాకుఁ గ్రింద కాళ్ళు కాలుచున్నవి; పైని నెత్తిమాడుచున్నది. నేను మిమ్ము వదలి ముందయినను నడువవల్లఁగాదు. మీరు నాకు గుదెకఱ్ఱలవలెఁ దగులుకొని నాకాలు సాగనీకున్నారు. మీసుకుమారత యంతయు నాయొద్దనే కనబఱుప నక్కఱలేదు. నాలుగడుగులు వేగిరము పెట్టుఁడు. ఇంతలోనే మీకాళ్ళు నొచ్చిపోవు.

హరి — ఓముని కుమారా! కోపపడకుము. మున్నెప్పుడును వీధిలోఁగాలుమోపియెఱుఁగని యీకోమలి పిల్లవాని నెత్తుకొని నడవలేక మెల్లఁగా నడుచుచున్నది.

చంద్ర — ఓబ్రాహ్మణోత్తమా! ఇదిగో నేనునడుచుచున్నాను. మీరు నానిమిత్తమయి మెల్లఁగా నడువవలసిన పనిలేదు. వేగిరము కాలు సాగనిండి. అయ్యో! నాకాళ్ళకీరాళ్ళు ముళ్ళవలె గ్రుచ్చుకొనుచున్నవి. (కాలు చూచుకొని) నాయడుకాలి నెంతలేసిపొక్కు లెక్కినవి! పిక్క లంతకంతకు లావయి నొచ్చుచున్నవి.

హరి — ఓపాణనాయికా! నీవెండబడి మిక్కిలి యలసినట్లున్నావు. నీమొగము వాడుపాఱినది; చెక్కులఁ జెమ్మటలు కాలువలు కట్టుచున్నవి. లోహితాస్యు నొకసారి నాచేతికిమ్ము. కొంచెము దూరము నేనెత్తుకొని నడిచెదను.

సత్య—(తనలో) ఈసమీపమున నెక్కడను నీళ్ళు దొరకవు నేనిప్పు డలసినట్లు నటించి, త్రాగుటకు నీరు తెమ్మని యీతనిని మఱింత చిక్కులుపెట్టెదను. (మిట్టనేలను గూలఁబడి నిట్టూర్పు విడిచి) ఓరాజా! నేనిఁక నడుగుడూర మయినను నడువలేను. దాహముచేత దేహము తాప మొందుచున్నది; కాళ్ళు తేళ్ళు కుట్టినట్లు మండుచున్నవి; నో రెండుకొనిపోవుచున్నది; నానాలుకను తడిలేదు; నా దురవస్థ నీతోఁబూర్ణముగాఁ జెప్పుకొనుటకు నోటమాటకూడ రాకున్నది. (హీనస్వరముతో) ఓమాలదైవమా! నన్నీయడవిలో దిక్కుమాలిన చావుచావుమని విధించితివా? ఓతల్లీ! నేనిఁక నిన్నుఁ జూడను గాఁబోలు! ఓగురువర్యా! ఇఁక మీకు శుశ్రూష చేయు భాగ్యము నాకు లభింపదు.

హరి—ఓఋషిపుత్రా! అధైర్యపడకు. నేనిప్పుడే పోయి యెందైనను మంచినీరు వెదకి తెచ్చి నీదప్పి తీర్చెదను. ధైర్యము తెచ్చుకొమ్ము.

సత్య—(తడఁబడుచు) ఓరాజా! నీవు మరలి వచ్చినదాఁక నాప్రాణములు నిలువవు. నామన స్సిప్పుడు వృద్ధురా లయిన నా తల్లిమీఁదికి బోవుచున్నది. నాతల్లికి నే నేకపుత్త్రుఁడను. నీవు నా కియ్యఁదలఁచిన బత్తెమును బుత్త్రశోకముచేత విలపించుచుండెడు నా తల్లి కిచ్చి యోదార్పుము.

హరి—అయ్యో! ఊరుచేరకుండ మునికుమారుఁడు దారిలోఁ బడిపోయినాఁడుగదా! ఎంత ప్రమాదము సంభవించెను! ఇప్పుడితని నొక్కయూరుచేర్చి రక్షించు నుపాయ మేది!

చంద్ర—ఓప్రాణవల్లభా! మీ రక్కడ విచారించుచు నిలుచున్న కార్యములేదు. అలక్ష్యమయిన నితఁ డేమగునో! మీరు శీఘ్ర

ముగాఁ బోయి యెందైన వెదకి నిర్మలోదకములు తెచ్చి బ్రహ్మ హత్యాదోషము రాకుండ నీతనిప్రాణములు నిలుపుఁడు.

హరి—ఇదిగో నే నుదకమునిమిత్తము పోవుచున్నాను. నేను వచ్చువఱకు నీ వీతని కుపచారములు చేయుచుండుము. (అని పోవుచున్నాఁడు)

చంద్ర—(పైటచెఱఁగుతో విసరుచు) ఓబ్రాహ్మణోత్తమా! నీవు వ్యసనపడఁబోకు. ఈమహారాజుగారిక్కడ నున్నట్టే నీరు కొనివచ్చి నీకు దాహశాంతి చేయుదురు. ఆయన వచ్చులోపల నీవీ పండు తినుము. (అని యొకనారింజపండొలిచి తొనలిచ్చుచున్నది)

నక్ష—(తొనలు తిని లేచికూరుచుండి) అమ్మా! ఈఫలరసముచేతను నీవచనామృతముచేతను గొంతవఱకు దాహశాంతియై మరల నానోట మాటవచ్చుచున్నది. బ్రాహ్మణసేవచేత మిక్కిలి పుణ్యము గలదు. నాకాళ్ళు నొచ్చుచున్నవి. కొంచెము నొవ్వపట్టుము. (అని కాళ్ళు చాచుచున్నాఁడు)

చంద్ర—(కాళ్ళు పిసుకుచు) ఓవిప్రోత్తమా! కొంచెముప శమనముగానున్నదా?

నక్ష—ఓపతివ్రతాశిరోమణీ! నీయనుగ్రహముచేతఁ బ్రాణములు మరల మెల్లగా నాదేహము నిప్పుడు చేరుకొనుచున్నవి. నీవు దొడ్డయిల్లాలవు. ఆజన్మశ్రీమంతులయిన తల్లిదండ్రులకడుపునఁబుట్టి, మహారాజునింటఁ జొచ్చి, కష్టము లెట్టివో యెఱుఁగక నిత్యసుఖము లనుభవించుచుండెడు నీభర్తమూలమున మహారణ్యములలో దుస్సహకష్టములు పొందవలసినయోగము సంభవించినదికదా! అయ్యో! నీ వెంత యభాగ్యురాలవు!

చంద్ర—ఓయి వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! నీవు తెలియనిమాటలు చెప్పుచున్నావు. పెనిమిటితోఁగూడ నుండుటవలన నాకేకష్ట

ములు కష్టములు కావు. మహారాజకూఁతురయినను భర్తకు బరి చారికయేసుమా యీయరణ్యములకిట్లు రాఁబట్టియేస్వయముగా భర్తకు సేవచేసెడుభాగ్యమిప్పుడు నాకు లభించినది. నేనెంతమాత్రముభాగ్య హీనురాలను గాను. వేయి యాపదలు వచ్చినను నీతి తప్పక ప్రవ ర్తించెడు సద్భర్త పూర్వపుణ్యముచేత నాకు లభించుటచేత, ఇల్లాం డ్రలో నన్ను మించిన ధన్యురాం డ్రెవ్వరును లేరు.

నక్ష—అమ్మా! నీవు నావిషయమయి మిక్కిలి శ్రమపడు చున్నావు. నీయవస్థచూడఁగా నాకు జాలియు దయయుఁ బుట్టు చున్నవి. బ్రాహ్మణసేవ యెప్పుడును నిష్ఫలము కాఁగూడదు. నీవును నీపుత్త్రుఁడును నావెంట రండు. నేనువిశ్వామిత్రుని కాళ్ళను గడుపును బట్టుకొని బతిమాలి యొప్పించి నీకొమారునికిఁ బట్టాభి షేకము చేయించి మీరాజ్యమును మరల మీకిప్పించెదను. నీభర్త విషయమయి చెప్పిన యెడల మాగురువు నామాట వినునో వినక పోవునో కాని నీకుమారునివిషయమయి నామాట తీసివేయఁజాలడు.

చంద్ర—ఓబ్రహ్మచారీ! ఇప్పుడు నీవుచెప్పినఁ జెప్పితివి కాని యిఁకముం దెప్పుడును నీవు నాతో నిటువంటిప్రసంగములు చేయఁ బోకు. నాకు భర్తయెక్కడనుండునో యదియేరాజ్యము. అరణ్యము లోనయినను నాకాతఁ డున్నచోటనే సమస్తసౌఖ్యములును గలు గును. ఎవ్వఁడో రాక్షసుఁడు పలుకవలసిన యీమాటలు బ్రాహ్మ ణుఁడవైన నీనోటినుండి వెడలఁగూడదు.

[అప్పుడు దంతఘాతకుఁ డను రాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దంత—(తనలో) నా రాక్షసమాయచేత హరిశ్చంద్రుని దారి తప్పించి యీరాత్రి యూరుచేరకుండ బేతాళవటముక్రిందఁ బరుండునట్లు చేయుమని నన్ను విశ్వామిత్రుఁడు పంపినాఁడు. ఈ రాత్రి యిక్కడశయనించిరా మఱ్ఱిచెట్టుమీఁది బేతాళుఁడు వీరిని హింసింపక విడువఁడు. నామునివేష మిప్పుడు సరిగానున్నదా? నా

చేతిలోని రుద్రాక్షమాల మఱచిపోలేను. కుంపటిలోని బూడిదతోఁ దిర్యపుండ్రములు దట్టముగాఁ దీర్చినాను. ఈ వ్యాఘ్రాజినమునకు సమీపమున దండమును కమండలమును పదిలపఱచినాను. హరిశ్చంద్రుఁడు వచ్చెడి యీమార్గములోఁ దావళము త్రిప్పుచు, ముక్కుపట్టిఁ కన్నులు మూసికొని, జపము చేసికొనుచున్నవారివలె నభినయించెదను. హరిశ్చంద్రు డిప్పుడే వచ్చుచున్నాఁడు! (అని వ్యాఘ్రచర్మముమీఁదఁ గూరుచున్నాఁడు)

హరి—(ప్రవేశించి) నేనెంతదూరము తిరిగినను వృథాప్రయాసమే కాని నీటికొలఁకెక్కడను గనఁబడలేదు. నేనాలస్యము చేసినయెడల నింతలో మునికుమారుఁ డేమగునో! వెళ్ళిన తరువాత నేనేపాపమువాట వినవలసివచ్చునో! హా దైవమా! ఈమునికుమారునకుఁ బ్రాణాపాయము రాకుండ రక్షించి మరల నీతనిని సుఖముగా గురువున కొప్పగించెడు సుకృతము నాకు లభింపఁజేయుము. అదుగో సమీపమున నెవ్వఁడో యొకఋషి తపస్సు చేయుచున్నాఁడు. కన్నులు తెఱచి నావంకఁ జూచుచున్నట్టున్నాఁడు. అతఁడింతలోనే మరలఁ గన్నులు మూసికొన్నాఁడు. అతని కమండలములో జల ముండక మానదు. ఈఋషిని బ్రార్థించి కొంచెము జలము కొనిపోయి ఋషికుమారుని బ్రతికించెదను. (అని సమీపించి) ఓ తాపసోత్తమా! నీకు నమస్కారము.

దంత—(కన్నులువిచ్చి చూచి) ఎవఁడురా యిప్పుడు మాతపస్సునకు విఘ్నముచేసి మాయనుసంధానమును జెడఁగొట్టుచున్నాడు? (అని కన్నులు మూసి యాలోచించి తలయూఁచి) ఆహా! తెలిసినది. (కన్నులు తెఱచి) ఓరాజోత్తమా! కూరుచుండుము. నీ వృత్తాంత మంతయు మే మిప్పుడు దివ్యదృష్టిచేతఁ జూచినారము. నీవుహరిశ్చంద్రుఁడవు. సత్యపరిపాలనము నిమిత్తమయి నీసామ్రాజ్య

మంతయు విశ్వామిత్రునికి ధారపోసి భార్యాపుత్ర సహితముగా నరణ్యములలోఁ దిరుగుచున్నావు.

హరి—(తనలో) ఈమహానుభావుఁ డీశ్వరానుగ్రహముచేత మమ్ము దరిచేర్చవచ్చిన పరమతపోధనుఁడు కాఁబోలును! నా వృత్తాంత మంతయుఁ జూడఁగానే చెప్పినాఁడు. (ప్రకాశముగా) ఓమహాత్మా! నాకిక్కడఁ దడయఁగూడదు. అవలఋషి—

దంత—ఓరాజేంద్రా! నీవు వచ్చినసంగతియు మాజ్ఞాన దృష్టిచేతనే తెలియవచ్చినది. నీవు విన్నవింపవలసిన పనిలేదు. సొమ్మునిమిత్తమై మీవెంటఁ దరువువచ్చిన ఋషికుమారుఁడు పిపాసాతురుఁడయి పడిపోఁగా నీవు జలమునిమిత్తమై వెదకుచువచ్చి యెందును గానక జలమున్నచోటు చెప్పుఁడని మమ్మడుగవచ్చినావు.

హరి—సర్వవిదులైన మీతో మనవి చేసికొనవలసినపనిలేదు. మీకమండలములోని పావనోదకములను గొంచెముదయచేసి విప్రబాలునికిఁ బ్రాణదానము చేయుఁడు.

దంత—ఓరాజోత్తమా! ఈకమండలములోనివి మంత్రోదకములు. ఇవి యెవ్వరికి నియ్యఁగూడదు. జలమక్కఱలేకయే మా తపోబలముచేత ఋషికుమారుఁడు నీవు పోవునప్పటికి సుఖముగా మాట్లాడు చుండును. సూర్యాస్తమానము కావచ్చుచున్నది. మీరు పోయి చేరుటకు సమీపములో నూరేదియులేదు. ఆలుబిడ్డలతోఁ గ్రూరమృగబహుళమయిన యీమహారణ్యములో నీ వీ రాత్రి యెట్లు వేగింపగలవు?

హరి—ఓమునివర్యా! ఈ రాత్రి భార్యాపుత్రులతో మేము విశ్రమించుటకు సురక్షితమయిన తావొక్కటి యనుగ్రహించి మమ్ముధన్యులఁ జేయుము. మీరాపే రానతిచ్చినయెడల, మీయాశ్రమమునకు వచ్చి యందీరాత్రి తల దాఁచుకొనెదము.

దండ—నాపేరు దంత. (తనలో) అయ్యో! ప్రమాదము సంభవించినదిగదా! తడవు మాటాడినయెడల నాగుట్టు బయలఁ బడకమానదు. నేను వేగిర మిక్కడనుండి తప్పించుకొని పోవలెను. నేను వచ్చినప్పుడు పేరు పెట్టుకొన మఱచిపోయినాను. ఏమని చెప్పను? జాబాలి యని చెప్పెదను. (ప్రకాశముగా) ఓరాజ చంద్రా! నీవేమో యడుగుచున్నావు. మాదృష్టి యంతయు నీశ్వర ధ్యానముమీద నున్నందున మాచెవులు నీమాటలను వినకున్నవి. మాపేరు జాబాలి; మాయాశ్రమము హిమవత్పర్వతమం దున్నది. మీరక్కడకు రాలేరు. మేము మాతపోమహిమచేత దివ్యమార్గమున క్షణకాలములోఁబోయి చేరుదుము. మాకనుష్ఠానసమయము సమీపించినది. ఇఁక మాటాడఁదీరదు. మీరువచ్చి నాకుఁదిన్నఁగా నెదుటనున్న యీమఱ్ఱిచెట్టుక్రిందఁ బరుండుఁడు. (అని వ్రేలితోఁ జూపి యదృశ్యుఁ డగుచున్నాఁడు)

హరి—ఋషీశ్వరుఁ డంతర్ధానమయినాఁడు. ప్రొద్దును వ్రాలిపోయినది. పక్షులును మేఁతలనుండివచ్చి కొలకొలకూయుచు గూళ్ళు చేరుచున్నవి. ఇఁక జీఁకటిపడక మునుపే ఋషిపుత్రిని భార్యాపుత్రులను గొనివచ్చి యీచెట్టునీడకుఁ జేర్చెదను.

(అని నడచుచున్నాఁడు)

నక్ష—అమ్మా! చంద్రమతీ! రాజదేపోకగాఁ బోయినాఁడు. అతఁడు మనమిక్కడ నున్నవార్త మఱచిపోయినాఁడేమో! చీఁకటి పడుచున్నది. ఈయరణ్యమును దలఁచుకొనఁగా నాగుండెలు బద్దలగుచున్నవి.

చంద్ర—ఓమునికుమారా! భయపడకుము. ఆఁడుదానిని నేనే భీరురాల ననుకొన్నాను. నీవు నాకంటెనుభీరుఁడవుగానున్నావు! అదిగో

నా ప్రాణేశ్వరుఁడు వచ్చుచున్నాఁడు. లేచిసిద్ధముగానుండుము. అతఁడు మరల నిప్పుడు భద్రమయిన చోటికిఁ దీసికొనిపోవును.

హరి—ఓనక్షత్రకా! జలము—

నక్ష—ఓరాజా! నాకు జల మక్కరలేదు చీఁకటి పడకము నుపే నన్ను సురక్షిత మయిన శయనస్థలము చేర్చి బ్రతికింపుము.

హరి— ఓమునికుమారా! నా వెంట రమ్ము మనముపరుండఁ దావు చూచి వచ్చినాను. ఓప్రాణేశ్వరీ! లోహితాస్యుని వెంటఁబెట్టు కొని రమ్ము. మనము శయన స్థలమునకుఁ బోదము.

(అందఱును నడుచుచున్నారు.)

చంద్ర—నక్షత్రకా! దారి చూచి నడువుము. అప్పుడేచీఁకటి పడినది. దారితిన్నఁగాఁ గనబడకున్నది.

హరి—అప్పుడే గాఢాంధకారము క్రమ్మి కన్నును మిన్నును గానరాకున్నది. ఓనక్షత్రకా! వచ్చుచున్నావా? ఈచీకటి యిప్పుడు మిట్టపల్లముల నేకము చేసినది.

నక్ష—నా దేహము కంపమెత్తుచున్నది.

క. పాములు కదు బుసకొట్టెడు;
నామూలను గాండ్రు గాండ్రు మనియెడుఁ బులుల్;
నామన సగలెడు భయమున
భూమీశా! పట్టుకొమ్ము పొదిగిట నన్నున్.

హరి—ఓమునికుమారా! నీకు వచ్చినభయములేదు. ఇదిగో నేను చేయి చాఁచుచున్నాను. నన్ను వచ్చి పట్టుకొనుము. ఇదిగో నీహస్తము దొరకినది.

లోహి—నాన్నగారూ! ఈచేయినాది.

నక్ష—(తడవుకొనుచు) ఓరాజేంద్రా! నన్ను గిల్లుచున్నా వేమి! నీహస్తము ముళ్లకంపవలె నెంతకఱుకుగా నున్నది!

హరి—నీవు కంపమీఁదఁ జేయి వేసినట్లున్నావు. నాకంఠ స్వరమునుబట్టి కొంచెము కుడివైపునకుఁ దొలఁగి నడువుము.

నక్ష—(ఏడ్చుచు) ఓరాజేంద్రా! నన్నుఁ బాము కఱచినది కాఁబోలును! నా నడిమివ్రేలు చిమచిమలాడుచున్నది. ఏమిబుద్ధి! నాకిక్కడ విషవైద్యులెవ్వరు దొరకుదురు? మందు వేయువా రెవ రున్నారు? ఓయీశ్వరుఁడా! నే నీరాజుమూలమునఁ జూచుచుట్టమును బ్రోక్కుదైవమును లేక మహారణ్యమధ్యమున దిక్కుమాలినపక్షి నయి చచ్చి నక్కలపాలగుచున్నానుగదా! అయ్యో! తుదకు నాకు దహనసంస్కారమయిన లేకపోయెనా?

హరి—ఓమునీంద్రా! నీవు లేనిపోనియూయూస మేల పడియె దవు? పాములు క్రింద నుండును గాని పయి నెక్కడ నుండును? నీకు గ్రుచ్చుకొన్నది. ముల్లు నీపిఱికి తనమును విడిచిపెట్టుము. చా విన్ని సారులు వచ్చునా?

ఉ. భీరుఁడు చావు చావనుచు వేమఱునుర్వి మరణార్తి నొందెడుర్;
　ధీరుఁడొ యొక్కసారియె మృతిం గనునప్పుడు బాధ నొందెడుర్
　ధారుణి దేహధారులకుఁ దప్పక చా వెపుడైన నుండఁగా;
　నూరక చావుకై వగవు నొందఁగ నేటికి మాటి మాటికిన్?

నక్ష—ఓరాజా! బ్రాహ్మణోత్తముఁడ ననియైనఁ జూడక పిఱికివాఁడు చావులేకయే గడియగడియకును మరణవేదన నొందు చుండునని నన్నాక్షేపించుచున్నావుగా? ఈయాక్షేపణ మఱచిపో కుము. నేనే యుత్తమబ్రాహ్మణుకొడుకు నయినపక్షమున నే నెప్పటి కైన నీపగ తీర్చుకొనకపోను. నేను బట్టుకొన్న యీహస్త మెవరిది?

హరి—నాదే నీవిఁక గుండెబెదరు తీఱి యుండుము. ఓలోహి తాస్యా! నీవు మీయమ్మను విడువకున్నావా?

చంద్ర—లోహితాస్యుఁడు నాచంకనున్నాఁడు. మునికుమారుని మీఁకువదలకుఁడు. మనమునిలువవలసినచోటెంతదూరమున నున్నది?

హరి—ఇదిగో సమీపించినారము. ఈచెట్టుక్రిందనే మన మీరాత్రి విశ్రమింపవలెను. ఈయంధకారమునకుఁ దోడు నీలమేఘములు కూడ మనలను జుట్టుకొన్న మాయాంధకారమువలెనే యాకాశమునఁ గాలుక్రమ్ముకొన్నవి.

నక్ష—నాకఱకాలుమొదలు శిరస్సువఱకును వ్యాపించి శీతజ్వరమువచ్చినట్లు కుదుపు వచ్చుచున్నది. మీ మాటలు చాలించి చలిపోవ నాకేవైన బట్టలుకప్పుఁడు.

హరి—ఓప్రాణేశ్వరీ! ఈమునికుమారునిశరీర మొత్తుకొన కుండఁ గొన్నిబట్టలు మెత్తగాఁ బ్రక్కవేసి, కొన్నిబట్టలు మీఁదఁ గప్పి మనమధ్యను బరుండఁబెట్టుము.

చంద్ర—అలాగే చేయుచున్నాను.

(అని చెప్పినట్లు చేయుచున్నది)

నక్ష—(పరుండి నిద్రపోవుచున్నాఁడు)

హరి—ఈతఁ డెంతలో నిద్రపోయినాఁడు! ఆహా! ఏమి ఈతనిగుఱ్ఱు పయియుఱుములతో వియ్య మందుచున్నది!

చంద్ర—వర్ష మారంభ మయినది. ఆకులమీఁద జినుకులు పడుచున్నవి.

హరి—లోహితాస్యునిగూడఁ బరుండబెట్టి పయిని బట్ట కప్పినావా?

చంద్ర—నాచీర చెరఁగు కప్పినాను. ఈ వాన సంతతధారగాఁ బడుచున్నది. ఈయుఱుములును వర్షధారలును జూడఁగా, ఆకాశము మనకష్టములనుజూచి యేడ్చుచు గన్నీరు విడుచుచున్నట్టున్నది.

హరి—ఓప్రాణేశ్వరీ! ఈమఱ్ఱికొమ్మలనుండి దిగజాఱెడి వర్షధారలను జూడుము.

క. మెఱుముల వెలుఁగున నల్లవె
 వఱలెడుఁ గొమ్మలను జాఱువర్షపుధారల్
 మఱిమఱి లావై నిడుపై
 యొరఁ బగుచున్నట్టిమఱ్ఱియూడ లనంగన్. 18

(కొంచెము నే పూరకుండి) నాప్రియురాలికిఁ గూడ నిద్ర పట్టినట్టున్నది. వాన యింకను దిన్నగాఁ బోకపోయినను మూర్ఛాయాసపడియున్న ప్రాణము లగుటచేత వీరి కందఱికి గొడుగువలె నున్న యీవిశాలశాఖక్రిందఁ గునుకుపట్టినది. ఇఁక నే నీ కత్తిని ధరించి వీరికిఁ గావలి కాచెదను. ఈ బ్రాహ్మణునిగుఱ్ఱు చూడఁగా, నాకీ చెట్టుమీఁదఁ బిశాచములున్నను బెదరి దిగిపాఱిపోవునని తోఁచు చున్నది. ఈమఱ్ఱియూడనుండి భల్లూకమో యేదో దిగుచున్న ట్టున్నది. (అని నిలిచి చూచుచున్నాఁడు.)

భూతము—పెద్దకాలమునకు నాకు మనుష్యమాంసము లభించినది. ఈ బాలకు నెత్తుకొనిపోయెదను.

హరి—ఒహోహో! ఇది భూతమువలె నున్నదే! (అని చేరఁ బోయి యొకభూతమును జుట్టు పట్టుకొని యీడ్చుకొను వచ్చు చున్నాఁడు.)

భూత—ఓమహాప్రభూ! నన్నువిడిచిపెట్టుము. నేనీవృక్షము నాశ్రయించియుండు కపాలకుండలుఁ డనుపిశాచరాజు సేవకుఁడను. సంచారార్థము పోయియుండిన మారాజీపాటికి వచ్చుచుండును.

హరి—మేమున్నచోట భూతములుండఁగూడదు. భయార్తుని సంహరించుట ధర్మము కాకపోయినను నీవు మావారిమీఁదికి దిగి వచ్చినందునకయి నిన్నూరక పోనియ్యరాదు. ఈకత్తితో నీముక్కిప్పుడు కోసి మఱి వదలిపెట్టెదను. దిక్కున్న యెడల నీవుపోయి నీనాయకునితోఁ జెప్పుకొమ్ము. (అని ముక్కుకోయుచున్నాఁడు.)

భూత—(పెద్దపెట్టున నేడ్చుచు ముక్కు చేతఁబట్టుకొని పరుగెత్తుచున్నాఁడు.)

హరి—అదియేమి ! ఈచెట్టుకొమ్మలనుండి కోఁతులవలె గుభిల్లునదుమికి భూతములు కాఁబోలును నానాముఖములఁ బరుగెత్తుచున్నవి. అవ్వైపున నాకోలాహలమేమి?

[తెరలో బేతాళుఁడు.]

శా. ఔరౌరా! యొకమానవాధముఁడు మిమ్మత్యంతగర్వంబునన్
దోరింపం గమకించెనే! యితని నార్తు న్నాసికం గోసెఁగా!
వీఁడుం డైనకపాలకుండలుని నన్ విన్నాఁడె! యీశుంఠ దు
ర్వారం బైనమదీయకోపశిఖిలో మ్రుంగు న్నిమేషంబునన్.

హరి—ఇప్పుడు నాచేత ముక్కు చెక్కఁబడినవాఁడు పోయి తనప్రభుఁడైన బేతాళుని గొనివచ్చుచున్నాఁడు. వీరికి నిద్రాభంగము కలుగకుండ నేను వీనిని దూరముగాఁ గొనిపోయి యీశితాసిచే శిరస్సు ఖండించెదను.

[కపాలకుండలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కపా:—

శా. ఓరీ! నీ విటు కండ క్రొవ్వున మదీయోర్వీజముం జేరి శం
కారాహిత్యమునన్ మదీయభటులన్ గారించినా వేమిరా!
ధీరుల్ మెచ్చఁగ ని న్వధించి యిపు డర్థి న్మద్భటశ్రేణికిన్
కూరల్ చేసెద నీదుమాంసచయమున్ గొంతుబ్బ భక్షింపఁగన్

హరి:—

శా. ఓరోరీ! వదరంగఁ బోకు మిట గర్వోక్తు ల్గడుం బ్రేలినన్
క్రూరాసిం గొని యీకరంబున ననే క్రుంతున్ శిరం బియ్యెడన్;
ఘోరాకారత నున్ననీతను విటన్ తునుకల్పడ పోవంగ నా
హారం బౌఁ బదివేలనక్కలకు నత్యంతంబు సంతృప్తిగన్. 21

పంచచామరము. కరంబు గూర్కి యున్న వీరు గాసి చెందకుండఁగా
బిరాన దవ్వు గాఁగఁ బొమ్ము ప్రేల కింక నిచ్చటన్,
దరంబు మాలి నిల్చితేని దవ్వు గొంచుఁ బోయి నీ
శిరంబు ద్రుంచువాఁడ గత్తిచేత నొక్క వ్రేటునన్. 22

కపా:—

ఉ. ఏమిర! కండకావరము? హీనమనుష్యుఁడ నన్నుఁ ద్రుంచుఁగా?
యీమహి నేఁడు నేనుభుజియింపఁగఁగంటి మనుష్యమాంసమున్
సోమరి యామ వటయిలు చొచ్చెను గుండెలు; తప్పిపోవునే?
చీమల భల్లుకంబువలెఁ జెంగున మ్రింగెద మిమ్ము నందఱన్.

(అని మీఁదికి వచ్చుచున్నాఁడు.)

హరి—(వారిని జుట్టు పట్టుకొని పిశికిలియెత్తి)

మ. ఇదిగోఁ జూడుము వజ్రపాతనిభమౌ యీముష్టిఘాతంబునన్
బదియార్వక్క లగున్ శిరం బిచటఁ గాల్వాగట్టఁ గ్రొన్నెత్తురుల్
ముదముం జేసెద నింక నీవటమహాభూజంబుక్రింద న్నిశల్
నిదురం జెందెడు పాంథలోకమునకు న్నేఁడాదిగా దుర్మతీ? 24

(అని యీడ్చుకొని పోవుచున్నాఁడు.)

[తెరలో]

కపా-ఉ. భూతములారా! రండు; పెనుభూత మొకండిదె నన్నుఁ బట్టి ని
ర్ఘాతసమానముష్టిహతి వ్రచ్చె శిరంబు; కరంబు ముక్కునన్
వాతను నెత్తురుల్ వఱదవాఱెను; మీప్రభు నన్నుఁగావరే;
భీతి వడంకెడున్ దనువు; పెల్లుగఁ బ్రాణము తల్లడిల్లెడున్ 24

నక్ష—(ఉలికిపడి లేచి) అయ్యో! పిడుగువంటిశబ్దమేదో నా
చెవులఁబడి గుండెలు పగులుచున్నవి. నా దేహము కంపమెత్తుచున్నది; ఈవెలుతు రెక్కడిది? వీరందఱు దేహము తెలియఁగక పడి నిద్రపోవుచున్నారు. హరిశ్చంద్రుఁడు మమ్మువిడిచి పారిపోయినట్లున్నాఁడు.

ఎవ్వఁడో యీయూడలనుండిదిగి పాఱిపోవుచున్నాఁడు. ఓచంద్రమతీ! ఓలోహితాస్యా! లెండు లెండు. మన మీయర్ధరాత్రి నిద్రిపోయి మోసపోయినాము.

చంద్ర—(లేచి కన్నులు నలువుకొనుచు) ఓబ్రాహ్మణోత్తమా! చెడుకలఁగని పలవరించుచున్నావా యేమి? మేము నీచెంతనే యున్నాము. భయపడకు నీకు నిద్రలోను భయమే.

నక్ష—నన్నొంటివానిని జేసి మీరందఱు నిద్రిపోవుచున్నారు. ఏదోభూతము చెట్టుమీఁదినుండి దిగి నామీఁదనుండి పఱుగెత్తినది. నేనెట్లు భయపడకుండఁగలను? నాభయమే నన్ను రక్షించుచున్నది.

చంద్ర—భూతమును లేదు పిశాచమును లేదు. మరల ముసుఁగుపెట్టుకొని మాటాడక పరుండుము. నీ కేదో పీడకలవచ్చినది.

నక్ష—కలకాదు. నేనీకన్నులతోఁ బ్రత్యక్షముగాఁ జూచినాను. ఈమఱ్ఱియూడనుండి దిగి పఱుగెత్తినది.

చంద్ర—(తేఱిపాఱఁజూచి) అమ్మో! నాప్రాణనాథుఁడెక్కడనున్నాఁడు?

హరి—(ప్రవేశించుచు)

మహాస్రగ్ధర.

అలఘూద్యత్ఖడ్గధారా హతఘనగళుఁడై యద్రిరాజంబనంగా
నిలఁగూలె న్వైరి పీఱుండిటు రుధిరచయంబేరులై నేలఁబాఱన్;
గలఁకం దద్భ్రాత్యులెల్లన్ గడురయమున శాఖామృగవ్రాతరీతిన్
బలశాఖల్దాఁకి భీతిన్ బఱచెద రదె దిగ్భ్రాంతి నల్దిక్కులందున్.26

చంద్ర—ఈబ్రాహ్మణునికల యూరకపోలేదు. మాకపాయము చేయవచ్చిన దురాత్మునెవ్వనినో సంహరించి భర్త వచ్చుచున్నాఁడు. నే నెదురుగాఁ బోయెదను. (రెండడుగులు నడిచి) ఓప్రాణేశ్వరా!

హరి—హృదయేశ్వరీ! తొందరపడఁబోకుము. చిమ్మచీఁకటిలో మీరు శరీరములు మఱచి నిద్రపోవుచున్నప్పుడు మీ కపాయము చేయ వచ్చిన యామట్టిచెట్టుమీఁది భూతాదులను దఱిమిపాఱదోలి, భూతనాయకుఁడగు బేతాళుని నేనిప్పుడే భూమికి బలిచేసివచ్చినాను.

నతు—భూతముల పేరు చెప్పిన నా మేను వడఁకుచున్నది. ఇఁక నొకయర్ధనిమిషమయినను నేనీదయ్యములమట్టిక్రింద నుండను. నన్నా వెలుతురు కనఁబడుచున్నదిక్కునకుఁ దీసికొనిపొండు.

హరి—అర్ధరాత్రమప్పుడీయీఁదుగాలిలో దారిలేని మహారణ్యమధ్యమున మనమిప్పుడెక్కడికిఁ బోఁగలము? అగనఁబడునది దవానలమేమో! అది గార్చిచ్చైనపక్షమున స్త్రీలతోను శిశువుల తోను గటికిచీఁకటిలో బహుగత్తలేక త్రొక్కులాడి, ముల్లుతీసి కొట్టడచుకొన్నట్లు మఱింతశ్రమపడవలసివచ్చును. నీవేలాగునసైన మా ప్రార్ధన విని మానిమిత్తమయి కొంచెము ప్రయాసపడి నేఁడు తెల్ల వాఱినదాఁక నీ చెట్టుక్రింద శయనింపుము.

నతు—నీవిఁక లక్ష చెప్పినను నేను వినను. ఏభూతమయి నను నన్ను నోటవేసికొని పోయినపక్షమున, నప్పు తీర్పుమని యడుగువారు లేక సుఖపడవచ్చునని మీరనుకొన్నారు. నాముందఱ యీయాటలు సాగిరావు. ఇప్పుడామంటయొద్దకుఁబోయి చలికాచుకొని పొలములోనిపర్ణశాలలో నేనీ రాత్రి పరున్నఁగాని బ్రదుకను. మీరు రానిపక్షమున నురిపెట్టుకొని యిప్పుడిక్కడఁ బ్రాణములు విడిచెదను.

చంద్ర—ఓభూసురోత్తమా! ఆమంట కార్చిచ్చేమో!

నతు—అది కార్చిచ్చుకాదు. పొలములోఁ గాపులుచలి నిమిత్తము వేసికొన్నమంట.

హరి—అట్లయినఁ బోదము రండు.

అందఱు—(కొంచెము నడుచుచున్నారు)

నక్ష—ఇదియేమి? మన వెనుకవంకఁగూడ మంట కనఁబడు చున్నది.

చంద్ర—ఒక్క వెనుకదిక్కున నే కాదు. మనకుడియెడమ గూడ దూరమున మంటలు లేచుచున్నవి.

నక్ష—(నలుదిక్కులుచూచి) మీరు కార్చిచ్చు కార్చిచ్చని మొదటనే వాక్యముపెట్టినారు. మీదెట్టిపాపపునోరో కాని మీమాటే నిజమయినది. మీమూలమున బీదబ్రాహ్మణుఁడ నయిన నేనిప్పు డగ్నిహోత్రున కాహార మగుచున్నాను. ఓవైశ్వానరా! బ్రాహ్మణ హత్య మహాపాతకముసుమా! నీవీపేద బ్రాహ్మణునిజోలికి మాత్రము రాకుము. అయ్యో! ఏమిచేయుదును? మంట లాకాశమంటుచున్నవి.

హరి—ఓహో! అగ్నిహోత్ర మెంతలో వ్యాపించుచున్నది!

గీ. దుష్టులిద్దఱు తమలోన దొమ్ములాడి
సాధుజనులకు మహిఁ గీడు సలుపునట్లు
యెండుద్రోడులు రాచుకొం చిట్లు వహ్నిఁ
గలుగఁజేసి వనంబెల్ల! గాల్చుఁదొడగె.

చంద్ర—ఓప్రాణేశ్వరా! మంట లన్నిప్రక్కలనుండియు వచ్చి చుట్టుకొనుచున్నవి. మన మీ దవాగ్నినుండి తప్పించుకొనుమార్గము కానరాకున్నది. మీరొంటిగానున్న యెడల నెట్లయినను దప్పించు కొని యుందురు. నానిమిత్తమున మీరును భాగ్యహీనులగుచున్నారు ధనబంధము వీడినట్లే కాలిసంకిలివలె నున్నభార్యాబంధముకూడ వీడియుండినపక్షమున మీకీచిక్కు లేకపోవునుగదా?

హరి—ఓప్రియురాలా! అట్లనఁ బోకుము. నీవు నన్ను విడుః కుండఁబట్టియే నేనిప్పుడు మహాగ్నిమధ్యమున నుండియు సంతాపము పొందకున్నాను. నేను భాగ్యహీనుఁడనుగాను; ధనహీనుఁడనుగాను

మహాపదలు వచ్చినప్పుడును విడువని బహిఃప్రాణముగు భార్య చెంత నుండఁగా లోకములో నాకంటెను భాగ్యసంపన్నుఁ డెవఁడు? నీస్నేహ ధనమే కాక నీతిధనముకూడఁ గావలసినంత యున్నప్పుడు. నే నేల ధనసంపన్నుఁడను గాకపోదును? అందఱిలోను నే నే ధన్యతముఁడను.

నక్ష—కావలసినవా రందఱు నొక్కచోట నుండుటచేత మీ రందఱు ధన్యతములే. ఎవ్వరును లేక యొంటిగాఁడ నైన నే నొక్కఁడనే యిందు మందభాగ్యుఁడను. మాతండ్రియైనను బ్రతికి యున్నపక్షమున మరణకాలమునందు నందనుని విడిచిపెట్టక కొంచె మోదార్చునుగదా? ఓదైవమా! నన్నిట్లేకాకిని జేసితివా?

హరి—ఓమునికుమారా! దుఃఖపడకుము. మాప్రాణములు పోయినతరువాతగాని నీకుఁ బ్రాణాపాయము రాదు. మేమీ చిచ్చులో నుఱికి నీపుమీఁద మోదుకొనిపోయి యయినను, నీప్రాణ రక్షణముఁ జేసెదము. అక్కటా! అగ్ని యంతకంతకు సమీపించు చున్నది! ఈప్రాణరక్షణ మెట్లు సంభవించును?

చ. చిటచిటవిస్ఫులింగములు చెంతల నెంతయు వింత మీఱఁగాఁ,
పెటపెట గాదము ల్వొదలఁ బెక్కులు పంకువెదుళ్లు వ్రీలఁగాఁ,
పుటపుట ధూమసంచయము భూమియు నింగియు నావరింపగాఁ,
గటగట! యన్నిప్రక్కలను గ్రమ్మెను మమ్ము దవాగ్ని యియ్యెడన్.

చంద్ర—ఓప్రాణేశ్వరా! ఇప్పుడు మన మీ మునికుమారుని ప్రాణరక్షణము చేయకపోయినయెడల మన కపకీర్తి వచ్చును. ధన మియ్యవలసివచ్చునని మన మీతని ప్రాణముల కెగ్గు చేసితిమని లోకము తలంచినను దలఁచును. ఋషీశ్వరునిఋణము తీర్చి ధర్మము నిలుపుకొనుటకయి మీరును సర్వవిధముల నాత్మరక్షణము చేసికొన వలయును. మనుష్యుఁడు ప్రపంచమునకువచ్చునప్పుడు దానొంటిగా నే వచ్చును. ప్రపంచమునుండి పోవునప్పుడును దానొంటిగానే పోవును.

ధర్మ మొక్కటిమాత్రమే మరణానంతరమునను వెంటవచ్చును. కాఁబట్టి మీరు దారాదిబంధమును గోసివేసి ధర్మ రక్షణోపాయమున కనుజ్ఞ యియ్యవలెను.

హరి—ఓ ప్రాణనాయికా! నా కేమియు సహాయము తప్పించుకొనుట కుపాయము తోఁచకున్నది.

చంద్ర—నాకొక్క చక్కని యుపాయము తోఁచుచున్నది. మీ రందున కొడఁబడవలెను. ఈప్రక్క నొక్కనిలివెడుమేర మాత్రమే నిప్పుమండుచు, దీని కావలదారి కనఁబడుచున్నది. నే నడ్డముగాఁ బడుండి యగ్నిహోత్రుని కాహారము నయ్యెదను; మీరీ యిరువురును దీసికొని నామీఁదనుండి నడిచి మార్గమునఁబడి ప్రాణరక్షణము చేసికొనుఁడు. ఇన్ని ప్రాణము లొక్కసారిగాఁబోవుటకంటె నొక్క ప్రాణము పోవుట శ్రేయస్కరముకదా!

హరి—హరహరా! ఎంతపాపపుమాట యిప్పుడీచెవులఁబడినది! ఈ మాటలు నా చెవులయందు సూదులకంటెను దీక్ష్ణముగా నాటి మనస్సుకలంచి యింద్రియముల నవశము చేయుచున్నవి. ఇట్టి దారుణవాగ్విషబాణము నాటియు నా ప్రాణములుపోకున్నవి. (అని మూర్ఛపోవుచున్నాడు.)

చంద్ర—ఓ బ్రాహ్మణోత్తమా! మూర్ఛతేఱనతరువాత నా ప్రాణవల్లభుఁడు నా చావున కంగీకరింపఁడు. ఇఁక జాగుచేయుట కవకాశములేదు. నేనీ యగ్నిహోత్రున కడ్డముగాఁ బడెదను. నీవు నాప్రాణవల్లభునిఁ బుత్రునిఁ గొని నా మీఁదనుండి నడిచి మీప్రాణములను రక్షించుకొనుఁడు. (అని అగ్నికెదురుగా నడుచుచున్నది.)

లోహి—అమ్మా! నేనుగూడ నీతోనే వచ్చెదను. నన్నుఁ దీసికొనిపొమ్ము.

చంద్ర—నాయనా! నేనిప్పు డీ యగ్నినాశ్చి నిన్నావలకుఁ దీసికొనిపోవుటఁకయి ప్రోవ చేసెదను. నీవు నాన్నగారివద్దకుఁబొమ్ము. (నాసికన్నీరు నింపుచున్నది.)

నకు—గోహిం శాస్త్యా! మీతల్లినివిడిచి నీవిటురా.

చంద్ర—నాకుఁ దల్లిదండ్రులు చెప్పించినవిద్య సార్థకమగున ట్లాశుకవిత్వముగా దండక మొకటి చెప్పి యిప్పు డిప్పావకుని మెప్పించెదను. (అని యగ్నిహోత్రుని కభిముఖురాలయి నమస్కరించి చేతులు జోడించి దండకము చదువుచున్నది.)

దండకము—శ్రీమన్మహా వాయుమిత్రా! పవిత్రా! లసద్దీపహోత్రా! జగత్ఖ్యాతచారిత్ర! నేనీమహత్త్వంబు వర్ణింపఁగా నెంతదానన్? కృపాదృష్టివీక్షించి రక్షింపుమోహవ్యవాహా! చలజ్జ్వాలికాజాలజాజ్వల్యమానోన్నతజ్యోజసందోహ! లోకంబులెల్లన్ భవన్నిస్తుల ప్రేమచేఁ గాదె సంపూర్ణసౌఖ్యంబులంబొందు? నీవెల్లచో స్వస్వరూపంబులం దెల్లగూఢంబుగా నుందు వత్యంతమున్; మానవుల్ తాము రుచ్యంబు లౌ భక్ష్యముల్ శాకపాకాదులన్ జిహ్వకుం దృప్తిగాఁ జేసికొంచున్ సుఖం బొందఁగాఁ గల్గుటల్ నీప్రసాదంబు గాదె? శీతంబుచే బాధ పొందంగ నీ వెంతయున్ బీదలన్ సాదరన్ బ్రోవవే? రాత్రులం జీఁకటుల్ క్రమ్మి సర్వేశ్వరుండిచ్చియున్నట్టి నేత్రంబులన్ వ్యర్థముల్ చేయదీపాళిరూపంబు నన్నేత్రసాఫల్యముం జేసి కారుణ్యముంజూపవే వ్యాధివర్గంబుఁ బుట్టించు నానావిధాశుద్ధవస్తుప్రపంచంబు భక్షించి లోకాళి కారోగ్యముం గూర్పవే? చాలఁగా నిన్ను నేస్తోత్రముల్ చేయఁగాఁ జాల; నేనీధరిత్రిన్మహాసాధ్వ నౌ దేని, నాభర్త సత్యవ్రతుండేని, యోపావకా! వేగనా ముద్దుగూలించి పాలింపుమా యిమ్మహీదేవపుత్రున్

పవిత్రుఁడ, ధరిత్రీకళత్రుఁడ, మదీయైకపుత్రుఁడ; నమస్కారముల్ నీకు వేవేలు కావింతు; దేవా! నమస్తే నమస్తే నమస్తే నమః

నక్ష—ఓహో ! ఈమెమహిమచేత దవాగ్ని యెంతలో మరలి పోయినది! ఓమహారాజా! మనము బ్రతికినారము. కన్నులు విప్పి చూడుము.

హరి—(కన్నులువిచ్చి) అయ్యో! నావ్యధ యధికము చేయుట కయి నన్నిప్పుడెవ్వరు మూర్ఛ తేర్చినారు ? ఈమూర్ఛమూలము నయినను నిమిషకాలము దుఃఖమును మఱచి యుండఁగా నింతలోనే యిట్టిపాపమును గట్టుకొఁజెల్లునా ? హా ! ప్రాణనాయికా! నేనింక నెట్లుజీవనములు నిలుపుదు నే?

చంద్ర—ఓహృదయేశ్వరా! ఈశ్వరానుగ్రహముచేత నేను సుఖముగా నేయున్నాను. నానిమిత్తమయి మీరు చింతపొందఁ బోకుఁడు. (అని చేరవచ్చి కౌగిలించుకొని లేవఁదీయుచున్నది.)

హరి—చల్లని నీహస్తస్పర్శమువల్ల నాయుల్లమిప్పుడు చల్ల పడినది. నీవుబ్రతికి నన్ను బ్రతికించినావు.

నక్ష—ఓమహారాజా! నిన్నొక్కనినే కాదు. మమ్మందఱిని గూడ నిప్పుడీపతివ్రతాతిలకమే బ్రతికించినది.

చంద్ర—ఇప్పుడు మాటల కెడము లేదు. ఈకార్చిచ్చింకను మనదిక్కున నుండుచునేయున్నది. ఈవంకను మనకుఁ ద్రోవ యిచ్చి నది గనుక, మన మీచోటుదాటి దారిలోఁబడి యావల సావ కాశముగా మాటలాడుకొందము రండు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

# చతుర్థాంకము

రంగము—కాశీకాపురవీధి.

[హరిశ్చంద్రుఁడును, చంద్రమతియు, లోహితాస్యుఁడును;
నక్షత్రకుఁడును, ప్రవేశించుచున్నారు.]

చంద్ర—ఓప్రాణనాథా! ఈదివ్యక్షేత్రమునకు వచ్చి యిరువదిదినములయినను, మనమింకను గాశీకాపురమునందలి దివ్యస్థలములనేకములు సేవింపనేలేదు. అవిముక్తక్షేత్రమున జూడలేదు; కేశవస్వామిని దర్శింపలేదు; జ్ఞానవాపిని కనలేదు; కేదారశంభులింగదర్శనము చేయలేదు; ఢుండివిఘ్నేశ్వరుని బొడగనలేదు; వరుణానదియందు స్నానము చేయలేదు. వచ్చినతరువాత నాలుగయిదుదినములు మార్గాయాసముచేత నిల్లుకదలలేకపోయినాము. నక్షత్రకుని యుపచారములమూలమునఁ గొన్నిదినములు తీఱలేదు.

హరి—ఓహృదయేశ్వరీ! మనమిప్పుడ విముక్తక్షేత్రమునకుఁ బోవుచున్నాము. ఉన్నదివ్యస్థలముల నన్నిటిని నేటరేపటఁ బోయి సేవింతము.

క. హరుఁడిటఁ దారకమంత్రము
మరణించుచు నున్నజంతు మండలిచెవులన్
బరువడి నుపదేశించును
కరుణమెయి న్నిత్యముక్తిగలిగించుటకున్. 1

ఉ. ఓలినిసప్తవాయువులు నొక్కట వీవఁగ ద్వాదశార్కులా
భీలత నెండకాయఁగను, భీకరపుష్కల ముఖ్యమేఘముల్
చాలఁగ వర్షముల్ కురియ, సప్తసముద్రము లొక్కపెట్టునన్
వేలనుమించిరాఁ, బ్రళయవేళను గాశినశింపఁ దింతయున్. 2

చంద్ర—నిస్సంశయముగా మన మీ కాశికాపురసందర్శనముచేతనే ధన్యులమైతిమి. ఇప్పుడు మేఘగర్జనమువలె నా చెవుల కేదో మ్రోత వినవచ్చుచున్నది. అది యేమయి యుండును?

హరి—అది గంగాప్రవాహఘోషము ఆవంకఁ జూడుము.

ఉ. అల్లతరంగడోలికల హంసము లూఁగెడు మెల్లమెల్లఁగాఁ;
దెల్లనినీరు కూఁకవిహారికిఁ బెనుమత్స్యము లుల్లులే సెదురన్;
జల్లనిగాలి వీచెను సౌరభముల్ వెదచల్లు చల్లనన్;
నల్లలితప్రశస్తినదె జాహ్నవి పొల్చెడు నేత్రపర్వమై. 3

ఓప్రియురాలా! నా చేయిచాయఁ దిన్నఁగాఁ జూడుము.

ఉ. మేటిమిసైడి ఘూర్ణిలను మోసులుగుల్కెడు చిత్రజంతులన్
జాలఁగ నోపి ముద్దులము చక్కగ నేర్పుగ నుండు గూర్పులై
చాలుగఁ బ్రాపురంబు లవిసందడి చేయఁగ విశ్వనాథు దే
వాలయమాదెసన్ దవుల నల్లదె చూడిటు కి వేడ్కఁ గొల్పెడున్.
(చూపుచున్నాఁడు.)

నక్ష—ఓరాజా! మీరు కృతార్థులయినారు.

క. వినుమీ కాశీపురమున
నొనరంగా నైదుదినము లుండినఁ జాలున్
జనుఁడఘము లెల్లఁ బోనిడి
యనఘంబగు ముక్తినొందు నందురు పెద్దల్. 5

చ. ఇరువదినాళ్లు నేఁటికిఁ గీపురి నీవు వసించియుంట నీ
కరగతమయ్యె ముక్తి; యటుగావున నీవిఁకలక్ష బొంకినన్
బరము నిహంబునుం జెడవు; సత్యము కాసయినన్ లభింపదీ
పురమున నీకు; నప్పెఱుఁగ బొమ్మని బొంకుము నేను బోయెదన్. 6

హరి—ఓబ్రాహ్మణోత్తమా!

చ. తలఁపఁగ బోకు మీశ్వరుఁడు తానొకచోటనె యుండునంచు, నీ
స్థలమె పవిత్రమై జనులఁ దద్దయు శుద్ధులఁ జేయునంచు; నె
ల్లెడలను నిండియుండఁ బరమేశుఁడు; వానికి విశ్వమంతయున్
నిలువఁగ నాలయంబె యగు; నిక్కమె యాతని యాజ్ఞ యెల్లెడన్. 7

క. సత్యముపలుకని మనుజుఁడు
నిత్యంబుగఁ గాశి నున్న నిజముగ నఘరా
హిత్యముఁ బొందఁడు; దేశిసి యు
సత్యముపలుకనె యల్పసౌఖ్యము కొఱకై? 8

కొంచెంసేపు ఈ భూమిని నే దైవబలమున సామ్రాజ్య మనుభవించుకోపల నీధన మిచ్చి ఋణవిముక్తుఁడనయ్యెదను.

నక్ష.—ఓహోహో! మాటలు వాలుబుగా నున్నవి.

సీ. విశ్వేశ్వరుని బోయి వీక్షింతు నీవేళ
నుండు నేఁటికి గంటి వాక్కనాఁడు
మణికర్ణికను గ్రుంకి ప్రణుతింతు నీవేళ
నుండు నేఁటికి గంటి వాక్కనాఁడు
తల్లి భాగీరథి దర్శింతు నీవేళ
నుండు నేఁటికి గంటి వాక్కనాఁడు
చేరి విశాలాక్షి సేవింతు నీవేళ
నుండు నేఁటికి గంటి వాక్కనాఁడు

గీ. కాలభైరవు నీవేళఁ గాంచఁ జనుదు
నుండు నేఁటికి గంటి వీవాక్కనాఁడు
నేఁడు నేఁడని సామ్రాజ్యనీవు గడప
నెంత కాలంబు తాళుదు నింక నేను? 9

ఉ. రాజ్యసుఖంబుల న్మరగి రాజసవృత్తిని నున్ననీకు వా
ణిజ్యము చేతఁ గా దలవణిక్కులరీతిని; బ్రాహ్మణాకృతిన్

బూజ్యత భిక్షమెత్తి ధనముం గడియింపఁగలే! విఁకెట్టులీ
రాజ్యములోనఁ దేఁగలవు ద్రవ్యము మాఋణ మెల్లదీర్పఁగన్? 10
చ. గడవుదినంబు నేఁడె; యిఁక కాసయినం జెయిచేర్పలేవు; నీ
యెడ మొకమోటముం గదిరి యీనిట నూరక యున్నమద్గురుం
డుడుగని కిన్కతోడ ననునొక్కట ద్రుంచును; నిన్ను నింక నే
నడుగటు పెట్టనీను? ధనమంతయు నిక్కడఁ గ్రక్కఁగావలెన్. 11

(అని త్రోవకడ్డమువచ్చి మొలలో చేయి వేసి నిలుపుచున్నాఁడు.)

హరి—మహాత్మా! నీవు చెప్పినట్లు బ్రాహ్మణ వృత్తి చేతను వైశ్యవృత్తి చేతను ధనమార్జించుట నాచేతఁగాదు. నారాజ్యము సర్వమును మీగురువుగారికి ధారపోసి రాజవృత్తి నీవలనే విడిచి యున్నాను. ధనార్జనమునకిఁక నాకొక్క సేవకవృత్తి మాత్రమే కనఁబడుచున్నది. పట్టువిడిచి నాలుగడుగులు సాగనిమ్ము. ఏమహాను భావుని యొద్దనైనను గొలువు కుదిరి నీఋణము తీర్చివేసెదను.

నక్ష—నేనట్లుపోనియ్యను. నెలదినములనుండి నిన్ను మంచి మాటలతో నడుగుచుండినఁ గార్యము లేకపోయినది. నిష్ఠురవృత్తి చూపి నిన్నాయాస పెట్టినంగాని నీవు ధనమియ్యవు. నెలదినముల నుండి నీమూలమున నా స్నానసంధ్యాద్యనుష్ఠానము మంటఁగలిసి పోయినవి. ఇంతకాల మోపిక పట్టినను నేను నీ కేమయ్యిన మంచి వాఁడనయితినా? ఆవలమాగురువుగారి యాగ్రహమునకుఁ గూడ నే నేల పాత్రుఁడను గావలెను? ధన మిప్పుడు నా ముందు పెట్టి మఱిమాటలాడుము.

హరి—ఓమహాత్మా! నన్నేల నిర్హేతుకముగా నడివీధిలో సిగ్గుపఱిచెదవు? ధనసంపాదనమునిమిత్తము నేను పడుచున్నపాట్లను నీవు కన్నులారఁ జూచుచునేయున్నావుగదా! ధన మెవ్వరినైనను వేఁడుట కయినను ముందు సాగనిమ్ము.

నక్ష—కార్యములు కావలెను గాని నీ తియ్యమాటలు నాక క్కఱలేదు. ముందుగా నీయొద్దనున్న సొత్తును విక్రయించి కూడి నంత ధనము నాచేతఁబెట్టి మిగిలినదాని నిమిత్తమయి యేసేవక వృత్తియందో ప్రవేశింపుము.

హరి—ఓనటువర్యా! కట్టుబట్టలతో లేచి వచ్చినమావద్ద నీ వెఱుఁగని సొత్తేమున్నది?

నక్ష—నీభార్యాపుత్రులు నీసొత్తుకారా? వారిని విక్రయించి వచ్చినసొమ్ము నాచేతిలోఁ బోయుము.

హరి—హరహరా! ఎంతపాపపుమాట వినుచున్నాను!

(అని తలవంచుకొని దీనత్వముతోఁ గ్రిందు చూచుచున్నాఁడు)

చంద్ర—ఓ ప్రాణేశ్వరా! మీరీప్రకారముగాఁ జింతాక్రాం తులయి ధైర్యమును విడుచుచున్నారేమి? ఈ మునికుమారుఁడు చెప్పినయుపాయము చక్కఁగా నున్నది. ధర్మము చెడిపోవునప్పుడే భర్తకు సాయపడదేని, ఆ భార్యయెందుకు? మనఃపూర్తిగా నేనే మిమ్ము వేఁడుచున్నాను గనుక మీకు భార్యావిక్రయపాతక మణు మాత్రమునురాదు. మీరాలస్యము చేయక నన్ను దాసినిగా విక్ర యించి వచ్చినధనముతో మీ ఋణముతీర్చి మిమ్ముబొంకింపఁ గంక ణము కట్టుకొన్న విశ్వామిత్రుని ప్రతిజ్ఞ బొంకు చేయుఁడు.

హరి—ఓ హృదయేశ్వరీ! నీమాటలు నా హృదయమునకు బాణములకంటెను దీక్ష్ణముగా నాటుకొనుచున్నవి. ఈ దుస్సహ పరుషవాక్యాగ్ని శిఖలను నామనస్సునందుఁ జొనిపి యేల బాధ పెట్టెదవు?

క. ఒక్కట నీవాగ్వహ్నియుఁ
జిక్కక చిత్తముఁదపింపఁ జేసెడునింతే
గ్రక్కున దహింపఁ జేయుఁగ
నక్కటకట చేతఁగాని దయ్యెను నిదియున్.

క. ఇలలో నెందయినను దన
కులకాంతను విక్రయించుకూళయుఁ గలఁడే!
పలుకను దలఁపను గూడని
కొలమేటికిఁ గట్టెదీవు కొమ్మరొ నాకున్?

(అని కన్నీరు విడుచుచున్నాఁడు.)

చంద్ర—ఓ ప్రాణనాథా! దుఃఖింపఁబోకుము. విధియిప్పుడు మనకిద్దఱకును వియోగము కలుగవలయునని విధించినాఁడు. ప్రతిబంధము చెప్పక దేవర నాప్రార్థన మంగీకరింపవలయును. భార్యారక్షణముధర్మరక్షణమునకంటె నధికమయినది కాదు. మరణానంతరము ధర్మమొక్కటియె సఖునివలె వెంటవచ్చి సుఖపెట్టునుగాని బ్రతికినన్నాళ్లును దెమ్మని తినితిని యనుభవించెడి యీ భార్యలును బంధువులును దా మొక్కరును వెంటరారు. మృత్యువెప్పుడు వచ్చునో మనతోఁ జెప్పిరాదు. కాఁబట్టి భార్యపోయినను బిడ్డలుపోయినను లోకములోనిదిమఱియేదిపోయినను బుద్ధిమంతుఁడు ధర్మముతప్పక శాశ్వతానందము కలుగుమార్గమును జూచుకొనవలెను. కాఁబట్టి మీరు ధర్మరక్షణార్థమయి నన్నుఁ ద్యజింపవలయును.

హరి—ఓ ప్రాణేశ్వరీ! అప్పుతీర్పలేని దుఃఖాగ్నిచేత నే తాప మొందుచున్న నాడెందమును నీదుస్సహవాక్యాగ్నిచేత మఱింతతపింపఁ జేయకుము. సత్యవర్జనమెంత ధర్మవిరుద్ధమో ధర్మపత్నీ విక్రయమును బురుషున కంత ధర్మవిరుద్ధమే. ధర్మబాహ్యమయిన నీ ప్రార్థనకు నే నెట్లొడంబడనేర్తును?

చంద్ర—ఓ ప్రాణేశ్వరా! మీరుచింతమాని నామనవిసాంతముగాఁ జిత్తగింపుఁడు. ఆపత్కాలమునందు దనదేహము నయిన విడిచి భర్తనుద్ధరించుట కులసతికి ధర్మము. అంతేకాక వివాహవిధిచేత భార్య భర్తసొత్తనుట లోకప్రసిద్ధముగదా! ఆపన్నివారణము

నకయి. యట్టిపాత్రునన్యులకు విక్రయించుటచేఁ బాపమేమున్నది? అదిగాక నేను మనఃపూర్వకముగా నన్యులకు దాసినయి మిమ్ము ఋణవిముక్తులను జేయుటకయి యొప్పుకొనుచున్నాను. మీరు సంకోచింపక ప్రేమానుబంధము కోసివేసి నన్ను దాసినిగా నమ్మివేసి యీ ఋణబాధను దప్పించుకొని శక్తియున్నప్పుడు నన్ను మరలమీ ధనముగాఁ జేసికొనుఁడు. మీరంగీకరింపకపోయినను నాకు దాస్యము తప్పదు. పూర్వము దుర్వాసుఁడొకసారి నన్ను మూడుమాసములు దాసినిగా నుండ శపించినాఁడు.

హరి—అయ్యో! మానులెప్పుడును దయావిహీనులుగదా! నీవేమియపరాధము చేసితివని నీకతఁడట్టి ఘోరశాపమిచ్చెను?

చంద్ర—నా చిన్నతనములో నే నొకనాఁడు వాకిటనిలుచుండఁగా నొకకిరాతుఁడొక చిలుకపిల్ల నాదారిని గొనిపోవుచు నా కమ్మఁ జూపెను. ఆకీరపోతము మిక్కిలి మనోహరముగా నున్నందున నేను దానిని ముచ్చటపడి కొని ప్రతిదినమును పండ్లును బంచదారయుఁ బెట్టి పద్యములు చెప్పుచుఁ బ్రాణతుల్యముగాఁ బెంచుకొనుచుంటిని. ఇట్లు మూడుమాసములు చెల్లిన తరువాత నొకనాఁడాకస్మికముగా దుర్వాసుఁడు మాతండ్రిని జూడవచ్చి నాచేతనున్న చిలుకను జూచి యిదియెక్కడదని యడిగెను.

హరి—ఋషు లెక్కడకుఁ బోయినను జోలిమాలినప్రశ్న లడుగుదురు. అటుతరువాత—

చంద్ర—ఒకనాఁ డొకకిరాతుఁ డీచిలుకను మాయింటి మార్గమునఁ గొనిపోవుచుండఁగా నాపుత్రికయైన యీచిన్నది మక్కువపడి కొని వినోదార్థముగాఁ బెంచుకొనుచున్నదని చెప్పఁగానే యతఁడు మండిపడి—అతనిరూపము తలఁచుకొన్న నాకిప్పుడు భయమగుచున్నది. (అని భయము నభినయించుచున్నది.)

హరి — ఓహో! ఈమూర్ఖముని కోపముచేత విశ్వామిత్రుని కూడ మించిపోయినాఁడే! ఇంతమాత్రము కోపమాపుకోలేని యాతనితపమెందుకు? అడవులలోనుండియు నాగ్రహగుణము విడువ లేని తపస్సులకంటె శాంతులయి యింట నుండు గృహస్థులే యుత్తములు.

ఉ. కానలనుంట నిష్ఫలముగాఁ జను నింద్రియనిగ్రహంబు లే
దేని; మనుష్యుఁ డింట వసియించియు నింద్రియనిగ్రహంబొగిన్
దా నొనరించు నేని, సతతంబును సత్ఫలమొందు; శాంతుఁడౌ
మానవుఁ డెందు నున్న వినుమా యదె యాశ్రమరాజమౌఁజుమీ.

అటుపయి నేమిజరిగినది ?

చంద్ర — (గద్గదస్వరముతో) అతఁడు మండిపడి. కటము లదర, ముకుపుటములు చెదర నావంకఁ గన్నులనిప్పులొలుకఁజూచుచు మాయాశ్రమవృక్షమునుండి కిరాతుఁ డపహరించి తెచ్చిన శుక పోతమును బంజరబంధము కావించి బాధించితివి గావున నీవును దాసివై సేవాబంధ మనుభవింపుమని ఘోరశాపమిచ్చి చిఱాలున లేచెను.

హరి — ఏమి యీ శాపనిమిత్తము! ఎఱుఁగక చిలుకను గొన్నదిది మహాపరాధ మని యెంచి నిర్దోషురాలి నూరక శపించుట దోషముగా నెంచకున్నాఁడు!

క. తెలియఁగఁజాలఁడు మనుజుఁడు
తలఁపఁగ గిరులంతలైనఁ దనదోషములన్;
తిలకించుఁ బరులతప్పుల
నలుకఁగ సన్నావగింజ లంతటివానిన్. 15

ఓహృదయేశ్వరీ! నీశాపమున కా మునీశ్వరుఁడు మూసత్ర యావధి పెట్టనే లేదా?

చంద్ర—మొదటమితిపెట్టలేదు. అప్పుడు నాయకుఁడాతని పాదములమీఁదఁబడి, ఓమునితల్లజా! బాల్యచాపలముచేత నెఱుఁగక చేసిన యీమె నేరమును క్షమింపవేయని బహువిధముల మనసు కరఁగఁ బ్రార్థించెను. అంతట నామునితల్లజుడు కొంతప్రసన్న హృదయుఁడయి మూఁడునెల, లీచిలుకకు స్వేచ్ఛావిహారభంగము గలిగించినది గనుక, ఈమెదాస్యమును మూఁడుమాసములే యుండునని యనుగ్రహించి కొలువునిడిచి వెడలిపోయెను.

హరి—ఈయుపకారమున కాతనికి మన మనేకాభివందనములు చేయవలసినదే. ఇది యెఱిఁగియే కాఁబోలును మన కులగురువులైన వశిష్ఠులవారు మనవివాహకాలమునందు నీకు దాసీయోగ మున్నదని నాతో సెలవిచ్చినారు. నీమీఁదఁగల ప్రేమచేత నాకామాటలప్పుడు చెవిని నాటినవి కావు.

చంద్ర—ఈసంగతి నేను నేఁడు క్రొత్తగా దేవరవారితో విన్నవించుటకాక యీపఱకే వశిష్ఠులవారు సెలవిచ్చి యున్నారు గదా? మీకిఁక సందేహమునూని నన్నెవ్వరికైన విక్రయింపుఁడు. ఇందువలన నమోఘమయిన బ్రాహ్మణశాపహతిచేత నాకవశ్య భోక్తవ్యమయియున్న దాస్యమునుం దీఱును; మీఋణమునుదీఱును.

హరి—ఓప్రాణేశ్వరీ! పుష్పకోమలివైన నిన్నిట్లు కాఱడవులలోఁ గష్టపెట్ట సంశయింపని కఠినచిత్తుఁ డెట్టిదారుణకర్మమున కయినను లోఁబడును, నామూలమునఁగదా,

చ. చెలువవు హేమసౌధముల స్నిగ్ధశశాంకశిలాతలంబులన్
మెలఁగెడునీవు ఘోరవనమేదినిలోపల సూదిరాళ్ళలో
నడుగులు పొక్కఁ గంటకచయంబులు గ్రుచ్చుకొన న్మెలంగుచుం
బలుమఱు సిట్టిపాట్లుపడఁబాలితి వక్కట మిక్కుటంబుగన్. 16

క. పరిచారికాశతంబులు
పరిచర్యలు చేయ నతుల వైభవలీలన్

జరియించెదు నీవిపు డే
కరణిం బరిచర్య చేయఁ గల వన్యులకున్! 17

క. ప్రాణములు నిల్పఁ గలనే
యేణాక్షిరో నిన్నుఁ బాసి యేనిమిషంబున్ ?
రాణీ! నినువిడిచిన నా
ప్రాణంబులు క్షణములోనఁ బాయును బొందిన్. 18

ఉ. ఈవు సమీపమందు వసించుట నాకునిశల్ పగళ్ళగున్,
బూవులతోఁట లౌను వనముల్, గిరిగహ్వరముల్ గృహంబులౌ,
కేవలజీర్ణపర్ణములు కెంజిగురాకులమేలిపాన్పులౌ;
హా! వనజాస్య! తాళఁగలనా నినుఁబాసి నిమేష మేనియున్? 19

నక్ష—ఓరాజా! నీకీమాఁదుదాని కున్నంతవివేకమయినను లేదు. పెట్టిన మితిలోపల ఋణ మేలాగునైనఁ దీర్పవలెనని యీామె సదుపాయము చెప్పుచుండఁగా నీ వీమెమాటలను జెడచెవులఁబెట్టి కల్లయేడ్పు లేడ్చుచు భార్యమీాఁద మహాప్రేమ యున్నవానివలె నటించి మాయప్పగి వేయఁ జూచుచున్నావు. నక్షత్రకుని ముందఱ నీ యాటలు సాగిరావు. నాకు నీకంటెను మాయ లెక్కువ తెలియును. ఈబుడిబుడి యేడుపులుచూచి జాలిపడి విడిచిపోవుటకు నేను మఱి యెవ్వఁడను గాను; కరుణయన్న నేమో యెఱుఁగని విశ్వామిత్ర శిష్యుఁడను జుమా. రమ్ము. పోయినంతవట్టుకు నీభార్యనమ్మి వచ్చిన సొమ్ము నాచేతికిమ్ము. (అని లాగుచున్నాఁడు.)

చంద్ర—ఓ ప్రాణేశ్వరా! ఈతనిచేత నీడుపులు పడక విధి ప్రేరితమయిన నా దాసీత్వమునకు మీారును సహకారులు కండు.

హరి—(గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు) భార్యావిక్రయము చేయు టకిని కమ్మని విధి నానొసట వ్రాసియుండఁగా నేనెట్లుసహకారుఁ డను గాకుందును? ఓ భూసురోత్తమా! నీ యభిమతమే చెల్లనిమ్ము. (అని వెంటనడచుచున్నాఁడు.)

[అప్పుడు కొందరు పౌరులు ప్రవేశించుచున్నారు.]

నక్ష—ఓపురజనులారా! ఈతఁడు తనభార్యయైన యీ సుందరి నమ్మఁబోవుచున్నాఁడు. మీలో నెవ్వరికైనను దాసి కావలసినయెడలఁ దగిన రొక్కమిచ్చి కొనుఁడు.

హరి—ఓహో! ఈదారుణవాక్యము పిడుగువలెఁ గర్ణరంధ్రములఁ దూఱియు నాకఠినహృదయమును పగిలింపఁజాలకున్నది. నాహృదయము వజ్రముతోనో యినుముతోనో చేయఁబడినది.

ప్రథమపౌరుఁడు—ఓనరోత్తమా! నీకీ త్రిలోకసుందరి యయినభార్యను విక్రయింపవలసినంత దురవస్థ యేలపట్టినది?

ద్వితీయపౌరుఁడు—హరహరా! ఇటువంటి కులకాంతను విక్రయింప నెంతటి బుద్ధిహీనుని కయినను మనసొప్పునా? ఓ పుణ్యాత్మా! నీవు నిజముగానే కులాంగనావిక్రయపుణ్యమున కొడిఁగట్టుకొనఁ బూనినావా?

హరి—(కన్నుల నీరునించుచు నూరకున్నాఁడు.)

నక్ష—ఓరాజా! నీవు బేరమడుగువారిప్రశ్నల కుత్తరమియ్యక కార్యము చెడఁగొట్టుచున్నావు. ఈలాగున మౌనము ధరించివచ్చెదు బేర మెల్లను చెడఁగొట్టుటకంటె మీ యప్పుపహరించెదనని మూఁగతనము విడిచి స్పష్టముగానే చెప్పుము. ఈ యడియాస మాని నేను మాగురువునొద్దకుఁ బోయెదను.

హరి—(గద్గదస్వరముతో) ఓ మునికుమారా! వేగిరపడఁబోకు. లోకవిరుద్ధమైన యీవార్త చాటుటకొకపట్టున నానోటమాట రాకున్నది. కొంచెము తాళుము.

నక్ష—అప్పుపహరింపఁ దలచుకొన్న నీకుఁ దాళిక యుండును గాని సొమ్ముగోలుపోయిననేనెట్లు వేగిరపడకుండఁగలను? ఓపౌరజనులారా! ఈతనికి మీతో మాటాడ నోరురాకున్నదఁట! నేను జెప్పె

దను వినుఁడు. ఈ తఁడు సూర్యవంశ జలధి చంద్రుఁడగు హరిశ్చంద్రుఁడు? ఇతఁడు మునికుల పవిత్రుఁడైన విశ్వామిత్రునకుఁ దన రాజ్యమంతయు దానమిచ్చి యాచఁడు యజ్ఞార్థ మిచ్చెద నన్న ధనమియ్యలేక ఋణబాధ తప్పించుకొనుటకయి యాలినమ్మఁ జూపుచున్నాఁడు.

ప్రథమపౌరుఁడు—శివశివా! ఈ మాటలు విన్న పాపము వచ్చును. మనము పోదము రండు. మన మెక్కడ? మహారాజు భార్యను కొను టెక్కడ?

ద్వితీయపౌరుఁడు—ఈతఁడు తనరాజ్యమంతయు విశ్వామిత్రునకా ధారపోసినది? రాజ్యమంతయుఁ దనకు ధారపోసిన మహాదాతను మున్నిచ్చెదనన్న స్వల్పధనము నిమిత్తమయి యిటు తనముల్లె డాఁచఁబెట్టినట్లు బాధ పెట్టుచుండుటచేత నతఁడు విశ్వామిత్రుఁడనదగిన వాఁడే! తనవంటి పాత్రుని వెదకి దానమిచ్చిన యీ సాధుచరిత్రుం జిక్కులు పెట్టెడియతఁడు విశ్వమున కమిత్రుఁడు గాక మిత్రుఁడెట్లగును?

ప్రథమపౌరుఁడు—ఎవ్వరును లేనట్టు పరమకోపి యని పేరు పొందిన యాకౌశికుని కేల దాన మిచ్చితివి? ఇచ్చినను దగుమాత్రపు దానము చేయవలెనుగాని శక్తికి మించినదానము చేయ వచ్చునా?

ఉ. కొందఱు యాచకాధముల క్రూరముఖస్థితి కుబ్బి యీవిచే
మందట నేమొ ముక్తితముఁ బొందెదుమన్ భ్రమ దాతలంచుఁ బే
రఁదఁగ నాలుబిడ్డల గృహంబున నంగడఁ బెట్టి దానముల్
క్రందుగఁ జేయుచుందురు కొరెకి రాతఁడు లట్టివారిలన్? 20

ద్వితీయపౌరుఁడు—ఇందులో రాజునననవలసిన దేమున్నది! మన బ్రాహ్మణోత్తములే యింతకయి నను దగినవారు. వారు సమయము వేచి తమ కుపకారము చేసినవారికే యపకారము చేయుదురు. (అని పోవుచున్నారు.)

నక్ష—ఓ రాజా! అమ్మవలసినవాఁడవు నీవు నోరెత్తక పోవుటచేత కొనఁదలఁచివచ్చిన వీరందఱును తొలఁగిపోవుచున్నారు. నీమౌనము చూచి నీవేమో ముగ్ధుడవని భావించి మీఁదుమిక్కిలి వీరు మాగురువుమీఁదనే తప్పుమోపి దూషించుచున్నారు. పరమపవిత్రుఁడయిన యీవిశ్వామిత్రునిఁ వీరిచేత నిట్లు తిట్టించుట నీకుధర్మమా? నీవిప్పు డాలి నమ్మ నని తెగఁజెప్పుము. నీవసత్యవాదివని యెఱిఁగి, నాదారిని నేను బోయెదను.

హరి—ఓ ఋషికుమారా! నిష్ఠురము లాడకుము. నేనిదిగో చంద్రమతిని విక్రయించుచున్నాను. (పురజనుల నుద్దేశించి)

గీ. పౌరులార! సుస్థిరమహోదారులార!
మునిఋణముదీర్ప నాభార్యఁ బుణ్యధుర్య
దాసిఁగా విక్రయించెద దయ దలిర్ప
వేగఁ గొంపరయ్య నేఁ గోరువిత్తమిచ్చి. 21

సీ. కలలోననైన నవ్వులకైన నిసుమంత
బొంకి యెఱుంగని పుణ్యశీల
తప్పఁ జేసిననైనఁ దన్ను దూఱిననైనఁ
గోపించి యెఱుఁగనిగుణధురీణ
పెఱలను దనవారి వేఱుగాఁ జూడక
నారయునట్టిసదయహృదయ
కానిమాటలు తన్నుఁగలుషాత్ము లాడినఁ
గలహింపనొల్లని గరితమిన్న

గీ. పరుఁ సొమ్ము తృణంబుగ భావమునను
దలఁచి యెప్పుడు వర్తించుధన్యచరిత
చంద్రమతి నాదుభార్య నీసాధ్వీ మణిని
విక్రయించెదఁ గొనరయ్య విబుధులార! 22

అప్పుడు వికృత వేషముతో కాలకౌశికుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సత్య—ఓ రాజేంద్రా! నీవందఱికిని వినఁబడునట్లు బిగ్గరగాఁ జాటకున్నావు. అందుచేతఁ బౌరు లిటురాక దూరదూరముల బోవు చున్నారు. ధాన్యపుమూటలును జింపిబట్టలును బంచాంగపుఁగట్ట యును ధరించి యొక బీదబ్రాహ్మణుఁడుమాత్ర మీవంక వచ్చు చున్నాఁడు.

కాల—(ప్రవేశించి) అయ్యా? మీరు గుంపుకూడి యేమి చేయుచున్నారు?

సత్య—ఈసుందరిని దాసినిగా విక్రయించుచున్నాము.

కాల—ఓ కాంతా! నీ వేమిపనులు చేసెదవు?

చంద్ర—రెండుపనులు తక్కఁ దక్కిన పనులన్నియు నేను జేసెదను.

కాల—ఆరెండుపనులుఁ నేవి? నీవు భోజనము చేసెదవుగదా?

చంద్ర—నేను బరోచ్ఛిష్టభోజనము చేయను.

కాల—అట్లయినఁ గొనువారి కందువలన లాభ మేదియు లేదు. ఇఁక నీవుచేయని రెండవపని యేది?

చంద్ర—పరపురుష—(అని చెప్పుటకు సిగ్గుపడుచున్నది.)

కాల—నీవు చెప్పనక్కఱలేదు. నాకది బోధపడినది. మంచిది యిప్పుడు నీభర్త యెక్కడ నున్నాఁడు?

హరి—ఇదిగో జీవచ్ఛవము నయి యిక్కడనే నిలుచున్నాను

కాల—నీ వెవఁడవు?

హరి—నేనవార్యశౌర్యధుర్యుఁడయిన త్రిశంకుని తనూజుఁ డను; సూర్యవంశ—

కాల—నీవు చెప్పనక్కఱలేదు. నీవృత్తాంతము నేనీవఱకే యెఱుఁగుదును. సామ్రాజ్య మంతయు గాధిపుత్త్రుఁ డయినవిశ్వా

మిత్రునకు ధారపోసి యాతని కంతకుమున్ను యజ్ఞార్థ మిచ్చెద నన్నవిత్త మియ్యలేక చిక్కులు పడుచున్న హరిశ్చంద్రుఁడవా నీవు!

హరి—అవును. ఆ విత్తమునిమిత్తమే యిప్పు డీయిల్లాలిని విక్రయింపఁబోవుచున్నాను.

కాల—సరిసరి! సర్వమును దెలిసినది. ఇంతేకదా! ఆఋణ బాధ తప్పించుకొనుటకయి నేను నీ కిప్పు డొక్కయాలోచన చెప్పెదను వినుము. సుందరీమతల్లియగు నీ యీయిల్లాలిని పరుల కమ్మనేల? నిష్కారణముగా నిందపాలు కానేల? నీవియ్యవలసినయర్థ మీ బ్రహ్మచారి చేతి కిచ్చితినని యొక్కబొంకుబొంకుము. స్త్రీల విషయమయి బొంకుట దోషము కాదుకనుక నీకు నేను సాక్షిగా నుండెదను. ఇప్పుడీతని చేతిలోనుండి తప్పించుకొని పోఁగలిగినయెడల, నీకసత్యమావల బాణమయినాటుకొనదు. నాబుద్ధి విని యీయొక్క యసత్యము పలుకుము. అసత్యభయము నీమనస్సును బాధించెడు పక్షమున, నాకల్పదక్షిణ యిచ్చితివా పాపపరిహారార్థముగాఁ దగిన ప్రాయశ్చిత్తము చేయించి నీయసత్యదోషము తొలఁగించెదను.

హరి—అసత్య మొక్కటియే యయినను నరుని నరక గామిని జేయకమానదు.

గీ. చిన్నసూది బెజ్జంబంతచిల్లి యున్నఁ
గడవెడుజలంబుఁ గ్రమముగాఁ గాఱునట్లు
పాపమున కింత యెడ సందు వదలునెడల
సర్వపుణ్యముల్ క్రమముగా సమసిపోవు. 28

కాఁబట్టి బుద్ధిమంతుఁడెన్నఁడును బాపహేతువయిన యసత్యమునకుఁ దనహృదయమునం దణుమాత్రమును జోటియ్యఁ గూడదు. వేయిప్రాయశ్చిత్తములు చేసికొన్నను, అసత్యదోషము పోదు.

కాల — నీవు వట్టిబుద్ధిహీనుఁడవు. ఋణవిముక్తుఁడ వగుటకు దగినసదుపాయమును నేనుపదేశించుచున్నను గ్రహింపజాలకున్నావు. లోకములో నసత్యముచేసి బాగుపడి సంపదలతోఁ దులఁదూగుచున్న వారిని నీవు చూచుచుండలేదా? ఈలోకములోఁ గల్లలాడుటవలన గౌరవహాని యొంతమాత్రమును రాదు.

హరి — ఓవిప్రోత్తమా! నీయభిప్రాయముతో నే నేకీభవింప జాలను. నీతిమార్గమునఁ జనువా రొకవేళ దైవవశమునఁ గష్టముల పాలయి యడఁగినను వారికిగౌరవమే యబ్బును; నీతిమాలినవా రొకా నొకప్పుడు సుఖమనుభవించుచున్నను వారికి గొప్పతనము రాదు. తాత్కాలికసుఖ మొకసుఖము కాదు. మన మెప్పుడును ధనము పోయినప్పుడును ముసలితనము వచ్చినప్పుడునుకూడ లోపల నంత రాత్మ పోరులేక సుఖపడునట్లుగా నడుచుకొనవలెను. ఆసుఖము నీతి మార్గముచేతఁ దప్ప మఱిదేనిచేతను లభింపదు. నీవు చెప్పినగౌరవ మయినను సత్యవేషమును వేసికొని వచ్చినప్పుడే యసత్యమునకుఁ గొంతకాలము కలుగును గాని నిజస్వరూపముతో వచ్చినప్పు డెప్పుడును గలుగదు.

గీ. ధాత్రిలో గౌరవము పొందఁ దలఁచునేని;
ధర్మవేషంబె వేయు నధర్మ మెపుడు;
స్వస్వరూప మొక్కించుక బయలఁబడిన;
నడుచు నాగౌరవం బెల్ల నాటితోన. 2.

ఓబ్రాహ్మణోత్తమా! నాకిప్పుడు నీతో వాదమున కవకాశములేదు. ఇఁక బహుభాషలుమాని నీకుఁ గావలసెనా నేను గోరినవిత్తమిచ్చి యీసాధ్విని బానిసనుగాఁ గొనుము. అక్కఱ లేనియెడల మాపని చెడఁగొట్టక నీదారిని నీవు పొమ్ము.

కాల — నీబాగుకొఱకే నేనిప్పుడు నీకుహితము చెప్పితిని గాని నామేలుకొఱకుఁగాదు. నీభార్యను విక్రయించుటకు నీకే చింత

లేకపోయినపక్షమున. మాకుమాత్ర మేమిటికి? ఈమె యోగ్యురా
లని చెప్పుచున్నావు గనుక నీవీమె కెంతధనము కావలెనందువో
కోరుము. ఇప్పుడ నే నారొక్క మిచ్చి కొనెదను.

హరి—ఏనుఁగుమీఁద నెక్కి నిలుచుండి రత్న మెగమీటి
నంతయెత్తుధనమిచ్చినజాలును. దానితో నాకిప్పుడు ఋణవిమోచన
మగును. నేను మరల నీధనమును నీకు వడ్డితో నిచ్చివేసినప్పుడు
మరల నాభార్యను దాస్యమునుండి విముక్తురాలినిగాఁ జేయ
వలెనుజుమా.

కాల—అందుకు నేనొప్పుకొన్నాను. ఆయెదుటిదే మాయిల్లు
నాతోవచ్చినయెడల విత్త మీభూసురోత్తమున కిచ్చెదను.

హరి—నక్షత్రకా! నీ వాధన మప్పగించుకొమ్ము.

నక్ష—ఓ బ్రాహ్మణోత్తమా! ఇఁక నీవు నీబానిసయైన యీ
చంద్రమతిని నీవెంటఁ గొనిపోవచ్చును.

కాల—హరిశ్చంద్రా! కొనిపోవచ్చునా?

హరి—(డగ్గుత్తికతో)కొనిపోవచ్చును. (అని కన్నులనీరు పెట్టు
కొనుచున్నాఁడు)

చంద్ర—(కన్నుల నీరు నించుచు) ఓప్రాణేశ్వరా! నానిమిత్త
మయి మీరడలఁ బోకుఁడు. నాశరీరము దూరముగా నున్నను,
నాహృదయ మెప్పుడును మీయొద్దనే యుండును.

హరి—నాబహిఃప్రాణమా! నిన్నుఁబాసి నేనెట్లు తాళఁ
గలను? జీవములనుబాసి బొంది యెప్పుడైనఁ దల యెత్తఁగలుగునా!
ఇఁక నాకెక్కడిబ్రతుకు? ఎక్కడిసుఖము?

గీ. అఖిలసామ్రాజ్యసంపద లనుభవించి
వైభవసమగ్రుఁ డగుసార్వభౌమునకును
దేవివై యుండి యొక్కని కీవు నేఁడు
దాసివైతివె కటకటా దైవగతిని. (అని యేడ్చుచున్నాఁడు.)

కాల—ఓరాజేంద్రా! నేను క్రొత్తగా దాసిని. గొన్నవు డమంగళకరముగా నీవేల యేడ్చెదవు? ఈశోకము మాని నీహృదయము పదిలపఱచుకొమ్ము. నీలోపలనున్న పంచేంద్రియములలో నొక్కదానిని జయింపలేనివాఁడవు లోకముల నెట్లుజయింపఁగలిగితివి?

హరి—అనుభవించువారు తాము కానప్పుడు పయినుండి పరుల కెన్నినీతులనైనను బోధింపవచ్చును గాని తమకే యాపదలు వచ్చినప్పు డెంతటిపండితులును ఖేదము నొందకుండజాలరు. ఎంతటి వేదాంతియైనను దేలుకుట్టినప్పు డేడువకుండునా?

కాల—అట్లయినపక్షమునఁ జైత్యపునీరు కాఱిపోవునట్లుగా నీవు కావలసినంతసేపేడువుము. మాదాసిని దీసికొని మాయింటికి నేనుబోయెదను. ఓచంద్రమతీ! ఈమూటలను మోచుకొని నావెంట మాయింటికి రమ్ము ఏమి? కదలవేమి? (అని మూటలు మీఁద వేయుచున్నాఁడు)

చంద్ర—క్షణము తాళుము. నాభర్తముఖ మింకొక్కసారి కన్నులారఁ జూడనిమ్ము.

కాల—నీభర్త దెప్పుడును జూచెడుప్రాఁతముఖమే. నడువు నడువు. (అని గెంటుచున్నాఁడు.)

లోహి—ఓబిచ్చపుబ్రాహ్మణుఁడా! బలవంతముగా మాయమ్మ నెక్కడకుఁదీసికొనిపోవుచున్నావు?

చంద్ర—ఓలోహితాస్యా! నీవు మీనాన్నగారియొద్దకుఁ బొమ్ము. నీఋణానుబంధము నాకు నేటితోఁ దీఱినది. (అని కన్నుల నీరువిడుచుచున్నది)

హరి—ఓలోహితాస్యా! ఆలిని విడిచిన పాపాత్ముఁడను నా యొద్ద కేలవచ్చెదవు? నీతల్లివెంటనే పొమ్ము.

కాల—ఓబాలకా! నీతల్లివెంబడినే రమ్ము. నీవును నేను కొన్నవిలువలోనివాఁడవే.

హరి—ఇది యేమిన్యాయము? నాభార్యను నీకమ్మఁజూపి నప్పుడు నే నీబాలకునిఁ జెప్పలేదే. వేఱుగ వెలయిచ్చి వీనినిగూడఁ గొని తల్లిబిడ్డల నేకము చేయుము.

కాల—నీ వీసుందరిని నాకమ్మినప్పు డీబాలుఁడు జట్టిలోని వాఁడు కాఁడని నాతోఁ జెప్పలేదు. అవును గొన్నప్పుడు లేగ దాని తో రాదా? అట్లేయీ బాలుడును దల్లిని గొన్న నాసొత్తే యగును.

నక్ష—ఈవిషయమయి మీరిరువురును బరస్పరవివాదమేల పడియెదరు? మాగురుప్రసాదముచేత నేను ధర్మశాస్త్రము లనేకము లెఱిఁగినవాఁడను. నన్ను మధ్యస్థునిగాఁ గోరుకొన్నయెడల మీలో నెవ్వరికి నన్యాయము కలుగకుండ యథాపధిగాఁ దగవు తీర్చెదను.

హరి—నీవు నీయిష్టము వచ్చినట్లు న్యాయము తీర్పుము.

కాల—నేనును నీమధ్యవర్తిత్వమున కొప్పుకొని పుణ్యమును పాపమును నీమీఁదనే వేసెదను.

నక్ష—అట్లయినపక్షమున నాకుఁ దోఁచినన్యాయమును జెప్పె దను వినుఁడు.

హరి—సావధానుల మయి యున్నాము చెప్పుము.

నక్ష—ఏధర్మశాస్త్రప్రకారముగా నే నిప్పుడీతగవు తీర్ప వలెనో సందిగ్ధముగా నున్నది. సందిగ్ధమైన ధర్మశాస్త్రములను మాని నే నిప్పు డభ్యసించుచున్న వ్యాకరణశాస్త్రప్రకారముగా వ్యవహారము తీర్చెదను. వినుఁడు. ఈమె తల్లి! ఇతఁడుపిల్లఁడు. తల్లిలోను పిల్లలోను కారద్వయమున్న సంబంధముచేతఁ దల్లియుఁ బిల్లఁడు నొక్కటే తండ్రిపిల్లల కట్టిసంబంధము లేకపోవుటచే నిద్ద ఱును వేఱు. కాఁబట్టి తల్లిని గొన్న సంబంధముచేతఁ బిల్లవాఁడును గాలకౌశికుని సొత్తేయయినాఁడు. ఓరాజా! ధర్మాధికారినైన నాతీర్పు

నకు బద్ధుఁడ వయి మాఱుమాటాడక లోహితాస్యు నీతని కిచ్చి వేయుము.

హరి—అయ్యా! వ్యవహారనిర్ణయమునకు ధర్మశాస్త్రములు ప్రమాణముకాని శబ్దశాస్త్రము కాదు.

నక్ష—నేను జెప్పినదే ధర్మశాస్త్రము ఋషులవాక్యములే ధర్మశాస్త్రములు. నేనును ఋషికుమారుఁడనే కాఁబట్టి జెప్పినది పిల్లధర్మశాస్త్రము. ఈపిల్లధర్మశాస్త్రమునుబట్టి యీపిల్లవానిని నీతని గొనిపోనిమ్ము.

కాల—ఓమునికుమారా! నీవు ధర్మశాస్త్రపారంగతుఁడవు. నాపాలిధర్మదేవతవలె వచ్చి న్యాయము చెప్పినావు. నేను నీమేలు మఱచిపోను. (అని కౌఁగిలించుకొనుచున్నాఁడు)

హరి—లోహితాస్యా! నీవు నీతల్లివెంట నీబ్రాహ్మణునితోఁ బొమ్ము.

కాల—ఓచంద్రమతీ! నాకు శివపూజాసమయ మయినది. వేగిరము నడువుము.

చంద్ర—నాప్రాణనాథుని సెల వడిగి రాసెందు. ఓప్రాణేశ్వరా! (అని పాదములమీఁదఁ బడుచున్నది)

హరి—ఓప్రాణేశ్వరీ! లెమ్ము. విశ్వనాథుఁడు శీఘ్రముగా నీదాస్యమును దొలగించి నీకు సుఖ మిచ్చునుగాక! (అని కన్నీరు నించుచున్నాఁడు)

చంద్ర—(లేచి) ఓప్రాణేశా! విధి పాపాత్ముఁడయి యిప్పుడు నాకు నీపాదసేవకూఁగ లేకుండఁ జేయుచున్నాఁడు. కటకటా! సన్నెల్లెడఁ బాయనేర్తును?

కాల—నాకావలఁ బ్రొద్దెక్కుచున్నది. నీచనువు చాలించి నడువుము.

చంద్ర—ఇదిగో! వచ్చుచున్నాను. ఇంకొక్క నిమిషము

తాళుము—ఓప్రాణేశ్వరా! నీవు నానిమిత్తమయి లేశమును జింతిల్లఁ బోకుము. నన్ను మఱచిపొమ్ము; సత్యమునుమాత్రము మఱవకుము.

కాల—ఓవంచకురాలా! నీవే వేళకును గదలి రాకున్నావు! మాటలసందడిలో నన్నేమఱించి పాఱిపోవఁ జూచుచున్నావా యేమి! నేను నీమాయలకు మోసపోవువాఁడను గాను. పద పద. (అని లాగుచున్నాఁడు)

చంద్ర—ప్రాణేశ్వరా! పోయి వచ్చెదను. (అని రెండడుగులు నడిచి వెనుక తిరిగి చూచి) నాకు నడువఁ గాళ్ళురాకున్నవి; హృదయము కొట్టుకొనుచున్నది. (అని తిరిగితిరిగి చూచుచు లోహితాస్యునితో మెల్లగ నడుచుచున్నది)

కాల—ఓదాసీ! నీ పెండ్లినడక లింకఁ గట్టిపెట్టి వేగిరము నడువుము. (అని నడుచుచున్నాఁడు)

నక్ష—ఓరాజా! బ్రాహ్మణుఁడుపోవుచున్నాఁడు. సొమ్ము తెచ్చుకోవలెను. నీవు మొగము వ్రేలవేసికొని నిలువఁబడక నాముందు నడువుము.

హరి—(కన్నీరు నించుచు) నాపాలిఁటి భాగ్యదేవతా! నా సామ్రాజ్యలక్ష్మీ!

నక్ష—ఏమి నామాట వినిపించుకో వేమి! బ్రాహ్మణుఁడు దాటిపోకుండ శీఘ్రముగా ముందు నడువుము.

హరి—నీతోడ నే నేల రావలెను? నీవు పోయి నీధనము తెచ్చుకొమ్ము.

నక్ష—ఇప్పుడు నీ వొప్పగించునది నాబత్తెపుసొమ్ము. నిన్ను విడిచిపెట్టినపక్షమున నింక నాగురువుగారిఋణ మెవ్వరు తీర్చెదరు? నాముందర నీవంచనలుమాని శీఘ్రముగా నడువుము.

హరి——ఇది యేమి యన్యాయము ? రెండుసువర్ణములిత్తురు మూడుసువర్ణములిత్తురు గాని యింతసొమ్మెవ్వరైన బత్తెమిత్తురా! పదులువిన్న నవ్వుదురు. ఈమాటలు మఱి యెక్కడను బలుకక యీసొమ్ము నీగురువు ఋణముక్రిందఁ గైకొమ్ము.

నక్ష——ఓరాజా! నీవు మాటలచేత నన్ను బెదరించి మోస పుచ్చఁ జూచుచున్నావు, నీమాటలకుజడిసి చేతఁబడినసొమ్ము విడుచుటకు నేనంత తెలివిమాలినవాఁడనుగాను.అల్పసంతుష్టుఁడనుమంచివాఁడనుగనుక నేనీయల్పధనమునకొప్పుకున్నాను. ఎండవానలకు సహించి వేళపట్టున నన్నము గానక నీవెంట వనములు దూఱి పర్వతము లెక్కి, నదులుదాఁటి, జపతపస్స్వాధ్యాయములుకట్టిపెట్టి పాడుగుళ్ళలోను జెట్లనీడను శయనించి, పడరానిపాట్లుపడియు నిన్నాయాస పెట్టక యూరకున్నాను. నీవు నామంచితనము లేశమయినను గని పెట్టలేకపోయినావు. "అసంతుష్టాద్విజానష్టా" (డన్న నీతినిబట్టి దొరికినదానితోనే తృప్తిపొందెదు నన్ను రవ్వచేయుక విశ్వామిత్రుని యప్పుకూడా నెట్లయిన నేఁడే చెల్లింపుము.

హరి——నీవు గురువుకార్యార్థమయి కష్టపడితివి గాని నా నిమిత్తముకాదు. పరదేశులకుఁ బాడుగుళ్ళును జెట్లనీడలును గాక పట్టెమంచములును బట్టుపరుపులు దొరకునా? నామాట విని——

నక్ష——నీ విఁక వేయి చెప్పినను నేను నీమాట వినను. నా ప్రాణములైనను విడిచెదనుగాని చేతఁ జిక్కిన యీధనమును మాత్రము నేను విడువను. నాతల నతికి బ్రహ్మహత్యాపుణ్యము కట్టుకొని మఱి యీధనమును గైకొమ్ము. ఓకాలకౌశికా! నీవు వచ్చి యీయాపత్సమయమున వద్దుపడి నాప్రాణము నిలుపవలెను.

కాల——(వెనుకనువచ్చి) ఓమునికుమారా! నీ కేమి ప్రాణాంతము వచ్చినది?

నక్ష—ఈరాజు నిన్న న్యాయము చేయదలంచినట్లే నాబత్తెము నియ్యక నాకన్యాయము చేయఁ జూచుచున్నాఁడు. ఇందులో నీవు నాకు సహాయుఁడవై నీవిచ్చెదుసొమ్ము ముందుగా నాబత్తెముక్రింద నిప్పింపవలయును. నేను మాగురువునిమిత్తము శ్రమపడితిని గాని తననిమిత్తమయి కాదఁట!

కాల—ఓరాజా! న్యాయము తప్పనివాఁడవని పేరుపొందిన నీకిప్పు డీదుర్బుద్ధియేలపుట్టినది? నిన్నాశ్రయించిన యీదారిద్ర్య దేవత యిప్పుడు నిన్నవివేకిని జేయుచున్నదాయేమి? ఇఁక దగవు మాలినపట్టుపట్టక యీవిత్త మీతని బత్తెమునకు విడిచిపెట్టుము. అడవులలోఁ బ్రయాసపడి యింతకాలము నీవెంటఁ దిరుగుట కీతఁడు నీబంటు కాఁడు.

హరి—(తనలో) ఇప్పుడు వీరిద్దఱు నేకమయి యన్యాయమున కొడిగట్టుచున్నారు. వీరిలో నొక్కరును ధర్మపాశములకు బద్ధులగువారు కారు. వృథావాగ్వాదము మాని పుణ్యమును బాపమును వీరిమీఁదనే పెట్టెదను. (ప్రకాశముగా) ఓప్రబుద్ధులారా! మీరిరువురును బ్రాహ్మణోత్తములు. దైవముఖముచూచి మీకు న్యాయమని తోఁచినట్లు విధింపుఁడు. మీ యాజ్ఞకు నేను బద్ధుడ నయ్యెదను.

కాల—ఈప్రకారముగా న్యాయమునకు రమ్ము. ఈవిత్త మీతని బత్తెమునకు వదలివేసి యీతని గురుఋణమును నీవు మరలఁ దీర్పవలసినదే.

నక్ష—ఓహో! ఏమి యీన్యాయము! భూలోకములో ధర్మదేవతయే యీబ్రాహ్మణరూపమున నవతరించినది! ఓహరిశ్చంద్రా! నీవింకను మాగురుఋణము తీర్పవలసియేయున్నది. ఆవిత్త మేలాగున సమర్పించెదవో చెప్పు.

హరి—ఓ వ టు శి ఖా మ ణీ ! నావద్ద నీవెటువంటి గనివి త్త మేమున్నది? దీనిని నీయధీనము చేసికొని నీమనస్సువచ్చినవారికి విక్రయించుకొమ్ము.

నక్ష—మంచిది నావెంట రమ్ము. నేను గోరువిత్తమిచ్చి నిన్నెవ్వఁగులీను డెవ్వఁడును గొనకపోయిన నేనేమి చేయుదును?

హరి—అగ్రవర్ణములవలన నీధనము రాకపోయినయెడల, నీవప్పుడు నన్ను గడజాతి మాలవానికయిన విక్రయించి నీసొమ్ము రాఁబట్టుకొవచ్చును. నేను చండాలుని కొలువైనను సంతోష పూర్వకముగానే చేసెదను.

నక్ష—ఓసత్యహరిశ్చంద్రా! నీ వన్నమాట తిరుగఁ గూడదు. నావెంట రమ్ము. (అని చేతికి త్రాడుగట్టి వెంటఁ గొని పోవుచున్నాఁడు)

హరి—ఓభూసురోత్తమా! నన్నెక్కడకుఁ గొనిపోయెదవు? ఇక్కడనే విక్రయించు.

నక్ష:—

సీ. ఆడినమాట దానముమాత్రమును దాట
నట్టిధర్మాత్ముఁ డీయలఘుగుణుఁడు
పృథ్వీతలం బెల్లఁ దృణకల్పముగ దాన
మిచ్చిన నెఱదాత యీనృపుండు
బాహుబలిమిన సప్తద్వీపములు గెల్చి
యేలినశూరుఁ డీయింద్రనిభుడు
నడిరేయి బేతాళు నడవిలో నెక్కటిఁ
దునిమినవీరుఁ డీఘనభుజుండు

గీ. బ్రాహ్మసురేంద్రులార! మహీంద్రచంద్రులార!
వైశ్యవరులార! చరణజప్రవరులార!

విక్రయించెద నేఁ గోరువిత్తమిచ్చి
పీనిఁ గొనరయ్య మీరలు వేగవచ్చి. 26

నే నెంతపిలిచినను బాఱు లెవ్వరును రాకున్నారు. బడ పడ. మాలవాఁడకుఁ గొనిపోయి పంచమునకే నిన్ను విక్రయించె దను. (అని లాగుచున్నాఁడు)

హరి—అర్ధప్రాణములు నీయధీనము చేసిన నన్ను నీచిత్తము వచ్చినట్లు చేయుము. (ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

చంద్ర—(తనలో) అయ్యో! నాప్రాణనాథుఁడు దాటిపోవు చున్నాఁడు. అతనిని జూచెడు భాగ్య మీ కన్నులకిఁక కలుగునో లేదో.

కాల—ఓకాంతా! అప్పుడు మాయింటికి వచ్చినాము. నా భార్యమిక్కిలి దొడ్డయిల్లాలు. ఆమెయెడల నీవు భయభక్తులు కలిగి నమ్రతతో నడుచుకోవలెను. ఒకానొకప్పు డామె నామీఁద గోప పడి నన్నుఁ గొట్టినను దిట్టినను గూడ నేనుసహితము మాఱు మాటాడక యోర్చుకొని పులినిజూచిన మేఁకపిల్లవలె నొదిగియుం దును. తలుపుతీయు మని నాభార్యను బిలిచెదను. ఆమె కోపముఖము చూచి నీవు భయపడఁబోకు. ఆమెరూప మెట్టిదయినను హృద యము మిక్కిలి చల్లనిది—ఓసీ! తలుపు తలుపు తలుపు తీయుము.

[అప్పుడు తలుపు తీసికొని కలహకంటకి ప్రవేశించుచున్నది]

చంద్ర—(తనలో) ఓహో! పిల్లికన్నులును జింపితలయును గండుముఖమును గలిగి వికృతరూపముతో నీమె పెనుభూతమువలె నున్నదే! హాదైవమా! నే నెటువంటి రాక్షసికి సేవచేయవలసి వచ్చి నది! ఈమె హృదయముకూడ రూపమువలె నుండకపోయినయెడల నేను గొంత ధన్యురాల నయ్యెదను.

కల—(నిమిషము తేఱిపాఱఁజూచి) ఓచండాలుఁడా! పట్ట పగలు నిర్భయముగా నీవీజవ్వనిని నాయింటికేల తెచ్చినావురా!

నిమిషమడచిపడకుండ నిలువుము. నీకండగ్రొవ్వరిగించెదను. (అని క్రిందఁ నుమియుచున్నది)

కాల—ఓప్రాణేశ్వరీ! కొంతశాంతత వహించి నామాట శాంతముగా వినుము. నే నీముద్దరాలిని.

కల—ఓరి పాపాత్ముఁడా! నీమాటకూడవినవలెనుగా? చచ్చినట్టు పడియుండక నీ పింకను నామాటకు మాఱుమాట చెప్పుచున్నావు? నన్నవలెనుగాఁ జూచుచున్నావు? నాలుగుదినములనుండి దెబ్బలు లేకపోయినంతమాత్రముచేతనే నేను నీపాలిఁటి యకాల మృత్యుదేవత నన్నమాట మఱచిపోయినావా? కానిమ్ము. నే నిప్పుడ నీకు బుద్ధివచ్చునట్లు చేసెదను. (అని మగనిమీఁద పడుచున్నది)

చంద్ర—(తనలో) అయ్యో! ఈదంపతు లిప్పుడు ఘోర యుద్ధమునకు డీకొనుచున్నారు. ఈమె కోపావేశముచేతఁ దా నబల యగుట మఱచి పురుషునిమీఁదికే కయ్యమునకుఁ గాలు ద్రివ్వుచున్నది. నేను వారింపఁ బ్రయత్నింతునా?

కాల—ఓప్రాణేశ్వరీ! నీకు మ్రొక్కెదను. నా నేరము మన్నించి నేఁటికి నీదాసుని నన్ను విడువుము.

కల—నీవీప్రకారముగాఁ జేసిననేర మొప్పుకొన్నతరువాతఁ గూడ నిన్ను విడిచెద ననుకొన్నావా? నేను గలహాకంటకిని గాని మఱి యెవ్వ తెనుగాను. బిచ్చపు బ్రాహ్మణుఁడవు నీ వెంత? నాపేరు చెప్పిన, ఈవీధినుండు పురుషులందఱును జడిసెదరు.

(అని జుట్టుపట్టుకొనివంచి గుద్దుచున్నది.)

కాల—ఓపుణ్యాత్మురాలా! ఇఁక నే నెప్పుడును నీమాట కెదురాడను. నేను నాతల్లి కేక పుత్త్రుఁడను. నాయందు దయ లేక పోయినను వృద్ధురా లయిన నాజననినైనను గరుణించి నాకుఁ

బ్రాహ్మణదానమును చేసి ముసలిదానికిఁ బుత్రభిక్ష పెట్టుము. పిడుగుల వలెఁ బడుచున్న నీముష్టిఘాతములకు నేను దాళలేను (అని గడ్డము పట్టుకొను చున్నాఁడు.)

కల—ఓరీ నీచేతులు కాలిపోను! నాదాఢలు నొక్కుచున్నావేమిరా? (అని రెండుచేతులతోను ముఖము బదుకుచున్నది)

చంద్ర—అమ్మా! నామాటలు విని కోపము శాంతింపు కొమ్ము. (తనలో) ఈ సంకుల సమరములో నామాటలే యీమె చెవిసోఁకకున్నవి. మే మాకొండమీఁద మున్నుఁ జూచిన పంచ ధారలవలెనే గోళ్లు తగిలి యీయన ముఖమునుండి యుయుదునెత్తురు టేరులు పాఱుచున్నవి. ఏమిచేయుదును? నాదేహము కంప మెత్తు చున్నది.

కాల—(తనలో) నాముఖ మంతయు మండుచున్నది. ఈమె నఖములు వజ్రసఖము లయి కామదేవుని పంచాయుధములోయన నా కాయము గాయములు చేయుచున్నవి. కొంచెము సేవు వానివాడిమి వ్యర్థపఱిచెదను. (అని రెండుచేతులును గట్టిగా పట్టుకొనుచున్నాఁడు)

కల—(గిల్లుటకుఁ జేతఁగాక నిప్పుతొక్కిన కోఁతివలె గంతులు వేయుచు పెద్దపెట్టున నేడ్చుచు) ఓరి పరమచండాలుఁడా! నీ చేతులు పడిపోను! ఓరిపాపీ! నీబలము మండిపోను! తాటిచెట్టులాగున్న నాఁడుదానిమీఁదఁ బడి యేడిపించెద వేమిరా? (అని మఱింత యేడ్చు చున్నది)

చంద్ర—(సమీపమునకుఁ బోయి) అయ్యా! నా ప్రార్థన విని యీమెచేతులు విడువుము.—అమ్మా! మగనితోఁ గలహింపుచుట పతివ్రతలకు ధర్మముగాదు. ఒకవేళఁ బురుషులయందు దోష మున్నను మనము సహించుకొనిరావలెను. పూర్వమునవమాయయయు లోపాముద్రయుఁ బతిభక్తిచేతనె కాదా నిరుపమానమైనమహిమ

బొంది సుందరులలో నెల్లను బేరుపొందిరి? భార్యాభర్తలు పరులు నవ్వునట్లుగాఁ గలహము లాడక యెప్పుడును క్షీరోదక న్యాయమునఁ గలసి మెలసియుండవలెను.

కాల—ఓచంద్రమతీ! నీవుపదేశించిన నీతి సర్వజనాదరణీయముగా నున్నది. నే నిప్పుడు చేతులు విడిచిపెట్టెదను. నీవెప్పుడును మాయింటనుండి మగనిని గొట్టవలదని సదా యీమె కుపదేశించుచుండుము. (అని చేతులు వదలుచున్నాఁడు.)

కల—ఈమిటారి నిప్పుడు మనయింటికిఁ దెచ్చుటయే కాక సదా యీమెను మనయింట నుంచుటకుఁగూడఁదలచుకొన్నావురా:- ఓసికుత్సితులారా! నీమాటలకు నాకు సంతోషముగుచున్నది. ఈపతివ్రతాధర్మములు నాకు నీకంటెను బదిరెట్లెక్కువ తెలియును. నీ నీతులింతటితోఁ జాలింపుము. నాకు ధర్మము లుపదేశింపుమని ప్రార్థనచేసి నిన్నిచ్చటి కెవ్వరు పిలుచుకొనివచ్చినారు? నీవు మరొకపైఁ (?) చేసినంతమాత్రముచేతనే నీతని నాజ్ఞ పెట్టక మనసు వచ్చినట్టు తిరుగనిచ్చెదననుకొన్నావా ? వేగిరపడకు నామాట కిప్పుడు మాఱుపలుక వెఱచుచుండెదు నాపెనిమిటి భయము పోఁగొట్టి బుద్ధి చెఱుచుచున్న నీపాపఫల మనుభవింతువుగాని నిమిషమోపిక పెట్టుము. (అని మగనివంకఁదిరిగి) ఊరిదానిచేత నన్నీరీతిగా గానిమాటలనిపించుటకే యీముత్తురాలిని నాయింటికిఁ దెచ్చినావా? (అని పీడివకొప్పు సవరించుకొని నడుము బిగించుచున్నది.)

కాల—ఓప్రాణేశ్వరీ! ఆగ్రహముమరలఁ దెచ్చుకోకు. నేను నీకుభృత్యుఁడనై యుండెదను. ఈపడుచును బుత్రసహితముగాఁ నీకు దాసినిగా గొనివచ్చినాను.

కల—(మగనిని కౌఁగిలించుకొని) ఓప్రాణనాథా! ఈమాట మొదటనే చెప్పలేకపోయినావా! అప్పుడే చెప్పియుండినయెడల,

నీముఖమునందు నీబాలచంద్రరేఖలు పడియుండకపోవునే! పోయినది పోనిమ్ము. నేనిఁక శాంతురాలనయ్యెదను. దీర్ఘక్రోధ మెవ్వరికిఁ గూడదు.

కాల—ఓప్రాణేశ్వరీ! నీవప్పుడు నన్ను మాటాడ నిచ్చితివా?

కల—ఇప్పుడును మాటడనియ్యను. ఊరకుండుము. ఓముద్దరాలా! ఇటురమ్ము నీ వీవరకు నాప్రభావ మెఱుఁగవు. నామాట వినఁబడినఁ బాఁడుగువా రెవ్వరును వీధిలోనికి రారు. ఆమాట యటుండనిచ్చి నీవు చేయవలసినపనులు వినుము. నీవు ప్రతిదినమును జాముప్రొద్దుండఁగా లేచి ప్రాచిపనులు తీరిచి తెల్లవాఱునప్పటికి నాకోలవునకు రావలెను. సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమానమువఱకును జేయవలసినపనులన్నిటిని నీ కాలోచించి తరువాతఁ జెప్పెదను. ఇట్లంటివని సూర్యాస్తమానముతో నీదాస్యము ముగియునని సంతోషింపకుము. రాత్రిపదిగడియలకు మేముపాన్పు చేరినతరువాత మాకాళ్ళుపట్టి మమ్ము నిద్రపుచ్చువఱకును నీ కేదో పని కల్పించి యెప్పటికప్పుడేదో చెప్పుచుండెదను. నీకొడుకడవులకుఁ బోయి యనుదినము తోడిబాలురతో సమిధలును బుష్పములును ఫలములును బత్రములును గొని తెచ్చుచుండవలెను.— మనవీధి నెవ్వఁడో మాలవాఁడు వచ్చుచున్నాఁడు. లోపలికిరా. నీపని యంతయు లోపల వివరముగాఁ జెప్పెదను.—ఓరి చండాలుఁడా! దగ్గఱగా వచ్చుచున్నావేమిరా? ఆగు. ఎవడవురా నీవు?

[అప్పుడు వీరబాహుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వీర—నేను వీరబాహుఁడను. వేగిరము లోపలికిఁ బొండి నేను పోవలెను.

కల—రండిరండి—నమ్ము లోపలికిఁబోనిమ్ము. ముటికి పాతలును గల్లుపాయయు దోలుముక్కలును జూచుకొని యేమి పొంగిపడుచున్నావురా? (అందఱును లోపలికిఁ బోవుచున్నారు.)

వీర—(నిలువబడి తనలో) అయ్యో! నక్షత్రకుఁడును హరిశ్చంద్రుఁడును దామింతలోనే యీచోటుఁ బాసియెక్కడకుఁబోయినారో! అతఁడు హరిశ్చంద్రుఁడన్న వార్త యీపట్టణ మేలెడు రాజునకుఁ దెలిసినపక్షమునఁ గోరినధన మిచ్చి యతఁడు హరిశ్చంద్రుని విడిపించును. అటువంటి వైపరీత్యము పుట్టకమునుపే నేను వారిని గలిసికొని విశ్వామిత్రుఁడు నాకిచ్చినధనముతో హరిశ్చంద్రుని వేగిరము కొనవలెను. అతఁడు నాచేతఁ జిక్కినా, విశ్వామిత్రుఁడు నాతోఁ జెప్పినదంతయుఁ జేసి యాతనిని బాధపెట్టెదను. (అని పయివంకఁజూచి) అదిగో వారీవంకనే వచ్చుచున్నారు.

[అప్పుడు నక్షత్రకుఁడును హరిశ్చంద్రుఁడును మరలఁ బ్రవేశించుచున్నారు.]

నక్ష—ఏవాడను దిరిగినను నిన్నెవ్వరును కొనకున్నారు. దైవము నిన్ను మాలవానికే దాసుఁడవు కమ్మని వ్రాసెను గాఁబోలును! మాలగూడె మీసమీపముననేయున్నఁదట! రమ్ము.

హరి—విధి నన్నేమి చేయఁదలఁచుకొన్నాఁడో యట్లు కాక మానదు. ఇక్కడ నొక్కసారి కేక వేయుము. (తనలో) నామనస్సున కారాటము హెచ్చుచున్నది.

నక్ష:—

గీ. సత్య మెప్పుడుఁ దప్పని సజ్జనుండు
పదువురను మించి పనిచేయుబాహుబలుఁడు
వీని నిప్పుడు నేఁ జెప్పువెల యొసంగి
వచ్చి కొనరయ్య వేవేగఁ బౌరులార!

హరి—అయ్యో! ఈయుగ మెంతదీర్ఘముగానున్నది! నేటిదినము సూర్యాస్తమానమే లేనట్టున్నదే! ఈ దినము సూర్యుఁడు క్రుంకఁడు. ఆహా! ఏమి యీవింత! ఎప్పుడును వెలుతురునే కోరుచుండెడు నేను నేఁడు చీఁకటిని గోరుచున్నాను!

మ. ధరఁ బ్రేమాస్పదులైనవారలు కడుం దవ్వైనచోఁ జాల సుం
దరమావస్తువుకూడఁ జిత్తమున కెన్నండా నసహ్యంబగున్;
గరముం జల్లనిపండువెన్నెలలునుం గల్గించు సంతాపమున్;
జెఱుఁగం జేయని దేది దుఃఖమును బృద్ధిన్ గష్టకాలంబునన్.

ఈ మనస్తాపమున కంతకును నా ప్రాణేశ్వరియే కారణము.

ఉ. ఇంతిరో! నీవు చెంత వసియించిన నెండయు వెన్నెలయ్యె; న
త్యంత సుగాన మయ్యెను మదాత్మకు నీదుగళస్వనంబు; నీ
వింత యొసంగినట్టిఫల మెల్ల సుధాసమ మయ్యె నప్డు; నా
కెంతయు నింద్రభోగసుఖ మిచ్చెను వింతగ నీదుస్పర్శయున్.

వీర—(సమీపించి) ఓ బ్రాహ్మణోత్తమా! నిలువునిలువు. నేను వచ్చుచున్నాఁడను.

నక్ష—నీ వెవఁడవు!

వీర—నేను వీరబాహుఁ డనుమాతంగుఁడను. నీవమ్మఁ జూపుచున్న యీతనిని గొనుటకయి వచ్చినాను. నీ కెంతధనము కావలెనో చెప్పుము.

నక్ష—నా కేనుఁగుమీఁద నెక్కి రత్న మెగమీటినంత యెత్తుధనము కుప్పవోసితివా, యీరాజును నీకు విక్రయించెదను.

వీర—ఈరా జేమిపనులు చేయును!

నక్ష—అన్నిపనులును జేయును-ఓరాజా! నీ వేమేమిపనులు చేయగలవో చెప్పు.

హరి—ఈతడు చెప్పిన న్యాయమయిన పనుల నన్నిఁటిని జేసెదను.

నక్ష—మఱియేపనులను జేయవా?

హరి—నామనస్సునకు మంచివికావని బోధించుపనులను నే నెట్లు చేయఁగలను?

వీర—ఓవిప్రోత్తమా! ఇతఁడేమనుచున్నాఁడో వింటివా! అప్పుడే యితఁడు నేనుజెప్పినపనుల నన్నిటిని జేయననుచున్నాఁడు. తన మనస్సునకునచ్చినపనుల మాత్రమే చేయునఁట! ఇంతధన మిచ్చి కొని యిట్టిసేవకుని నే నేమిచేసుకొందును?

నక్ష—ఓరాజా! రాకరాకవచ్చినబేరమును నీవిప్పుడు చెడఁ గొట్టుచున్నావు. నన్నిట్లు చిక్కులు పెట్టి చంపుటకన్న ఋణము తీర్ప నిష్టము లేదనియే చెప్పరాదా?

హరి—సత్యముతప్పిన ధర్మహానివచ్చునని ధర్మమునిమిత్త మమ్ముడు పోవుచున్న నే నీతని నిమిత్తము ధర్మవిరుద్ధము లయిన పనులు చేయుదునా? ఈతఁడు తగవునూలి యెవ్వరితల యయినఁ బగులగొట్టమన్నఁ గొట్టుదునా? ఎవ్వరిసొత్తయిన దొంగిలింపుమన్న దొంగిలి తెత్తునా?

వీర—అట్టి ధర్మబాహ్యములయినపనులు నే నెప్పుడును జెప్పను.

హరి—చెప్పకపోయినయెడల, నీయాజ్ఞలనన్నిటిని నేను శిరసా వహించి చేసెదను.

వీర—నీవు మఱి యేమి కోరికలు కోరెదవో యిప్పుడే చెప్పు. నీవు చెప్పెడిది నా కంగీకారమయినయెడల నిన్ను గొనెదను; లేదా, మానుకొనెదను.

హరి—నే నింకొక్క కోరిక కోరవలసి యున్నది. నేను స్వహస్తపాకముచేసికొని తినుచు దూరముగా నుండి నీసేవచేయుట కంగీకరింపవలయును. ఇంతకన్న వేఱుకోరికలు లేవు.

వీర—ఓ బాపనయ్యా! నేనీతఁడు చెప్పినదాని కంగీకరించితిని గాని నా మనస్సు నొక్కసంశయముమాత్రము బాధించుచున్నది. ఈతఁడాలుబిడ్డలు లేని యేకాకి. ఈతనినెట్లు నమ్మవచ్చును? ఉన్నట్టే యుండి యేయర్ధరాత్రి వేళనో యీతఁడు సన్నీమతించి పారిపోయిన నేది దిక్కు? అప్పుడు నాధనము నాకిచ్చుట కెవ్వరయినఁ బూట పడువారున్నారా?

నక్ష—ఓమాతంగపుంగవా! నీవట్టిసందేహము పెట్టుకోవల సిన పనిలేదు. దానమిచ్చిన ధనమును దీర్చుటకే భార్యాపుత్రులను బోఁగొట్టుకొని యేకాకియై యిట్లిడుములు బడుచున్నయీతఁడు నీవద్ద బుచ్చుకొన్నధన మపహరించి పాఱిపోవఁజూచునా? ఇట్టిపనికిమాలిన శంకలు మాని నీవీతనిని విశ్వసింపవచ్చును. ఒకవేళ నితఁడు మోసము చేసి నీధనమపహరించి పారిపోవునంతటివైపరీత్యమే పుట్టినపక్షమున నీ ధనము నీకు మరల నిచ్చివేయుటకు నేను బూటపడెదను.

హరి—ఓ మాతంగపుంగవా! నే నొక్కమాట చెప్పెదను వినుము. సత్యపరిపాలనము నిమిత్తమే రాజ్యమంతయు విడిచి అర ణ్యములపాలయి, భార్యాపుత్రులనుబోఁగొట్టుకొని, ఆత్మవిక్రయము నకు సహితము లోఁబడితిని. నీవద్ద భయభక్తులతో గొలువు చేసె దనని చెప్పుచున్నాను. కాఁబట్టి నాసత్యవాక్యమునందే గౌరవముంచి కోరినధన మీవిప్రకుమారున కిచ్చి పంపివేయుము.

వీర—ఇప్పుడు నీమీఁద నాకు విశ్వాసము కలిగినది. ఇఁక నాకర్ధభయములేదు.- ఓబ్రాహ్మణోత్తమా! నావెంట మాపల్లెకు రమ్ము. నీవిత్తమిచ్చెదను.

నక్ష—ఇదిగో వచ్చుచున్నాను. హరిశ్చంద్రా! ముందు నడు వుము.

హరి—నడుచుచున్నాను—ఓవీరబాహూ! నేను నీయొద్దఁ జేయవలసినపని యేమి!

వీర—నే నీయూరి ప్రేతభూమికధికారిని. నేఁడు మొదలుకొని నాయాజ్ఞచేత నాయధికారమును నీవు వహించి, అహోరాత్రము లందుఁ గనిపెట్టియుండవలెను. అక్కడ కాల్చుట కెవ్వరు శవమును దెచ్చినను కాటికట్న మొకమాడ పుచ్చుకొనక దహనము చేయ నీయఁగూడదు. నీయాజ్ఞ చెల్లుటకయి యిదిగో నీకునాముద్రగుదియ నిచ్చుచున్నాను. (అని తనచేతికఱ్ఱనిచ్చి) నీకిప్పుడు వీరదాసుఁడను పేరిచ్చుచున్నాను. నేఁటినుండి నీవీపేరితో స్మశానవాటికయందు రాత్రిందివములు మిక్కిలి జాగరూకుఁడవయి యుండవలెను. ఈ కల్లుపంటిని నావెంటఁ గొనితెమ్ము. (అని కల్లుకుండ నిచ్చుచున్నాడు)

హరి—మీరు చెప్పినపని యెల్లను జేసెదను. (అని కల్లుపంటి పట్టుకొని నడుచుచున్నాఁడు)

వీర—ఓవీరదాసా! వేగిరము రమ్ము.

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

## పంచమాంకము

రంగము—స్మశానవాటిక

[వీరదాసుఁడును, తదనుచరుఁడగు మధుదాసుఁడును ప్రవేశించుచున్నారు]

మధు—ఓమహారాజా! దివ్యభవనములలో సంగీతారావములకానందించు చెవులతోఁ బిత్రృవనములలో సృగాలారావము

లాలకించుచు, ఏనుఁగులను నడిపిన చేతులతోఁ బీనుఁగులను నడువుచు, వీరదాసను పేరున మాలవాడలో నీవిప్పు డెంతకష్టపడవలసి వచ్చినది! ఇన్నికష్టము లనుభవించుచున్నను నీవు నిశ్చింతుఁడవై యుండుట చూడఁగా నాకాశ్చర్య మగుచున్నది.

వీర—ఓవసుధుదాసా! స్వామికార్య పరాయత్తచిత్తుఁడనయి కష్టములు మఱచియున్న నాకిప్పుడు పూర్వకష్టములను స్మరణకుఁ దెచ్చి దుఃఖము పుట్టింపకుము. అన్నికష్టములు వచ్చినను, వాని నన్నిటిని మఱపించుటకయి యాపదలయందు సహితము సత్యము విడువలేదన్న సంతోష మొక్కటే నాకుఁ జాలును. ఈసంతోషములో నాకేదుఃఖములును దోఁచవు. అయినను మానుషప్రకృతి యగుటచేత వెనుకటివిపత్తులు దలఁపునకు వచ్చినప్పుడుమాత్రము దుఃఖమాగదు. నీమాటలచేత నాదురవస్థ యిప్పుడు నాకుఁ దలఁపునకు వచ్చుచున్నది.

ఉ. నేనిఁట గాటికాపరికి నీచపుభృత్యుఁడనైతి నక్కటా!
తానును దాసి యయ్యె వసుధాసుర ధూర్తునియింటభార్యయున్;
భానుసమాన తేజుఁ డగుపట్టియు సేవకుఁ డయ్యె; నయ్యయో!
నే నెటు దుఃఖ మాపుకొన నేరుతు నిన్నియుఁ జిత్తమేపగన్! 1

(అని కన్నీరు విడుచుచున్నాఁడు)

మధు—ఓరాజేంద్రా! శోకమడచుకొమ్ము. ఆవంక నెవ్వరో మన సుంకమియ్యకయే దహనము నిమిత్తమై శవమును దింపినట్టున్నారు. పడమటికడను జూడుము.

వీర—స్వామికార్యము పేరుచెప్పఁగానే నాదుఃఖమంతయుఁ బాఱిపోయినది. మన మక్కడకుఁ బోయి కాటిరూక లియ్యక మనలను వంచింప నెంచిన యావంచకుల నదలింతము. (అని నిక్కి చూచి) ఇప్పుడు తెలిసినది. అది పశుకళేబరము కాని మనుష్యకళే

బరము కాదు. పశ్చిమమున వాలుచున్న సూర్యుని కిరణములచేత మనకన్నులు మిఱుమిట్లు గొని యీదిక్కున నున్నవానిని దిన్నగాఁ గానకున్నవి. ఎండకుఁ జే యడ్డము పెట్టుకొని యిప్పుడావంకఁ జూదుము.

మధు—(చూచి) అవు నవును. అది నేఁటి ప్రాతఃకాలమునఁ జచ్చినధేనువుయొక్క కళేబరము. ఆమొండెమును లాగుచున్న కుక్కలను జూచి మనుష్యులని భ్రమపడినాను.

వీర—అట్టిభ్రమ మొదట నాకును గలిగినది. అశునకములు మోఱ లెత్తుకొని మొఱుఁగుచు నొకదానితో నొకటి యెట్లు కలహించుచున్నవో చూడు.

మధు—అట్లు పోరుచున్న వొక్కకుక్కలు మాత్రమే కావు. రాజ్యభాగమునిమిత్తమయి యుద్ధముచేయు వీరభటులవలెనే మాంసభాగమునిమిత్తమయియాకాశమున కెగసి కాకులును యుద్ధయు చేయుచున్నవి.

వీర—వట్టియుఅవులేకాని కాకులలోఁ గాట్లాటలంతగా లేవు.

చ. మనుజుల కైకమత్యమును మన్నన నేరువు చున్నవో యనన్
  గనుఁగొను మీ-మహీజములఁ గాకులుగుంపులుకూడియొండొరుల్
  ఘనమతిఁ బిల్చుచున్ బిశితఖండము లల్లన నారగించెడుల్
  దునుకలు కాళ్ళక్రింద నిడి తోటిపుటంబులఁజించి చీల్చుచున్. 2

మధు—అవి యట్లే యున్నవి. రెండును ద్విజాతులేయైనను గాకుల కున్న యైకమత్యము గ్రద్దలకుఁ గానరాకున్నది. అవి నొకరిత్తియొకదాని నొకటి పిలిచిన పాపమునఁ బోకున్నవి.

వీర—అగ్రద్దలను నిపుణముగాఁ గనిపెట్టుము.

ఉ. గ్రద్దలు కొన్ని చంచువునఁ గట్టిగ మాంసము లాగి మొక్కఁగాఁ
  దద్దయు మండలాకృతిని దవ్వుల మింటఁ బరిభ్రమించుచున్

గ్రద్దలు కొన్ని చూచి తమకంబున నోళ్ళను విప్పి తెక్కలన్
బెద్దయుఁ జూచి వేఁదిగెడు బీమఁగుమీఁదికిఁ జూడు మాదెసన్.

మధు—ఇటు మనము మాటాడుచుండఁగానే సమస్తవస్తువులు నెఱ్ఱపడుచున్నవి. ఆకాశమునుండి మేఘములు రక్తవర్షము కురియుచున్నవా యేమి?

వీర—ఓయీ! నీ విప్పుడు సాయంకాల మగుచున్న దన్నమాట మఱచిపోయి నావు. సూర్యుఁడు తనకిరణముల వేఁడిమిని బోఁగొట్టుకొని శాంతమూర్తియయి పశ్చిమమునఁ గ్రుంకఁబోవుచున్నాఁడు. నీ విప్పుడు చూచినది సంధ్యారాగముగాని రక్తవర్షము కాదు. ఇప్పుడు సూర్యుఁ డెంత మనోహరముగా నున్నాఁడో చూచినావా?

క. అస్తాద్రిాంచుని దెసఁగనుఁ
గొమ్మామూలాగ్ర మొక్కకుప్పగ నత్యం
తమ్ముఁ జిగిర్చినయెఱ్ఱని
క్రొమ్మామిడిగున్నవంటి కోమటుపహించెన్. 4

కాఱుగ్రమ్ముకొనుచున్న యీకటికచీఁకట్లు పల్లవభక్షణాపేక్షచేతఁ జనుదెంచుచున్న కోయిలగుంపులవలె నున్నవి.

మధు—నాదృష్టి కెఱ్ఱనైన యాసూర్యబింబము మండుచున్న సొదగాను, చీఁకట్లు దానిపయి పొగలుగాను, నక్షత్రములుండి లేచిన మిణుఁగురులుగాను, పొడకట్టుచున్నవి.

వీర—కాటికాపరివాఁడవగుటచే నీమన స్సెప్పుడును జితులమీఁదను, శవములమీఁదను, మంటలమీఁదనే యుండును. అందుచేత నీకుసర్వమును కాష్ఠమయముగానే తోఁచుట యాశ్చర్యము కాదు. ఆహా! మనము చూచుచుండఁగానే యెంతలో గాఢాంధకారము వ్యాపించి కన్నులు నిరర్థకములయి మిట్టపల్లము తెలియఁగ

రాక మిన్నునమన్నను నేకముఁగుబోయినవి! నీవొక్కగడియ నేపిందుఁ గూరుచుండి యప్రమత్తుఁడవై కాచియుండుము. నేనింతలో సాయంకాలకృత్యములను దీర్చుకొనివచ్చి స్వామి కార్యతత్పరుఁడ నయ్యెదను.

మధు—నీవు పోయిరమ్ము. నీవుమరల వచ్చువఱకును నేను గనిపెట్టియుండెదను.

వీర—పోయివచ్చెదను. నీవు క్షణకాలమయిన నేమఱి యుండఁగూడదునుమా. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మధు—అయ్యో! నాకప్పుడే యావులింతలు వచ్చుచున్నవి; తెప్పలుమూసికొనిపోవుచున్నవి. ఈలోపల నొక్కనిద్రతీసి వీరదాసు మరల వచ్చునప్పటికి మేలుకొని కావలి కాచుచుండెదను.

(మంచెకుఁ జేరగిలఁబడి నిద్రపోవుచున్నాఁడు.)

[అప్పుడు లోహితాస్యుని భుజముమీఁద వేసికొని విలపించుచునొక్క బ్రాహ్మణబాలకుఁడు వెంటరాఁగా చంద్రమతి ప్రవేశించుచున్నది.]

బాల—అమ్మా! మన మిప్పుడు స్మశానవాటికకువచ్చినాము. మనమేఱుకొనివచ్చినచితుకలతో సొదఁ బేర్చి యీలోహితాస్యున కిక్కడ దహనసంస్కారము చేయవచ్చును.

చంద్ర—(లోహితాస్యుని దింపి యాతనివంకఁ జూచుచు) నాకన్నతండ్రీ! ఓలోహితా! నేనెంత పిలిచినను నాతో మాటాడవేమి? బ్రాహ్మణుని నిమిత్తమయి నీవు విఱిచినసమిధ లిప్పుడు నీకే వినియోగపడవలసివచ్చినవా ? "ఓవిప్రవరా! మీయాజ్ఞచొప్పున నరణ్యమునకుఁ బోయి సమిత్కుశాదులను దెచ్చితి"నని యిఁకగాలకౌశికున కెవ్వ రర్పింతురు! ఫలపర్ణకుశాదులు తక్కువ తెచ్చితి వని కాలకౌశికులు కోపపడి కొట్టితిట్టినని కన్నుల నీరుగార నేడ్చుచు వచ్చి యిప్పుడు నాతోఁజెప్పవేమి!

బాల—అమ్మా! దుఃఖపడఁబోకుు. పాపాత్ముఁ డయిన యాకాలకౌశికుని పేరిప్పుడేల యుచ్చరించెదవు! వాని పేరు విన్నఁ బాపమువచ్చును. కటకటా! ఆపాపిమూలముననేకదా నవమన్మథుని వంటి యీబాలకునికిటువంటిగతి పట్టినది! ఓకౌశికా! ఇప్పుడయిన నీకు సంపూర్ణసంతోషము కలిగినదా?

చంద్ర—ఓవిప్రబాలకా! కాలకౌశికుని నిందింపఁబోకుము. మాభాగ్యమిట్లుండఁగా నతఁ డేమి చేయఁగలఁడు? ఓలోహితా! దుఃఖమాఁపుకొందమన్నను నాగక మహాసముద్రమువలె లోపలి నుండి పొరలిపొరలి వచ్చుచున్నది. (అని యేడ్చుచున్నది.)

బాల—అమ్మా! అడలఁబోకుము నీయరణ్యరోదనమువిని యిక్కడ నిన్నోదార్చు వారెవ్వరున్నారు? సహించుకొమ్ము. అగ్నిహోత్రమువలెనే దుఃఖమును స్వాశ్రయమును దహించును. ఈయర్ధరాత్రమున నీస్మశానభూమిలోఁ దడవు నిలువఁగూడదు. వేగిరమీతని కగ్నికార్యముచేసి పట్టణమునకుఁ బోదము లెమ్ము.

చంద్ర—ఓవిప్రబాలకా! రాత్రి చీఁకటిలో మిక్కిలి నిన్నాయాసపెట్టినాను. క్షమింపుము. నాయేలికసానియయిన కలహకంటకి నన్నంపుట కాలస్యము చేసినందున నిన్నినిశీధవేళదాఁక నిలుపవలసి వచ్చినది. నీవు గాఢాంధకారములో మహారణ్యమార్గమున నన్నుఁ గొనివచ్చి యీకుమారుఁడు పడియున్నచోటు చూపి పుణ్యము కట్టుకొన్నావు. నీఋణము నేను దీర్చుకోలేను. నేను జేయఁగలిగినది కృతజ్ఞతాపూర్వకమయిన నమస్కార మొక్కటి చేసెదను. దాని నంగీకరించి యింటికడ నీతల్లిదండ్రులు నీనిమిత్తమయి యడలకుండ వేగముగా నిల్లుచేరుము. గుడ్లగూబలు తొఱ్ఱలువెడలివచ్చి కూయుచున్నవి; పాములు బుసకొట్టుచున్నవి; నక్కలరచుచున్నవి. త్రోవలో భయపడక పదిలముగా నింటికిఁ బొమ్ము.

బాల—ఇవి యన్నియుఁ బిఱికివారికి భయము పుట్టించును గాని నావంటివానిని జడిపింపలేవు. అర్ధరాత్రమునఁ బుత్రశోకాతురవై యున్న నిన్ని నట్టడవిలో నొంటిగా దిగవిడిచి నేనెట్లు పోఁగలను? పరమ పాపాత్మురాలైన మాకలహకంటకి పుత్రుఁడడవిలో పడిసెనన్నను నిన్ను విడిచిపెట్టక కానిమాటలాడి దుఃఖసముద్రములో నున్న నీచేతఁ బనిచేయించి యెంత చేసినది? అడవిలోఁ బడియున్నకొడుకు నొక్కసారి చూడనిచ్చి పుణ్యము కట్టుకొమ్మని నీవు దీనత్వముతోఁ బ్రార్థించినప్పుడాదుష్టురాలాడినదుర్భాషలు నామనస్సు నిప్పుడును వేధించుచున్నవి. తెల్లవాఱినతరువాత నేనీ నీచురాలితులువతనమును నాసహపాఠులయిన బ్రహ్మచారులతోఁ జెప్పి నేనును వారును జేరి యెట్లు పగతీర్చుకొనెదమో నీవే చూచెదవు.

చంద్ర—ఓవిప్రబాలకా! నీకు నమస్కారము చేసెదను. నానిమిత్తమయి మీరావిప్రభామినిమీఁద నెంతమాత్రమును దుడుకుతనము చూపఁబోకుఁడు. నేనామెకు శరీర మమ్ముకొన్నదానను. దాసురాలనయియున్న నన్నామె కానిమాటలాడి యయినను బని తీఱినతరువాత విడిచిపెట్టినందుకే సంతోషపడవలెను.

బాల—అమ్మా! నీవుపుత్రశోకములో మునిఁగియున్నప్పుడు—

చంద్ర—పుత్రశబ్దోచ్చారణముచేత దుఃఖము పొరలిపొరలి వచ్చుచున్నది. నేనీదుఃఖమును సహింపఁజాలను. ఇప్పుడీవృక్షమున కురిపెట్టుకొని ప్రాణములువిడిచి శీఘ్రముగాఁ బోయి పరలోకమున నాపుత్రునిఁగలిసికొనెదను. హర హరా! ఎంతపాపపుఁదలంపు తలఁచితిని! ఇక్కడ రజ్జుబంధముచేతఁ బ్రాణహానిచేసికొన్నపక్షమున నన్నుఁ గొన్న బ్రాహ్మణుని వంచించినదాననగుదును. అంతేకాక యాత్మహత్య నరకహేతువనియుఁ బెద్దలు చెప్పుదురు—ఓపుత్రకా! నన్నుఁ

గన్నతండ్రీ ! నాతొడలమీఁద మోపెడునీశిరము నేకటికి నేలను మోపుచున్నావా? (అని కొడుకును క్రింద దింపి కూలఁబడుచున్నది.)

బాల—(పడకుండఁ బట్టుకొని) అమ్మా! మాగ్భిల్లలోకము. దుఃఖము ద్రింగి ధైర్యము తెచ్చుకొమ్ము.

చంద్ర—(గద్గదస్వరముతో) ఓతండ్రీ ! నేనెట్లు దుఃఖమాపుకోఁగలుగుదును? హా ! కుమారా ! హా ! లోహితాస్యా ! నీపాలిటికి కాలమృత్యుదేవతయయివచ్చిన యీకాలసర్పము నిన్నుఁ గాటువేసినప్పుడు విషమెక్కి సర్వాంగములును నిర్వేదింపఁదల్లడిల్లి నన్నుఁదలఁచుకొని యెంతపరితపించితివోగదా ! హాపుత్రకా ! నిత్యమునుగన్నులయెుందటు సంపూర్ణపూర్ణిమాచంద్రునివలె నీముద్దుమొగము కానఁబడుచుండఁగా భర్తనుబాసి యున్నదుఃఖమును మఱచియున్న నన్నగాధమైన శోకసముద్రములో ముంచి విడిచి పోయితివా? కటకటా! నాకింకదిక్కెవ్వరున్నారు? పుష్పసుకుమారములయిన యీబాహువులతో దేహము చల్లఁగా నన్నెవ్వరింక గౌఁగిలించుకొందురు? తేనియలొలుకు ముద్దుపలుకులతో నావీనులకు విందులు గొలుపువా రెవ్వరు? ఓకుమారా ! నామాటలకు మాఱు పలుకవేమి? (అని పెద్దపెట్టున నేడ్చుచున్నది.)

[అప్పుడు వీరదాసు ప్రవేశించుచున్నాఁడు.]

వీర—(చెవియొగ్గి యాలకించి) ఈశ్మశానభూమిలో నేదో రోదనధ్వనివినఁబడుచున్నది. కంఠస్వరము చూడఁగా స్త్రీకంఠము వలెనున్నది. ఈయర్ధరాత్రివేళ నెవ్వరిక్కడ నేడ్చుచుందురు? నేను బోయి విచారించి వచ్చెదను—ఓమధుదాసా! నీవాయార్తనాదము వినుచున్నావా? ఏమి! మధుదాసుఁడుత్తరము చెప్పకున్నాఁడు! వీఁడు నిద్రపోయినాఁడు కాఁబోలును. ఒకవేళ తనపేరు సార్థకమగునట్లుగా మధుపానముచేసి మత్తెక్కి యొడలు తెలియక పడిపోయినాఁడేమో!

(అని చేరువకుఁ బోయి) మధుదాసా! మధుదాసా! (అని లేపు చున్నాఁడు.)

మధు—(ఉలికిపడి లేచి) నేను జాగరూకుడనయి కావలి కాచుచున్నాను. ఇట్లు స్వామికార్యతత్పరుడ నైయున్నప్పుడు వేయేం డ్లయినను నాకంటికి నిద్రరాదు.

వీర—(తనలో) వీఁడు మత్తుగొని యవ్యక్తప్రలాపములు చేయుచున్నాఁడు. తప్పఁద్రాగియేఁగుండును. (ప్రకాశముగా) మధు దాసా! నీవు మత్తుగొనియున్నావు. సురాపానము జేసినావా?

మధు—అయ్యా! మీపాదములతోడ! నేనీసాయంకాల మొక్కచుక్కయయినను గల్లు చవిగొనలేను. మీరు చేసిన బోధనుబట్టి యిఁక సురాపానము చేయరాదని వ్రతముపట్టి యీ సాయంకాలమునుండి మానుకొన్నాను. నాకున్న యీమత్తుస్వాభా వికముగా నున్నదే కాని కల్లువలనఁ గలిగినది కాదు.

వీర—కానిమ్ము. ఈచేరువ నామట్టివంక నెవ్వరోరోదనము చేయుచున్నారు. నే నక్కడకుఁ బోయెదను. నీవు దీపము వెలిఁగించు కొని శీఘ్రముగా రమ్ము.

మధు—మీ వెనుక నే వచ్చెదను బొండి. నాకాయేడుపిప్పుడు వినఁబడుచున్నది. ఇంతవఱకును నిద్రలో వినఁబడినదేకాదు. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

వీర—(కొంచెము నడిచి) ఈనడిరేయి యిక్కడ రోదనము చేయుచున్నవారెవ్వరు?

చంద్ర—(గద్గదస్వరముతో) అయ్యా! నేనీపట్టణములో నుండెడియొక బ్రాహ్మణుని దాసిదానను: నాపేరు గంగనారి.

వీర—నీవీరీతిగా నర్ధరాత్రసమయమున నొంటిగా నీవరేత నిలయమున కేతెంచి యేల యేడ్చుచున్నావు?

చంద్ర—(గద్గదస్వరముతో) అయ్యా! నాపుత్రుఁడు వీడుఫలస మిత్కాశాహరణార్థ మడవికి వచ్చి యాకులు కోయుచు సర్పదుష్టుఁడై ప్రాణములువిడిచినాడు.

వీర—అయ్యో! పాపము నీ కిప్పుడెంతయాపద వచ్చినది! తరువాత—

చంద్ర—(గద్గదస్వరముతో)పిడుగువంటి యీవార్తను వెంటఁ బోయిన బ్రాహ్మణబాలకులు వచ్చి చెప్పఁగామొదలునఱకినకదళీ తరువువలె నేలఁగూలికొంతవడికిఁదెప్పిఱిలి విలపించుచు, పరాధీననయి యుండుటచేత వెంటనే వచ్చిపుత్రశవమును జూచుట కైన వలనుపడక నాయజమానురాలు చెప్పినపనులన్నియుఁ జేసి యామెనిద్రపోయిన తరువాత నీవిప్రకుమారునితోడుగాఁగొని వెదకుకొనుచువచ్చి యడవిలో నీకుమారుని శరీరము పొడగన్నాను.

వీర—కటకటా! నీయజమానురాలెంతకఠినజిత్తురాలు!(తనలో ఈమెమాటలు వినఁగా నామనస్సులో నాపుత్రుడుపోయినట్లుదుఃఖము కలుగుచున్నది. స్పష్టముగా వినఁబడకపోయినను నాకీమెకంఠస్వరము మున్నెన్నఁడో విన్నదానివలెగూడఁ గొంచెము పొడకట్టుచున్నది.

చంద్ర—(గద్గదస్వరముతో) ఆమెనిద్రనుండి మరలలేవక మునుపే యీబాలునకు దహనసంస్కారముచేసి యిల్లుచేరి మరలఁ బనులు చేయుటకయిపోవలెను. ఓమహానుభావా! నీవు నాకీపనికిఁ గొంతతోడుపడవలెను.

వీర—నీవు కాటిమాడ తెచ్చినావా? సొద పేర్పఁదగినంత చోటికొక్కమాడ యియ్యవలెను. ముందుగా నారెండురూప్యములను నాచేతిలోఁబెట్టి తరువాతదహనవిషయమయి మాటాడుము, అప్పుడగ్నిసంస్కారవిషయమున నేనునీకుఁగావలసినంతసాహాయ్యము చేసెదను.

చంద్ర—ఓదయామయా! నే నిప్పుడునిలు పేదరాలనయి యున్నదానను. నాకిక్కడ నెవ్వరును దిక్కులేరు: కడుపుకూటికయి యొకరికి శరీరమమ్ముకొని పరుల పెట్టుపోతలకు లోనయి పరాధీనురాల నయి యున్నానాకు మాడ ఎక్కడనుండి వచ్చును? గతిమాలి యున్న నన్ననుగ్రహించి యీబాలుని యగ్నిసంస్కారమునకయి బారెడు నేలను ధర్మార్థముగా దయచేయుము.

వీర—నేనిక్కడ మోమాటపడి యూరక సోద పేర్వనిచ్చినపక్షమున నాకు స్వామిద్రోహము సంభవించును. మాడగొనక మూరెడు నేలయైనను నేనియ్యజాలను.

చంద్ర—(కన్నులనీరు కార నార్తస్వరముతో) హాకుమారకా! సార్వభౌమత్వము పొందవలసిన నీకెంతగతి పట్టినది! హాదైవమా! సప్తసముద్ర ముద్రితమయిన సమస్తధాత్రియు నేలుచుండెడు చక్రవర్తిపుత్రుడు బారెడునేలకు నోచుకోకపోయెనుగా! కటకటా! కాలవక్రత నేమనవచ్చును?

వీర—(తనలో) అక్కటా! ఈమెమాటలు శూలములవలె నాటి మనస్సునకు నొప్పి కలిగించుచున్నవి. ఈమె పలుకుబడి చంద్రమతి దానిని గొంత పోలియున్నది. ఈబాలుడు లోహితాస్యుడు కాడుగదా! మధువాసుడు దీపము వెలిగించుకొని వచ్చుచున్నాడు. ఆదీపకాంతి నన్ను శోకాంధకారమున ముంపకుండును గాక! (ప్రకాశముగా) ఓకాంతా! దైవముచేసినదాని కేల చింతిల్లెదవు? వేయేడులు దుఃఖించినను పోయినవాడు మరల లేచిరాడు. నీమేదుపు చూచి దాక్షిణ్యము వహించి నేనిప్పుడు మాడవిడచిపెట్టరాదు. నీమెడలోని మంగళసూత్రమునందున్న బంగారు కాళినివిక్రయించి యైనను మాడతెచ్చి యిచ్చి దహన క్రియకుబూనుము.

చంద్ర—(దుఃఖముతో తనలో) ఇది నా ప్రాణనాథుని కంఠ నాదమువలె నున్నది. కటకటా! నా పాపపు గన్ను లేమి చూడనున్నవో ఓ హృదయమా! నీవింతటి కఠినైనను సహస్ర ఖండములుగాక వజ్ర కాఠిన్యము వహించుచున్నావేమి! ఇతఁడు నా ప్రాణేశ్వరుఁడే కాక పోయినయెడల, పతివ్రతనైన నా కంఠమునందలి శతమానము పరుల కెట్లు నేత్రగోచరమగును? సందేహము లేదు! ఇతఁడు నా ప్రాణవల్ల భుఁడే. దీపపు వెలుతురున స్పష్టమయినది. అయ్యో! ఇప్పుడితఁడెంత మాఱిపోయినాఁడు! (ప్రకాశముగా) ఓ ప్రాణవల్లభా! తొల్లి నీయూరు తలమున నిద్రపోయెడు లోహితాస్యుఁడీ భూమితలమున దీర్ఘనిద్ర పోయియున్నాఁడు చూడుము.

[దీపము పట్టుకొని మధుదాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మధు—ఇదియేమి! నేను దీపము గొనువచ్చుచున్నప్పటికీ వీర దాసుమూర్ఛిల్లుచున్నాఁడు! (అని యాతని పట్టుకొనుచున్నాఁడు)

వీర—(కూలఁబడుచున్నాఁడు.)

చంద్రి—ఓ ప్రాణనాథా! మూర్ఛిల్లకుము. ఓ సార్వభౌమా! నీకిప్పుడీ రుద్రభూమియే రాజ్యమయినదా? ఈ కఠినశిలయే హంసతూ లికాతల్పము లయినవా?

వీర—(తెప్పిఱిలి నిట్టూర్పు విడిచి) హా పాపపు దైవమా! మంద భాగ్యుఁడనైన నాకాపదలమీఁద నీ యాపదలు తెచ్చుచున్నావా? హా! కుమారకా! చేరవచ్చి కౌఁగిలించుకొని నాకొక్కసారి ముద్దియ్య వేమి? ఇఁక నాతొడలమీఁద గూరుచుండి యమృతరస మొలుకు ముద్దుపలుకులతో నాకుఁ గర్ణోత్సవ మెవ్వరు చేయుదురు? నమును దెప్పుడో నాకుఁ దిలోదకము లిచ్చి సుగతి కల్పింతువని బోయి పడియున్న మేమే యీ కన్నీటితో నీకిప్పుడు తర్పణము నమగవానికిఁ వచ్చినదా?

చంద్ర—ఓ ప్రాణనాయకా! ఊఱడిల్లుము. నీవుపుత్ర మోహమునువిడిచి శీఘ్రముగా దహనసంస్కారముజరుగుమార్గముఁ జూపుము. నేను శీఘ్రముగాఁ బోకపోయినయెడల విప్రాంగన నామీఁదఁ గోపపడును.

వీర—(తనలో) అయ్యో! నేనిప్పుడు పుత్రశోకములో మునిఁగి స్వకృత్యమును మఱచుచున్నాను! (ప్రకాశముగా) ఓ యిల్లాలా! నేనిక్కడ సుతుఁడని చూచి మోమోటపడినయెడల ధర్మహానిసంభవించును. కాఁబట్టి నీవిప్పుడు శీఘ్రముగాఁబోయి నీప్రభువైన బ్రాహ్మణుని వేఁడుకొని యొక్కమాడను దెచ్చి కొమ్ము. పొమ్ము.

చంద్ర—హా! తండ్రీ! నిన్ను నేనెట్లు విడిచిపోఁగలను? నవ మాసములుమోచి కని కష్టపడి యిన్నాళ్ళునుబెంచినది నిన్నీ కాశీకా పురమున కప్పగించుకొఱకా! నీ వెప్పుడో సమస్తయిశ్వర్యములను బొంది నన్ను సుఖపెట్టుదు వనుకొంటిని గాని యిట్లగుదువని కల లోను దెలిసికొనఁ జాలనైతిని. జన్మనక్షత్రమును గ్రహఫలమును జూచి జ్యోతిష్కులు దీర్ఘాయుష్మంతుఁ డగుననిరి కాని యల్పా యుష్కుఁడవగుదువని చెప్పరయిరి. ఓ గ్రహతారకాదులారా! మనుష్యులవలె మీరును నన్ను మోసపుచ్చుచున్నారా?

వీర—ప్రాణేశ్వరీ! నీకీ వెఱ్ఱిభ్రమ లేటికి? ఫలాపేక్షతోఁ బలికినజోస్యులమాటలను నమ్మి యిప్పుడేల యున్మాలించెదవు? ... ములెక్కడ? ఫలములిచ్చుటెక్కడ? మన కార్యములఫలమును ప్రకాశ... ...నుభవించునప్పుడు మనదోషములకయి ప్రాణములేని వీయొదుఁఖ ...గ్రహాదిగ్రహములను నక్షత్రములను దూషించిన ఫల ముపు చూచి ... ...పోయి మాడను దెచ్చుప్రయత్నము చేయుము. నీ మెడలోని మ... ...మెనను మాడతె

చంద్ర—(లేచి) నాకు నడవఁ గాళ్ళురాకున్నవి; శరీర మవశ మగుచున్నది ఏమిచేయుదును? నామనస్సున . కున్నచోరవ కాళ్ళకు లేకున్నది. ఓకుమారా! నాపాలిఁటి పుణ్యరాసివలె నీవు కన్నుల యెదుటనుండఁగా నెన్నికష్టములువచ్చినను నిర్విచారముగా నుండఁ గలిగితిని. ఇఁక నెట్లుందును? నీరూప మెక్కడఁజూతును? నీవు వత్తువని యెక్కడ నెదురుచూతును? నిన్నేలాగున మఱచిపోదును? ఇఁకఁ బోకతీఱదు. నాతండ్రీ! పోయివత్తునా? (అని నడుచుచున్నది.)

విప్రబాలకుఁడు—అమ్మా! రమ్ము. నేనుదారి చూపెదను.

చంద్ర—(రెండడుగులు నడిచి) కాళ్ళు ముందుకు సాగుచున్నను మనస్సు వెనుకకు లాగుచున్నది. నే నెట్లుపోఁగలను? ఓయీశ్వరుఁడా! ఈరాత్రి యేలాగుననైన నగ్ని కార్యము జరిగి ప్రభాతముగులోపల నేనిల్లుచేరి బ్రాహ్మణగృహిణికిఁ బరిచర్య చేయునట్లు చేయుము. (అని తిరిగి తిరిగి చూచుచుఁ బోవుచున్నది.)

వీర—(లోహితాస్యునివంకఁ జూచి దుఃఖముతో)

చ. అకటకటా! కుమార! చతురబ్ధిపరీతమహీతలం బకం
టకముగ నేలినట్టిప్రకటప్రతిభుండగుచక్రవర్తి పు
త్రకునకు నీకుఁ బ్రేతవసుధాస్థలిలోపల మూడుమూళ్ళ నే
లకును ముహూర్తకాలము నలంతిస్వతంత్రత లేక పోయెనే? 6

క. పటుతరనానాసుఖచయ
ఘటనాచణచక్రవర్తి గర్భమునమహో
త్కటజననముఁ గనఁ గాంచియుఁ
గటకట నీ కడవిపాలు గావలసెనుగా?

మధు—ఓవీరదాసా! నీవాఁడుదానికన్నను బేలతనమును వహించుచున్నావు! ఆఁడుది ధైర్య మవలంబించి ఇంటికిఁ బోయినప్పుడిక్కడఁ గూరుచుండి వావిడిచి విలపించుట నీవంటిమగవానికిఁ దగునా?

వీర — ఓమధురవాసా! నీవేమో యనుచున్నావు. జల్లెడలోఁ బోసిననీటివలె నీమాటలు నామనస్సున నిలువకున్నవి. హా కుమారా!

సీ. తతహంసతూలికాతల్పంబునకు జేర్చ
మృదుతరదేహమా యిది కుమార
కస్తూరిసొంపెసఁగ నూనె కడు రాచి పెంచిన
ముంగురులా యివి ముద్దుకూన
నవరత్నమయభూషణంబులఁ బెనగొన్న
హస్తంబులా యివి యనుఁగుపట్టి
చిఱుగజ్జియలు మ్రోయఁ జెలువొప్ప
నడయాడుచరణంబులా యివి వరకుమార

గీ. నేలఁ బొరలాడుచును పెనుధూళి గ్రమ్మి
కాలుసేతులుగఁ బడి చెల్వు తప్పియున్న
నీదుకోమలాంగకము లీనేత్రములను
గాంచి యెట్లోర్తు గారాపనుఁగన్నతండ్రి.

సాధు — ఓవీరదాసా! ఊఱడుము. నీ విట్లు దుఃఖపడుచుండఁగా నీభార్య వచ్చినయెడల నామె మఱింత దుఃఖపడును.

వీర — నాకింక నెక్కడిశాంతి? ఓచంద్రమతీ! వివిధచిత్రరత్న భూషణ, భూషితురాలవైయుండు నీకలంకారార్థము కాక పోయినను బాలుని దహనసంస్కారార్థమిప్పటకైన నేఁడొక్క చిన్నవగ లేక పోయెనుగా? ఎటువంటి దివ్యరత్నాలంకారములును నీసుందరాంగముల కలంకారములు కాఁజాలవని నేనెఱుఁగుదును.

ఉ. ఆరమణీయకోమలతరాంగములందిడ హేమరత్నాలం
కారము లేల? కేవలవికారము లౌటకుఁ గాక! కేకికిన్
వేఱుగవన్నెలేల? జిగవీడిన కాకికిఁ గాక? పైపయిన్
బూరిమెఱుగు సేతికి నభోమణికి న్వలె న్మహిన్? 8.

మధు — ఐనను స్వర్ణరూప మయిన ధనమునకంటె సౌందర్య ధనమునే యౌవన మదాంధు లగుదొంగ లధికముగా నాశింతురు. కాఁబట్టిదానిని గాపాడుటకయి పురుషుఁడు సర్వదా కష్టపడవలెను. స్త్రీలును స్వభావచంచలు రాండ్రుసుమా!

వీర — స్త్రీలుచంచలురాండ్రనియుఁగఠినురాండ్రనియుఁబురుషులు నిష్కారణముగా దూషింతురు గాని నిజమది కాదు. స్త్రీలు స్వభావముచేత మంచివారును దయాధిక్యము కలవారు నని యనుభవముచే నెల్లవారికినిఁ దెలియును. కుత్సితులకు మాత్రము వారు కుత్సితురాండ్రుగాఁ గానఁబడుదురు.

ఉ. అద్దములట్ల స్త్రీలహృదయంబులు స్వచ్ఛములౌ యనంగ; నే
పొద్దును జెంతల న్మెలఁగుపూరుషపాళికి నాత్మచిత్తము
ల్పెద్దయు వానిలోఁ బ్రతిఫలించుచు నుంట. నిజాత్మలం బలెం
దద్దయు దోఁచుచుండు వనితాహృదయంబులు వారివారికిన్ 9.

హా! నిర్మలహృదయా! చంద్రమతీ! నామూలమున నీకెట్టిపాట్లు సంభవించినవి.

మధు — వీరదాసా! చూడుచూడు. రాజభటులెవ్వరినో యిటకుఁ దీసుకొనివచ్చుచున్నారు, ముందు వచ్చుచున్నవాఁడు మన పురి పెద్దతలారి యయిన భీమకుఁడు. ఆతనివెనుకను మనస్వామి యయినవీరబాహుని ప్రధానసేవకుఁడు తామ్రాక్షుఁడుకూడ నున్నాఁడు. వారివెనుక దూరమునఁ బౌరజనులు గుంపులుకూడి వచ్చుచున్నారు. అదిగో తూర్పు తెల్లవారుచున్నది.

వీర — ఏమియీవింత! రాజాజ్ఞచేత నెవంరినైన శిరశ్ఛేదము చేయించుటకయి రాజభటులు తీసుకొనివచ్చుచున్నారాయేమి! అప్పుడే తిన్నగాఁ బ్రభాతము కాకమునుపే రా జెవ్వరికి మరణశిక్ష విధించియుండెను? ఆవచ్చెడివారిలో జంద్రమతికూడ నున్నట్లున్న దే? హాదైవమా! ఇప్పుడేమి పాపపుమాట వినవలసివచ్చునో!

[అప్పుడు చంద్రమతిని వెంటఁగొని భీమణుఁడును తామ్రాక్షుఁడును మఱికొందఱు రాజభటులును ప్రవేశించుచున్నారు.]

భీమ—ఓవీరదాసా! ఈపట్టణమేలెడి మహీపాలుని ముద్దుల బాలుని రత్నాలంకారముల నిమిత్తమయి వధించిన యపరాధమున కయి యీయింతిని శిరశ్ఛేదము చేయింపుమని రాజుగారు విధించినారు.

తామ్ర—వీరదాసా! స్త్రీహత్యయని చూడక శిశుహంతకు రాలయినను యీఘోరపాతకురాలిని నీ చేతులతో శిరఃఖండనము చేయుమని మనస్వామి యయిన వీరబాహుఁడు నీకాజ్ఞాపించినాఁడు.

వీర—(నలువంకలుఁజూచి దిగ్భ్రమతో) ఇదియేమి! నేని ప్పుడు కలఁగనుచున్నానా? మేలుకొనియున్నానా? ఇది యింద్ర జాలమా? సత్యమా? నేను హరిశ్చంద్రుఁడ నగుదునా కానా? నా ముందు నిల్చియున్నవారెవ్వరు?

చంద్ర—ఓప్రాణేశ్వరా! దిగ్భ్రాంతిపడి చూచుచున్నారేమి? ఇది స్వప్నముగాదు; యథార్థమే నేను జంద్రమతిని; వీరిప్పుడు చెప్పెడు బాలఘాతినిని నేనే.

వీర—(తేఱిచూచి డగ్గుత్తికతో) శృంగారవనములోని పుష్పలతల పూవులనయినను గట్టిగా గోటితో గిల్లి కోయ సంకో చించుచుండెడు నీవు శిశుహంతకురాలవయితివన్న నే నెట్లు నమ్మఁ గలుగుదునే? ప్రాణేశ్వరీ! నీకుఁ బాపపువిధి యీ యపనింద యెక్కడఁ దెచ్చిపెట్టెనే? డేగను తప్పించుకొని వచ్చి కిరాతుని వలలోఁదగులుకొన్న కలరవాంగనవలె విశ్వామిత్రుని మాయావాగు వలనుండి విడివడిన నీకీ విధిపాశములం దగులుకొనుట సంభవించెనా?

చంద్ర—ఓధైర్యనిధీ! అధైర్యపడకుము. ఓప్రాణనాథా! దొంగ వని నాకిట్టి యపఖ్యాతివచ్చినందునకయి నీ వెంతమాత్ర

మును భేదింపఁబోకుము. ఓపుత్రికా! వీఁడు హంతకురాలి కొడుకని పరిజలాడుకోకుండ నీవుముందుగా నే కాలముచేసికృతార్థుడవయితివా!

వీర—ఓపాపేశ్వరీ! నీకీదురవస్థ యెట్లుసంప్రాప్తమయినదో చెప్పఁగలవా?

చంద్ర—ఇటువంటి నిందకోర్చి ప్రాణములతో నుండగలిగిన కఠినచిత్తురాలను నేను దేనినైనను జెప్పఁగలుగుదును. మూడఁ దెచ్చుటకయి మీ యాజ్ఞగొని పురివంక జనుచుండఁగా నొక్కపురుషుఁ డెదురుపడి "అమ్మా! నీ వెవ్వరవు? ఈచీకఁటిలోనొంటిగా నేపనినిమిత్త మెటకేగెదవు?" అని యెంతో దయగలవానివలెనడిగెను.

వీర—లోకములో ననేకులకు మాటలలో నమృత ముట్టిపడు చున్నను హృదయము కోసిచూచినయెడల లోపల నంతయు విషమే యుండును. తరువాత?

చంద్ర—నావృత్తాంతమంతయు నేను వినిపింపఁగాజాలిపడిన వానివలె 'నటించి నాసహోదరీ! ఇంత యల్పకార్యమునకయి వగ పేటికి? ఈరత్న భూషణములను గొనిపోయి నీయక్కఱఁదీర్చుకొమ్ము' అని నేను వలదనుచుండఁగాఁ గొన్నిస్వర్ణాభరణములని నామీఁదఁ బడవైచి "దొంగదొరికినది రం"డని కేకలు వేసెను.

వీర—దుష్టులుచేసినదోషములకు లోకములో సాధులు బాధ పడుదురు. అటుపైని?

చంద్ర—అప్పుడు యమకింకరులవంటి రాజభటులు దండ హస్తులయి వచ్చి నన్నుఁ బట్టుకొని యీడ్చుకొనిపోయి "నగలనిమి త్తమయి మీముద్దులపట్టిప్రాణములుగొన్న మహాపాతకురా లిదియే" యని నన్ను రాజుమ్రోలనిలిపిరి.

వీర—ఆహా! లోకములో బంగార మెంతచెడ్డది! అది ప్రాణ మిత్రులను బగవారిని జేయును. తండ్రికొడుకులకును, అన్నదమ్ములకును శత్రుత్వముకలిగించును.

క. గరళముకంటెను స్వర్ణమె
ధరలో నెక్కుడువిషంబు తథ్యము కాఁగో
దరవిషముకంటెఁ గనకమె
పొరిగొనుఁ జూ వేయిరెట్లు పురుషుల నెపుడున్

అటుపయిన రాజేమిచేసినాఁడు?

చంద్ర—“స్త్రీ వేషముననున్న యోవ్యాఘ్రమా! ఎత్తిము ద్దాడవలసిన నీమృదుహస్తములతో నీబాలకుని మెడ యెట్లు విఱువఁ గలిగితివి? నీదిబిడ్డలగన్నకడుపు కాదా? నీవు గొడ్రాలవా? బంగారు తొట్లలో మైమఱచి నిద్రించుచున్న పసికూనను జంప నీకెట్లు చేతు లాడెను?” అని రాజు కొంతసేపు నన్ను నిందించి, లేనియపరాధము మీఁదఁ బడినందునఁ నోటమాటరాక నిలుచున్న నన్నీ పెద్దతలారికిఁ జూపి “దీనితో నిఁక మాటాడినఁ బాపమువచ్చును. మృత్యుస్వరూప యయినదీనిని నీక్షణమునా యెదుటనుండి గొనిపోయి తల గొట్టివేయిం పుము” అని యాజ్ఞ యిచ్చెను.

వీర—కోటలుదాటి కవాటములు తెఱచి కావలివాండ్ర నేమఱించి యంతఃపురము చొచ్చి బిడ్డను జంపుటయొక్క స్త్రీకి శక్యమగునా యని విచారింపక, రాజు పాపము కట్టుకొనెను. ‘రాజ్యాంతే నరకంధ్రువ’ మ్మని విద్వాంసులు చెప్పుదురుగదా!

గీ. కనికరము లేక మృగయుఁడు కాననమునఁ
క్రూరశార్దూలముల లేళ్ళఁ గూల్చునట్లు
యవనిలోపల నవివేకియైన నృపుడు
దోషులట్లు నిర్దోషులఁ ద్రుంచుఁ జూవె.

చంద్ర—మరణము వచ్చెనని నా కిప్పుడణుమాత్రమును జింతలేదు. కాని మరణదశయందు నాకిటువంటి యపకీర్తివచ్చెను గదాయని మాత్రము నామనస్సెంతో నొచ్చుచున్నది. అపకీర్తితోడి

బ్రతుకు కంటెను గీర్తినొడిచావే యుత్తమము. ఓప్రాణనాథా! నీవింక జాగుచేయక నీస్వామియాజ్ఞను నెఱవుము.

వీర — (తనలో) పాదమున గ్రుచ్చుకొన్న ముల్లు తీసినను దీయకపోయినను గూడ నొప్పికలుగునట్లే, స్వామికార్యము చేయుటకును జేయకపోవుటకును గూడ నామనస్సు బాధపడుచున్నది. (ప్రకాశముగా) స్వామియాజ్ఞనుల్లంఘ్యమే యయినను సంగరాంగణంబున విపక్షులను శిక్షింప దక్షంబైయుండిన యీకౌక్షేయకంబునం గులాంగనయుత్తమాంగంబు ఖండించి స్త్రీహత్య గొడిగట్టుకొన మనసొప్పకున్నది.

చంద్ర — ఓమనోవల్లభా! లోకములో నీవెఱుంగని ధర్మములు లేవు. భృత్యునకు స్వామియాజ్ఞ చేయుట పరమధర్మము, రాజాజ్ఞచేతను స్వామి నియోగముచేతను భృత్యధర్మమునుబట్టి చేసెడి విధ్యుక్తమైన యీహత్య హత్యకాదు. కాబట్టి మమకారమును దయను నీహృదయమునుండి పాఱదోలి ధైర్యముతో స్వామికార్యమును నిర్వహించి కృతకృత్యుండవు కమ్ము.

వీర — గోమాంసభక్షణకు శంకింపక తలలు నఱకుటయే నిత్యకృత్యముగా గల చండాలునకుం గింకరుడనై యున్న నాకు దయ యెక్కడనుండును! అనాథరక్షణ ప్రశస్తంబులైన యీహస్తంబులింక నెన్ని స్త్రీహత్యల గొడిగట్టుకొన నున్నవో!

చంద్ర — ప్రాణేశ్వరా! స్వామికార్యము నిర్వహించునప్పుడు ఖేదపడరాదు. నన్నును లోహితాస్యునిని మాప్రేమానుబంధమును మఱచి ధర్మమునందే బుద్ధినిలుపుము. ఇదిగో నేను వధ్యశిల నధిరోహించుచున్నాను. నీచేతికరవాలముతో నొక్కవేటున నాశిరము తెగవ్రేసి నన్ను నాపుత్రకునిం జేరం బంపుము. ఓకాశికా! తరుచ్ఛాయను

విశ్రమించి బడలిక తీర్చుకొని యా చెట్టుకొమ్మలనే తెగనఱికినయాం టవికునివలె దానమిచ్చినదోషమునకై యీ మహారాజునింత చేసితివా!

[అప్పుడు విశ్వామిత్రుడు ప్రవేశించుచున్నాఁడు]

విశ్వా—(తనలో) ఇప్పటి వీరియవస్థ చూడఁగా వజ్రకఠిన మయిన నాహృదయముకూడ నీరుగాఁ గఱఁగుచున్నదే. వీరుమాత్ర మింకను జలింపకున్నారు. నామనస్సులో నిప్పుడు వేయి తేళ్లును జెఱ్ఱులును బ్రాఁకుచున్నట్టున్నది. ఇది సాధువుల కకారణముగా బాధ చేసినదానిఫలమా యేమి?

చంద్ర—(భర్తకుఁ బ్రదక్షిణము చేసి నమస్కరించుచు నిలిచి ఓయీశ్వరా! నా ప్రియవల్లభుని మనస్సెప్పుడును ధర్మమునందే వర్తిల్లునట్లును సత్యవ్రతమునుండి యణుమాత్రమును జలింపకుండునట్లును జేయుము. జన్మాంతరములున్నవో, నాకు జన్మ జన్మములయందును సత్యశీలుఁడైన యీ హరిశ్చంద్రనృపాలుఁడే భర్తయగునట్లు ప్రసా దింపుము. మమ్ము బాధించి సత్యసంధులను జేసిన విశ్వామిత్రుని మామూలమున నేకీడును బొందకుండునట్లు చేయుము. (అని వధ్య శిల నెక్కుచున్నది.)

వీర—(ఖడ్గముధరించి చేయెత్తి) ఓయీశ్వరా! స్వామికార్యా నిర్వహణాయత్తచిత్తుఁడనగు నాకిందువలన స్త్రీహత్యాపాతకము కలుగకుండ ననుగ్రహింపుము.

భీష—వీరదాసా! క్షణకాలము తాళు. శిరశ్ఛేదము చేయు టకు ముందు రాజాజ్ఞను ముమ్మాఱు ఘోషింపవలయును—ఓ పౌరులారా! రాజకుమారుని వధించిన నేరమునకై యీసుందరి యిప్పుడు శిరశ్ఛేదము చేయఁబడుచున్నది. చూడుడు.

విశ్వా—(తనలో) ఇఁక నేను పేక్ష చేయఁగూడదు. నా మనస్సు చేయిపెట్టి కలఁచుచున్నట్లున్నది. (ప్రకాశముగా) ఏమి!

కాశీకానగరమంతయు నేఁడిక్కడనే మూఁగినది! ఓపౌరజనులారా! ఏమి చూచెదరు? మీయిండ్లకుఁబొండి. దారియుండి!

వీర—ప్రాణేశ్వరీ! ఇదిగో నాచేతికృపాణముతో నొక్క వ్రేటున శిరఃఖండనము చేయుచున్నాను. మనస్సులో నీశ్వరుని నిలుపుకొమ్ము.

చంద్ర—ఓప్రాణేశ్వరా! నేను సంసిద్ధురాలనై యున్నను. ఓయీశ్వరా! ఓదీనజనసంరక్షకా! ఓయార్తజనశరణ్యా! రక్షింపుము రక్షింపుము రక్షింపుము.

భీమ—ఓపౌరులారా! రాజకుమారుని వధించిన నేరమునకై యీసుందరి యిప్పుడు శిరశ్ఛేదము చేయఁబడుచున్నది. చూడుఁడు.

వీర—ఓప్రాణేశ్వరీ! నిశ్చలురాలవయి యున్నావా? (అని ఖడ్గమును కంఠమున మోపి గురిచూచి నఱకుటకయి చేయి పయి కెత్తుచున్నాఁడు)

విశ్వా—(పరుగెత్తుకొనివచ్చి చేయిపట్టుకొని) ఓరాజా! నీ సాహసమింతటితోఁ జాలును. ఇటువంటి యబలలను జూచినఁ జండాలునకైనను మనస్సులోఁ గొంతదయ కలుగునే! నీకేల కలుగక యున్నది? ఇట్లు స్త్రీలను జంపుమని నీకు నీకులగురుఁడుపదేశము చేసినాఁడా! కులకాంతను వధించుట ధర్మము గాదు. మానుము.

వీర—ఓమానిచంద్రా! నాపూనిక కడ్డమురాక నాచేయి విడిచి స్వామికార్యమును నిర్వహింప నిండు. ఇట్టిసమయమందు మీవంటి మునిసత్తములు చెంత నుండగూడదు. నావిన్నపము మన్నించి శీఘ్రముగా నందేనియు నిజయుంచేయుఁడు.

విశ్వా—ఓరాజా! నన్ను నీవుపరునిగా నెన్నక నీక్షేమమును గోరి చెప్పెడి యీహితము విని కులసతిని జంపక విడువుము,

వీర—ఓమానిచంద్రా! కాలము మంచిది కానప్పుడు ప్రాణబంధువులును గర్భశత్రువులు కావచ్చును; మంచిదినములు వచ్చినప్పుడు పరులును బరమాప్తులు కావచ్చును.

క. మనదేహంబులలోపల
జనియించినవ్యాధి దుఃఖజనకంబును గా
ననములఁ బుట్టినయోషధి
ఘనసుఖజనకంబు నగుట కనమే ధాత్రిన్? 12

కాఁబట్టి మీరిప్పుడు చెప్పినది నాకు క్షేమకరమే కావచ్చును. అయినను నేనీవిషయమున మీయాజ్ఞ వినఁగలవాఁడను గాను.

విశ్వా—ఓరాజా! వెఱ్ఱివాఁడవయి ఖ్యాతికయి కష్టములేల తెచ్చిపెట్టుకొనెదవు? ధర్మము ధర్మమని యేల పలువరించెదవు? భార్యాపుత్రులు పోయిన తరువాత నీఖ్యాతియు నీధర్మమును వచ్చి నిన్ను సుఖపెట్టఁ జాలునా?

వీర—ఓయువిప్రశ్రేష్ఠా! వేయిమాటలేటికి? నాకుసత్ఖ్యాతియే యుత్తమధనము. ధర్మమే సంపూర్ణసుఖదాయకము. నాకీర్తిధనమును దొంగిలినవాఁడు తాను ధనవంతుఁడు కాకపోయినను నన్ను మాత్రము భాగ్యహీనునిగాఁ జేయును.

చ. తెలివిసి మర్త్యుఁ డెప్పుడును దేహపటుత్వము పోకమున్నె వ్యాధులు చనుదేకమున్నె జరదొట్టి మతిభ్రమ రాకమున్నె దొంగల కణుమాత్రము న్వశము గాక నిరంతరసౌఖ్యమిచ్చి యిమ్ములవెలయించు పుణ్యధనముంగడియింపఁగజూడఁగావలెన్.

భార్యాపుత్రాదులు విడిచినను విడువక ధర్మము పురుషునికి శాశ్వతసుఖ మిచ్చును.

విశ్వా—ఎన్నఁడో యప్రత్యక్ష మయినపరలోకసుఖము వచ్చునని ప్రత్యక్షమయిన యిహలోకసౌఖ్యము నేలపోఁగొట్టుకొన

దవు! నీవొక్క యసత్యమాడిన పక్షమున నీపుత్రుని మగల బ్రతి కించి సకలసంపదలతోను భార్యాసహితముగా నిన్ను రాజ్యసుఖ మనుభవించునట్లు చేసెదను.

వీర — దేహము లస్థిరములు; సంపదలు క్షణభంగురములు; దారసుతాదులు బుద్బుదప్రాయులు. ధర్మమొక్కటియే సుస్థిరమయి నది. సమస్తసంపదలతోను తులదూఁగుటకై యసత్యదేవత నాశ్ర యించుటకంటె మృత్యుదేవతనే నేను జేరెదను.

విశ్వా — నీవిప్పుడు దారిద్ర్యకష్టము లనుభవించుచున్నావు గదా! ఆలోచించుకొమ్ము.

వీర — దరిద్రుఁడ నైతినని నా కావంతయుఁ జింతలేదు, నే నెప్పుడును సంపదలతోఁ దులఁదూగుచునే యుందునేని నాసత్యనిత్యత లోకమునకు వెల్లడి కాకయే యుండును. చందనవృక్షము నఱుకఁ దీసినప్పుడే సువాసన బయలు వెడలునట్లుగా, కష్టములు వచ్చి నలు గుడు తగిలినప్పుడే మంచివారికి సౌజన్యము వెల్లడియగును.

చ. సిరులను జూచియుఁ దురగసింధురసాధనుతాళిఁ జూచియుఁ
గరువము పొందుచుండ్రు కనుఁగానక మూఢులు ధారుణీస్థలిన్;
మరణము సంభవించునెడ మాత్ర మవేమియు లేనివారలై
ధర నధికారు లయ్యెదరు తా మొకనిల్వెడు భూమికేయిటున్.

చ. ప్రజ లెఱుఁగంగ లేరు సిరిపట్టుల మర్త్యులతారతమ్యముల్;
నిజమును దాము గన్గొనఁగ నేర్తురు ధారుణిఁగోనిమానవ
వ్రజముల నెవ్వరుత్తములొ వారొనరాని యయోగ్యు లెవ్వరో
రుజల శరీరములొరఁగి రూపఱుపిమ్మట మెల్ల మెల్లగన్. 15

విశ్వా — (తనలో) ఇఁక నీతఁడు నామాయలకు లోఁబడఁడు. వేయేండ్లు తలక్రిందుగాఁ దపస్సుచేసినను నే నితనిచేత బొంకింప లేను. ఇంతటితో నీతనినిగష్టములనుండి గట్టెక్కింపవలెను. (ప్రకాశ

ముగా) ఓరాజేంద్రా! నీచిత్రచరిత్రము చూడఁగా నాశ్చర్యక రమగుచున్నది. నీసత్యసంధతకు మెచ్చినాను. బొంకెఱుఁగనివాఁడ వన్ని లోకములలో నీవొక్కఁడవే.

వీర—ఓమహేంద్రా! మీవలన నే నిప్పుడు కృతార్థుఁడ నయినాను.

విశ్వా—నావలనఁ గాదు. ఈశ్వరానుగ్రహము వలనను నీ నిత్యసత్యమువలనను కృతార్థుఁడవయినావు. తనలోని పంచేంద్రియములను జయించినవాఁడు సర్వలోకములను జయించినవానికంటె నధికుఁడు. నీవు సప్తద్వీపములను జయింపఁగలుగుట యీ యింద్రియ జయముతో సమానమని యెంచను. నీసత్యశీలతను బరీక్షింపఁగోరి మీయెడలఁ జేసిన యపరాధము లన్నిటికిని నన్ను క్షమింపవలెను.

వీర—మీరు నాకు మహోపకారము చేసినవారు గాని నా యెడల నపరాధమేదియుఁ జేయలేదు. తల్లిదొప్పుల నొందియుఁ బుత్రజన్మమునకు సంతోషించునట్లుగానే బహుబాధలు పొందియు మీవలన నాకుఁగలిగిన సత్యసంతానలాభమునకు నేనమితానందము నొందుచున్నాను. మనసులో మీరేమియు సంకోచపడబోకుడు.

విశ్వా—నీ వీ పతివ్రతశిరోమణి యయిన చంద్రమతిని శిరశ్ఛేదము చేయకుండినయెడల నేనప్పుడు మనస్సంకోచము లేక యుందును.

వీర—రాజశాసనమును స్వామియాజ్ఞను నేనెట్లు మీఱఁ గలుగుదును? అట్లుమీఱుట ధర్మమగునా? సకలధర్మవేత్తలైన మీరు నన్నధర్మముచేయుమని బోధింతురా?

విశ్వా—నాప్రార్థన చెల్లించి క్షణమాత్ర మీపని నిలుపుము. ఈలోపలరాజువచ్చి యీమెను మన్నింపఁగలఁడు.

వీర—మీయాజ్ఞ యవిలంఘ్యముగాన క్షణకాల మాగెదను. (కత్తి విడుచుచున్నాఁడు.)

విశ్వా—పాముకాటుచేత విషమెక్కి మూర్ఛిల్లియున్న నీకు మారుకింతలోఁ జికిత్స చేయుదము రమ్ము. (అని లోహితాస్యుని నోటిలో నేదో వేయుచున్నాఁడు.)

లోహి—(మూర్ఛ తెలిసి లేచికూరుచుండి) హా! ఎంతనిద్ర పోతిని! నన్నిక్కడ కెవ్వరు తెచ్చినారు? ఓవిప్రబాలకులారా! దర్భలు సమిధలువిఱిచినారా?

వీర—(సంతోషముతో) ఏమి నాకన్నులు చేసికొన్న భాగ్యము! చంద్రమతికూడ రాజదండనమునుండి విముక్తురాలయిన గదా నాకుఁ బుత్రుఁడు పునర్జీవితుఁడైనాఁ డన్న సంతోషము పూర్ణమగును!

గీ. నారికేళంబుపయి నొక్కసారిగాను
వారిదము నీరుఁ బిడుగున పంపునట్లు
విధియు సంతోషదుఃఖము ల్వేలయునాకు
నొక్కసారియె కూర్చుచునున్నవాఁడు

భీమ—ఓహో! కాశీపురాధీశు లయిన ప్రతాపచంద్రదేవ మహారాజుగారు మంత్రులతోడఁ గూడ నిక్కడకు విజయముచేయుచున్నారు.

[అప్పుడు రాజు మంత్రులతోఁ గూడఁ ప్రవేశించుచున్నాఁడు.]

ప్రతా—ఓయతిచంద్రా! పుత్రశోకములో మునిఁగియున్న వాఁడనైనను దేవరయాజ్ఞ యైనదని వచ్చినాను. శిష్యుని కేమి యాజ్ఞ?

విశ్వా—సుపుత్రావాప్తిరస్తు!—ఓనక్షత్రకా! నక్షత్రకా!

నక్ష—స్వామీ! వచ్చుచున్నాను (అని రాజపుత్రునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

విశ్వా—నక్షత్రకా! పుత్రుఁడు మరణమునొందెనని దుఃఖించుచున్న రాజుకడకుఁ గొనిపోయి యీ బాలకుని సమర్పించి యాతని సంతోషపరవశునిం జేయుము.

ప్రతా—ఆహా! ఏమి నాభాగ్యము! చచ్చెననుకొన్న నా ముద్దుల బాలకుఁడు మరల సజీవుఁడై నాకు నేత్రోత్సవము చేయుచున్నాఁడు! అయ్యో! శిశుహంతకురాలని యొకయిల్లాలిని నిష్కారణముగాఁ జంపించి పాపము కట్టుకొంటినిగదా!

విశ్వా—రాజేంద్రా! పరితాపపడకు. ఆ నిరపరాధిని సజీవురాలై యున్నది.

ప్రతా—ఇప్పుడు నాయుల్లము చల్లబడినది.—ఓభీషణా! ఆనిర్దోషురాలిని శిరశ్ఛేదము చేయక విముక్తుని యిప్పుడ వీరబాహుని కాజ్ఞాపింపుము.

విశ్వా—ఆమె యెవ్వరనుకొన్నావు? నిత్యసత్యవ్రతుఁడైన హరిశ్చంద్రుని యిల్లాలైన చంద్రమతీదేవి. ఆపతివ్రతాతిలక మిక్కడ నేయున్నది. వీరబాహునియొద్ద వీరదాసను నామముతోఁ గొలువు చేయుచున్న యీమహానుభావుఁడు హరిశ్చంద్రుఁడు.

ప్రతా—ఇప్పుడు వీరి దర్శనముచేత నాకన్నులు సఫలములయినవి. (అని లేచి హరిశ్చంద్రునిఁ గౌఁగిలించుకొనుచున్నాఁడు.)

వీర—పిచ్చుకుంటుమీఁద భాగీరథి పాఱినట్లు మీరయాచితముగా దర్శనమిచ్చుటచేత మీరన్నవాక్యములు నేననవలసినవిగాని మీరు సెలవియ్యవలసినవి కావు. మీరు పెద్దలు; పూజ్యులు మీదర్శనలాభమువలన నేను జరితార్థుఁడ నయినాను.

ప్రతా—ఒకవేళ వయస్సుచేత నేనే వృద్ధుఁడ నైనను బుద్ధిచేతను గుణసంపదచేతను మీరే వృద్ధులు, మీరు దంపతులిరువురును గొన్నిదినములు మాయింట నతిథులుగా నుండి మా

గృహము పావనము చేయువలెను. ఓమహేంద్రా! శిశుహంతకు రాలన్న యపనింద సాధ్వీశిరోరత్నమయిన యీచంద్రమతి కెట్లు వచ్చినది?

విశ్వా—ఓరాజేంద్రా! చెప్పెదనువినుము. ఈహరిశ్చంద్రుని సత్యపరిశీలనార్థమై నేనే యీనక్షత్రకుని నియమింపగా నితఁడొరు లెఱుఁగకుండ రాజాంతఃపురముచొచ్చి యుయ్యెలలో నిద్రించుచున్న యీబాలకు నెత్తుకొనివచ్చి దాఁచి యీయర్భకుని శరీరమున నున్న నగలను గొనిపోయి యూరివంకఁ బోవుచున్న యీమెయొడిలో వైచి, దాదులుబిడ్డనుగానక మొత్తుపెట్టినపిమ్మట వెదకుచు బయలుదేఱిన తలారులకీమెను సొమ్ముతోఁ బట్టియొప్పగించెను. ఈయనసత్యసంధత నేఁడు స్థిరపడినదిగదా! సర్వదేవతాసమక్షమున నేను జేసినప్రతిజ్ఞను నేనిప్పుడు చెల్లించుకొనెదను, (అనియాకాశమువంకఁజూచి) ఓమహేంద్రా! నీవిక్కడఁ బ్రత్యక్షముగుము. ఓకాశీవిశ్వనాథా! నీవిందు వచ్చి సాక్షిభావము వహింపుము. ఓవశిష్ఠా! నీశిష్యునిమహిమను జూడ రమ్ము!

[ఇంద్రుఁడును, ఉమతో శివుఁడును ప్రవేశించుచున్నారు.]

ప్రతా—ఆహా! ఏమి ఈభాగ్యము? ఇప్పుడు హరిశ్చంద్రుని మూలమున నందఱికిని దేవతాసాక్షాత్కారము కలుగుచున్నది.

విశ్వా—ఓపార్వతీశా! నీకు నమస్కారము. ఓమహేంద్రా! నా యెదుటకురమ్ము. ఓవశిష్ఠా! నీమాట గెలిచినది. నీశిష్యుని బొంకింపలేక నేనే యోడిపోయినాను. ముల్లోకములలో నీహరిశ్చంద్రుఁ డొక్కఁడే నిక్కమైన సత్యవాది యని యామహేశ్వరాదుల సమక్షమున నేనే ముమ్మాటికిని ఘోషించుచున్నాను. ఈతఁడికమీఁదట లోకములో సత్యహరిశ్చంద్రుఁడని ప్రఖ్యాతి చెందఁగలఁడు. ఓసత్యహరిశ్చంద్రా! ఇటురమ్ము నే నింద్రసభలోబలి

కినప్రతిన తప్పకుండఁ దొల్లి నేను జలాశనుఁడనై హిమవత్పర్వతమునఁ జేసినతపస్సులో నీకు సగము ధారపోయుచున్నాను. గ్రహింపుము. (అని చేతిలో ధారపోయుచున్నాఁడు.)

ఇంద్రు—విశ్వామిత్రా! నీవు పలికిన ప్రతిజ్ఞలో నొకదానినే చెల్లించినావు.

విశ్వా—ఇదిగో కడమదానినిగూడ నిర్వహించుచున్నాను. సత్యహరిశ్చంద్రా! నీరాజ్యమును నీకిచ్చుచున్నాను. నాయాజ్ఞచేత నీవు నీయిచ్చవచ్చినన్నాళ్లీభూమి యేలినతరువాత స్వర్గములో నీయిందుని యర్ధాసనమందుండిసుఖ మనుభవింపుము. ఓమహేంద్రా! నీ కిది సమ్మతముగా నున్నదా?

ఇంద్రు—ఇటువంటి సత్యసంధునితోఁ గలిసి యర్ధాసనమునం దధివసించు భాగ్యముకలుగుటచే స్వర్గమును నేనును గూడ ధన్యత నొందుచున్నాము.

విశ్వా—కాలకౌశికుఁడును వీరబాహుఁడును వెనుక నిలచి తా మిచ్చినధన మెక్కడఁ బోవునో యని తహతహపడుచున్నారు. వీరివలన నేను గైకొన్నధనమును మరల వీరి కిచ్చివేసి యీదంపతులను దాస్యమునుండి యీక్షణమ విముక్తులనుజేయుచున్నాను. ఓనక్షత్రకా! వీరిధనమును వీరి కిచ్చివేయుము.

నక్ష—మహాప్రసాదము. కాలకౌశికా! వీరబాహుడా! మీరిద్దరును నావెంటరండు. మీధన మిచ్చెదను.

(అని వారిని గొనినిష్క్రమించుచున్నాఁడు.)

శివు—ఓహరిశ్చంద్రా! మీరు వధూవరు లుభయులును నాయెదుటకు రండు. మీసత్యవర్తనము నాకాశ్చర్యము పుట్టించుచున్నది.

హరి-(భార్యతో వచ్చి యెదురనిలిచి చేతులు జోడించి) ఓ దేవా! నమస్కారము.

సీ. జయజయ యంబరచరవాహినీజూట
జయచంద్రమఃకళాసత్కిరీట
జయజయ పాతకజ్వాలనామలకృపీట
జయ వినిర్ధళితకుంజరనిశాట
జయజయ పావకనయనాంచితలలాట
జయ నివసద్రౌప్యశైలకూట
జయజయ వ్యాఘ్రరాట్కుసనిర్భరాఖేట
జయధృతనీరజాసనకరోట

గీ. జయ భువనపావనామ్నాయసంఘఘోట
జయ నిశాసమయచరత్స్మశానవాట
జయ సతతభూషణీకృతసర్పఝాట
జయ కనద్రిచిరామోఘశంబఖేట. 17

శివు—ఓ రాజేంద్రా! నీవు మమ్ము స్తుతింపనక్కఱలేదు. నీభక్తితాత్పర్యములను మే మెఱుఁగుదుము. మావలన నీ కేమి కావలెనో వరము కోరుము.

హరి—దేవరకటాక్షసంపాదనము తప్ప నాకు మఱేమియుఁ గోరిక లేదు. అయినను దేవరయాజ్ఞాపించినప్పు డేదో కోరకయూరకుండరాదు.

ఉ. దేవ! మదీయమానసము దేవరమీఁదను ధర్మమందునుర్
భావిని నిల్చునట్లుగను, భ్రాతలఁ బోలె జనంబుల న్సదా
భావన చేసి తోడ్పడుచు వర్తిలునట్లును; జీవహింసకుం
బోవక యుండునట్లును ప్రభుప్రవరా! వర మిమ్ము సత్కృపన్ 18

శివు—వత్సా! నీవు కోరినకోరికల నిచ్చినారము.

పార్వతి—ఓసాధ్వీశిరోమణీ! నీ కేమయినఁ గోరిక కలదా!

చంద్ర—అంబా! నామన సెప్పుడును ధర్మమునందే వర్తిల్లు నట్లును, ఈశ్వర భక్తిని బతిభక్తిని పాయకుండునట్లును, జేయుము.

పార్వ—నీ కీ వరమును బ్రసాదించినాము.

శివు—ఓహరిశ్చంద్రా! నీకు మఱేమయినఁ గోరికకలదా?

హరి.—

చ. అనయము భూమి సస్యవతియై ఫలియించును గాక! మానవుల్
ఘనతర నీతివర్తనలఁ గాంతురు గాక సుఖంబు! దుష్టవ
ర్తనులు సమర్థుఁడనల దౌష్ట్యముమాని చరింతురు గాక! భూ
జను లెటనున్న మానక రజమ్ము గ్రహింతురుగాక యెప్పుడున్ 19.

(అందఱునిష్క్రమించుచున్నారు.)

---

సంపూర్ణము.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రపరము.

శ్రీ

# దక్షిణగోగ్రహణము

ఇది

**కందుకూరి వీరేశలింగముచే**

రచియింపఁబడినది.

మూఁడవ కూర్పు

ప్రకాశకులు:

**హితకారిణీసమాజము**

రాజమహేంద్రవరము.

శ్రీరామ ముద్రాక్షరశాలయందు ముద్రితము

రాజమహేంద్రవరము.

1948

## ఈనాటకమునందు వచ్చుపాత్రములు

సుశర్మ:—త్రిగర్తాధీశుఁడు

సత్యసేనుఁడు:—సుశర్మ తమ్ముఁడు

విక్రమభుజుఁడు:—త్రిగర్త సేనాధిపతి

ఘటోదరుఁడు, నిపుణకుఁడు:—సుశర్మయొక్క భటులు

ధనగుప్తుఁడు:—విరాటరాజు ప్రియభృత్యుఁడు, వైశ్యుఁడు

విరాటరాజు:—మత్స్యదేశపురాజు; విరాటనగరాధీశుఁడు

వామనశర్మ:—పురోహితుఁడు

సుధేష్ణాదేవి:—విరాటరాజు భార్య

ఉపచారిక:—చేటిక

కంకుభట్టు:—ధర్మరాజుయొక్క మాఱుపేరు

వీరసేనుఁడు:—విరాట సేనాధిపతి

దామగ్రంథి:—నకులుని మాఱుపేరు

తంత్రీపాలుఁడు:—సహదేవుని మాఱుపేరు

వలలుఁడు:—భీముని మాఱుపేరు

పురుషోత్తవర్మ:—విరాటనగరపు కాపు

వజ్రబాహువు:—పురుషోత్తవర్మ కొమారుఁడు

దౌవారికుఁడు, సూతుఁడు, భటులు, సైనికులు &c.

శ్రీ

# దక్షిణగోగ్రహణము

## ప్రథమాంకము

రంగము — విరాటనగర సమీపారామము.

[సుశర్మయు, తమ్ముఁడగు సత్యసేనుఁడును, సేనాధిపతి యగు విక్రమభుజుఁడును, భటులును ప్రవేశించుచున్నారు]

సుశ — ఓ సేనానీ! విక్రమభుజా! మనదుర్యోధనమహారాజుగా రన న్యసామాన్య మేధావంతులుసుమా. రారాజుగా రూహించిన ట్లొక వేళఁ బ్రచ్ఛన్నవేషు లయి పాండవు లిం దుండిన నుండవచ్చును. నీ వేమి తలఁచెదవు?

విక్ర — ఉండనేవచ్చును. ఆమహారాజుగారిది కుశాగ్రబుద్ధి గదా!

సుశ — అందుకు సందేహ మేమి? భీష్మద్రోణకృపాశ్వత్థామాది ధీమంతు లంద ఱుండఁగా నిండుసభలో దుర్యోధనమహారాజుగారి కొక్కరికిఁ దక్క మఱి యెవ్వరికయిన నీయాలోచన తోఁచినదా?

గీ. అవగింజంత యవకాశ మబ్బునేని,
యతఁడు కొండంతయూహ చేయంగఁ గలఁడు;
పనిని దూర మాలోచించి కనుటగాదె
శేముషీమంతులకును విశేష మెందు?

విక్ర — ఒకానొక యబలమూలమున సింహబలుఁ డొక్క యపారబాహుబలునిచే నిహతుఁ డయ్యె నన్నవృత్తాంతశ్రవణమాత్రమున నేకదా సుయోధనుఁ డంతయూహ చేయఁగలిగెను! ఆయూహయే సత్య మయ్యెనేని, అతనిబుద్ధిసంపద యెంతయైనను శ్లాఘింపఁదగినదే.

సుశ — నిస్సందేహముగా.

సీ. బలుఁడు శల్యుఁడు సింహబలుఁడు భీముండును సమబాహుబలు లిలా [చక్రమునను
చంపిన నొండొరుఁ జంపంగవలెఁ గాని పరు లేరు వారిఁ జంపంగ లేరు
శల్యుండుహలియును జాలదవ్వుగనుంటఁ జంపియుండరలకీచకునివారు
కావున భీముండె గంధర్వుఁ డనుపేర నడిరేయి నాతనిఁ గెడపియుండు
నంతె కాకుండఁ దా నొక్క యింతికొఱకు
సింహబలుఁ డీల్గె నని జనుల్ చెప్పుకొనుట
కతన నయ్యింతి ద్రౌపది కాఁగనోపు
ననుచు నీరీతి నూహించె నవనిభర్త.

విక్ర — మేలు మేలు! అది మిక్కిలి చక్కనియూహ.

సుశ — కానిమ్ము.

ఉ. ఎవ్వరు చంపి రేమి? దివి కేగెను గీచకుఁ డంతెచాలు; నా
కివ్వడిఁ బండు వయ్యె నలహీనుని దుర్మరణంబు వింటచేఁ;
జివ్వను భంగపుచ్చె మును చేవమెయిన్ ననువాఁడు క్రూరుఁడై
యవ్వెడఁగు న్వధించి నతఁ డాప్తుఁడునా కతఁ డెవ్వఁడేనియున్.

సత్య — అన్నయ్యా! కురుమహీకాంతుఁ డూహించినట్లు సింహబలు నంతకాంతికంబున కంచినవాఁడు భీమసేనుఁ డయినను, నీ కాతఁ డాప్తుఁడే యగునా?

సుశ — (కొంచె మాలోచించి) అవు నాప్తుఁడే యగును. తమ్ముఁడా!

క. మన మియ్యెడ కరుదెంచుట
యనఘా! పాండవుల నరసి యడవికి వారిన్
బనుచుటకొఱకును గాదే
ఘనసమయాతిక్రమంబు కనఁబఱిచి వెసన్?

కీచకాంతకుఁ డిప్పుడు భీముఁడే యయి బయలఁ బడునేని, ప్రతిజ్ఞాభంగ మును జెప్పి యెప్పటియట్ల యప్పాండవుల మరల నడవులకుఁ బంపి మనము స్వామి కార్యనిర్వహణ ధుర్యులము కాఁ గలుగుట కతఁడు తోడుపడినవాఁ డౌను గాన మన కట్టిమహోపకారి యాప్తుఁడు గాక యన్యుఁ డెట్లగును?

సత్య — అది సత్యమే కాని పాండవులే యిం దుందు రను కొందము. అప్పుడు—

క. పాండవమహాబ్ధి వెలువడి
చండతరవిరాటవాయు సంప్రేరితమై
నిండి యతివేలముగ మన
దండుల వడి నాక్రమింపఁ దరమే నిలుపన్?

సుశ — మన మప్పుడును భయపడవలసినపని లేదు. మనల నిక్కడకుఁ బంపు నప్పుడు కురురా జన్నమాట వినలేదా?

ఉ. ఏసరు పాండవాంబునిధి నీఁదుట దుర్భర మయ్యె నేని, దు
శ్శాసన వాయుసంగతిని శాంతనవాది సునావికేంద్ర రా
ధాసుత కర్ణధారసహితం బగు కౌరవరాజపోత ము
ల్లాసముతోడ వచ్చి మనలన్ సరగం దరిఁ జేర్చ కుండునే?

సత్య — కురురాజు కౌరవయోధులతో రేపుగదా యిక్కడకు వచ్చును?

క. మన మీదినమునఁ బసులన్
ఘనజవమునఁ బట్టఁగానె కని కౌంతేయుల్
చనుదెంచి తాఁకిరేనియు
ననిలోన న్వారి గెలువ నగునే మనకున్?

ఆభీమార్జునులపేరు తలఁపునఁ బొటిన నాగుండె లిప్పుడు తటతట కొట్టుకొనుచున్నవి.

మ. బకకిమ్మీరహిడింబముఖ్యదనుజవ్రాతంబు నెవ్వాఁడు మ
త్తకరీంద్రంబులఁ ద్రుంచు సింహముగతిన్ ద్రుంచెఁ; నెవ్వాఁడు యా
చకబంధున్ భుజవీర్యసింధుని జరాసంధున్ హతుం జేసె; నా
ప్రకటస్థేముని భీమునిం దలఁప నా ప్రాణంబు భీతిల్లెడున్.

మ. పటుశౌర్యోన్నతి నెక్కటిం గడఁగి దేవవ్రాతముం గూల్చి దు
ర్ఘటమౌ ఖాండవదాహము న్సలిపె; నాగంధర్వయూథంబు ను
ద్భటశక్తిం బరిమార్చి కాచెఁ గురుభర్తన్ ఘోషయాత్రన్; మహో
త్కట తేజోనిధి యైన యానరునకున్ ధాత్రి న్నరుల్ లెక్కయే?

సుశ — ఓ మనుజా! నీవాశంక పెట్టుకోకు. వారజ్ఞాతవాససంవత్స రాంతములోపల బయలఁబడి ప్రతిజ్ఞాభంగ మగునట్లుగా మనతో యుద్ధము చేయవత్తురా? తమ్ము లొకవేళ తొందర పడుదు రనుకొన్నను, ధర్మ బాహ్య మయినపనికి ధర్మరా జెన్నఁడయిన నొడఁబడునా?

గీ. తమ్ము లొకవేళ నున్మత్తదంతు లట్లు
విడివడిన, ధర్మజాంకుశ విహతిచేతఁ
దారు మరలింపఁగాఁ బడి ధర్మపాశ
బద్ధు లగుచుఁ గ్రమ్మఱఁ గానపాలు కారె?

కాఁబట్టి మనము ముందుగాఁ బాండవులవృత్తాంతమునే విచారింతము. దుర్యోధనమహారాజు నాజ్ఞయు మన కట్టిదేకదా? మీరు పాండవులు సుండీ యని మనము నిరూపించినతోడనే వారు మాఱుమాటాడక తత్క్షణ మరణ్యమార్గము పట్టుదురు. ధర్మజుఁడు ధర్మము తప్పుటవలన లభించెడు నింద్రపదవి యైననఁ దృణకణమువలె నిరసించును.

సత్య — ధర్మనందనుఁడు ధర్మ మెప్పుడును దప్పఁడని నీకు దృఢ నిశ్చయ మున్నదా?

సుశ — సూర్యుఁడు నేఁడు సహజతేజోవంతుఁడై పూర్వదిక్కున నుదయించునని యెంత నిశ్చయ మున్నదో యంత నిశ్చయ మున్నది. సూర్యుఁడు నైజతేజము విడుచు నని నీ కేమయిన సందేహ మున్నదా?

ఉ. భాస్కరుఁడు నైజతేజమును బాసిన, సీతకరుఁడు వేడిమిం
బూనిన, నగ్ని చల్లపడిపోయిన, వార్ధి జలంబు పోరతల్
మానిన, వ్యాఘ్రసింహములు మాంసము తింటఁ బరిత్యజించినన్,
గాని యిల ధర్మనందనుఁడు ధర్మము తప్పఁ డొకించుకేనియున్.

సత్యా—అజ్ఞాతవాససంవత్సర మీనాటికే కడచిన దేమో! అప్పుడు పాండవుల నెవ్వ రడ్డుపెట్టఁ గలరు?

సుశ—అజ్ఞాతవాసాబ్దమింకను నతీతము కాలేదు. దాఁటిపోయిన యెడలఁ బాండవుల వెదకించుటకు దుర్యోధనమహారాజు అంత మతిహీనుఁడా?

సత్యా—అట్లయిన మనము పాండవాన్వేషణప్రయత్నము నే చేయుదము.

సుశ—విరాటునిగర్వ మడఁపక ముందుగా మన కాపని సాధ్యము కాదు. కాఁబట్టి మనము ముందుగా శత్రువైన విరాటుని పశుగణమును వస్తుసంపదను జూఱగొందము.

సత్యా—మమ్ము దేవరచిత్తమువచ్చినపనికి నియోగింపవచ్చును. మే మందఱము భవదాజ్ఞాధీనమానసుల మయి వేచియున్నాము.

సుశ—(ప్రయివంకఁ జూచి) ఓవిక్రమభుజా! తూర్పు తెల్లవాఱు చున్నది. మనచేఁ బంపఁబడినచారు లింకను రాలేదు. రాత్రి యంతయు నడిచిన మార్గాయాసముచేత సేనలు నిద్రకుఁ బడినవి. సేనలను లేపి యుద్ధసన్నద్ధము లగునట్లు చేయుము.

విక్ర—తమయాజ్ఞాప్రకారము చేసెదను.

సుశ—మనజాడ కనిపెట్టి యెవ్వరును శత్రువులకుఁ దెలుపక మునుపే మన మాకస్మికముగాఁ బోయి గోగణమునుబట్టి యడ్డువచ్చిన గోపాలురఁ బాఱఁద్రోలి పశుబృందమును ముందు కొంతసేనతో సత్యసేనుని వెంటఁ బంపి వేయవలెను. వెనుక మన మనుకూలస్థలమున సేన

లను బన్నించి నిలిచి పశువిమోచనమున కై వచ్చెడి విరాటాదుల నోడించుటకై సంసిద్ధుల మై యుండవలెను.

విక్ర—అలాగుననే యుందము.

సుశ—విరాటుని నోడించి యాతనిన గెప్పుడు చూతుమో యని నామనస్సెంతో తహతహపడుచున్నది. పూర్వ మాతఁడు పఱచిన భంగపాటు నాహృదయము నిప్పటికిని శల్యమై వేధించుచున్నది. వేగులవారు వచ్చెడులోపలనే మన దడములను నడిపించుకొని పోయి గోవులను బట్టుదమా?

విక్ర—స్వామీ! తొందరపడఁబోకుఁడు. మనచేఁ బంపఁబడిన నిపుణకుఁడు మొదలగువారు దేశకాలానుకూల్యములను విచారించుకొని యింతకు వచ్చుచుందురు. మనకిది క్రొత్తదేశము; మార్గ మడిగినను జెప్పువారు లేరు; మర్మ మెఱుఁగక శత్రుమధ్యమున సాహసించి పనిచేసినచోఁ దరువాతఁ బశ్చాత్తాప పడవలసివచ్చును. విరటుఁడును మన కశక్యసాధ్యుఁడు కాఁడు. అతనిబలవిక్రమాదులను మున్ను దేవర కొంత యెఱుఁగుదురుగదా?

సుశ—(తిరస్కారముతో) విరాటుని గిరాటుని నాముందఱ నొకపౌరుషశాలినిగాఁ జెప్పకుము. అతనివిక్రమము నే నెఱుఁగనిది కాదు. అతఁ డొకనాఁడి మొట్లో దైవికముగా రణజూదమున నాపయి గెలుపు కొనుట నీ వొకమహాకార్యముగా నెంచుచున్నావు. అదియు గెలుపగుటను సింహబలునిచే నైనదిగాని స్వశక్తిచేత నైనది కాదు.

సత్య—అట్లయిన సింహబలుఁడు మరణము నొందినందున కై మన మిప్పుడు సంతోషపడవలెను.

సుశ—సింహబలుఁ డున్న నేమి? ఆసింహబలుఁ డయినను గేకయ సాస్వాలను దోడు చేసికొని వచ్చి నాతోఁ బోరి యల్పజయమును బొందఁ గలిగెనుగాని యప్పు డీవిరాటుఁడును సింహబలుఁడునుమాత్రమే

వచ్చియుండినయెడల నే నాఖురపుటను కౌటిల్యుని కాలిక్రిందను జీమలను వలె నలిపివేసి యుండనా?

ఉ. సింహబలుండు నేఁ డిచట జీవముతోడుత నుండెనేని, నే
రంహగతిం గనద్గద కరంబునఁ దాలిచి దంతిమీఁదికిన్
సింహము దూఁకుకైవడిని జెంగున దూఁకి, గదాహతి న్వడిన్
సంహరణంబొనర్చి నిమిషంబునఁ దీర్పనె తొంటివైరమున్?

విక్ర — ఇప్పుడు దేవరవారు స్వబలమునం దతివిశ్వాస ముంచి పరబలమును దిన్నఁగా గణింపకున్నారు. మనసేనలు మార్గాయాసముచే నలసి——

సుశ — తాళుము, తాళుము. వాకిట నేదో కలకలము వినవచ్చుచున్నది. ఆలకింపుము.

[తెరలో]

గీ. బ్రతికియున్న నిన్ను రణరంగమున మున్ను
సింహబలుఁడు గెలిచె శితశరాళిఁ;
జచ్చియున్న యతనిఁ జప్పిడిమాటల
గెలిచె దిప్పుడు నీవు గృహమునందు.

సుశ — (కోపముతో) విక్రమభుజా! ఆ ప్రలాపము విన్నవా? ఆయువు మూడిన వాఁ డెవ్వఁడో చాటుననుండి నిర్భయముగా నన్నే యాక్షేపించుచున్నాఁడు! వాఁడు ప్రాణము లొల్లఁడు కాఁబోలును! ఈరాజద్రోహి మనపరిజనులలో నెవ్వఁ డయి యుండును?

విక్ర — ఆకంఠస్వరము మున్నెన్నఁడును విన్నదికాదు. శత్రుపక్షమువాఁ డెవ్వఁడైన మనవారిచేతఁ జిక్కి యట్లు ప్రేలుచుండి యుండును. మనపరివార మెక్కడ! స్వామిద్రోహ మెక్కడ!

సుశ — కావచ్చును. ఆదుష్టునిఁ దత్క్షణ మిక్కడ కీడ్చుకొని రమ్మనుము.

విక్ర — ఓరీ! ఘటోదరా! ఆనందపడిచేయువారి నందటిని ప్రభువు గారి సమ్ముఖమునకుఁ దీసికొనిరా

ఘటో — చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[ తెరలో ]

ఓసీ! పలుగాకీ! నీ విప్పుడు కూసినకూఁత మా ప్రభువుగారిచెవులఁ బడి యుండిన పక్షమున నీతల యుండక నీమె కమింకఁ దడవు నిలువదు. నీకు మృత్యువు సమీపించినది మిడిసిపడక నడువు.

విక్ర — (చూచి) మనవిప్రులకాదు లెవ్వనినో పెడ తెక్కలుకట్టి దేవరసన్నిధి కీడ్చుకొని వచ్చుచున్నారు.

సుశ — ఇప్పుడు డాకాలు ఆచినవాఁడు వాఁడే యయియుండును. అందుకు సందేహము లేదు. నేనూరక మనపక్షమువాఁడని భ్రమపడితిని.

[అప్పుడు నిపుణకుఁడు, ఘటోదరుఁడు, పెడ తెక్కలు విఱిచికట్టిన యొక వైశ్యునితోఁ బ్రవేశించుచున్నారు.]

నిపు — దేవా! నమస్కారము. దేవరకు విజయ మగుఁగాక.

సుశ — నిపుణకా! కార్యసాఫల్యము చేసికొనివచ్చితివా?

నిపు — మనసుభటు లిప్పుడే కార్యము పండించుకొనివత్తురు. నేను వారిని వెనుకవిడిచి దారిలోఁ దాఁగుచుండి వీనిని బట్టుకొని వచ్చినాఁడను — ఓధనగుప్తా! మారాజుగారికి మ్రొక్కుము. చెప్పినను చేయుట వేమి?

ధన — (గర్వముతో) ఈబంధములు లేనప్పుడే పరులముందు చే యొగ్గనివాఁడను నే నీనిర్బంధమున కో మ్రొక్కుదునా?

సుశ — ఓ వదరుఁబోతా! ఎవఁడవురా నీవు?

ధన — (గర్వముతో) మా ప్రభువువారిపసువులను దొంగిలివచ్చిన యీదొంగల గుంపునకు నాయకుఁ డీమువ్వురిలో నెవ్వఁడో ముందు చెప్పుఁడు నేనాతని కొంకింత బుద్ధిచెప్పవలెను.

సత్య — ఇట్లు కాఱులు ప్రేలుచున్న యీ తులువనాలుక కోయక కత్తి చేతఁబట్టుకొని యూరక చూచుచున్న వేమిరా?

ఘటో— (ఒరలోనుండి కత్తి దూయుచున్నాఁడు.)

సుశ— ఘటోదరా! కొంతకాలము తాళుము. వీఁడు శత్రుపురమునందలి వార్తలేమైనఁ జెప్పునేమో యడిగి తెలిసికొందము — ఓనిపుణకా! వీఁ డెవఁడు?

నిపు — వీఁడు విరాటుని ధనాగారమునందున్న బచ్చు. వీని పేరు ధనగుప్తుఁడఁట! వీఁడు మొదట మాతో శాంతముగా మాటాడుచు మేము దేవర నిర్దేశము చెప్పఁగానే కాఱు లఱవ మొదలు పెట్టినాఁడు.

ధన— మీకు శత్రుపురమునందలి వార్తలు కావలెనుగా! ఏమి యీ ద్రోహులు! సిగ్గులేక —

ఘటో— ఓరి మూర్ఖా! ప్రేలక యూరకుండెదవా? ఈ కత్తితో నీనాలుక కోయుదునా?

ధన— కోయుము కోయుము. నిర్దోషులనాలుకలు కోసెడి యసహాయశూరుఁడవు నీ వొక్కఁడవేనా మీ సేనలో నీవంటి పుణ్యాత్ము లింకను బలువు రున్నారా?

సత్య— వీనికి నేఁ డాయువు మూఁడినది.

ధన— మీరు చెప్పనక్కఱలేదు. నా కాయువు మూఁడిన దని నా కీవఱకే తెలియును.

సత్య— ఎట్లు తెలిసినది

ధన— మీవంటి దయావంతులు చేతులలోఁ బడుటచేత.

విక్ర— వీనికి నిశ్చయముగా నే చావు వ్రాసినది.

ధన— అందుకు సందేహమేమి? ఈ జ్యోతిషము నాకు నీకంటె ముందుగాఁ దెలిసినది. నీభటులు నన్నెప్పుడు పట్టుకొన్నారో నా కప్పుడే చావు వ్రాసినదని నీ ముఖవిలాసము చూడకమునుపే నే ననుకొన్నాను.

సత్య—ఈసుంతకును జ్యోతిషముగూడఁ దెలిసినదా?

ధన—ఒక్క జ్యోతిషమే కాదు మీసన్నిధికి రాఁగానే నా కిప్పుడు సాముద్రికమును దెలియుచున్నది. మీముఖలక్షణము తేటపఱచి జూచిన కొలఁదిని నామరణము నా కంతకంతకుఁ దేటగా బోధపడుచున్నది.

విక్ర—ఓరి వైశ్యాధమా! ప్రేలఁబోకు.

సుశ—ఈనీచుఁడు చావునకుఁ దెగించి తెంపరియై నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలుచున్నాఁడు. వీనిచే బ్రేలింపకుఁడు.

ధన—నానోరు దగ్గఱియుండదు. నన్ను రేఁచుట కాని జోకొట్టుట సుమీ!

సుశ—వీఁడు వైశ్యుఁడ నన్నాఁడే? వీనివంశమున లేని యీ వాక్యశూరత వీని కెట్లు వచ్చినది?

సత్య—తల్లి వైశ్యాంగనయే యయియుండును. వీనితండ్రి నెవ్వ రెఱుఁగఁగలరు?

ధన—ఈశ్వరుఁ డెఱుఁగఁగలఁడు. నినుబోటి యజ్ఞు లెఱుఁగలేకున్న నష్టమేమి? సహజభీరువు లని పేరొందిన వైశ్యులే మాపీట నింత శూరు లయియుండఁగాఁ బరాక్రమోపజీవు లయినవారిచర్య లెట్లుండునో నన్నుఁబట్టి యూహించుకొనుఁడు.

సత్య—వీఁడు సురాపానము చేసినవానివలెఁ బ్రేలుచున్నాఁడే!

ధన—సురాపానము చేయుట మాకులాచారము గాదు.

సుశ—నిర్ఘృణకా! వీని కేమైన నున్మాద మున్నదా?

విప్ర—మనదండయాత్రనుగుఱించి ప్రసంగింపనంతవఱకు వీఁడు మహర్షివలె మాటాడినాఁడు. ఆపేరెత్తఁగానే వీని కీవెఱ్ఱి యెత్తినది.

సుశ—(తనలో) వీనిని మంచిమాటలాడి దారికిఁ దేవచ్చునేమో చూచెదము (ప్రకాశముగా) ఓధనగుప్తా! నీవు మంచివాఁడవు. భయపడఁబోకు. నీప్రాణములు రక్షింపించెదను. మనస్సు పదిలపఱుచుకొని నేనడిగినదానికి సదుత్తరము చెప్పుము.

ధన—ప్రాణభయ మెప్పుడును నాకు లేదు. మీకుఁ గావలసి నన్ని సదుత్తరములను జెప్పెదను. మీ ప్రశ్నపత్రములను విప్పుఁడు.

సుశీ— మావీటఁ బాండవు లున్నారేమో యెఱుఁగుదువా?

ధన— ఎఱుఁగుదును.

సుశీ— ఏ మెఱుఁగుదువు?

ధన— పాండవులు లే రని.

సత్య— వీఁ డసత్యము పలుకుచున్నాఁడు.

ధన— మావీట నున్న కుక్కయు నసత్యము పలుకదు.

సుశీ— ఎఱుఁగకున్నఁ బోనిమ్ము. కోపము తెచ్చుకొనకు. మీరాజుగారి బావ సింహబలుఁడు సుఖుఁ డయి యున్నాఁడేమో చెప్పఁగలవా?

ధన— చెప్పఁగలను. అతఁడు చచ్చి స్వర్గలోకమున సుఖుఁ డయి యున్నాఁడు.

సుశీ— స్వర్గలోకముననా?

ధన— స్వర్గమునఁ గాకున్న నరకమున నని నిశ్చయముగాఁ జెప్ప వచ్చును. ఏదో యొకలోకమున నున్నాఁడు. ఈలోకమునమాత్రము లేఁడు.

సుశీ— ఎందుచేతఁ జచ్చినాఁడు?

ధన— తనదుర్వర్తత్వముచేత.

సుశీ— ఎవనిచేతఁ జంపబడినాఁడు?

ధన— విధిచేతఁ జంపఁబడినాఁడు.

సుశీ— నీవేదాంతార్థ మక్కఱలేదు; లౌకికార్థము చెప్పుము. సింహబలుని జంపినవాఁ డెవ్వఁడు?

ధన— గంధర్వుఁ డఁట!

సుశీ— భూలోకమున నున్న సింహబలునకు గగనచరుఁ డయిన గంధర్వునితోడ వైర మేల కలిగినది?

ధన. - ఖగనచరు లేమి? భూచరు లేమి? దుష్టున కందఱును వైరులే. పరాంగనానురక్తులకును బరధనాసక్తులకును వైరులు కానివా రెవ్వ రుందురు? కండక్రొవ్వున వాఁడొక్క మహాపతివ్రత కాశపడఁగా, కావలసినకార్యము గంధర్వు లొనర్చిరి.

సుశ- -అతఁడు జారత్వదేవత కే బలి యయ్యెనా?

ధన—అవును. ఆ రాక్షసికే నరబలి యయినాఁడు. పరకాంత కాశపడి బ్రతికినవాఁడెవఁడు?

ఉ. సీత మహాపతివ్రతను జేరఁగఁ గోరి దశాస్యుఁ డీల్గఁడే?
పాతకియై సురాంగనలఁ బట్టి వెస న్నరకుండు కూలఁడే?
ఘాతుకులైనయాదనుజకాంక్షు మట్లనరప్రతిన్ సురా
రాతి యితండు పుట్టి మహి భ్రమండెను, నేఁ డిట వింత యేటికిన్?

సుశ- -(తనలో) ఈమూర్ఖుఁడు దారికి వచ్చుచున్నాఁడు. ఇఁక మెల్లఁగాఁ గార్యాంశమునకు దింపెదను. (ప్రకాశముగా) ఓసెట్టీ! అన్నగారి దుర్మరణమును జూచి తమ్ము లోర్చి యూరకుండిరా?

ధన—ఆయన్నతమ్ము లేల యూరకుందురు? అన్నపలెనే త్రుళ్ళిపడి సాధుపిరుసకు యత్నింపఁగా గంధర్వు లెఱిఁగి యన్నవద్దకే వానిని దోడుపంపిరి.

సుశ—అది సరేకాని యాదుష్టుఁ డాశించిన యామహాపతివ్రత యెవ్వరు?

ధన- -అంతఃపురపరిజనముమాట నన్నడుగఁబోకు. నేను బరకాంత పేరెత్తను.

సుశ—పోనిమ్ము. మీదేశమునఁ బశుసమృద్ధి గలదా?

ధన- -కావలసినంత యున్నది.

సుశ—మీరాజుపశువు లెక్కడ క్షేమముగా నుంచఁబడును?

ధన——మీరాజుపశువులా! సరిసరి! మీ కలఁపు నా కిప్పుడు బోధ పడుచున్నది. ఆపశువార్త పశువుల్లకే కాని మనకెందుకు?

సుశీ——(తనలో) పశువుల్ల పేరు తలపెట్టఁగానే వీనికి మరలఁ బిచ్చి యెత్తుచున్నది. (ప్రకాశముగా) నీవు ప్రాణముల కాశపడెదవు పక్షమున నీళ్ళు నమలక నిజము చెప్పుము. నీ కభయదానము చేసెదను.

ధన——నాకు రాజభక్తి కంటెను ప్రాణము లెక్కువవి కావు. వలయునేని యీపాడుప్రాణములం బుచ్చుకొమ్ము. నే నీదేహమునైనను విడిచెదనుగాని ప్రాణము పోయినను రాజద్రోహము చేయను.

క. రుజలం బస చెడి ముదిమిని
ద్యజియింపఁగవలయు నట్టిదగు నీయొడలిన్
భజియించిన స్వామ్యర్థము
త్యజియించుటకంటె భాగ్య మన్యము కలదే?

సుశీ——ఓయి పిచ్చివాఁడా! మామాట వినక నీ విప్పు డేల నిష్కారణముగాఁ జెడిపోయెదవు? నీవు చెప్పకపోయినను మే మెట్టును మీరాజుగోవులను బట్టకమానము. మానిపుణకుని వెంటఁ బోయిన చారులు సర్వమును దెలిసికొని నీ విక్కడ నుండఁగానే వత్తురు. ఈలోప లనె బుద్ధిమంతుఁడవయి మాకిప్పుడు త్రోవ చెప్పి నడిపించితివా, నీకుఁ దగిన ప్రత్యుపకారమును జేసెదము. ఇదిగో ప్రస్తుత మీబహుమానము నందుకొమ్ము. (అని చేతి రత్నకంకణ మియ్యఁబోవుచున్నాఁడు.)

ధన——ఆహాహాహా! బహుమానమా!

సుశీ——అవును బహుమానమే. మా బహుమాన మన్న నీ కంత తిరస్కారముగా నున్నదా?

ధన——ఒక్క నీబహుమానమునే కాదు నీబహుమానమును నిన్నును గూడఁ దిరస్కరించుచున్నాను. నేఁ డుండి రేపు పోయెడు

నీతుచ్ఛధనమును నీయొద్దనే యుంచుకొమ్ము. నావద్ద నెన్నఁడును దఱుఁగని దివ్యధనము కావలసినంత యున్నది.

సుశ—మీరాజువద్ద నని నీ యభిప్రాయము కాఁబోలును!

ధన—కాదు నావద్ద ననియే.

సుశ—నీయింటివద్దనా?

ధన—ఇంటివద్దకా దిక్కడనే.

సుశ—ఇక్కడ నెక్కడ?

ధన—ఇక్కడ. (అని హృదయమును జూపుచున్నాఁడు)

సుశ—అక్కడనున్న దేమిధనము?

ధన—ఏమిధనమా? సత్య ధనము; దయాధనము; ధైర్యధనము; అమూల్యనీతి ధనము. ఈధనములు మీకు వేయిజన్మము లెత్తినను రావు

సత్య—ఓరి చండాలుఁడా! స్వామితారతమ్యమెఱుఁగక నోరికి వచ్చిన ట్లెల్లను ప్రేలుచున్నావు!

సుశ—ఈమూర్ఖుఁడు నామవచనములచేతఁ జక్కఁబడఁడు. ఓభటులారా! వీనిని దండింపుఁడు.

భటు—ఓరిమూర్ఖా! నీపాపఫల మనుభవింపుము. (అని కొట్టుచున్నాఁడు.)

ధన—అనుభవించెదను! అనుభవించెదను! మీ రన్నట్లు స్వయంకృతాపరాధ ఫల మనుభవింపవలయును. ఇక్కడ నావిషయమునఁ జేసిన దంతయు మీ రక్కడ యమసన్నిధానమునందు కోటిగుణముగా ననుభవించెదరు.

సుశ—ఓరీ! ఇకనైన బుద్ధితెచ్చుకొని మీరాజుగుట్టు చెప్పెదవా? నిన్ను మన్నించెదను.

ధన—మన్నింప నక్కఱలేదు చెప్పెదను వినుము.

సుశ—సావధానులమయి యున్నాము. చెప్పుము.

ధన—ఇదిగో మర్మము విడిచి చెప్పుచున్నాను. నీవు వృథా పశుహరణమున కేల యత్నించెదవు? వంచకులకుఁగాని ఋజుమార్గవర్తులకు గోప్యాంశమేమి యుండును? అతనిగుట్టంతయు నీతి తప్పకుండుటయే.

గీ. దుర్గ్రహీర్యంబుచే మత్స్యేంద్రు దోర్వ్యగంబు
గోరసి నిలిచిన మగఁటిమి యొనవుఁగాక,
ఖీరులగుగోవులను గొట్టి నోరు లేని
పసరములఁ బట్టు టెది యేటిపౌరుషంబు?

నీవు మానప్రాణములు దక్కించుకోఁ గోరితివా, యీవ్యర్థప్రయత్నము మాని యిప్పుడు వచ్చినదారినే మరల నింటిమార్గము పట్టుము. నీ కీ దుర్బుద్ధి వదలక ప్రాణములు చేదయి చెడిపోఁ దలఁచితివా, పోయి గోవులను బట్టుము. అప్పుడు

మ. లయకాలానలభీషణాకృతిని లీల న్నీదు సేనాటవీ
రయమారంగ శరాస్త్రలం బొదివి తీవ్రప్రక్రియం గాల్చుచున్
భయదాస్త్రంబుల నవ్విరాటుఁడు నిను న్దర్పోద్ధతిం దాఁకఁ ద
ద్దయుఁ బ్రాణంబును మానమున్ రణమునం దక్కించుకో నేర్తువే?

మ. గజబృందంబులతో నఖర్వమదరేఖా దా శతానీకుఁడున్,
విజయాశ్వంబులతో భుజాబలమురీతిన్ సూర్యదత్తుండు, వా
యుజవం బొప్పు రథాళితోడ మదిరాస్యుండున్, ద్రిమూర్తు ల్నృపా
నుజు లొక్కుమ్మడిఁ దాఁకఁ గూలరె భవన్ముఖ్యాగ్ర సేనాపతుల్?

ఉ. ఆతని యగ్రనందనుఁడు హర్పతితేజుఁడు శంఖుఁ డుస్మదా
రాతిభయంకరుండు మృగరాజు గజంబులఁ బోలెఁ దోలి బల్
శాతకృపాణిచే నడరఁ జంపఁగ నొంపఁగ నీసుసైనిక
వ్రాతము గుండియల్ పగిలి పాఱక జాఱక నిల్వ నేర్చునే?

క. చావం దలఁచితి వేనియు
గోవుల నిటఁ బట్టు మీవు కుటిలత్వమునన్;
జావక బ్రదుకం దలఁచిన,
నీ విదె నాబుద్ధి వినుము నేగుము పురికిన్.

సుశ — ఓరీ! ఆత్మస్తుతి పరనిందా పాండిత్యధురీణా! నీచదువు పూర్ణమయినదా? ఇంకను గొంత కొఱంత యున్నదా?

ధన — చెప్పవలసినదానిలో సహస్రాంశమయినను గాలేదు. అందని ద్రాక్షపండ్లకు కాళ్లు చాచుటవలన నేమి ప్రయోజనము? కార్యాకార్యవిచారము లేక నీ వేల నిష్కారణముగా చెట్టు గొట్టి పైని వేసి కొనెదవు? మూఢా! నిరాధనిరుఁడు—

సుశ — ఇంతటితో నీచదువు చాలించు. నీపాండిత్యము మేము మెచ్చుకొన్నాము—విక్రమభుజా! మన మీమూర్ఖునితోఁ గాల మంతయు వ్యర్థపుచ్చుచున్నాము. వీనితో వేయేండ్లు మాటాడినను మనకుఁ బ్రయోజనలేశమును గలుగదు. ఓఘటోదరా! వీనిని గొనిపోయి మనకార్యాలోచన వినఁబడకుండ దూరముగా నాతాళవనమునం దుంచుము. బంధములు త్రెంచుకొని పాఱిపోకుండ వీనిని పదిలముగా మీ రందఱును గను గలిగి కాచుచుండవలెను జుడీ.

ధన — (తనలో) ఇతఁడు నాకు మంచియుపాయము తోఁపించినాఁడు.

ఘటో — చిత్తము. (అని ధనగుప్తునితో నిష్క్రమించుచున్నాఁడు)

సుశ — విక్రమభుజా! వాఁడు దాఁటిపోయినాఁడా?

విక్ర — పోవుచున్నాఁడు. మన మింక రహస్యాలోచనమున కుపక్రమింపవచ్చును. అదె మనసిపుణకుఁడు మరల వచ్చుచున్నాఁడు. అతని ముఖవికాసము చూడఁగా నేదో శుభవార్త తెచ్చుచున్నట్లున్నది.

సుశ — [illegible]

[illegible] చేసినారా?

[illegible] — [illegible] చేసినారు. [illegible] మొదలు [illegible] [illegible] గ్రామములు [illegible] నాను: [illegible] సైన్యమును [illegible] పిచిచి [illegible] గర్వము చేసినారు! గుఱ్ఱములు గజములు——

సుశ- చాలును. ఇ వన్నియు సరేకాని విరటుని కదుపులజాడ మాత్ర మింకను మనకుఁ దెలియనే లేదు గదా?

[నిపుణకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నిపు——స్వామీ! నమస్కారము. నేను వెనుక దిగవిడిచివచ్చిన భటులు విరటుని గోవులజాడ కనిపెట్టి వచ్చినారు. ఆతనిగోగణ మాతోఁట కీశాన్యమూలనున్న పొలములోనుండి గోపాలురచే రక్షింపఁ బడుచున్నది.

సుశ——అట్లయిన వేగముగాఁ బోయి పసులఁ బట్టుదము లెండు. ఓవీరులారా! ఇప్పు డాధనగుప్తుఁడు ప్రేలిన వీరాలాపములను విన్నారా?

సత్య——మీా రావాగాడంబరము నమ్మి యణుమాత్రమును జింతిలఁబోకుఁడు.

చ. విరటునితమ్ముల న్మఱియు విక్రమలీల వధించు వాఁడ నో
క్కరుఁడనె నేను వ్యాఘ్ర మలుకన్ హరిణంబులఁ జంపు కైవడిన్;
నరవర! చింత మానుము మనంబున; నాయుసిపాలు మత్స్యభూ
వరు ననుజన్మ లెల్ల; సభవారు వినంగఁ బ్రతిజ్ఞ పట్టితిన్.

విక్ర——ఇఁక నా ప్రతిజ్ఞ చిత్తగింపుడు.

క. శిరములు త్రుంచెద సునిశిత
శరధారలచేత నేని శంఖాదిమహీ
వరసుతుల నెల్ల; సోపా
లరయఁగ సేనానితోడ నఖిలకుమారుల్.

సుశ — నేను నిజ శపథము చేయుచున్నాను వినుఁడు.

క. విరటునిఁ బారిఁగొనియెడు నీ
　　ఖరతరకౌక్షేయకమున క్షణకాలమునన్ ;
　　విరటుండు నాపా లయ్యెడు
　　సురలెల్లను వచ్చి తోడు చూపిరి యేనిన్.

ఓసత్యసేనా! నీవు నిపుణకుని వెంటఁ బోయి యడ్డువచ్చిన గోపకులఁ దూపులపాలు చేసి గోవులను బట్టుము — ఓ విక్రమభుజా! నీవు సేనలను బన్ని పురమునకును గోవులకును మధ్య నిలువుము. పొమ్ము. నే నిదె నిన్నుఁ గలిసికొనెదను.

సత్య — అట్లు చేసెదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## ద్వితీయాంకము.

---

రంగము — విరాటుని సభామంటపము.

[విరాటరాజును, రాణియైనసుధేష్ణాదేవియు ఉపచారిక యను చేటికయు, పురోహితుఁడగు వామనశర్మయు, దౌవారికుఁడును ప్రవేశించుచున్నారు.]

విరా — ఓ వామనశర్మా! నిన్నటిదినము పూజ్యులైన కంకుభట్లవారు శౌచవిషయమైన ప్రస్తావనలో "దశాహం బ్రాహ్మణానాంతు। క్షత్రియాణాం త్రిపంచక" మ్మని దేవల స్మృతివచనము నొకదాని నుదాహరించినారు. దానినిబట్టి పదియేనుదినము లాశౌచము పట్టవలసినపని లేదుగదా?

వామ——లేదు. దేశాచారమునుబట్టి మనకుఁ బండ్రెండుదినముల తోనే యాశౌచ శుద్ధి యగును. ధర్మశాస్త్రమును శిష్టాచారమున కను గుణముగానే యున్నది.

శ్లో. శుద్ధే ద్విప్రో దశాహేన ద్వాదశాహేన భూమిపః
వైశ్యః పంచదశాహేన శూద్రో మాసేనశుద్ధ్యతి.

అను దక్షస్మృతివచనమును దేవరవారు చిత్తగించియుండలేదా? ఈనఱ కేర్పఱిచినట్లుగా సింహబలాదుల పత్నులచేత నేఁడే శుద్ధిస్నానము చేయింపవచ్చును. అయ్యో! సింహబలుని పేరుచ్చరింపఁగానే దేవిగారు మరల రోదనమున కారంభించినారు!

విరా——

చ. వనితరో! గ్రీష్మతాపమున వాడినపూసరమట్లు లున్న యీ
తనువును దుఃఖవహ్ని నిటు తాపము నొందఁగఁ జేసె దేల? స
మ్మనమునఁ దాల్మి పూని యిఁక మానుము శోకము; నిన్నుఁజూచి నీ
తనయులు నేముఁ గుందెదము; ధైర్యమునన్మము నూఱడింపుమా.

నీ వీరీతిఁగా వేయేండ్లు చింతిల్లినను, అప్ప యేఁడ్చుచున్నదని జాలిపడి సింహబలుఁడును దమ్ములును లేచివచ్చి నిన్నోదార్తురా? వారు నీతల్లి కడుపునఁబుట్టనేలే దనుకొని వారిని మఱచిపొమ్మా.

ఉప——అమ్మా! ఊఱడిల్లుము.

వామ——ఓహో! ఈపండ్రెండుదినములలోనే యీమె యెంత మాఱిపోయినది! నిత్యమును జూచుచుండఁబట్టి నే నీమె దేవి యనుకొం టిని గాని పదునేనుదినములక్రిందఁ జూచినవా రిప్పు డీమెను గుఱుతు పట్టలేరు. అమ్మా! ప్రభువుగారు చెప్పినట్లు చేసి దుఃఖమును నీమనసు లోనే దిగమ్రింగికొమ్ము.

సుధే — హా! సింహబలా! నిన్నెట్లు మఱచిపోఁగలుగుదునురా తమ్ముఁడా? నీవుపోయి నేటికిఁ బండ్రెండుదినములు దాఁటిపోయినను నామనోవ్యథ యంతకంతకు మఱింత క్రొత్తదగుచున్నది. మఱతునన్నను మఱపునకురాక నామనోనేత్రమున కిప్పుడును నీవు సైరంధ్రిని నాయింటికిఁ బంపు మని దీనముఖముతో వేఁడుచు నాయెదుట నిలువఁబడినట్లే కనఁబడుచున్నావు!

విరా — ఓదేవీ! నీ వూరక తమ్ముఁడా తమ్ముఁడా యని పలవరించెదవు. ఇఁకను నీ కెక్కడి తమ్ముఁడు? నీమీఁదఁ బ్రేమలేక నిన్నువిడిచిపోయిన కఠినచిత్తునికొఱ కెన్నాళ్ళు విలపించెదవు?

సుధే — ఓప్రాణేశ్వరా! ఎన్నాళ్ళని సెలవిచ్చెద రేమి? ఎన్నియేండ్లు విలపించినను శోకసముద్రమునకు దరి గానరానట్టున్నది. నా కిప్పుడు క్షణ మొకకల్ప మగుచున్నది. ఎంతసేపటికిని తెల్లవాఱక నా కీరాత్రి యొక మహాయుగమైనది. హాదైవమా! చిరంజీవినివై దుఃఖములనుభవింపు మని నన్నీ లోకములోఁ బుట్టించితివా!

విరా — హా! హృదయేశ్వరీ! (అని తలవంచుకొని నేల చూచుచున్నాఁడు.)

ఉ: — అయ్యో! రాజుగారును నధైర్యపడుచున్నారు! ఏమిబుద్ధి?

వామ — అమ్మా! ఊఱడుము. నిన్నుఁజూచి రాజుగారును దుఃఖపడుచున్నారు. భర్తగారిని మీపుత్రులను పుత్రాధికులనుగాఁ జూచుకొనుచున్న ప్రజలమైన మమ్మును జూచి దుఃఖముపశమించుకొనుము.— ఓరాజేంద్రా! మీకీవెఱ్ఱియేమి? దేవిగారి నోదార్పవలసినవారు మీరే యిట్లు వావిడిచి దుఃఖపడినచో మిమ్మూఱడించువా రెవ్వరు? ధైర్యమవలంబించి దేవి నోదార్పుఁడు.

సుధే — ఓవిప్రోత్తమా! ఇట్లొక్కసారిగా నూర్వురు తమ్ములను మింగుకొని మరలఁ బ్రజలముఖములు చూచుటకు నాకు ముఖ మెట్లు

చెల్లును? ఇఁక నా కెక్కడిలోకము! ఎక్కడి ప్రజలు! లోకములో నన్నుఁ
బోలు భాగ్యహీనురాలు వేఱొకతె లేదు.

విరా——ఓభూదేవోత్తమా! నే నీదేవి నెట్లోదార్పఁగలను?

ఉ. ఊరికిఁ బోయి రిందఱు సహోదరు లాదట నేఁట రేపటన్
దా రరుదెంతు రోర్చుకొను ధైర్యముతో నని యూఱడింతునా?
వారల నేను దెచ్చెదను వందురఁ బోకని యూఱడింతునా?
ఊఱడు మిట్లు లీ వసుట కొక్కయుపాయముఁ దోఁప దక్కటా!

హా! సింహబలా! నా రాష్ట్రమునకు నీవొక పెట్టని కోటవుగదా? కొండవలె
నీవు దండ నుండుటచేత నెట్టివిక్రమధురంధరులును నారాజ్యమువంకఁ
దేఱిపాఱఁ జూడ వెఱచుచుందురు. ఇఁక నీవు లేని యీరాజ్యమున
కేయోగము పట్టనున్నదో! నాభాగ్యహీనతచేతనే నీ కకాలమరణము
సంప్రాప్తమయినది.

సుధే——నేను గేవల మందభాగ్యురాలను. నావంటినిర్భాగ్యురాలి
కటువంటి సోదరరత్నము దక్కునా? హా! నే నెంతటి కఠినచిత్తురాలను!
అటువంటి భ్రాతృశతమును మృత్యుదేవత కప్పగించి వారివెంటఁ బోలేక
హృదయము పగులక మొండిజీవినై బ్రతుకుచున్నాను. ఓవిధాతా! నీవు
నాహృదయమును రాతితోఁ జేసితివా?

ఉప.——అమ్మా! ఓర్చుకొమ్ము. మృత్యుదేవతను నీ వడ్డగింపఁ
గలుగుదువా? అట్లు మృత్యువు త్రోచుకొనిరాఁగా నీవేమి చేసెదవు?

సుధే——ఆహా! ఎట్టివంటిబలవంతు లంద ఱొక్కసారిగాఁ
గార్చిచ్చు పొదివిన జీర్ణాటవివలె దగ్ధు లయినారు! హా! సైరంధ్రీ! నాతల్లీ!
కీచకకులమున కకాలమృత్యుదేవతవయి మాకు నీ వెక్కడ దాపురించి
నావు! ఇంతమందిని నీపొట్టఁ బెట్టుకొనుటచేతనయినను నీకుఁ దృప్తి కలిగి
నదా? నీకన్నులిప్పుడు చల్లబడినవా?

విరా—ప్రాణేశ్వరీ! మనభాగ్య మిట్లుండఁగా నీ వేల పరుల నిం దించెదవు? ఇం దామహాపతివ్రతదోష మే మున్నది? పరాంగనను బలిమిని బట్టఁబోయిన వాని దుర్ణయవిషమే వానిని జంపినది.

సుధే—అవు నాసాధ్వియెడల దోషము లేశమును లేదు. దోష మంతయు మా వానియొద్దనే యున్నది. ఒక్క కడుపునఁ బుట్టిన దోషము చేత నే నిట్లు మతిచెడి ప్రలపించుచున్నాను. హా! తమ్ముఁడా నీకు రంభల మించు సుందరు లంద అంతఃపురమున నుండఁగా, పరదార కేల యాశ పడితివి? పరసతిపొందు వలదని నేను నాఁడే చెవి నిల్లుకట్టుకొని పోరితిని. నాహితవాక్య మొక్కటియుఁ జెవిని జొరనియ్యక సర్వమును బెడచెవులఁ బెట్టితివి. ఇప్పుడయిన నామాట హిత మని నీ కనుభవ మైనదా?

విరా—వినాశకాలము దాపించినవాఁ డాప్తుల హితాలాపము లేల వినును?

క. మృత్యువు విడువక తలపై
నృత్యం బటు సల్పుచుండ నెవ్వండును దా
నత్యంతహితులమతులం
బ్రత్యయ మిడ నిచ్చునె యల పాపువిధియుఁ?

విధి ననవలసిన పనియేమి? వానిచావునకు నీ యుపేక్షకూడఁ గొంత తోడు పడినది. నాఁ డట్లు మధువునకై మాలినిని వానియింటికిఁ బంపకుంటివా, ఇంతలో నింత వైపరీత్యము పుట్టదు.

సుధే—అవును. ఈసంఘమరణమునకుఁ బాపకర్మురాలనయిన నేనే కొంత కారకురాలను. అప్పుడు నాబుద్ధి భ్రమిసి పాడుసురకయి సైరంధ్రిని వానియింటికిఁ బంపి పాపము కట్టుకొని నూటయేవుర తమ్ములను నాపొట్టను బెట్టుకొన్నాను. నాలోపలఁ జొచ్చి విధి నాచేనట్లు చేయించు చుండఁగా, నే నెట్లు మాలినిని సురాహరణార్థము పంపకుండ నేర్తును?

విరా—అది నీదోషము కాదు. విధి బలవంతముగు బ్రేరేపించు చుండఁగా, విధి విధానము తప్పింప నెవ్వరికి శక్యమగును? నాఁ డాలాగున వాఁడు పట్టపగలు సిగ్గువిడిచి వీధిని బడి మాలినిని సభ కేసి తఱుముకొని వచ్చినప్పుడే వానికిఁ జేటుకాల మాసన్న మయినదని నే నను కొన్నాను. ఆయువు మూఁడఁబట్టియే వాని కట్టిదుర్బుద్ధి పుట్టినది.

సుధే—వాఁడు నాకాళ్ళమీఁదఁబడి లేవక సైరంధ్రిని దనగృహమున కంపనియెడల మన్మథాగ్నిచేత నప్పుడే ప్రాణములు పోవు నని ప్రలపించినాఁడు. అప్పటి వానియవస్థను జూచి వాఁ డెట్లును కాముని నిశాతశరములచేతఁ జచ్చుట నిశ్చయ మని తలపోసి భ్రాతృవాత్సల్యముచేఁ గార్యాకార్యవిచారము చేయలేక సోదర ప్రాణరక్షణార్థమయి యాపని చేసితిని.

ఉప—ఆహా! సోదరస్నేహ మట్టిదే కదా! సహోదరునివ్యథఁ జూచి యాడుతో డెట్లోర్వఁ గలుగును?

సుధే— ఓతమ్ముఁడా! అఖర్వశౌర్యగర్వు లైనగంధర్వులు నీప్రాణములు గొందురని నే భయపెట్టినప్పుడు సైరంధ్రిపతులయిన గంధర్వపతు లెంతటి బలవంతు లైనను వారి నరక్షణములో నంతము నొందించెద నని ప్రగల్భవచనములు పలికితివే, లోకములో నాకంటె బలవంతులు లేరని విఱ్ఱవీఁగెడు నీమర్జ యయినబలము వారిముం దేమయిపోయినది? అతిలోక బాహుబలుఁ డైనసింహబలు నొక్కరాత్రిలో నంతము నొందించిన యాగంధర్వు లెంతబలము గలవారో!

విరా— పాపోపహతుని జంపుటకు బలమే యక్కఱలేదు. ఇతరు లూరక నిమిత్తమాత్రమే కాని వానిపాపమే వానిని జంపును. ధర్మబాహ్యుఁ డయి పాపకార్యమునకుఁ జొచ్చినవానికడ ధైర్యశౌర్యాదులు నిలుచునా? నీతిబల ముడిగినవాఁ డన్ని బలములు నుడిగినవాఁడే,

నీతిబలవిహీనుని బాలుఁడైన ననాయాసముగాఁ జంపఁగలుగును. ఆతని పాపమే కాకున్న లోకాతీతసత్త్వాఢ్యుఁ డగునసింహాబలు నొక్కరు చంపఁగలుగుదురా?

సుధే—ఓరమ్మఁడా! నీవు శాస్త్రము లెఱిఁగినవాఁడవే? పర వనితాసంగమము పాప మని తెలిసియు బుద్ధి యేల మరలించుకొన్నావు కావు? దీనివలన నపఖ్యాతియేగాక నీ వేమిసుఖ మనుభవించినావు?

విరా—ఓప్రియురాలా! ఏమి నీవెఱ్ఱి! వ్యభిచారమువలన దుఃఖమే గాక సుఖము కూడఁ గలుగునా?

చ. పతి వినెనేని ప్రాణములపై నలుగుఁ; జను లింత చూచినఁ
క్షితిపయి మానుషంబు చెడుఁ; జింతమెయిం గులకాంత విన్నచో
బ్రతుకు త్యజింపఁ జూచుఁ; దలవంపు లగు స్సరివా రెఱింగినఁ;
వెత యగుఁగాక ! సౌఖ్య మొదవించు నె యన్యసతీరతం బెటుఁ?

గీ. ఆయువు నడంచు, నైశ్వర్య మపహరించుఁ,
గీర్తితరువు నున్మూలించుఁ గేవలంబు
పరసతీసంగమం బట్టిపాడుపనికి
ధర్మపరుఁ డెప్పుడైనను దలఁపుగొనునె?

సుధే—స్వానుష్ఠానసమయమునఁ దెలిసినవారును తప్పుదారిఁ బట్టుదురు. ఓరమ్మఁడా! ఈవిషయమున నీవివేక మెక్కడకుఁ బోయినది?

విరా—కామాతురున కుచితానుచితవివేక మెక్కడ నుండును? ఆస దోసమెఱుఁగ నిచ్చునా?

మ. అలనాఁ డాయవివేకి కీచకుఁడు మధ్యాహ్నంబునం గామవి
హ్వాలుఁడై బొవురుగాఁడు రాచిలుక డాయన్వచ్చున క్లోచి రా,
నిలువెల్లం జెమరింప మే న్వడఁకఁ గన్నీ రత్యలం గ్రమ్మఁ దా
నలసైరంధ్రి కడంగి న న్ననినవాక్యం బుల్లముఁ బ్రవచ్చెదుఁ.

సుధే—ఆవాక్య మేది?

విరా— ఇది—

చ. నరపతి చూచుచుండ సభ న న్నిటు లీకుజనుండు క్రూరుఁడై
పరిభవ మందఁ జేయఁగ నృపాలకుఁడే కని యూరకుండఁగా,
నరయఁగ నింకమీఁదటఁ గులాంగన లెవ్వరిభార్య లీపురిం
పరిభవ మందకుండ మనువారలు మానముతోడ? నక్కటా!

సుధే— అధర్మమును జూచి రా జుపేక్షకుఁ డైనయెడల, ఆపాపములో సగము రాజును జెందు నని నీతివేత్తలు చెప్పుదురే మీ రేల యుపేక్ష చేసితిరి? అప్పుడు మీరు వానికిఁ దగినబుద్ధి చెప్పి వారించి యుండినయెడల మనకీచక ప్రజమున కీయకాండప్రళయము రాకుండి యుండును. దుఃఖకరమైన యావాక్యము విని మీ రేమి చేసితిరి?

విరా—ఆమెను శాంతవచనములతోఁ గొంత యూఱడించి, తరువాత విచారించి ని న్నిట్లు భంగపఱిచిన యాదుష్టుని శిక్షించెదఁ బొమ్మని సమయోచితముగాఁ జెప్పి యొకఁబఱిచి నే నామె నప్పటికిఁ బంపివేసితిని. అంతలో పాడుదాక్షిణ్య మడ్డువచ్చి నానోరు నొక్కుటచేత సభలోఁ గీచకుని గినియుటకయిన నాలు కాడినదికాదు.

సుధే—దుర్మార్గుఁ డయినసింహబలుఁడు పోలిసినను వంశము నిలుచుటకై నూటనలువురు తమ్ములలో నొక్కఁడైన బ్రతుకరాదా?

విరా—పుట్టుకచేతనేకాక దుర్నయముచేతఁగూడ వానికిఁ దమ్ము లనఁదగినవారు మాత్రి మేల యన్నను విడిచి బ్రతుకుదురు? అన్నగారి యవస్థను గన్నులార చూచియు భయపడక యాపరమపావనిని ముద్ద యయియున్న యన్నశవముమీఁదఁ బెట్టి కట్టిపట్టి దుష్టుల కట్టికష్టపాటు తప్పునా?

సుధే—హా! పాపపుదైవమా! నీకంటికి కీచకకులమింతయెక్కువే టరువయ్యెనా? భ్రాతలకును బితలకును దిలోదకము లిచ్చుట కొక్కని నైన విడిచిపెట్టలేకపోతివా? మీ కితరు లెందుకు? ఇదిగో మృతకళ్ళు

రాలనయి బ్రతికియున్న నేనే మీయందఱికిని గన్నీటితో తర్పణజలము విడుచుచున్నాను. (అని యేడ్చుచున్నది.)

వామ—అమ్మా! తలఁచుకొని తలఁచుకొని యేల దుఃఖించెదరు? మీ రేడిచి యీ పోయినవారిలో నొక్కరినైన బ్రతికింపఁగలరా? మి మ్మిట్లు దుఃఖపెట్టెడువారు మీకు శత్రువులుగాక తమ్ము లగుదురా? ఇఁక వారిమీఁది మోహపాశము కోసివేసి నేఁటిదినమున జరగవలసిన క్రియలమాట చూడుఁడు

విరా—ఓమనోనాయికా! నేను జెప్పుమన్నమాటలు నీ వా సైరంధ్రితోఁ జెప్పితివా?

ఉ. ఓకమలాస్యరో! పురుషు లుర్విని జంచలచిత్తు లెంతయున్;
లోకములోని సుందరులలోఁ గడుసుందరి యామె; యెవ్వరే
నాకమలాయతాక్షి దెస నాసఁ గనుంగొనిరేని, చావొగిన్
జేకుఱుఁగాన, మాలినిని శీఘ్రము సాగఁగనంపఁగాఁ దగున్.

పురుషులకంటెఁ దరుణులు మృదుతరమధురవచనరచనలతో సమయోచితముగాఁ బలుకనేర్తురుగాన, నే నీభారమును నీమీఁదఁ బెట్టవలసివచ్చినది. అంతేకాక నేనును బురుషుఁడనే యగుటచేత నాతరుణి చెంతకుఁబోయిన నాస్వాంతము కలఁగి యేమి చేటు మూఁడునో యని భీతి కలుగుచున్నది.

సుధే—ప్రాణేశా! ఎంతమాత్రమును మీ రాసైరంధ్రి దృష్టిపథమునఁ బడఁగూడదు. మీరు చెప్పుమన్నమాట లీవఱకే నేను సైరంధ్రితోఁ జెప్పి శీఘ్రముగా మారాష్ట్రమును మమ్మును విడిచి మహోపకారము చేయుమని నాఁడే వేడుకొన్నాను.

విరా—సైరంధ్రి యందు కొప్పుకొన్నదా?

సుధే—ఇఁక పదుమూడుదినములుమాత్ర మెట్లయిన నేను మీ యింట నుంట కొర్చుకొమ్మి. అట్లుంట కీకొంటివా కృతజ్ఞులయిన నాపతు

లప్పుడు మీకుఁ గనఁబడి తగిన మేలుచేసి నన్నుఁ గొనిపోదురు. అందాఁక నిందు నాయునికి కీడొనవలయు నని యామె నన్ను బహువిధములఁ బ్రార్థించినది.

విరా—నీ వామె ప్రార్థన మంగీకరించితి వనుకొనెదను.

సుధే—అందుల కొప్పుకొని యీలోపల నేయపాయమును గలుగకుండ నా పుత్రులను వల్లభుని రక్షించుకొనిమ్మని యమ్మామె కొప్పగించినాను.

విరా—అట్లయిన గడువుదాటునంతకు సహించియుండుము. నేఁడే కదా తుదిదినము?

సుధే—ఒక్కదినమయినను నే నెట్లు సహింపఁగలుగుదును? నా తమ్ములపాలిటి యపమృత్యుదేవతయైన యామాలిని నాకంటఁబడినప్పు డెల్లను చచ్చినవాండ్రు స్మరణకువచ్చి దుఃఖము సముద్రతరంగములవలె పొరలిపొరలి వచ్చుచుండఁగా, సైరంధ్రి సదా చెంతనుండి పనిచేయుచు నాకన్నులయెదుర మెలఁగఁగా నెట్లు చూచి సహింపగలుగుదును? ఓసహోదరులారా! నాకన్నులు మండించు మంటలవలె మీభార్య లగతికలయి ప్రతిదినమును నానేత్రములయెదుర నేలకుఁ గంటికి నేక ధారగా నేడ్చుచుండ నే నెట్లు చూడఁగలుగుదును? (అని పెద్దపెట్టున నేడ్చుచున్నది.)

విరా—ఇఁక నేనీమెకు దుఃఖశాంతి చేయలేను. కంకుభట్టు వచ్చినయెడల, పురాణగాథలను జెప్పి శోకోపశమనము చేయఁగలుగును. ఆతఁడు నేఁటి శ్రాద్ధకర్మలందు యోగ్యులయినబ్రాహ్మణుల నియోగించి వచ్చెద నని పోయి యింకను రాలేదు.

దౌవా—దేవా! కంకుభట్టుగారు వచ్చుచున్నారు.

విరా—ఆయనను శీఘ్రముగాఁ గొనిరమ్ము.

[కంకుభట్టు ప్రవేశించుచున్నాఁడు.]

విరా—(లేచి చేతులు జోడించి) స్వామీ! భట్టారకా! నమస్కారము.

కంకు—విజయోస్తు! దేవరసింహాసనమును స్వీకరింపుఁడు.

విరా—మీ రీపీఠమున నధివసింపుఁడు. (ఇద్దఱును గూర్చున్న తరువాత) స్వామీ! మీరు పురోహితానుమతంబున బ్రాహ్మణుల సమర్థుల నాయాకర్మలకు నియోగించి వచ్చినారా?

కంకు—సర్వమును సంసిద్ధము చేయించినాను. గోదానములకు వలయు గోవులు మాత్రి మింకను రాలేదు.

విరా—దానార్థమయి సవత్సకగోసహస్రము నేఁటి తెమ్మని పంపిన ధనగుప్తుఁ డింకను రాలేదు. ఆతఁ డేపని చెప్పినను యుక్తకాలములో నిర్వహించుకొనిరాక యిట్లెప్పుడును మసలినవాఁడు కాఁడు. ప్రభాతమునకు ముందే వచ్చెద నని పోయినవాఁడు జాముప్రొద్దెక్కవచ్చినను రాకపోవుటచూడఁగా గిట్టనివారివలన నాతని కేమో విపత్తు వచ్చియుండు నని నాచిత్తము తత్తరిల్లుచున్నది.

కంకు—మీరు చింతిల్లవలసినపని లేదు. అతఁ డెట్టివిఘ్నముల నైనఁ దప్పించుకొని యింతకు వచ్చుచుండును.

దౌవా—దేవా! ధనగుప్తుఁడు రోఁజుచు పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

విరా—వెంటనే లోపలికి రమ్మనుము.

[రోఁజుచు ధనగుప్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ధన—(రోఁజుచు) దేవా! సమస్కారము. నాదేహము—దేహము—కంప మెత్తుచున్నది; నానోట—మాట—మాట రాకున్నది. (అని గడియకొకమాటగాఁ జెప్పుచున్నాఁడు.)

విరా—వడఁకఁబోకు; తొందరపడకు. శాంతించుకొని నీ కేమి యుపద్రవము వచ్చినదో చెప్పు. నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?

ధన—యమ-యమ-యమసన్నిధానమునుండి.

సుభే—అయ్యో! ధనగుప్తున కెంతగతిపట్టినది! నామన స్సిప్పుడు దుఃఖసముద్రములో మునిఁగియుండియు తనదుఃఖమును మఱచి పరుని యాపదకై పరితపించుచున్నది.

విరా—ధనగుప్తా! నీవు వెఱ్ఱిచూపులు చూచుచున్నావు. నీకు మతిభ్రమణము కలిగినదా? నీ వెక్కడనుండి పరుగెత్తుకొని వచ్చినావు?

ధన—మృత్యుముఖమునుండి తప్పించుకొని పరుగెత్తివచ్చినాను.

విరా—నీకు చిత్తచాంచల్యము కలిగినదా? దేహము తెలిసియే యున్నదా? గోవులను తోలించుకొని వచ్చినావా లేదా చెప్పు.

ధన—గోవులనా? గోవులనా? ఇంకను మన కెక్కడిగోవులు? మనగోవులను గోవులను-నేను చెప్పలేను. (అని నిట్టూర్పు విడుచుచున్నాఁడు.)

విరా—అయ్యో! పాపము! వీని కాకస్మికముగా చిత్తభ్రమ కలిగినదిగదా? వైద్యులను బిలిపించి వీనికి చికిత్స చేయింపుఁడు. ఓధనగుప్తా! గోవులను దీసికొని రాలేదా? కొంచెము శాంతించుకొని చెప్పు.

ధన—నాకు మతిభ్రాంతి లేదు. నాదేహము పూర్ణముగా తెలిసియేయున్నది. అప్రియమని చెప్పఁజాలకున్నాను. మనసింహబలుఁడు చచ్చియు నదృష్టహీనుఁడే యయినాఁడు. అతఁడు గోదానపుణ్యమునకు నోచుకోలేదు.

విరా—(ఉలికిపడి) అప్రియ మేమి? నే నుండఁగా వానికి గోదానము లేల లేకపోవును?

ధన—మనగోవులను బట్టుటకయి సేనలతో సుశర్మ వచ్చినాఁడు.

విరా—(ఆశ్చర్యముతో) ఏసుశర్మ? ఎక్కడకు వచ్చినాఁడు?

ధన—ఏసుశర్మా? ఆసుశర్మే. మనశత్రువైన సుశర్మ. ఊరి బయలికి వచ్చినాఁడు.

విరా—(విస్మయముతో) ఆత్రిగర్తరాజు కాఁడుగదా?

ధన—ఔ నతఁడే. అతఁడు దుర్యోధనుని ప్రేరణముచేత మనగోవులను బట్టుటకయి దక్షిణదిక్కునకు వచ్చినాఁడు.

విరా—ఓసభికులారా! వింటిరా యీవైపరీత్యంబు? ఏమేమీ?

మ. ధనగుప్తా! మనగోగణంబులఁ ద్రిగర్తల్ పట్టఁగా వచ్చిరే?
మును దా నొందిన భంగపాటలసుశర్మం డప్పుడే విస్మృతిం
గనెనే? క్రమ్మఱ నేమొగంబునను సంగ్రామార్థియై వచ్చె? న
న్నెమ్మనల న్నాదు ప్రతాపవహ్ని కొకటం బూర్ణాహుతిం జేసెదన్.

క. శలభం బెయ్యెడఁ గాలా
నలముపయిన్ గంతువేయ నడ తెంచె; నిదే
పొలిసె సుశర్మ; మదిష్టము
ఫలియించెను; నేఁడు కాదె పండువు నాకున్?

(అని తనలో నేమో యాలోచించుచు క్రిందుచూచుచున్నాఁడు.)

కంకు - (తనలో) సుయోధనుఁడు మే మిందున్నజాడ కనిపెట్టినాఁడేమో! (ప్రకాశముగా) ధనగుప్తా! గోవులఁ బట్టుటకయి సుశర్మ దుర్యోధనుని ప్రేరణముచేత వచ్చినాఁడా? ఆకౌరవాధముఁ డెంత దుర్మార్గుఁడు!

ధన—భటుల సంభాషణమువలన నే నీసంగతి గ్రహించినాను. న న్నాసుశర్మ పాండవులవృత్తాంతముకూడ నడిగినాఁడు.

కంకు—(తనలో) ఈతఁడు మనవృత్తాంత మేమయిన నెఱిఁగి చెప్పినాఁడేమో! (ప్రకాశముగా) ఓధనగుప్తా నీ వేమి చెప్పినావు?

ధన — చెప్పుట కేమున్నది? నే నేమియు నెఱుఁగ నని చెప్పి నాను. న న్నాపసువు మనపసువులజాడకూడ గ్రుచ్చి గ్రుచ్చి యడిగి నాఁడు.

కంకు — (తనలో) ఇఁక నే నూఱట చెందవచ్చును. ఈవార్త రాజుగారికిఁ గావలసినది. రాజుగారు తమలోఁ దా మేమో యాలో చించుకొనుచు వినకున్నారు. (ప్రకాశముగా) దేవా! ధనగుప్తుఁ డేదో మనవి చేయుచున్నాఁడు.

విరా — ఆతఁ డేమనుచున్నాఁడు?

కంకు — ఆసుశర్మ మన పశువులజాడ త న్నడిగినాఁ డనుచున్నాఁడు.

విరా — (ధనగుప్తునివంకఁ దిరిగి) ఓధనగుప్తా! ఎదేదీ? ఆమాట యింకొకసారి చెప్పు. ఆనరపసువు మనపసువులజాడకూడ నిన్నే యడిగి నాఁడుగా! ఏమి యాతని పోతరము! ఆక్రూరుని నీ వెట్లు తారసించితివి?

ధన — నేఁటి దానార్థమై నేను గోవుల నేర్పఁబోవుచుండఁగా దారిలో యమభటులవంటి వానిభటు లెదురుపడి నన్నుఁ బట్టి కొట్టి తమ ప్రభువుసన్నిధికిఁ గొనిపోయిరి.

గీ. కటకటా! నేను మీయువంటి ఘనబలాఢ్యు
పానభక్తుఁడ నయ్యు నాపలువ చేతఁ
గానిమాటలుపడి కొయ్యిలోన కొట్టఁ
బడితి; విధివ్రాఁత తప్పింప వశమె యెందు?

విరా — ఇట్లవమానితుఁడ నైతి నని నొచ్చుకొనకు. నాప్రియ భృత్యుని బరిభవపఱిచిన పాపఫలము వాఁ డిప్పుడ యనుభవింపఁగలఁడు. ఆతులువ మ మ్మేమైన నన్నాఁడా?

ధన — ఆదుష్టుఁడు నోటికి మాఱు లేదుగనుక దేవరవిషయమయి కావలసి నన్ని కాఱు లఱచినాఁడు. ఆప్రలాపములు నిండినసభలో

నుచ్చరింపఁ బోలవు. అకుక్క చాటున మొఱఁగినమాత్రమున దేవర ప్రతాపము కొఱవడునా?

విరా—ఆహా! ఎంతపనిపుట్టెను! వాఁ డేమి తలఁచుకొని యింత నిర్భయముగా వచ్చియుండును?

ధన—మఱియేమి యున్నది? ఆత్మవినాశము తలఁచుకొని వచ్చి నాఁడు. కాలనియోగము మీఱి నెవరితర మగును?

విరా—(తలయూఁచి) ఔరా! ఇంతకాలమున కెంతవింత వినఁబడెను! నాప్రియభృత్యుని భంగపఱిచినవాఁ డింకను ప్రాణములతో నున్నాఁడు. ధనగుప్తా! యమకింకరులవంటి యాకిరాతుల చేతులలోనుండి నీ వెట్లు తప్పించుకోఁగలిగితివి?

ధన—మరల దేవరవారిపాదసందర్శనము చేయవలసినభాగ్య మున్నది కాఁబట్టి దైవికముగా మృత్యుముఖమునుండి వెడలివచ్చినాను. ఆసుశర్మ తనమంత్రులతోఁ గార్యాలోచనము చేయుదలఁచి నన్ను దూరముగాఁ గొనిపోయి నిలువుం డని భటుల కాజ్ఞాపించెను. వారు నన్నుఁ గొనిపోయి యొకతాళవృక్షమునకుఁ గట్టి, ఆదారిని సురా భాండముఁ గొనిపోవుచున్న శౌండికుని గొట్టి బలవంతముగా దాని పంటిలోని కల్లు త్రావి, మత్తెక్కి చెట్టుక్రిందఁజేరి జూద మాడఁ దొడఁగిరి.

విరా—వారు తమనాయకునికిఁ దగినభటులు. తరువాత.

ధన—ఆసందడిలో నేను మెల్లఁగా నాబంధములను పండ్లతోఁ గొఱికి త్రెంచుకొని పురివంక మరలి నాపిక్కబలము చూప నారంభించి తిని. అది చూచి నలుగురు భటులు నావెంటఁ బడి నన్నుఁ దఱుము కొనివచ్చిరికాని వారు నాపరుగు పట్టఁజాలక కొంతదూరము వచ్చి వెనుకకు మరలవలసిన వారైరి. ఇప్పు డాదుష్టుల పశుగ్రహణ వృత్తాంత మును దేవరకు నివేదింపఁ గలిగి కృతార్థుఁడ నయినాఁడను.

వీరా—ఓ దౌవారికా! ఇప్పుడ తమతమ సేనలతోడ యుద్ధసన్నద్ధులయి యుండుఁ డని మనదండనాథులకుఁ జెప్పి పంపుము. మే మిదె విపక్షశిక్షాదీక్షఁబూని దండయాత్ర వెడలఁబోవుచున్నాము.

దౌవా—మహాప్రసాదము. (అని నిష్క్రమించి మరల ప్రవేశించి) దేవా! సేనానియగు వీరసేనుఁడు మహావేగముగా గోపాలురను వెంటఁగొని దేవరను సందర్శింప వచ్చుచున్నాఁడు.

విరా— ఏఁడీ? ఏఁడీ? ఇటు రమ్మను.

వీర—(ప్రవేశించి) స్వామీ! నమస్కారము.

విరా—సేనానీ! సింహబలుఁడు పోఁగానే శత్రువులవలన మనవీటి కెంతవైపరీత్యము పుట్టినదో విన్నావా?

వీర—దేవా! వినుటయేకాదు కన్నారఁ గనియే వచ్చినాను. ఇఁక మాటల కెడము లేదు.

ఉ. ఆవల గర్భశత్రుఁ డగు నల్లసుశర్ముఁ డపార మైన సై
న్యావళితోడ వచ్చి యతులాతిమదాంధత దక్షిణంబునన్
గోవులఁ బట్టె; నడ్డుపడు గోపుల వీరిని గొట్టెఁ దూపులన్;
భూవర! యాలఁ దోలుకొనిపోయెడుఁ బచ్చెపుదొంగయో యనన్.

ఆగోవులదొంగ నిప్పుడ తెంబడించి వేఁడిచూపినంగాని మన గోవులు మనకు దక్కవు.

క. పాపిష్ఠుఁ డడ్డు చొచ్చిన
గోపాలుర వీరి నెట్లు కుపితుండై వాల్
తూపులపా లొనరించెనొ
యాపట్టునఁ జిత్తగింపుఁ డెల్లరతేనువుల్.

నేను మనసేనల నన్నిటిని సన్నద్ధము లయియుండ నియమించి వైరిసంహారమున కీయ యేలినవారియనుజ్ఞ పొంద వచ్చినాను.

విరా — (గోపకులవంకఁ జూచి)

ఉ. గోపకులారా! చింతపడకుం డణుమాత్రము మీరు దీనికిన్;
మాపు లనెన్ని మీయెడల మాఱెనో వానికి నూఱురెట్లుగాఁ
మాపులు వానిదేహమునఁ మాన్చెదఁ, గార్చెద నస్త్రపేసులన్,
బాపెద మీపరాభవము; పంపెద నంతకు చెంతకున్ రిపున్.

వీరసేనా! మనసైన్య ముత్సాహవంత మయియున్నదా?

వీర — ఉత్సాహమో గిత్సాహమో నేను జెప్పలేను.

ఉ. డాసె సుశర్మ యంచు వినుటన్ మనసైనికు లెల్ల సంగరో
ల్లాసము మోములందుఁ జూపలన్ రిపు నెప్పుడు రూపడంతుమా
గాసిలకంచు మించుతమకంబునఁ బెండ్లికిఁ బోవు కైవడిన్
భాసిలుచున్నవారు గెలుపం బయనం బగు నవ్వమోములన్.

పగవారి నెప్పుడు పరాభవింతుమా యనుచింతయేకాని మనవీరభటులలో నొక్కనికిని ప్రాణములమీఁది చింత లేదు.

కంకు — (తనలో) విక్రమక్రీడకు నాకు నుత్సాహము కలుగుచున్నది. ఏదో యుపాయమున్ని నేనును వీరివెంటఁ బోవఁ బ్రయత్నించెదను.

విరా — దౌవారికా! సూతుని నారథము సాయుధముగా నాయిత్తముచేసి తెమ్మనుము. ఇదిగో నేను విక్రమవిహారమునకు లేచుచున్నాను. (అని లేచుచున్నాఁడు.)

వీర — ఇంతమాత్రపుపనికి దేవరవారు శ్రమపడవలెనా? మీభటుని నన్నుఁ బంపుఁడు. క్షణకాలమున సుశర్మను బట్టితెచ్చి మీపాదములకుఁ గానుకచేసెదను. శత్రుశిరఃఖండనమున కయి నాచేతులు త్వరపడు చున్నవి.

విరా — నాతోఁ బ్రతిఘటించి వీరాధివీరుఁడనని గర్వాలాపములు పలుకుచున్న యాపృథివీపతిని నే నుండఁగాఁ బరు లెవ్వరును సంహరింపఁ

గూడదం. ఈసేనలను నేనే నడిపెదను. ఓవీరసేనా! మనశతానీకాద్యను జన్ములను శంఖాదికుమారులను నావీరవిహారమును జూచుట కయి రథారూఢు లయి నావెంట రా నియమింపుము. పురసంరక్షణార్థ మయి యుత్తరుఁ డింట నుండును.

వీర——నే నీవఱకే వారల కీ్రతిగర్తలవార్త చెప్పిపంపితిని వా రీవార్త చెవి సోఁకినతరువాత వీరవిహారమునకు బయలుదేఱక క్షణకాల మయిన నింట నిలువఁజాలరు.

సుధే——ప్రాణేశ్వరా! నన్నుఁగూడ యుద్ధభూమికి మీవెంటఁ గొనిపొండు. మిమ్ము విడిచి నే నింట నొంటిగా నుండలేను. ఒక వేళ బలవంతముగా నాదేహము నిం దుంచఁగలిగినను ప్రాణము లెట్లును మీవెంట రాకమానవు. సోదరమరణదుఃఖమే నన్ను సంతాపింపఁజేయు చుండఁగా, మీదుస్సహవిరహతాపముకూడ దానికిఁ దోడుపడిన నేను దాళఁగలుగుదునా?

కంకు——(తనలో) ఇదిగో సమయము తటస్థించినది. నే నీమెను బ్రోత్సాహపఱిచి యీమెతోఁ బ్రయాణ మయ్యెదను. (ప్రకాశముగా) అమ్మా! సోదరమరణ వ్యథాతుర వయియున్న నీ కిప్పుడు పతివిరహము నిశ్చయముగా దుర్భరమే యగును.

విరా——ఓహృదయేశ్వరీ! నామాట వినుము. వీరులకుసహితము దుర్నిరీక్షమయి యుండెడు రణరంగమునకు సహజభీరువు లైనస్త్రీలు రాఁ దగినవారుకారు. అంతేకాక మనప్రతివీరులును గ్రూరాగ్రేసరు లని పేరు పడినవారుగదా?

సుధే——ఆవల దేని కయినను సహింతునుగాని యిం దుండి ప్రాణములు నిలుపఁజాలను.

కంకు——ఓమహారాజా! ఈమెప్రార్థన నంగీకరింపుఁడు. క్షత్రియ స్త్రీలు భీరురాండ్రుకారు. పూర్వము కేకయరాజపుత్రి భర్తయైనదశరథు

నకు సంగరరంగమునందుఁ దోడుపడలేదా? మున్ను సుభద్ర యాదవుల తోడఁ బోరాడిన విజయునకు సారథ్యము చేయలేదా? ధైర్యగరిమచేత దేవియు వారికిఁ దీసిపోవునది కాదు. నా కొక్క వలలుని తోడిచ్చిన పక్షమున సురక్షితస్థలమున నిలిపి మే మిద్దఱము నీమెను గంటికి ఱెప్పవలెఁ గాచి యుండెదము. ఆతఁడు కావలి కాచుచుండును; నేను ధర్మతత్త్వములుచెప్పి దుఃఖశాంతి చేయుచుండెదను.

విరా——మంచిది. ఆలాగే కానిమ్ము. పెద్దలయాజ్ఞ మీఱరాదు గనుక దేవిరాక కంగీకరించినారము. ఈమె రక్షణభారము మీది. మీకిం కెవ్వరు తోడుకావలెను?

కంకు——పాండవులవద్ద నున్నప్పుడు తంత్రీపాలదామగ్రంథుల పౌరుషములు కొంత యెఱిఁగియున్నాను. వారుగూడ వార్తాహరణాదులకై నాకుసహాయులుకానిండు.

విరా——వీరసేనా! దేవికిని వీరికి నలువురకును నశ్వరథములను బన్నింపఁబంపుము. నడుమనడుమ నీవును వీరిక్షేమము విచారించు చుండుము.

వీర——దేవరయాజ్ఞాప్రకారము చేసెదను.

విరా——వామనశర్మా! దేవికూడ మాతోడనే వచ్చును. సింహబలాదులయుత్తరక్రియల కయి యీదినమున జరపవలసిన దంతయు ధనగుప్తుని సాహాయ్యమున నడుపుఁడు. మీ కన్నిటికిని నామాఱుగా నుత్తరుఁ డున్నాఁడు. మేము పోయివత్తుమా?

వామ——నిమిత్తము లనుకూలములుగా నున్నవి. శీఘ్రముగా విజయంచేయుఁడు. మీకు విజయ మగుఁగాక!

కంకు——ఇది యాశీర్వాదముకాక వరమే యగును.

ద్వా——దేవా! శతానీకాదులు రథారూఢు లయి చతురంగసేనాసమేతముగా వచ్చి వాకిట నిలిచి దేవరకు విన్నపము చేయు

చున్నారు. ఏలినవారిసారధియు నాయుధ సహితముగా నుత్తమాశ్వములను బూన్చినరథమును దెచ్చి వీధిలో నిలిపియున్నాఁడు.

విరా—ఇదిగో మేమును వచ్చుచున్నాము. ధనగుప్తా! నీ వుత్తర కుమారుని యొద్దకుఁ బోయి పురరక్షణ మేమఱకుండు మని నాపలుకులుగాఁ జెప్పుము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

# తృ తీ యాం క ము.

---

[ఆసీనురాం డ్రయియున్న సుధేష్ణాదు లగునంతఃపురస్త్రీజనమును
పరివేష్టించి కంకభట్టు దామగ్రంధి తంత్రీపాలాదులు
ప్రవేశించుచున్నారు.]

కంక—తంత్రీపాలా! వలలుని బలమును నమ్మి నామాటయందలి విశ్వాసముచే శ్రీమహారాజుగారు తమయంతఃపురాంగనారక్షణభారమంతయు మనమీఁదఁ బెట్టి కొలఁది సైన్యమునుమాత్రము మనకు తోడిచ్చి ప్రధానసేనాసమేతు లయి నిర్విచారముగా గోగణమును మరలింప దండయాత్ర వెడలియున్నారుగదా.

తంత్రీ—సమర్థులపైని గార్యభారము నుంచినప్పుడు నిర్విచారముగా నుంచుట నైసర్గికమే.

కంక—రిపుసేనలవెంట ధృతరాష్ట్రుఁడిందు వచ్చె నని యెవ్వరో చెప్పినంతమాత్రమున వలలుఁడు స్వకృత్యమును విడిచి, నేను వలదనుచుండఁగా నిదె వచ్చెద నని తద్దర్శనకుతూహలచాపలమునఁ బరుగెత్తి యింకను రాలేదు. అంధరాజెక్కడ? శత్రుసేనలవెంట వచ్చు టెక్కడ?

దామ—అట్లనఁగూడదు. పాండవు లిందు దాఁగియుండిరేమో యన్న శంకచేత నొకవేళ ధృతరాష్ట్రుని యాలోచనమీఁద వారి నన్వేషింపవలె నన్నతలంపుతో గోగ్రహణమిష పెట్టి దుర్యోధనుఁడే యీసుశర్మ నిందుఁ బంచియుండవచ్చును.

కంక—వాని కట్టిదురూహ పుట్టుట వింతగాదు.

దామ—అట్లయ్యేనేని, మాయోపాయధురంధరుఁడైనయంధ నరపాలుని ముందుగా నీసేనవెంట నంపి సుయోధనుఁడుసహితము యోధవీరులతో జేపురావచ్చును.

తంత్రీ—వలలుఁడు సత్య మారసి రానిమ్ము. అతఁడు వచ్చు లోపలనె శత్రుభటు లొకద్రోహమునకుఁ జొచ్చినచో వైరులఁ బాఱఁ ద్రోలి యీశుద్ధాంతజనమును మనము రక్షింపఁజాలమా?

సుధే—అయ్యో! అధర్మపరులైన పరులమూలమున మహాను భావులైనపాండవులెక్కడ నజ్ఞాతవాసము చేయుచు నిడుమలఁ బడు చున్నారోకదా! ఓహృదయమా! ఏమి నీసామర్థ్యము! ఇంతలోనే భ్రాతృమరణశోకమును మఱపించి నేనేమో కష్టములెఱుఁగనిదాని నయినట్లు పరకష్టములనుగూర్చి నన్నుఁ బరితాప పడునట్లు చేయు చున్నావు!

కంక—స్వకష్టములను గలఁపక పరులకష్టములకుఁ బరితపించుట మంచివారికి స్వభావము. సజ్జనహృదయములు వెన్న కంటెను మృదు తరములు.

క. తాపాధిక్యము తనకుం
బ్రాపించినయపుడె వెన్న రయమునఁ గరఁగున్
దాపలవం బన్యులకున్
బ్రాపించినఁ గరఁగు సజ్జనస్వాంతంబుల్.

సుధే—అది— యేమో నాహ్వానయము భయసదన మగు చున్నది. దూరమున నేనో శ్రేనణవిదారణదారుణ స్వనములు వినఁబడు చున్నవి.

కం—అమ్మా! ఆభీమధ్వనులు భయంకరములు. అవి మన భటుల సింహనాదములును గజబృంహితములును హయహేషలును రథఘోషలునుగాని వేఱొండు కావు. మే మింతఱము సన్నిధానమునఁ గాచియుండఁగా వెఱపేల?

సుధే—మీవంటివారి కాపుండఁగా వెఱవవలసినపని లేదు. అదె గదను కేలఁ దాలిచి భీమునివలె వలలుఁడు వచ్చుచున్నాఁడు. నాగుండె కుదుటఁబడినది.

కం—(తనలో) ఈమె వలలుని భీమునిగా నెఱిఁగి యుండదుగదా?

[గదాహస్తుఁడై వలలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సుధే—ఓయీ! వలలా! నీవు పోయినకార్యము పండెనదా? కాయనదా?

కం—మనోరథసిద్ధి యైనదా?

వ—దేవీ! నమస్కారము. కంకభట్టారకా! వందనము. నేను బడిన ప్రయాసము పిపాసచే నింతమాపివెంటఁ దగిలిన ట్లయినది.

కం—అంధరాజు కనఁబడ లేదా?

వల—అంధరాజు కనఁబడెను. కాని యతఁడు మన మనుకొన్న యంధరాజు కాఁడు.

కంక—మఱి యెవఁడు?

వల—సంగ్రామవీక్షాపేక్షచే వచ్చుచున్న యొకవృద్ధాంధరాజు.

కంక—అంధుఁడయినచో నిఁక యుద్ధమును జక్కఁగానే వీక్షింపఁగలఁడు.

వల—అతఁడు కేవ లాంధుఁడే కాక బధిరుఁడుసహిత మైనను, సంగరదర్శనమునకును సమరవార్తావిశేషాకర్ణనమునకును దగిన సాధన సంపత్తి లేనివాఁడు కాఁడు.

కంక— అట్టియద్భుతసాధన మేది?

వల—దక్షిణభుజాదండము లేకయు జనకుని కవలంబదండముగా నున్న పుత్రరత్నము.

కంక—అట్లయినచో నతఁడు తండ్రికిఁ దగిన తనయుఁడే.

వల—ఆయంగహీనతలు వారికి స్వదోషమువలన నైనవి కావు. స్వరాష్ట్ర రక్షణార్థముగా ము న్నొకసారి వా రొనర్చిన సంగర రంగమునందే వారి కీయంగ వైకల్యములు సంప్రాప్తము లయినవఁట!

కంక—వా రతి సుకృతులు.

వల—మేలు మఱవక మహారాజుగారు తాము పారితోషికముగా నొసంగెడి యుపకార వేతనము నంగీకరింపవలసినదని యెంత ప్రార్థించినను వినక వినయవచనములతో నిరాకరించి స్వతంత్రజీవనము చేయవలె నన్న యుదారబుద్ధితో వా రిప్పుడు కృషీవృత్తి నవలంబించి చెమట యూర్చి స్వకాయకష్టమువలన జీవించుచున్నారఁట! గ్రుచ్చి గ్రుచ్చి నే నడిగినమీఁదట వా రిష్టములేకయే యీవృత్తాంతమును నాతోఁ జెప్పవలసినవా రైరి.

కంక—వారు మన కత్యంత గౌరవార్హులు.

గీ. పృథివిలోపలఁ బరతంత్రవృత్తిఁ దోడఁ
బడయునట్టి మహేంద్రవైభవముకంటె
నుత్తములు దాము స్వచ్ఛందవృత్తితోడి
కొలఁది విభవంబె గొప్పగాఁ దలఁతు రెపుడు.

పరభాగ్యోపజీవులు కా నొల్లని యీయోగ్యపురుషులపేరు లేవో యెఱుఁగుదువా?

వల—వారిలో వృద్ధుని పేరు పురుషోత్తవర్మయఁట! కుమారుని నామము వజ్రబాహువఁట!—అదె వారు వచ్చుచున్నారు. క్షణకాల మూరకుండుఁడు.

సుధే—వృద్ధుని బుజసులమీఁద నెక్కించుకొని కుమారుఁ డెట్లు మిట్ట నెక్కుచున్నాఁడో! వారును మన మున్నయెడకే వత్తురా?

వల—రారు. వారు మనముందున్న యీమెట్ట నెక్కి యక్కడ నుండి యుద్ధమును జూతురు. పల్లములోనున్న మనకు వారాడుకొను మాటలు వినఁబడునుగాని వారికి మనము కంటఁబడము.

తంత్రీ—వారివలెనే మనమును మిట్టనెక్కి ప్రత్యక్షముగా సంగ్రామము నేల సందర్శింపరాదు?

కంక—మన మట్లు చేయరాదు. ఉన్నతప్రదేశ మధిరోహించి యుంటచే మన మొక్కింత పగవారికంటఁ బడితిమా, మన కపాయము సంభవించును.

వల—వీరి యూజ్ఞ మన కవిలంఘనీయము. ఈయుభయుల మూలముననే మనము సకలమును నిరపాయముగా నెఱుఁగవచ్చును. వృద్ధుఁ డంధుఁ డగుటచేతఁ దాను జూచిన దెల్లను గుమారుఁ డాతనికిఁ దెలుపుచుండును. బధిరుఁ డగు తండ్రికిఁ దెలుపునప్పుడు కొడుకు బిగ్గరగాఁ జెప్పక తీఱనందున నందనుఁడు పలుకు ప్రతివాక్యమును మనకు వినఁబడుచునేయుండును.

దామ—కన్నదానికిని విన్నదానికిని భేద ముండదా?

కంక—మొట్టమొదటఁ గొంతసేపు మనము శ్రవణానందముగా వినుటతో దృప్తి వహించినయెడల, తరువాత నేత్రోత్సవాపాదక మగు సమిద్దర్శనమే కాక మహోత్సాహముతో నాహవముననే భాగస్థుల మగుభాగ్యముసహితము మనకు లభించునేమో! కొంచెము తాలిమి వహింపుఁడు. అదిగో వారు గుట్ట నారోహించినారు.

వల—ఈసంగరభరీభాంకరణమాచే నాయంగము హొంగుచున్నది. ఏదీగద? (అని లేవఁబోవుచున్నాఁడు.)

కంక—వలలా! తాళుతాళు ఇది సమయముకాదు. నీ వేమి రణరంగభీముఁడ వనుకొనుచున్నావా? నీ వెవ్వఁడవో స్మరణకుఁ దెచ్చుకో.

వల—(తనుఁ జూచుకొని) నేను విరాటుని వంటలవాఁడనా? వీరావేశమున నన్ను నేను మఱచితిని మన్నింపుఁడు. (అని మరలఁ గూయుచున్నాఁడు)

పురు—ఓహో! తెలిసినది. యుద్ధ మారంభము కాఁబోవుచున్నది కాఁబోలును! నామీఁద నేదో ధూళిలాగున రాలుచున్నది. ఇది యీవృక్షమునుండి పడుచున్న పుష్పరజమా? గమనవేగమున నుత్థాపితమైన బలహయపరాగమా?

వల—ఇది యుద్ధయాత్రచేయుచున్న మన సైనికనికరములచరణహతులచే లేచినదుమారము. అదిగో మనసేన శత్రుసేనమీఁది కెంత వేగముగా నడుచు చున్నదో!

ఉ. తమ్ము పుడప్పు మింటి జలదమ్ములు వృష్టి నడంచు చుండుటన్
బమ్మిన పూర్వవైరమును బాపికొనన్ ఘనరోషమూర్తులై
దొమ్మి యొనర్పఁబోవుగతిఁ దోయదవీధికి శోణధూళి మే
ఘమ్ములు మిన్నుముట్టఁగ గ్రమ్ముచు లేచెఁ జమూపదాహతిన్.

పురు—యుద్ధమున్న పేరు విన్న నామేను పొంగుచున్నది. నేను వ్యర్థుఁడనై దూరమున నిలువఁజాలను. నన్ను రణరంగమునకుఁ గొనిపోయి విడువుము. ఖడ్గపాణినయి పోరాడి జయము నొంది స్వామికార్యనిర్వాహకుఁడనయి చిరకీర్తినైనను గందును. విమతులఁ గొందఱనైన హతులను జేసి స్వామ్యర్థపరిత్యక్తదేహుఁడనై జయము నొంది వీరస్వర్గము నైనను జూఱగొందును. ఏదీ ఖడ్గము? ఎక్కడ నున్నది? (అని తడవుచున్నాఁడు.)

వల—(లేచుచు). ఈవృద్ధునకు నేనును దోడుపడుదునా?

కంక— వలలా! కూర్చుండుము. నిమిషనిమిషమునకును నిన్ను నీవు మఱచుచున్నావు. త్వరపడఁబోకు. మహారాజుగారు నిన్నీ కొలికి సంరక్షణార్థముగా నియోగించి పోవుట విస్మరించితివా?

వల— అవునౌను. రాజాజ్ఞ మీఱి నే నీస్థలమును విడువఁగూడదు. (అని కూర్చున్నాఁడు.)

వజ్ర—నాయనా! వృక్షమూలముప నట్లు తడవెద వేమి? ఊఁత కోలనేకాని నీ విచటికిఁ గరవాలమును దేలేదు. యుద్ధవార్తను విని మన మింటికిఁ బోక పొలము నుండియే యిచ్చటికి వచ్చినాము కామా?

పుర—అక్కటా! పాపపుదైవము సమయమునకు నాచేత ఖడ్గము సైతము లేకుండఁ జేసెనుగా! నీ విక్కడనుండి చూచి సంగ్రామ క్రమమున్నెనను నాచెవుల వేయు చుండుము. కన్నులతోఁ జూడలేక పోయినను మహారాజుగారి యవక్రవిక్రమమును తద్భటుల యుద్భటపరా క్రమమును వీనులార వినియైనను సంతోషించెదను.

వజ్ర—క్రిందినుండి రణరంగము నాకు స్పష్టముగాఁ గానరా కున్నది. వృక్షారోహణము చేసి చూచి సరిగాఁ జెప్పెదను. ఈతరువుపై కెగఁ బ్రాకుటకు నా కొకింత చేతోడగును.

పుర—ఎక్కుము (అని చేయి సాయ మిచ్చి యెక్కించు చున్నాఁడు.)

వజ్ర—నే నీకొమ్మమీఁద నెక్కి కూరుచున్నాను. ఇక్కడనుండి నాకు సమస్తమును దృగ్గోచర మగును (అని ముందువంకఁ జూచి) అదిగో సంగరరంగము సర్వమును నా కిప్పుడు కన్నులఁ గట్టినట్టున్నది. మన భటులు పరబలమును సమీపించినారు. వా రెట్లు వీరాలాపము లాడు చున్నారో వినుచున్నావా? ఇంతదూరమునకు వారి మాటలు చెవిలోఁ జెప్పిన ట్లెంత స్పష్టముగా వినఁబడుచున్నవి!

పురు—పయినుండి యేమో యనుచున్నావు. బిగ్గరగాఁ జెప్పు.

వ్రజ—వారి వీరాలాపములు——వీరాలాపములు—వినఁబడు చున్నవా?

పురు—నాచెవిటిచెవులు చవులుగులుకు వారిసుభవచనములను వినుపాటి పుణ్యమునకు నోచుకో లేదు. వా రేమనుచున్నారు?

వ్రజ—ఏ మనుచున్నారా?

క. కొట్టుఁడు——పరుగులు వెట్టుఁడు——
పట్టుఁడు——మనపసులఁ గొంచుఁ బాఱెద రదె యా
కట్టిఁడిపగతుర నిలువం
బెట్టుఁడు—— వడి గోగణంబు విడిపింపుఁ డిటన్.

అని పలువురు పలుఁదెఱంగుల వీరోక్తులు పలుకు చున్నారు. ఉభయబల ములును గలియఁబడినవి. సంకులసమర మగుచున్నది.

పురు—కన్నులు లేని కొఱఁత నా కిప్పుడుగదా తోఁచుచున్నది!

వల—మేము కన్నులు గలవార మైనను లేనివారమే యైనాము.

వ్రజ—ఓహో! ఏమి యారణక్రీడ!

మ. ధరణీకాంతయు నఁ శరిత్పతియున్ దా రొండొరుల్ కందుకో
త్కరసంక్రీడ యొనర్చుచో నెగయు నుద్యత్కందుకౌఘం బనన్
శరధారాహతిఁ ద్రెస్సి నూఱులు సహస్రంబు ల్మహోగ్రాకృతిన్
శిరము ల్మింటికి నొక్కట న్నెగసి క్షోణిం గ్రమ్మఱం గూలెడిన్.

వల—పుచ్చకాయలవలె నెగయుచున్న యీపుఱ్ఱె లన్నియు మనపగవారివే యగునుగాక!

కంక—తథాస్తు!

పురు—ఆహా! ఏమి వారిపుణ్యము! ఒక్కసారిగా నెందఱు సుభటులు వీరస్వర్గమును గొల్లగొనుచున్నారు!

వ|జ—

చ. బలికి నలంకరించుకొని వచ్చిన కైవడి యోధవీరు ల
త్యలఘుగ దాసి మన్గర శర ..నకంకటభూషితాంగులై
కలఁగక పోరు సల్పి తృణాల్పముగా నదె యుద్ధరంగమం
దెలమిని మృత్యుదేవతకు నిచ్చిర రక్తములున్ శిరంబులున్.

చూడు చూడు మనసేనాని తేరు డిగ్గి కౌక్షేయకము కరమున్దరనఁ
గరమున్దను మెఱుఁగులు గక్క విపక్షసేనాధ్యక్షులమీఁదఁ బడి యెట్లు
వీరవిహారము సలుపుచున్నాఁడో!

ఉ. ముష్కర సైన్యకాంక్ష నసిపుత్రిక వీరవరప్రశస్తకం
ఠమ్ములఁ గౌఁగిలింపఁ బ్రకటం బగుదివ్యసతీస్వయంవరే
ష్టమ్మున వేడ్క నాఁడెదు వసంత మనన్ రుధిరప్రపూరముల్
చిమ్మనగ్రోవులం బయికిఁ జిమ్మినయట్లుగ మిన్నుముట్టెడున్.

ఇప్పుడు ధూళి - పూర్ణముగా సడఁగిపోయినది. స్వసైన్యనాశమున కోర్వక శత్రుసేనాపతి యైన విక్రమభుజుఁడు డస్సిపడి వీరసేనుని ననూనశరధారాప్రవాహమున ముంపఁగా నతఁడు మరల రథారోహణము చేసి శరశరాసనముల నందుకొనుచున్నాఁడు.

వల—మనవీరసేనునకుఁ బోరు భార మగునేమో! నేను బోయి—

కంక—తాళుము. వారిమాటలు విననిమ్ము.

పురు—సుమారా! మన మహారాజుగారి నుపేక్షించుచున్న ట్టున్నావే?

వ|జ—లేదులేదు. ఈక్రిందుకయ్యమున మహారాజుగారిరథమే నాదృష్టిపథమునఁ బడకున్నది.

సుధే—ఏమిబుద్ధి?

కంక—అమ్మా! అతఁడు మఱేమో యనుచున్నాఁడు విను,

వజ్ర—ఇప్పటి కది నేత్రగోచర మైనది. కేతనమునుబట్టి రథమును గుఱుతుపట్టినాను. మహారాజుగారును బ్రత్యక్షముగాఁ గాన వచ్చుచున్నారు. ఆమహారాజపర్జన్యుఁడు వైరివీరులమీఁద శరవర్షము లెట్లు కురియుచున్నాఁడో!

పురు—నీవు వేఱుప్రక్కకు దృష్టి మరలింపక మనమహారాజు గారిపౌరుషమునే నాకు వర్ణించి చెప్పుచుండుము.

వజ్ర—ఏమి యాశ్చర్యము!

ఉ. తూణమునందుఁ జేయిడుట తూపులఁ దీయుట కార్ముకంబునన్
బాణచయంబుఁగూర్చుట విపక్షులపై గుఱి పెట్టి యేయుటల్
కానఁగరా వొకింతయును; గానఁగ నౌ విలు మండలాకృతిన్
బూనుట యంపవాన లరిముఖ్యుల ముంచుటమాత్ర మెప్పుడున్.

క. కరలాఘవ మే మందును
శరములు పుంఖానుపుంఖసంగతి నడరన్
శరములు వింటిని శాత్రవ
శిరములు మంటిని శతములు చేరెడు నొకటన్.

శా. ఆహాకారముతోడ సల్లడల నత్యార్తి న్నిజానీకిపీ
వ్యూహంబు ల్చెలివంగ నద్దుపడి తాఁ బుంఖాను పుంఖంబుగా
శాహాటోపముతో సుశర్మ ధరణీపాలాగ్రగం దాఁకి యు
త్సాహస్ఫూర్తిని నించెడున్ విశిఖవర్షంబు ల్మహోగ్రంబుగన్.

కటకటా! మనరాజుగారిధ్వజంబును రథాశ్వవజంబును నేలఁ గూలెను గదా!

సుధే—ఏమిబుద్ధి?

వల—తోడుపడ మన కిది సమయము.

కంక—తాళుఁ. ఆతఁ డేమో యనుచున్నాఁడు.

వజ్ర—

మ. గద కేలన్ ధరియించి తేరు డిగుచుం గాలాంత కాకారుఁడై
కదియం బోయి విరాటభర్త రిపుయుగ్మవ్రాతము న్నాతునిన్
జదియ న్మోఁదె సుశర్మయు న్విరథుఁడై సర్వాం సహామండలం
బదరన్ దూఁకె గదారణం బొకటఁ జేయున్ దారుణ ప్రక్రియన్.

క. కని శంఖాద్యనుజులు మన
మనుజపతికిఁ దోడుపడిరి; మఱి యరియోధుల్
చని తోడ్పడిరి సుశర్మకు;
రణసంకులతన్ గుఱు తిడరా దొండొరులన్.

దృష్టి చెదరనీక మహారాజుగారి దారుణప్రవిదారణకౌశలమునే నేత్ర పర్వముగా నాలోకించుచుండఁగా మన కత్యంత సమీపముననే యేదో నేమి ధ్వనివలె వినవచ్చుచున్నది. ఈచెట్లక్రిందికి రథ మేదియు రాదుగదా? ఏమిది? మనభటు లింతమంది పరుగువాఱు చున్నారు!

పురు—సుశర్మసేనమీఁదికా?

వజ్ర—కా దీవంకకు.

సుధే—రాజుగారు మన క్షేమైన సందేశము బంపు చున్నారేమో!

వజ్ర—ఏరీ భటులు? నే నెదురు పోదునా?

కంక—వేగిరపడకు. వారి నిట రానీ.

పురు—శత్రుభటులవలన నీ కిష్ట దేమి కీడు మూఁడునో యని నాయుల్లము తల్లడిల్లుచున్నది.

వజ్ర—వారిబాణము లింతదూరమురావు.

పురు—నాభయ మదికాదు. కంటఁబడితివా శత్రు లిట వచ్చి నిన్ను వధింతురేమో యని భయపడుచున్నాను.

• వజ్ర—అంధున కూఁతకోలగా నీతోనున్న నన్నుఁ జూచియు నా కెగ్గు దలఁతురా? నీచెంత నున్నంతవఱకు నాకా భయము లేదు.

పురు—లోకానుభవము చాలనిబాలుఁడ వగుటచేత నీవు పరులను నీవలెనే భావించుచున్నావు. వారి కంతనీతి యుండినపక్షమున నిష్కారణముగా మఱగోగణములను బట్టుదురా? కానిమ్ము. వారీస్థల మును దాఁటిపోవువఱకును క్షణకాలము నీవు మాటాడక నామాట విని మౌనము వహించి యుండుము.

వజ్ర—వారెవరు? ఇందు వచ్చువారు వైరిభటులు కారు. విరాటభటులు. మనభటులే.

పురు—కారుకారు. నీవు భ్రమపడుచున్నావు. నీమాటలు నేను నమ్మను. విరాటభటు లైనపక్షమున సంగర రంగమును విడిచి వెనుక కెన్నఁడైనఁ బరుగెత్తుకొనివత్తురా? కన్ను లున్నయెడల నేనే చూచి నిజ మెఱుఁగుదునుగదా? నేత్రహీనుఁడ నగుటచేత నితరు లేమి చెప్పినను నేను విని యూరకుండవలసి వచ్చుచున్నది.

వజ్ర—నీవు నామాట నమ్ముము నమ్మకపొమ్ము. నాకన్నులారఁ జూచినది నేను జెప్పుచున్నాను. నాకన్నులను నే నెట్లు నమ్మకుండఁగలను? ఇదిగో వారు మన మున్న చోటనుండియే పరుగెత్తుచున్నారు. వారిరాకకుఁ గారణాంతర ముండి యుండవచ్చును.

[ఇరువురుభటులు ప్రవేశించుచున్నారు.]

పురు—అట్లయినయెడల వారేల పరుగెత్తుచున్నారో యడుగుము.

వజ్ర—ఓ భటులారా! మీరేల యింతవేగముతోఁ బరుగెత్తు చున్నారు? ఎక్కడ కరిగెదరు? యుద్ధ మెట్లు చెల్లుచున్నది? ఎవరి కపజయము కలుగున ట్లున్నది? ఇటు వచ్చి చెప్పిపొండు.

భటులు—మాకు మీవద్దకు వచ్చి మీతో మాటాడుచుండు టకుఁ దీఱదు. వెనుక నిలువయున్న సేనలను బిలుచుకొనిపోవుటకును

పరుగెత్తుచున్నాము. శత్రుసేనాధిపతి యొక్క శరాఘాతముచేత మన సేనాని మూర్ఛితుండైనాఁడు. ఇప్పుడు నిమిత్తములు మన కంత యనుకూలముగా నున్నట్లు లేవు.

పురు—అయ్యలారా! అట్లయినవో నిలువక పరుగెత్తుఁడు. మీ రతివేగమునఁ బరుగెత్తుఁడు.

భటులు—(పరుగెత్తిపోవుచున్నారు.)

కంక—వలలా! సుధేష్ణాదికామినీజనరక్షణమునకయి మన మిందఱ ముండగా మనకు సేవలతోఁ బనిలేదు. ఈభటులవెంట మనబలకరపుబలమును బంపి వేయవచ్చును—అమ్మా! ఏమిసెలవు?

సుధే—వలలాదులు మీ రిందఱుండఁగా నా కేమి భయము? శీఘ్రముగాఁ బంపివేయుఁడు.

కంక—తంత్రీపాలా! నీవుపోయి యీభటులవెంట మనకావలి సేనను బంపివేసి యిక్కడ నున్నట్టే మరల రమ్ము.

తంత్రీ—చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

[సారథిసహితముగా రథముతో సేనాధిపతి ప్రవేశించుచున్నాఁడు.]

సేనా—(అంతటఁ గలయఁజూచి) సూతుఁడా! మనరథమిక్కడ కేల వచ్చినది?

సూతు—శత్రుశరప్రహారముచే దేవరవారు మూర్ఛితులు కాఁగా రథమును రణరంగమునుండి తొలఁగించి యీవృక్షచ్ఛాయకుఁ దెచ్చి నిలిపినాను.

సేనా—యథాపూర్వముగా రథమును యుద్ధభూమికి మరలఁ గొనిపొమ్ము. నాకిప్పుడు గాయ మంతబాధాకరముగా లేదు. నే నిప్పుడే పోయి నన్ను మూర్ఛపుచ్చిన యాతుచ్ఛునిప్రాణమును గొనవలెను.

ఘాతు — అదిగో పగదీర్చుకొనుటకయి మనసేన పోవుచున్నది. స్వామీ! మీరు నా ప్రార్థన మంగీకరించి యుంచుకతఁడ యిందు విశ్రమించి విగతశ్రమము లయి మఱి శత్రువు మీఁదికిఁ బొండు.

సేనా — అట్లుకాదు. ఆ ప్రకారముగా వీరభటు లంతమంది ప్రాణములు డాపక పోరాడుచుండఁగా సేనాధిపతి నన్ను పేరు పెట్టుకొన్న నేను శరీరములోఁ బ్రాణము లుండఁగానే వీరవిహారము సలుపక పయినుండి చూచుచు నూర కుందునా? ఆవల భూవరుఁ డే మయ్యెనో! తొలుము—తొలుము.

పురు — (ఆలకించి) ఇక్కడ నెవ్వరో గుసగుసలాడుచున్నారు. ఆమాటాడువా రెవరు? వీరభటు లైనయెడల మీ రీచెట్టునీడ కేల వచ్చినారు? ఆవల మీ రాజు ప్రాణార్థులై పోరాడుచుండఁగా మీ రాతనిని దిగవిడిచి యిచట మీప్రాణములు దాఁచుకో వచ్చినారా? పొండి పొండి. అవమానమునకు భయపడక మీరు చావునకా జడియు చున్నారు?

వజ్ర — తూలనాడకు.

సేనా — ఓవృద్ధుఁడా! నీ వనుకొన్నట్లు—

పురు — ఇది తూలనాడుటా? చేతఁ గత్తి దాల్చి వెనుక తిరిగి వచ్చుటకు మీరు సిగ్గుపడకున్నారు. అట్టిసిగ్గుమాలిన మీరు నాతో మాటాడ రాఁబోకుడు. మీయాలాపములశబ్దమే కాని మీరూపములు నాకు గోచరము కాకున్నవి. నేనే యంధుఁడనుగాక మిమ్ముఁ జూడ గలిగియుంటినా, పాఱిపంద లయి వెనుక తిరిగి వచ్చినందున కయి మిం మిమ్మ భూమికి బలి యిచ్చి యుందును. లెండు. పొండు. పోవుచున్నట్టు లే దేమి? మీవద్ద మగతనమే లేదా? మీరు ధరించినవి తెడ్లా? ఖడ్గములు కావా? ఖడ్గములే యయ్యె నేని పోయి పోరాడుఁడు.

సేనా--ఓయంధుఁడా! కోపపడఁబోకు. ప్రాణములు దక్కించుకోవలెనని పిఱికితనముచేత నే నిటరాలేదు. మూర్ఛితుఁడ నయియున్న సమయమున నాకుఁ దెలియకుండ సారథి నారథము నిచ్చటికిఁ దోలి తెచ్చినాఁడు. ఇదె పోవుచున్నాను--సారథీ! రథము తోలుము.

సూతు--మహాప్రసాదము. (అని తోలుచున్నాఁడు.)

వ్రజ--నాయనా! మనసేనాని మహావేగముతోఁ బోయి శత్రుసేనలమీఁదఁ బడుచున్నాఁడు.

పురు--ఎక్కడనుండి పోవుచున్నాఁడు?

వ్రజ--ఇక్కడనుండియే. ఎనుటిమాట వినిపించుకోక నీ వింత వఱకుఁ బదరుచుండినది మనసేనాధపతినే. అతఁడు గాయపడి మూర్ఛలో మునిఁగియున్నప్పుడు సారథి రథము నిటఁ దోలితెచ్చినాఁడు. అతఁడు మూర్ఛ తేరి తేరిని బోరి కున్ముఖము చేయుట కయి సారథిని ద్వరపఱుచుచుండఁగా నిజ మెఱుఁగక నీవు నిష్కారణముగా దూఱనాడితివి.

పురు--అయ్యో! అజ్ఞానముచేత సేనానియెడల నేను మహాపరాధము చేసితినే! అది నాబధిరత్వదోషముగాని నాదోషము కాదు. ఈయంధుఁడు చెవిటివాఁ డని యెఱిఁగి న న్నతఁడు మన్నింపకపోఁడు.

వ్రజ--ఇప్పు డీగతజలసేతుబంధ మేల? పోనిమ్ము. అదిగో యుద్ధభూమియం దంతకంతకుఁ గలకలము హెచ్చుచున్నది. రొఁజుచు మఱియొకభటుఁ డిందుఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

పురు--యుద్ధ మెట్లు నడుచుచున్నదో యాతని నడుగు.

[భటుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వ్రజ--ఓవీరభటా!--

భటు--నీతో మాటాడుటకు నా కవకాశము లేదు. నే నీవృద్ధుని మాట విన్నాను. నిమిత్తములు మన కిప్పుడు ప్రతికూలములుగా నున్నవి.

రాజుగారు మూర్ఛితు లైనారు. నే నంతఃపురస్త్రీ సంరక్షణార్థము పరు గెత్తుచున్నాను (అని పరు గెత్తుచున్నాఁడు.)

పుర——మహారాజుగారే మూర్ఛితు లయినారా? ఓభటుఁడా! నిరాయుధుఁడ నయియున్న నాచేతికి నీఖడ్గము నిచ్చి నన్ను శత్రుసేనలో విడువుము. గ్రుడ్డియెద్దు జొన్నచేనిలోఁ బడ్డట్టు శత్రుసేనాటవిలోఁ బడి ప్రాణముల కాశింపక కృప యెఱుఁగని నీకృపాణముతోఁ జేతి కందిన వారి నెల్లఁ దెగనఱికెదను.

సుధే——భర్తగారు మూర్ఛితు లయినా రన్నపిడుగువంటి దుర్వార్త నాచెవిని బడి హృదయభేదమును కావించుచున్నది. ఏమి చేయుదును? ఎందుఁ జొత్తును?

కంక——అమ్మా! తొందరపడఁబోకు. ఈభటుఁడు చెప్పునది సావధానముగా వినుము.

సుధే——ఓభటోత్తమా! శుభమా? అశుభమా? ఏమివార్త?

భటు——దేవీ! అశుభ మేమియు లేదు. తత్తరపడఁబోకుఁడు. రాజుగా రించుక మూర్ఛితు లయిరి. ఇప్పటికి మూర్ఛ తేరి మరల గదోత్సవము చేయుచుండి యుందురు. సంకులసమరములో నడ్డుపడిన తమ్ములకును గుమారునికిని గాయములు తగిలినవి. మనసేనల కపజయము కలుగునట్లు కనఁబడఁగా వైరులు క్రూరు లగుట విచారించి, ముందుగాఁ బోయి యంతఃపురకాంతాబృందము నుద్యానమందలి కృత్రిమాద్రికందరమునఁ దాఁగియుండ హెచ్చరించి రమ్మని సేనాని నన్ను నియమింపఁగాఁ దన్నియోగమును నివేదింప వచ్చినాను. నేను వచ్చుచుండఁగా శత్రుసేనలోనుండి యెవ్వఁడో యొకదుష్టుఁడు రాజుగారు పట్టుపడిరని యఱచెను గాని యంతపని పుట్టు నని నే ననుకోను.

సుధే——(గుండెలు కొట్టుకొని విలపించుచు) ఓనలలా! ఓదామగంధీ! ఓతంత్రీపాలా! నాకుఁ బతిభిక్ష పెట్టుఁడు. హా ప్రాణనాథా! హా–

వల——అమ్మా! శోకింపకు. కొంచెము తాళుము.

సుధే——అన్నలారా! తాళఁగలమార్గ మేదో నాకుఁ జెప్పుఁడు. భర్త క్రూరకిరాతు లగుపరులచేతులలోఁ బడె నని విని నే నెట్లు తాళఁగలను? (అని యేడ్చుచున్నది.)

వల——దేవీ! ధైర్యము విడనాడకు. ఇప్పుడే మేము పోయి నీభర్తను విడిపించి తెచ్చెదము. (అని లేచుచున్నాఁడు.)

సుధే——అందాఁక మేన నే నెట్లు ప్రాణములు నిలుపఁగలను? విధవనై పృథివిమీఁద నే నొక్కక్షణ మయిన బ్రదుకఁజాలను.

వల——ఎంతమాట! వైరిభార్యలుగాక మీరు విధవ లగుట మాదేహములలో నూపిరి యుండఁగానే సంభవించునా? అమ్మా! అధైర్యపడకు.——ఓకంకభట్టారకా! మీ రీశుద్ధాంతకాంతలను రహస్య స్థలమునకు వారముగాఁ గొనిపోయి వీరి రక్షణ మేమఱ కుండుఁడు.——ఓదామగ్రంథీ! ఓతంత్రీపాలా! మనము పోయి యిప్పుడ రాజుగారిని విడిపించి తెచ్చి దేవిగారినేత్రముల కపూర్వపర్వ మొనర్తము రండు. ఆయుధములను గైకొని లెండు.

కంక——శీఘ్రముగాఁబొండు. మీకు విజయ మగుఁగాక!——దేవీ! మనము ముందు సపరివారముగాఁ గృతకధరాధరకందరమున కరుగుదము రండి. లెండి.

సుధే——(లేచి) నాకు నడవఁ గాళ్ళు రావు——ఓవీరోత్తములారా! మీరు మరల వచ్చి భర్తృపునర్దర్శనము చేయించినదాఁక నాహృదయము కుదుటఁబడదు. మీకుఁ గార్యసిద్ధి యగుచు గాక! పొండు. (అని నడచుచున్నది.)

వల——అమ్మా! కార్యసిద్ధి యైనట్టే సంభావింపుము. మేము పోయి వచ్చెదము. (అని ముప్వురు నాయుధపాణు లయి రణరంగము వంకఁ బోవుచున్నారు.)

పురు——ఇంతకుముం దేదో రోదనధ్వనివలెఁ గొంతేమి నాచెవిని బడ్డట్టున్నది! అది యే దయిన మన కేమి? రాజుగారివార్త చెప్పుము.

వజ్ర——మనరాజుగారు పగతురచేఁ బట్టుపడినారఁట! విడిపింపుట కయి కాంభోలును సేనాని వైరివీరులతో ఘోరసంగ్రామము చేయు చున్నాఁడు.

పురు——ఏమి! ఇంతసేపలో రాజును విడిపింపఁగల మగతనము గలవాఁ డొక్కఁడును లేఁడుగా!

వజ్ర——ఎవ్వరో ముగ్గురువీరపురుషు లీవంకనుండి త్రేతాగ్నుల వలెఁ దేజరిలుచు శత్రుసేనాటవిమీఁద కురుకఁ బరుగిడుచున్నారు.

పురు——వారి కీశ్వరుఁడు తోడుపడునుగాక! ఓశూరవరులారా! శత్రువీరులలో నొక్కరిని మిగులనీయక యందఱిని మీప్రతాపాగ్నికిఁ బూర్ణాహుతి చేయుఁడు. ఇసీ! అశక్తునివలె నే నిప్పుడు శూరత్వముచేతఁ గాక నిరర్థకప్రలాపములచేతనే రాజభక్తిని గనఁబఱుచుచున్నాను!

వజ్ర——పలాయితు లగుచున్న సైనికులను జూచి సింహగర్జన ములవలె గుహాలు మాఱుమ్రోఁగు వారు వీరాలాపము లెట్లు పలుకుచున్నారో విను.

వల——

క. సంగరరంగమునం దిటు
　భంగము పడి సిగ్గు విడిచి పాఱెద రేలా?
　శృంగారార్థమె మీమీ
　సింగిణులును గైదువులును? చెడు భటులారా!

చ. నిలుఁడు నిలుండు; పాఱకుఁడు; నెట్టనఁ దాఁకుఁడు వైరివీరులన్;
　దలపడి పోరి శౌర్యఘనత న్విడిపింపుఁడు మీనృపాలునిన్;
　గలఁగి తొలంగఁ జేసులవి గాజులె? కత్తులు కావె? భీతియే
　ధ్యులఁ జెడుఁ గాని మిమ్ము భయదారులు గారు; యశంబు నొల్లరే?

లయి పోవుచున్న యీవీరత్రయముయొక్క విగ్రహములే స్పష్టముగాఁ గంటఁబడవు మన మిఁకఁ గ్రిందికి దిగుదమా?

పుష్ప—చీఁకట్లు కారుక్రమ్మినపక్షమునఁ గన్నులు లేని నాకును గన్ను లున్న యీసైనికులకును భేద ముండదు. కాఁబట్టి యింటికిఁ గాక నన్నును యుద్ధభూమికే కొనిపొండు. వీరశయన మొందిన భటునిచేతి కరవాల మొకటి నా చేత నిడి శత్రు మధ్యమున విడువుము. రమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## చతుర్థాంకము.

---

రంగము — సుశర్మశిబిరములోని పటమందిరము.

[సుశర్మయు, సత్యసేనుఁడును, విక్రమభుజుఁడును, భటులును, ప్రవేశించుచున్నారు.]

సుశ—ఓవిక్రమభుజా! ఓసత్యసేనా! భగవదనుగ్రహమువలనను యుష్మదాదుల యవక్రవిక్రమమువలనను మనకు నేఁడు విజయమహోత్సవము కలిగినది. ఓవిక్రమభుజా! మన యీగెలుపునకు ముఖ్యకారణము నీబాహుబలమే సుమా!

చ. బవరమునం ద్వదీయ కరవాలఫణీంద్రుఁడు కాఁడె యెల్లెడన్
జవమున సూఁకి సూఁకి బహుశాత్రవవీరుల ప్రాణవాయువుల్
చవిగొని క్రోలి తాఁ బలిసె సర్వగృహాళి నిరాటుపేట నేఁ
డవిరళలీల నేత్రముల నాంద్రకుఁ దల్లుల కస్రువాహినుల్?

మనపక్షమున విశేషనష్టము లేకుండ ననాయాసవిజయము కలిగించినది నీభుజవిక్రమముగాక వేఱే మున్నది?

విక్ర—ఇంత యంతయు నీస్వామ్యనుగ్రహమువలన నైనది గాని నాపౌరుషమువలనఁ గాదు. మీవిజయమునకు నన్నుఁగూడ నొక యుపకరణముగాఁ జేయ ననుగ్రహించినందునకు మీకును నార్యులకనేకాభివందనములు సమర్పించుచున్నాను.

సుశ—నీయసహాయసాహసక్రీడచేఁ గాక యసహ్యసామాన్య పరాక్రముఁ డైన విరాటుఁడు మనచేతఁ బట్టుపడువాఁడా? నీవు చేసిన యుపకారకృత్యమును మఱవక యెపుడు నేను సదా కృతజ్ఞుఁడ నయి యుండెదను—ఓసభాసదులారా! మనకుఁ గలిగిన యీవిజయమునకయి మీరందఱు సేనాపతి నభినందింపుఁడు—ఓవీరభటులారా! ప్రభుభక్తితోఁ బ్రాణములు దాఁచక పోరాడిన మీ కందఱకు నేఁ బహుసమ్మానములు చేసెదను—ఓసభ్యులారా! మన మిఁక విరాటరాజువిషయమున నడపవలసినపని యేమి?

సత్య—అత్యంతశీఘ్రముగా నంతకాంతికమున కనుచుట దక్క మఱి యేమున్నది?

విక్ర—అది ద్వేషైకమూషితులైన దయాశూన్యులు చేయఁ దగినదిగాని యుదారహృదయులు చేయఁదగినపని కాదు. మీవంటి వారు చంపఁ దగినశత్రువు చేతఁ జిక్కినప్పు డెట్లు చేసిన లోకము మెచ్చునో యట్లు చేయవలెను.

సుశ—శత్రుసంహారము రాజధర్మము కాదా?

విక్ర—శత్రుసంహారము రాజధర్మమే.

సుశ—అట్లయినచో నుత్తమక్షత్రియునకు శత్రుసంహారముకంటె లోకము మెచ్చఁదగిన పని మఱి యే ముండును?

విక్ర—రణరంగమున శత్రుసంహారము చేసినప్పుడు లోకులు మెత్తురుగాని చేతఁ జిక్కినవానిని జంపినప్పు డెవ్వరును మెచ్చరు.

సుశ—ఈవిరాటుఁడు మనకు శత్రుఁడు కాఁడా?

విక్ర—పోరాడుచుండినంతవఱకు శత్రుఁడేకాని యిప్పుడు పట్టుపడి దయనీయుఁడైనాఁడు.

సుశ—నాప్రాణములు గొనఁబూని నాపైకి దండెత్తి వచ్చిన గర్వశత్రువు ప్రాణములు గొననైన సంగ్రామవిజయశాలినగు నాకు స్వాతంత్ర్యము లేదా?

విక్ర—శత్రువు మీచేతిలో నున్నప్పుడు మనసు వచ్చినట్లు చేయుటకు మీకుఁ గావలసినంత స్వాతంత్ర్య మున్నది. అది నేను లేదనను. అయినను బట్టువడి యసహాయుఁడయియున్న పగవాని ప్రాణముల కలుగుట క్రూరకర్మముగాని వీరధర్మము కాదు.

గీ. పట్టువడి నిరాయుధుఁ డౌచు బద్ధుఁ డైన
యట్టిశాత్రవుఁ డసహాయుఁ డగుటకతన
మృతునితోడను దుల్యుండు పృథివిమీఁద;
శవముఁ జంపుటె యవ్వానిఁ జంపు టెల్ల.

ఉ. అక్కట! నీకు లోఁబడినయట్టి యరాతినిఁ జంపితేనియుఁ,
మిక్కిలి నీశ్వరుండు నిను మెచ్చునె? నీసరివారు మెత్తురే?
నిక్కము నీసుగౌరవము నీదుయశంబును జంపుకొంటగా
కెక్కువ యేల? శత్రు మడియించుటయే యది యించుకేనియున్?

సుశ—ఇప్పుడు నీవు చెప్పినదానినిబట్టి చూడఁగా బహుప్రయాసలబ్ధమైన మన యుద్ధవిజయ మంతయు వ్యర్థము కావలసిన దయినట్టు కనఁబడుచున్నది.

విక్ర—మనయుద్ధవిజయము వ్యర్థముగాక సార్థకపడవలయు ననియే నా యభిమతము. జేతయొక్కయుదారకృత్యమువలననే గెలుపు సఫల మగును. ఉదారబుద్ధి యింద్రియజయమువలనఁగాని కలుగనేరదు. రిపువర్గమును గెలువఁగలుగుటకంటె నింద్రియవర్గమును గెలువఁ గలుగుట యధికకీర్తికరము. బాహ్యశత్రువులకంటె నంతశ్శత్రువులను జయించుట దుష్కరము.

సుశ——ఏల?

విక్ర——యుద్ధజయము దైవాధీనము; ఇంద్రియజయము పౌరుషాధీనము.

ఉ. యుద్ధము చూడఁ గేవలము ద్యూతమువంటిది; యందు నందునుఁ
సిద్ధముగా ననర్హునకె చేకుఱు గెల్పొకకొన్నివేళలం
దిద్ధర; నెక్కివాఁ డొకట నేసిన రాయియుఁ బోలె, భీరుఁ డ
త్యుద్ధతిఁ జిమ్ము నమ్మ ఘనయోధునిఁ గూల్చును వైరికంబుగన్.

ఉ. కావునఁ గయ్యమం గెలుపొకానొకచోట నదృష్టకార్యమాఁ;
గేవలపౌరుషం బచటఁ గీడ్పడవచ్చు; నయోగ్యుఁ డైన, వీ
రావళి గెల్చు; నింద్రియజయం బటువంటిది గాదు; ధైర్యముఁ
భావబలంబునుం గలుగు భవ్యుఁడె గెల్చెడు నింద్రియంబులన్.

బాహ్యారిపులతోడి పోరాటమునో బలవంతుఁడును బలహీనునిచేఁ జావవచ్చును; బలహీనుఁడును బలవంతునిచేఁ జావవచ్చును. అందు యోగ్యత ప్రధానముకాదు. ఇంద్రియములతోడి పోరాటమో యట్టిదికాదు. అందు నిజమైనధైర్యమును మనోబలమును గలవాఁడేకాని యవి లేనివాఁ డెన్నఁడును జయము నొందఁజాలఁడు. కాఁబట్టి యింద్రియవిజయమే నిజమగు విజయము; అదియే నిజమైన పౌరుషము; అదియే నిజమగు శూరత్వము.

క. ఇల నింద్రియముల గెలువం
గలవాఁ డొకఁడె పురుషుండుగాక తదన్యుల్
బలముగ గడ్డము మీసం
బులుఁ గలుగరూపుఁ దాల్పఁ బురుషులె తలఁపన్?

సుశ——ఈవిరాటుఁడు పూర్వము నా కెంతో యవమానము చేసినవాఁడు. ప్రతిక్రియ గానక చిరకాలమునుండి పెరుఁగుచుండిన కొంటెపగను వడ్డితోఁ దీర్చుకొనుట కిప్పుడు సమయము వచ్చినది. ఇట్లు

దైవికముగా లభించిన యీసమయము నిప్పుడు జాఱవిడిచినపక్షమున, లోపల మెఱమెఱ మెఱయుచున్న నాహృదయశల్యమును బాపుకొనుట కవకాశము నాకు మరలఁ గలుగదు.—ఓభటులారా! మీరు పోయి విరాటు నిట కీడ్చుకొని రండు.

భటు——చిత్తము. మహాప్రభూ! (అని పోవుచున్నారు.)

విక్ర——దేవరవారు పాపకృత్యమును దేనినిఁ దలపెట్టరాదు. ఇట్టి సమయమునందు వేగిరపడి యొకయకార్యమునకుఁ జొచ్చుట రాజనీతి కాదు; యశస్కరమును గాదు.

సుశ——నాకు యశస్సుతోను గిశస్సుతోను బనిలేదు. చేతఁ జిక్కిన శత్రువు నూరక విడువరాదు. విడిచినచోఁ గాలాంతరమునఁ బ్రాణాంతము వచ్చును. ఇతఁ డిప్పుడు నాచేతిలో నున్నవాఁడు; నాకు శత్రువు.

విక్ర——ఈరెండు హేతువులచేతనే నీ కతఁ డాదరణీయుఁడు.

సుశ——నీమాటలయర్థ మేమో నాకు బోధపడలేదు. నీ విప్పుడు చెప్పెడి దేమి?

విక్ర——శత్రువును క్షమించి విడిచిపుచ్చుటయే యుదారచిత్తు లగువీరపురుషుల కిట్టి యెడఁ గర్తవ్యము. కారుణ్యమయమయిన యీ కార్యమే యుద్ధవిజయమున కలంకారము తెచ్చునది.

క. ఆరయఁ గారుణ్యసమో
 దారగుణం బొండు లేదు ధరణీస్థలిలోఁ
 గారుణ్యమె భూతలమునఁ
 జారుగతిన్ నరుని దేవసన్నిభుఁ జేయున్.

[అంతట భటునితోడ విరాటుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సుశ——(లేచి పరిహాసముగా) ఓహోహో! విరాటమహారాజుల వారా? దయచేయుఁడు. బహుకాలదర్శనము! ఏలిన వారెప్పుడును బగ వారికి లోఁబడువారు కారుగాదా?

విరా——అదృష్టదేవతయొక్క యవివేకముచేత ముండ్లకంప మీఁదఁ బుష్పగుచ్ఛము పడ్డట్టేయల్పుఁడయి యిప్పుడు నీపాలఁ బడినంత మాత్రముననె నీ వధికుఁడ వయితివనుకొని విఱ్ఱవీఁగఁబోకు. ఇల్లలుకఁ గానే పండుగ కాదు. ఇంతటి నడుమంత్రపు సిరి కింత గర్వమేల? నీపూర్వ స్థితి నొకింత స్మృతికిఁ దెచ్చుకో.

సుశ——నీనోటి కడ్డులేదు గనుకఁ గావలసి నన్నిదురుక్తుల నిప్పుడే ప్రేలుము. రేపు నీజిహ్వ నీకు వశముగాదు. తెల్లవారినతరువాత నీవు మరల సూర్యునిముఖమును జూడఁబోవు. మృత్యుముఖమున నుండియు నీ వెట్లుత్సాహము చెడనట్లు నటించుచున్నావు!

విరా—నినుబోటి వేషధారులకుఁ గాని నావంటి ఋజువర్తను లకు నటన మక్కఱలేదు. నాయంతరాత్మ నిర్దోషమయి యున్నప్పుడు నాకుత్సాహముగాక విచార మెక్కడనుండివచ్చును? నీవు పరిహాస ముగా నన్నట్లు నే నిప్పుడు మహారాజనే. నాదేశమును నాగోధనమును గాపాడుకోవచ్చిన మహారాజను. స్వదేశరక్షణమును మించిన మహారాజ ధర్మ మింకొకటి యేమి యుండును? నీవలె నేను బరులగోధనమును దొంగిలవచ్చిన తస్కరుఁడను గాను. నేను దొరను; నీవు దొంగవు. నీనిలివె డెత్తుధనము పోసినను నా కున్న మనోత్సాహము నీకు రాదు.

సుశ——ఇఁక నీకుఁ జావు నిశ్చయము.

విరా——దొంగలచేతిలోఁబడిన ధనస్వామికి మరణముగాక మఱి యేమివచ్చును?

సుశ——పాపము! ఈదొరగారిభార్యకు ముసలితనములో వైధవ్య దుఃఖము సంభవించుచున్నదిగదా!

విరా——చేతికి ఖడ్గ మిచ్చి నాతో సరిగా నిలిచి పోరాడుము. నాముసలితనమును నీపడుచుతనమును లోకమున కప్పుడు వెల్లడి యగును.

సుశ — ఓవిరాటా! నీవు ముసలిపిల్లవాఁడవే కాని బుద్ధిగలిగి పాండవు లెక్కడ నజ్ఞాతచర్య నడుపుచున్నారో చెప్పెదవా?

విరా — ఆమహానుభావుల గూఢచర్య యెవ్వరికి గోచర మగును? అట్టి సత్పురుషుల నామసంస్మరణముచేత మన మిప్పుడు కృతార్థుల మయినాము.

సుశ — వారు నీయండను దల దాఁచుకొని యున్నా రన్నచో నీప్రాణము పోదు. భయపడక నిజము చెప్పు.

విరా — నీ వడుగుచున్నా వని నేటికాలమున కసత్యము లాడ నేర్చుకొమ్మన్నావా? మావీట నుండు కుక్కకుఁగూడ నాలుక కసత్యము రాదు. పాండవుల యంతటి మహామహులే నాయొద్ద నుండునంతటి భాగ్యము తటస్థించినపక్షమున నేను నిర్భయుఁడ నగుదునుగాని భయ మేలపడుదును? అణుమాత్రమైనను వారికి సహాయుఁడు కాఁజాలినవాఁ డెల్ల గర్వపడవలెను.

సుశ — నీబావను సింహబలుని సంహరించిన మహాపురుషు లెవరు?

విరా — గంధర్వులు. ఆగంధర్వులే యాపుణ్యమును గట్టుకొన కుండిరేని నీవిప్పు డాసింహబలుఁ డనుసింహము బారికి గొఱియ వయి యుందువు.

సుశ — ఇప్పుడు నాచే కాఁగలకార్యమును గంధర్వులే తీర్చిరా?

విరా — నీచేఁ గాఁగలకార్యమేమో నాఁడు సింహబలుఁడు బ్రతికియుండఁగానే యైనది. లోక మెఱిఁగిన నీపౌరుషమును సిగ్గుమాలి నీ విప్పుడు పొగడుకోనేల?

సుశ — పాండవులు నీవీటను లేనేలేరా?

విరా — ఆపాండవులే మావీట నున్న పక్షమున, నిన్నిప్పుడు ప్రాణములతో విడుతురా?

సుశ—నాప్రాణములమాట తరువాతఁ జూచుకొందము ముందు నీప్రాణములమాట చూచుకో. నీకుఁ బ్రాణదానము చేసినయెడలఁ బాండవులఁ బట్టి యొప్పగించెదవా?

విరా—నిమిషభంగుర మగు నీశరీరమున కాశపడి మిత్రద్రోహము చేసి యకార్యకరణమునకుఁ జొత్తు ననుకొన్నావా? నిజముగాఁ బాండవులే నన్ను శరణొంది యున్నపక్షమున, నాకున్న యీయొక్క ప్రాణమునకుఁ దోడు మఱి లక్షప్రాణముల విడువవలసివచ్చినను తృణప్రాయముగా నన్నిటిని విడిచి వారిని రక్షించియుందును.

సుశ—ఓసత్యసేనా! ఈతనికిఁ బ్రాణత్యాగములు తృణప్రాయము లఁట! ఈతని మనోభీష్ట సిద్ధి యగునప్పుడు భార్యాపుత్రాదులు చూచి సంతోషింపవలెను. సంగర విజయోత్సవమును జూడవలె నన్న యభిలాషతో సుదేష్ణాదేవియు నీతనివెంట వచ్చి యున్నదని విన్నాను. నీ వస్త్రసేనాసమేతముగాఁ బోయి యామెను బట్టి యిందుఁ దోడి తెమ్ము. విజయోత్సవమునకు మాఱుగా భర్తృవధోత్సవముతో జే పామెకు నేత్రపర్వము చేయుదము.

సత్య—మహాప్రసాదము. దేవర యాజ్ఞ శిరసావహించి నిర్వహించెదను. (అని కొలువు విడిచి పోవుచున్నాఁడు)

విరా—ఈఘోరకృత్యమున కీశ్వరుఁడు విఘ్నము కలిగించును గాక!

సుశ—ఇతఁడు డిప్పుడు కొంచెము దారికి వచ్చుచున్నట్టున్నాఁడు—ఓవిరాటా! నీకు జీవితాశ యున్నపక్షమున, నీనీతిని గీతిని గొంతసేపు దూరముగా నుంచి పాండవులజాడ తెలిపి నీజీవితమును గొంత దీర్ఘపఱుచుకో.

విరా—నీతిసహిత మైనజీవన మొక్కపూఁటయైనను దీర్ఘమయినదే. వేయేండ్లు వర్ధిల్లినను నిష్ప్రయోజన మగుటచే నీతిమాలిన జీవనమే యత్యల్పమయినది.

చ. మనుజుని జీవితంపుఁ బరిమాణము నేఁడులచేతఁగాక చే
సిన ఘనకార్య సంచయముచేత గణింపఁగఁ జెల్లు నెప్పుడున్;
బనివడి నూఱువర్షములు వాయసమట్లులు పొట్టకూటికై
మనినఫలంబునుం గలదె మర్త్యుఁడు; భారమెకాక భూమికిన్?

మ. ఎతఁ డత్యంత పరోపకారి యయి సద్వృత్తంబుఁ దాఁ బూనునో
యతఁడే యల్పపుఁగాలమే మనియు దీర్ఘాయుష్కుఁ డెంతేనియున్;
ఎతఁ డెంతే నుపకారశూన్యుఁ డయి సద్వృత్తంబుఁ దా మానునో
యతఁడే దీర్ఘపుఁగాలమున్ మనియు నల్పాయుష్కుఁ డత్యంతమున్.

నీతి విడిచి ప్రాణములు కాపాడుకోఁదలఁచుట నీవంటి పౌరుషహీనులకుఁగాని నావంటి పౌరుషశాలులకు లక్షణముగాదు.

సుశ—కాటికిఁ గాళ్ళు చాచుకొనియున్న యీముసలివానికీమొండిధైర్య మెక్కడనుండి వచ్చినదో!—ఓభటులారా!

విరా—ఈధైర్యము నాకు నిష్కలుష మైన యీహృదయమధ్యముననుండి వచ్చినది. ఆపత్కాలమునందు మంచివారి కెప్పుడును ధైర్యమే సహాయము.

గీ. సాధుజనులకు నాపద ల్సంభవిల్లు
కాలముననె ధైర్యంబు ప్రకాశ మొందు;
అఱుగరాచినసమయంబునందుఁ గాదె
వసుధపయి గంధసారంబు పరిమళించు?

సుశ—ఓభటులారా! ఈ తెంపరి యిఁక నిటఁ బ్రేలనీక నాయెదుటనుండి యీడ్చుకొని పొండు—ఓరాజాధమా! ఇప్పటికిఁ బొమ్ము. నీ విప్పు డాడిన దుర్భాషలకుఁ దగినట్లుగా నిన్నెట్లు బాధపెట్టి హింసింపవలయునో తెల్లవాఱులోపల విచారించెదను—ఓభటులారా! ఈడ్చుకొనిపోయి శృంఖలాబద్ధుని జేసి యీరాత్రి యీతని భద్రముగాఁ గాపాడుచుండుఁడు.

భటు—చిత్తము మహాప్రభూ! (అని యాతనిఁ గొనిపోవు చున్నారు.)

సుశ—విక్రమభుజా! ఈతులువ ప్రేలిన ప్రలాపము లన్నియు విన్నావుగదా? నీ వింకను వీనిని జంపక విడువవలయు నని చెప్ప సాహసింతువా?

విక్ర—మన కీతనిఁ బాలిఁచుట ఘనకార్యము కాదని యిప్పటికిని జెప్పెదను.

ఉ. చంపఁగ నర్హుఁ డైన ఘనశాత్రవుఁ డేవరి చేతఁ జిక్కెనన్
జంప కువారి కెడిచి సాగఁగ సంపుట చావుకన్న నూ
హింపఁగ మానవంతునకు నెక్కువలాఘవ మూర్విలోపలన్;
బెంపునుఁ బేసు వచ్చుఁ బృథివిం గరుణాపరుఁడైన జేతకున్.

సుశ—కర్తవ్యమును జెల్లవారినతరువాత విచారింతము. వంట యింటి కుండే లివిరటుఁ డిఁక నెక్కడకుఁ దప్పించుకొని పోఁగలఁడు? ఇట్లు విరటుని గర్వభంగముచేసి స్వకార్యమును సాధించుకొన్నాము; ఇఁకఁ బాండవుల నన్వేషించి స్వామి కార్యమును నిర్వహింపవలసి యున్నది. పాండవులు కంటఁబడినదాఁక మనము చరితార్థుల మైతి మనుకోరాదు.

విక్ర—మహామేధావంతులగు దుర్యోధనమహారాజుగారు చేసిన యూహా యబద్ధ మగునా? ఇఁకఁ బాండుపుత్రులును మనకు నేత్ర గోచరు లగుదు రనుకోవలసినదే.

[తెరలోఁ గలకలము.]

సుశ—(ఆకించి) ఏమి యూసందడి? భటుల సంక్షోభధ్వనులు వినఁబడుచున్నవి.

[తెరలో]

ఎవ్వరో వీరపురుషులు ముగ్గురు త్రేతాగ్నులవలె మనసేనాటవిపయిం బడి బాణార్చులచే నడ్డు వచ్చినవారి నెల్ల నిర్దహించుచున్నారు. ఇదిగోం గావలివారల మమ్ముం బడమోంది విరాటుని విడిపింపం జూచుచున్నారు. ఓమహారాజా! వచ్చి రక్షింపుము — విరాటుని విడిపించినవాండవు నీ వెవండవురా?

సుశ — ఏమి యీసాహసము! వాం డేమో యుత్తర మిచ్చుచున్నాండు.

[మరలం దెరలో]

చ. వలలుండ; నే విరాటుకడ వంటలవాండ: నిదే త్వదీయ సే
నలం బరిమార్చి మామనుజనాయకుని న్విడిపించుకొంటి, బె
బ్బులి పెనువాతంబడ్డ వృషము న్వలె; వీరుండ వేన్, సుశర్ముండా!
వెలువడి వచ్చి వేగ విడిపించుకొనంజనుం గ్రమ్మఱన్ నృపున్.

సుశ — ఏమిది! వాండు నన్నే పేర్కొని పిలుచుచున్నాండు! ఓవిక్రమభుజా! నీ విందు నిలువుము. నేను బోయి వానిని స్వర్గమున కంపివచ్చెదను — ఓరిమూర్ఖా!

క. ఇదె వచ్చుచు నున్నాండను
బదరగ క్షణకాల మచట వదరక నిలుమీ
యిదె నాప్రతాపశిఖి కి
య్యెదన నీ వింధనంబ వయ్యెద వోకటా.

[తెరలో]

నీవు నిక్కంపుం బౌరుషశాలి వగుదువేని, న న్నెదిరించి ప్రాణమును మానమును దక్కించుకొని పొమ్ము.

సుశ — ఊరక వదరంబోకు. నీకండగర్వ మిప్పుడే యడంగును. నేను దారసించువఱకే కాని యామీందట నీనోటినుండి మాటరాదు.

(అని సత్వరముగాం బోవుచున్నాండు.)

విక్ర—ఓభటులారా! నాకృపాణమును ధనుర్బాణములను వేగఁ గొనిరండు.

[తెరలో]

ఓవిక్రమసేనా! మూర్తీభవించిన వీరరసాధిదేవతవలె నీవీరపురుషుఁ డెవఁడో గదాఘాతముచేత మనరాజును జయమొందుచున్నాఁడు. వేగ వచ్చి యీతని ప్రాణరక్షణము చేయుము.

విక్ర—ఓసుభటా! ఆయుధములు వేగఁ దెమ్ము.

భటు—ఇవిగోఁ దెచ్చితిని. (అని చేతి కిచ్చుచున్నాఁడు)

విక్ర—ఇదిగో నేను వచ్చితిని. మారాజును విడువుము. నేను దారసించులోపల విడువకుంటివా, నీప్రాణములు నీవికావు. నాచేతి ఖడ్గము దయయు గియయు నెఱిఁగినది కాదు సుమా. (అని పరుగిడు చున్నాఁడు)

[తెరలో]

త్రిమూర్తులవలె వచ్చిన యీముగ్గురిలో నొకఁడు ముందు విరాటుని గొనిపోవుచున్నాఁడు. అయ్యో! విరాటుఁడు తప్పించుకొని పోయెను గదా! ఇంకొకఁడు గదాఘాతముచే మనరాజును మూర్ఛపుచ్చినాఁడు. అయ్యో! ఇఁక నే మున్నది? ఓసేనాపతీ! వచ్చితివా? ఇఁక రాజునకు భయము లేదు.

వల—ఓదామగ్రంథీ! నీ వీసుశర్మను గొని విరాటునివెనుకఁ బొమ్ము. నేనీవచ్చినవానినిఁ బాఱఁద్రోలి వచ్చి నిన్నిప్పుడే కలిసికొనెదను.

విక్ర—ఓరీ! నరాధమా! నీ వింకను మారాజును విడువనే లేదుగా? నాచేతఁ జావు మని విధి నీనొసట వ్రాసియుండ, సామవచనములతో నీ వెట్లు విడుతువు?

వల—ఓవిక్రమహీనా! నాముందఱ నీవృథాప్రలాపములు ప్రేలక పౌరుషశాలివేని నీరాజును విడిపించుకొమ్ము. కార్యములచేత నేమియుఁ జేయఁ జేతఁగాక నీ విప్పుడు మాటలచేతఁ జేయుచున్నావు.

విక్ర——ఇఁక ములుకులచేతనేకాని పలుకులచేత నేను నీ కుత్తర మియ్యను.

వల——నన్నుఁ దూరసించినతరువాత నీ విఁక వేనితోను నా కుత్తర మియ్యవు. నీవు చేసినపాపముల కుత్తర మిచ్చుట కయి నిన్ను యమ సన్నిధానమునకుఁ బంప నా చేతి గద వేగిరపడుచున్నది. పాలిక నిలువుము.

[తెరలో]

అయ్యో! వీఁడు ప్రళయకాలదండధరునివలె మాఱు లేక మల యుచు నష్టపడిన యోధవీరుల నెల్ల గదాఘాతములఁ జదియమోఁదుచు మనసేనాపతితల భిన్నము చేసినాఁడు? పిడుగడిచిన తాళమువలె నేలఁ గూలి విక్రమభుజుఁడు కొట్టుకొనుచున్నాఁడు. నెత్తురు వఱదలు కట్టు చున్నవి. సేనాపతిమేన ప్రాణములు లేవు. హావిక్రమభుజా! హాసేనానీ! విరాటసేనాసముద్రము నీదివచ్చిన నీ వీవంటలవాఁడను చిఱుకాలువను దరింపలేక మునిఁగి చచ్చితివా?

వల——మీసేనాపతి నిహతుఁడయినాఁడు. మీసేనలో న న్నెదిరింపఁగల బిరుదుమగ లెవ్వరైనఁ గలిగిరేని రండు. అందఱిని సేనాపతి పోయినత్రోవనే పంపెదను. ఏమి! ఎవ్వరును రా రేమి?

సుశర్మసైనికులు——ఓపాపపుదైవమా! అతి ప్రయాసలబ్ధమైన మాగెలుపు నంతను నిమిషములో నిష్ఫలము చేసితివి! లోకములో నిన్ను నమ్మికొన్నవాఁ డెవ్వఁడు బాగుపడును? క్షణకాలముక్రింద మాలోనుండి యింతలోనే మమ్ము విడిచి మాపగవారిచెంతఁ జేరితివా?

సుశర్మ——(మూర్ఛ తెరలి) ఎవఁడురా నన్నుఁ బట్టుకొన్నవాఁడు? మనవాఁడా? పగవాఁడా?

దామ — నీశత్రుఁడను. నీ విప్పుడు విరాటునకు దాసుఁడ వయితివి. అతని యాజ్ఞానుసారముగా సర్వదండనమును బొందుట కయి నీ విప్పు డాతనికొలువుకూటమునకుఁ గొనిపోఁబడుచున్నావు.

వల — అది యేమి? దామగ్రంథీ! సుశర్మ మూర్ఛ తేటినాఁడా?

దామ — మూర్ఛ తేటి వీఁడు విడిపించుకొనఁ బెనఁగులాడు చున్నాఁడు. నీవిటురమ్ము.

వల — ఇదిగో నేను వచ్చి యీ త్రాళ్ళతోనే వీని పెడ రెక్కలు విఱిచికట్టెదను.

సుశ — ఇట వచ్చితివా నిన్నే విఱిచికట్టెదను.

వల — ఇదిగో వచ్చితిని. నన్నుఁ గట్టవేమి? నీగర్వభంగ మయినదా? యమపాశములవంటి యీపాశములతో నిన్ను బంధించి నాను. శక్తి యున్నచోఁ ద్రెంచుకొమ్ము. ఓవిరాటమహారాజా! ముందుగా నీ వీతంత్రీపాలునితో నడచి మననివేశమును జేరుము. నీసుఖవార్త తెలియక యంతఃపురకాంతలు తల్లడిల్లుచుందురు. మీ వెనుకనే మేమును మనపశుగణములను దొంగిలిన యీనరపశు వును మీసన్నిధి కీడ్చుకొనివచ్చెదము.

విరా — తంత్రీపాలా! దారితీయుము.

తంత్రీ — ఇటు. ఇటు.

వల — ఓసుశర్మా! మ మ్మాయాసపెట్టి యీగుదెపెట్లు తినక బుద్ధిమంతుఁడ వయి శీఘ్రముగా నడువుము. నడవక పెనఁగితివా తావు చేరునప్పటికి నీశరీరములో గట్టియెముక యొక్కటి యుండదు.

(సుశర్మసైనికులు దీనముఖములతోఁ జూచుచున్నారు.)

ప్రథమభటుఁడు — వారు మనరాజుతో దృష్టిపథమును దాఁటి పోయినారు. ఇఁక మనకుఁ బ్రాణభయములేదు. మనము మెల్లఁగా నడచి సేనతో ముందు నడిచిన సత్యసేనుని గలిసికొని, రాజును రక్షింపఁ బ్రయత్నము చేయుదము రండు.

ద్వితీయభటుఁడు—వారు మఱికొంతదూరము సాగిపోనీ. మనము మెల్లఁగాఁ బోవుదము. కార్యసాధననిపుణు లెప్పుడును త్వరపడ గూడదు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

## పంచమాంకము

---

రంగము:—విరాటరాజు సేనానివేశము.

[సింహాసనాసీనుఁ డగు విరాటరాజును, సమీపమున సర్వాపీఠముపైని తంత్రీపాలుఁడును, కొందఱు భటులును ప్రవేశించుచున్నారు.]

విరా—ఓతంత్రీపాలా! ఇటువంటి శ్రవణవిదారణమైన దారుణ వార్తవినియు హృదయము పగులక జాతిగుండెవాఁడనై బ్రతుకు చున్నాను! హా! ప్రాణేశ్వరీ! హా! సుదేష్ణా!

ఉ. ఒం డననేల? సింహబలు సోదరి వయ్యును వీరమాతవై
యుండియు వీరపత్ని వన నొప్పియు ముక్కున నూర్పు గల్గి నే
నుండఁగ దాయచేత నయయో కొనిపోఁబడితే? యనాథ య
ట్లుండజమాన! యీయెడలియం దెటు నిల్పుదు నింకఁ బ్రాణముల్?

ఓభటులారా! దేవి యేవంకకుఁ బోయినది? కంకభట్టాదు లెటుచనిరి?

ఆసత్యసేనుఁడు —ఆపాపాత్ముని పే రుచ్చరింపరాదు.

ఉ. ఎక్కడ కాన్నృపాలపసు విప్పుడు నాప్రియఁ గొంచుఁ బోయెనో
యెక్కటిఁ గూడముట్టి మ దహీంసకఘోరకఠారధారచే
వ్రక్కలు చేసెదం దనువు ప్రక్కలు ముక్క లొనర్చెదం దలల్
చెక్కలు వాపెదన్ సతిని జెచ్చెరఁ దెచ్చెదఁ జింతఁ బుచ్చెదన్.

(అని ఖడ్గహస్తుఁ డై లేచుచున్నాఁడు.)

తంత్రీ—ఓమహాప్రభూ! సేవకుఁడ నే నుండ దేవర కీశ్రమ యేల? కంకభట్టారకుఁడే యింతకు నావైరిభూకాంతుని నంతకుఁ జెంతకుఁ బుచ్చ కుండినయెడల నేనుబోయి తోడ్పడి యాతని నవలీలం దునిమి దేవిని దెచ్చి యిచ్చుట నున్నట్లు నీకు సమర్పించెదను.

విరా—అటువంటి క్రూరకిరాతుని చేతఁజిక్కి యింకను దేవి ప్రాణములు చిక్కఁబట్టఁ గలుగునా? నాఁడు ధనగుప్తుఁ డామృత్యుదేవత వాతఁబడి పురుషుఁ డగుటచేత మరల బ్రతికి బయలఁబడఁ గలిగెనుగాని యీయబల యెట్లు తప్పించుకొని రాఁగలుగును? ఈయడియాసతోఁ బని లేదు.

భటులు—ఓమహారాజా! దేవిని దేవేంద్రునివలె సహస్రదృష్టులతోఁ జూచుచుఁ గంకభట్టారకుఁడు కాపాడుచుండుటచేత దేవిచెంతఁ జేరి చూచుటకైనను సత్యసేనుని సేకు సాధ్యము కాలేదు. అదె ధనగుప్తుఁడు రోఁజుచుఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. అతఁడు యుద్ధ వార్తను విన్నవింపఁ గలఁడు.

[కొందఱు సైనికులు వెనుక రా ధనగుప్తుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ధన—(వగర్చుచు)—ఓ-ఓ-ఓమహారాజా! సత్యా—సత్యసేనుఁడు—

విరా—ఏమి చేసినాఁడు?

ధన—పాఱి—పాఱిపోయినాఁడు.

విరా—ఊపిరి సంబాళించుకొని కొంచెము తాళి మఱిచెప్పు.

ధన—(తెప్పెఱి) కంకభట్టారకు దాడికిఁ దాళఁజాలక సత్యసేనుఁడు పరాజితుఁడై పలాయితుఁ డయ్యెను. దేవి సురక్షిత యయి యున్నది.

విరా—ధనగుప్తా! కంకభట్టారకుని దాడికిఁ దాళఁజాలక సత్యసేనుఁడు పరాజితుఁ డయి పలాయితుఁడగుట నీవు కనివచ్చితివా? విని వచ్చితివా? దేవి సురక్షితయై యుండుట నిశ్చయమే కదా? నిత్య సత్యుఁడ వని ని న్నెఱిఁగియుఁ బగతునిచే భంగపడి సంచలత నొంది యున్న నాడెంద మిప్పుడు నీవు చెప్పిన మేలివార్త నొకపట్టున నమ్మఁజాలక సందేహపడుచున్నది.

ధన—ఓమహారాజా! విన్నది కన్నట్టు నే నెన్నఁడైన విన్న వింతునా? సత్యసేనుఁడు సిగ్గువిడిచి పాఱుచుండఁగా నే నీకన్నులారఁ జూచియే యీశుభవార్తను దేవరచెవిని వేయ వడివడిఁ బరుగిడి వచ్చినాఁడను. ఇఁక మీచిత్తము నించుకసేపు తత్తఱపాటు మాని స్వస్థత నొంది యూఱడిల్లి యుండు మనుఁడు. కంకభట్టారకుని వెంటఁ జెక్కుచెమర్పక విచ్చేసెడు సుదేష్ణాదేవియొక్క శుభస్వరూపమే క్షణకాలములోఁ బ్రత్యక్షముగా దేవరడెందములోని సందియమును దీర్పఁగలదు.

విరా—నీవాక్కు ఫలించి యంతటిభాగ్య మిప్పు డీకన్నులకుఁ గలుగవలెనుగదా? బ్రాహ్మణుఁ డయ్యును బరాక్రమమున మన కంక భట్టారకుఁడు బవరముల నాఱితేఱిన క్షత్రియువీరుని నోర్వఁగలుగుట నాపాలిటి భాగ్యదేవతయే యాతని రూపమును ధరించి నన్ననుగ్రహింప వచ్చిన దని భావించెదను.

తంత్రీ—అస్త్రవేత్తలైన బ్రాహ్మణసత్తము లుత్తమక్షత్రియుల నోర్చుట యిది క్రొత్త గాదు.

క. జమదగ్ని కుమారుఁడు మును
సమరంబున నిరువదొక్క సారులు నృపులన్
సమయించి నెత్రుమడువులు
సమదగతిం జేయలేదె క్ష్మాతలమందున్.

ఈమహాద్విజుని శౌర్యవిశేషమును నేను బూర్వము హస్తినాపురమునం దుండినప్పుడే యెఱిఁగినవాఁడను. ఈతఁడు ధనురాచార్యుఁడైన ద్రోణాచార్యుని శిష్యుఁడు. శౌర్యసంపదచేత నీతనిని క్షత్రియులలో నుత్తమ క్షత్రియుఁ డనవచ్చును.

విరా—ఓధనగుప్తా! క్రూరజనాగ్రగణ్యుఁడైన యాసుశర్మ తమ్ముఁడు దేవిని జెఱగొని పోవుచుండఁగా వీరాగ్రేసరుఁ డగు కంకభట్టారకుఁ డడ్డుపడి పోరాడి డేగ నోటఁబడ్డ పారావతినిబోలె రాణి నెట్లు విడిపించెనో సవిస్తరముగా వివరింపుము.

ధన—మొకటిరుండియు నే నచట లేను. యుద్ధ మెట్లు నడచు చున్నదో చూచివచ్చి యెఱిఁగింపు మని యుత్తరకుమారుఁడు పంపఁగా నేను వచ్చునప్పటికే మార్గమధ్యమున ముందు పలాయితుఁ డగుచున్న సత్యసేనుఁడును వెనుక వానిని దఱుముచున్న కంకుఁడును నా కెదురుపడిరి. సంగరవృత్తాంత మాద్యంతము దేవర కీసైనికులు విన్నవింపఁగలరు. ఓసైనికులారా! మీ కన్నది విన్నవింపుఁడు.

సైని—ఓమహారాజా! దేవరవారు పగతురచేఁ బట్టుపడి రన్న పిడుగువంటి దుర్వార్త చెవిని బడఁగానే దేవిగారు మూర్ఛగూరి మొదలు నఱికిన రంభాతరువువలె నేలఁ గూలి సఖిజనశైత్యోపచారములచేఁ గొండొకవడికిఁ దెప్పిఱిలిరి.

విరా—అక్కటా! దేవి కెంతసంతాపము కలిగినది! అనంతరము,

సైని—అంత నంతఃపురకాంతలు చింతాక్రాంత లయి భయభ్రాంతిచే దాయలు వచ్చి తమ్ము ద్రొమ్మి చేయుదు రని నానాముఖములఁ బఱవఁ జొచ్చిరి. కంకభట్టారకులవారు వారిసంభ్రమమును వారించి ధైర్యము చెప్పి దేవీపురస్సరముగా వారి నందఱిని గూర్చుకొని మావెంటఁ గృతకాద్రికందరమునకుఁ గొనిపోవుచుండఁగా దారిలో సత్యసేనుఁడు తనసేనతో వచ్చి తాఁకెను.

విరా—తరువాత?

సైని—తరువాత మనకంకభట్టారకుండు మొగంబు జేవురింపఁ గనుంగవ విస్ఫులింగంబులుగురియ మూర్తీభవించిన వీరరసాధిదేవతయో యన నాగ్రహవ్యగ్రుండై మహోగ్రంబుగా సత్యసేనునివంకఁ జూచుచు—

ఉ. వీరుఁడ వౌదు స్త్రీలకడ బీరముఁ జూపఁగ వచ్చినావె? యో
రోరి నరాధమా! నిలువు మొక్కనిమేషము పాఱిపోక; నీ
శూరత యెల్లఁ దెల్లమగుఁ జుమ్మని యమ్మరిఁ బోసి యేసినన్
నోరను నెత్తు రొల్కఁ బడె నొచ్చి యతం డరచచ్చి యుర్వరన్.

విరా—మేలు! మేలు! ఆపయిని?

సైని—ఆపైని మఱియే మున్నది? అతులువ తెలివిరాఁగానే లేచి మఱి యుద్ధభూమిని నిలువనోల్లక కాళ్ళకు బుద్ధిచెప్పి యూడనిఁబాడెను.

విరా—ఔరౌరా! ఏమి యీపౌరుషము! ఓకంకభట్టారకా! ఒక్కసారి నీ గాఢాలింగన మిచ్చి నన్ను గారవింపుము.

(అప్పుడు కంకభట్టు సుధేష్ణాసహితముగాఁ బ్రవేశించుచున్నాఁడు.)

కంక—అమ్మా! నామాట నీవిప్పుడైనను నమ్మెదవా? అదె మహారాజుగారు సుఖాసీనులయి యెట్లు కూర్చున్నారో చూడు. మన వలలుఁడు కార్యసాధనదీక్ష వహించి పోయినప్పుడును గార్యసిద్ధి గాకుండునా?

సుధే—ఓమహాత్మా! నా కిట్లు నేత్రోత్సవము చేయుచున్న యతఁడు నిజముగా నాప్రాణనాథుఁ డగునా? ఇప్పుడు సహితము నా చిత్తము నాకన్నులను నమ్మఁజాలకున్నది. ఇదియింద్రజాలము కాదుగదా? ఒకవేళ స్వప్న మేమో! కాదుకాదు. నేను మేలుకొనియే యున్నాను. ఓదైవమా! ఇది మాయచేయక నిజము చేయుము. నాప్రాణేశ్వరుఁడు నామాటకు మాఱుపలికిన నిది మాయకాదని నమ్మవచ్చును. (దాపు నకుఁబోయి) ఓప్రాణనాథా!

విరా—(లేచి) ఓప్రాణేశ్వరీ!

సుధే—(తనలో) ఇది నిస్సందేహముగా నాప్రాణేశ్వరునికంఠస్వరమే. (గాత్రస్పర్శనము చేసి) ఇందు మాయ లేదు. (ప్రకాశముగా) ఓమనోవల్లభా! ఏమి నాపుణ్యము! మీ రాయకాలమృత్యువునోటఁబడియు విడివడి యిప్పుడు మరల నాకంటఁబడుచున్నారు!

విరా—ఇది వలలుఁడు చేసిన యుపకారము. అతఁడు సాక్షాద్రణరంగభీముఁడై యి శత్రువులమీఁదఁ బడి పలువురఁ బొలియించి పోయిన వనుకొన్నప్రాణములనే మరల నిలిపినాఁడు. నీ వెట్లాదురాత్మునిపాలఁబడక మానప్రాణములు దక్కించుకోఁ గలిగితివి?

సుధే—ఈద్విజసార్వభౌముని యనుగ్రహమువలన (అని కంకుని జూపుచున్నది.)

విరా—ఓకంకభట్టారకా! సహస్రనమస్కారములు. చేర వచ్చి యొక్కసారి నిపరిష్వంగసౌఖ్య మిచ్చి నన్నుఁ జరితార్థుని జేయుము. నేను సహస్రజన్మము లెత్తినయెనను నీఋణలేశమును దీర్చుకోలేను.(అని కౌఁగిలించుకొనుచున్నాఁడు.)

కంక—విజయోస్తు! మహారాజా! నా కిప్పుడు జన్మసాఫల్యమయినది.

విరా—మారాజ్యమును బ్రాణములును మీ రిచ్చినవే. ఇటువంటిప్రాణదాతకు నే నేమి సమర్పించి సంతోషపెట్టఁగలను?

గీ. మృత్యుదంష్ట్రాంకురంబుల నిఱికికొన్న
నన్ను విడిపించె వలలుఁడు నాగబలుఁడు;
పట్టి వచ్చినఖలుశారిఁ బడక యుండఁ
గాంతఁ గాపాడితివి నీవు కంకభట్ట.

దీని నంగీకరించి నాభక్తిఁ గానందింపుము. (అని తనమెడ నున్నరత్నహారమును దీసి యాతనికంఠమున వేయుచున్నాఁడు.)

కంక——దేవరవారి యీచల్లనిమాటమాత్రముననే నాకు సకల సత్కారములును జరిగినవి? వేఱుగఁ గంఠమాలయేల?

విరా——నేను జేసిన యీసత్కారము మీరొనర్చిన యుపకృతికిఁ దగినదికాదు. కొండంతదేవరకుఁ గొండంతపత్రి యెవ్వరు సమర్పింపఁ గలరు?

కంక——తనయేలిక కయి ప్రాణములు డాపక పోరాడుట భృత్య సామాన్యధర్మము. అంతకంటె మే మధికముగాఁ జేసిన దేమియు లేదు. స్వకృత్యమును నిర్వహించిన మ మ్మింత పొగడనేల? ఈయపూర్వసమ్మానము దేవరవారి గుణగ్రహణపరాయణతను దెలుపునుగాని మాయర్హతను గాదు.

విరా——ఈవిషయమున మన మేకీభవింపఁజాలము. అది పోనిమ్ము. దేవిని జెఱగొనవచ్చిన యాదురాత్ముఁడు ప్రాణములతోఁ దప్పించుకొని పోఁగలిగెనా?

కంక——వంటవల్లు చొచ్చినకుండే లెంకుఁ బోఁగలదు? అదె యానరపశువును మావాండ్రిరుకు లిట కీడ్చుకొని వచ్చుచున్నారు.

విరా——క్షణకాలము వానిని కారాగారముగా నుండనిండు. మన వలలుఁడును దామగ్రంథియు సుశర్మనిటఁ గొనివచ్చుచున్నారు—— ఓధనగుప్తా! మేము నిన్నుఁ బిలిచినదాఁక నీ వించుకతడ వావలికిఁ బోయి యామదుష్టునికడ నేనుజుక కాచి యుండుము.

ధన——చిత్తము. (అని పోవుచున్నాఁడు.)

కంక——ఆసుశర్మ యెట్లు బెమసుగదిరి వడఁకుచున్నాఁడో!

[అంతట వలలదామగ్రంథులతో సుశర్మ ప్రవేశించుచున్నాఁడు]

విరా——(లేచి యెదురుగాఁబోయి) "ఓహోహో! సుశర్మమహారాజులవారా? దయచేయుఁడు. బహుకాలదర్శనము! ఏలినవా రెప్పుడును

బగవారికి లోఁబడువారు కారుగదా?" ఇది యింతకుమున్ను దేశరవారు నాకుఁ జేయ ననుగ్రహించిన సమ్మానమునకుఁ బ్రతిసమ్మానము.

సుశ—(తనలో) దీనికేమి యుత్తరము చెప్పుదు? ఇప్పుడు భీతిచేత నాయొడలు వడఁకుచున్నది; నాలుక తడఁబడుచున్నది; గుండెలు కొట్టుకొనుచున్నవి. అయినను గాంభీర్యము తెచ్చుకొని తగినసమాధానము చెప్పి నిక్కపు ధైర్యశాలివలె నటింపఁ బ్రయత్నించెదను. (ప్రకాశముగా) ఓరీ! నృపాధమా! ఇంతలోనే నీ కీకండకావర మేటికి? గడియకింద టి నీయవస్థను స్మరణకుఁ దెచ్చుకొని మఱి మాటాడుము. విధిదోషముచేతఁ బరాభూతుఁడైనవీరపురుషునిఁ బరిహసించుట యుత్తమక్షత్రియ లక్షణముగాదు. ఇట్లు పరిహాసము చేసినంత మాత్రముననే నీ వధికుఁడవు కావు.

విరా—"నీ నోటికడ్డులేదు గనుకఁ గావలసినన్ని దురక్తుల నిప్పుడే ప్రేలుము. రేపు నీజిహ్వ నీకు వశముగాదు. తెల్లవాఱినతరువాత నీవు మరల సూర్యునిముఖమును జూడఁబోవు."

సుశ—(తనలో) ఇతఁడన్నంతయుఁ జేయునేమో! ఏమి చేయుదును? హా దైవమా నా కెట్టిగతి తెచ్చిపెట్టితివి! ఓధైర్యమా! నన్ను విడనాడి పోఁబోకు. (ప్రకాశముగా) స్వపౌరుషముచేత నన్ను గెలువఁ జేతఁగాక యన్యుఁడు లోఁబఱిచినప్పుడు నాముందఱ సిగ్గుమాలి యీగర్వోక్తు లేల ప్రేలెదవు?

విరా—ఓరోరి దురాత్మా! నన్నింతకుమున్ను మూర్ఛితునిఁ జేయుట నీపౌరుషమో నీసేనాని యైనవిక్రమభుజుని పౌరుషమో స్మరణకుఁ దెచ్చుకో. అసుకృతాత్ముఁడు వీరస్వర్గమును జూఱగొనఁగా, 'పాకీ చిరాయు' నన్నట్లు నీవు బ్రతికి లజ్జలేక యాతని పౌరుషమును నీపౌరుషమునుగాఁ బరిగణించుకొనుచున్నావు.

సుశ—నేను బాపాత్ముఁడనా! ఏమి యీయున్మత్తప్రలాపములు!

• విరా—నావి ప్రలాపములో యమోఘవాక్కులో యిప్పుడే తెలిసికోఁగలవు. త్రుటికాల మోర్చియుండుము. పాపాత్ముఁడ నన్న నీ కెంత కోపము వచ్చినది! ఆపదలో నున్నప్పు డన్నకళత్రమునకు ద్రోహము దలఁచిన నీవు పాపాత్ముఁడవు గాక సుకృతాత్ముఁడ వగుదువా! ఔనౌను! నేనే తప్పఁదలఁచితిని. ఈరాత్రియే విగతప్రాణుడవు కానున్నందున, 'సుకృతీ గతాయు' వన్నట్లు నీవు సుకృతాత్ముఁడ వే యగుదువు?

సుశ—నిరాయుధుఁడయి చేతఁ జిక్కియున్న యరాతిని జంపఁబూనుట పౌరుషముగాదు, ధర్మమును గాదు.

విరా—ఇది యింతకుముందు నీవలన నేర్చుకొన్న పౌరుషమే. నీవు నేర్పిన నీతిని నీవిషయముననే ప్రయోగింపవలెను. దుష్టు లన్యుల విషయమున ధర్మమును దలఁపకపోయినను స్వవిషయమునందైనను ధర్మమును గోరుకొందురు. నీవు నేర్పిన ధర్మమిం కొక్కటి గలదు. నీకు సుకృతత్వసిద్ధి యగునప్పుడు నీబంధువులు నీవద్దనుండి వేడుక చూచి సంతోషపడవలెనుగదా?—ఓభటులారా! ఈతని మరణమహోత్సవ సందర్శనార్థ మయి యంతఃపురకాంతలను జెఱగొన నేతెంచిన మహానుభావుని నీతని తమ్ముని నిటకుఁ దోడ్కొని నిమ్మని మన ధనగుప్తునితోఁ జెప్పి రండు.

భటులు—మహాప్రసాదము. (అని పోవుచున్నారు.)

విరా—సుశర్మా! నీనిది నేను మఱచితిని. భ్రాతృవధోత్సవములో నీతమ్మునికి నేతిపర్వము చేయవలెనుగాదా? చెప్పు.

సుశ—(మేను చెమర్ప వడఁకుచున్నాఁడు.)

విరా—ఏమి? నోట మాటరాదేమి? ఓపిఱికిపందా! ప్రాణభీతిచేత గాలిలోని పూరెపుఱకవలె నెట్లు కంపమొందుచున్నావు!

సుశ—(గద్గదస్వరముతో) క్షమయను గుణమే పరాక్రమశాలి కలంకారము.

[బద్ధుఁడైన సత్యసేనుఁడు ధనగుప్తాదులవెంటఁ బ్రవేశించుచున్నాఁడు.]

సత్య—(తనలో) ఇది యేమి! విజయశాలియైన నాయన్నగారే యిచ్చట ఘనపాశబద్ధు లయి విజితుఁడైనవిరాటరాజుముందఱ నిలిచి యున్నట్లు కనఁబడుచున్నారు! ఇది యేదో యింద్రజాల మయి యుండవలెను.

ధన—ఓరీ! మదాంధా! మహారాజపత్నిని జెఱఁగొన నిన్ను బనిచిన నీయన్నగారియవస్థను గన్నులారఁ జూచినావా?

సత్య—ఇప్పుడు నాకన్నులే నన్ను మోసపుచ్చుచున్నట్లున్నవి. ఇది యేదో రాక్షసమాయ—మహేంద్రజాలము—ఇది కనుకట్టే కాకుండిన పక్షమున, జాముక్రింద భండనోద్దండవిజయవిరాజితుండయి నిండుకొలువుండి పరాజితుండయి పట్టువడిన విరాటున కర్హదండనము విధింపఁ గూరుచుండియుండిన యితఁ డింతలో నావిరాటునకే భృత్యుఁడయి ప్రోల నిలుచుండుట యెట్లు సాధ్య మగును?

ధన—ఓసత్యసేనా! నీకన్నులే నిన్ను మోసపుచ్చుచున్న వేమి? నీవు సత్యసేనుఁడ వగుదువో కావో చూచుకో. నీవు సత్యసేనుఁడవు కాకుందువేని, యితఁడు నీయన్న సుశర్మయును గాకపోవచ్చును.

విరా.—ఓసుశర్మా! నీవు పరలోకయాత్రకుఁ బోవ నున్నా వని విని నీతమ్ముఁ డితఁడె నిన్నుఁ జూడ వచ్చియున్నాఁడు. మరణమునకు ముందు నీవు నీభార్యకుఁ జెప్పవలసిన పలుకు లేవేని గలవేని యిప్పుడే యీతనితోడఁ జెప్పిపంపుము.

ధన—స్వామీ! ఈతనికి భ్రాతృస్నేహము మెండు. ఇతఁ డగ్రజుని విడిచి యరనిమిషమైన నుండఁజాలఁడు. యమమందిరమున కన్నకుఁ దెన్నుచూపుచు నాతనితోడనే యితఁడు ముందు నడుచును.

సుశ—ఓపలువలారా! పరాజితుఁ డయియున్నవానిని బరిహసించుట క్షాత్రధర్మము గాదురా.

ధన—ఓహో! నీనోటినుండి యెంత దొడ్డమాట వచ్చినది! పట్టుపడిన నన్నుఁ బరిహాసించినప్పు డీధర్మ మెందుఁ బోయినది?

విరా—నీధర్మము స్వాచరణమునందు నీకుఁ బనికిరాకపోయినను బరోపదేశమునకయినను బనికి వచ్చుచున్నది. మే మన్నది సత్యముకాక పరిహాస మయినట్టు నీవేల తలఁచెదవు? నీమరణవిషయమున నీ కింకను సందేహమున్న—

సుశ—(తనలో) ఇతఁడు నన్ను వధింపఁ గృతనిశ్చయుఁ డయి యున్నట్టే కనఁబడుచున్నాఁడు. ఓధైర్యమా! నేను బ్రార్థించుచున్నను నావద్దనుండక పరుగెత్తెద వేమి? ఓభయమా! ని న్నెవరు రమ్మన్నారు? నామనసు చొచ్చి యిట్లు కలఁచెద వేమి? (ప్రకాశముగా) తమ్ముఁడా! నోటమాట—

సత్య—(తనలో) ఇతఁడు నిశ్చయముగా నాయన్నగారే. వీ రన్నమాట యసత్యము కాదు. (ప్రకాశముగా) అన్నయ్యా! తడఁబడఁ బోకు. వీరితో నీపక్షమున నేను మాటాడెదను.—ఓకరుణాళులారా! చేతఁజిక్కిన శత్రువును జంపఁ జూచుట మీకిది యేటిపౌరుషము?

ధన— నేను త్తరము చెప్పెదను. ఓభటులారా! "వీఁడు సురాపానము చేసిన వానివలెఁ బ్రేలుచున్నాఁడే"

సత్య—తులువమాట లాడుటకు మీకిప్పుడు సమయము వచ్చినది.

ధన—ఓభటులారా! "వీని కేమైన నున్మాద మున్నదా?" "ఇట్లు కాఱులు ప్రేలుచున్న యీతులువనాలుక కోయక కత్తి చేతఁ బట్టుకొని యూరక చూచుచున్నారేమి?" ఓసత్యసేనా! న న్నెఱుఁగుదువా? నేటిప్రాతఃకాలమునం దీమాటలు నీచే ననిపించుకొన్న ధనగుప్తుఁడను నేను. నీమాటలు మరల నీకప్పగించివేసినాను. నేనిప్పుడైనను నీకు స్మరణకు వచ్చినానా?

సుశ—(తనలో) వీఁడు మే మన్న దన్నమాట లెత్తిపొడుచు చున్నాఁడు. ఇక మాటకుమాట యని వీనిని గదలించినఁ బ్రయోజనము లేదు. మంచిమాటలతో వీనిమనసు కరఁగింపఁ జూచెదను. (ప్రకాశముగా) ఓ విరాటమహారాజా! నీ వేమో కరుణాసాగరుఁడ వని చెప్పుకొందురే! నీ కీ నిష్కరుణత యెక్కడనుండి వచ్చినది?

సుదే—(రహస్యముగా) ఓ ప్రాణవల్లభా! నీ వీతనిప్రాణములు గొనఁగూడదు.

విరా—(రహస్యముగా) ఓప్రాణనాయకీ! ఎన్నఁడును నే నీతని వధింపఁ దలఁచుకోలేదు. వినోదార్థముగాఁ గొంతతడ వీతని నొక యాట యాడించి విడిచిపెట్టెదను. నీవితనిపక్షము నవలంబించి మాటాడు చుండుము. (ప్రకాశముగా) ఓసుశర్మా! కరుణామయమగు దివ్యవాక్కు నీనోటినుండి వచ్చి చెడిపోవుచున్నది—ఓ ప్రాణేశ్వరీ! "పాపము! ఈదొరగారిభార్యకు పడుచుఁదనములోనే వైధవ్యదుఃఖము సంభవించు చున్నదిగదా!"

సుదే—ఓ ప్రాణనాథా! మనమూలమున మనశత్రువునకునహిత మట్టివిపత్తు పుట్టరాదు.

కంక—(రహస్యముగా) అమ్మా! నీవు నీపూనికను విడువక యేలాగుననైన నీతని విడిపింపుము.

సుదే—(రహస్యముగా) ఓకంకభట్టారకా! దయార్ద్రహృదయు లైనరాజుగారిచిత్త మెన్నఁడైనఁ గ్రూరకార్యమునకుఁ జొరఁబాఱునా? మీరు నిర్విచారముగా నుండుఁడు.

సుశ—అమ్మా! ఈసభలో నీ కొక్కదానికిఁ దక్క మఱియెవ్వరికిని నామీఁద దయపుట్ట కున్నది.

వలలుఁడు—ఏలపుట్టును? ఆమెవలె నిక్కడ మఱియెవ్వరును స్త్రీలు లేరు. పిఱికితనముచేత స్త్రీతో సమానుఁడవు నీవు మఱియొకఁడ

వున్నావు. • మీయిద్దఱికిని దక్క సిక్కడ మఱియెవ్వరికిని నీమీఁద జాలి పుట్టదు.

సుశ—(తనలో) ఓభాగ్యదేవతా! నన్నీతనిచేతఁ జిక్కించిన చెలువుతోఁ దృప్తినొంది యీతనిడెందమందు నామీఁద దయనైనఁ బుట్టింపరాదా? నమ్మించి చెఱిచిన యీభాగ్యదేవత నేల పేరుకొన వలెను?

క. భాగ్యమునె నమ్మకొన్న య
భాగ్యుఁ డెవఁ డభీష్టసిద్ధి పడయంగలుగున్
భాగ్యము నమ్మించి ననున్
భోగ్యావసరమున మోసపుచ్చదె నేఁడున్?

ఇఁక నే నీరాజునే కనికరము పుట్టునట్లు ప్రార్థించెదను.

విరా—ఓసుశర్మా! పాపపరిహారార్థముగా నీశ్వరప్రార్థనము చేసి యాసన్నమరణమునకు సంసిద్ధుఁడవు కమ్ము.

సుశ—(తనలో) ఎప్పుడో రోగములచేత విడువవలసిన యీశరీరము నిప్పుడే విడుచుట కోర్చుకొందునుగాని యావలి నరకబాధలను దలఁపునఁ దెచ్చి నామనస్సు నన్ను భయపెట్టుచున్నది. ఏమి! ఈమనో వేదన! నామనస్సులో నిప్పుడు వేయి తేళ్లును జెఱ్ఱులును పాఁకుచున్న ట్లున్నవి. (ప్రకాశముగా) ఓరాజా!—(అని తలవంచుకొనుచున్నాఁడు.)

విరా—వ్రేలుమొగము వేసికొనుటయేకాని మొగము పైకెత్తి దేవుని వేఁడికోవేమి?

వల—హృదయము పాపములతో నిండియున్నప్పు డం దీశ్వరునిఁ బ్రవేశపెట్టుట కవకాశ మెక్కడ నుండును?

క. సుజనుఁ డెప్పుడైన దేవుని
భజియించుచుఁ బ్రీతితోడఁ బ్రాణము విడుచున్
కుజనుఁడో యీశ్వరభయమున
నిజముగఁ జావన్న మేటినెగులునఁ బొగులున్.

ఈశ్వరసాన్నిధ్యమునకుఁ బోవ మార్గము నొందుపుణ్యాత్ములు వేఱు; ఈపాపపుబొందిని వదలలేక యీశ్వరునికి దూరదూరములఁ దొలఁగు చుండు వీనివంటివారు వేఱు. ఈపాపాత్ముని కీశ్వరుని పేరెత్త నోరాడునా?

సుశ—(తనలో) ఓలజ్జా? భయమునకుఁ దోడు నీవుకూడ నన్నుఁ జేరి బాధించుచున్నా వేమి? ఛీ! నన్ను విడిచి తొలఁగిపో. (ప్రకాశముగా) ఓమహారాజా! ఈనీచునియెడఁ గరుణచూపుము. నీ వేయీశ్వరుని బ్రార్థింప నన్ను నియోగించితివో యాయీశ్వరునికిఁ బ్రీతికరముగా వర్తింప నిన్నుఁ బ్రార్థించెదను.

క. పరమోపకారి యంచును
గురు కోపమునఁ బగ తీర్పఁ గోరుటకంటెన్
బరమేశ్వరునికి రిపునెడఁ
గరుణను జూపుటయె ప్రీతికర మగుఁ జుమ్మా.

క. నీ విప్పుడ దయ చూపుము
దేవసమానుఁడవు గాఁగఁ దివిరెద వేనిన్
దేవగుణమె దయ ధరణిన్
కేవల రాక్షసగుణంబె నిర్దయత కనన్.

వివేకియైనవాఁడు తొలుదొల్తఁ గోపమును నిర్మూలము చేయవలెను.

ఉ. కోపముతోడఁ దుల్యమగు ఘోరతమాఘము లేదు; కోపమే
పాపులఁ జేయు మానవుల; భ్రాతల మాతలఁ జంపఁ జేయు; స
మ్రూపహితోపదేశములఁ దోఁచఁగనీక, నశింపఁ జేసెడున్
జూపును విన్కినిన్ గనులు శ్రోత్రములుం గలవారి కేనియున్.

[అని కన్నీరు విడుచుచున్నాఁడు]

కంక—(తనలో) ఈదివ్యవాక్యము లీక్రియాశూన్యునినోటినుండి వెడలి నప్పుడే యింత శ్లాఘ్యములుగా నున్నపుడు క్రియావంతుల నోటి

నుండి వచ్చినప్పు డెట్లుండునో! లోకములో నెట్టినుష్పథవర్తులును దెలిసియే యింద్రియములకు దాసులగుచుందురుగదా!

సుధే—ఓప్రాణనాథా! దీనులకన్నులనుండి వెడలు నీరు చూచి నేను సహింపలేను. మీకు నామీఁద దయగలదేని యీతని కన్నుల నుండి వెడలి పాఱుచున్నట్లుగా మీహృదయమునుండి కరుణామృతరసప్రవాహమును బాఱించి యీతనికుటుంబమును సంతోషవార్థిం దేల్పుఁడు.

కంఠ—ఓసుశర్మా! నీవు చేసిన యుపకారమునకుఁ బశ్చాత్తాపపడి మీదాసుఁడనని రాజుగారిని శరణు చొరుము. శరణాగతరక్షణనీతిందక్కఁడు.

వల—ఈకఠినాత్మునికన్నులనుండి నీరు భయముచేతఁ గాలువ కట్టుచున్నది కానియనుతాపముచేతఁ గాదు. వీఁడు దయనీయుఁడుకాఁడు.

సుశ—నాకన్నులనుండి నీ రనుతాపముచేతనే వెడలుచున్నది.

సుధే—ఓమనోనాయకా! ఇతఁ డన్న ట్లీబాష్పధారలు పశ్చాత్తాపముచేతనే వెడలుచున్నపక్షమున గంగాప్రవాహమువలె హృదయాంతరాళమందలి పాపమును గడిగి వేసియే వెడలిన వనుటకు సందేహము లేదు. అందుచేత శుద్ధుఁ డైనయితఁ డిప్పుడు దేవరవారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడు

విరా—ఓసుశర్మా! దేవిగారిదయవలన నీవు బ్రతికిపోయినావు. ఇఁక నీవారివద్దకు నీవు పో. (అని బంధములు విడిపించుచున్నాఁడు.)

సత్యా—ఓమహారాజా! ఇక్కడ మీదాసుఁడు మఱియొకఁడున్నాఁడు.

విరా—నిన్నును క్షమించినాము. ఓసుశర్మా! నేను మొదటి నుండియు నిన్నుఁ జంపఁ దలఁచుకోలేదు. నీధైర్యాదులను శోధించి నీకును నాకును గలభేదమును జూపి మఱి నిన్ను విడువవలయునని యెంచుకనే పీకపటనాటకమును నడిపినాను. పశ్చాత్తప్తుఁడ వగుటచే

నీ విప్పుడు నాకు శత్రుడవుగాక పరమమిత్రుడ వయినావు. మాతో వచ్చి నీవును నీతమ్ముడును మాయింట నాతిథేయసత్కారము లొంది మఱిపొండు. ఇది నాహృదయపూర్వక మైనప్రార్థన.

సుశ—ఓమహారాజా! శక్తిచేతగాక నీయాదరముచేత నిజముగా నే నిప్పుడు చంపఁబడినవాఁడ నయినాను. చంపవలసిన శత్రువే తనయెడ దయ చూపుటకంటె మానవంతునకు మరణము వే తే ముండును?

విరా—సుశర్మా! ఈయవమానదుఃఖము మనసునం దుంచుకోక మఱచిపొమ్ము. ఈపరాభవమరణముచేత నీశ్వరుఁడు నీకు నీతిమంత మయిన నూతనజన్మమును బ్రసాదించుఁగాక! ఓకంకభట్టా! ఈరాత్రి సేనలను సుఖనిద్ర చేయ నియమింపుము. మనమును గొంతసేపు విశ్రమింతము.

కంక—దేవర యాజ్ఞాపించినట్లు చేసెదను. సేనలను దోడుకొని వచ్చుట కయి పురమున కేగియున్న మనసేనానీక శంఖాద్యనుజతనూజుల కీవిజయవార్తను దెలుప ధనగుప్తుని నిప్పుడె పంపవలెను.

విరా—ధనగుప్తా! నీ విప్పుడె పోయి సేనలతోఁ బనిలేదని మన శతానీకసూర్యదత్తాదులతోడఁ జెప్పి వారిని వారింపుము.

ధన—మహాప్రసాదము. (అని పోవుచున్నాఁడు)

విరా—ఓవలలా! దామగ్రంథీ! తంత్రీపాలా! నానిమిత్తము మీ రత్యంత ప్రయాసపడి యున్నారు. విశ్రమింపఁ బొండు.

వలలాదులు—కార్యసాఫల్య మయినందున మాశ్రమను మేము పరిగణింపము. దేవరవారిక విశ్రమింప విజయంచేయవచ్చును.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

# వివేకదీపిక

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

# వివేకదీపిక

## ప్రథమాంకము

౧. రంగము—సీతారామయ్యగారి గృహములోని చావడి.

[తనలోఁదానే యేమోమాటాడుకొనుచు నారాయణమూర్తి ప్రవేశించుచున్నాఁడు.]

నారా—(తనలో) నేనిప్పుడెంత క్రూరకృత్యమును చేయఁ దలఁచుకొనుచున్నాను. ఏకగర్భవాసమునఁ బుట్టినదానిని చంపుటయన్న నేదో మనస్సులో భీతిపుట్టి దేహము కంపించుచున్నది. నా చెల్లెండ్రిందఱిలోను జానకి బహుసాత్వికురాలు గుణవంతురాలు. అయినను చెట్టు చెడుకాలమునకు కుక్కమూతిపిందె యన్నట్టు నేఁటి కాలమునకు దానికిట్టి దుర్బుద్ధి పుట్టినది కాఁబోలును. ఏమో దాని యేడుపది యేడుచునని యింతవఱకును సహించి యూరకుండుచునే వచ్చినాఁడను. ఇప్పుడింటనున్న పుణ్యస్త్రీలను గూడ జారత్వమునకు దింపనారంభించినది. ఇంక నేనిది చూచి సహింపలేను. మొన్న గోపాలశాస్త్రిగాఁడు నాభార్యతో గుసగుసలాడుచు నొంటిగా పడకగదిదొడ్డిలోఁ గనఁబడ్డప్పుడే వానిని చావఁగొట్టి సాగనంపినాను. ఆ దెబ్బలచేత వాఁడింక పదిదినములదాఁక మంచముమీఁదనుండి లేవఁడు. జానకి యాలోచనలేక యీపని జరిగినదని తోఁచదు. మగఁడుగల యిల్లాండ్రనుగూడ పాడుచేయ మొదలు పెట్టినది గనుక, ఏపాపమునకైన నొప్పుకొని యిప్పుడు నేను కొనితెచ్చిన పాషాణమును దీనికే వస్తువులోనో పెట్టి లోపలికిచ్చెదను. కులమున కపకీర్తి తెచ్చిన

యిటువంటి పాడుముండలు బ్రతుకుటకంటె వేగిరముచచ్చుటయే మేలు. ఇంటనున్న మూఁడువాండ్ర సాహాయ్యములేక నేనెట్లు జానకికి విషము పెట్టఁగల్గుదును? నా యభిప్రాయము అమ్మతోఁగాని నాన్నగారితోఁగాని చెప్పుదునా? చెప్పినను కడుపునఁ బుట్టినదానికి విషము పెట్ట వారొప్పుకొందురా! అదుగో బాబయ్యగారీ లాగున వచ్చుచున్నారు. మఱియొకవిధముగా నీ ప్రస్తాపనము నాయనయొద్దఁ దెచ్చిచూచెదను.

[సీతారామయ్యగారు ప్రవేశించుచున్నారు]

సీతా—ఏమోయి నారాయణమూర్తి! హారతికర్పూరమును తీసికొనివచ్చుటకు వెళ్ళి యింత సేపాలస్యము చేసినావు? ఇప్పుడైన తీసికొనివచ్చినావా? మఱచిపోయినావా?

నారా—(తనలో చెప్పుదునా?)

సీతా—(తనలో) వీఁడేమో రెండుదినములనుండి పరధ్యానముగా నుండి యెప్పుడును తనలోఁదానేమో యాలోచించుకొనుచున్నట్టు కనఁబడుచున్నాఁడు. వీనికి లోపల నేదోగొప్ప యాలోచన యున్నది. (బిగ్గఱగా) మాటాడవేమి? హారతికర్పూరము తెచ్చినావా?

నారా—ఏమిటి? హారతికర్పూరమా? ఇదిగో తెచ్చినాను. (అని యొక పొట్లమును చేతికిచ్చుచున్నాఁడు.)

సీతా—(విప్పిచూచి) ఇది హారతికర్పూరము లాగున లేదే—

నారా—(తనలో) మనస్సు చెదరియుండుటచేత నొకపొట్లము నియ్యఁబోయి మఱియొకపొట్లము నిచ్చినాను. (అని చప్పన తండ్రి చేతిలోనుండి యాపొట్లమును బుచ్చుకొని బిగ్గఱగా) పొరపాటున మఱియొకపొట్లము నిచ్చినాను. ఇదిగో ఇది హారతికర్పూరము. (అని రెండవపొట్లమును చేతికిచ్చుచున్నాఁడు.)

సీతా—(తనలో) ఈవేళ వీనిస్థితిచూడఁగా నేమోవింతగాఁ గనఁబడుచున్నది. మనసులో నేమో యాలోచించుకొనుచు పర ధ్యానముగానుండి రెండవమా రడిగిన దాఁక నామాటనే వినిపించు కొన్నాఁడు కాఁడు? హారతికర్పూరమడిగిన మఱియొక పొట్లమును చేతిలోఁ బెట్టి తత్తరపడి చేతిలోనుండి పుచ్చుకొన్నాఁడు. హారతి కర్పూరమును పుచ్చుకొని తిన్నగాఁ లోపలికిరాఁక వడవలో గూరు చుండి యేమో యాలోచించుచున్నాఁడు. సంగతి యడిగిచూచెదను. (బిగ్గఱగా) నారాయణమూర్తీ! నీవు మొదట నా చేతికిచ్చినపొట్ల మేమిటి? ఒంటరిగాకూరుచుండి నీ విప్పుడాలోచించుచున్న సంగతి యేమిటి?

నారా—(తనలో) ఈయన తనంతట తానే వన్నడుగు చున్నారు గనుక చెప్పివేసెదను. (బిగ్గఱగా) పొట్లమా—పొట్లమా—పొట్లమాండీ? అదిపటికపొడుము—పటికముక్కలు. తమతో నేతే యొకసంగతి మనవి చేయుచలెను. ఒకనిమిషము దగ్గరగావచ్చి కూర్చుండండి.

సీతా—ఏమోచెప్పు (అని చెంతఁజేరి కూరుచున్నాఁడు)

నారా—మన యింటజరుగుచున్న యల్లరి చూచుచున్నారు గదా? మనకు నలుగురిలోను తలయెత్తుకొని తిరుగుటకు వల్లపడ కున్నది. ఎప్పుడు నేదోషము నెఱుఁగని సద్వంశమున కాఁడుము డలమూలమున నేఁటికాలమున కపకీర్తిపాలు కావలసిన యోగము తటస్థించినది.

సీతా—నీవన్నది నాకు తెలిసినది. అన్నపూర్ణసంగతి చెప్పు చున్నావు. అదియు మనవంటబ్రాహ్మణుఁడు కామయ్యను ముట్లగదిలో నుండఁగా పట్టుకొని మొన్నరాత్రికుఱ్ఱవాండ్రేమో యల్లరిచేసినారని మీఅమ్మ నాతోఁజెప్పఁగా మేమిద్దఱము నింతసేపు దుఃఖించినాము. దానిగతి యీలాగుననుండఁగా మనమేమిచేయఁగలము? మగనికిని

దానికిని మూడేండ్లు హెచ్చుతగ్గుగాఁజూచి పెండ్లిచేయఁగా వాఁడు వివాహమయిన మూడవయేటనే కాలముచేసినాఁడు.

నారా—దాని గ్రహచారమునకు మనమేమి చేయఁగలము? లోకములోనివారివలె మీరు వందలును వేలును పుచ్చుకొని చిన్న దానిని ముసలివానికిని తెగులుగొంటునకును గట్టిపెట్టలేదుగదా? దాని కర్మమునకు కేవరుకర్తలు? పూర్వజన్మదుష్కృతముచేత దాని కీజన్మమున విధవాత్వము సంభవించినది. ఎవరికయినను బుద్ధితిన్నగా నుండవలెను.

సీతా—మనముకూరుచుండి మాటలెన్నియైనను జెప్పవచ్చును గాని వయసులోనున్న వారికి కామమును జయించుట మాత్రము శక్యముకాదు. నీవు రెండవభార్యయెదిగి కాపురమునకువచ్చులోపల రెండు సంవత్సరములు తిన్నగానుండలేక మూఁడుసారులు రోగములు తగిలించుకొని మంచమెక్కినావు. రజస్వలయయిన మూఁడుమాస ములకే దానిమగఁడుపోగా నిత్యమును విధవకూఁతురింట నుండఁగాఁ జూచి దుఃఖముసహింపలేక ప్రేముడుకొసి వేసి దానిని మామగారి నెలత్త వారియింటనే యట్టియుంచినాను. అక్కడనున్న కాలములో నుంచి మాటలాడి దాని మఱఁదియే దానిని భంగపఱిచి వలలో పడవేసి నాఁడని వదంతికలిగినది. తరువాత నత్తవారు దానికితిన్నగాతిండియే పెట్టక బట్టయేయియ్యక సకలబాధలునుపెట్టి యొకనాఁడు మధ్యా హ్నమిక్కడకుఁ దీసికొనివచ్చి దిగవిడిచిపోయినారు. పడుచుతనము లోనున్న విధవ యింటనుండెనా బంధువులకందఱకును దానినడత నెట్లుకాపాడుదుమాయనియొకవిచారము; అదికొంచెముదుర్వృత్తిలో ప్రవేశించియేమైనఁ దెచ్చుకొన్నయెడ పాపమును దాచినలుగురికన్నులు నునేలాగునఁగప్పుదుమాయని మఱియొకవిచారము. అప్పుడునీ చెల్లెలు [illegible] నున్నదట. మన యాఁడువాండ్రుగర్భవిచ్ఛి

త్తునకై యేమిపాట్లుపడినారోగాని యది యిప్పుడు నెలదినములు తీసి కొని చచ్చిబ్రతికినది. కులమునకు వెఱచి తల్లిదండ్రులు తమ బిడ్డల విషయములో నెన్ని పాతకములకయిన లోఁబడవలెను.

నారా—బిడ్డలో బిడ్డలోయని కొట్టుకొనువారి కెన్ని దేవత లకు మ్రొక్కుకొన్నను సంతానము గలుగదు. ఎప్పుడును సంతా నము గలుగఁజేయవలదని నిత్యమును కోటివేల్పులకు మ్రొక్కుచుండు బాలరండల కొక్కుమాఱు కక్కుర్తిపడఁగనే కడుపునిలుచును. రండాగర్భము నిలిపియుంచుటయు సిగ్గుపాటే: విచ్ఛేదము చేయుట యంతకంటెను సిగ్గులచేటు.

సీతా—అప్పు డత్తవారిమీఁద నాకు దేహముమండి కొన్ని నెలలు పోయినతరువాత దీనిచేత బావగారిమీఁద న్యాయసభలో జీవనాంశమునకు వ్యాజ్యము వేయించినాను. అప్పు డేమిచెప్పను! తమ్మునిభార్యకు జీవనాంశము లేకుండఁ జేయుటకయి తనకు పిత్రా ర్జితమయిన సొత్తేమియుఁ జెందలేదనియు తనయొద్దనున్న సొమ్ము స్వార్జితమనియు వాదించెనుగాని న్యాయాధిపతిసంవత్సరమునకు పది యేనురూపాయలు భరణమిచ్చునట్లాతనిమీఁద తీర్పుచేసినాఁడు. చూచితివా! లోకములో మగఁడుచచ్చి యేడ్చుచున్న యనాథల కొక్కపూట తిండికి సగముసరిపోవు జీవనాంశ మియ్యవలసివచ్చునని వారిమగల భాగమునంతయు వేసికొని తమది స్వార్జితమనియు వారు వ్యభిచారిణులనియు వాదించి జ్ఞాతులెట్టి యక్రమములకు లోఁ బడుదురో!

నారా—అవును. మనలో భర్తలు తమ యనంతరము భార్యల సుఖజీవనములకయి యాధారము నేర్పఱిచి పోకుండుట కష్ట కరముగానే యున్నది. అయినను స్వల్పజీవనాంశ మేర్పడుట బాల విధవల కామమును తగ్గించుటకొక సాధనముగా నున్నందున, ఒక

మనుమున నాకది యుక్తముగానున్నట్టే తోఁచుచున్నది. ఇప్పుడు చాలీచాలని యొంటిపూట తిండితోనే విధవలలో నెన్ని ఘోరకృత్యములైన జరగుచున్నవి. ఇఁక బాలవిధవలకే రెండుపూటలును కడుపునిండ తిండియున్న వాండ్రను పట్టపగ్గము లుండునా!

సీతా—వారికిబొత్తిగా తిండిలేకపోయినను జీవించియున్నంత వఱకు స్వభావసిద్ధమయిన కామము వారిని విడువనేరదు. సమస్తమును దెలిసి, యింద్రియనిగ్రహము చేసి, సంసారబంధమును కోసి వేసి దేహమును కృశింపఁజేసి, అడవులలో కందమూలఫలాదులు తినుచు తలక్రిందుగా తపస్సుచేయు మహర్షులే యప్పుడప్పుడు కామవికారమునకు లోనయి వివేకము పోగొట్టుకొని స్త్రీలవలలో పడుచుండఁగా విద్యాగంధమే లేకపోవుటచేత యుక్తాయుక్త వివేకముచాలక మాధురాండ్రయి యుప్పును పులుసును దినుచు మంచివయసులోనుండి పట్టణములలో, గాపురము చేయు ననాథయువతులకు కామబాధకు లోనుగాకుండ తప్పించుకొనుట శక్యమగునా! బలవంతములగు నింద్రియములు మనస్థైర్యముగల విద్వాంసులనే యాకర్షించుచుండఁగా, వాని ధాటికోర్చుటకింక నబలలెంతటివారు? అదియెఱిఁగియే పూర్వము వ్యాసమహర్షి "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" యను సత్యవచనమును వ్రాసియున్నాఁడు. అందువిషయమయిన కథను నీవు విన్నావా?

నారా—వినలేదు. దయచేసి కొంచెము చెప్పుఁడు.

సీతా—ఆ మహర్షియొక్క శిష్యులలో నెల్ల విద్వదగ్రగణ్యుఁడయిన జైమినిముని పైవచనమును గురునింట లేని సమయమునఁ జూచి గురువుగా రబద్ధమును వ్రాసినారనుకొని "విద్వాంసం నాపకర్షతి" యని దానిని దిద్దెను.

# ప్రథమాంకము

నారా—తరువాత నేమి జరిగినది?

సీతా—గురునింటికి వచ్చి తన శిష్యుఁ డట్లు దిద్దుట తెలిసికొని యాతని మనోదార్ఢ్యమును పరిశీలింపఁ గోరి యొక నాఁటి సాయంకాలమునఁ దానొక స్త్రీవేషమును వేసికొని సమస్తాభరణములను ధరించుకొని మేలిముసుఁగుతో సంజవేళ నా జైమిని యొద్దకు వచ్చి యాయాశ్రమమునం దనకా రాత్రి పరుండుటకయి తావిమ్మని మందస్వరముతో వేఁడుకొని, అతఁడొక యింటివిజూపఁగా నందుఁ బ్రవేశించి దీపము వెలిగించుకొని కూరుచుండెను.

నారా—అటు పిమ్మట వృత్తాంత మేమి?

సీతా—ఆ రాత్రి గురు వే వేళకు నింటికి రాలేదు. చీఁకటి పోయి కామిజనుల హృదయాహ్లాదకరముగా పిండి యారఁబోసినట్లు వెన్నెల కాయఁజొచ్చెను. వసంతకాలమగుటచే హృదయముల కామాగ్ని రవుల్కొనుచు మలయమారుతము చల్లగా వీచుచుండెను. ఆశ్రమమునందలి పుష్పలతలు కమ్మతావులను వెదఁజల్లుచు నా సుందరి కొప్పులోని పూలదండల పరిమళమును తలఁపింపసాగెను. అప్పుడొంటిగా నున్నందున నా ఋషికుమారుని మనసంతయు గదిలో నున్న సుందరీమణి మీఁద నే పోయెను. అతఁడు విద్వాంసుఁడగుటచే హృదయమును పలువిధముల మరలించుకొనుచు వచ్చెనుగాని కడపట కాముఁడే బలవంతుఁడయి యాతని నపస్మారుని జేసి తనకు లోఁబఱుచుకొనెను. ఆతఁడు కాముని యాజ్ఞకు లోఁబడి దాసుఁడయి యా సుందరియున్న గదితలుపువద్దఁ జేరి మెల్లగా పిలిచెను. ఆమె పలుకకపోఁగా నంతకంత కధికమగుచున్న యింద్రియముల నిర్బంధమునకు తాళఁజాలక రాగాంధుఁడయి యొక్కసారి తలుపు తీయవలయునని బహువిధముల దీనత్వముతో ప్రార్థించి యడిగెను. అప్పుడును లోపలినుండి ప్రత్యుత్తరము రాలేదు.

నారా—అతఁ డంతటితోనైనఁ దెలివి తెచ్చుకొని యూర కున్నాఁడా? మఱి యేమైన సాహసకార్యమునకుఁ జొచ్చినాఁడా?

సీతా—కాముఁడు తనకు లోఁబడినవానిచేత నేమి చేయింపఁ జాలఁడు? కాముని కఱపులకు లోనయి యా విద్వాంసుఁడు కాల హరణమున కోర్వజాలక వలపు వెట్టి తలకెక్కి నిచ్చెన వేసికొనిగోడ పయి కెక్కి గదిలోనికి దుమికెను. అప్పు డాతని యవస్థ నేమని చెప్పను! లోపల దీపము వెలుతురున వయసు పడుచునకు మాఱుగా నగలు తీసికొని ముసలిముని వేషముతో నున్న తన గురువును జూచి యతం డద్భుతమును భయమును సిగ్గును పెనఁగొన మాటరాక నిశ్చేష్టితుఁడయి కొంతసేపు చిత్రపు ప్రతిమవలె నిలువఁబడెను. అంత నతఁడు గురువుచేత ప్రబోధితుఁడై యచట నుండజాలక లోప లికి వెంటనే వెళ్ళి "విద్వాంసమపికర్షతికర్షతికర్షత్యేవ" యని ముమ్మాఱు వ్రాసెను. అడవులయం దినుపగోచులను కట్టుకొని యొంటిగానుండు విద్వాంసుల పాట్లే యిట్లుండఁగా నిఁక బహువిధ మాయోపాయ ములు పన్ని యింద్రియములకు లోఁడు దుష్టపురుషులుకూడ తమ్మా కర్షింప సుందరమందిరములయందు వాసము చేయు ముద్దరాండ్రకు మనసు నిలుపుకొనుట శక్యమగునా?

నారా—పూర్ణముగా శక్యము కాదుగాని పెద్దవారు చూచి యాఁజూడ నట్టూరకుండక కాలవితంతువులను గొంచెము నిర్బంధ ములోనుంచి కాచుచున్నచో వారు తిన్నఁగా నుండక యేమిచేయఁ గలుగుదురు?

సీతా—పాతివ్రత్యము నీతిచేత నిలువవలెనుగాని నిర్బంధము చేత నెంతసేపు నిలుచును? ఏడుమేడలలోపలిమేడలోనుంచి చుట్టును వేయిమందిని కావలియుంచుచున్నను కొన్ని రాజాంతఃపురములలో జారత్వము జరుగుచునే యుండుటను మనము వినుచుండుటలేదా?

అట్టి రాజులే నిర్బంధముచేత వ్యభిచారమును మాన్పఁజాలకుండఁగా మనమా యిఁక నాపఁగలవారము? మనయన్నపూర్ణ చెడుతిరుగుళ్లు చూచి సహింపలేక మనముకొంచెము నిర్బంధపెట్టినతోడనే పూర్వ మది యేమి చేసినదో చూడలేదా?

నారా—కామాతురులయినవా రేమిచేసినను జేయుదురు. వారికి సిగ్గుండునా? పాపభీతి యుండునా?

సీతా—పయివా రెవ్వరును లోపలికి వచ్చుటకు వీలులేక పోయినందున నిర్బంధమునకు సహింపలేక యొక నాఁటి రాత్రి చాకల సామిగానిని తీసికొని నగలతో లేచిపోయి యావలివీధిని శూద్రుని యింటఁ బ్రవేశించినది. కన్నకడుపగుటచేత నెట్టి దుర్మార్గురా లయినను దానిని విడిచిపెట్టియూరకుండ మనసొప్పక యందఱకును దెలిసిన మఱింత యవమానమునకు హేతువగునని యెంచి వెంటనే వర్తమానము తెలిసినందున మఱునాఁటిరాత్రియే దానినిబతిమాలు కొని రహస్యముగ నింటదెచ్చిపెట్టుకొని యప్పటినుండియునదియెట్లు తిరుగుచున్నను చేయునది లేక చూచియు చూడనట్టూరకుండు చున్నాము. గట్టిగా నేమయిన నన్నచో నలుగురిలోను రవ్వయగు టయే కాక మఱునాఁడే యది వీధి కెక్కును. అది మొదలుకొని యది గర్భస్రావములను శిశుహత్యలను బ్రతిసంవత్సరము నన్నిటినో చేయుచున్నది. మనలో వితంతువివాహములు లేకపోవుటవలనఁగదా యీయనర్థములెల్లను మూడుచున్నవని యెన్ని పాపములకయిన నోడిగట్టి సహించుచున్నాము. దాని నేమయిన నన్నచో మనగర్భ వాసమునఁ బుట్టినదానిని మనమే నలుగురిలోను రవ్వచేసి యల్లరి పడుదుమనియు, అది యిల్లు విడిచి వీధికెక్కినను తెగించి నూతి లోనో గోతిలోనో పడినను మనమే యప్రతిష్ఠ పాలగుదుమనియు, ఏమియుననక లోలోపలనె కృశించి కుములుచు దుఃఖమునుమ్రింగు

కొనుచు పయికందతితో పాటు తిరుగుచున్నాము. ఎక్కడకు వెళ్ళినను, ఎవ్వరేమి యెత్తిపొడుపుమాట యందురో యను భయమే కాని తిన్నగా తలయెత్తుకొని పదిమందిలోను సంతోషముగా తిరుగుటకు నోచుకొలేదుగదా! ఎవ్వరే వితంతువుల వ్యభిచారాది దుశ్చేష్టలప్రచారము తెచ్చినను మనవిషయమే యనిమనసులోసలుకుపుట్టుచుండును.

నారా—మన కన్నవస్త్రములకు లోపము లేకపోయినను దైవము మనలను సుఖపడనియ్యదలచుకొలేదు. ఏజన్మముననో మీదంపతులకు గర్భశత్రువులయిన యీముండలు మీకు పుత్రికలుగా పుట్టి మిమ్ము దుఃఖపెట్టి యీప్రకారముగా తమ పగసాధించుకొనుచున్నారు.

సీతా—అమ్మవారి జాడ్యములలో సామిగాని బాధ వదిలిపోయినది గదా యని కొంచెము తల తడవి చూచుకొనగానే యిప్పుడు వంట బ్రాహ్మణుడు సామిగానిబాధ యంతకంటె నెక్కువయినది. ఇల్లంతయు వానికి దోచిపెట్టుచున్నది. మనయింటదెచ్చిన వానిలో నుప్పులోనుప్పును పప్పులో పప్పును సగము వానియింటనే యుండును. ఇంటిదొంగ నెవ్వరు మాన్పగలరు? మొన్న మనయింట పోయిన మిరియాలపేరు విషయమయి కూడ నాకు దీనిమీదనే యనుమానమున్నది. అది గట్టిగా దీనిపనియే కాని మఱియొకరిపనిగాదు. గృహచ్ఛిద్రము బయలపెట్టరాదు గనుక, ఏమి జరిగినను నోరుమూసికొని యూరకుండవలెను. నోరు తెఱచి యేమయిన నన్న నెప్పుడు వీధికెక్కునోయనియే భయమగుచున్నది.

నారా—ఇంటనుండి వ్యభిచరించుచు కలకాలము తల్లిదండ్రులను వ్యథపెట్టువారికంటె నిల్లువిడిచి లేచి పోవువాండ్రే యుత్తమురాండ్రని చెప్పవలసియున్నది. ఇల్లు విడిచి వీధికెక్కినవారు తామొక్కరు మాత్రమే సంకరురాండ్రయి చెడిపోవుచున్నారు. ఇల్లు

వదలక మాలకూడంతయు నింటనే కలుపువారు తాము మాత్రమే కాక కులమువారి నందఱిని సంకరులను జేసి కుటుంబమున కంతకు నవమానము తెచ్చుచున్నారు. కాఁబట్టి యింతకపకీర్తి తెచ్చు ముండలను లేవఁగొట్టుటయే మంచిది.

సీతా—అది నిజమే కాని కడుపున పుట్టిన బిడ్డలు చెడి లేచి పోవుచుండఁగా చూచి యూరకుండుట కెట్టి రాతిగుండెవానికిని బుద్ధి పుట్టదు. మావంటివాండ్రు జీవించుట కిది కాలము కాదు. వయసులో నన్నపూర్ణకంటె నలుదేండ్లు చిన్నదయినను మన జానకి కింత పాపము లేదు. అది బహు బుద్ధిమంతురాలు! దానికి నలుగురు నేమను కొందరో యని భయ మున్నది; ఇది నీవు తగదని చెప్పిన విననేర్చినది.

నారా—ఇఁక జానకిబుద్ధి యడుగ నక్కఱలేదు. దానిసంగతి మీకు బొత్తిగా తెలియదు. అది వెనుక బుద్ధిమంతురాలుగానే యుండెను గాని దానిసంగతి యిప్పుడు బొత్తిగా చెడిపోయినది. దాని తేనెమాటలును స్నానములును జపములును జూచి మీరు భ్రమ పడుచున్నారు. అది మేకవన్నెపులి; లోలోపలనె గొంతుకలు కోయును. మొన్నటివఱకును నేనును మీవలెనే మోసపోయినాను. ఇప్పుడు దానిపేరు చెప్పిన నాయొడలు మండుకొని పోవుచున్నది.

సీతా—అది మనయింట చిన్న సొత్తు వస్తువొకరికిచ్చినదని నే నెవరినోటను వినలేదు. అది తనయత్తవారి యింటికడనుండి తెచ్చుకొన్న సొమ్మునే నోముల క్రిందను వ్రతముల క్రిందను దానధర్మముల క్రిందను వ్యయపెట్టుకొనుచున్నది కాని మనసొమ్ము పూచిక పుడకయైనను పుచ్చుకొని యెఱుఁగదు. ఇంకను దాని సొమ్మే మఱదండ్రకును చెల్లెండ్రకును పెట్టుచున్నది. వెలకును పనిచేయు దినములకును సందియిచ్చు డెప్పుడో మనజానకి కాయకము పట్టలేక మహారహస్యముగా మనలోపల పురాణము చెప్పు గోపాలశాస్త్రిలతో

నేమో యేడ్చుచుండునని వెనుక నాతో మీతల్లి యప్పు డప్పుడు చెప్పుచువచ్చినది. అదియు నెవ్వరికిని తెలియును. నీవు మొన్న గోపాలశాస్త్రిని కొట్టినప్పటినుండియు నతఁడు మనయింటికి వచ్చుట మానుకొన్నాఁడు. ఇఁక లక్షవరహాలిచ్చినను తాను మనయిల్లు త్రొక్కి చూడనని నీమేనమామయొద్ద నొట్టు కూడ పెట్టుకొన్నాఁడట. దానిని మనమొక్కసారి చాటునకు పిలిచి చీవాట్లు వేసిన పక్షమున, తన మునుపటి గుణమును మానుకొనునని నాకు గట్టినమ్మకమున్నది.

నారా—దాని మొగము మండిఁ లెండి. పుట్టెను పుట్టినబుద్ధి పుడకలతోఁ గాని పోదు. అది పిడికెడు బూడిద యగువఱకును దాని గుణ మాలాగున నుండునదియే కాని నడుమ మాఱునది కాదు. పెద్దదానివలె దానియేడుపేమో యది యేడిచి యూరకున్న—

సీతా—ఏమో చెప్పబోయి సగము చెప్పి యూరకున్నా వేమి? ఆమాట కడతేఱఁ జెప్పు. దానియేడుపది యేడిచి యూరకుండక యెవరి నేమి చేసినది?

నారా—గాడిదకొడుకును మొన్న గోపాలశాస్త్రిగాఁ డిని కొట్టిన దెందుకనుకొన్నారు?

సీతా—ఎందు కేమి? మనజానకి యతనితో మాటాడుచుండఁగా నీకంటఁ బడ్డదేమో యనుకొన్నాను.

నారా—అందుకుఁ గాదు.

సీతా—మఱి యెందుకు?

నారా—యెందుకయిన నేమి? నేనిప్పుడు మీతో చెప్పను. జానకిముండ పేరును శాస్త్రిగాడి పేరును తలఁచుకొన్న నాకిప్పుడు శరీరమంతయు రవులుచున్నది. కోపమాపుకోలేక వారికి నేనేమిహాని తలఁతునో మీరాసంగతి నన్ను గ్రుచ్చి యడుగకండి.

సీతా—నాయనా! శాంతించుము. వారిమీఁద నీ కెందుకో విశేషాగ్రహము కలిగినట్లున్నది. వారేమయిన నకార్యకరణము చేయుచుండఁగా నీవు ప్రత్యక్షమునఁ జూచితివా యేమి? కొంచెము విమర్శించి కారణమేమో నాతోఁజెప్పు.

నారా—మానవంతుఁడు తనవారు మఱియే నేరము చేసినను సహించునుగాని ఱంకుతనము చేసినప్పుడుమాత్రము సహించియూరకుండలేఁడు. నిజమయిన పౌరుషము గలవాఁడు జారత్వము జరుగుచుండఁగాఁ జూచినప్పుడు తత్క్షణమే యిద్దఱినిగూడ కత్తిడయిన పొడిచివేసి యక్కడనే గొయ్యిత్రవ్వి పాతిపెట్టునుగాని మానభంగము నోర్చి వారి నవతల కడుగుపెట్టనియ్యఁడు. (అని కోపముచేత వణఁకుచున్నాఁడు.)

సీతా—నాయనా! చిన్నవాఁడవు నీవేమియు నెఱుఁగవు. పెద్దవాఁడను నామాటవిను తొందరపడఁబోకు. దుడుకుతనముచేసి వాడ్రివిషయమున నీవేమయిన పాపకార్యమున కొడిగట్టెదవు సుమా? ఇప్పుడు కాలము బొత్తిగా మంచిదికాదు. తనహానియు లోభించఁగూడ వచ్చును. కోపము పాపమునకు కారణమగును. కార్యము మించినతరువాత విచారపడి చేసెడిపనిలేదు. నిష్కారణముగా మన మందఱము నప్రతిష్ఠపాలును నవమానము పాలునుకూడ కావలసివచ్చును. మా ముసలిప్రాణములను జూచియైన శాంతము వహించు. మునుపటికంటె నీవిప్పుడు క్రొత్తగా విశేషమేమి చూచినావ నాతో దాఁచక చెప్పితివా, నేనుదానికి తగిన ప్రతిక్రియ చేసెను. (అని కన్నీరు నించుచున్నాఁడు.)

నారా—(లోపలినుండివచ్చి దుఃఖము నాపుకొనుచు) మీరే మియు ప్రతిక్రియ చేయనక్కఱలేదు. నేనొక క్రూరకృత్యమేమియుఁ జేయదలఁచుకోలేదు. ఇదివర కొకవేళఁ జేయఁదలఁచుకొన్నను

మీదంపతుల నిద్దతినిజూచి యిప్పు డాపత్రయత్నమును మానుకొన్నాను. మీమనస్సును ఖేదపెట్టుకొనకుఁడు. నామూలమున మీకెంతమాత్రమును మనోవ్యధ కలుగనియ్యను. మీ కోడలిని మాత్రము వెంటనే పుట్టినింటికి పంపివేయుండి.

సీతా—(తనలో) వీని కేమో భార్యమీఁద సందేహముతోఁచి నది. మరియొకరి విషయమయినచో వీనికింత కోపమురాదు. (బిగ్గ అగా) గోపాలశాస్త్రి నీభార్యతో నేమయిన మాటాడినాఁడని నీకను మానము కలిగినదా? కిట్టనివారెవరైన నీతో నటువంటి చెడుమాట చెప్పినారా?

నారా—జరిగినదేమో జరిగినది. దీనికంతకును మన జానకి ముండయే కారకురాలు. అది పోయినఁగాని మనయింటిపీడ వదలదు. దాని నేలాగునైన విఱుగడ చేసికోవలెను. నాకు గోపాలశాస్త్రి గాడిమీఁద నెలదినములక్రిందటనే యొకసారి కొంచెము సందేహము కలిగినది. ఆగాడిదకొడుకును నీకోడలును మొన్న గదిదొడ్డిలో నొంటిగా మాటాడుచుండఁగా నేను ప్రత్యక్షముగా కన్నులారచూచినాను. తమ్ముఁ డడ్డమురాకుండినయెడల మొన్ననే వారిద్దఱిప్రాణములను పుచ్చుకొనియుందును. వాఁడు బ్రాహ్మణవేషముతో నున్న చండాలుఁడు గాని పండితుఁడు కాఁడు.

సీతా—ఇంట జనువుగాతిరుగుచున్నాఁడు కనుక, అదినీకు కోపమువచ్చునని యెఱుఁగక యతనితో నేమోమాటాడియుండును. అంతమాత్రముచేత దానియందొక దోషారోపణముచేయుట ధర్మము కాదు. లోకములో నీ వొక్కఁడవే కాదు, పడుచుభార్యలను గలవారందఱును భార్య పరపురుషునితో మాటాడినంత మాత్రముననీవలెనే యనుమానపడుచుందురు. వారికి హృదయములోఁగల కుపనమ్మికయే పలువిధములయిన యనుమానములను పుట్టించి వారిని

బాధింపుచుండును. మనసులో లేనిపోనిసందేహము పెట్టుకొని యుల్లరి పడఁబోకు. నేరము స్పష్టముగాఁ గనఁబడువఱకును నీవు దాని నేమియుఁ జేయవని యిప్పుడు నాచేతిలో చేయివేయుము.

నారా—పూర్వకాలపు మనుష్యులు గనుక మీ రెప్పుడును చిన్నవాండ్రేమి కానిపనిచేసినను దానికి మంచియుద్దేశము కల్పన చేయుటకే చూచుచుందురు. ఈకాలపువాండ్ర మాయలును కృత్రిమాలోచనలును మీకు తెలియవు. మీతో నాకు వాదమెందుకు? ఇఁక నాకాభార్య యక్కరలేదు. తత్క్షణము పుట్టినింటికి పంపి వేయండి.

సీతా—అలాగుననే పంపివేసెదను. నీవు వట్టివెఱ్ఱివాఁడవు. నీకిప్పుడున్న కోపముమీఁద యుక్తాయుక్తము లాలోచించుకో లేకు న్నావు. కొంచెము శాంతివహించి పెద్దవాఁడను నేనన్నమాట కొట్టివేయక నెమ్మదిగా నీలో నీవు విచారించుకో. నీవిప్పుడు చెప్పి నది మాత్రమే కోపకారణ మయినయెడల, నీభార్యయెడలవిశేష దోష మేమియు నాబుద్ధికిఁ గనఁబడదు. ఇందులో జానకి తప్పిద మేమున్నది?

నారా—అది యేమోకాని యీ మూడుదినములనుండియు జానకియన్న పేరే నాచెవికి శూలమువలె సోఁకి నామనస్సును వ్యాకు లపెట్టి బాధించుచున్నది. దాని దురాలోచనయే లేకపోయినయెడల శాస్త్రిగారితో నిర్భయముగా రహస్యము మాటాడుటకు నీకోడలికి గుండెలుండునా? బారాదుకొన్న మాటలేవో నాకువినఁబడినవి కావు. జానకి నేమిచేసినను పాపములేదు. దానికి తగిన శిక్ష చేయవలెను.

సీతా—(తనలో) మాటాడినకొలఁదిని వీనికి జానకిమీఁది కోప మంతకంతకు హెచ్చుచున్నది. వీఁ డేమి దుర్ణయమునకు సాహసించునో యని నామనస్సు పరితపించుచున్నది. (గద్గదస్వర

ముతో బిగ్గఱగా) నీ యిప్పటి యౌద్ధత్యము చూడఁగా జానకికేదో యుపాయము చేయుదువని నాకు భయమగుచున్నది. నీవు దాని కేమయిన హాని తలఁచుకొన్న యెడల ముందుగా నన్ను ధన్యునిఁ జేసి యా పాపపువార్త నాచెవి సోఁకకుండ పిమ్మట నీమనసువచ్చి నట్లు చేయుము. దానిని చిన్నప్పటినుండియు ప్రాణముకంటె నెక్కువగా—(అని యేమో చెప్పఁబోయి మాటరాక కన్నుల నీరు గ్రుక్కుకొనుచు తలవంచుకొని యూరకున్నాఁడు.)

నారా—(కన్నుల నీరుపెట్టుకొని) నానిమిత్తమున మీరు మనసులో ఖేదము నొందఁబోకుఁడు. కోపోద్రేకముచేత దేహము తెలియక యేమో నోరికి వచ్చినట్లెల్లను ప్రేలినాను. అది నాకు మాత్రము తోడఁబుట్టినది కాదా? నాకు మాత్రము దానిమీఁద ప్రేమలేదా? దాని విషయమై ద్రోహము తలఁచుటకు నేనంత క్రూరకర్ముఁడనా? మీపాదములతోడు దానికి నేనేమియు హాని చేయను. మీరు నిర్విచారముగా నుండుఁడు.

సీతా—నిజముగా దానియెడ తప్పిదమున్నదనియే నీకు తోచిన యెడల, నీకోపశాంతికయి నీవు దానికే శిక్షచేయుమన్నను జేసెదను. నీవు దానికి కీడు దలఁపఁబోకు.

నారా—అట్లయినచో రేపు మంచి దినము చూచి దాని శిరోజములు తీసివేయించండి. అవి వదలెనా దాని దుర్గుణములును వదలును; అంతటితో నాకోపమును చల్లారును.—ఎవరో వచ్చుచున్నారు నేను లేచి వెళ్ళెదను.

[అంత పార్వతి ప్రవేశించుచున్నది]

పార్వ—నాన్నా! భోజనానికి ప్రొద్దెక్కింది. చిన్నన్నయ్య కనిపెట్టుకొని వున్నాఁడు వేగిరం లెండి.—పెద్దన్నయ్యా! నీవుకూడా లేచి మడిగట్టుకో.

నారా—నాకిప్పు డాఁకలిగాలేదు. మీరందఱును భోజనములు కానిండి. నాకు వీధిలో పనియున్నది. నేను వెనుకవచ్చి భోజనముచేసెదను. (అని లేచి వీధిలోనికి వెళ్ళుచున్నాఁడు.)

సీతా—ఇదిగో వచ్చుచున్నానని చెప్పు. (అని లేచి పడకగదివంక నడుచుచున్నాఁడు.)

పార్వ—స్నానానికి రాకుండా మళ్ళీ గదిలోనికి వెళ్ళుతూవున్నారేమి? వేగిరరండి. (అని వెళ్ళుచున్నది)

---

౨. రంగము—ఆగృహములోనే పడకగది

---

[సీతారామయ్యగారు ప్రవేశించుచున్నారు]

సీతా—భోజనమునకు లేవవలసినదని లోపలనుండి రెండుమూడు వర్తమానములు వచ్చినను నాకు లేవతోఁచకున్నది. నాకిందాఁకటి యాఁకలియంతయు నేమయిపోయినదో కాని యిప్పుడు భోజనముమీఁద బుద్ధియేపుట్టకున్నది. ఆమాటలువిన్నప్పటినుండియు నాకు గుండెలలో రాయిపడి యేమి యాలోచింతమన్నను తోఁచకున్నది; ఇంతకుమునుపు శ్యామలాంబవచ్చి నాతో నేమిచెప్పినదో నేనేమి బదులుచెప్పి దానిని పంపివేసినానో నేనెఱుఁగకున్నాను; నిప్పులలో పొరలించినట్లు నామనస్సు పరితపించుచున్నది; మెత్తని పఱుపుమీఁద పరున్నను నా దేహమిప్పుడు ముండ్లమీఁద పడుకొన్నట్టున్నది, గోవిందరావువలె నారాయణమూర్తి శాంతాత్ముఁడు కాఁడు. నాతోమాటాడినంతసేపును వానిచిహ్నములుచూడఁగా నెవరిప్రాణముల కెగ్గుతలంచునోయని నాగుండెలు కొట్టుకొనుచునే యున్నవి. ఆలోచింపఁగా మొదట వాఁడు నాచేతిలోఁబెట్టిన పొట్లము పాషాణమేమో యని యిప్పుడు నాకు సందేహము గలుగుచున్నది.

అప్పుడు వాడు దాని పేరు చెప్పక చెప్పక తడవుకొనుటయు నాచేతి
లోని పొట్లమును తత్తరపడి పుచ్చుకొనుటయు వాఁడు తరువాత
నాతో సంభాషించిన సంగతులును విచారింపఁగా నదియేదో విష
మయి యుండుట నిశ్చయము. అప్పుడే నాకీసందేహము గలిగిన
నాచేతిలోఁ బెట్టిన పొట్లమును మరల నియ్యకయే పోయియుండును;
వానిమాటలవలన వానికి జానకిమీఁదనే గొంతుకవఱకు కోపము
న్నట్టు కనబడినది. నాదీనత్వము దుఃఖమును జూచి పయికప్పుడు
దాని కేహానియుఁ జేయనన్నాఁడు కాని వాని మాటయందు నాకు
బొత్తిగా విశ్వాసము కలుగకున్నది. దేవుఁడు మన కుటుంబమున
కేమివిపత్తు తెచ్చిపెట్టనున్నాఁడో!

[ఇంతలో సుభద్రమ్మ ప్రవేశించుచున్నది]

సుభ—ఏమి! నేనన్నిసార్లు వర్తమానం పంపినా మీరు
భోజనానికి లేవకుండావున్నారు? స్నానంకోసం పెట్టిన వేణ్ణీళ్ళన్నీ
చల్లారిపోతూ వున్నవి. విశాలాక్షి అన్నంకోసం యేడుస్తూవున్నది.
దానికీవేళ ప్రొద్దున్న చద్దన్నం లేకపోయింది. మీరువచ్చి దేవతా
నివేదన చేస్తేనే కాని దానికన్నం పెట్టవల్లకాదు. వేగిరం లెండి.

సీతా—(తనలో) ఇంతకును దాని గ్రహచార మెట్లున్నదో!
కాఁదలఁచియున్నదేమో కాకమానదు.

సుభ—(మఱింత దగ్గఱకు వెళ్ళి) నేను చెప్పిందేమిన్నీ విని
పించుకోకుండా మీలోమీరే యేమిటో మాట్లాడుకుంటూవున్నారు.
మీరిప్పుడేమో పరధ్యానంగా వున్నారు. సంగతి యేమయినావుంటే
భోజనం చేసినతరువాత ఆలోచించుకోవచ్చును. ముందుగా భోజ
నానికి లేచిరండి.

సీతా—(నిట్టూర్పు విడిచి) ఇప్పుడు నాబ్రతుకు భోజనము
నకు లేచినట్లే యున్నది.

సుభ—(తొట్రుపాటుతో) యేమి! అలాగంటారు!

సీతా—ఏమియు లేదు. భోజన మక్కఱలేకయే యిప్పుడు నా కడుపునిండుగా నున్నది.

సుభ—మనవాఁడు గోపాలశాస్త్రుల్లను కొట్టిన దెబ్బలచేత అతఁడు వాయువుచేసి చావలేదుగదా? అందుకోసం యేమయినా మనకు దివాణంవారివల్ల మాటవచ్చేటట్టు వున్నదా యేమి?

సీతా—అటువంటి దేమియు నిదివఱకు పొసఁగలేదు. మన యింటిసంగతి తలఁచుకొన్న నే నాకు మనుగడమీఁద రోతపుట్టు చున్నది.

సుభ—అన్నపూర్ణనుగుఱించి కొత్తసంగతి యేమయినా విన్నారా యేమి? దాని చర్య చూస్తే మొదటినుంచీ నా కనుమానంగానే వున్నది. దాని మూలాన్నే మన కుటుంబాని కెప్పుడో ముప్పువూడుతుంది.

సీతా—మన మెప్పుడు ననుకొననిది యిప్పుడు మఱియొకటి వచ్చినది. మఱియొకదాని వలన కీడు మూడ సిద్ధముగా నున్నది. జానకి—జానకి—(అని చెప్పలేక కన్నులనీరు పెట్టుకొనుచున్నాఁడు)

సుభ—(తొందరపడి) జానకేమిటి? అదివకరిజోలికిపోయేది కాదే. దానికేమి ఆపద రాఁబోవుచున్నది? దాని దగ్గిరడబ్బంతా దోచుకొని మీఁదిమిక్కిలి గోపాలశాస్త్రుల్లరచ్చకీడ్చి దానికేమయినా ద్రోహంతలఁచుకొన్నాడా యేమిటి? సాక్ష్యం నిమిత్తం సభల కెక్క వలసిన దుర్యోగం తటస్థించలేదుగదా?

సీతా—అటువంటి దేదియుఁ గాదు. వాని యిల్లు వల్లకాడు గాను గోపాలశాస్త్రి మూలముననే మన కొంప కూలిపోవలసిన యోగము సంభవించినది. నీ పెద్దకోడలేమో మొన్న గోపాల శాస్త్రితో మాటాడుచుండఁగా నీ పెద్దకొడుకు చూచినాఁడట. అప్పటినుండియు వానికి భార్యమీఁద ననుమానము కలిగి దానిని

పుట్టినింటికిఁ బంపివేయు మనుచున్నాఁడు. జానకి యాలోచనమీఁదనే యావని జరిగియుండునని వానికి సందేహము తోఁచి జానకిని పొడిచి వేయవలెనని యున్నది.

సుభ—అందుచేతనే కాఁబోలు మొన్న మీ రింట్లోలేనప్పుడు గోపాలశాస్త్రుల్లను కఱ్ఱ పుచ్చుకొని చావదెబ్బలు కొట్టినాడు. అప్పుడు మన గోవిందరావు వుండి అడ్డం వెళ్ళినమూలంగా గాని లేకపోతే అప్పటి కోపంమీద అతణ్ని చంపివేసిపోను. నారాయణ మూర్తికి కోపం వచ్చినప్పుడు వళ్ళు తెలియదు. ఆ రాత్రి గదిలోనికి వెళ్ళింతరువాత పెళ్ళాన్నికూడా బెత్తంతో కొట్టినాడు. తెల్లవారి లేచివచ్చినతర్వాత చూస్తే దానికి వీపుమీఁదనూ చేతులమీఁదనూ అడ్డంగా దద్దుర్లు తేలినవి.

సీతా—అప్పటి నారాయణమూర్తి మాటలవలన భార్యకు ప్రాణహాని చేయునని తోఁచదుగాని పుట్టినింటికిఁ బంపివేయుమని మరలమరల నడుగుట చూడఁగా నొక వేళ వాఁడు దాని నొల్లడేమో యని సందేహము గలుగుచున్నది. వానికోప మంతయు నిప్పుడు జానకిమీఁద నున్నది. దాని కేమయిన హాని చేయునేమోయని నా హృదయము తల్లడిల్లుచున్నది.

సుభ—ఒకవేళ కోపంమీఁద వాఁడు వూరికే అట్లా అన్నాడేమో కాని వాడికి జానకిమీఁద మిక్కిలిప్రేమ.

సీతా—ఆ ప్రేమయంతయు నిప్పుడు నడచినది. వట్టిమాటలు మాత్రమే కాదు వానియొద్ద విషముకూడఁ జూచినాను. నిజముగా దాని కేదోహాని-(అని చెప్పలేక కన్నులనీరు పెట్టుకొనుచున్నాఁడు)

సుభ—అయ్యో! నా కడుపున పుట్టినతొమ్మండుగురిలోనూ యిప్పుడు యిద్దరు మగవాళ్ళున్నూ అయిదుగురాడవాళ్లున్నూ వున్నారు. అన్నపూర్ణ తరువాతవాడు చెట్టంత కొడుకు మన సాంబ

శివుడు పోయి నాలుగేళ్ళు నిండా కాలేదు. వాడిప్పుడు బ్రతికివుంటే మొన్నటి సప్తమికి యిరవయిరెండేళ్ళు వెళ్ళును. జానకి వాడికంటె రెండేళ్ళు చిన్నది.

సీతా—పోయినవాండ్రను తలంచుకొని యిప్పుడు దుఃఖించిన నేమి కార్యమున్నది? వారిని మఱచిపో.

సుభ—నిత్యమూ వాణ్ని జ్ఞాపకం చేస్తూ సుందరమ్మ యింట్లో వుండఁగా వాణ్ని యేలా మఱిచిపోను? వాడికంటె అయి దేళ్లు చిన్నదిగదా అని మేనరికం చేసుకొన్నందుకు దాని కయిదో తనం చేసే యోగం లేక సుందరమ్మ మూల పట్టినది. అవుకుందా మన్నా ఆగకుండా దాన్ని తలుచుకున్నప్పుడల్లా నాకు లోపలినుంచి దుఃఖం పొర్లిపొర్లి వస్తూవుంటుంది. ఆ దుఃఖంతో కృశిస్తూవుండగా నిరుడు కాపురంచేస్తూవున్న నా అంతకూఁతురు మహాలక్ష్మి నన్ను భంగపెట్టి పోయింది. దానితో వెనకటి దుఃఖం మరచిపోయి పది హేనేళ్ళ యీ కూతురిని మింగుకొన్నందుకు బెంగపెట్టుకొని రాత్రి పగలూ కంటికీ నేలకూ యేకధారగా యేడుస్తూవుండగా తరువాత నెల్లాళ్ళకే శ్యామలాంబ మొగుడు పోయినాడని పిడుగువంటి వర్త మానం వచ్చింది.

సీతా—మరచిపోవుచున్న దుఃఖములనన్నిటిని జ్ఞాపకముచేసి నాకు మఱింత విచారమును కలిగించుచున్నావు.

సుభ—ఈ దుఃఖాలు యెల్లకాలమూ మనని యీలాగుబాధ పెడుతూ వుండేవేగాని మఱిచిపోదామన్నా మరుపుకు వచ్చేవికావు. పదమూడేళ్ళది యిక శ్యామలాంబ బ్రతుకెట్లా తెల్లవారుతుంది? అది నేడో రేపో సమర్తాడడానికి సిద్ధంగావున్నది. దాని బతుకెవరు చూచి సంతోషించను? దాన్ని చూచినప్పుడల్లా మనస్సు కలుక్కు మని యేడవకుండా వూరుకుందామన్నా వాటంతటఅవే కళ్ళమ్మట

నీళ్లు వస్తూవుంటవి. చదువుకున్నది గనుక అదే నాకు ధైర్యం చెప్పి దైవగతి యిట్లావుండగా యేడిచిన ప్రయోజనం యేమనివోదారుస్తూ వుంటుంది. నారాయణమూర్తి పెద్దపెళ్ళాము యేమి పాపాత్మున్ని దారితీసిందోకాని తరువాత వరుసగా మనయింట్లో అయిదారు ప్రాణాలు లేచినవి. పోగా మిగిలిన అయిదుగురు కూతుళ్ళలోనూ యిప్పుడు ముగ్గురుమూలపట్టినారు. అలాగయినా వాళ్ళను చూచుకొంటూ వుండడానికి ఋణం లేకుండా యిప్పుడు నారాయణమూర్తికిటువంటి దుర్బుద్ధికూడాపుట్టవలెనా?(అని పెద్దపెట్టున నేడ్చుచున్నది)

సీతా—(దుఃఖముమ్రింగుకొనుచు) ఇంకను మగఁడు బాగున్నవారిద్దఱున్నారు గదా? ఆ యిద్దఱినిజూచి సంతోషించు. తక్కిన ముండమోసినవారినిజూచి దుఃఖించుచున్న మనము బాధపడి వారికి బాధకలుగఁజేయుటయేకాని యందువలన నుఱియేమియుఫలములేదు

సుభ—ఆయిద్దరయినా పసుపూ కుంకం తిన్నగావుండి పదికాలాలపాటు బ్రతికి బట్టకట్టవలెనుగదా! ఎదిగి పెద్దవాళ్ళయిసమస్తసుఖాలూ అనుభవిస్తూ కని పెంచుతూ వుండవలసినకాలంలో వాళ్ళ బ్రతుకట్లా అయినది. యీభైయేళ్లు దాటి రాత్రి మనం గదిలో పడుకుని సుఖం అనుభవిస్తూంటే మొన్నమొన్న మన కడుపునపుట్టిన వాళ్ళు వొంటిగా యిపతలకూలి నిద్రపట్టక యేడుస్తుండవలసిన గతి పట్టింది. అప్పుడు మనసులో యెంత దుఃఖంవుండునో! వాళ్ళ దుర్యోగమే అలాకాగా ఇఁక పసికూన లెప్పుడో యెదిగి కాపురం చేస్తూ సుఖపడుదురనా మనంసంతోషం పడవలసినది? మనపార్వతికి వెయ్యేళ్ళకు పదోయేడు వచ్చినది; విశాలాక్షికింకా ఆరో యేడు వెళ్ళనేలేదు. వీళ్ళయినా నాలుగు కాలాలపాటు మగనితో కాపురం చేసి వాళ్ళకడుపున నాలుగుకాయలు కాయగా నేనుచూస్తానో లేదో!

సీతా—విచారించకోకు. చిన్నవాండ్రే యయిదవతనముచేసి సంతానవంతు రాండ్రగుదురు.

సుభ—అలాకాదు. లోకములో దేవుడు వెధవముండల కెక్కడలేని ఆయువూ పోస్తాడు; మొరుగుడు పురుగులలాగు పచ్చగా వున్నవాళ్లను యిట్టే యెత్తుకపోతాడు. మొగుళ్ళు ఆయుష్షూ వాళ్ళ ఆయుష్షూకూడా వాళ్ళకేపోసి వెధవవాళ్ళకెవ్వుడూ భగవంతుఁడు చావుపెట్టడు. అన్నపూర్ణపోయి మన మహాలక్ష్మి బ్రతికివుంటే యెంత బాగావుండును!

సీతా—దాని చెడుతిరుగుళ్ళుచూచి విసుగుపుట్టి నీవుపయికా లాగున ననుచున్నావే కాని లోపల నీకు విధవకూఁతురు మాత్రము చావవలెనని యుండునా! ఒక్కదినము వెనుక అన్నపూర్ణ లేచిపోయి యుపతలనుండఁగా మాఅనాఁడు దానిని మరల నింటికి తీసికొనివచ్చిన దాక నీళ్ళను నన్నమును తినక పరితపించినావు.

సుభ—ఏమిచెయ్యను! మోహాంకోసివేసి వూరుకుందామన్నా కానీ కన్నకడుపు వూరుకోనియ్యక అలాయేడిపిస్తూవుంటుంది. ఈ సంసారంలో వున్నంత మట్టుకు మోహపాశాలు తెంపుకోలేము. నారాయణమూర్తిని మీరు కూకలువేసి వాడికిపుట్టినదుర్వృత్తినుంచి వాణ్నియేలాగయినా మళ్ళించలేకపోయినారా! వాడిదగ్గిర మీకు విషం కనఁబడ్డప్పుడు మీరు తప్పకుండా లాక్కోవలసిందే.

సీతా—వానిదగ్గిరది విషమని వాడావలకు పోయిన తరువాత నాకు స్ఫురణకువచ్చినది. నేను బహువిధములు మందలించి సాహస కార్యమునకు దిగవలదని బుద్ధిచెప్పినాను. వానిహృదయములో కని కరముతోఁచునట్లుగా జానకిస్థితిని దలఁచి కన్నుల నీరుపెట్టుకొన్నాను. నావ్యాకులత్వమునుజూచి వాఁడప్పటికేమియుఁ జేయనని నాచేతిలో చేయివేసినాఁడు. కాని వానిధోరణిచూడఁగా వాఁడంతటితో తన

దుర్వృత్తినుండి మళ్ళుకొనునని నాకు నమ్మకముతోఁచలేదు. పయి కేమన్నను మనసులో వానికి కోపము రాజుచునేయున్నది.

సుభ—వాడి కోపం చల్లార్చ డానికి యేమిసాధనం ఆలోచించినారు?

సీతా—జానకికి శిరోజములు తీయించివేసి దానిని కురూపిని జేసిన పక్షమున తనకోపము శాంతించునని నాతో వాఁడే మొట్ట మొదట చెప్పినాఁడు. దానికేమియు నపాయమురాకుండ కాపాడ వలెనన్నచో మనమాపని సాధ్యమయినంత శీఘ్రముగానే చేయించ వలెను.

సుభ—మన పెద్దదానికి యిరవై అయిదేళ్ళు వున్నవి. అది నారాయణమూర్తికంటె నాలుగేళ్ళన్నర చిన్నది. అన్నపూర్ణకు తలవెంట్రుకలు వుండగా చిన్నదానికి జానకికి ముందర్తిగా తలవెంట్రుకలు తీయించివెయ్యడం బాగావుండదు. ఒకవేళ అన్నపూర్ణతో నేనుచెప్పినా తల గొరిగించుకోడాని కది వొప్పుకోదు. యేమిచేతును!

సీతా—అన్నపూర్ణతో మన మెవరముచెప్పినను కార్యము లేదు. మెల్లఁగా నీవు జానకితోనే యీ సంగతిచెప్పి దానినొడఁబఱుపుము. ఈలోపుగా నన్నగారేమి పెట్టినను తినకుండ భద్రముగా నుండుమని దానితో నిప్పుడే తప్పక చెప్పు.

సుభ—(లోపలనుండి దుఃఖమురాగా కన్నులు తుడుచుకొనుచు) మన పెద్దప్రాణాలు రెండూ తిన్నగావుండగానే మనగర్భవాసాన్న పుట్టినబిడ్డలను తలగొరిగించి ముసుగువేసి మూలకూర్చొపెట్టడానికి చూస్తూవున్నాము. కలానికి వెఱచి మనము యీలాంటి పని చెయ్యడానికి లోబడుతూవున్నాము. ఛీ! దిక్కుమాలిన కులము! వాళ్ళుబ్రాహ్మణకులంలో పుట్టక తురకవాళ్ళ యింట్లోనో

మాదేకులవాళ్ళ యింట్లోనో పుట్టినా మళ్ళీ పెళ్ళిచేసుకొని సుఖంగా వుండివుందురు. మనలో మగవాడికి పెళ్ళాంపోతే అరవైయేళ్ళవాడయినా శవం యింటికాడనుంచి కదలకమునుపే మళ్ళీ మూడేళ్ళదాన్ని చేసుకోవడానికి బేరాలు మొదలుపెడుతాడు; మూడేళ్ళదానికి మొగుడుపోయినా సమస్తసుఖాలూ వదలిపెట్టి యావజ్జీవం చచ్చినవాడిజీవానికి వుసూరుమని యేడుస్తూ కడగళ్ళుపడుతూ వుండవలసినదే. యీ క్రూరాచారం మనలో యేకాలమందు దయాదాక్షిణ్యాలులేని యేకటికి ముండాకొడుకు పెట్టినాడో కాని మానిపించే దిక్కు లేక బహుఘోరకృత్యములు జరుగుతూ వున్నవి. యిరవై యేళ్ళలోపు వాళ్ళకయినా మొగుడుపోయినప్పుడు మళ్ళీపెళ్ళి వుంటే యెంతయినా అనుకూలంగా వుంటుంది. జానకి గోవిందరావుకంటే రెండేళ్ళు చిన్నది. గోవిందరావుకింకా మీసాలయినా రాలేదు. పోనీ దానిమాట యేలావున్నా మన శ్యామలాంబవంటి వాళ్ళకయినా రెండోపెళ్ళి చేయించి యేమహానుభావుడయినా పుణ్యంకట్టుకుంటే యిప్పటి దుర్మార్గాలు ముప్పాతికమట్టుకువదలి లోకం సుఖపడుతుంది. విధవపిల్లలు కలవాళ్ళకందరికీ వివాహాలుచేస్తే బాగుగావుంటుందని లోపల యెంతోఅభిలాష వున్నది. లోకానికి వెఱచి యెవ్వరూ సాహసం చెయ్యలేక లోలోపలనే యేడుస్తూఊరుకుంటారు. ముందుగా చొరవచేసి వక్కరొక్క వివాహంచేస్తే తరువాత వక్కమాటు నూరు వివాహాలవుతవి.

సీతా—మన గోవిందరావు కప్పుడే పదునెనిమిదవయేడు ప్రవేశించినట్టున్నది. లోకములో జరుగుచున్న మాలకూళ్ళన్నియు చూడఁగా నాకిప్పుడు విధవావివాహము లుండుటయే యోగ్యముగా నుండునని తోఁచుచున్నది. పదియేను సంవత్సరముల క్రిందట ఈప్ర

యత్నము జరిగినప్పుడు నేనే పనిచేసి చెడఁగొట్టినాను. అదీ యున్న పూర్ణవివాహమయిన మఱునటి సంవత్సరము. అప్పటికి నాకీకష్టము లేమియు నాటుకోలేను. ఇప్పుడు మరల నట్టిప్రయత్నము జరుగు చున్నది. మనవారు నలుగురు నంగీకరించి వివాహములు జరగనారం భించినపక్షమున మన శ్యామలాంబకు కూడ వివాహము చేయుదము.

సుభ—బంధువులందరూ మనల్ని వదలివేసినా చెయ్యవలసిందే. రెండోపెళ్లి లేకపోవడంచేత జరుగుతూవున్న చెప్పరాని ఘోరపాత కాలకంటె వేయి వెలులయినా మంచిదే. ముండామోసిన పడుచు వాళ్ళల్లో జరుగుతూవుండే అక్రమాలున్నూ రహస్యాలున్నూ మాగ వాళ్ళకు మీకు బాగా తెలియవు. మీరు మహాయోగ్యురాలవని సం తోషించే జానకివంటిదానికి మొగుడు పోయినతరువాత ఇదివరకు రెండు కడుపులువచ్చినవి. చెప్పుకుంటే సిగ్గులచేటు. అదియెంతో యోగ్యురాలేఅవును. అయినా నడివయస్సులో వున్నప్పుడు కామము జయించడానికి యెవరితరమవుతుంది?

సీతా—శివశివా! విధవావివాహములు లేకపోవుటవలన నీ జగత్తులో నెన్నిదుష్కార్యములయినను జరుగుచున్నవి. నీవు ప్రత్య క్షముగా చెప్పనక్కఱలేదు. ఇంట నిటువంటిదుశ్చేష్టలు జరుగుచుం డఁగా చేయునదిలేక సహించి యూరకుండి రాత్రిందివములు లోలో పలనె కృశించి దుఃఖించుచుండుటకయి దేవుఁడీపరికారముగా మన కాయువుపోసినాఁడు. ఇఁక జానకికి శిరోజములు తీసివేయించ వలసినదే.

(అని కన్నులనుండి దిగజారు నీరు పైబట్టతో తుడుచు కొనుచున్నాఁడు.)

[అప్పుడు విశాలాక్షిని వెంటఁబెట్టుకొని జానకి ప్రవేశించుచున్నది]

జాన—విశాలాక్షీ! నేను చద్దన్నముతినలే దాకలవుతూ వున్నది. వేగిరం భోజనానికి లెమ్మని నాన్నగారిని పిలువు.

విశా—నాన్నా! అన్నానికి లే.

సీతా—ఇదిగో వచ్చుచున్నాను. మీరుపొండి. (అని జానకి మొగమువంకఁ జూచి తలవంచుకొని దుఃఖించుచున్నాఁడు)

సుభ—బాబయ్యగారిని నేను భోజనానికి తీసుకువస్తాను. మీరు లోపలికి వెళ్ళండి. (అని కంట తడిపెట్టుచున్నది)

జాన—విశాలాక్షీ భోజనానికి తాళలేకుండావున్నది. నాన్నగారిని వేగిరం తీసుకుని వస్తానని చెప్పివచ్చి నీవుకూడా యిక్కడ అట్టే కూర్చున్నావా? మీరు వచ్చిందాకా నేనూ వెళ్ళను.

సీతా—వచ్చుచున్నాను. స్నానమునకు నీళ్లు సిద్ధముగా నుంచు. (అని కన్నులు తుడుచుకొనుచు లేవఁగా నందఱును వెంట వెళ్ళుచున్నారు)

---

3. రంగము—అగ్రహాములోనే పడమటియిల్లు.

---

(జానకియు, సుభద్రమ్మయు ప్రవేశించుచున్నారు)

జాన—అమ్మా! యిందాకా నాన్నగారూ నీవూ పడకగదిలో యేమో చాలాసేపు రహస్యం మాట్లాడినారు. అందులో నాసంగతి యేమైనా వచ్చిందా యేమిటి? నాన్నగారు నావంక చూచి కళ్ళనీళ్లు పెట్టుకొని తలవంచుకుని కిందచూస్తూ వూరుకున్నారు. నీవుకూడా నామొఖంకేసిచూచి వ్యసనపడ్డట్టు కనపడ్డావు. మీయిద్దరికీకూడా అలాగు దుఃఖం రావడానికి కారణం యేమిటి? అప్పటినుంచీ నిన్నీసంగతి యెప్పుడడిగి తెలుసుకొందామా అని లోపల

తొందరపడుతూ సమయం దొరక్కపోవడంచేత యింతసేపటికి నా కా నిరీక్షిస్తూవున్నాను. ఇప్పుడు మనము ఒంటిగావున్నాము గనుక నాతో ఆసంగతి చెపుతావా!

సుభ—నీసంగతే చెప్పకుని యింతసేపు నాన్నగారూ నేను కూడా దుఃఖపడ్డాము. మాకీబిడ్డలే కలుగకపోయినట్టయితేహాయిగా వుండివుందుము. సంతానము లేనివాళ్ళకు బిడ్డలు లేకపోయినారు గదా అని అప్పుడప్పుడు కొంచెం విచారంతప్ప మరి యేవిచారమూ వుండదు. నిత్యమూ బిడ్డలుకన్నవాళ్ళ కన్నీ దుఃఖాలే. అందులోనూ బిడ్డలు దుశ్చరిత్రం కలవాళ్ళయితే తల్లిదండ్రుల దుఃఖం యింతంత అని చెప్పడానికి అలవికాదు. మీ మూలాన్న మాకు మనస్సుకు యెంతమాత్రం నెమ్మదిలేకుండా యెప్పుడూ ఖేదపడుతూ వుండవలసినగతి వచ్చింది.

జాన—(తనలో) యిప్పుడు నాకు మళ్ళీ కడుపువచ్చినసంగతి యేమైనా తెలిసివుందునా! నేనీ మూడుమాసాలనుంచీ మామూలు ప్రకారం నెల కొకపర్యాయం మూడు దినములూ వాకిటవున్నట్టు నటిస్తూనే వున్నానే. చాకలిముండ వక వేళ గ్రహించి యేమయినా రహస్యంగా చెప్పివుండదుగదా! మరివకలాగు తెలుసుకోవడానికి కడుపయినా అంతయెత్తుగా కనబడడంలేదు. అయినాకానీ తొందర పడక మెల్లిగా సంగతియేమో అడిగి తెలుసుకుందాము. నేడు కాక పోతే రేపయినా యీరహస్యం అమ్మతో చెప్పకతప్పదు. నాదుర్న డత సహించి నన్నాదరించి కడుపులో పెట్టుకోవడానికి తల్లిదండ్రీ కాకుండా నాకు వేఱే ఆప్తులు యెవరున్నారు! (బిగ్గరగా) అమ్మా! నానిమిత్తంగా మీదంపతులకిద్దరికీ దుఃఖం కలుగుతూవున్న సంగతి నేను బాగా యెఱుగుదును. మీపెద్దప్రాణాల మనస్సుకు బాధకలుగ కుండా నడుచుకోవలెననే నాయావచ్ఛక్తినీ వుపయోగిస్తూవున్నాను.

అట్లావున్నా కానీ పాపిష్ఠియవ్వనము నన్ను మోహపెట్టి మధ్యమధ్య నన్ను తనవలలో పడవేసుకుని నాకు నళ్ళు తెలియకుండా వున్న కాలంలో నాచేత కొన్ని కానిపనులు చేయించి మీాకు మనోవేదన కలిగేటట్టు చేస్తూవున్నది. కార్యం అయిపోయినతరువాత నేనుపశ్చా త్తాపం తెచ్చుకొని యికముం దెప్పుడూ మళ్లీ యిటువంటిపనిలో ప్రవేశింపనని నిశ్చయంచేసుకుంటూవచ్చినా, సమయంవచ్చినప్పుడు నాబుద్ధి భ్రమించిపోయేటట్టుచేసి కామము తన సమ్మోహనవిద్యచేత నన్ను లోబరుచుకుంటూ వుంటుంది. అప్పుడు నాయింద్రియములే నాకు స్వాధీనంకావు; అవి నామాట వినక కామాదులలోచేరి నామీాఁద తిరగఁబడి నన్ను దుష్కార్యంలోకి దింపుతూవస్తవి. ఇది వరకు జరిగినది యేలావున్నా యింకముందు మీా మనస్సుల కెంత మాత్రమూ నొప్పి కలుగకుండా ప్రవర్తించడానికి నా యావచ్ఛక్తినీ ధారపోసి సర్వవిధాలా ప్రయత్నంచేస్తాను. అవతల భగవంతుడి సంకల్ప యేలావుంటే అలా అవుతుంది. వెధవవాళ్ళకు పెళ్ళిలేకుండా చేసినందుకు దేవుడు వాళ్ళకు కామంకూడా లేకుండా చేసినట్టయితే లోకంలో యిటువంటి దుష్కర్మలు లేకుండా అందరూ యెంత సుఖ పడుదురు! అలా చెయ్యడానికి యిష్టంలేకపోతే వెధవముండలందరూ నక్కమాటుగా చచ్చేటట్టయినా చెయ్యరాదా? చంపకుండానూ బ్రతికించి కామమూ తీసివెయ్యక పెళ్ళిలేకుండానూ చేసి యీలాగు బాధపెట్టడానికి దేవుడికి మేమేమి ద్రోహంచేసినాము? దిక్కుమాలిన దేవుడు మనుష్యులకంటెనూ దుర్మార్గుడు. నేను చచ్చిపోయి మన మహాలక్ష్మి బాగావుంటే యీావిచారం లేకుండా మీాకెంత సంతోషంగా వుండును? విధవదానికి నాకీచక్కదనమూ యవ్వనమూ బ్రమకూ యెందుకు? యికనయినా భగవంతుడు వేగిరం నన్నీలోకా న్నుంచి తీసుకొని పోరాదా? (అని యేడ్చుచున్నది.)

సుభ—యెందుకేడుస్తావు వూరుకో. నీ పూర్వజన్మకర్మం ఆలాగువున్నది. మాకడుపున పుట్టినవాళ్లీప్రకారంగా అడలుతూ వుండగా యేమీచెయ్యలేక చూస్తూ వూరికేవుండడంచేత యీదుఃఖ మంతా మాదేకానినీదికాదు. (అని కన్నుల నీరుపెట్టుకొనుచున్నది.)

జాన—మావల్ల మీకు రెండువిధాల దుఃఖం సంభవిస్తూ వున్నది. మీకళ్ళముందర మేమీప్రకారంగా దుఃఖ మనుభవిస్తూ వుండగా చూడలేక వకదుఃఖము? మేమెప్పుడయినా బుద్ధి గడ్డితిని కామోద్రేకంచేత యేదైనా అకార్యానికిలోబడితేమరివకదుఃఖము, మీరెన్నిదుఃఖాలైనా నేనువక్కరాత్రివంటిగాపరుండిమీరు గదిలో పడుకున్న కాలంలోపడే క్షోభలో నూరోపాలుకయినా సమానం కావు. అటువంటి స్థితిలో మేము యావజ్జీవమూ వకటే రీతిగా రాత్రింపగల్లు విరామములేకుండా పొందవలసిన దుఃఖం యింతంతని చెప్పడానికి యెవరికైనా అలవి అవుతుందా?

సుభ—అవును. అలవికానిమాట నిజమే. మీరు పడే బాధలు తలుచుకుంటేనే నాగుండెలుబద్దలై మనసు దహించుకొని పోతుంది. మాకే అట్లావుండగా నిజంగా ఆకష్టాలనుభవించే వారికి దుఃఖం మీకు యెట్లావుండునో.

జాన—నావంటివాళ్ళకు గలిగే దుఃఖంఅనుభవంవల్లం తెలుసుకోతగ్గదేకాని అది యీలాటిదని మాటలవల్ల చెప్పడానికి శక్యమయినదికాదు. ఇటువంటి కష్టజీవనం జీవించడం కంటె చావైనా వెయ్యిరెట్లు మేలుగావుంటుంది. అయినా తనకష్టాలను ఆప్తులయిన వారితో చెప్పుకొన్నప్పుడు దుఃఖము కొంత శాంతించి మనసులో బరువు చాలా తగ్గిపోతుంది. లోకంలో నాకు నీకంటె ఆప్తులు మరి యెవరూ లేరు గనుక నాకడుపులో వున్నదాన్ని నీతో చెప్పి వేసి కొంత వూరట పొందుతాను.

సుభ—నీకథ మొదటినుంచీ నాకు తెలియనిది యేమీ లేదు. గడిచిపోయినదాన్ని మళ్ళీ జ్ఞాపకంచేసి నాకు దుఃఖం యెక్కువ చెయ్యడం తప్ప మరేమీ లాభం కలుగదు. అయినా కానీ అలా చెప్పడంవల్ల నీకు దుఃఖశాంతి కలుగుతుందని నమ్ముతున్నావు గనుక నేను కొంచెం శ్రమకయినా వోర్చుకుని నీ సుఖంకోసం నీ వేమి చెప్పినా గుండె రాయిచేసుకుని వింటాను. ఏమీ దాచక చెప్పదలచు కొన్నదంతా మనసు విడిచి చెప్పు.

జాన—ఆ బ్రతికివున్న నాలుగుదినాలయినా నీ అల్లుడు నా మీద యెంత ప్రేమగలిగి వుండేవాడో నీకే తెలుసునుగదా? ఆయన నే నంటే ప్రాణం విడిచేవారు; యింట్లో యెవ్వరైనా నన్ను కాస్త మాట అంటే కలిపించుకుని వచ్చేవారు. నేను కాపురానికి వెళ్ళిన సంవత్సరానికల్లా పదిలంకణాలు చేసి అటువంటి మొగుడు కాలం చెయ్యడం చేత కొండవిరిగి మీద పడ్డట్టు వుండి యేమీ తోచక దుఃఖసముద్రంలో మునిగిపోయి నాకిక యీ ప్రపంచములో పనిలేదనుకొని యేలాగయినా ప్రాణం పోగొట్టుకోవలెనని నూతివద్దకు పది మాట్లు పరుగెత్తుకొని పోయినాను. అప్పుడందరూ వచ్చి నన్ను పట్టుకొని లోపలికి తీసుకొనివెళ్ళి మీరు వచ్చినదాకా రాత్రింపగళ్లు వకరు విడిచి వకరు నావద్ద కనిపెట్టుకుని వుండి నన్ను మీకు వప్పగించినారు. నా అత్తవారి తాలూకు సొమ్మంతా పట్టుకునినన్ను మీ రిక్కడికి తీసుకువచ్చిన తరువాత సమేతూ నేను తిన్నగా అన్నం తినక నీళ్ళు తాగక మనోవ్యాధిపెట్టుకొని మంచం పట్టివక్కమాస్తరుగా యేడుస్తూ వుంటే నాన్నగారూ నీవూ ప్రతిదినం నా మంచం వద్దకు వచ్చి వేదాంతం మాటలు చెవుతూ నన్ను ఓదారుస్తూ వుండేవారు గదా?

సుభ—అవును. అప్పటి నీ అవస్థ చూచినవాళ్ళు నీ వీలాగు మళ్ళీ భూమిమీఁద అడుగుపెట్టి మనుష్యులలో కలిసి తింటూ తిరుగుతావని యెవరూ అనుకోలేదు. నీవు చచ్చిపోతావని నేనువక్కతెనూ చాటున కూర్చుండి యేడ్చేదాన్ని. నీ నిమిత్తమయ్యే నాన్నగారు మన యింట్లో పురాణకాలక్షేపం వకటి పెట్టి నిన్నెట్లాగో బలవంతం చేసి తన మీఁద వట్టుపెట్టుకుని తీసుకునివచ్చి పురాణం వినడానికి నిన్ను గదిగుమ్మములో కూర్చుండపెట్టేవారు. తరువాత తరువాత నీవు పురాణం వినవలెననే అపేక్షచేత గదిగుమ్మంలోనుంచిలేచివచ్చి యెవరూ లేనప్పుడు యివతల కూర్చుంటూ వుండి ఆ ధ్యానంతో కొంత దుఃఖం మఱచిపోయి నెలదినములకు కొంచెం కోలుకున్నావు.

జాన—మొదటి పదిదినాలూ మీ నిర్బంధంచేత వూరికే గుమ్మంలోకూర్చుండేదాన్నే కాని శాస్త్రుల్లుగారేమిచదివేవారో యేమి అర్థంచెప్పేవారో యేమీ నా చెవిని చొచ్చేదే కాదు. అటుతరువాత సీతాదేవిమొదలయిన వారికి ఆపదసంభవించినపట్టుచదివిఅర్థంచెప్పేటప్పుడు కొంచంవినవలెనని బుద్ధిపుట్టి నా వలెనే పూర్వపువాళ్ళు కూడా కష్టపడేవారుగదా అని వాళ్ళవిషయమయి కొంత జాలిపుట్టి అందులో నా దుఃఖం మఱచిపోయి వాళ్ళకోసం మనసులో విచారించేదాన్ని. అందువల్ల నాకు రోజుకురోజు కొంచెం ధైర్యంకలగడం ఆరంభించినది. నేను గదిలోనుంచి యివతలకు రాకుండావున్నమూఁడు నెలలలోనే నా పెద్దపదినెగారు నాదిదొంగయేడుపనీ, యింట్లో పని చెయ్యవలసివస్తుందని మొద్దులాగున తిని మంచము నదుముక్కొ కూర్చుండి లేచి రావనీ, దుంగలాగున యెల్లకాలమూ కూర్చుండబెట్టి పనిచెయ్యడం కష్టమనీ, వారి ముందరనూ వీరి ముందరనూ నాకు వినపడేటట్టుగా సణగడం ఆరంభించినది; పిల్లిమీఁదనూ మొలుక మీఁదనూ పెట్టి నన్ను దెప్పేది. నా వ్రాత యీలాగయివుట్టిల్లు చేర

బట్టిగదా అడ్డమయిన వాళ్ళూ నన్నాడి పోసుకోడానికి సందు కలి
గిందని తెల్లవారగట్ట కొండంత చీఁకటి వుండగానే లేచియెవరికంటా
పడకుండా లోపలపాచి అంతా చేసేదాన్ని. తన సొమ్ము తాను
తింటూవున్నా కానీ మగడుపోయిపుట్టింటికిచేరగానే అన్న పెళ్ళాలికీ
తమ్ముల పెళ్ళాలకీ వాళ్ళబ్రతుకంటే యెంతో తేలికగా వుంటుంది.
ఇఖ ముండామోసి పుట్టిల్లు చేరేవాళ్ళు డబ్బులేని వాళ్ళే అయిన
పక్షమున, వదినగార్లూ మరదళ్ళూ ఆడేరోతమాటలన్నిటికీ తల
కాయవొగ్గివక్కపూట పట్టెడు మెతుకులకోసం యెవరేమి కాని
కూఁతలుకూసినా పడుతూనలుగురు నవుకర్లపెట్టు యింటిపని అంతా
చేస్తూ బిగ్గరగా యేడిస్తే యెవరేమనుకుంటారో అనిపయికిరాకుండా
దుఃఖంలోపలనే మింగుకొంటూ యెవరూలేకుండా చూచి అందరూ
పడుకున్న తరువాత దొడ్లో దూరంగా వెళ్ళియేడిచిరావలెను. అటు
వంటి నీచమయిన బ్రతుకు బ్రతకడంకంటె వురిపెట్టుకొని గుక్కెడు
ప్రాణంవక్కమాటు పోగొట్టుకుంటే యీ బాధలన్నీ నిముషంలో
విరగడ అయిపోతవి.

సుభ—నీకటువంటి కష్టాలేమీ యిదివరకు సంభవించలేదు
గదా! మేమిద్దరమూ బాగావున్నంతకాలము యిఖనైనా నీకటు
వంటి కష్టాలు రానియ్యాము. నీవదినగారు నిన్నొకసారియేమో
అన్నదని తెలిసి చాటుకుపిలిచి దాన్ని నాన్నగారున్నూ నేనున్నూ
కూడా చెడచీవాట్లు పెట్టినాము. మొగుడుకద్రవుద్దుకుని దాన్ని
యెముకలు విరగకొట్టినాడు. అప్పటినుంచీ అదినిన్నెప్పుడూ పల్లెత్తు
మాట అనలేదు.

జాన—అటుతర్వాత ఆవిడయేమనడానికీ యెంతకాలంబ్రతి
కింది? ఆరోనెల కడుపుతో పుట్టింటికివెళ్ళి నీళ్ళాడి అక్కడనే కాలం
చేసింది. అదీనంతప్పి పుట్టిల్లుచేరేవాళ్ళకు అన్నపెళ్ళాలవల్ల బాధలు

లేకపోయినా దానినిమించేబాధలు యిక లక్షవుంటవి. ఎవరిమాటో చెప్పనక్కరలేదు. యేకగర్భవాసమందుపుట్టి నాయందెంతో ప్రేమ గలిగిన నాఅన్నగారేంద్ర లేవడంతోనే నేనెప్పుడయినా కనఁబడ్డట్టయితే ప్రొద్దున్నే లేచి వెధవముండ మొఖంచూచినాను, నేడేమో కీడుమూడుననీ దుశ్శకునమయిందనీ విసుక్కునేవాడు. ఇకపరాయివాళ్లు వెధవల మొగంచూస్తే తిట్టడంఆశ్చర్యం కాదు. మొగుడు పోయి అనాధలయి దుఃఖపడుతూండేవారిని తమంతటతాము వెళ్లి చూచి ఆదరించడానికి బదులుగా అట్టివాళ్ళ పొడకనఁబడ్డప్పుడెల్లా దుశ్శకునమయిందని బంధువులుసహితం తిడుతూవుంటారు. దైవంచేసిన వంచనకు తోడు మనుష్యవంచనకూడా యీలావున్నప్పుడు, అలాగంటి పాపిష్టిబ్రతుకు బ్రతకడంకంటె చావడమే వుత్తమము.

సుభ—మనకు చావవలెననివున్నా కాలంరాని దేచావురాదు. యెంతటివారికీ జన్మాంతర ప్రారబ్ధంయెంతకాలం అనుభవించవలెనో అంతకాలమూ అనుభవించకతీరదు.

జాన—పూర్వజన్మంలో నేను యెవరికేమి అపకారంచేసినానో యెరుగనుగాని యీ జన్మంలో మాత్రము నేనిటువంటి కష్టాలనుభవిస్తూవున్నాను. నీఅల్లుడు పోయినకొత్తరికంలో వెనుక నేను పెట్టుకునే నగలుచూచినా కట్టుకునేచీరెలు చూచినా దుఃఖం ఆపుకున్నా పొర్లిపొర్లివచ్చేది. వాటిని చూచినప్పుడల్లా దుఃఖంపట్టలేక వకనాడు నగలన్నిటిని తెగనమ్మించివేసి రొక్కంచేసుకున్నాను; చీరెలు నాపెట్టెలో లేకుండా మరదలికి కొన్ని చెల్లెళ్లకు కొన్ని యిచ్చివేసినాను. అప్పటికీ నా దుఃఖమేమీ పోలేదు.

సుభ—వక్కమాటు వూరుకో యెవరో నడచినట్టు చప్పుడయినది. ఎవరయినా వస్తూవున్నారేమో!

వకటిపరిచి వళ్ళువత్తుకోకుండా మెల్లిగాపిల్లవాణ్ని దానిమీదపరుండ
బెట్టి పయినబట్టకప్పి చటుక్కున యివతలకువచ్చి గుండెలు తటతట
కొట్టుకోగా దొడ్డి గుమ్మములోనిలుచుండి కాకులువచ్చి పొడిచిపోత
వేమో అని విచారంచేత దూరాన్నుంచి చూస్తూవుంటిని. ఇంతట్లో
పెంట యెత్తుకపోయేవాడువచ్చి పిల్లయేడుపు విని మగశిశువునుచూచి
సంతోషించి కావడి అక్కడఅట్టే పెట్టి పిల్లవాణ్ని తీసుకొని యింటికి
చక్కాపోయినాడు. మనస్సుకు కొంచెం వూరటగలిగి నేనున్న లోప
లికివచ్చినాను గాని నాధ్యాసయంతా పిల్లవాడిమీదనే వున్నది. నే
నప్పటినుంచీ దొంకిలిపిల్లవాడు బాగావున్నాడా లేదా అని వాణ్ని
అడిగితెలుసుకుంటూ యిప్పటికీ అప్పుడప్పుడు వాడికేమయినాయిస్తూ
వుంటాను. వాడు మొన్నపిల్లవాణ్ని తనతోకూడా తీసుకొనివచ్చి
నాకు చూపించినప్పుడు పట్టుచేతిరుమాలు నావద్దవుండగా యిచ్చి
నాను. గుమ్మడిపండువలె పిల్లవాడెంతో చక్కగావున్నాడు. వాణ్ని
చూచినప్పుడు నాకెంతో దుఃఖంవచ్చింది. గొప్పవాళ్ళకడుపున పుట్టి
భాగ్యాలలో వుండి వుద్యోగాలు చేస్తూవూళ్ళేలవలసినవాడికి అడ్డ
మయినవాళ్ళయిళ్ళవద్దా పెంటలుయెత్తుకుంటూ ముంగిళ్ళు యెత్తుతూ
మనయెదుట నీచంగా జీవించవలసి వచ్చిందిగదా! (అని యేడ్చు
చున్నది.)

శ్యామ—ఇక నేనిక్కడవుండి యీదుఃఖవార్తలు వినలేను
వెళ్ళిపోతాను (అని లేచి వెళ్ళుచున్నది.)

సుభ—ఏడవకపోకు నీవు కొడుకునప్పుడు వీధిలోపారవేసి
నావో వాడప్పుడే పోయినాడనుకో.

జాన—నావంటి నిర్భాగ్యురాలి కడుపున పుట్టిన వాళ్ళకు
యేదురవస్థా కలగకుండా యెందుకుపోతుంది? మొదటిశిశువును పార
వేసినతరువాత యిఖనెప్పుడూ కామానికిలోబడి కక్కుర్తిపడకూడ

నొక్కబోయిందిగాని నేనేచివాలున లేచి అడ్డపడి దానినవతలికి తోసి పిల్లవాణ్ణి గట్టిగా రొమ్మున అదుముకున్నాను.

సుభ — నీవు కాగా అంతరంలో వించివావు గాని అన్నపూర్ణయితే నిమిషంలో ఆయినంటి బిడ్డలను పలుపాకి గొంతుకలు నులిమి వేసును. అది మిక్కిలీ రాతిగుండెది: దానికి నీలాగు జాలిగీలీ లేదు. దానిచేతి మీదుగా యిదివరకయిదారుగురు పిల్లలు స్వర్గస్థులయినారు.

శ్యామ — అయ్యో! యీఛండాలపు ఆచారంవల్ల యేలాగంటి క్రూరకృత్యాలు జరుగుతూన్నవి! ఆఆచారమే యిప్పుడు నా మెడటికి మనిషయివస్తే యేమిపాపం వచ్చినా కానీ నాకసితీరేట్టుగా వక్కసారిగా తుకపకికి వీళ్ళపిల్లవాణ్ణి చంపదలచుకొన్నట్టుగా చంపి వేసి లోకానికంతా బాధలేకుండా నివారణచేస్తును. ఇక్కడ అట్టే వుంటే పిల్లవాణ్ణి చంపినామాట కూడా వింటానేమో వెళ్లిపోదునా! చిన్నప్పయ్య యీమాటచెప్పబోయేమాట విని తరువాత వెళ్ళి పోతాను.

జాన — బిడ్డను వేగంగ వదలిపెట్టుమని నీవూ అన్నపూర్ణా కూడా నన్ను తిట్టి మొపపెట్టినా నాముసర్పప్పను నిప్పులలోపెట్టి పొర్లించి నట్లువుండి కులంవదిలి పెట్టడానికీ శిశువునువదిలి పెట్టడానికీ కూడా తోచక మరేమిచెయ్యడానికీ కొంతసేపాలోచన పాలుపోక చిట్టచివరకు చిన్నప్పటినుంచీ నన్నుపెంచి పెద్దదాన్ని చేసిన తల్లిదండ్రులను వదలిపెట్టడంకంటె అప్పుడుపుట్టిన శిశువును వదలిపెట్టడమే మంచిదని యెంచుకొని చంపడానికి మాత్రము ఒప్పుకోక తెగించి తెలతెల్ల వారేసమయాన్ని మెల్లిగా బిడ్డనెత్తుకుని వీథివయిపుకువెళ్ళి యొక పట్టాన్ని కొంపపడవెయ్యడానికి చేతులురాక సంశయించి యెవరైనా వచ్చి చూచిపోతారేమో అనేభయముచేత విధిలేక చివరకు యెవరూ లేకుండాచూచి యెంగిలివిస్తర్లు వేసేకుండులో ముందుగా పాతబట్ట

ఎప్పుడూ ఆడపిల్లలకు కనకూడదు. నీవుపడ్డ పరితాపం చూచిమగడు పోయిన, కొత్తరికంలో నైనా నీకంత దుఃఖం కలిగిందో లేదోనని నా కప్పుడు సందేహంతోచింది.

జాన—ఆక్షేపం నేనంతగా చెప్పలేనుగాని నాకప్పుడు కలిగిన ఆరాటం వర్ణించడానికి బ్రహ్మకైనా శక్యంకాదు. తోడివాళ్ళవలె సంతానంలేంపోయిందని విచారించడానికి బదులుగా నాకీకడుపెందుకు వచ్చిందా అని యేడవ మొదలుపెట్టినాను. కడుపుతో వున్నప్పుడు జరిగే శ్రీమంతమూ, సూడిదెలూ మొదలయిన సంతోషకార్యాలికి మారుగా నిద్రలేకపోవడం, తిండితినకుండా వుండడం, పరితాపపడడం మొదలయిన దుఃఖాలపాలయి కృశించడం సంభవించింది. యిలా కొన్ని నెలలు జరిగిన తరువాత వకనాడురాత్రి నొప్పులారంభించి ఘడియల ప్రొద్దుపోయేటప్పటికి ముద్దులుమూటకట్టే మగశిశువు పుట్టినాడు. ఆశిశువు మొగం చూడగానే నాకప్పుడు కలిగిన దుఃఖం యింతాఅంతా అని చెప్పడానికివల్లకాదు. ఆదివరకుశిశువుపుట్టగానే చంపిపారవెయ్యవలెనని మనస్సులో యెన్నివిధాలనిశ్చయించుకున్నా, పుత్రవాత్సల్యం యెటువంటిదో కాని ఆశిశువు మొగంచూచి చంపడానికి బుద్ధిపుట్టక యేమి చెయ్యడానికీన్నీ కూడా తోచకమనస్సులో వెయ్యితేళ్ళున్నూ జెర్రులున్నూ కుట్టినట్లుండే బహుబాధ పడ్డాను. నేనంతపాపాత్మురాలినీ కఠినచిత్తురాలినైయినా నాహృదయంలో అప్పుడు యెక్కడలేనిదయా ప్రేమా పుట్టుకొనివచ్చి కడుపున గన్న బిడ్డను చేతులారా చంపుకోవడంకంటె కులమూ ధర్మమూ వదిలి పెట్టి మాలమాదిగలలో కలిసేదానినయినా వుత్తమమని నిశ్చయించు కున్నాను. నేను యిలాగు తొందరపడుతూ పిల్లవానికేసిచూచి మనసులో యేగుడిసెటివాళ్ళ కడుపుననైనా పుట్టక నాకడుపున యెందుకు పుట్టినావని విచారిస్తూవుండగా, ఇంతలో అవ్వవచ్చిపిల్లవాడిగొంతుక

డబరిచినవు. ఒకపాపకార్యానికి పరిగెట్టినవాళ్ళు రెండోపాపకార్యానికి వెనుక తీయరు గనుక కులమునకు వెరచి మనసు రాయి చేసుకొని యెలాగో ఆపాపకార్యానికి సహితం నేను వప్పుకున్నాను.

శ్యామ—ఈమాటలువిన్న కొద్దీ లోపలినుండి వుప్పొంగి నాకోపము కొత్తుతూవున్నది. అయ్యో! మనకులాచారం యెంతపాపముగావున్నది! రంకుతనమూ, గర్భస్రావాలూ శిశుహత్యలూ స్త్రీహత్యలూ మొదలయిన ఘోరపాతకాలు చేయడానికై నాప్రోత్సాహపెడుతూవున్నది. గాని యీమదుర్మార్గపుకులాచారం దిక్కుమాలిన బాలవితంతులకు పునర్వివాహమంగీకరించి వాళ్ళకష్టాలను తొలగించడానికి అనుమతింపదు. దానికి నేను తిన్నగా వుండలేకపోతే మళ్ళీవివాహమయినా ఆమె తానుగాని రంకుతనంలో ప్రవేశించి యిలాగంటి అకార్యాలకెన్నడూ లోపడదు. రామ! రామ! యీ దిక్కుమాలిన కులంలో ఆడవాళ్ళకు మళ్ళీపెళ్ళిలేక పోబట్టికదా యీపాపపు మాటలన్నీ వింటూ వున్నాను!

జాన—అవును నిజంగాయి సాధారణంగా మనవూళ్లో రండా గర్భాలు దిగబడడానికి మందిచ్చే యెరకలదాని వద్దనే మందుపుచ్చుకున్నా కొన్నిదినాలు వల్లమాలిన కడుపునొప్పిచేత బాధపడ్డానే కాని కడుపుమ దిగడంచేతనో మరి యేహేతువుచేతనో చూలు దిగక యెప్పటిపలెనే సంతాపమువాలు కావలసిన దాన్నయినాను.

సుభ—ఆప్రయత్నం వ్యర్థమయినతరువాత నీవు మరింత బెంగపెట్టుకొని తిన్నగా తిండి తినడంమానివేసి గదిలోనుంచి యివతలకు లేచిరాక మనోవ్యాధిచేత మరింత కృశించసాగినావు. కూతురికి కడుపువచ్చిందని సంతోషించి సూడిదలనుచేసి పెట్టడానికి మారుగా యీ కడుపెందుకు వచ్చిందా అని పిండముపడి పోవడానికి మందులు పెట్టవలసినయోగం నాకుతటస్థించినది. లోకంలో పగవాళ్ళయినా

జాన—అప్పుడేమి చెప్పుదును! నాఅంతరాత్మ అకస్మాత్తుగా దీర్ఘనిద్రలోనుంచి మేలుకొని నామనస్సు చిల్లులు పడేటట్టుగా దూషించడాని కారంభించినది; మనసులో దాని పోలెక్కడకు వెళ్ళినా మానక అంతకంత కెక్కువై మనోవ్యథ బలము కావడాని కారంభించినది. ఆబాధ పోగొట్టుకోవడానికి వుపాయ మేమీతోచక ప్రాణత్యాగం చేసుకోవడానికి నిశ్చయించుకొని వకనాఁడు రాత్రి గోదావరిలో పడవలెనని యెవరూ చూడకుండా వెళ్లి కంఠం లోతు వరకూ దిగి చావడానికి మనసొప్పక ప్రాణాలమీది తీపిచేత తడి బట్టలతో మళ్ళీ యింటికి వచ్చినాను.

శ్యామ—నా కీసంగతి వింటేనే దుఃఖం వస్తూవున్నది. అది నిజంగా బాధపడేటప్పుడు యెలావుండేదో!

సుభ—అప్పుడు నీమనస్సు పడ్డ పరితాపం యెంతయినా ఉస్సహంగా వుండి వుండును. ఒకనాఁడు రాత్రి పదిసారులు తలుపు తీసి వెలుపలికి లోపలికీ పోతూవస్తూవుండి తరువాత మేముపడుకున్న గది దొడ్డితలుపు గుంజడం మొదలుపెట్టినావు. అప్పుడు నేను లేచి వచ్చి యేమిటని అడిగినాను. మొట్టమొదట నీవెంతసేపటికిన్నీ చెప్పక మరీమరీ బుజ్జగించి అడిగినమీదట మెల్లిగా నీకు కడుపు వచ్చినసంగతి చెప్పినావు. అది విన్న తరువాత నాకారాత్రి నిద్రే పట్టలేదు!

జాన—అప్పుడు నీతో నిజమంతా చెప్పకపోయినా యిప్పుడు చెపుతాను. నే నారాత్రి మీపడకగది దొడ్డి తలుపు గుంజినది తలుపు తీసుకొని వెళ్ళి నూతిలో పడవలెనని. నీవు చేసిన బోధవల్ల బ్రతికినానే కాని లేనియెడల నేనారాత్రి యేలాగయినా తప్పకుండా ఆత్మహత్య చేసుకొందును. నీవు నన్ను నివారించి యేమేమో బోధించి యెరకలదానిచేత గర్భవిచ్ఛిత్తు చేయించుకోవడానికినన్నొ

గుడ్డమందయిన శాస్త్రుల్లగారి వేదాంతోపదేశమున్నూ రోజుకు రోజు వృద్ధిపొందుతూవున్న నాయింద్రియములున్నూ పాపిష్ఠియవ్వనమున్నూ మూడూకూడా యేకమయి పోరాడి నామనస్సునుల్లో భర్తచుకొని వేసటపొందించడంచేత నామనస్సుబలహీనమయి కామస్వాధీనమైపోయింది. అప్పటికిన్నీ బొత్తిగా చావకుండా మూర్ఛపోయివున్న నా మనను మధ్యమధ్య తెలివివచ్చినప్పుడెల్లా లోపల్లహీనస్వరంతో మొరపెడుతూవున్న ధర్మదేవతయొక్క హితబోధవినడానికి ప్రయత్నపడుతూ వచ్చిందిగాని, మీరు మమ్మల్ని యింటికాడ దిగబెట్టి సింహాచలయాత్ర వెళ్లినప్పుడు శాస్త్రుల్లగారు చేసినమాయచేత దుర్బలమయిన ఆహితబోధ యెంతమాత్రమూ చెవిని జొరక వకనాడు కొంచం కక్కుర్తికి లోబడ్డాను. మొదట ఆకార్యానికి దిగకుండానే వుండవలెను గాని వకసారి దిగిన తరువాత యిక ఆపుకోవడానికి యెవ్వరికీ శక్యం కాదు. మీరు యాత్రసేవించుకొని తిరిగి వచ్చేవరకూ మేమూ ప్రకారం స్వేచ్ఛగా దేహం తెలియకుండా వివేకంపోయి సుఖసాగరంలో మునిగి తేలుతూవుండగా నాకంతలో—యేమి చెప్పను నా పాపఫలము!

శ్యామ—కడుపు వచ్చింది కాబోలును. ఈమాటలువింటేనే నాదేహం కంపం యెత్తుతూవున్నది.

సుధ—నీకు వక్కర్తెకే కాదు. యవ్వనంలో వున్న వాళ్ళ కెంతటి వాళ్ళకూ కామాన్ని జయించడానికి శక్యంకాదు. భర్తతో నిత్యం సుఖిస్తూవుండేవాళ్ళే కామంచేత కన్నుగానక మన్మథవ్యామోహంలో పడుతూవుండగా కామం జయించడానికి నీవంటి దానికెక్కడ సాధ్యమవుతుంది.

శ్యామ—అయ్యో! యికముందు నాబ్రతు కేమవుతుందో!

సంగతులు అనుభవంలోకి వస్తూవున్నవి. అందులోనూ ఒకముసలి ముత్తైదువ నీ వెంతచిన్నదానవైనా వైధవ్యముండవుగదా పునిస్త్రీల లోకి యెందుకు వచ్చినావని నా మొగంమీదనే అన్నది. నాకప్పుడెంతో దుఃఖం వచ్చింది. వాళ్ళు యేమిమాట్లాడుకుంటారో విందాము.

సుభ — అంత మనోవ్యాధిలోనూ నీకు పురాణకాలక్షేపం వకటి కొంచెం దుఃఖోపశమనానికి కారణమయింది.

జాన — కొంతనిజమే కాని, ఆపురాణకాలక్షేపమే నాకు మరి వకవిధమైన దుఃఖాన్ని తెచ్చిపెట్టింది. నాకు పురాణం వినవలెననే అపేక్ష అంతకంతకు యెక్కువయి మీరువున్నప్పుడూ లేనప్పుడూ కూడా శాస్త్రుల్లగారిచేత మంచికథలు చదివించి అర్థం చెప్పించుకోవడానికి మొదలు పెట్టినాను. వాటిలో తార, అహల్య మొదలయిన వాళ్ల కథలు యెంతో మనోహరంగావుండేవి. అందులోనూ చక్కనివాడు కావడమే కాకుండా వయస్సులో వుండడంచేత శాస్త్రుల్లుగారా భాగములకు అభినయిస్తూ అర్థంవిప్పిచెప్పేటప్పుడు నామనస్సు వెన్నవలె కరగడానికి ఆరంభించినది. మీరెవ్వరూ లేనప్పుడు శాస్త్రుల్లుగారు తారాచంద్రాదుల సంభోగప్పట్టుచనేవి చేతులుతిప్పుతూ మళ్ళీ మళ్ళీ అర్థంవివరించేటప్పుడు వొక్కొక్కమాటు నామనసు తానటువంటిసుఖం పొందడానికి ఉవ్విళ్లూర మొదలుపెట్టేది. మళ్లీ అంతలో అటువంటి తలపులు పాపహేతువులనితోచి బుద్ధిమళ్లించుకుంటూ వచ్చేదాన్నిగాని, అంతకంతకు మనస్సుకూ కామానికీ దెబ్బలాట జరగడం ఆరంభించింది.

శ్యామ — నాకిప్పుడీసంగతులేమీ తెలియకుండావున్నవి. పెద్దదాన్నయినతరువాత నాసంగతీ యిట్లాగే అవుతుందేమో.

జాన — పాపభయంచేత మొట్టమొదట నామనస్సెంతో దృఢంగానిలిచి లోబడకుండా పోరాడుతూవచ్చినా, పాతివ్రత్యానికి విరు

[శ్యామలాంబ చాటున ప్రవేశించుచున్నది]

శ్యామ—(తనలో) అమ్మ నడిచినట్టు చప్పుడవుతూవున్నది
వూరుకోమంటూవున్నది. దీన్నిబట్టిచూస్తే వాళ్లేమో రహస్యంమా
ట్లాడుకుంటూవున్నట్టున్నారు. నేనీతడికెచాటున కూర్చుండి వాళ్ళను
కునేమాటలు వింటూయుంటాను. వాళ్లు తలుపుతీసినపక్షానికి వాళ్ళకు
కనబడకుండా వెంటనే యీదోవనుదొడ్లోకి వెళ్ళవచ్చును. (అని
తడికెచాటున కూర్చున్నది)

జాన—(ఆలకించి) నాకేమీచప్పుడువినబడలేదు. నీవువూరికే
అలాఅనుకున్నావు గాని యెవరూరావడంలేదు. నామాటకడితేరా
విను. నాయీడువాళ్లు నగలుపెట్టుకున్నా మంచిచీరెకట్టుకున్నా నా
వ్రాత యిలా అయిందిగదా అని విచారంకలిగేది; నాయీడువాళ్ళు
శుభకార్యాలలో పేరంటానికి వెళుతూవున్నా భోజనానికి వెళుతూ
వున్నా నాబ్రతుకు బండలయిందికదా అని దుఃఖంకలిగేది; నాతో
కూడా చిన్నప్పుడాడుకునేవాళ్ళు బిడ్డలను కనిపెంచుతూ వుండడం
చూచి నాకటువంటిభాగ్యంపట్టలేదుగదాఅని కడుపుకాలిపోయేది.
పొరుగువాళ్ళయింట్లో వివాహమయినా పెళ్ళి వేడుకచూడడానికి
నోచుకోలేదుగదా? పొరుగింటిమాటదాకాయెందుకు? మన యింట్లో
నశుభకార్యం జరుగుతూవున్నా నలుగురితోనూకలిసిసంతోషంగా
తలయెత్తుకొని తిరగడానికివల్లలేదు. దైవమింతచేశాడుగదా అని
యేడుస్తూబయటికిరాక యేమూలనోదాగివుండవలెను. వెయ్యిమాట
లెందుకు? మనయింట్లో యేదో పండుగో పబ్బమోవచ్చి అందరికీ
వేడుకగావుండే సంతోషదినం నాకుమాత్రం దుఃఖదినంగావుండేది.

శ్యామ—ఇప్పుడు అప్పచెప్పిందంతానిజము. మొన్న చిన్న
చెల్లెలిపెళ్ళిలో నేను తిరుగుతూవుంటే పేరంటాళ్లంతా ముఖంముడు
చుకోవడం అసహ్యించుకోవడం చూస్తే నాకూ యిప్పుడిప్పుడే యీ

దని నిశ్చయమంచేసుకొని కట్టుగావుండవలెనని పెద్దవొట్టుపెట్టుకున్నాను. ఆవొట్టుప్రకారం కొన్ని మాసాలున్నతరువాత నాబుద్ధిఅంతాయేమయిపోయిందో కాని క్రమక్రమంగా మొదట అనుకున్న మాటలన్నీ మరిచిపోయి శాస్త్రుర్లవలలోబడి మళ్ళీయెప్పటిలాగు శాస్త్రుర్లతో రహస్యంగా తిరగడాని కారంభించినాను.

సుభ—ఆపదమ్రొక్కు లెప్పుడూ ఆపదపోయిన తరువాత స్థిరంగావుండవు. వయసులోవున్న వాళ్ళకు పురుషుడు వంటిగాతటస్థమయితే మనసు నిలుపుకోవడానికి యెక్కడనో లక్షకూ కోటికీ వక్కత్తెకుగాని అందరికీ సాధ్యంకాదు.

జాన—అటుతరువాత శాస్త్రుర్లమీద అంతకంతకు మోహం యెక్కువయి నోములూ వ్రతాలూ పేరుపెట్టి అందరికీ తెలిసేటట్టుగా కొంతా యెవరికీ తెలియకుండా రహస్యంగాకొంతా నాదగ్గరవున్న డబ్బంతా శాస్త్రుర్లకు దోచిపెట్టినాను. మీపెద్దప్రాణాలు సుఖంగా వున్నంతకాలమే కాని అవతల తోడబుట్టినవాళ్ళు తిండిపెట్టక నన్ను వెళ్ళగొట్టినట్టయితే నేను ముష్టియెత్తుకో వలసినదానినో, అటుకులు కొట్టుకోవలసినదానినో, పూటకూళ్ళు పెట్టుకో వలసినదానినో అవుతాను. అప్పుడు కామంచేత నాకు వళ్లూపయీూ తెలిసిందికాదు. అలావుండగా నాకు ధనంపోవడమే కాకుండా మళ్ళీగర్భంవచ్చింది. ఈసారి నాకు మునుపటంత మనోవేదన కలుగనందున, ఆరంభంలో కడుపు దింపుకోవడానికి ప్రయత్నం చెయ్యక వుపేక్షచేసినాను. ఈ గండంగడిచి పిండంబయటపడ్డపక్షానికి యిక నెప్పుడూ జారత్వం చెయ్యనని మాత్రం ఆదివాలలో నిత్యమూ కోటివేల్పులకు మ్రొక్కుకుంటూవుండేదాన్ని. తొమ్మిది నెలలూ నిండినతరువాత ఆడపిల్లను కనడమూ, దాన్ని శాస్త్రుర్లు తీసుకువచ్చిన మంత్రసానికియిచ్చివెయ్యడమూ అంతానీకు తెలియునే తెలుసును.

సుభ—రెండోసారి పిల్లనిచ్చివెయ్యడానికి నీవు మొదటమా టంత విచారంపడలేదు. వకటి రెండుమాట్లయిన తరువాతక్రమంగా విచారం తక్కువవుతుంది.

జాన—యెందుకుచేతనోగాని రెండోసారి నా మనస్సుకు మొదటిమాటు కలిగినంతబాధ తోచలేదు. ఆమంత్రసానిముండ పిల్లదాన్ని తీసుకొనివెళ్ళి భోగింపల్లవపాణికి రెండుమూపాయల కమ్ము కున్నదట. ఇప్పుడు పిల్లది దానియింటనే పెరుగుతూవున్నది. దుర్మా ర్గమయినయీకులాచారంవల్ల నాకు కలిగిన సంతానం మాలవాడి యింట్లో పెరిగి వీధులువూడ్చుకోవలసిన వాళ్ళున్నూ భోగంవాళ్ళ యింట్లోపెరిగి తన్నుకన్నవాళ్ళతోనూ వ్యభిచరిస్తూ గజ్జెకట్టుకునిప్రతి చోటా ఆడవలసినవాళ్ళున్నూ అవుతూవున్నారు. నాపాపంయిలాగు పండిపోగా యెవరిననవలసిన పనియేమున్నది? అన్నయ్య మొన్న శాస్త్రర్లనుకొట్టి వెళ్ళగొట్టినాడు గనుక, నాకిప్పుడు బుద్ధివచ్చింది. యిక అటువంటిగుణంవదిలి తిన్నగా వుంటాను.

సుభ—ఏతిన్నగా వుండడానికైనా యికనీవు భూమిమీద బ్రతికి బట్టకడితేగదా? యేనిమిషాని కేమవుతామో వకదినంమనది కాదు. మీకర్మంయిలా కాలిపోయింది. కూతుళ్ళకు వురుళ్ళుపోసి మనమలినీమనమరాళ్ళనీయెత్తిపెంచడానికిమారుగా గర్భస్రావాలకూ శిశుహత్యలకూ తోడుపడవలసిన పాపం నాకు తటస్థమయింది. యేదియెలావున్నా నాకు యిప్పుడు నీ బ్రతుకును గురించే ముఖ్యంగా విచారంగావున్నది. (అని యేడ్చుచున్నది.)

జాన—నాబ్రతుకునుగురించి నీవిప్పుడు భయపడవలసినంత వుపద్రవం యేమీ వుట్టలేదే, యెందుకేడుస్తావు? భగవంతుఁడు నావంటి వెధవముండను కష్టాలనుభవిస్తూవుండడానికి యెల్లకాలం బ్రతికిస్తాడు.

సుభ—చావంటే యెంత నేపురావలెను! నీసంగతినీవిప్పుడేమి యెరక్కుండా వున్నావు. నీ అన్నగారు — నీ అన్నగారు — (అని యేడ్చుచున్నది)

జాన—(తొట్రుపాటుతో) నాఅన్నగారేమిటి? కడితేరా చెప్పకపోతే నన్ను చంపుకు తిన్నట్టుసుమా! నిజము చెప్పు.

సుభ—నీవేమో తనభార్యను శాస్త్రుర్లవద్దకు పంపినావని నీఅన్నగారు నీమీద మహాకోపంగా వున్నాడు.

జాన—రామరామ! నేనాపాపంయేమీ యెరుగను. ఆ అనుమానంచేతనే కామోలును మూన్నాళ్ళనుంచి నన్ను చూచినచోట వల్లా కొరకొరలాడుతూ నెటికలువిరుస్తూ తిడుతూవున్నాడు. హేతువేమో అని నేను లోపల విచారిస్తూనేవున్నాను. నీపాదాలతోడు యిందులో నేనేదోషంయెరుగను. నేను చెడిపోయినందుకే రాత్రింబగళ్ళు విచారిస్తూవున్నదాన్ని మగడుగల యిల్లాళ్లనుకూడా దుర్నడతలోకి దింపుతానా? నాసంగతి దైవానికి తెలుసును.

సుభ—నీ విందులో యేదోషమయినా యెరుగుదువో లేదో కాని నీ అన్నగారు మాత్రం నీమీదనే అనుమానపడి నీకువిషం పెట్టడానికికూడా ప్రయత్నంచేస్తూవున్నాడట. వాడు నీకేమిపెట్టినా తినబోకు.

జాన—నీకుకూడా నామీద అనుమానం వున్నట్టున్నది. తరువాత అంతానీకే తెలుస్తుంది. నాకు యిదివరకు వచ్చినఅపకీర్తికి తోడు యీఅపఖ్యాతికూడారాకుండావుంటే, విషంపెట్టినందుకువాడికి నేనెంతో కృతజ్ఞురాలనై వుంటాను. చావుకోసం యెదురుచూస్తూ వుండిన్నీ ఆత్మహత్య చేసుకోవడానికీ సాహసించలేక బాధపడుతూ వున్నాను. వాడు నాకు నిజంగా విషమేపెట్టినపక్షానికి వక్కవాట్టి

క్రమతో యావజ్జీవమూ పొందవలసిన కష్టమంత విరగడై పోతుంది. మనలో విధవై జీవించడంకంటే వేరే తప్పిదంలేదు.

సుభ—మీ నాన్నగారి దుఃఖంచూచి వాడు ప్రయత్నం మానుకొన్నట్టున్నాడు. నీశిరోజాలు తీయించి వేయించవలసిందని మాత్రం వాడిప్పుడు గట్టిపట్టు పట్టినాడు. మొగుడుపోయినతరువాత నీ కీతలవెంట్రుకలెందుకు? తల దువ్వుకోనా పువ్వులు ముడుచుకోనా? నామాటవిని నీఅన్నగారి కోరిక చెల్లించు.

జాన—అయ్యో! వాడు నాకష్టం గట్టెక్కించేమార్గం మళ్ళీ మానుకున్నాడా? ఆడవాళ్ళకు తలగొరిగించడంకంటె వక్కమాటు తలతరిగివెయ్యడమేనుంచిది. చిన్నప్పటినుంచీ చమురురాచి పెంచుకొని ప్రాణంతో సమానంగా చూచుకుంటూవున్న పుట్టుకతోనే దేవుడుదయచేసిన అలంకారాలను చూస్తూచూస్తూ మంగలవాడి కత్తికి వప్పగించి యెలా ప్రాణాలు నిలుపుకోగలుగుతాను? (అని కన్నీరు నించుమన్నది.)

సుభ—అమ్మాయీ! దుఃఖంఅపుకో. నీకీఅలంకారాలవున్నా లేకపోయినావకటే, యెవరుమెచ్చుకుంటారు? యెవరుచూచి సంతోషిస్తారు? అవివుండడంవల్ల దువ్వుకోవడమూ చమురురాసుకోవడమూ లేక నీకూబాధగావుంటుంది; చూస్తూవుండడంవల్ల మాకూ దుఃఖంగావుంటుంది; నీవు బుద్ధిమంతురాలవుగనుక నామాటవిని నన్నూ నాన్నగారినీకూడా సంతోషపెట్టు.

జాన—అమ్మా! నీపాదాలికి నమస్కారంచేస్తాను. ఇప్పుడు మాత్రం నాకు శిరోజాలు తీయించేప్రయత్నం మాన్పించు. నాకు యిప్పుడు తలవెంట్రుకలు తీయించుకోవడానికీ వేరేబాధకంవున్నది.

సుభ—ఆబాధకంయేమిటో నాతోచెప్పు. నీకుబాధకలిగే పని నేనుమాత్రంచేస్తానా?

జాన—నీకు తెలియని దేమున్నది? నాకిప్పుడు మళ్ళీ—నేను చెప్పలేను.

సుభ—నీకు మళ్ళీ కడుపువచ్చిందా యేమి?

జాన—నీవు గ్రహించికూడా, ఆమాటమళ్ళీ నానోటనే యెందుకు పలికిస్తావు? ఈకడుపు దిక్కుమాలినముండకు నాకు రాక పోతే పెద్దన్నయ్య పెళ్ళానికి రారాదూ?

సుభ—అమ్మో! నాకిప్పుడు మళ్ళీకొత్తవిచారం తెచ్చిపెట్టినావు. ఎన్నోమాసమో వేగిరం చెప్పు.

జాన—మూడో మాసం.

సుభ—అలాగయితే యింకా ముదరలేదు. మునుపు రెండు సారులూ యుక్తకాలంలో చెప్పక కార్యం చెడగొట్టినావు. ఈమాటు తప్పకుండా లేతలోనే తగినమందు వేసి ముందుగా జాగ్రతపడవలెను. ఈవూళ్లో ముసలియెరకలదితప్ప యిటువంటిపనులలో సాధకురాలు మరియెవతెలేదు. అది రెణ్నెల్లక్రింద మీ అప్పగారికోసం వచ్చింది. అప్పటినుంచీ మళ్ళీ యెక్కడాజాడలేదు. రేపే వర్తమానం పంపి దాన్ని పిలిపించవలెను.

జాన—ఏమో నీమనసునచ్చిన వుపాయంచెయ్యి. నాబ్రతుకెప్పుడూ దుఃఖాలపాలే అవుతూవున్నది. తక్కవజాతి వాళ్ళల్లోవలె మనలో మారుమనువులయినా—

సుభ—అమ్మాయీ! యెవరో వస్తూవున్నారు. కళ్ళు తుడుచుకో.

[శ్యామలాంబ ప్రవేశించుచున్నది.]

శ్యామ—(తనలో) అప్పటినుండి వీళ్ళింకా మాట్లాడుకుంటూనే వున్నారు. జానకి తనకష్టాలే యింతసేపూ చెప్పి యేడు

స్తూవున్నది కామల్సును. (బిగ్గరగా) అమ్మా! నాన్నగా రేందుకో నిన్ను పిలుస్తూవున్నారు. నీతో యేమో మాట్లాడవలసి వుందట.

సుభ—నాన్నగారు వక్కరేవున్నా రా ? మరి యెవరైన కూడా వున్నారా?

శ్యామ—నాన్నగారు భోంచేసి వెళ్ళి గదిలో పడుకుని యేవేళకూనిద్రపట్టక లేచివచ్చి నన్నుపిలిచి కాళ్ళుపట్టుమన్నారు. నేను కాళ్ళుపిసుకుతూవుండగానే వక్కకునుకుపోయి యింతలో నిద్రలో వులిక్కిపడి లేచి యేమీతోచనట్టువుండి యేమిటని నేనడిగితే యేమీచెప్పక నిన్ను పిలుచుకుని రమ్మన్నారు.

సుభ—ఆయన కేదో దుస్వప్నం వచ్చివుంటుంది. జానకీ! నేను నాన్నగారి దగ్గరకు వెళ్ళివస్తాను. నీవూ శ్యామలాంబా యిక్కడ మాట్లాడుకుంటూ కూర్చుండండి. (అని వెళ్లుచున్నది.)

జాన—మళ్ళీ వేగిరంరా.—చెల్లీ! మనం దొడ్లో తులసికోట దగ్గరకు వెళదాముదా. నిన్ను వొకసంగతి అడగవలెను. (అని యిద్దరును వెళ్ళుచున్నారు.)

---

## ద్వి తీ యాం క ము

### ప్రథమరంగము—సీతారామయ్యగారిగృహము.

[నారాయణమూర్తియు, గోవిందరావును ప్రవేశించుచున్నారు.]

గోవిం—అన్నయ్యా! నిన్న నేను పాఠశాలకు వెళ్ళినప్పుడు మనయింటి కెవరో రాజ పురుషులు వచ్చి నాన్నగారితో నేమో చాలాసేపు మాటాడిపోయినారట. రెండుమూడు దినములనుండి నాన్నగారేమోచిన్నపోయియున్నారు; అట్లుండుటకు కారణమేమని

నేను రెండుమూడుసారు లడిగినను నామాట వినిపించుకొనక మరియొక ధోరణి తెచ్చుచువచ్చినారు. అందుచేత నేనా ప్రశ్న వేయుట నాన్న గారి కిష్టము లేదని మాటాడక యూరకున్నాను. రెండుమూడు దినములనుండి రాజభటుఁ డెవఁడో మనయింటిచుట్టును తిరిగిపోవు చున్నాఁడు. మన యిరుగుపొరుగులవా రిద్దఱును ముగ్గురును గుంపులు గూడి యేమో చెప్పుకొనుచు నేను వెళ్ళగానే మాటాడుకొనుట మానివేయుచున్నారు. రాజభటులు మన యింటి కేందుకు రావలెనో కొంచెము చెప్పెదవా?

నారా—వందమంది రాజభటులువచ్చినను, ఇప్పుడు మన నేమియుఁ జేయలేరు. రెండవవారికి తెలియకుండ రాత్రివేళ శవమును దహనము చేయించివేసినాము. ఆరాత్రివేళ వాహకులను కుదుర్చుటకును స్మశానభూమికి కట్టెలు చేరవేయించుటకును నేనెంతయుయినను శ్రమపడ్డాను. ఇప్పుడీకుట్రయంతయు మనసీళ్ళకావళ్ళ బ్రాహ్మణుఁడు కామయ్యగాఁడు చేయుచున్నాఁడు. వానిని వెళ్ళఁగొట్టివేసినాము కాని గాడిదకొడుకును వానికే విషము పెట్టవలసినది.

గోవిం—సుందరమ్మవదిన పాముకఱచి చావలేదా యేమిటి? విషవైద్యుఁడువచ్చి చాలసేపు మంత్రించినాఁడే.

నా—అదిచచ్చిన తరువాత విషవైద్యుని పిలుచుకొనివచ్చి నాము. మన సాంబశివుఁడు పోయినతరువాత దానినడత తిన్నగానే యున్నదికాని యేలాగుననో కొన్ని నెలలక్రిందట కామయ్యగాఁడు దానినికూడ నంటుకొన్నాఁడు. అమ్మ యీ సంగతి నాతో చెప్పి దానికి గర్భోత్పత్తికూడ అయినదని కన్నులనీరు పెట్టుకొన్నది. అమ్మయు నేనును కొంతసే పాలోచించి చేయవలసినపని నిశ్చయించి వెంటనే కామయ్యగాడిని మనయింటికడనుండి వెళ్ళఁగొట్టివేసినాము; అమ్మతరువాత రెండవవారెఱుఁగకుండ పాకవుచలిమిడిలో పాషా

ణముకలిపి మరదలికిపెట్టినది. పాషాణము మొదట నేనొకరి నిమిత్తము తెచ్చినాను; అది చివరకు మఱియొకరినిమిత్త ముపయోగించినది. దైవమే వేళకెవరికే విధముగా ముప్పుపెట్టునో యెవ్వరికిని తెలియదు తెల్లవారినదాఁక శవముట్టేయున్న నేమయినవచ్చునని తొందరపడి యారాత్రియే యన్నిపనులను కానిచ్చినాము. మేమాపని యెంత రహస్యముగా జరిగించినను, ఏలాగుననో కొంచెము పయికిపొక్కినది. రాజపురుషులకు వందరూపాయలిచ్చి వారినోళ్ళుకట్టినాము. సాక్ష్యము రాదుగనుక రక్షకభటులకుకూడ పదిరూపాయిలు పాఱవేసిన తీఱిపోవును.

గోవిం—మనకేమియు నపాయమురాక తప్పిపోయినను, మీరు చేసిన పనిమాత్రము మహాదారుణమయినది. మీకాసంగతి తెలిసినప్పుడు వదినెను పుట్టినింటికడ దిగవిడిచి రావలసినది; తమ కడుపునఁ బెట్టుకొని యాదరించుటకు తల్లిదండ్రు లొప్పుకొన్న పక్షమున వేఱేయుంచి యామెకు భరణమియ్యవలసినది. ఆవిడకిప్పుడు పదునెనిమిది సంవత్సరముల వయస్సు. మగఁడు లేకపోయిన తరువాత వయస్సులోనున్నవా రొకప్పుడయిన భంగపడకుందురా? కోడలుమాత్రమే కాక సాక్షాత్తుగా నన్నగారికోమార్తెకు విషము పెట్టుట కమ్మకెట్లుచేతులువచ్చినవి? మీరు చేసిన ఘోరకృత్యము విన్నమాత్రమున నాశరీరము పులకరించుచున్నది. మనసు కొట్టుకొనుచున్నది. రవంత కులాచారమును మీఱుటకు సాహసింపలేక నోట వచింపరాని కిరాతకృత్యములకు లోఁబడుచున్నాము. కటకటా! మనమత మింక కాల్పనా? నీవే మహాకార్యము నిమిత్తము మొట్టమొదట విషము తెచ్చినావో యా శుభవార్త కూడ నాకుఁ జెప్పితివా, విని సంతోషించెదను.

నారా—(దేహము కంపింప) చేసినపాపము చెప్పిన బోవు నని పెద్దలు చెప్పుదురు గనుక, నీకేమియు దాచక చెప్పెదను. జానకి చేసిన దుష్కార్యమొకటి చూచి కోపమువచ్చి దానికి పెట్టుటకయి మొట్టమొదట పాషాణముకొన్నాను. తరువాత అమ్మయొక్కయు బాబయ్యయొక్కయు దుఃఖమును చూచి దానికి హానిచేయవలెనన్న బుద్ధి నాకు మారిపోయినది. ఇప్పుడు నీవన్న మాటలమీద నాకు నన్ను చెదరి దేహము కంపమెత్తుచున్నది. మించిపోయినదానికి విచారించి చేసెడికార్యము లేదు. విషము పెట్టినతరువాతపశ్చాత్తాపము తెచ్చుకొని, అమ్మకూడ బహుదుఃఖించినది. ఘోరపాతకమున కొడిగట్టుకొన్నానుగదాయని నాకెంతో పరితాపము కలుగుచున్నది. అన్నపూర్ణమూలమున నిదియంతయు పుట్టినది. దాని దుర్బోధవలననే సుందరమ్మ చెడిపోయినది.

గోవిం—అన్నపూర్ణను, జానకిని నిందించిన కార్యమేమియు లేదు. స్వభావమును మళ్ళించుకొనుట కెవ్వరికిని శక్యము గాదుగనుక వయసులో నున్నంతవఱకు వారిని దూషించవలసినపని లేదు. తప్పిద మంతయు మనకులముదారిలోనే యున్నది. అనాథ యువతులసౌఖ్యమునకయి న్యాయమయినమార్గము నవరోధించి వారిని బాధపెట్టుచుండుటవలన నా తప్పిదమంతయు మనదేకాని మఱియొకరిదికాదు. దయావిహీనులమయి యటువంటి కాఠిన్యమును వహించినతరువాత మన కా దుష్కృతఫల మనుభవించకుండ తీఱునా? బాలవిధవలకు వివాహ మంగీకరించినంగాని యీ పాపములేమియు పోవు. అంత వఱకును నీ మాలకూళ్ళన్నియు నీలాగున నుండవలసినవే.

నారా—స్త్రీలకు పునర్వివాహము లేకపోవుట కలియుగము పుట్టినప్పటినుండియు నున్నదికాని నిన్న మొన్న వచ్చినదికాదు. ఎన్ని కష్టములు వచ్చినను పూర్వాచార కులాచారములను మాత్రము

మీఱరాదు. పడుచుతనములో భర్తలుపోయినను పరపురుషుని మొగము చూడక పతివ్రతలుగా నున్నవారు లోకములో నెంతమంది యున్నారు కారు? మనయింటిలో కాఁగా పాప మీలాగున పండినది.

గోవిం—మనయొక్కరింట మాత్రమే యీలాగున నున్నదని నీవు భ్రమపడుచున్నావు గాని యించుమించుగా లోకమంతటను ఈవిధముగానే యుండును. చిన్నతనములో మగలుపోయినవారిలో తిన్నగానుండునది యెక్కడనో నూటికి కోటికి నొకానొకతె యుండునుగాని బాలవిధవలలో ముప్పాతిక మూఁడువీసము లెప్పుడో యొకసారియైనను కక్కుర్తిపడినవారుగానే యుందురు. నీవన్నట్లు పతివ్రతలుగానుండు కొందఱిలోనైనను విశేషభాగము సమయము దొరకకపోవుటచేతను బంధుజనులు నిర్బంధపఱుచుటచేతను పంజరములో చిక్కుకొన్న చిలుకవలె స్వేచ్ఛావిహారమున కవకాశములేక యాప్రకారముగా నుండవలసినవారగుదురే కాని నిర్మలచింతచేతఁ గాదు. మన గ్రామము సంగతియంతయు మనము చెప్పలేకపోయినను మన వీధిసంగతి మాత్రము మనము విచారింతము.

నారా—మనవీధిలో నింటింటను ఒకరిద్దఱు బాలవిధవ లుండనే యున్నారు. వారిలో తిన్నగానుండువా రొకరిద్దఱుందురేమో కాని మొత్తముమీఁద నందఱును చెడుతిరుగుళ్ళు తిరుగువారుగానే కనబడుచున్నారు.

గోవిం—వారా యొకరిద్దఱును కనఁబడుచుండ లేదు. ఆస్త్రీ తిన్నగానున్నదని వ్రేలుమడచి నాకొక్కదానిని పేరెత్తి చెప్పుము. దానిచరిత్రమంతయు నే నిప్పు డేకరువుపెట్టెదను. సోమయాజులు గారి విధవకూఁతురు మొన్న బహిరంగముగా తురకవాని తీసుకొని లేచిపోయి రాజవీధిలో గుడిసెవేసికొని వానితో కాపురమున్నది. ఆసోమయాజులుగారును సోమిదేవమ్మయు పెద్దతనములో పడుచున్న

దుఃఖము తలఁచుకొన్న నాకు గుండెలు బ్రద్దలగుచున్నవి. పాపమా బ్రాహ్మణుఁడీయూరు నెలలనుండియు నిల్లువిడిచి వీధిలోనికి రాలేదు.

నారా—ఒక్కొక్క పాడుముండపుట్టి కులమున కంతకు నప్రతిష్ఠ తీసికొనివచ్చును. నాలుగు సంవత్సరముల క్రిందట మనయింటి యెదుట కంసాలివానిని తీసికొని లేచిపోయిన పాపిముండ బ్రతుకిప్పు డేమయినదో విన్నావా? వాఁడు దానివద్దనున్న నాలుగువందల రూపాయల నగలును తీసికొని యొకనాఁడు దానితో చెప్పకుండ పారిపోయినాఁడు. ఆముండ తరువాత రోగములు తగిలించుకొని తిండిలేక సకలబాధలుపడి చివరకు పంతులుగారిలోపల నంట్లుతోముకొని యెంగిలి మెతుకులుతిని జీవించుచున్నది. అనగలు నాలుగు లాగుకొని యాతురకవాఁడు దారిపట్టినతరువాత సోమయాజులగారి కొమార్తెగతియు నీలాగేయగును.

గోపిం—ఒక్క సోమయాజులుగారి కొమార్తెగతియే యేమి? మనలోని స్త్రీపునర్వివాహము లేని క్రూరాచారమువలననలక్షలకొలఁది కులస్త్రీల కిట్టిగతియే పట్టుచున్నది. కొందఱిగతి యింతకంటె నిర్భాగ్యకరమయినదిగా నున్నది. మొన్న యీ పట్టణములోనే గొప్ప యింటబుట్టిన వెలగపూడివారి చిన్నదానికి సంభవించిన దురంతముచూచి జాలిపడి కన్నులనీరుపెట్టుకొనివారొక్కరైనను లేరు. అంతమంది గొప్పపనులలోనున్న బంధువులుండియు నేమియుంజేయఁజాలక యాచిన్నదాని నరితీయుటకయి మాలవానికొప్పగించి యూరకున్నారు. ఆవిరుద్ధపుసంగతి జరిగిన తరువాత నేమియు సంబంధము లేని నావంటివానికి సహితము రెండుదినములవఱకును రాత్రి నిద్ర పట్టినదికాదు. అట్టిస్థితిలో తల్లిదండ్రులకును దోడబుట్టినవాండ్రకును బంధువులకును నెంతవిచారముగా నుండునో! ఇంకనాకుటుంబ మెప్పుడయినఁ దలయెత్తుకొని పదిమందిలోను తిరుగఁగలుగునా? ఈయుక

కీర్తి చేత గృహ యజమానుడు కుంగిపోయి సరి వారి మొగము చూచుటకుగాని గ్రామములో నుండ లేక యిల్లువిడిచి సకుటుంబముగా నేదో దేశాంతరమునకు లేచిపోవుటకయి సిద్ధముగా నున్నాడు.

నారా— పాపమా చిన్న దానికి మరణశిక్ష విధించునప్పుడు న్యాయాధిపతికి సహితము కన్నులనుండి నీరు కారినది. అతడు జంతుహింసచేసి మాంసభక్షణము చేయు హూణుడయినను, ఈ విషయములో మిక్కిలిదయాళుడుగా కనబడినాడు. శిక్షాస్మృతినిమీరి వర్తించుట కధికారము లేక యిష్టములేక పోయినను న్యాయాధిపతి యాకఠినశిక్షను విధింపవలసినవాడయినాడు. ఆచిన్నదాని నురితీసిన దినమున మనగ్రామ మశేషమును చూడ వెళ్ళినది. ఉరికొయ్యమీటను త్రొక్కినమాలవాడు సహితము చిన్నదానినిచూచి యేడిచి యందఱిలోను బ్రాహ్మణకులమును పట్టుకొని చెడదిట్టినాడు. వానిమాట లప్పుడందఱిమనసులోను శూలములవలె నాటుకొని యెల్లవారును కులాచారమును నిందింపసాగిరి. భాగ్యవంతులుగదా డబ్బులాగుదమని యెవ్వరో దుర్మార్గు లీవ్యవహారమును పయికి తెచ్చినారు. ఆచిన్నదిచప్పున దండవిధాయియొద్ద ప్రథమవిమర్శనలో నే తన నేరము నొప్పుకొన్నది. ఎంతధనము వ్యయపుచ్చియినను పయికివచ్చినతరువాత తప్పించుట కెవ్వరికిని సాధ్యమయినదికాదు. తెల్లవారి లేచిన మన గ్రామములో నిటువంటి వ్యవహారములు ప్రతి దినమును లక్షలు మన చెవులకు వినబడుచుండును. అవియన్నియు పయికివచ్చుచున్నవా యేమిటి? కాలమును కర్మమును సమకూడినప్పు డేదోయొకటిపయికి వచ్చుచుండును.

గోవిం— ఈఘోరపాతకముల కెల్లనుమనకులాచారముమూలాధారమయియున్నది. సర్వానర్థములకును జన్మస్థానమయిన యీ కులాచారము నశించెనా యిప్పుడు నేను పండుగుచేసిపిండివంటిలతో

పదివేలమందికి విందుచేసెదను. ఆచిన్నది తనయకృత్యము బయలఁబడ్డతరువాత బ్రతికియుండుటకంటె మరణము నొందుటయే మేలని యెంచుకొని తనయపరాధము నొప్పుకొనియుండును. ఒకవేళ శిక్ష తప్పించుకొన్నను, కులమువారామెను మరల జాతిలోనికి రానియ్యరు గదా? ఇఁక నామె యెల్లకాలమును జాతిభ్రష్టురాలై సమస్తమును విడిచి దుఃఖైకమూలమయిన చెడుబ్రదుకు బ్రదుకవలెను. అట్టి నీచపు మనుగడకంటె చావే వేయిరెట్లుత్తమమైనది.

నారా—అట్లయిన, రాజశాసనము బహుకాలము కష్టపడకుండ నిమిషములో ప్రాణముపోఁగొట్టి యామెకుపకారమే చేసినది.

గోపిం—క్రూరమయిన కులాచారమూలమునవచ్చెడి బాధను తప్పించి యాచిన్నదానివిషయములో రాజశాసనమొకవేళఁగొంచె ముపకారము చేసినను, అనాథలైన ముద్దరాండ్రవిషయమయి కులాచారమువలెనే రాజశాసనము నిర్దయమయినదిగానే యున్నది. ఈ యనర్థములకెల్లను కారకుఁడయిన దుర్మార్గుని రాజశాసనముగాని కులాచారముగాని సిగపువ్వు తెంపదు. బహువిధములయోపాయములు పన్నినిర్దోషురాండ్రయిన ముగ్ధస్త్రీలను తమవలలోఁబడవైచి భంగ పరచు దుష్టపురుషులను నిర్భయముగా విహరించుటకు విడిచిపెట్టి, అట్టి కఠినచిత్తుల దుష్ప్రయత్నములచే మోసపోయి తమ పాతివ్రత్య మును పోఁగొట్టుకొని మూలలనడఁగి యున్న యభాగ్యురాండ్రయిన యబలలను బాధించుటకయి కులాచారమును రాజశాసనమునుకూడఁ గలిసి తమ క్రౌర్యమునంతను జూపును. ఆచిన్నదాని దురవస్థకంతకును కృష్ణశాస్త్రి కారకుఁడు; అతఁడు వారియింట దేవతార్చనకని ప్రవేశించి మెల్లగా నాచిన్నదానిని భంగపెట్టినాఁడు. ఈహానికెల్లను మూలమయినవాఁడు మహాగౌరవముతో మన యందఱియిండ్లలోను తిరుగుచునే యున్నాఁడు; వానిదోషమువలన భాగ్యహీనురాలయిన

యాచిన్నదిమాత్రము మన్నుగొట్టుకొని పోయినది. ఆకృష్ణశాస్త్రి యొక్క విధవ చెల్లెలిదివఱకు పదికడుపులు దింపుకొని యెంతమందినో పిల్లలను చంపినది. దానినెవ్వరును నేమియుఁ జేయఁజాలరు.

నారా—ఇటువంటివి విచారించిన ప్రతి గృహమునందును కొంచెముగానో గొప్పగానో యుండనేయుండును. మనమెంతో యోగ్యులనుకొనుచుండినదీక్షితులవారికూతురంతటిదానికిప్రమాదమువలన నిటువంటిపాపమే సంభవించినది. ఆమె తండ్రితో గంగాపూజ చేయుచున్నదినములలోనే కడుపురాఁగా, శిశువు జననమయిన తరువాత బిడ్డను దొడ్డిలోనే గోయితవ్వి పాతిపెట్టి తోడఁబుట్టినవాఁడే యుప్పుకువిషముపెట్టి చంపివేసినాఁడు. ఈకలిమహిమయిట్లుండఁగా మనమేమి చేయఁగలము?

గోవిం—కాలమునునిందించుట వట్టివెఱ్ఱితనము. యోగ్యతాయోగ్యతలు మనుష్యులలోనున్నవి కాని కాలములో నేమియులేదు. మనదుష్ప్రవర్తనము నంతను మనము కాలమువిూఁద త్రోచివైచి పయికి మనము నిర్దోషులముగాఁ గనఁబడఁజూచుచున్నాము. అనాథలయిన యువతుల సౌఖ్యమునకు మనమున్యాయమయిన మార్గమును నిరోధించుటవలన వారు ప్రకృతిని జయింపలేక యింద్రియదౌర్బల్యమువలనను కామపీడవలనను కాముకప్రేరణమువలనను పురికొల్పఁబడి యున్మత్తురాండ్రయి కానిమార్గమునఁ బ్రవర్తించి తమకును తమవారికిని బహువిధవిపత్తులను తెచ్చిపెట్టవలసినవారగుచున్నారు. వివాహమయిన మూఁడోనెలనేపోయిన గోపాలశాస్త్రి మేనల్లునిభార్య మొన్ననెవరినో తీసికొనిలేచివచ్చినదట. మనమింత ప్రయత్నము చేసినను, మనవీధినున్న బాలవిధవలలో నొక్కతెను మంచిదానినిని చెప్పలేకపోయితిమి. కొందఱు బ్రాహ్మణ విధవలు శుభ్రముగా చాకలవాళ్ళను మంగలవాళ్ళను జీతములకే యుంచు

కొన్నారు; మఱికొందఱెవరు దొరకిన వాండ్రితో నెల్ల నేస్తుచు భ్రూణహత్యలును, శిశుహత్యలును జేయుచు కులములో నేయుండి గౌరవహాని లేకుండ మనయందఱియిండ్లలోను నిశ్శంకముగా తిరుగుచున్నారు. మఱియొకవీధివారి నడిగినచో తమవీధియే యీవిషయమున మిక్కిలి పాడుగానున్నదని చెప్పుచున్నారు. ఏయూరివారి నడిగినను, ఈదుర్మార్గముల విషయమై తమ గ్రామములో నున్నంత మాలకూ డెక్కడనులేదని చెప్పుదురు. మానుషస్వభావ మంతటను నేకరీతిగా నే యుండునుగనుక, వయస్సులో నున్న స్త్రీలకుస్వభావమును జయించుట కెక్కడను శక్యముగాదు. తప్పిదము మనయందు పెట్టుకొని వృథాగా కాలమును దూషింపక, అందఱునుజేరి యీ పాప నివారణమునకై యేదైన నొక యుపాయము నాలోచించవలెను.

నా రా.—అటువంటి దుర్మార్గురాండ్ర నందఱిని చంపివేయుట తప్ప నాకు మఱియొక యుపాయమేమియుఁ గనఁబడలేదు. స్త్రీలు దుర్మార్గురాండ్రని యెఱిఁగియే త్రికాలవేదులయిన మనమహర్షులు స్త్రీలకు సహగమనము విధించినారు. సద్వివేచనములేని యీమ్లేచ్ఛులు మన దేశమునకు ప్రభువులుగావచ్చి మన శాస్త్రములు మంటంగలిపి మాణిక్యమువంటి మన సదాచారమును మాన్పివేసినారు. అందుచేత విధవమండ లెక్కువయి యీదుర్మార్గములకన్నిటికిని లోనయి బ్రాహ్మణవర్ణమున కవమానమును సిగ్గును తెచ్చుచున్నారు.

గోవిం.—ఇప్పుడు విధవలను కులమువారు కలకాలముపెట్టెడు తుదిలేనిబాధలకంటె నొక్కమాఱు బ్రతికియుండఁగానే కాల్చిచంపుటయే మంచిదయినను, ఆహింసమాత్ర మెప్పుడును క్షాత్రకృత్యము కాకపోదు. మన పరిపాలకులగు లిప్పుడు దయాళులు కనుక నే యీ క్రూరాచారమును మాన్పియున్నారు. ఆ దురాచారము బహు

కాలమునుండి వచ్చుచుండుటచేతను దానివలన మనకేమియు బాధ లేదు గనుకను మనకది యిప్పుడంత క్రూరకృత్యముగా కనఁబడుచుండలేదు. ఆ యాచారమును పురుషుల విషయమునకు మార్చి, భర్తపోయిన తోడనే భార్య సహగమనము చేయవలసినదని బ్రహ్మచర్యము చేయవలసినదని చెప్పుటకు మారుగా నెంతచిన్న పిల్లయైనను భార్యపోయినతోడనే యామె శవముతోఁ గూడఁ గట్టిబ్రతికి యున్న భర్తను తగులఁబెట్టవలసినదనిగాని తలగొరిగించి విరూపిని జేసిగాని తిన్నగా తిండిపెట్టక మాడ్చి శక్తికిమించినపని చేయించుచు వీధిమొగము చూడకుండ భర్తను మూలఁగదిమిపెట్టి మరల పెండ్లి లేకుండఁ జేయవలసినదనిగాని విధియుండి యాప్రకారముగా జరుగుచున్నచో, అది క్రూరాచారమగునో కాదో మనకప్పుడు తెలియును. అట్టిదురాచారములను తొలఁగించి ప్రజాసౌఖ్యము వృద్ధిచేయుట ప్రభుత్వమువారి కర్తవ్యకృత్యమే. మనలో విధవావివాహము నెలకొల్పినచో మన మిప్పుడనుకొన్న దోషములన్నియు నివారణమగును.

నారా—ఎన్నిదోషములు పోయినను బ్రాహ్మణులుమాత్ర మది చేయఁదగిన పనికాదు. విధవావివాహము మనశాస్త్రమెంత మాత్రము నంగీకరింపదు.

గోవిం—విధవావివాహము శాస్త్రసమ్మతమని మనపట్టణములోని కొందఱు సభలు చేసి వాదింపఁ బోవుచున్నారు. దొరతనమువారుకూడ విధవావివాహము ధర్మవివాహమేయనియు వారికిపుట్టిన సంతానము గనుక వారు దాయార్హులనియు రాజశాసనమునుజేసి పీఠికలో మనహిందూధర్మశాస్త్రకారులు స్త్రీపునర్వివాహము నంగీకరించుననికూడ వ్రాసియున్నారు.

నారా—ఏమివ్రాసినను మతాంతరులమాట మనమునమ్మరాదు. వారేలాగుననైనను మనలను బ్రాహ్మణులనుండి చెడఁగొట్టి

యందఱితో సమానులనుగాఁ జేయవలెనని చూచుచున్నారు. విధవా వివాహము శాస్త్రసమ్మతమని వాదించువారు జాతిభేదమక్కఱలే దను మతాంతరుల పుస్తకములను జదివినవారే. శాస్త్రములను వారు చెప్పినయర్థము విశ్వసింపరాదు. హూణభాషచదువుకొని రెండుపరీక్షలలో తేఱఁగానే నీకుకూడ నిటువంటి దుర్బుద్ధి పుట్టు చున్నది.

గోవిం—శాస్త్రములు ప్రమాణముకదా? విధవావివాహము శాస్త్రసమ్మతమని మన పండితు లొప్పుకొన్నపక్షమున జరిగించ వచ్చును.

నారా—మనపండితు లొప్పుకొన్నప్పటిమాట చూతము. వారిని బ్రహ్మాదిగివచ్చినను ఒప్పించలేఁడు. మనలో నెటువంటిపండితు లున్నారనుకొన్నావు?

గోవిం—ఒకవేళ పండితులందఱు నంగీకరించిన పక్షమున, మన శ్యామలాంబకు వివాహము చేయుటకు నీవొప్పుకొనెదవా?

నారా—అటువంటి పాపపుమాటలనఁబోకు. శాస్త్రమంగీ కరించినను, మనవంటి అగ్రవర్ణములలో చేయరాదు. గొల్లలు మొదలగు వారి తోడిపాటిగా మనలో కూడ మాఱుమనుములున్న పక్షమున బ్రాహ్మణవర్ణమున కాధిక్యమేముండును? మనము కూడ తక్కువ వర్ణములవారితో సమానులము కామా?

గోవిం—ఇప్పుడు జరుగుచున్నట్టుగా గర్భస్రావములును, శిశు హత్యలును, స్త్రీహత్యలును, హీనజాతిసంభోగమునుజరుగు చుండుట చేత మనగౌరవము పోక యుండు తక్కిన జాతులవాఁవలె శాస్త్ర సమ్మతమయిన పునర్వివాహమును మనస్త్రీలకుఁ జేసి యీదోష ములనన్నింటిని పోఁగొట్టినందువలననా మన గౌరవముపోవును?

నారా—నాకీయ శ్రుతులతో పనిలేదు. శాస్త్రమంగీకరించునని పండితులందఱు నొప్పుకొని నాన్నగారు కూడ సమాధానపడ్డ మీదట నే నప్పుడేమియు చేయక యూరకుండెదను. నే నప్పుడేమియు నడ్డము రాకపోవుటయే విధవావివాహము శాస్త్రసమ్మత మనువారికి మహోపకారము. కలి ముదురుచున్నది; ఇంక నెవరు పట్టుకొన్నను వర్ణసంకరము కాక మానదు. పనియున్నది నేను వెళ్ళిపోయెదను.

[అని లేవగా నిద్దఱును వెళ్ళుచున్నారు.]

---

## ద్వితీయరంగము—పాపన్నయిల్లు.

[వంట బ్రాహ్మణుడు కామయ్య ప్రవేశించుచున్నాడు.

కామ—(తనలో) నారాయణమూర్తి వట్టి కిరాతుడు. తండ్రితో చెప్పి నన్ను వెళ్ళగొట్టించి వేసేడు. అప్పటినుంచీ అన్నపూర్ణతో మునుపటిలాగు స్వేచ్ఛగా తిరగడానికి వీలు లేకుండా వున్నది. అయినా కానీ యీ పాపన్న అన్న పుణ్యమాఅని రోజుకు వకపర్యాయమయినా యిక్కడ చూచుకోవడం సంభవిస్తూ వున్నది. ఎలాగయినా ప్రయత్నంచేసి అన్నపూర్ణను యిల్లు లేవతీస్తాను. మొన్న నేను చెప్పినప్పుడే వప్పీనప్పుడంగావుండి చూతామని సగం సమాధానం కనబరిచింది. నారాయణమూర్తిగాడు సుందరమ్మను విషంపెట్టి నిమిషంలో చంపివేసినాడు. నేను వాళ్ళయింట్లో అల్లే వున్నట్టయితే ఆదుర్మార్గుడు నాపనీఅంతే చేసును. ఒకవిధంగా లేచి రావడమే మంచిదయింది. తీరా సుందరమ్మను దహనంచేసి వేసిన తరువాత తెలిసింది కాని లేకపోతే వాళ్ళకొంపతీసివేస్తును. ఎప్పుడయినా వాళ్ళకుటుంబానికి గొప్ప అపకారంచేసి నాపగ తీర్చుకుం

టాను. అంతలోనూ జానకమ్మమీఁద నాకు మహాకోపంగావున్నది శాస్త్రుల్లతో యేదుస్తూ నాతో రమ్మంటే వచ్చింది కాదు.

[ఇంతలో పాపమ్మ ప్రవేశించుచున్నది.]

పాప—నాయనా! నీవెంత సేపైంది వచ్చి?

కామ—ఇప్పుడేవచ్చినాను. ఇంకా అన్నపూర్ణమ్మరాలేదు. ఈవీధికి పుణ్యాత్మురాలవు నీవొక్కత్తెవున్నమూలంగా మావంటి వాళ్ళ కందఱికి ఆధారం దొరకింది.

పాప—నేను ముసలిముండనయినాను. మునుపు నాకాలంలో పడుచువాళ్ళందరూ యింటిముందర పడి కాపులుపడి వుండేవారు. ఆకాలం పోయింది. యిప్పుడు నేను చేసే వుపకారమల్లా డబ్బువుచ్చుకొని మీవంటి పడుచువాళ్ళకు కొంచెం స్థలం యివ్వడం తప్ప మరేమీ లేదు.

కామ—ఆసహాయంమాత్రం మాటలతో వున్నదా యేమిటి? యీవీధిని యిన్ని యిళ్ళువున్నవి. యేరండా కొడుకయినా యేరండ ముండయినా యింతమాత్రం వుపకారం కట్టుకుంటూవున్నారా? అన్నపూర్ణమ్మ వచ్చేవేళ మించిపట్టున్నది.

పాప—యింకా మించలేదు. యింట్లో వాళ్ళందరూ భోజనానికి మడికట్టుకోవడంతోనే వస్తుంది. దానికి రావడానికి సమయం దొరకవలెనా? అక్కరలేదా?

కామ—యీలోగా వూళ్ళోకబుర్లేమయినావుంటే చెవుదూ.

పాప—యేమికబుర్లున్నవి? మన యింటి వెనకాలను కాపురంవుండే సుబ్బమ్మ కడుపు దింపుకోవడానికి మందువుచ్చుకొని పిండంపడక రాత్రి చచ్చిపోయింది.

కామ—ఆమసిషి పొట్టియెఱ్ఱవెధవ కాదూ?

పాప—అవును, ముప్ఫయ్యేళ్ళమనిషి. మన యింటికి తరచుగా వస్తూపోతూవుండేది.

కామ—మనలో పడుచుముండలు కడుపులు దింపుకుంటూ వుండడమూ పిల్లలను కని చంపివెయ్యడమూ మందులుతిని చావడమూ మహామెక్కువవుతూవున్నవి. యీలాగు వుండడంకంటె పడుచుముండలనందరినీ యెవరినైనా కట్టుకుని కాపురం చెయ్యమంటే బాగా వుంటుంది.

పాప—నాయనా! లోకంలో మన కళ్ళముందరనే యెన్ని విరుద్ధాలైనా పుడుతూవున్నవి. యెవళ్లో దుర్మార్గపు ముండవాళ్ళు వెధవవాళ్ళకు పెళ్ళిచేయించడానికి మనవూళ్ళోసభలుచేస్తారట. కలియుగం యింకా యేమి వున్నది! చాటుగా పిల్లలను గన్నా కడుపులు దింపుకున్నా నేమి యేడిచినా బాగా వుంటుంది కాని వెధవముండలు బహిరంగంగా పెళ్ళిచేసుకుంటూ రా?

కామ—నామతానికి పెళ్ళిచేసుకుంటేనే బాగా వుంటుందని తోస్తూవున్నది. అలాగంటి పెళ్ళివుంటే నేను యెవతెనయినా కట్టుకుని సుఖంగావుందును. డబ్బుగల వాళ్లు ముసలిముండా కొడుకులు సహితమూ మూడోపెళ్లికీ నాలుగోపెళ్ళికీ మూడేళ్ల పిల్లలను చేసుకుని ముండామోయించడంచేత, యిప్పుడు పిల్లలకు కరువువచ్చి సాధారణపురుషార్లకు యెక్కడా పిల్లలు దొరకడంలేదు. ధనాశచేత తండ్రి ముండాకొడుకులు కూతుళ్ళను వెయ్యింటికీ రెండువేలింటికీ రూపాయల కెత్తుకెత్తు అమ్ముకుంటూవున్నారు. డబ్బుతెచ్చుకోలేనివాళ్ళు బ్రహ్మచారులై యెల్లకాలమూ తిన్నగావుండలేక అడ్డమయిన గుడిసేటిముండలతోనూ యేడిచి సంకటాలు తగిలించుకొని బాధపడి చస్తూవున్నారు; కొందరు సంసారులను లేవతీస్తూవున్నారు. నేను చిన్నప్పటినుంచీ చెమటవూడ్చి సంపాదించిన యేడువందలరూపాయ

లూ నామామగారి మొగాన్ని పోసి నాలుగేళ్ళపిల్లను పెళ్ళిచేసుకుంటే అది పెద్దది కాకుండానే లంఖణాలుచేసి చచ్చిపోయింది.

పాప—మళ్ళీయేమయిన పెళ్లిప్రయత్నం యెక్కడనైనా చేస్తూవున్నావా?

కామ—నేను ప్రయత్నం చేస్తూవుంటేమాత్రం యెలాఅవుతుంది? రెండోపెళ్ళివాడనని డబ్బు మరీయెక్కువ తెమ్మంటారు. మొన్న మూడేళ్ళపిల్లను తొమ్మిదివందలరూపాయలకు బేరంచేసినాను. ఇంతలోకే నేతి వెంకయ్యగాడు అడ్డంవచ్చి తాను వెయ్యిరూపాయలు పూర్తిగా యిస్తానని నాకంటె యిరవైయేళ్లు పెద్దవాడయినా పిల్లను తానుచేసుకున్నాడు.

పాప—దానిముండా మోసిన రూపాయలు ఆవెయ్యిరూపాయలూ నీవే యిస్తాననకపోయినావా?

కామ—మొదటిపెళ్లి అయినకాడినుంచీ నీళ్లుమోసీ వంటలు చేసీ నాలుగువందలరూపాయలు కూడబెట్టినాను. జీతం లేకుండా బసులుతీరిందాకా వడ్డీకింద నవుకరీచెయ్యడానికి వప్పుకుని వకచోట అయిదువందలరూపాయలు బదులు పుచ్చుకున్నాను. వక్క వంద రూపాయలు తక్కువయినవి. ఆరూపాయలు తరువాత యిస్తానని పెళ్ళిచేసుకొని మోసంచెయ్యవలెనని చూచినానుగాని, ఆముండా కొడుకు నామాట నమ్మక ముందుగా రూపాయలక్కడపెడితేనేగాని పిల్ల నివ్వనన్నాడు. వెంకయ్యగాడు పునాసాతారావెళ్ళి నలభయియేళ్ళు యేకాధ్వర్యంగా పీనుగులను మోసి డబ్బు సంపాదించినాడు గనుక, వెయ్యిరూపాయలున్నూ తక్షణం పారపోసినాడు.

పాప—అన్నపూర్ణమ్మను పెళ్ళినిమిత్తం వందరూపాయలు సహాయం చెయ్యవలసిందని అడక్కపోయినావా?

కామ—పెళ్ళికని చెప్పితే యివ్వదలుచుకొన్నదయినా యివ్వదు. దానికి వేరేయెత్తు వున్నది. సీతారామయ్యగారి నగలపెట్టె ఆయనపడుకునే గదిలో భోషాణంలో వుంటుంది. నేనుయిల్లో అట్టె వుంటే, ఆసొమ్మేలాగయినా తర్లిస్తును. తాళంచెవి యెలాగయినా సంగ్రహించుమని అన్నపూర్ణమ్మకు బోధిస్తూవున్నాను. మాప్రయత్నం సాగితే రెండువేలరూపాయలకు తక్కువదొరకవు. ఆసొమ్ముతో ఆవిడలేచి రావడంకోసే సొమ్ము రహస్యంగా దాస్తానని చెప్పివున్నది. దానికి వకకన్ను గుడ్డిది. అయినాకానీ యింతపెద్దపిల్ల మరివకతె దొరకదు.

పాప—తీరా వచ్చినతరవాత ద్రోహంచేసి డబ్బుపుచ్చుకుని దాన్ని మధ్య వదిలివేస్తావా?

కామ—నాపెళ్ళాం యెదిరి కాపురానికివచ్చేదాకా వదలిపెట్టను. అప్పటిదాకా చానకంటా బ్రతికివుంటేఅప్పటిమాటచూతాము. నీవిందులో పనిచేసి నాకుసహాయం చేసేటట్లయితే వచ్చిన సొమ్ములో నీకు వందరూపాయలు యిస్తాను.

పాప—అలాగైతే నీకు కావలసినంత సహాయంచేస్తాను. నా శక్తిచూడు. నీవు వుంచుకొన్నవాళ్ళు వుంచుకొని నగలుతీసుకున్న తరువాత నీవు దాన్ని యేనూతిలోనైనా రాత్రివేళ తోసివెయ్యవచ్చును. నిన్ను యెవరు పట్టుకుంటారు? అంతగాపైకివస్తే కడుపునొప్పిచేత పడిందనవచ్చును.

కామ—తరువాత యేలాగైనా చూతాము. నీశక్తిఅంతా నీ కార్యంలో కనపడవలెను.

పాప—పూరుకో అన్నపూర్ణమ్మ వస్తూవున్నది.

(అన్నపూర్ణ ప్రవేశించుచున్నది.)

అన్న—ఝాము సేపటినుంచీ వత్తామంటే తీరుబడి అయింది కాదు. ఇదివరదాకా యెవరితోనో మాట్లాడుతూ కూర్చుండి యిప్పుడే నాన్నగారు లోపలికి భోజనానికి వెళ్ళినారు. వెళ్ళడంతో నేయిలాగు చక్కావచ్చినాను.

పాప—నీకోసం కామయ్య రెండుఘడియలనుంచీ కనిపెట్టుకుని వున్నాడు. అమ్మాయీ! యీ కామయ్య బహుదొడ్డ బ్రాహ్మడు సుమీ. యెవరినినమ్మితే వాళ్ళకు ప్రాణంకోసి యిస్తాడు.

కామ—అవ్వా! నామీద దయచేత నీవువూరికే అలాగు పొగుడుతూవున్నావుకాని నేనెంతటివాణ్ని?

పాప—యీకబుర్లకేమికాని, మీకోసం యెవరైనా వస్తారు మీకు మాట్లాడుకోవలసిన సంగతులు ముందరమాట్లాడుకోండి. మీరు రహస్యం మాట్లాడుకుంటారేమో నేను అవతలికి వెళ్ళనా?

కామ—పసరి! మాకు నీవు వినకూడని రహస్యాలు యేమి వుంటవి? మనముగ్గురికీ దేహం మాత్రమే భేదంకాని మనస్సులు వక్కటే.

అన్న—అవ్వా! వెళ్ళవద్దు. మారహస్యం నీవూ వినవచ్చును.

కామ—బోషాణం తాళంచెవి సాధ్యమయినదా?

అన్న—నిన్న రాత్రికిందే గాని తీరాగదిలోనికి వెళ్ళేటప్పటికి నా అన్నగారు కూడావచ్చినారు. అందుచేత సాధ్యమయింది కాదు. అప్పుడు మరిదిపోయి బాబయ్యగారి తాళంచెవి పరుపుమీద దిగబెట్టి యివతలకు వచ్చినాను. అటువంటిసమయం మరివకప్పుడు దొరకదు.

కామ—మన కన్నిటికీ పానకంలో పుల్లలాగు నారాయణమూర్తే అడ్డంవస్తూవుంటాడు. నన్ను యింట్లో వుండనియ్యకుండా అతడే లేవగొట్టినాఁడు.

అన్న—వాడు మహాచెడ్డవాడు. అన్నీ కనిపెడుతూవుంటాడు. యీమధ్య వాడిభార్యవిషయమై అనుమానము జానకిమీఁద పడిపోయింది కాని నామీఁద నేపడినట్టయితే వాడునిశ్చయంగా నన్ను చంపివేసును. నేను శాస్త్రుర్లను దానివద్దకు పంపడంచేత అనుమానము జానకిమీఁదకు పోయింది.

పాప—అదేమిటి?

అన్న—నేను కామయ్యకు యేమయినా యింట్లోవస్తువులు యివ్వబోతూవుంటే నావదినెగారు అడ్డంవస్తూవుండేది. వకరోజు నేను చెంబులో నెయ్యిపోసి దాసీదానిచేత పంపుతూవుంటే మెల్లిగా మొగుణ్ని తీసుకువచ్చి చూపింది. వాడుపట్టుకుని దాసీదాన్ని నన్నూ కూడా కటికకర్రతో కొట్టినాడు. ఇలా కాదని నేను మెల్లిగా మంచి మాటలువేసి నావదినెగారితో స్నేహంచేసి మాయింట్లో పురాణం చెప్పే శాస్త్రుర్లతో యిలా కాచేసినాను. అప్పటినుంచీ యేమయినా అంటే తనగుట్టు బయలుపెడతానేమోనని నావదినెగారు నేనుయేమి తీసుకునివెళ్ళినాయెవరితోనూ చెప్పక వూరుకుంటుంది. తనపెళ్లాము శాస్త్రుర్లతో మాట్లాతూవుండగా వకనాడు నా అన్నగారు చూచి జానకిమీఁద అపోహపడి దాన్నిచంపడానికి ప్రయత్నంచేసినాఁడు.

కామ—ఈమాటలకేమిగాని సొమ్ముతీసుకుని నీవు లేచి రావడంమాట యేమిచేసినావు? ముందస్తుగా నాకాసంగతి చెప్పు. నీకు నామీఁద నిజంగా మోహం వున్నదీ లేనిదీ యిందులో తెలుస్తుంది. భుజంగరావు పంతులుగారి కిమగోసిళ్ళు తెస్తానని చెప్పి నీవు వచ్చినావేమో చూచిపోదామని వెళుతూవెళుతూయిలావచ్చినాను.

వారు నాకోసం కనిపెట్టుకువుంటారు. యేదో వొకమాట చెప్పు. నేను వేగిరం వెళ్ళవలెను.

అన్న—నేనూ రాత్రీపగలూ ఆసంగతే ఆలోచిస్తూవున్నాను. నాకు యెటూతోచకుండా వున్నది. చిన్నప్పటినుంచీ పెంచి పెద్ద దాన్నిచేసి యెన్ని కార్యాలుచేసికా కడుపులోపెట్టుకునే తల్లినీతండ్రినీ వదలిపెట్టడానికి వకపట్టాన్ని ప్రాణంవప్పకుండా వున్నది. ఆ ముసలి వాళ్ళిద్దరూ బాగా వున్నంతమట్టుకూ మనం యిలాగే వుందాము.

కామ—నేను మొన్న ఝామునేవూ బోధించినదంతా గం గలోకలిసి వ్యవహారం మళ్ళీ మొదటికి వచ్చింది. నీవిలా అనుకుం టూవుండగానే నారాయణమూర్తి యెప్పుడో విషంపెట్టి నిన్ను చంపివేస్తాడు. అక్కడితో అన్నీ కుదురుతవి.

పాప—అన్నపూర్ణా! నీ సుఖం నీవు బాగావిచారించుకో. తల్లి దండ్రులూ తోడబుట్టినవాళ్ళూ అని ఆలోచిస్తే నీకు సుఖంరాదు.

అన్న—ఎవరో వస్తూవున్నారు వూరుకో.

[పురుషోత్తమరావుపంతులు ప్రవేశించుచున్నాడు.]

పురు—ఏమోయి కామయ్యా! ఇదిగో నీళ్ళు తెచ్చెద నని చెప్పి యిక్కడికువచ్చి వీరితో మాటలువేసినావా? భుజంగరావు మడికట్టుకొని మంచినీళ్ళు రాలేదని దేవతార్చన చేసికొనుటకు వల్ల కాక కనిపెట్టుకొని కూర్చున్నాడు. వేగిరము లేచివెళ్ళు.

కామ—ఇదిగో నిమిషంలో కావిడి వప్పగించివస్తాను. (అని నీళ్ళకావిడి భుజముమీద వేసికొని వెడలిపోవుచున్నాడు.)

పురు—ఏమి అవ్వా! ఏమో మీరంతకును మహాశ్చర్య ముగా మాటాడుకొనుచున్నారు?

పాప—యీవూళ్ళో యిప్పుడు యేమేమాటలు వున్నవి నాయనా? యెవళ్ళోపోఖరీ ముండాకొడుకులు వెధవముండలకు పెళ్ళి చేస్తామని బయలుదేరినారట. యిప్పుడందరికీ వినాశకాలం వస్తావున్నది. యింతకాలమయింది యిటువంటి సూర్ణయం మేమెన్నఁడూ యెరగము నాయనా.

అన్న—(తనలో) యీముండ తాను మహాపతివ్రతలాగు అందరినీ చెడతిడుతూ వున్నది. చిన్నతనంలో మొగుడుపోతే అడ్డమయినవాళ్ళతోనూ తిరిగి యిల్లూ వాకిల్లూ సంపాదించి యీముండ యిప్పుడు వీరపతివ్రత అయింది. ఆడవాళ్ళకు రెండో పెళ్ళి వుంటే మేమంతా యీ దోషపు శేరండా సుఖంగా కాపురం చేస్తూ వుందుముగదా?

పురు—ఒకనర్ధముచేత విధవావివాహములు యుక్తములుగానే యున్నట్టుతోచుచున్నవి. ముసలివాండ్రకు భార్యలుపోయినను చిన్నపిల్లలనే వివాహము చేసికొనవలెను. ఎన్నియో సంవత్సరములకుగాని యాచిన్నపిల్ల లెదిగి కాపురమునకు రాదు. ఈలోపల మగవాండ్రు తిన్నగానుండలేక కష్యార్త్తిపడి రోగములు తగిలించుకొని కాముబాధపడి యీచిన్నపిల్లల దేహములయందు వెడఁగొట్టవలసి వచ్చును.

పాప—పెద్దవాళ్ళయినా పెళ్ళాలెదిగి కాపురానికి వచ్చేవరకూ వుండేవారు లేరా?

పురు—ఉన్నారుగాని, అట్టివారివిషయములో భార్యలు రజస్వలలు కాకమునుపే తొందరపడి గర్భాదానముచేయుదురు. ఆపిల్లలారాత్రిరేపడి యిల్లెగిరిపోవునట్టుగదిలో అల్లరిచేయుదురు; చిన్నతనమగుటచేత గృహకృత్యములు చక్కఁబెట్టుకొనుటకు చేతఁగాక యిల్లు పాడుచేయుదురు. అదిగాక ముసలిభర్త్తలకును పడుచు భార్యలకును

మనసెప్పుడును కలియదు. అందుచేత గుడికి మేకపోతు వెళ్ళినట్టుగా విధిలేక గదిలోనికి వెళ్ళినను ముసలికంపని పక్కకొత్తిగిలి యీ భార్యలు మంచపుపట్టెలను కౌగిలించుకొని పరుండుదురు. ఆలాగున నయిన నింటఁబడియుండక వయసులోనున్న పురుషులతో జారత్వమున కారంభింతురు. రెండవపెండ్లికాండ్రు యుక్తవయస్సువచ్చినవిధవలను వివాహమాడెదుపక్షమున నీతొందర లేమియు నుండవుగదా?

పాప—కలికాలమందు దకీ యిలాగంటిబుద్ధులేపుడుతూవున్నవి.

పురు—అవ్వా! మీయింటికి మాకోడలు రాలేదుగదా?

పాప—లేదు నాయనా!

పురు—నేను వెళ్ళదునా? (అని వెళ్ళుచున్నాడు.)

పాప—(తనలో) పయికి లోకానికివెరచి యేమన్నా వెధవలకు పెళ్ళిళ్ళువుంటేనే బాగావుంటుంది. (బిగ్గఱగా) అన్నపూర్ణా! యీ వెధవల పెళ్ళిళ్ళు నీకు యెలాగువున్నవి?

అన్న—దక్కవలసిన పెళ్ళిళ్లులే. ఎవళ్లోపాప్యాకాలంవచ్చి యిటువంటి పాపకార్యం తలపెట్టినారు. అవ్వా!. యిప్పుడు వచ్చిన ముసలాయన యెవరు?

పాప—భుజంగరావుపంతులుగారి పినతండ్రి. ఈయన చెప్పిన సంగతులన్నీ తన అనుభవంచేత చెప్పినాడు. యేడెనిమిది సంవత్సరాల క్రిందట రెండోపెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళామిప్పుడు పదహారేళ్ళది; దానిమీద బహుఅనుమానం. వక్కనిమిషం కనఁబడకపోతే యేమివుపద్రవం వచ్చిందో అని వూరంతా తిరుగుతాడు. వీడెంత అనుమానపడి యేడుస్తూవున్నా దానిపని అది రహస్యంగా చేసుకుంటూనే వుంటుంది.

అన్న—బాబయ్యగారు భోంచేసిలేచే వేళఅయింది వెళ్లుదునా?

పాప—కామయ్య చెప్పినమాట యేమిచేసినావు?

అన్న—నేనూ రాత్రీపగలూ అదే ఆలోచిస్తూ యేమిచెయ్య డానికీతోచకుండా కొట్టుకుంటూవున్నాను. అటుచూస్తే తల్లిదండ్రుల మీాది మోహం తప్పలేకుండా వున్నాను. యిటుచూస్తే కామయ్య మీాది మోహం మరీయెక్కువగా వున్నది. ఇతణ్నీ విడవలేను.

పాప—నీసుఖంమాట బాగాఆలోచించుకో. నీ మొగుడు బాగావుండి కాపురంచేస్తూవుంటేమాత్రము నీవు తల్లిదండ్రులను వదిలిపెట్టవాయేమిటి? నీవుయిలాగు ఆలస్యంచేస్తూవుంటే కామయ్య మనసు విరిగిపోతుంది. నీకు యిటువంటి మంచివాడు మళ్ళీ మరివకడు దొరకడు. మీారనుకొన్నట్లు డబ్బుతీసుకు లేచివస్తివా మీారిద్దరూ యావజ్జీవమూ మొగుడూ పెళ్ళాలకంటె యెక్కువగా సుఖపడుతూ హాయిగా వుండవచ్చును. వకవేళ మొగుడు బ్రతికివున్నా నీకింత సౌఖ్యమూ స్వతంత్రిమూవుండదు. నామాట తోసివెయ్యక బాగా ఆలోచించుకో. నీమేలుకోసం చెవుతూవున్నాను.

అన్న—యేమిచేసేదీ రేపాలోచించి చెవుతాను. (అనివెళ్ళం బోవుచున్నది.)

పాప—నీకు చెవులో వకరహస్యం చెవుతాను. నామాట విని పో.

అన్న—యిప్పుడుకాదు. ఆనకమళ్ళీ వస్తానులే. (అని వెళ్ళు చున్నది.)

---

తృతీయరంగము—పఠనమందిరము.

[వండలకొలంది లౌక్యులును వైదికులును కూడుచుండియుండఁగా బాపన్నశాస్త్రిగారును, వీరరాఘవరావుగారును, మిత్రి బృందముతో ప్రివేశించుచున్నారు.]

బాప—శ్రీనివాసాచార్యులుగారూ! మనవారింకను వచ్చి నారు కారు. ఆహ్వానపత్రిక లందఱికి నందినవా?

శ్రీని—అందినది. వారందఱును వేణుగోపాలరావుగారితో వత్తురు. వామనశాస్త్రులుగారును గోపాలశాస్త్రిగారును, పరబ్రహ్మ సోమయాజులుగారును వారియింటియొద్దనే యున్నారు.

వీర—నాగయ్యపంతులుగారు వచ్చినారు. ఇఁక వేణుగోపాల రావుగారు వచ్చిన నందఱును వచ్చినట్టే.

శ్రీని—అదిగో వారును వచ్చుచున్నారు. వేణుగోపాలరావు గారూ దయచేయుఁడి.

(వేణుగోపాలరావుగారును పండితులును ప్రవేశించుచున్నారు)

వీర—కుమారశాస్త్రులవారు రాలేదేమి?

వామ—వారీదినము సభకు రారు. వారికి వేరేపనియున్నది.

వీర—శ్రీరామపండితులవారు వచ్చినారా?

శ్రీరా—నేనందఱికంటెను ముందుగానేవచ్చి కూరుచున్నాను. విధవావివాహము వలన నష్టములకంటె లాభము లెక్కువగా నున్నవని మీరు సాధింపఁగలిగిన పిమ్మటఁగదా శాస్త్రమున్నదా లేదా యను సంశయమును విచారింపవలయును? విధవావివాహము వలన లాభము లేమియు లేవనియు విశేషముగానష్టములే యున్నవనియు నేను మీతో వాదించెదను. చేతనయినపక్షమున మీరు నాతో యుక్తి వాదము చేయుఁడు.

వామ—వారుచెప్పినమాట సయుక్తికముగానున్నది. వారితో యుక్తివాదముచేసి మెప్పించి మీశక్తి సభవారికందఱికిని గనఁబఱుపవలెను.

పర—శ్రీరామపంతులుగారు లౌక్యములోనున్నను, వైదికమునందుఁగూడ అఖండ ప్రజ్ఞగలవారు. మొన్న మాబంధువులపక్షమున న్యాయవాదిగానుండి న్యాయసభలో నింటిమీఁదిపెంకు లెగిరి

పోవునట్టుగా వాదముచేసినారు. ప్రతివాదిపక్షమున వచ్చిన న్యాయవాదిలేచి యేమో చెప్పఁబోవు నప్పటికి, ఆయన చట్టలు తాగినసంగతి యెత్తుకొని నలుగురిలోను చీవాట్లు పెట్టి గదిమి చేయిపట్టుకొని ఆయనను కూర్చుండఁబెట్టినారు. అటువంటివారితో వాదముచేసి గెలిచిన పక్షమున మీకీర్తి కనఁబడును.

వీర—మీయభీష్టప్రకారముగానే చేసెదను. ఎవ్వరినైన సభవారగ్రాసనాసీనులనుగా నియమింపుఁడు.

శ్రీని—నేను వేణుగోపాలరావు పంతులుగారి నగ్రాసనాసీనులుగా నుండఁగోరుచున్నాను. సభవారికందఱికి నిష్టమా?

వీర—అందఱికిని పరమసమ్మతమే. శ్రీనివాసాచార్యులుగారు చెప్పినమాట దేవతలైనను మెచ్చుకోఁదగియున్నది.

వేణు—నేను తగినవాఁడను కాకపోయినను, సభవారందఱును నన్ను మన్నించి యగ్రాసనముందుఁ గూర్చుండ నియమించుచున్నారు గనుక వారియాజ్ఞ మీఱఁజాలక యంగీకరించుచున్నాను. పరబ్రహ్మసోమయాజులుగారు నాయందలి దయచేత నన్నాప్రకారముగా శ్లాఘించుచున్నారే కాని నేను వట్టి వ్యర్థుఁడను. (అని కూరుచున్నాడు)

పర—మీరు మీవిధేయతను గనఁబఱచుటకయి యట్లనుచున్నారే కాని కేవలము మీరవతారపురుషులు.

బాప—వీరరాఘవరావుగారూ! అంతకంతకు ప్రొద్దుపోవుచున్నది. శీఘ్రముగా ప్రసంగ మారంభింపుఁడు.

వీర—(లేచి) వాదమారంభించుటకు ముందుగా నేను సభవారితో కొన్ని మాటలు మనవిచేసికొనుచున్నాను. తమరందఱును సావధానముగా వినవలెను.—

వివేకనిధులారా! కాలమహిమచేత నేనిప్పుడు చేయఁబోయెడి విన్నపము మీలో కొందఱి చెవులకు వెగటుగాఁ దోఁచునని నేనెఱుఁగని వాఁడనుఁగాను. అయినను దురభిమానము విడిచి పారమార్థిక చింతతో పరిశీలించు నిష్పక్షపాతబుద్ధుల కెల్లను సత్యము బోధపడుటకు సందేహముండదు గనుక, మీమనసుల కెక్కునట్లుగా రసపుష్టిగల ప్రౌఢవాక్యములతో నుపన్యసించుటకు నేను సమర్థుఁడను గాకపోయినను దయయు బాల్యమున భర్తలను పోఁగొట్టుకొన్న మన దేశపు యువతుల మనస్థితియు నన్ను బహువిధములఁ బ్రేరేపవాపక్షమున నున్న సత్యముయొక్క బలమును నమ్ముకొని యిటువంటి పండితసింహములయెదుట నాబాల్యవాక్యములను బలుకు సాహసము చేయుచున్నాను. ఇప్పుడు మనలోని క్రూరాచారమునుబట్టి పతివిహీనలయిన యబలలిప్పుడు మనదేశములో ననుభవింపవలసిన దుర్దశను తలంచుకొన్న మాత్రమున పగవారికయినను మనస్సు కరుఁగక మానదు. మన మెంతనిర్బంధ పెట్టినను, ఎన్ని సుబోధలు చేసి స్వర్గము వచ్చునని యాశ పెట్టినను, బాలవిధవలనందఱిని మన మెన్నటికిని పతివ్రతలనుగా జేయఁజాలము. సమస్తసంగములను త్యజించి దుంపలును ఫలములును, తినుచు మహారణ్యములలో తపస్సు చేయు ఋషులవంటి సమస్తము తెలిసి మహానుభావులు సహితము కామము జయింపలేకపోయిరని మనము వినుచుండగా, ఉప్పును పులుసును తినుచు నింద్రియ సుఖానుభవమునకు నివాసములయిన పట్టణములయందు వయస్సులోనున్న సుందరపురుషమధ్యమున సదా మెలఁగుచు తమయింద్రియములకుఁ దోడు గుప్తపురుషుల ప్రయత్నములు కూడఁ దమ్మెప్పుడును కామోపభోగములకయి ప్రోత్సాహపఱుప విద్యాగంధమైన లేకపోవుటవలన యుక్తాయుక్తవివేకము చాలకున్న యనాథయువతు లింద్రియనిగ్రహముచేసి పతివ్రతలుగా నుండఁగలుగుదురు

రని మనమెల్లు పరీక్షింపఁగలము? మనచేతనయిన పని వారి శిరో జములను ఆభరణములను తీసివేయింపఁ గలిగినను, లోపలనున్న కామములను మాత్రము తీసివేయింపఁజాలము. వారి కామమేవిధముగా నయినను శాంతి పొందవలయును గనుక మనము క్రమమయిన మార్గమును చూపకపోవుటవలన వా రక్రమములకు లోఁబడవలసిన వారయి గూఢముగా వ్యభిచరించుచున్నారు. మానవంతుఁడగు వాఁడు తన వారేయితరదోషము చేసినను సహించి యూరకుండఁగలుగునుగాని వ్యభిచారము చేసినప్పుడు మాత్రము చూచి యూరకుండఁజాలఁడు. తక్కిన నేరములవలనఁ జేసిన వారికే యపకీర్తి వచ్చును గాని ఱంకు తనమువలనఁ జేసిన వారికి బంధువులకును మాత్రమే కాక కులము వారి కందఱికిని గూడ అప్రతిష్ఠ కలుగును. అందుచేతనే యభిమాన ధనులగు పురుషులు తమ స్త్రీలు వ్యభిచరింపఁగాఁ జూచినప్పుడు తోడఁబుట్టిన పడుచులనైనను, కూఁతులనైనను, కోడండ్రనైనను, వది నెలనైనను, మఱఁదండ్రనైనను, మఱియెవ్వరినైనను, వారివిటులతోఁ గూడ నంతము నొందించి యవమానమున కోర్వలేక యొకానొక ప్పుడు తాము కూడ నాత్మహత్యలు చేసికొందురు. ఇందువలన వ్యభిచారమెంత హేయమయినదో మీరే యూహించుకోవచ్చును. ప్రజాసౌఖ్యమునకయి ధర్మశాస్త్రములను జేసి వాని ప్రకారముగా మహాజనులను నడిపించి పేరుపొందిన యార్యులయొక్క సంతతివార మని పేరుపెట్టుకొనియు, మీరు వారు చేసిన ధర్మశాస్త్రప్రకార ముగా నడిపించుటకయినను పూనుకోకపోవుట యటుండఁగా మీది మిక్కిలి వారియాజ్ఞలను మీఱి శాస్త్రసమ్మతమయిన పునర్వివా హము చేసికోనియ్యక యోగ్యురాండ్రు కాఁదగిన గతిలేని యనాథ కామినులను సకల బాధలను పెట్టి వేశ్యలకన్నను హీనముగా వ్యభి చరించుటకై దింపుట మీకు సిగ్గుల చేటుకాదా? అందువలన మీకు

గలుగుచున్న నష్టములయినను మీరు చూచుకొనుచున్నారా? సద్వంశమునఁ బుట్టిన మీ బాలవితంతువులు వంటబ్రాహ్మణులతోను, మ్లేచ్ఛభటులతోను చాకలివాండ్రతోను, ఇతరహీనజాతులవారితోను చెడి తిరుగుచుండుట మీకు ప్రతిష్ఠగానే తోఁచుచున్నదా? అట్టి బాలవిధవలు తమ యుపపతుల వృత్తికయి యింటఁ గల వస్తువు లెత్తుకొనిపోయి వాండ్రకు పెట్టుచుండుట గాని తమ నేరము మాసిపోవుటకయి సాధ్యమయినంతవఱకు పుణ్యస్త్రీలను సహితము జారత్వమున ప్రవేశపెట్టి యందఱిని తమవంటి వారినిగాఁ జేయుచుండుట గాని మీదృష్టికి నష్టములుగా గనఁబడుచుండలేదా? ఇంటనుండి రహస్యముగా వ్యభిచరించుట కిష్టములేని బాలరండలు తమ బంధువర్గము మీఁది ప్రేమానుబంధమును త్రెంపుకొని యేతురకవానినో యేదూదేకులవానినో తీసికొని లేచిపోయి బహిరంగముగా వీధిలో గుడిసె వేసుకొని పడుచుకొనుచుండుట మీ కపఖ్యాతిగా నుండలేదా? వారు చేసిన చీఁకటి తప్పునకు ఫలముగా సంప్రాప్తములయిన గర్భములను దింపుకొనుటయు, మందులు వికటించి యట్టి సమయములయందు కడుపులోని పిల్లలతోకూడ తల్లులు చచ్చుటయు, దైవయత్నముచే మనుష్య ప్రయత్నములన్నియు విఫలములయి శిశువులు జనింపఁగా మెడలునులిమి చంపుటయు, మీకించుకయు పాపకృత్యములుగా తోఁచుచుండలేదా? చంపి పాఱవేయఁబడియున్న లేఁత శిశువులను జూచి నప్పుడు మృగపక్ష్యాదుల మెడలు విఱిచి పచ్చినెత్తురు త్రాగు కిరాతులకయినను దయపుట్టుచుండఁగా రక్తసంబంధముగల మీకేల కనికరము పుట్టదు? కొందఱు శిశువులను జంపక మాలమాదిగల కియ్యఁగా నుత్తమవంశమునందుఁ బుట్టినయాబిడ్డలు పెద్దపెరిగి మీముందఱనే పెంటలూడ్చుచు నీచపుపనులు చేయుచుండుట మీకు కన్నులపండువుగా నున్నదా? మీ వేడుకకయి కన్నులు

తెలియనిపిల్లలకు మంగళసూత్రమను మిషమున మెడకొక త్రాడు కట్టి గుడికి మేకపోతును తీసికొనిపోవునప్పుడు మెడకు వేపరొట్ట కట్టి నట్టుగా చేతికొక తోరమును కట్టి, వాద్యముల మ్రోఁతతో వివాహమని పేరుపెట్టి యదియేమో కన్యావరులకే తెలియని యొకతంతు నడిపి, తరువాత భర్తపోయినాఁడన్న దుఃఖవార్త కుటుంబమునం తను దుఃఖ సముద్రమున ముంపఁగా ప్రాణాధికులయిన తమ ముద్దుల కూఁతులను బ్రదికియున్నంతకాలమును దుస్సహవైధవ్యదశకుఁ దెచ్చిన దురదృష్టమును తలఁచుకొని తలలుపీడ బొమ్మలు బాదుకొనుచు పెద్దపెట్టున రోదనముచేసెడు జననీజనకుల మొగములవంక తెల్లపోయి చూచుచు "అమ్మా! యేలయేడ్చెదవు!" "నాయనా! యేలయేడ్చెదవు!" అని యెఱుఁగని ప్రశ్నలు వేయుచు తమకు ముందు ప్రాపింపబోయెడి దురవస్థ లేశమయినను తెలియక నడయాడెడు పసిబాలికలస్థితి చూచుటకు మీకు వినోదకరముగా నున్నదా! నిర్దోషురాండ్రయిన యాపసిబిడ్డల దుర్దశచూచినను మీకు గుండెలు బద్దలయి యట్టివారికయినను పునర్వివాహము చేయవలెనను బుద్ధి జనింపకున్నదా? శిశుహత్యాదులు జరుగునప్పుడు దొరతనమువారు పట్టుకొని సహాయులుగా నున్నవారిని సహితము శిక్షించుచు కులమునకు వెలిచి కన్నబిడ్డలకు సహితము చంప వెనుక తీయని మాతలను మాలవానిచేత నురితీయించుచుండుట మీకు సంతోషకరముగానే యున్నదా? ఈపయిని జెప్పినవన్నియు మీకు పుణ్యకర్మలుగానే తోఁచుచున్నవా? శాస్త్రసమ్మతమైన పునర్వివాహ మొక్కటిమాత్రమే మీమనస్సులకు పాపకర్మముగా కనిపించుచున్నదా? ఓమహాజనులారా! మీరొక్క నిమిషము పాక్షికవృత్తిని విడిచి నేను జెప్పిన యంశములను సమబుద్ధితో విచారించి స్త్రీ పునర్వివాహమున కనుజ్ఞయిచ్చి శుద్ధమయిన యాహిం

దూజాతి కంతకు నపకీర్తికరముగా నున్న యీ దురాచారకళంక
మును బాపుకొండు. ఒకవేళ బాలవిధవలలోఁ గొందఱు వ్యభిచా
రాది దోషములులేనివారైనను వారి బ్రతుకు సహితము విరామము
లేని దుఃఖపరంపరతో నిండియుండును. మగఁడు పోయిన కూఁతురు
గుమ్మము వెలుపలఁబడి యేడ్చుచుండఁగా రాత్రులు తల్లిదండ్రులు
నిర్విచారముగా సుఖమనుభవించుటకంటె శీఘ్రముగా మరణమునొంది
స్వర్గసుఖమనుభవించుట చాలమేలు. చిన్నప్పటినుండియు ప్రేమతోఁ
బెంచి తమ ప్రాణములతో సమానముగాఁ జూచుకొనుచున్న తల్లి
దండ్రులే కులాచారములకు దాసులై కరుణమాలి జీవితేశ్వరునిపోగొట్టు
కొని దుఃఖసాగరమునందు మునిఁగితముయుండఁజేరినకొమార్తెల నాదరిం
చి పతిశోకమును మఱచునట్లు చేయుటకు మాఱుగా తాము నదుమఁ
బెట్టిన యాభరణములను మాత్రమే కాక భగవంతుఁడు పుట్టుకతోనే
దయచేసిన నిడుదశిరోజములను గూడ తీయించి మఱింత దుఃఖ మధి
కముచేసి, నొసట కస్తూరి తిలకమునకు మాఱుగా బూడిదయును
చేతుల బంగారుకంకణములకు మాఱుగా రాగిపట్టెలను పెట్టించి,
నిన్నటివఱకును మూడు పూటలు భోజనము చేయ నలవాటుపడిన
ప్రాణమును శోషిల్లఁజేసి యొకపూట మూడుజాముల కిన్ని మెతు
కులు వేసి చచ్చియుఁ జావకుండ నిలుపుచు, ఇంటఁగల పనియంతయు
వారిచేతనే చేయించుచు, వారిని జీవచ్ఛవములనుగా నుంచి యావజ్జీ
వము దుఃఖించునట్లు చేయుట హిందూజాతి కంతకు నవమానకర
ముగా నున్నది. పరులవలని బాధలక్కఱలేక ప్రాణవల్లభులుపోవుట
చేతనే దుర్వారవ్యథలపాలయి కృశించుచు నెల్లవారికినిదయనీయులు
కాఁదగిన యనాథయువతులను నిష్కారణులయి మనవారు పెట్టు
చున్న బాధలను బట్టి "విధవ" యనఁగానే యెల్లవారికిని జాలిపుట్ట
వలసినదానికి మాఱుగా తన్నామోచ్చారణమే కర్ణకఠోరముగా విను

బడుచు, ఎవ్వనినైనను "విధవా" యన్నమాత్రమున నసహ్యపడి వాఁడెంత నీచుఁడయిన నది గొప్పతిట్టుగా భావించుకొని మండిపడు నట్లు తటస్థించినదిగదా! అనాథలను బాధపెట్టుచున్నారన్న యీ నిందను పోఁగొట్టుకొనుటకయి ప్రయత్నము చేయుట హిందువయిన వానికెల్లనవశ్యకర్తవ్యము. కాఁబట్టి యాచారమును పాటిగాఁబట్టక మీ బుద్ధిచేత చక్కఁగా నాలోచించుకొని యితరుల దూషణము లను లక్ష్యము చేయక మీ యంతరాత్మ సంతోషించునట్లుగా పని చేయుఁడు.

శ్లో. యత్కర్మకుర్వతో స్యస్యాత్పరితోషోంతరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతంతు వర్జయేత్.

ఏ పని చేసిన తన యంతరాత్మ సంతోషించునో యాపనినే చేయవలయుననియు, అంతరాత్మ కతుష్టికరమయిన పనిని మానవల యుననియు, పయిన జెప్పిన ధర్మము నేమనుస్మృతి బోధించుచున్నది. లోకమునకు నష్టకరమయిన పనిని శాస్త్రము విధించుచున్నను దానిని మానుకొనుట మనకు పరమధర్మము.

శ్లో. పరిత్యజే దర్థకామౌ యౌస్యాతాం ధర్మవర్జితౌ
ధర్మంచాప్యసుఖోదర్కం లోక విక్రుష్టమేవచ.

ధర్మవిరుద్ధములయిన యర్థకామములను విడువవలయుననియు అసుఖకరమును లోకమునకు శోకకరమునైన ధర్మమునైనను విడువ వలయుననియు, మనుస్మృతియే ఘోషించుచున్నది. ఇట్లు చెప్పుట చేత శాస్త్రము స్త్రీపునర్వివాహమును నిషేధించుననని నా యభి ప్రాయము కాదు. కావలయునేని స్త్రీపునర్వివాహము సమస్తశ్రుతి స్మృతి పురాణసమ్మతమని నేనిప్పుడే చూపెదను.

శ్రీరా—అక్కఱలేదు. మీరు యుక్తిచేత సాధించినపిమ్మటఁ గదా శాస్త్రముమాట చూచుకోవలెను. మీరింతసేపు శ్రమపుచ్చు

కొని చెప్పినాడగాని, మీ వాక్యములలో నొక్కటియు యుక్తి కవఁ బడదు. మీరు చెప్పినమాటలన్నియు నే నొక్క నిమిషములో యుక్తులు చెప్పి ఖండించెదను.

వీర—మీరు సెలవిచ్చెడు ప్రబలయుక్తు లేవో వినవలెనని నా మనస్సు మిక్కిలి కుతూహలపడుచున్నది. దయచేసి వాదమున కుప క్రమింపుఁడు.

శ్రీరా—మీరు యుక్తులనుకొని యింతవఱకును జెప్పిన యసంబద్ధపు మాటలను సయుక్తికముగా ఖండించివేసి, సభవారంద ఱును మెచ్చునట్లుగా నిరాక్షేపములయిన నా యుక్తులను ప్రతి వాదుల ముఖములు ముడుచుకొనిపోవునట్లుగా దివ్యవాగ్గుంభనలతో నుపన్యసించి సర్వసమ్మతముగునట్లుగా విధవావివాహము కూడ దన్న పరమసిద్ధాంతమును స్థాపించెదను.

త్రివి—అహాహాహా! ఆత్మస్తుతియు పరనిందయులేని మహాను భావులు మీ రెంతపనికైనను జేయఁగలవారే. మీకు నమస్కా రము. మీయొద్దనున్నశక్తి భగవంతుని యొద్ద నయినను లేదు.

శ్రీరా—మీ రేమో పరిహాసముగా మాటాడుచున్నారు. మా సామర్థ్యము మీ కేమి తెలియును! మే మిప్పుడు చేయునది పరమత నిరాకరణపూర్వక స్వమత సిద్ధాంత స్థాపనమని మీకు కొంచెము శాస్త్రజ్ఞానమున్న తెలియకపోదే.

వేణు—త్రివిక్రమరావుగారు పరిహాసకులు. మీరు వారి మాటలకు కోపపడి వివాదము పెట్టుకోక, మీ ప్రసంగము కానిండి.

శ్రీరా—చిత్తము. ప్రతివాదులవాదము ఖండించెదను. సభ వారు నా యుక్తులు భక్తిశ్రద్ధలతో వినవలెను:—మనలోని విధవల యవస్థచూచి పగవారి మనస్సు కలుక్కుమను నన్నమాట సత్యము కాదు. పగవారిమాట యటుండగా శిష్టాచారావలంబులయిన మన

వారి కెండతికినిగాని సర్వజ్ఞులయిన మన పండితసార్వభౌములకుఁగాని విధవలస్థితిచూచిమనస్సుకలుక్కుమనకపోవుటయేగాకపైగా ఈదుర్వివాహములయిపోవునేమోయని మనస్సు దహించుకొనిపోవుచున్నది. స్త్రీలుకామముజయింపలేరన్నసంగతి యున్మత్తప్రలాపముగానున్నది. కామముచేత చచ్చిపోయినవా రెవ్వరునులేరు. ఇఁక మనకు కలుగదని నిరాశ చేసికొన్నవారికి సంభోగముమీఁద కోరికయే కలుగదు. గజశాలలయందు బంధింపఁబడియున్న యేనుఁగులును అశ్వశాలలయందు కట్టఁబడియున్నగుఱ్ఱములును, పంజరములలోపెట్టఁబడియున్న పక్షులును ఎన్నికామమును, జయింపఁగలిగినవికావు! ఆప్రకారముగానే స్త్రీలనుకూడ తగినంత నిర్బంధములోనుంచిన యెడల వారును తిన్నఁగానే యుందురు. స్త్రీలకు స్వాతంత్ర్యము కూడదన్న ధర్మశాస్త్రకర్తల యాజ్ఞమీఁటిమనవారిప్పుడు స్త్రీలకుస్వేచ్ఛగలుగఁజేసి చెడిపివేయుచున్నారు. సంసర్గము జరగకుండనుంచుటవలన గజాశ్వాదులకు శరీర దార్ఢ్యముగలిగి చక్కఁగా పనిచేయునట్లే సంభోగము లేకపోవుటవలన విధవలును బలిసిమనకు చక్కఁగాపనిచేయుటకుసమర్థురాండ్రగుదురు. విధవలలో వ్యభిచారమున్నదనిప్రతిపక్షులేయొప్పుకొనుచున్నారుగదా! తలగొరిగించికురూపినిజేసి యొంటిపూటనేతిండిపెట్టికడుపుమాడ్చి యలంకారములు తీసివేసి వ్రతాదులచే దేహము కృశింపఁజేయుచుండఁగానే వ్యభిచారము మానకుండఁగా అవియన్నియు నున్నపక్షమున బొత్తిగానే పట్ట పగ్గములుండునా! మన పూర్వులు త్రికాలవేదులు గనుక, దూరము విచారించియే మహత్తరములైన యీనిర్బంధముల నన్నిటిని విధించినారు. ఇప్పటివారన్ని నియమములను క్రమముగా నడపకపోవుటచేత వ్యభిచారాది దోషములు కలుగుచున్నవి. అది స్వయంకృతాపరాధమేగనుక, స్త్రీల యెడల దయతలంచిన పాపఫల మనుభవింపవలసినదే. వర్ణాశ్రమా

వార ధర్మములుగల యీకర్మభూమిలో నిహలోక సుఖమునుబట్టి దమచూడుమనుటకంటె పిచ్చి వేఱేలేదు. కాఁబట్టి శాస్త్రనియమములకు లోఁబడి నీచపు సంభోగమందు తలఁపుకట్టిపెట్టి కష్టపడినపక్షమున, విధవకు పరలోకసుఖ ప్రాప్తికలిగి మరణానంతరము బహు సహస్ర సంవత్సరములు భర్తతో సంభోగ సుఖము వచ్చును. పునర్వివాహము నిమిత్తము ప్రయత్నము చేసినపక్షమున, మనము విధవలకాసుఖము చెడఁగొట్టి పాపముకట్టుకొన్నవార మగుదుము. గర్భస్రావములు, శిశుహత్యలు, మొదలయినవి జరుగుచున్నవన్న విషయములో పయియుత్తరమే ప్రతివాదులను మూకీభావము నొందింపఁ జాలియుండును. విధవలనుజూచి పుణ్యస్త్రీలు చెడుచున్నారన్నమాట హాస్యాస్పదముగానున్నది. అనుభవముగల వారనుభవము లేనివారి కొక సంగతిని నేర్పుట లోకములో సహజమయి యుండఁగా, మిథున కర్మానుభవము లేని విధవలే మిథునకర్మానుభవముగల సభర్తృకల కుపదేశింతురనుట పిచ్చిమాట. పుణ్యాపాపములనుగుర్తెఱింగి ప్రవర్తించుటయే వివేకముగాని యుక్తినిబట్టి ప్రవర్తించుట వివేకము కాదు. ఈలోకములో విధవలు బాధలనుభవించుటవలన పుణ్యముగలుగును.

త్రివి—మీధోరణి కడ్డమువచ్చుచున్నాను. దయాస్వరూపుఁడయిన భగవంతుఁడు నిష్కారణముగా విధవలనీలోకమునమాత్రము బాధపడ నియమించునా?

వేణు—ప్రసంగము చేయుచుండఁగా నడుమమీరుమాటాడ కూడదు.

శ్రీరా—అడుగనిండి. నేనిటువంటివారికి లక్షమందికయినను సదుత్తరములిచ్చి సమాధానము చెప్పఁగలను. విధవలకీకష్టములు భగవంతుఁడు పెట్టలేదు. స్త్రీలుపూర్వజన్మమున చేసికొన్న పాపముచేత

వారికీగతివచ్చినది. పూర్వజన్మమున నేమిచేసినారో యది వారీజన్మమున ననుభవింపక తీరదు.

త్రివి—సరిసరి అట్లయినయెడల వారిపూర్వజన్మస్థితియు మీ పూర్వజన్మస్థితియుకూడ నాకు తెలిసిపోయినవి.

శ్రీరా—అదేమి? ఎగతాళిచేయుచున్నారు. మీ కేమి తెలిసినది?

త్రివి—పూర్వజన్మమునందా స్త్రీవంటివారు మీరును, మీవంటి వారాస్త్రీలును, అని మీరుసూచించినమార్గమువలన నేనూహించితిని.

శ్రీరా—అనఁగానేమో మీమాటలు నాకర్థము కాలేదు.

త్రివి—బుద్ధిమంతులు మీకర్థముకాని దేమున్నది? ఇప్పటి విధవలు వెనుకటిజన్మమునందు మీవంటి పండితులయి విధవావివాహము కూడదని వాదించి, అప్పటి విధవలను దుఃఖపెట్టియుందురు. ఆపాప ఫలముచేత నప్పటి పండితులీజన్మమున విధవలయిపుట్టి పురాకృతదుష్కృతఫల మనుభవించుచుండఁగా, తమపగసాధించుకొనుటకయి యాకాలపువిధవలు నిషేధవాదులరూపమున నవతరించివిధవావివాహము కూడదని యీప్రకారముగా వారిని బాధపెట్టుచుండియుందురు. లేకున్న మీరుచెప్పిన ప్రకారముగా విధవలిట్లు దుఃఖపడుచుండుటకును, వారిట్లు వాదించుటకును కారణ మగపడదు.

వీర—మీరువాదములోకూడ హాస్యమే మొదలుపెట్టినారేమి? ఇవి సభలలో నడవలసినమాటలుగావు.

శ్రీరా—విధవాసంభోగమునందలి యపేక్షచేతస్వప్రయోజనపరులయిమీరందఱువిధవావివాహము కావలెనని వాదించుచున్నారు,

త్రివి—విధవలకు వివాహమయినయెడల, మీరిప్పు డనుభవించుచున్న వితంతువులతోడి సంభోగసుఖము పోవునేమోయను భయముచేత మీరుస్త్రీపునర్వివాహముకూడదనివాదించుచున్నారు.

వీర—త్రివిక్రమరావుగారూ! ఎదుటివారొకవేళ తొందర పడినను మనమిట్లు తొందర పడుట న్యాయము కాదు. మీరిప్పుడను కొన్నమాటలు సభలో నుచ్చరింపదగినవి కావు.

వేణు—త్రివిక్రమరావుగారూ! ప్రసంగమధ్యమున మాటాడఁ గూడదని నేను మీతో మొదటనే చెప్పియున్నాను. శ్రీరామమూర్తి గారూ! మీప్రసంగము పూర్తి కానిండి.

శ్రీరా—ఈస్త్రీ పునర్వివాహము లేకపోవుటవలన దేశమునకు కలుగుచున్న లాభము లిన్నియన్నియని వర్ణించుటకు మనుష్య మాత్రుడనైన నాకు శక్యము కాదు. విధవావివాహమువలన విశం తువులకు ప్రసవమరణములు మాత్రమే కాక, పుత్రాదిమరణములు మొదలైన సంసారదుఃఖములు కలుగును; జనసంఖ్య యెక్కువగుట వలన పంటలు చాలక దేశమునకు కాటకములు సంభవించును; ఒత్తుగానున్న సస్యములు దుర్బలములగునట్లే జనులును బలహీనులును వ్యాధిబాధితులు నగుదురు. ఇప్పుడు బీటినేలలుగానున్న భూములు సేద్యము చేయఁబడుటచేత మేఁత లేక పశువులు చచ్చును; మను ష్యులు మఱింత యెక్కువయి సేద్యములకు చోటు లేక యుండఁజాలను నశింతురు; విధవలు లేకపోయిన నింటిపని చేయువారు లేక యనేక కుటుంబములకు కష్టములు వచ్చును; వ్రతములు లేక బ్రాహ్మణులకు వృత్తులు నశించి జీవనములు చెడిపోవును. చెప్పఁబూనుకొన్న నిటు వంటి యుక్తులింక లక్షయున్నవి. బుద్ధిమంతులగువారు నావాదము యొక్క సారమును గ్రహించి ప్రతివాదుల చేసెడి దుర్వాదమును నమ్మి మోసపోక సదాచారగరిష్ఠులుకండు. [అని కూరుచున్నాడు.]

వీర—మీరు చెప్పినదానిలో—

శ్రీరా—మీరు మొదట వాదముచేసినారు; తరువాత నేను మీవాదము పూర్వపక్షముచేసి స్వమతసిద్ధాంతస్థాపనము చేసినాను. అక్కడితో సరిపోయినది. మీ రిక మాటాడకూడదు. మీరు చెప్పిన తరువాత నేనును నేను చెప్పినతరువాత మీరును చెప్పుచు నేవచ్చి నచో, అనవస్థాదోషము సంభవించును. మిమ్మే కడపట చెప్ప నిచ్చినపక్షమున, పామరులు మీదుర్బోధనమ్మి చెడిపోదురు. మన పూర్వులకంటె మీరెక్కువ మహాబుద్ధిమంతులు బయలుదేరినారు. జగత్తు పుట్టినప్పటినుండి యీ యాచారము ప్రపంచములో నెక్క డను లేదు. నేటికాలమునందు మీరువచ్చి నాలుగుముక్కలు చెప్పం గానే సాగునను కొన్నారా?— వేణుగోపాలరావుగారూ! మాధర్మ సందేహము మీరు తీర్పవలెను.

వేణు—వీరరాఘవరావుగారిక చెప్పకూడదు. వారివం తయిపోయినది.

వీర—ఈ హిందూదేశమే ప్రపంచమంతయు నని మీరు భ్రమపడుచున్నారు. ఈ భరతఖండము భూమిలోని యైదుఖండ ములలో నొకఖండములో పదియవవంతయినను లేదు. ఈయొక్క దేశములో తప్ప మిగిలిన యన్ని దేశములలోను స్త్రీపునర్వివాహ మున్నది. ఈదేశములో సహితము శూద్రులలో—

వేణు—మీరు మాటాడకూడదన్నను నామాట వినిపించు కొనకుండ నున్నారు.

శ్రీ:—చెప్పవిండి. నేను కొన్ని యుక్తులు చెప్పవలసియు న్నవి. నాతో వాదముచేయకుండండి. వీరిప్పుడుచెప్పిన దోషముల నన్నిటిని విధవావివాహము లేకపోవుట కారోపించుచున్నారే కాని నిజముగా నందువలన విశేషబాధకములేమియు లేవు.

వీర — ఊరకే యిట్టిమాటలనుటవలన నేమి ప్రయోజనము? నే నిప్పుడు చెప్పినయంశములలో క్రమముగా నొక్కొక్కదానినే యెత్తుకొని యిది యిట్టిది కాదని చెప్పెదను.

శ్రీని — మీరు విధవావివాహము లేకపోవుటచేత జారత్వము వృద్ధిపొందుచున్నదని గదా చెప్పినారు? విధవావివాహములుచేసెడు పక్షమున ప్రపంచములో జారత్వము తగ్గిపోవునని మీరు వ్రాసి యియ్యఁగలరా? అట్లు జారత్వమును తప్పక మీరు పోఁగొట్టఁగలిగిన యెడల నే నిప్పుడు విధవావివాహములు చేయించెదను. వితంతూద్వాహమువలనను జారత్వము పోనియెడల, ఈ వివాహములతో ప్రయోజనమేమి?

వీర — విధవావివాహములు చేయుట వలన జారత్వము బొత్తిగా పోకపోయినను విశేషభాగము తగ్గిపోవుననుటకు సందేహము లేదు; అంతియకాక శిశుహత్యలును, భ్రూణహత్యలును, నశించును. దోషములనన్నిటిని నివారించుటకు మనము శక్తులము కాము గనుక, కొన్నిటిని పోఁగొట్టుటవలన ప్రయోజనమేమనుట యుక్తాయుక్తము కాదు. మీరు చెప్పిన హేతువుమీఁద లోకములోని సత్కార్యముల నన్నిటిని మాననవలసివచ్చును. నేరముల నన్నిటిని పట్టుకొనలేరు గనుక, ఆరక్షకభటులను తీసివేయవలసివచ్చును. ఔషధములవలన రోగములన్నియు కుదురుచుండలేదుగనుక, వైద్యముతో పనిలేదనవలసి వచ్చును, అట్లనుటకు మతిమంతుఁ డెవ్వఁడైన సాహసించునా? మందులవలన రోగములన్నియు నివారణ కాకపోయినను, బహువ్యాధులు కుదిరి మొత్తముమీఁద సుఖాభివృద్ధి కలుగుచున్నది. ఆప్రకారముగానే విధవావివాహము వలన బహుదోషములు నివారణమయి సుఖాభివృద్ధి కలుగును.

శ్రీని—లోకములో మగఁడుగల స్త్రీలుమాత్రము వ్యభిచరించుచుండలేదా! వ్యభిచారము చేసినవారిని మనము శిక్షింపవలయునే కాని, వారికి పెండ్లిచేసినయెడల దొంగ దొంగతనముచేయునని దొంగకు ధనమిచ్చిన ట్లుండదా!

వీర—పుణ్యస్త్రీలు తమ కామశాంతికయి న్యాయమయిన మార్గమున్నను వ్యభిచరించుచున్నారుగనుక దొంగలవలెనే వారును దండార్హు లగుదురు. ఆఁకలిగొనియున్న యొకమనుష్యుని భోజన పదార్థములతో నిండియున్న యొకగదిలోపెట్టి తాళమువేసి, న్యాయముగాపాటుపడి సంపాదించుట కవకాశము కలుగనియ్యక నిరోధించి, క్షుద్బాధకు తాళలేక వాఁడాగదిలోని యాహారపదార్థములలో నొకదానిని తినెనని శిక్షించుట యెంత యుక్తమయిన కార్యమో మీరేయాలోచింపుఁడు. అట్టిస్థితిలో వివేకముగలవారందఱును కయి నిర్బంధములను బెట్టి శిక్షించువారిని క్రూరులందురేగాని క్షుత్తుతీర్చుకొనుటకయి పదార్థభక్షణము చేసినవానిని దోషినిగా భావింపరు. ఆప్రకారముగానే కామపీడితలయి యువతులను కాముకజనమధ్యమున వసించునట్లుచేసి, కామశాంతికయి వారికున్న న్యాయమయిన మార్గమును నిరోధించి, అందుచేత వారక్రమములకు దిగవలసివచ్చినప్పుడు క్రమమయిన మార్గమును చూపుదమనుటకు మాఱుగా వారిని శిక్షింతుమనుట క్రూరకృత్యముగాదా?

శ్రీని—స్త్రీలకు కామమంత యాపుకోశక్యముగానిదిగా నుండునా? కామశాంతి కలుగకపోయిన చచ్చిపోరుగనుక వారెందుకు పతివ్రతలుగా నుండరాదు?

వీర—పయినుండి యితరులుమాటలెన్నియైనను జెప్పవచ్చును గాని కష్టములు పడుచుకొనివారికే కాని తెలియవు. పురుషుఁడుమాత్రము కామముతీర్చుకొనకున్నమరణమునొందునా? భార్యపోయిన

తిరువాతనతఁడు మాత్రమెందుకు ద్వితీయవివాహముచేసికోవలెను? విద్యావివేకములు గలిగి స్థిరచిత్తులమని చెప్పికొనుపురుషులకే కామమును జయింపశక్యము కానప్పుడు, ఇఁక మూర్ఖురాండ్రయి స్వభావచంచలలై యుండు స్త్రీలకా యింద్రియ నిగ్రహముచేయుట శక్యమగును?

శ్రీని — స్త్రీలకును పురుషులకును కామము సమానమా?

వీర — మనశాస్త్రములు పురుషులకంటె స్త్రీలకెనిమిదిరెట్లు కామమెక్కువయని చెప్పుచున్నవి? "కామశ్చాష్టగుణోభవేత్" అనుశ్లోకమును మీరెప్పుడును వినలేదా యేమి? మనశాస్త్రములెట్లున్నను స్త్రీపురుషులకు కామము సమానమనియే నేను భావించెదను. నేనిప్పుడు వాదమునిమిత్తము మీకనుకూలముగా నుండునట్లు పురుషులకంటె స్త్రీలకు కామము తక్కువయనియే యొప్పుకొనెదను. అంత మాత్రముచేత స్త్రీలకు కామనివారణ సహాయముక్కఱలేదని మీరు సాధింపఁగలుగుదురా? రామయ్యకంటె భీమయ్యకాఁకలి తక్కువనియే స్థిరపడినను, అంత మాత్రముచేత భీమయ్యకు తిండిపెట్టక మాడ్చిచంపవలయునని మతిమంతుఁడెవ్వఁడైన సాధింపఁజూచునా?

శ్రీని — స్త్రీలకు కామ మెనిమిదిరెట్లయిన, ఎనమండ్రుభర్తల నేలకట్టిపెట్టరాదు?

వీర — ఒకభర్తయే కూడదనివాదించువారు కామినుల కెనమండ్రుభర్తలను గట్టుమనుట, ఆఁకలిచేత బాధపడువాని చేతులు కట్టిపెట్టి యొక కబళమయినను తిననియ్యక నిర్బంధించిన మహానుభావుఁడు వాని కొక్కసారిగా నెనిమిది బిందెలయన్నము నేల పెట్టరాదని యడిగినట్లున్నది. బహుభర్తలుండుటవలన నష్టములు తమకువిశదము కానట్లున్నవి. మనపెద్దల యనుగ్రహమువలన దుర్ణీతికి పట్టుకొమ్మలయి పలుకుటుంబములను గూలఁద్రోచిమనదేశమున

కంతకు నవమానమును దెచ్చుచు వివాహాద్యుత్సవసమయములయందు మనగృహములను పావనము చేయుచున్న వేశ్యలస్థితినిగొంచెముజ్ఞప్తికి దెచ్చుకొన్న, మీారు నన్నా ప్రశ్నను వేయకయేయుందురు. మన దేశమున బోగము వాండ్రుబహుభర్తలను గలిగియుండుటవలన సంభవించు సౌఖ్యములను మనవంటివారికి బోధించుట కేమోయనునట్లుగా కొన్నటికిని తఱుగని పడవివలె నిత్యకళ్యాణమును పచ్చతోరణమును గానుండి మన కుపదేష్టలగుచున్నారు.

శ్రీని — దానికేమిగాని యొకసారి సంభోగించుటవలన చెడిపోయిన స్త్రీల కెవ్వరాశపడుదురు? అట్టిస్త్రీతోడి సంభోగము రోతగానుండదా?

వీర — ముపశాంతిగా యుండు నేని, మనలో నెవ్వరును పయికి పెద్దమనుష్యులవలె పగలెల్లను వేషములు వేసికొని జుట్టుచివర ముడి వేసికొని తిరుగుచు చీకటిపడగానే భార్యలను విడిచిపెట్టి లంజెలయిండ్లకు వేంచేసెడు మహానుభావు లుండకయే పోదురు; లోకములో వ్యభిచారమే లేకపోవును; వేశ్యలందఱును మహాపతివ్రతలే యయి యుందురు, బాలవిధవల కిప్పటివలె వ్యభిచారముదోషమును, గర్భస్రావాదిపాతకములు సంభవించినయే యుండును. నిత్యమును కన్నకన్నవారినెల్లను గలియు వేశ్యలపాదము లాశ్రయించి తమధనమును కొల్ల పెట్టు మహాపురుషులకు,ఎప్పుడో భర్త పోయిన కులస్త్రీని వివాహమాడుట రోతగా కనబడవలసినదే. మనలో చిరకాలము నుండి యట్టి దురాచారము తప్పియుండుటవలనను, మనవారు వారికి కల్పించియున్న వికృతవేషమువలనను, మొట్టమొదట కొందఱి కంటికి వారిరూప మసహ్యముగాఁ గనబడవచ్చును. అట్టివారికన్నులకయినను పయివేషమువూఱి సువాసినీచిహ్నములు కనబడినపిమ్మట మొదటియట్లుండదు. ఆదివఱకు భర్తలతోడి సంభోగసుఖమనుభ

విషయమునం గాని యితరులతో మొఱ్ఱలిడుచున్నారా? సిగ్గుచేతను, మనలోని క్రూరాచారముచేతను, మనవారు వహించిన కఠినచిత్తత చేతను, వారు మనలను ప్రార్థించకపోయినను వారికష్టములనుజూచి నను స్త్రీపునర్వివాహము లేకపోవుటవలనం గలుగుచున్న యనర్థము లను జూచినను మానవజన్మమెత్తినవారికెల్లను వితంతువివాహముల కయి పనిచేయుట విధిగా నేర్పడుచున్నది.

శ్రీని—ఈయన యెంత సేపు చెప్పినను, సారవంతమయినమాట యొక్కటియు కనంబడలేదు. మాయుక్తులలో నొకదానికిని సమాధానము రాలేదు. వారివాదము పడిపోయినది; మావాదము స్థిరపడినది. శాస్త్రచర్చతో పనిలేకయే మేము గెలిచినాము. ఇంక విధవా వివాహముల విషయమున యెన్నఁడును సభలు లేకుండ చేయవలెను. అగ్రాసనాధిపతిగారు పక్షపాతమువిడిచిపెట్టి న్యాయమయిన మాట చెప్పవలెను.

వేణు—యుక్తులకేమి? ఏపక్షమునకైననుజెప్పవచ్చును. ఒక వేళనొకరు తిన్నఁగా యుక్తి చెప్పలేకపోయినను, అదివారిదౌర్బల్యమే కాని వాద దౌర్బల్యమెన్నటికిని కానేరదు. ఆచార్యులుగారుచెప్పిన యుక్తు లనుకూలములుగానే యున్నవి.

శ్రీని—ఏమి? నేను చెప్పినయుక్తు లనుకూలముగా నున్నవి కావా?

వేణు—మీరు చెప్పిన యుక్తులును దివ్యముగానే యున్నవి. యుక్తులకేమి? మనకు శాస్త్రముప్రమాణము. పయిభానువారము నాఁడు శాస్త్రవాదము చేయుటకయి మీరందఱు నిక్కడకు దయచేయవలెను. పండితులు ముఖ్యముగా విజయంచేయవలెను.

పర—వేణుగోపాలరావుగా రందఱును మెచ్చుకొనునట్లుగా న్యాయము సెలవిచ్చినారు. యుక్తివాదములోమనమే గెలిచినాము.

మనకిది శుభసూచకము. శాస్త్రవాదములోను మనకే జయము కలుగును.

వామ—తథాస్తు! అందఱును సంతోషముతో నిండ్లకునడువండి. (అనఁగా నందఱును వెళ్ళుచున్నారు)

---

## తృతీయాంకము

---

ప్రథమరంగము—వేణుగోపాలరావుగారి గృహము.

[వేణుగోపాలరావుగారును, శ్రీనివాసాచార్యులుగారును కూరుచుండి మాటాడుచుండఁగా వామనశాస్త్రిగారును, కుమారశాస్త్రిగారును, గోపాలశాస్త్రిగారును, పరబ్రహ్మసోమయాజులుగారును ప్రవేశించుచున్నారు]

వేణు—(లేచి) దయచేయండి. శాస్త్రులవారికందఱికి నమస్కారము. (అని చేతులు జోడించుచున్నారు)

శాస్త్రి—ఆచంద్రార్కం వంశాభివృద్ధిరస్తు. రాజద్వారే రాజభవనే సర్వదా దిగ్విజయమస్తు. తథాస్తు.

వామ—మీరేమో రహస్యము మాటాడుకొనుచున్నట్టున్నారు మేముండవచ్చునా?

వేణు—మాకు రహస్యమేమున్నది? మన సభవిషయమయియే మాటాడుచున్నాము. ఎంతప్రయత్నమయినను చేసి వారిప్రయత్నము చెడఁగొట్టవలెను.

కుమా—మొన్నజరిగిన సభవిషయమయి జనులేమి యభిప్రాయపడ్డారని మీరు విన్నారు?

వేణు—నేనుమఱియొకలాగున విన్నానుగాని జనులందఱును మనయుక్తులు దివ్యముగానున్నవని మిక్కిలి సంతోషించుచున్నారని శంకరశాస్త్రులుగారు శ్రీనివాసాచార్యులుగారితో మనవిచేసినారట.

కమా—ఆయన యేమిచెప్పినారోగాని నేను మొన్నటి సభకు రాలేదుగనుక వాదమెట్లున్నదని బహుజనుల నడిగినూచి నాను. మనపక్షమం దభిమానముగలవారు కొందఱుతప్ప జనులందఱును వారి యుక్తులే బాగున్నవని చెప్పుచువచ్చినారు. యుక్తులెట్లున్నను శాస్త్రము మాత్రము వారివాదమునకు ప్రతికూలముగానున్నదని నేను కనబడినవారితో నెల్ల చెప్పుచున్నాను.

వామ—మీరాలాగున సెలవిచ్చెద రేమి? విధవల యవస్థ చూచిన పగవారి మనస్సు కలుగుచున్నదన్న మాటకు బదులుగా విధవావివాహము లయిపోవునేమో యనిదే శిష్టాచార సంపన్నులయిన పండితుల మనస్సులు దహించుకొని పోవుచున్నవని శ్రీరామపండితులవారు చెప్పిన యుక్తి యెంత సరసముగానున్నది? దానికి వారేమి సమాధానము చెప్పఁగలరు?

పర—నే నీసంగతినే సీతారామశాస్త్రిగారి కొమారుఁడు గోవిందరావుతో ప్రశంసించి నప్పుడు, అతఁడు మంచి సమాధానమునే చెప్పినాఁడు.

వామ—మన మనసులలో నాలాగుండుట కేమి కారణము చెప్పినాఁడు?

పర—చిరకాలాచారమువలన నట్లుతోఁచుట సహజమనియు, దురభిమానమును వదలి న్యాయైకదృష్టితోఁ జూచినప్పుడు దయ పుట్టకుండదనియు, బహు కాలాచారమువలన మనలో పలువురకు నరబలు లిచ్చునప్పుడు లేశమయినను జాలిలేకుండుట మీరు చూచుచున్నారు కారా యనియు, చెప్పినాఁడు.

కమా—ఇన్నిమాటలు చెప్పుచున్నాను గాని యిప్పుడు లోకములో జరుగుచున్న దారుణకృత్యములనుజూచినప్పుడు విధవల విషయమయి మనకు మాత్రము నిజముగా జాలిపుట్టుచుండుట లేదా?

ఘరబ్రహ్మ సోమయాజులుగారి మేనకోడలి కొమార్తెకు వివాహ మయిన నెలలోపలనె మగఁడు పోయినాఁడు. ఆపిల్లను తలఁచుకొన్న ప్పుడు మాకందఱకు నెంతదుఃఖము—

వామ—మనపక్షములో నున్నవారు మీరే యీలాగున సెలవిచ్చుచుండఁగా, ఇతరుల మాట చెప్పవలసిన దేమున్నది!

కుమా—మనలో మనమాట గనుక చెప్పినాను గాని యితరుల ముందఱ నే నీప్రకారముగా చెప్పుదునా? మీరేమియు సందేహపడఁబోకుఁడు.

వేణు—మీరు గోవిందరావు నెందుకుచూచినారు? ఆతఁడు వీరరాఘవరావుగారితోఁ గలిసి యెప్పుడును తిరుగుచున్నాఁడే.

పర—ఈదినము సభలో చెప్పుటకు వీరరాఘవరావుగారేమి యాలోచించుచున్నారో జాడతీయుటకయి మొన్నటిదినము వారి యింటికి వెళ్ళినాను.

వామ—గోవిందరా వీదినమున సభకురాఁడు. నిన్నరాత్రి యతని యప్పగారు కొంత సొమ్ముతో వంట బ్రాహ్మణుని తీసుకొని లేచిపోయి బహిరంగముగా నంగడివీథిలో ప్రవేశించినదట. సిగ్గుచేత వారి కుటుంబములోని వా రెవరును పయికిరాకున్నారు.

పర—ఆ లేచిపోయినదాని పేరెవరు?

వామ—పేరేమో నాకు తెలియదు గానీ యామె సీతారామయ్యగారి పెద్దకూఁతురట. మనగోపాలశాస్త్రిగారికి తెలియును.

గోపా—అన్నపూర్ణ. సీతారామయ్యగారికిరజస్వలకానివిధవ కూఁతు రొకతెయున్నది. ఆచిన్నదాని కేలాగునైన వివాహము చేయించవలెనని గోవిందరావు కభిప్రాయమున్నట్లుకనఁబడుచున్నది.

వామ—సీతారామయ్యగా రందుకొప్పుకొందురా! ఒప్పుకొనరు.

వర—ఒకవేళ కూఁతురు లేచిపోయినందుచేత నొప్పి కొందురేమో?

వేణు—ఒక్క కూఁతురు కాదుగదా పదిమంది కొమార్తెలు లేచిపోయినను పెద్దలొప్పుకోరు. నిన్న గాక మొన్ననాఁ డప్పకోడలు లేచిపోయినది. నేనేమయిన నొప్పుకొనుచున్నానా? ఒకవేళ లోపల నభిప్రాయమున్నను లోక భీతిచేతనయినను మూసి వేయుదురు.

వర—నేను చూచుచున్నాను. లోపల నూటిలో తొంబది తొమ్మిదిపాళ్లు ప్రతిమనుష్యునకు విధవావివాహములు కావలెనని యే యున్నది. పయి కెవ్వరును లోకభీతిచేత మాటాడరు.

శ్రీని—ఎవరి కేలాగున్నను, మనము చేతనయినంత ప్రయత్నముచేసి విధవావివాహములు మాన్పినామన్న ప్రతిష్ఠను పొందవలెను.

వేణు—దాని కేమి యాలోచన? శంకరాచార్యులవారికి వ్రాసి యీ ప్రయత్నము చేయుచున్నవారి కాంతపత్రిక తెప్పింతమా? డబ్బు కావలసిన నేనిచ్చెదను.

వామ—ఆ ప్రయత్నము దివ్యముగా నున్నది. ఇప్పుడే యా ప్రకారముగా చేయుదము.

శ్రీని—ఇప్పుడు కాలము మంచిది కాదు. హూణప్రభుత్వమగుటచేత మనస్వాములవారి యధికారము చక్కఁగా చెల్లదు. ఇదియే మనస్వదేశరాజుల యధికారమైన పక్షమున, ఈపాటికిప్రయత్నము చేసినవారి నందఱిని రాతిగానుగలలో పెట్టి యాడించలేక పోయినామా? ఈదినము సభ జరగనిండి తరువాత మాట చూచుకొందము.

పర—వారేమో గ్రంథములువిస్తారముగా వెదకుచున్నారట. ఇదివఱకే వారి కాధారము లనేకములు దొరికినవట!

వామ—వారికెన్ని దొరికిననేమి! అవియన్నియు నే నొక నిమిషములో ఖండించివేసెదను. అందులో నెవరైన నాతో సమానముగా మాటాడఁగలరా!

వేణు—మీరు చెప్పిన మాట బాగున్నది. జనులు యుక్తులను గ్రహించినట్లు శాస్త్రమును గ్రహింపలేరు. మీరు మాత్రము విడువకుండ గబగబయేవో శ్లోకములను చదివి వారు చెప్పినదెల్లను కాదనుచుండవలెను. అప్పు డందఱును మీరేగెలిచినారనుకొందురు. అందుకు సందేహము లేదు.

కుమా—అందఱునుగాకపోయినను కొందరైనను శాస్త్రము సహితము గ్రహింపఁ గలిగినవా రుందురు. శాస్త్రవిషయంలో మనము బహుజాగ్రతగా నుండవలెను. లౌకికయుక్తులలో నెట్లున్నను పండితులమని పేరుపెట్టుకొని శాస్త్రములో మనము తగిన సమాధానము చెప్పలేకపోయినపక్షమున మిక్కిలి యవమానకరముగానుండును.

వామ—వారికి పుస్తకముల నేమియు నియ్యకుండ గ్రామములోని వైదికుల నందఱితోను ముందుగా చెప్పవలెను. ఎవ్వరైనవారి కొక పుస్తకము నెరువిచ్చినను, ఒక్క శ్రుతివచనమునకర్థము చెప్పినను, వారిని బహిష్కారము చేసెదమని భయపెట్టవలెను.

వేణు—కుమారశాస్త్రిగారు చెప్పిన యంశ మాలోచింపవలసియే యున్నది. మన ప్రతిపక్షులు బహుగ్రంథములను జూచుచున్నారని నేనును విన్నాను. ధనమునకాశపడి పండితులలో నెవ్వరయినను వారి పక్షమునకు రావచ్చును. వామనశాస్త్రిగారూ! మీరీవిషయమున ధర్మశాస్త్రము లేవి చూచినారు?

వాసు—ఏమియు చూడవక్కఱలేదు. విధవావివాహము కూడదని కాశీపండితులు వ్రాసిన పుస్తకము నావద్దనున్నది. అది యిక్కడ మఱి యెవ్వరియొద్దను లేదు. దానితో నేనెంతమందినయి నను జయింపఁగలను.

రామ—మేము ధర్మశాస్త్రపండితులమని పేరేగాని మాలో నెవ్వరియొద్దను ధర్మశాస్త్ర గ్రంథములు లేవు. ఆయనయొద్ద తర్క గ్రంథములున్నవి; నాయొద్ద వ్యాకరణ గ్రంథములున్నవి; కాశీపండి తుల పుస్తకములోలేని క్రొత్తసంగతులను వారు తీసికొనివచ్చిన పక్ష మున మనము సభలో నోరెత్తలేక యూరకుండవలసివచ్చును.

వేణు—అందుకు నేనొక యుపాయము చెప్పెదను వినండి. జ్వరమున్నదని చెప్పి యీదినముకూడ కుమారశాస్త్రిగారు సభకు రాకయే యుండవలెను. అందఱును వచ్చి చెప్పలేకపోవుటకంటె మొదట వాదము ధోరణి కనిపెట్టి యొకరు చెప్పలేకపోయిన మఱు సటిసభయందు మఱియొక రాలోచించుకొనివచ్చి సమాధానము చెప్పవచ్చును. ఒకదినమున వాద మొకవంతమవచ్చిన మఱియొక దినము దానిని మఱియొకవంతకు దింపి వాదింపవచ్చును. అక్కడ కును మనము జయింపలేక పోయినపక్షమున వారిని జాతినుండిబహి ష్కారము చేసెదమని బెదరింపవచ్చును. మన మోడిపోతిమని మాత్ర మెన్నఁడు నొప్పుకొనఁ గూడదు.

వాసు—తుదకంతటను మనము గెలిచితిమని మే మింటింటికిని పోయి చాటవలెను. శాస్త్రమున్నదన్నమాట మనము ప్రాణము పోయినను, ఒప్పుకొనఁ గూడదు.

శ్రీని—వేణుగోపాలరావుగారు చెప్పిన యాలోచనకంటె మంచియాలోచన మఱియొకటి యేమియు నాకు తోఁచలేదు. అదే సర్వోత్కృష్టమయినది. ఆప్రకారముగా చేయుదము. మనము గెలిచి

నట్టు గ్రామములో వడంతి వేయించుట యెంతపని! అదిమాశాస్త్రి చేత నిమిషములో నేను చేయించగలను.

వేణు—భోజనముల వేళ అయినది కదమా! మధ్యాహ్నమందఱు నీత్రోవనే దయచేయవలెను. మన మందఱము కలిసి వెళ్ళుదము.

[అప్పు డందఱును పోవుచున్నారు.]

---

ద్వితీయరంగము—పఠనమందిరము.

---

[పండితులతో వేణుగోపాలరావుగారును, వీరరాఘవరావుగారు మొదలయిన వారును ప్రవేశించుచున్నారు.]

వీర—పండితు లందఱును దయచేసినట్టున్నారు. ఈపాటికి సభ యారంభింపవచ్చునా? ఒక్క కుమారశాస్త్రిగారు రాలేదు.

పర—వారీదినమున రారు. సభ మొదలుపెట్టవచ్చును. క్రిందటి మాఱువలెనే వేణుగోపాలరావుగా రగ్రాసనాసీనులుగా నుండవలెనని నాకోరిక.

వేణు—నాకంటె శ్రీనివాసాచార్యులుగా రగ్రాసనాసీనులుగా నున్న ననుకూలముగా నుండును.

శ్రీని—కాదు కాదు. వేణుగోపాలరావుగారే యుండవలెను.

త్రివి—మీ రిద్దఱును తగవులాడుచున్నారు. మీ యిద్దఱి బదులు నేనుందునా?

వామ—త్రివిక్రమరావుగా రిక్కడకూడ హాస్యమాడుచున్నారు.

వీర—హాస్యముగాదు. నిజముగానే యగ్రాసనాసీనులుగా మఱియెవ్వరైన నుండవలెను. వారిరువురును మాకు ప్రతిపక్షకోటి

లోనివారు, ఎవ్వరితోనుసంబంధములేనివారు మఱియొకరుండుటయే యుభయపక్షములవారికిని క్షేమకరము.

వామ—అట్లయిన సాంబసదాశివరావుపంతులుగా రగ్రాసనాసీనులుగా నుండుట మీకు సమ్మతమా? మావారందఱు నొప్పుకొందురు.

వీర—ఆయనయుండుటకు మాకేమా క్షేపణమును లేదు.

వామ—పంతులుగా రగ్రపీఠమునకు దయచేయువలెను.

సాంబ—నాకేమియు తెలియకపోయినను, మీరందఱునన్ను నియమించుచున్నారు గనుక విఘ్నేశ్వరునివలె నేను పీఠముమీఁద కూరుచుండి మీరు చెప్పెడిది వినుచుండెదను.

వీర—నేనిఁక మొదలుపెట్టవచ్చునా?

వామ—అవశ్యము మొదలుపెట్టవచ్చును. మీవాదమునకు వేదములలో నెక్కడనైన నాధారమున్నదేమో మొదట కనఁబఱుపుఁడు.

వీర—ఒకటికాదు. అనేకాధారములున్నవి. వానినెల్లను వరుసగా చూపెదను.

శ్రుతి. ఉదీర్ష్వ నార్యభిజీవలోకం గతాసుమేత ముపశేష ఏహి,
హస్తగ్రాభస్య దిధిషో స్త్వ మేత త్పత్యుర్జనిత్వమభిసంబభూవ॥
అను నారణ్యకశ్రుతి మావాదమునకు మిక్కిలి బలమయినది.

వామ—మీ వాదమునకు బలముగానుండు శ్రుతులు మఱి యేమియు లేవా?

వీర—శ్రుతి. యాపూర్వం పతింవిత్వా అథాన్యం విందతే పతిం। పంచౌదనంచ తావజం దదాతో నవియోషతః॥ సమానలోకో భవతి పునర్భువాపరః పతిః ॥ యోజం పంచౌదనందక్షిణాజ్యోతిషం దదాతి॥

అను నాథర్వణశ్రుతి మొదటిదానికంటెను మావాదమునకు బలవత్తరమయినది.

వామ — ఈ రెండునుతప్ప మీ వాదమున కక్కఱకువచ్చు శ్రుతులు లేవా?

వీర — కావలసినన్ని యున్నవి. మొట్టమొదట మీరీశ్రుతుల యర్థమును విచారించి మా వాదమును స్థాపించుటకివి చాలవని సాధింపఁ గలిగినపిమ్మట నేను తక్కిన శ్రుతులను జెప్పెదను.

వామ — అలాగున కాదు. మీ కున్న యాధారముల నన్నిటిని చెప్పివేసినమీఁదట నే నొక్కసారిగా వాని నన్నిటిని ఖండించి వేసెదను.

వీర — స్త్రీ పునర్వివాహమును స్థాపించు మఱికొన్ని శ్రుతి వాక్యములను గూడ నుదాహరించెదను.

శ్రుతి. ఇయంనారీ పతిలోకం వృణానా నిపద్యత ఉపత్వా మర్త్య ప్రేతం. విశ్వపురాణ మనుపాలయంతీ తస్యైప్రజాంద్రవిణం చేహధేహి॥ అను యజుర్వేద వచనమున,

శ్రుతి. తస్మాదేకస్య బహ్వోజాయాభవన్తి! నైకస్యైబహ వస్సహపతయః॥ అను ఋగ్వేద వచనమును,

శ్రుతి. ఉతయ త్పతయో దశయాః పూర్వే అబ్రాహ్మణాః॥ బ్రహ్మచేత్ హాస్తమగ్రహీత్ సఏవ పతిరేకధా॥ బ్రాహ్మణః ఏవ పతిర్న రాజన్యోనవైశ్యః। తత్సూర్య ప్రబ్రువన్నేతి పంచభ్యో మానవేభ్యః॥ అను నాథర్వణవచనమును,

శ్రుతి. సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిదఉత్తరః।తృతీయోఅగ్నిష్టే పతిస్తురీ య స్తే మనుష్యజాః॥ అనుఋగ్వేదవచనమును,

శ్రుతి. కుహస్విద్దోషా కుహవస్తో రశ్వి నాకుహాభిపిత్వం।కరతః కుహోషతుః కోవాంశయుత్రా విధవేవ దేవరం మర్యన్నయోషా

కృణుతేసధస్థఆ॥ అను ఋగ్వేదవచనమును, వేదము స్త్రీ పునర్వి వాహము నంగీకరించుననని సూచించుచున్నవి.

వామ—"దేవర" మని నియోగమునుగూర్చి చెప్పిన యీ కడపటి శ్రుతి మీ కేమి యుపయోగకరము?

వీర—నియోగముగాక దేవరునితోడి వివాహమునే వేదము విధవకు చెప్పుచున్నది. అందుచేతనే పయి శ్రుత్యర్థమును వివరించు నిరుక్తము స్పష్టముగా,

నిరుక్తము॥ క్వస్విద్రాత్రౌ భవధః క్వదివా క్వాభిప్రాప్తిం కురుధః-క్వవసధః। కోవాంశయనే విధవేవ దేవరం దేవరః కస్మాద్ద్వితీయో వరఉచ్యతే॥

ద్వితీయవరుఁడనియే చెప్పుచున్నది.

వామ—(పరబ్రహ్మసోమయాజులతో రహస్యముగా)ఇదేమి? వీరు కాశీపుస్తకములోలేని శ్రుతులను జదువుచున్నారు?

పర—(రహస్యముగా) వారు చెప్పిన యర్థమెల్లను కాదని వారిమాట చొరకుండ కేకలు వేయండి. తరువాతచూచుకొందము.

వీర—నేను శ్రుతివాక్యములను జదువుచుండగా వినక మీ రిద్దఱు నేమో మాటాడుకొనుచున్నారు.

వామ—నాయర్థమునకన్న వేదార్థప్రకాశాఖ్య వ్యాఖ్యానమునందు శ్రీవిద్యారణ్యులవారు చేసిన ప్రతిపదార్థమునే నేనిక్కడఁ జెప్పెదను:—

హేనారీ! త్వమ్ ఇతాసుం=గతప్రాణం, ఏతం=పతిం, ఉపశేషే=ఉపేత్యశయనం కరోషి; ఉదీర్ష్వ=అస్మాత్పతిసమీపాదుత్తిష్ఠ జీవలోకమభి=జీవంతం ప్రాణిసమూహమభిలక్ష్య, ఏహి=ఆగచ్ఛ; త్వమ్,హస్తగ్రాభస్య=పాణిగ్రాహవతః, దిధిషోః=పునర్వివాహేచ్ఛోః,

పత్యుః, ఏతత్, జనిత్వం=జాయాత్వం, అభిసంబభూవ, ఆభిముఖ్యేన సమ్యక్ ప్రాప్నుహి.

త్రివి—మీరు సంస్కృతముతో నేమో చెప్పుచున్నారు. మాకేమియు తెలియుచుండలేదు. మీరా శ్రుత్యర్థమును తెనుఁగునఁ జెప్పుఁడు.

వామ—తెనుఁగునఁ జెప్పుట శాస్త్రసమ్మతము గాదు—

సాంబ—అందఱికిని దెలియుటకై తెలుఁగుతో కూడ చెప్పనిండి.

వీర—ఈశ్రుతికి విద్యారణ్యులవారు వ్రాసిన భాష్యార్థమును తెనుఁగుతో జెప్పుచున్నానుగనుక దయచేసి యందఱును వినుండి.

నారి—ఓనారీ (త్వమ్=నీవు), ఇతాసుం=గతప్రాణుఁడయిన, ఏతం = ఈపతినిగూర్చి, ఉపశేషే = సమీపమున పడియున్నావు; ఉదీర్ష్వ=(పతిసమీపమునుండి) లెమ్ము. జీవలోకమభి=జీవించియున్న ప్రాణిసమూహమునుజూచి; ఏహి=రమ్ము. త్వమ్=నీవు, హస్తగ్రాభస్య=ప్రాణిగ్రాహకుఁడును, దిధిషోః=రెండవమాఱు వివాహమాడ నిచ్ఛగలవాఁడును (అయిన), పత్యుః=భర్తకు, ఏతత్=ఇటువంటి, జనిత్వం—భార్యాత్వము, అభిసంభూవ=అభిముఖ్యముచేత చక్కఁగా పొందుము.

ఊర్ధ్వదైహిక కాండమునందలి పూర్వక్రియయందు విధింపఁబడిన సహగమనమును జేయుటకు మృతభర్తృక భీతురాలయిన నుడల, సహగమనముచేయుని యాస్త్రీయొద్ద బంధువులీమంత్రమును చదువవలయును. "ఓనారీ! ప్రాణముపోయిన యీపెనిమిటియొద్ద నేల పడియుండెదవు? జీవించియున్నవారిని జూచి లేచిరా. పునర్వివాహమును సేసికొన గోరువానికి భార్యవుకమ్ము" అనునర్థమిచ్చెడి మీ మంత్రమును మఱది మొదలగువారెవ్వరైన పెనిమిటిపోయిన స్త్రీ

యొద్దఁజదివియామె నూఅడించి లేవఁదీయవలెను. "తాముత్థాపయ త్యన్యోవా బ్రాహ్మణ ఉదీర్ష్వనారీతి" అనునది యీమంత్రమునకు వినియోజక వాక్యమయిన కల్పసూత్రము. దీనినిబట్టి వేదమువిధవా వివాహమును విధించుచున్నదని స్పష్టముగాలేదా?

వామ—మీరు చెప్పినదంతయు కేవల శాస్త్రవిరుద్ధమయిన యర్థము. స్త్రీ మృతుఁడయిన భర్తయొద్ద పరుండవలెనని విధి యున్నదా? దానిని లేవతీయుట యెందుకు? మీరు చెప్పినయర్థ మబద్ధ మని యీ సభవారి కందఱికిని—

వీర—తొందరపడకండి. శాస్త్రులవారు కొంచెమోపిక చేయవలెను. మృతభర్తృకను ప్రేతమువద్ద పరుండఁబెట్టవలయునని విధియును గలదు. ఇదివఱ కుదాహరించిన "ఇయంనారీ" యను మంత్ర మప్పుడు చెప్పవలసినదే. "అత్రపత్నీముపనిపాతయతీయం నారీతి" యని కల్పసూత్రము 'ఇయంనారీ' త్యాది మంత్రమునుజెప్పి ప్రేతపత్నిని భర్తృశరసమీపమున పరుండఁబెట్టవలయునని విధించు చున్నది.

త్రివి—'ఇయంనారీ' యని మంత్రమునకుఁ గూడ నర్థము సెలవించి.

వీర—హేమర్త్య=ఓమనుష్యుఁడా, ఇయంనారీ=ఈస్త్రీ, పతి లోకం = పెనిమిటివైన నీలోకమును, వృణానా = కోరుచున్నదై, ప్రేతం=ప్రేతవగు, త్వా=నిన్ను ఉప=సమీపమునందు, నిపద్యత= పడియున్నది. పురాణం=ప్రాచీనమగు, విశ్వం=ప్రపంచమును, అను పాలయంతీ=అనుసరించి వర్తించుచున్నది. తస్యై = ఆమెకొఱకు, ప్రజాం=సంతానమును, ద్రవిణంచ=ధనమును, ఇహ=ఈలోకము నందు, ధేహి=వృద్ధిపొందునట్లు చేయుము.

ఓమృతుఁడా! నీభార్యనీలోకమును గోరి ప్రేతవగు నీసమీపమునపడి యున్నది; ప్రాచీనమయిన యీ ప్రపంచధర్మము ననుసరించి ప్రవర్తించుచున్నది కాఁబట్టి దీనికి సంతానము ధనమును వృద్ధి పొంది బాగుండునట్లు చేయుమని యర్థ మిచ్చెడి యీ మంత్రమును శవమువద్ద భార్యపడియుండఁగా ప్రేతముద్దేశించి బంధువులు పఠింతురు. 'ఇయంనారి'యను మంత్రముచేత నీభార్యకుసంతానము కలిగి బాగుండునట్లు చేయుమని ప్రేతమునుగోరుటయు, 'ఉదీర్ష్వనారి'యను మంత్రముచేత మృతునియొద్దపడి యేలయేడ్చెదవు మఱియొకనికి భార్యవుకమ్మని ప్రేతపత్ని నూఱడించుటయు, వేదము నిస్సందేహముగా విధవావివాహమును విధించుచున్నట్టు మీకు స్పష్టపడలేదా?

వామ—సంతానము బాగుండునట్లు చేయుమన్నమాత్రముచేత నట్లూహించుటకు వీలులేదు. ఇప్పుడుచెప్పిన సంతాన మిది వఱకున్నదేకాని యిఁకముందు కలుగఁబోవునది కాదు.

వీర—సూ. "ఏతన్మంత్రద్వయం సపుత్రకాయానాస్తి" యని రెండు మంత్రములును సంతానవంతురాలికి లేవని సూత్రకారులు విధించుటవలన మీయర్థమున కెంత మాత్రము నవకాశము లేదు.

వామ—అట్లయిన నీచెప్పినసంతాన ముత్తరజన్మమునందని యూహింపవలయును.

వీర—అట్లు చెప్పినయెడల'తస్యై'యనుపదము బాధించును. ఉత్తరజన్మమునందనెడు పక్షమున నామె యొక్క తెకొఱకే సంతానమభివృద్ధికావలెనని కోరుట యసందర్భము. దంపతుల యుభయులకొఱకునని చెప్పవలసియుండును. ఆజన్మమునఁగూడ విధవయేయయి యప్పుడుకూడ నీమెకొఱకే సంతానము నిలువవలెననుట యెంతపరిహాసాస్పదమయినమాట! అదిగాక యీ శ్రుతిలో నుత్తరజన్మముని

సూచించుపదమయినను లేదుగనుక మీరుచేసిన యర్థము మఱిమంతు డెవ్వఁడును నొప్పుకొనఁడు.

వామ—మేమీ శ్రుతులు రెండును సహగమన పరములే యనియు, ఈసంతానము, వివాహము మొదలయినవి, పరలోకము ననే యనియు సాధించెదము.

వీర—అప్పుడు సహితము 'తస్యై' యను పదము బాధించనే బాధించును. ఆమెకొఱకనుట కనుకూలముగా సిద్ధతికొఱకనని యుండ వలసియుండును. అదిగాక 'యిహ' యనుపదము మఱింత బాధించును. శ్రుతిలోనే (ఇహ) యీలోకమున ననియుండఁగా మీరుపరలోకమున ననియెట్లుసాధింపఁ గలుగుదురు? ప్రేతపత్ని భర్తతో ననుగమనము చేయుచున్నప్పు డామెకొఱకు సంతానము బాగుండవలెనన్న నెట్లు పొసఁగియుండును? ఆమెజీవించియున్నఁగదా యామెకొఱకని చెప్ప వలసియుండును. ఉత్తరజన్మమున ననికాని పరలోకముననని కాని చెప్పెడు పక్షమున మొదటి శ్రుతిలోని "దిధిషు" శబ్దముపొసఁగదు. "పునర్భూర్దిధిషూరూఢాద్విస్తస్యాదిధిషుఃపతిః" అను నిఘంటువును బట్టి రెండుమాఱులు వివాహము చేసికొను స్త్రీ పునర్భువనియు, పునర్భువును వివాహమాడువాడు దిధిషువనియుగదా చెప్పబడుదురు మొదటిభర్త దిధిషుఁడెట్లు కాఁగలఁడు?

వామ—మీ రెంతమాత్రమును శాస్త్రసమ్మతమయిన యర్థ మును శిష్యు లెవ్వరును విశ్వసింపరు. మీవాదముతో యుక్తి యెంత మాత్రమును లేదు. ఎంతసేపువిన్నను మీనోటినుండియన్నియు కుయు క్తులే వచ్చుచున్నవిగాని మంచియుక్తి యొక్కటియుఁ గనఁబడదు. వేదమెక్కడనైన మగఁడుచచ్చి యేడ్చుచున్నదానినిపునర్వివాహము చేసికొమ్మని చెప్పునా? అది యెంతవిరుద్ధము? ఇప్పుడెవరైన నట్టి స్త్రీతో నీవు బరల పెండ్లిచేసికొమ్మని యన్నపక్షమున—

పర—మీరు కొంచెము తాళి నన్నొక్కసారి మాటాడనిండి ఉదీర్ష్వనారి యను శ్రుతికి—

వీర—వామనశాస్త్రులవారు రాకక నాయర్థ మపార్థ మని దూషించుటయే కాని నేను చెప్పిన యర్థ మీహేతువుచేత సరి యయినది కాదని చూపఁగలిగినవారు కారు. భార్య పోయినప్పుడు పురుషుని జేరి బంధువులు మొదలయినవారు 'చచ్చినదాని నిమిత్త మేడ్చిన కార్యములేదు. నీవు మరల వివాహము చేసికోవచ్చు'నని యోదార్చుచుండుట సర్వసాధారణమయియే యున్నది. మనలో పురుషునకు పునర్వివాహమున్నది గనుక, ఆమాట యెంతమాత్ర మును తప్పుగా తోఁచుచుండలేదు. ఆ ప్రకారముగానే స్త్రీలకుఁ గూడ పునర్వివాహముండిన నట్టియోదార్పుమాటలు సహజముగానే తోఁచుననుటకు లేశముగాని సందేహములేదు. మనలోఁ గొంత కాలమునుండి స్త్రీ పునర్వివాహము నిలిచిపోవుటవలన, అట్టిమాట లాచారాభావమును బట్టి యిప్పుడు చెవుల కొకలాగున వినఁబడు చున్నవి. వేదములో నట్లు చెప్పుటలో నేమియు విరుద్ధము లేదు.

పర—ఆమాటలు పోనిచ్చి నన్నొక్కమాట మనవి చెయ్య నిండి.

వీర—మీరు చెప్పెడిదేమో చెప్పండి.

పర—శ్రుతిలో 'హస్తగ్రాభస్య' 'పత్యుః' అని భూతార్థ ద్యోతకములయిన పదములుండుటచేత పరలోకమున ఆపతికే మరల భార్యవుకమ్మని వామనశాస్త్రిగారు చేసిన యర్థమును నొక విధ మున సయుక్తికముగానే కనఁబడుచున్నది. అయినను—

వీర— వ్యాకరణశాస్త్రము నభ్యసించియు మీరు కూడ నాపదములు భూతార్థకద్యోతకములని చెప్పుట వింతగానున్నది.

వాసు—హస్తగ్రాభస్యపదమొక్కటున్నను దానియర్థమును వివరించు 'పాణిగ్రాహవతః?' అనునది స్పష్టముగా భూతార్థకముగా కనఁబడుచుండలేదా? మఱిప్రత్యయము భూతార్థకమునందుఁగాక మఱియెప్పుడు వచ్చును.

వీర—బుద్ధిమంతుఁడు లోనుగాఁగల మతుబంతములు భూతకాలద్యోతకములో సర్వకాలద్యోతకములో వ్యాకరణపండితులయిన పరబ్రహ్మసోమయాజులుగారి నడిగి తెలిసికొండి.

పర—ఆయంశ మట్లుండనిండి. హస్తగ్రాభస్య యనుచో షష్ఠికి సంబంధార్థమును గల్పించి పాణిగ్రాహుని సంబంధుఁడయిన దిధిషువగు పతికనఁగా దేవరునికని యర్థముచేసి యీశ్రుతిని నియోగపరము చేయవచ్చును. అప్పుడు మీరు చేసిన యాక్షేపము లేమియుఁ బట్టవు. ఇయంనారి యను శ్రుతికిని విరోధము పొసఁగదు. "శాస్త్రీయపదానాం శాస్త్రాదేవ శక్తిగ్రహః" అను న్యాయమును బట్టి "దిధిషు" శబ్దమునకు "శ్లో॥ భ్రాతుర్మృతస్య భార్యాయాం యోనురజ్యేత కామతః। ధర్మేణాపి నియుక్తాయాం సజ్ఞేయో దిధిషూపతిః" అను మనుస్మృత్యనుసారముగా దేవరుఁడనియే యర్థము చేయవలెను.

వీర—శ్రుతిలో నియోగమును సూచించు పదములయినను లేవు. మనుస్మృతిలోనైనను "దిధిషూపతి" యనియున్నదిగాని "దిధిషు" వనియుండలేదు. పునర్వివాహము చేసికొను స్త్రీయొక్క భర్త దిధిషువని స్పష్టముగాసిఘంటువునందుఁగనబడుచుండఁగా ఆయర్థమును గైకొనక దిధిషూపతియని గ్రహించిపిమ్మట యతనికి దేవరుఁడని యర్థముచెప్పవలయుననుట యేమిసహేతుకముగా నున్నది? ఆమనుస్మృతిలోనె "అయంద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః............ తతః ప్రభృతి యో మోహాత్ ప్రమీతపతికాం స్త్రియం। నియోజ

యత్యపత్యార్థం తంవిగర్హాంతిసాధవః॥" నియోగము పశుధర్మమని విద్వాంసులచేత గర్హింపఁబడుచున్నదనియు, సంతతికొఱకన్యపురుష నియోగమును సాధువులెల్లను నిందించుచున్నారనియు, నియోగము దూషింపఁబడియున్నది. మీరు చెప్పిన న్యాయమునుబట్టియే పయి శ్రుతిని సాధునిందితమయిన నియోగపరముగాఁ జేయుటకంటె 'నష్టేమృతే' త్యాది శాస్త్రవిహితమయిన పునర్వివాహ పరముగాఁ జేయుటయే నిర్బాధకముగాను పదములను బట్టి యుచితముగాను గనఁబడుచున్నది.

పర — మనము మొట్టమొదట మఱియొకటి యాలోచింప వలయును. మీరు చెప్పిన 'యుదీర్ష్వనారి' యనునది మంత్రముగాని బ్రాహ్మణములోని విధివాక్యము కాదు. కల్పసూత్రకారుల విధివాక్యము లున్నప్పుడేకాని మఱియొకప్పుడు మంత్ర ప్రతిపాదితార్థములనుష్ఠేయములే కావు. సూత్రము స్థాపనక్రియనుమాత్రమే చెప్పుచున్నదిగాని పునర్వివాహమును జెప్పుచుండలేదు. అదిగాక భారద్వాజసూత్రము "యావజ్జీవం ప్రేతపత్న్యుదకోపస్పర్శ మేకభుక్తమధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ మధుమాంసవర్జనంచ" యని ప్రేతపత్నికి యావజ్జీవమును బ్రహ్మచర్యమునే విధిగాఁ జెప్పుచున్నది. మంత్రముకన్న సూత్రము బలమయినదగనుక స్త్రీకిపునర్వివాహము కూడదు.

వీర — కల్పసూత్రము వేదార్థప్రతిపాదకములయిన షడంగములలో నొకటియేకాని వేదములోఁ జెప్పఁబడిన విధులను నిషేధింపశక్తి కలది కాదు. సర్వత్ర యీసూత్రమే ప్రవర్తించునెడుల యెడల, శాస్త్రసిద్ధములనఁబడు సహగమనాదులుకూడ లేకపోవలసి వచ్చును. కాఁబట్టి పునర్వివాహమునుగాని సహగమనమునుగాని కైకొనని విధవలకుమాత్రమే యీసూత్రమువలన పయినిర్బంధము

లన్నియు విధింపఁబడినవని చెప్పకతీఱదు. అట్లు కానిపక్షమున సహగమనమును పునర్వివాహమును విధించెడి యనేకస్మృతివచనములు నిష్ప్రయోజనములు కావలసివచ్చును. పరమప్రమాణములైన శ్రుతిస్మృతులు నిష్ప్రయోజనములనియు ప్రవర్తకములు కావనియు నెవ్వరును జెప్ప సాహసింపఁజాలరు. అంతేకాక కొన్ని స్మృతులు పయి సూత్రములోఁ జెప్పిన నిర్బంధములఁ గొన్నిటిని సంవత్సరము వఱకును కొన్నిటిని నాలుగుమాసములవఱకును మాత్రమే యవలంబింపవలయునని విధించుచున్నవి.

"శ్లో. సంవత్సరం ప్రేతపత్నీ మధుమాంసం విసర్జయేత్
అధశ్శయీతమాసాంశ్చతుర్మాద్గల్యభాషితం." బోధాయనులు

ఇత్యాది వచనములనుబట్టి వివాహమాడెడి స్త్రీ సంవత్సరమునకు లోపు కాలములో మాత్రమే యీనిర్బంధములకు లోఁబడి యుండవలెననియు, పునర్వివాహము చేసికోని స్త్రీ యావజ్జీవము లోఁబడి యుండవలెననియు సూత్రమునకు వ్యవస్థయేర్పఱుపవలసి యుండును. మఱియును "తస్మాదేకస్యబహ్వోర్జాయాభవన్తి" యిత్యాది శ్రుతి స్త్రీకి పునర్వివాహము విధించుచున్నది.

పర—ఆశ్రుతి విధియని చెప్పవల్లకాదు. లిఙ్, లోట్, తవ్య ప్రత్యయములను గలిగియున్నప్పుడు మాత్రమే విధాయకత్వ మేర్పడును కాని వర్తమానార్థక క్రియను గలిగియున్నప్పుడు విధి కాదు.

వీర—వర్తమానార్థక క్రియకూడా విధ్యర్థమునందుపయోగింపఁబడుటగలదు. "వ్రీహీన్ప్రోక్షతి" మొదలగు పెక్కుచోట్ల వర్తమానబోధక క్రియలు విధిబోధకములుగా నున్నవి.

వామ—మొదట తస్మాదేకస్యయను శ్రుతియొక్క యర్థవిచారముచేసి, ఆశ్రుతి యెందు కక్కఱకువచ్చునో చూడవలెను.

శ్రీవి—అంతటికిని దెలియుటకై యాశ్రుతికి తెనుఁగున ప్రతి పదార్థమును జెప్పుఁడు.

వీర—తస్మాత్ ఆకారణమువలన, ఏకస్య ఒకపురుషునకు, బహ్వ్యోజాయాః=బహుభార్యలు, భవన్తి=అగుదురు, ఏకస్యై=ఒకస్త్రీకిఁ గాఁ అను, బహువఃపతయః=బహుభర్తలు, సహ=ఏకకాలము నందు=న (భవన్తి)=కారు.

వామ—ఈశ్రుతియొక్క యుత్తరభాగమునందలి యొకస్త్రీకేకకాలమునందు బహుపతు లుండరను వాక్యమువలన భిన్నకాలములయం దుండవచ్చునని చెప్పెడుపక్షమున, పూర్వభాగమునుబట్టి యొకపురుషునకు భిన్నకాలములయందు బహుభార్య లుండఁగూడదని మీయుక్తిప్రకారముగానే యేర్పడి మొదటికే భంగమువచ్చును.

వీర—పూర్వభాగమునందు ఏకకాలమని సూచించుపదమేదియు లేఁకగనుక, పురుషున కేకకాలమునందే బహుభార్యలగుదురని చెప్పుట కెంతమాత్రము నవకాశము లేదు. సమకాలమునందుఁగాని భిన్నకాలమునందుఁగాని పురుషునకు బహుభార్య లుండవచ్చునని యే యీశ్రుతివలన స్పష్టపడుచున్నది. స్త్రీవిషయమున నేకకాలమని బోధించు సహాశబ్దమును వేసియుండుటవలన, స్త్రీ కేకకాలమునందు బహుపతులుండరనియు భిన్నకాలమునందు వేఱుపతి యుండవచ్చుననియు స్పష్టమగుచున్నది. వేదపురుషుని యభిప్రాయమదియే కాని పక్షమున, వ్యర్థముగా సహాశబ్దమును ప్రయోగించియుండఁడు.

వామ—భిన్నకాలమనఁగా మీతాత్పర్యమేమి? భిన్నక్షణమా? పతిజీవిత యావత్కాలమా? భిన్నక్షణమని చెప్పెడుపక్షమున స్త్రీకి నిమిషమున కొకపతి యుండవచ్చునని యేర్పడి లోకవిరుద్ధమగును. పతిజీవిత యావత్కాలము ననెడుపక్షమున, నష్టాదినిమిత్త

ములయందు మఱియొక పతిని జేసికొనవచ్చునను మీవాదమే పడి పోవును.

వీర—ఒక స్త్రీ విధ్యుక్తప్రకారముగా నొకనికి భార్యయయిన తరువాత నాతని పతిధర్మమునకు భంగము కలిగించి శాస్త్రవిహిత మయిన కారణ మగపడువఱకు నాతఁ డామెకు పెనిమిటియే యగునుగనుక, సహశబ్దప్రయోగమునుబట్టి భిన్నక్షణములయందు వేఱుభర్త లుండవచ్చునాయని ప్రశ్నమునకే యవకాశముండదు. నష్టత్వాది నిమిత్తములయందు శాస్త్రము స్త్రీపునర్వివాహమును విధించుచున్నదిగనుక, శాస్త్రవిహితమయిన యాకాలమే సమయ భేదమగును. అప్పుడేవిధమయిన బాధకమునులేదు. భారతవ్యాఖ్యా నమునందు నీలకంఠాచార్యులవారును పయిశ్రుతికి "సహేతియుగ పద్బహుపతిత్వనిషేధో విహితో నతు సమయభేదేన" అని వ్రాసి యున్నారు.

వామ—నీలకంఠాచార్యులు వ్రాసినదానిని మేమునమ్మము. మాకంటె నతని యాధిక్యమేమి?

వీర—ఆ యర్థముసరియైనది కాదనుటకు మీ కేమి యాధార మున్నది? భాష్యమునందు సహిత మీ యర్థమే వ్రాయఁబడి, "గ్రహణం సహశబ్దస్య పర్యాయాద్బహ వోధ వాః స్యురితి ప్రతిపత్త్యర్థం ప్రాజాపత్యవచోయథా॥" యనువచన ముదహరింపఁ బడియున్నది.

వామ—'బహవోధవా' యనుచోట 'బహవః' 'అధవాః' అని పదచ్ఛేదముచేసి పతిభిన్నులును పతిసదృశులు నగువారు పలువు రుండవచ్చునని సాధించెదను.

వీర—మీరు వ్యాఖ్యానమునందలి శ్లోకములో 'నధవా' యని పదచ్ఛేదము చేసెదరుగాని మూలమునందలి "సహపతయః"

అనుకొని యట్లు 'అపతయః' అని పదవిభాగము చేయఁగలుగుదురా! అట్లు చేయలేకపోయినయెడల మీయర్థమెట్లు సిద్ధించును!

పర—అది కాదు. మేము పర్యాయమనఁగా జన్మపర్యాయమని సాధించెదము!

వీర—మూలములో జన్మపర్యాయమని సూచించు పదము లేనిది మీవాదము నిలువదు. ఉత్తరజన్మమునందుఁగూడ స్త్రీకా భర్తయే మరల భర్తయగుచున్న మీ వెనుకటి మాటకే మీవాదము విరుద్ధమగుచున్నది.

వామ—మీరు యుక్తులెన్ని పన్నినను మీవాదము నిలువదు. పర్యాయ మనఁగా జన్మపర్యాయమని సోమయాజులుగారు చెప్పినది సర్వశాస్త్ర సమ్మతమయిన యర్థము, వేదములో నెక్కడను స్త్రీపునర్వివాహమన్న పేరైనను లేదు.

వీర—స్త్రీపునర్వివాహము కూడునని కంఠోక్తిగా వేదమునందుఁ జెప్పఁబడిన పెక్కు ప్రమాణములను నేను జూపినను మీరు నిరాధారముగా వేదమునం దెక్కడను స్త్రీపునర్వివాహమన్న పేరే లేదనుచున్నారు. 'యాపూర్వ' మను శ్రుతికి మీరేమైన విశేషార్థమును గల్పింపఁగలరా?

శ్రోవి—ఏదీ? ఆశ్రుతికి తెనుఁగున ప్రతిపదార్థము సెలవిండి.

వీర—యా=ఏస్త్రీ, పూర్వం=మొదటను, పతిం=భర్తను, విత్వా=పొంది, అథ = అనంతరము, అన్యంపతిం = మఱియొక భర్తను, విందతే=పొందుచున్నదో, తౌ=వారు (ఆదంపతులు), అజం=మేఁకను, పంచౌదనంచ=అయిదు విధములయిన ఆహారములను, దదాతః=ఇత్తురేని, నవియోషతః = ఎడఁబాయరు. యః= ఎవఁడు, అజమ్=మేఁకను, పంచౌదనం=పంచవిధాహారమును, దక్షిణాజ్యోతిషమ్ = దక్షిణాసువర్ణమును, దదాతి = ఇచ్చుచున్నాఁడో,

పరఃపతిః= (అటువంటి) రెండవభ ర్త, పునర్భవా=పునర్భువుతోడ, సమాలోకః=సమానలోకము గలవాఁడు, భవతి=అగుచున్నాఁడు.

వామ—ఈ శ్రుతి మీవాదమున కెంతమాత్రమును పనికి రాదు.

వీర—ఒక స్త్రీ పూర్వమొకభర్తను వివాహము చేసికొని తరువాత మఱియొకనిని పునర్వివాహము చేసికొనెడుపక్షమున నజా పంచౌదనమను కర్మనుచేసి వారు సమానలోకమును పొందుదురని స్పష్టముగానున్న యీశ్రుతియే పునర్వివాహమునకుఁ బనికిరానిపక్ష మున మఱియేశ్రుతి పనికివచ్చును? స్త్రీకి భర్తలోకము వచ్చునని శాస్త్రము చెప్పుచున్నది గనుక, ద్వితీయవివాహము చేసికొనెడి స్త్రీకే భర్తయొక్క లోకము కలుగునని శంకకలుగఁగా ద్వితీయ భర్తలోకమే కలుగుననియీశ్రుతిసందేహనివారణముచేయుచున్నది.

వామ—ఇది యందునిమిత్తమయి చెప్పఁబడిన శ్రుతి కాదు. స్త్రీ పునర్వివాహము శ్రుతినిషిద్ధము. మీరుచదివిన శ్రుతిచేతనే నారీపునర్వివాహము కూడదని నేను సాధించెదను. మీరు చెప్పిన యర్థముచొప్పున నే స్త్రీ పునర్వివాహము చేసికొన్నయెడల నజాపం చౌదనము చేయవలసినట్లు కనఁబడుచున్నదిగదా? అజాపంచౌదన మొకప్రాయశ్చిత్తము. ప్రాయశ్చిత్తము చేసికోవలయునన్న మాత్ర మున నే యదియొక పాపకార్యముగా నేర్పడి స్త్రీ పునరుద్వాహము నిషిద్ధమని సిద్ధాంతమగుచున్నది. సురాపానముచేయువాఁడు ప్రాయ శ్చిత్తము చేసికొన్నయెడల పాపము పోవునని వేదములోనున్నంత మాత్రమున సురాపానము వేదవిహితముకానట్లే పునర్వివాహము చేసికొన్న స్త్రీయును భర్తయుఁగలిసి యజాపంచౌదనమును చేయ వలయునన్న మాత్రమున స్త్రీ పునర్వివాహమును వేదసమ్మతము కానేరదు.

వీర—అజాపంచౌదనము ప్రాయశ్చిత్తమని యెక్కడనుగను పట్టదు. స్త్రీపునర్వివాహమువలన పాపమువచ్చుననియు, ఆపాపమజాపంచౌదనమువలన పరిహారమగుననియు, పయిశ్రుతి చెప్పుచుండలేదు. అజాపంచౌదనము శ్రేయఃప్రాప్తికై చేయు నొకకర్మవిశేషముగా మాత్రము కనఁబడుచున్నది. యజ్ఞముచేసినయెడల స్వర్గభోగము కలుగునని చెప్పినట్లే, అజాపంచౌదనము చేయుటవలన పునర్భువును భర్తయు మరణానంతరమున సహితము సమానలోకమున సుఖింతురని చెప్పఁబడియున్నది. దీనిచేత స్త్రీపునర్వివాహము సిద్ధాంతమే యగుచున్నది. అదిగాక యథర్వణవేదమందలి ఉతయత్పతయు, యనువచనము స్త్రీపునర్వివాహమును స్థాపించుచునేయున్నది.

త్రివి—ఆశ్రుతికిఁగూడ తెనుఁగర్థము సెలవిండి.

వీర—ఉత=మఱియును, యత్=ఏది, స్త్రియాః,=స్త్రీకి, పూర్వే=పూర్వులయిన, అబ్రాహ్మణాః=బ్రాహ్మణులు కానివారు, దశపతయః=పదిమంది భర్తలు (అయి), బ్రహ్మ=బ్రాహ్మణుఁడు, హస్తమగ్రహీత్ చేత్=పాణిగ్రహణము చేసినపక్షమున. సఏవ—అతఁడే, ఏకధా=ఏకవిధముగా, పతిః=పెనిమిటి. బ్రాహ్మణఏవ=బ్రాహ్మణుఁడే పతిః=భర్త; నరాజన్యః=రాజన్యుఁడు కాఁడు; నవైశ్యః=వైశ్యుఁడు కాఁడు; తత్=అది, సూర్యః=సూర్యుఁడు, ప్రబ్రువన్=చాటుచు, పంచభ్యో మానవేభ్యః=అయిదువిధములయిన మనుష్యులకొఱకు, ఏతి=తిరుగుచున్నాఁడు. ఒకస్త్రీకి మొదట బ్రాహ్మణులు కానివారు పదిమందిపతులనయినను కడపట బ్రాహ్మణుఁడు పతియగునేని, అతఁడే యామెకు భర్తయనియు మరణానంతర మతని తోడిలోకమే కలుగుననియు శ్రుతితాత్పర్యము.

వామ—ఆహాహా! ఈయర్థ మెంత సొగసుగా నున్నది, ఒకస్త్రీ మొదట నొక శూద్రునిని, వాఁడుచచ్చిన నొక వైశ్యుని,

[illegible] నాకు [illegible], ఈ ప్రకారముగా పది [illegible] అంతఃస్మృతి నాకు బ్రాహ్మణుని వివా[illegible] ద్వారా [illegible] విధించుచున్నదట! లోకములో నింత [illegible] విరుద్ధ మేమున్నది! నిజముగా మీ యర్థము నంగీకరించి బ్రాహ్మణుడు మంగలదాసిని చాకలదానినివివాహము చేసికొన్నచో వర్ణాశ్రమధర్మములు చెడి లోకమంతయు పాడుకాదా! కాబట్టి మీరు చెప్పిన యర్థము సరియయినదికాదు. వేద మింత విరుద్ధ మయిన సంగతి చెప్పునా!

వీర—శ్రుత్యర్థమును విచారింపక మీరూరక పరిహసించిన కార్యము లేదు. పూర్వకాలమునందు బ్రాహ్మణుడు బ్రాహ్మణేతర జాతుల స్త్రీలను వివాహము చేసుకొనెడి యాచారము లేదనిగాని, ఆయాచారము శ్రుతిస్మృతిసమ్మతము కాదని కాని మీరు చెప్పఁగలరా? విక్రమార్క చరిత్రమును చదివిన మీకీసంగతి విశదమగు ననుటకు సందేహము లేదు. పూర్వకాలమునందు బ్రాహ్మణుడు బ్రాహ్మణేతరస్త్రీలను మాత్రమే కాక వారి విధవలను సహితము వివాహమాడెడి యాచారమున్నట్టు ఈశ్రుతి సాక్ష్యమిచ్చుచున్నది.

వామ—మేమాయర్థము నొప్పుకొనము. ఇది బ్రాహ్మణుని యాధిక్యమును చెప్పవచ్చిన శ్రుతియే కాని యొక స్త్రీకి పదిమంది భర్తలయిన తరువాత బ్రాహ్మణుడు భర్త కావచ్చునని చెప్పవచ్చి నదికాదు. శ్రుతికర్తయొక్కయుద్దేశములను గ్రహించెడి శక్తి మా కెవ్వరికిని లేదు. శ్రుతివాక్యమునకు నేను జెప్పిన యర్థముతప్ప మఱి యొక యర్థము కాదు. వేదము జెప్పినది విరుద్ధమని మీరు మాటి మాటికి ననుచుండుటకు మీకేమి యాధారమున్నదో నేనూహింపఁ జాలకున్నాను.

వీర — పదములిచ్చెడి యర్థమును గట్టిపెట్టి యుద్దేశములను గ్రహించెడిశక్తి మాయొద్దలేదు. శ్రుతివాక్యమునకు నేను జెప్పిన యర్థము తప్ప మఱియొక యర్థము రాదు. వేదము చెప్పినది విరుద్ధమని మీరు మాటిమాటికి ననుచుండుటకు మీకేమి యాధారమున్నదో నే నూహింపఁజాలకున్నాను.

వామ — మాకు కావలసినన్ని యాధారములున్నవి. లోకాచారమే గొప్ప యాధారము. మీవాదమున కనుకూలముగా నున్నవని మీరు తెచ్చిన శ్రుతివాక్యముల యర్థవిచారమయినతరువాత వేదమునుండియే విధవావివాహము కూడదనుటకు కావలసినన్ని నిదర్శనములను జూపెదను.

వీర — "సోమః ప్రథమ" యను శ్రుతియొక్క యర్థమును గూడ చిత్తగింపుఁడు.—(ఓ చిన్నదానా!), తే=నీకు, సోమః=చంద్రుఁడు, ప్రథమః=మొదటిభర్తయని, వివిదే=తెలియఁబడుచున్నాఁడు గంధర్వః=గంధర్వుఁడు, ఉత్తరః=తరువాతి పెనిమిటియని, వివిదే=తెలియఁబడుచున్నాఁడు; అగ్నిః=అగ్నిహోత్రుఁడు, తే=నీకు తృతీయః=మూఁడవ, పతిః=భర్త, తే=నీకు, తురీయః=నాలవవాఁడు, మనుష్యజాః=మనుష్యునివలనఁ బుట్టినవారు.

వామ — ఈశ్రుతి మీ వాదమున కెందుకు పనికివచ్చును?

వీర — నాలవభర్త మనుష్యుఁడని చెప్పక మనుష్యునివలనఁ బుట్టినవారని బహువచనప్రయోగమును చేసియుండుటచేత స్త్రీపునర్వివాహము కూడదని యేర్పడుచున్నది.

వామ — "తురీయః" అనుచోట నాలవవాఁడని యేకవచనబోధకముగా నున్నది. "మనుష్యజాః" అనుచో బహువచనము ప్రయోగింపఁబడియున్నది. శ్రుతికర్తయొక్క యభిప్రాయమే మీరు

చెప్పినదయినపక్షమున, నాలవవారని బహువచనమే ప్రయోగింప బడియుండును.

వీర—నాలవవాఁడని యేకవచనమును ప్రయోగించుటలోనే విశేషసారస్యమున్నది. తరువాత మనుష్యునివలనఁ బుట్టినవారని బహువచనము ప్రయోగించియు మొదట నాలవవాఁడని యేకవచనము వేయుటవలన, స్త్రీకి బహుభర్తలుండవచ్చినను, ఒక కాలము నందొకనికంటె నధికభర్తలుండఁగూడదని తెలియవచ్చుచున్నది.

వామ—నాలవవాఁడని చెప్పుటచేతనే మీయర్థము పడిపోయినది. శ్రుతికన్యకు నలువురు భర్తలను మాత్రమే విధించుచున్నది. అందు మొదటి మువ్వురును సోమగంధర్వాగ్నులు; నాలవవాఁడు మనుష్యుఁడు. కన్యకు మరల వివాహముచేసిన యెడల వాఁడయిదవవాఁడగును గనుక నలుగురు భర్తలనే విధించిన శ్రుతి కట్టి వివాహము విరుద్ధమగును.

వీర—మీరు స్త్రీ కెన్ని వివాహములు చేసినను మనుష్యేతరు లెన్నఁడును భర్తను జేయరు గనుక, శ్రుత్యనుసారముగా మనుష్యుఁ డెప్పుడును నాలవవాఁడే యగును. అందుచేత మీయాక్షేపణ మేమియు పొసఁగియుండలేదు. స్త్రీకి పునర్వివాహము చేసినను మనుష్యుడగుటచే నాభర్త నాలవవాఁడేయయి మీయాక్షేపణమున కవకాశము లేకపోవును.

వామ—అట్లయిన వేదపాఠము తప్పు. "మనుష్యజః" అని యేకవచనముండవలెను. సర్వజ్ఞుఁడయిన యీశ్వరుఁడు వ్యాకరణ జ్ఞానము లేనివానివలె 'తురీయ' యని విశేషణము నేకవచనము గాను దాని విశేష్యమయిన 'మనుష్యజా' యను దానిని బహు వచనముగాను ప్రయోగించునా? వేదాభ్యాసముచేసిన ఋషులును బ్రాహ్మణులును ప్రమాదవశమున మీరు చెప్పిన తప్పు పాఠమును

గ్రహించియుందురు. అంతేకాని వేదపురుషుని భావము నేను చెప్పినదే వేదములో నున్న గూఢార్థము మీ కేమియు తెలియక యపార్థములను జేయుచున్నారు.

వీర—ఇంక—వేదపాఠమును తమవంటి పెద్దలు సంస్కరించవలెను గాని నావంటివారి కటువంటి సామర్థ్యము లేదు. తొల్లిటి పెద్దలు సహితము వైదిక ప్రయోగములను మన మాక్షేపింపరాదనియే నియమము చేసియున్నారు. అయినను మీరు చెప్పినట్టు సంస్కరించినను మీ వాదమునకు లాభముగాని మా వాదమునకు నష్టముగాని కలుగదు. మనుష్యుఁడని యేకవచనమేయున్నను, అది జాతివాచకమయి యందఱు భర్తలకును పనికివచ్చును. ఏ భర్తయయినను మనుష్యుఁ డగుటచేత నాలవవాఁడేయగును గనుక, మీరు చేసిన యపూర్వార్థమును మారుపును నంగీకరించినను మీ కావగింజంతయు లాభము కలుఁగలేదు.

వామ—మీరన్నియు కుయుక్తులు చెప్పుచున్నారు. మీ రెంత చెప్పినను మీ వాదము గెలువదు. ఇట్టి యక్రమమయిన వాదమును సభవా రెవ్వరైనను నంగీకరింతురా? ఒక్క సభవారే కాదు. లోకములో కర్మభూమియందు పుట్టి శ్రుతిస్మృతి శిష్టాచారములు ప్రమాణమనుకొనువా రెవ్వరైన మీరు చెప్పిన యర్థము సరియైనదని యొప్పుకొందురా? మీరు చేసిన యర్థమును నమ్ముకొని యాచరణము చేసిన పక్షమున లోకమంతయు వర్ణసంకరము కాదా? మీ రెన్నివిధముల మాయోపాయములు చేసినను శిష్టులెవ్వరును మీ మాటలను విశ్వసింపరు.

వీర—వర్ణసాంకర్యము కలుగకుండ లోకమును రక్షించుటకై మీరు చేసెడి సదర్థమును జూపి మీ వాదమును స్థాపించుట కాధారభూతములుగా నున్న శ్రుతిప్రమాణములను వివరింపరాదా?

వామ—మీ వాదమును ఖండించుటకయి యెన్నో శ్రుతి ప్రమాణములు కావలెనా? ఒక శ్రుతివాక్యముతో మీ రెంత కాలమో కష్టపడి యపార్థకల్పముచేసిన దుర్బలప్రమాణముల నన్నిటిని ఝంఝూమారుతము దూదిపరకల నెగరఁగొట్టివేసినట్లు తుప్పున నెగరఁగొట్టెదను.

శ్రుతి॥ యదేకస్మిన్ యూపే ద్వేరశనే పరివ్యయతి తస్మాదేకో ద్వేజాయే విందతే॥ యన్నైకాగ్ం రశనాం ద్వయోర్యూపయోః పరివ్యయతి తస్మాన్నైకా ద్వాపతీ విందతే.

అను శ్రుతిని మీ రెప్పుడయిన విన్నారా? వినియుండిన పక్షమున స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని యింత సాహసము చేయుటకు మీరు బయలుదేఱరు. ఇది విధవావివాహము నెంత స్పష్టముగా నిరసించుచున్నదో చూడుఁడు.

త్రివి—ఈశ్రుత్యర్థమేమో నాకు తెలుఁగుమాటలతో సెలవియ్యవలెను.

వామ—ఒకపురుషున కిద్దఱు భార్యలుండవచ్చును గాని, యొక స్త్రీకిద్దఱు భర్తలెంతమాత్రము నుండఁగూడదని యీశ్రుతి స్పష్టముగాఁ జెప్పుచున్నది. ఇంతకంటె తేటతెలుఁగేమి కావలెను?

త్రివి—వాక్యమును జదివి ప్రతిపదార్థమును నొక్కసారి సెలవిచ్చెదరా?

వీర—ప్రతిపదార్థమును నేను జెప్పెదను వినుఁడి:—

యత్=ఎందువలన, ఏకస్మిన్‌యూపే—ఒక స్తంభమునందు, ద్వేరశనే=రెండుత్రాళ్ళు, పరివ్యయతి=కట్టఁబడుచున్నవో, తస్మాత్= అందువలన, ఏకః=ఒకఁడు, ద్వేజాయే ఇద్దఱుభార్యలను, విందతే= పొందుచున్నాఁడు; యత్=ఎందువలన, ఏకాగ్ంరశనాం=ఒకరశనను,

ద్వయోర్యూపయోః = రెండుయూపములకు, నపరివ్యయతి = కట్టుచుండలేదో, తస్మాత్ = అందువలన, ఏకా = ఒకతె, ద్రౌపతీ = ఇద్దఱు భర్తలను, నవిందతే = పొందుచుండలేదు.

ఇదేనా మీయర్థము? ఇంతకంటె విశేషార్థము నేమయినఁ గల్పించెదరా?

వామ—మీరు చెప్పిన యర్థము సరిగానేయున్నది. స్త్రీ పునర్వివాహము కూడదనుట కింతకంటెను విశేషార్థమేదికావలెను?

త్రివి—ఈయర్థమునుబట్టి విచారింపఁగా నేకకాలమునందు మాత్రమే స్త్రీ కిద్దఱు భర్తలుండరని శ్రుతిచెప్పుచున్నట్టు కనఁబడుచున్నది.

వామ—ఏకకాలమునందు మాత్రమేకాక భిన్నకాలములయందుఁగూడ స్త్రీకి బహుభర్త లుండగూడదనియే శ్రుతితాత్పర్యము. వేదవాక్యములలో కాలనిర్ణయము లేకపోవుటచేతనే సర్వకాలములయందునని మీకు స్ఫురించుచుండలేదా?

వీర—ఆసంగతి తరువాత చూచుకొందము. ముందుగా నేను చేసెడి యాక్షేపణలకు సమాధానము చెప్పుఁడి. వేదము, బ్రాహ్మణము, మంత్రము, అర్థవాదము నని మూడుభాగములు కలదిగానుండును. బ్రాహ్మణమనఁగా విధివాక్యము గనుక, అది స్వతః ప్రమాణము; మంత్రములు విధివాక్యైకవాక్యతచేతఁగాని, కల్పమాత్రకారుల విధివాక్యబలముచేతఁగాని ప్రమాణములగునుగాని స్వతఃప్రమాణములు గావు; అర్థవాదము లెప్పుడును ప్రమాణములే కావు. పయిశ్రుతిలోని స్త్రీ కిద్దఱుభర్తలుండరు లోనుగాఁగల భాగమర్థవాదమే గనుక, అది ప్రమాణము కానేరదు.

వామ—అది యర్థవాదముకాదు మంత్రము.

పీర—"లౌకిక దృష్టాన్తేన రశనాద్వయమ్ విధత్తే"—అను భాష్యమునుబట్టి చూచినను, సందర్భమునుబట్టి చూచినను, ఈశ్రుతి యూపమునకు రశనను గట్టుటనుగూర్చి చెప్పవచ్చినదే కాని వివాహమునుగూర్చి చెప్పవచ్చినది కాదు; ఒకపురుషునకెట్లు ఇద్దఱు భార్యలుందురో యాప్రకారముగా నొకయూపమునకు రెండు రశనలను గట్టవచ్చుననియు, ఒకస్త్రీ కేప్రకారముగా నిద్దఱుపురుషభర్తలుండరో యారీతినే యొకరశనను రెండుయూపములకుఁ గట్టరనియుదాని తాత్పర్యము. ఇదియంతయుమంత్రమేయయినను,ప్రత్యేకవిధివాక్యముగాని సూత్రకారుల వినియోజక వాక్యముగాని లేక మంత్ర మెంతమాత్రమును ప్రమాణముకాదు. వేదమున బ్రాహ్మణభాగమునం దెక్కడను నారీ పునర్వివాహమును నిషేధించు విధివాక్యము కానరాదు; వినియోజక వాక్యమయిన కల్పసూత్రము "అగ్నిష్ఠం ద్వాభ్యాగ్ రశనాభ్యాంపరివీయ" యని రశనాబంధమును మాత్రమే విధించుచున్నది. కాఁబట్టి యొకపురుషుఁ డిద్దఱుస్త్రీలను బొందుననియు నొకసుందరి యిద్దఱు పతులను బొందదనియుఁ జెప్పెడివాక్యము విధివాక్య సన్నిధానమునఁ బఠింపఁబడి యర్థవాదమే యగును.

వామ—ఆభాగముకూడ మంత్రముతోఁ జేరినదేయగుటచేత వినియోజకవాక్య మగ్నిష్ఠయూపమునకు రశనాద్వయ బంధనమును మాత్రమే విధించుచున్నను సంబంధమునుబట్టి తక్కినభాగమును ప్రమాణ మగును.

పీర—"ఉదీర్ష్వనారీ" యను మంత్రముయొక్క వినియోజక వాక్య ముత్థాపనక్రియను మాత్రము చెప్పుచున్నను మంత్రము పునర్వివాహము చేసికొందువుగాని లెమ్మని పలుకుటవలన నేకవిషయ మగుటం జేసి సంబంధమునుబట్టి స్త్రీపునర్వివాహమున కనుజ్ఞయయినట్లు, ఇక్కడ పోలికచేతతప్పతుతియేసంబంధమునులేని భిన్నవిషయ

ములయిన రశనాబంధన వివాహబంధములయందు రశనావిధానము చేత వివాహవిధానము కానేరదు. మీరు చెప్పిన సంబంధమునుబట్టి మాత్ర మగ్నిష్ఠయూపమునకు రశనాద్వయబంధనమును మాత్రమే విధించుచున్నను, ఏకవిషయ మగుటంజేసి యగ్నిష్ఠయూపమునకును సమీపమునందున్న మఱియొక యూపమునకును జేర్చి యేకరశనను గట్టఁగూడదన్న యుత్తరార్థమునందలి నిషేధముకూడ ప్రమాణము కాఁగలదు.

వామ—వినియోజకవాక్య మెట్లున్నను మూలమునుబట్టి రశనాబంధమే దృష్టాంతముగాను వివాహము దార్ష్టాంతికముగాను గనఁబడుచున్నది గనుక వివాహవిషయమునఁగూడ నీశ్రుతి ప్రమాణ మగునని నేతలఁచెదను.

వీర—మీరట్లు తలఁచుట కాధారము లేశమయినను లేక పోయినను వాదమునిమిత్తము క్షణకాలము మీ తాత్పర్యముతో నే నేను నేకీభవించెదను. అప్పుడునుసహిత మీశ్రుతి మీ వాదమునకెంత మాత్రము ననుకూలపడదు.

వామ—ఎందుచేత? మీరాయర్థము నొప్పుకొన్న పక్షమున నారీ పునరుద్వాహము కూడదని నిమిషములో సాధించెదను.

వీర—ఎన్నిపాట్లుపడినను మీ రావిషయమును సాధింపఁ జాలరు! ఏకకాలమునందొక స్త్రీకిరువురుభర్త లుండరనితప్ప మఱి యొక యర్థ మీశ్రుతికి స్థిరపడదు.

వామ—వేదవచనములో నేకకాలమునందనిగాని కాలభేద మునందనిగాని లేకపోవుటవలన సర్వకాలములయందని మనమర్థము చేయవలెను.

వీర—సాధారణముగా నొకపురుషున కిద్దఱుభార్య లన్నతో డనే యేకకాలమునం దిద్దఱుభార్య లున్నారనియే యూహకలుగును

గాని పూర్వము మృతినొందిన భార్యయు నిప్పుడు జీవించియున్న భార్యయుఁ గలిసి యిద్దఱు భార్యలన్న యూహ కలుగదు; అదేప్రకారముగా స్త్రీ కిద్దఱు భర్తలన్నను, ఏక కాలమునందనిగూ యూహింపఁదగియుండును. అందుచేత పయి నిషేధ మేక కాలమునం దొకయింతికిరువురు పతు లుండరనుటయం దే ప్రవర్తించుననుట స్పష్టము. అదిగాక కల్పసూత్రాది షడంగములు ననుసరించియే యెప్పుడును శ్రుతివాక్యముల కర్థనిర్ణయము చేయవలెను. దీనికి వినియోజక వాక్యమయిన "అగ్నిష్ఠం ద్వాభ్యాఁ రశనాభ్యాం పరివీయ" యను కల్పసూత్రి మగ్నిష్ఠయూపమున కేక కాలమునం దే రెండు త్రాళ్ళను కట్టవలయునని విధించుచున్నది గనుక, దృష్టాంతమునుబట్టి పూర్వార్థమునకు పురుషున కేక కాలమునం దిద్దఱు భార్యలుండవచ్చునన్న యర్థము సిద్ధించుచున్నది; అగ్నిష్ఠయూపమునకును మఱియొక యూపమునకును గలపి యొక త్రాటి నేలాగునఁ జుట్టబెట్టరో యాలాగుననే యేక కాలమున నొక కామిని కిరువురు పతులుండరని యుత్తరార్థము వలన సిద్ధించుచున్నది.

వామ—ఒక యూపమునకుఁ గట్టినరశనను మఱియొక యూపమునకుఁ గట్టఁగూడదన్న విధులు ప్రత్యేకముగ నున్నవిగనుక, ఒక పురుషుఁ డనుభవించిన స్త్రీని మఱియొకపురుషుఁ డెప్పుడు ననుభవింపఁగూడదనియు నేర్పడును.

వీర—ఈమంత్రము యూపసామాన్యమునకు రశనాబంధనమును విధింపవచ్చినది కాదనియు, విశేషముగా యూపైకాదశినీ ప్రకరణములో నగ్నిష్ఠయూపమునకు రశనాద్వయబంధమును విధించునదియనియు నిదివఱకే చెప్పియున్నాను. అగ్నిష్ఠమనునది పదునొకండు యూపములలో నగ్నికి సమీపమునందు నడిమియూపము. కాఁబట్టి యేకయూపమునకు సమకాలమునందుఁగాని భిన్న

కాలముల యందుగాని వేఱువేఱురశనలను కట్టుదురా కట్టరాయని
యు, ఏకరశనను సమకాలమునందుఁగాని భిన్నకాలమునందుఁగాని
వేఱుయూపములకుఁ గట్టుదురా కట్టరాయనియు, ఇక్కడ విచార
ణీయము కాదు. ఆయావిషయములను దెలుపుట కితరశ్రుతులును
కల్పసూత్రములు నుండును. ఈశ్రుతియేక కాలమునుగూర్చియే చెప్పు
చున్నదిగనుక, కామినికి బహుపతిత్వనిషేధమును నేక కాలమునందే
యగును. అంతేకాక "ఉదీర్ష్వనారీ" ఇత్యాది శ్రుతులకు విరుద్ధము
కాకుండ నీశ్రుతి కర్థనిర్ణయము చేయవలెను.

వామ—"ఉదీర్ష్వనారీ" యను మంత్రములోని పునర్వివాహ
మాభర్తకే పరలోకముఁ నని వెనుకనే చెప్పియున్నానుగనుక మీరా
యంశము నెత్తుకోఁగూడదు.

త్రివి—అవును మీరు వెనుకనే సెలవిచ్చినారు. ఈభార్యబ్రహ్మ
చర్యము చేసి మరణమునొంది పరలోకమునకు వెళ్ళునప్పటికి,ఆభర్త
మఱియొకజన్మమెత్తి యుండవచ్చును. అప్పుడు పరలోకమునందు
సహితమామెకు భర్తద్వారకక మరల నక్కడను బ్రహ్మచర్యమే యా
చరింపవలసివచ్చును. ఒకవేళ నుత్తరజన్మమునందైనను మొదటిభర్త
తోడి పొందు లభించవచ్చునన్న పక్షమున, పురాకృతదుష్కృతము
చేత నతఁడు పిల్లియో యెలుకయో యయి పుట్టెడునెడల నామె
కప్పుడుపిల్లితోడనో యెలుకతోడనో సౌఖ్యముసంభవించును. మీరు
చేసినయర్థము దివ్యముగాను నిరాక్షేపముగాను నున్నది.

వీర—ఈమాటలకేమి కాని శ్రుతిలోని వర్తమానార్థబోధక
క్రియాపదములు గూడపయినిజెప్పిన బహుపతిత్వనిషేధమేక కాలము
నందు మాత్రమేయని తెలుపుచున్నవి.

వామ—వర్తమానార్థక క్రియాపదములువిధ్యర్థమును తెలుప
వచ్చునని మీరొకచోటఁ జెప్పియున్నారు కాదా?

వీర—ఒకానొకచోట నట్టి ప్రయోగములుకనఁబడినను,అవి యిక్కడ వర్తమానార్థద్యోతకములు కావనుట కాధారమేమియు గనఁబడదు. మఱియును విద్యారణ్యులవారు భాష్యమునందు పరివ్యయతి=పరివేష్టయతి, నిందతే=అనుభుంక్తే, నవిందతే=నప్రాప్నోతి, అని వర్తమానార్థకములుగానే చెప్పియున్నారు. ఇవిగాక యీశ్రుతి యేకకాలమందేయని చూపుట కితరాధారము లనేకములుగలవు.

వామ—ఇప్పుడు చూపిన యాధారము లెంతచప్పగా నున్నవో యిఁకముందు చూపఁబోయెడి యాధారములును పండితులకంత చప్పగానే యుండును. మీవాదములలో వట్టి పిచ్చియే కానిసార మేమియు లేదు. మీది శాస్త్రమర్యాద తెలిసిన వాదముకాదు.

వీర—నాది యొట్టివాదమయినను సాంతముగాచిత్తగించిమీ ససారమయిన శాస్త్రసమాధానములను సెలవిండి. వ్యాఖ్యానములను జేసిన మనపూర్వులును నేనుజెప్పిన యర్థమునే చెప్పియున్నారు. పండితమండలాగ్రగణ్యులయిన మాధవాచార్యులవారుపరాశరస్మృతి వ్యాఖ్యానమునందు స్థూల సూక్ష్మ ధర్మవిచారమును జేయుచు, పైకి ధర్మముగాఁ గనఁబడు ద్రౌపదీ వివాహమునందలి బహుపతిత్వమును సూక్ష్మధర్మమునుగా జెప్పి. ద్రుపదుఁడు లోకవేదవిరుద్ధమని చెప్పిన వాక్యము నందుకొని, "తిర్యక్ష్వపి ఏకస్యాం గవివృషభద్వయయుద్ధదర్శనాత్" తిర్యగ్జంతువులయందు సహితమొకయావు విషయమయి రెండుగిత్తలు పోరాడుట చూచుచుండుటవలన లోకవిరుద్ధము స్ఫు మేయనియు, "వేదేప్యేవంశ్రూయతే" వేదమునందు నిటులే చెప్పబడియున్నదని, "ఏకస్య బహ్వ్యో" యను శ్రుతిని, "యదేకస్మి యూపే" యను శ్రుతినిగూడ నుదాహరించియున్నారు. మాధ చార్యులవారిచ్చిన దృష్టాంతమువల్లను, వేదమును ఈయర్థము యిచ్చుచున్నదని కంఠోక్తిగాఁ జెప్పుటవల్లను, పయిశ్రుతిద్వయము

ఏకకాలమునందుమాత్రమే స్త్రీలకు బహుపతిత్వ నిషేధము చేయు చున్నదని మాధవాచార్యులవారి తాత్పర్యమయినట్లు కరతలామలక ముగాఁ గనఁబడుచున్నది.

వాహ — ఊరకే యట్టివ్యాఖ్యానము నిచ్చినారే కాని మాధవా చార్యులవారి మతము మీరు చెప్పినది గాదు. పండితులమతము పం డితులకేగాని గోచరముకాదు. ఇంతకంటె మీరుచెప్పెడి దేమయిన నున్నదా?

వీర — భారతమునందును పూర్వోక్తమయిన "తస్మాదేకస్య" యను ఋగ్వేద వచనమును, ఈశ్రుతియుఁగూడ ద్రౌపతీ వివాహ ఘట్టమున నేకకాలమునందు స్త్రీలకు బహుపతిత్వము నిషేధమని చూపుటకే యుదాహరింపఁబడియున్నది. గ్రీపదుఁ డీ రెండుశ్రుతుల యర్థమును మనసునందుంచుకొనియే,

శ్లో॥ ఏకస్యబహ్వ్యోవిహితా మహిష్యఃకురునందన
నైకస్యాబహవోలోకే శ్రూయంతే పతయఃక్వచిత్॥

అని స్త్రీల కేక కాలమునందు బహుపతిత్వనిషేధమును జెప్పి, ఏకకా లమునందు ద్రౌపదిని యుధిష్ఠిరాధిపతుల కైదుగురకిచ్చి వివా హముచేయుట యుక్రమమని చెప్పియున్నాఁడు.

వాహ — ఏకకాలమునందు బహుపతిత్వనిషేధము నెఱిఁగి యుండియు ద్రౌపతి నేకకాలమున నేప్రకారముగా నేవురుభర్తల కిచ్చి వివాహము చేసినాఁడు?

వీర — ఏకకాలమనఁగా నేకక్షణమని యర్థముచేసి, ఒకరితరు వాత నొకరికిచ్చుట యేకకాలము కాదని యభిప్రాయ పడుటవలన ద్రౌపదీవివాహము జరిగినది. అప్పుడు యుధిష్ఠిరుఁడు,

శ్లో॥ సర్వేషాం ధర్మతః కృష్ణా మహిషీనోభవిష్యతి।
ఆనుపూర్వేణ సర్వేషాం గృహ్ణాతుజ్వలనేకరం॥

అని 'ధర్మమార్గమున మాయందఱకు ద్రౌపది భార్య కాఁగలదు; జ్యేష్ఠానుక్రమముగా సంద ఱి బాణములను అగ్నిసమీపమున గ్రహించునుగాక' యని ద్రుపదునితోఁ జెప్పెను.

వామ—ఏకకాలమనఁగా మీయభిప్రాయము నట్టిదేయయి యుండవచ్చును.

వీర—నాయభిప్రాయ మట్టిదికాదు. మన పెద్దలట్టి యర్థము చేయ సాహసించినను, వెనుక చెప్పినట్లు నష్టత్వాదినిమిత్తముల యందు వివాహమాడవచ్చునన్న శాస్త్రవిహితమయిన కాలమే భిన్నకాలమనియు, తద్వ్యతిరిక్తమయిన కాల మేకకాలమే యనియు నానిశ్చిత తాత్పర్యము.

వామ—మీవన్నియు కుశ్శంకలును కుయుక్తులు నేకాని శాస్త్రసమ్మతమయిన నాయాక్షేపణలకు తిన్నని సమాధాన మొక్కటియు రాలేదు. స్త్రీపునర్వివాహ మశాస్త్రీయము. నావాదమువల్ల 'యదేకస్మి\ యూపే' అనుశ్రుతి స్త్రీపునర్వివాహమును నిషేధించుచున్నట్లు స్థాపనమయినది.

వీర—ఒకవేళ శ్రుతికి వాదమునిమిత్తమయి మీయర్థముసే యొప్పుకొని యేకకాలమునందుఁగాని భిన్నకాలములయందుఁగాని స్త్రీలకు ద్విపతిత్వనిషేధమునే చెప్పినను, అప్పుడుసహితము శాస్త్రసమన్వయరీతిచేత సామాన్యవిశేష వ్యవస్థనుజేయఁగా స్త్రీకిద్దఱు భర్తలు కూడదన్న యీసామాన్యవిధి భర్తృమరణము సంభవించునప్పుడు పునర్వివాహము చేసికోవచ్చునని విధించి "ఉదీర్ష్వనారి" యను విశేషవిధిచేత బాధింపఁబడి మృతభర్తృక యయినప్పుడు తప్ప స్త్రీకిఁ బునర్వివాహము లేదని సిద్ధాంతమగుచున్నది.

వామ—మీరడంతయు నప్రమాణ్యావాదము. ఇక్కడ నుత్స ర్గాపవాద న్యాయముపట్టను. అందుచేత సామాన్యవిశేష వ్యవస్థను చేయుటకు వీలుపడదు.

వీర—మీరు సహేతుకముగా నుత్తరమును జెప్పక నేను జెప్పినదెల్లను దప్పని వితండవాదము చేయుచున్నారు. మీకనుకూలముగా నిమిష కాలము శ్రుతిద్వయమునకును విశేషసామాన్యభావముచేత వ్యవస్థచేయుట కవకాశము లేదనియే యొప్పుకొన్నను, అప్పుడయినను.

"శ్లో॥ ధర్మజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశ్రుతిః।
శ్రుతిద్వైధంతు యత్రస్యాత్తత్రధర్మావుభౌస్మృతౌ॥"

అను మనువచనమునుబట్టి శ్రుతి ద్వివిధమైనచో రెండును ప్రమాణములే యగును గనుక వికల్పముగా స్త్రీపునర్వివాహ మంగీకార్యమే యగును.

వామ—మీరుచెప్పిన గొడవయేమో నాకు తెలిసినది కాదు మీరీ శ్రుతివిషయమయి యసంగతముగా పదిసంగతులు చెప్పినారు. మీనిశ్చితాభిప్రాయ మేమో యూహించుటకు తోఁచకున్నది.

వీర—నేను చెప్పినదానిలో నసంగతమేదియు లేదు. వివాహ విషయమును బోధించెడి యీశ్రుతిభాగ మర్థవాదముగనుక ప్రమాణమే కాదనియు, ఒకవేళ ప్రమాణమగునని యొప్పుకొన్నను ఏకకాలమునందనితప్ప వేరర్థమురాదనియు, భిన్నకాలములయందుఁ గూడనని యర్థమువచ్చునని యంగీకరించినను ఇది సామాన్యవిధియయి మృతభర్తృక వివాహముచేసికొవచ్చునన్న విశేషవిధిచేత బాధింపఁబడుచున్నదనియు, అట్లుబాధింపఁ బడదన్నను పరస్పరవిరుద్ధములగు రెండు విధులున్నచో ధర్మము వికల్పమగునుగనుక ఇష్టమున్నచో స్త్రీపున

ర్వివాహము చేయవచ్చునని యేసిద్ధాంతమనియు, అనేకవిధములచేతఁ జెప్పి యేవిధమునఁ జూచినను మీవాదము నిలువదని స్థాపించినాను.

వామ—బహుచక్కఁగా స్థాపించినారు!

శ్రుతి॥ సమాయుషాసంప్రజయా సమగ్నేవర్చసాపునః
సంపత్నీ పత్యాహంగచ్ఛే మమాత్మాతనువామమ॥

అను కృష్ణ యజుర్వేదమునందలి యీ మంత్రమును అగ్ని బ్రాహ్మణ సన్నిధిని యజమానపత్ని పఠించుచున్నది. "పునఃసం పత్నీ పత్యాహంగచ్ఛే" యను వాక్యమునకు "అనేక పత్యాపునః పునః పత్నీ భూత్వా సంగచ్ఛే-వియోగః కదాచిదపిమాభూదిత్యర్థః" అని వ్రాసిన భాష్యము నాలోచింపఁగా నీజన్మమం దీభర్తతోనెప్పు డును వియోగము లేకుండునటులు చేయుమని యగ్నిని ప్రార్థించుట స్పష్టమయి యున్నది. అట్లుండఁగా వేదము పునర్వివాహము నంగీక రించుచున్న నెట్లు నమ్మఁదగియుండును ?

వీర—సాధ్వియెప్పుడును తనకు పతితోడి వియోగము లేకుం డునట్లు చేయవలయునని ప్రార్థించినమాత్రమున నారీపునర్వివాహము లేదని యెట్లేర్పడును! తనవారు దీర్ఘాయుష్మంతులు కావలయునని యెల్లవారును గోరుదురు. దైవయోగముచేత మరణాదికమువలన వియోగము సంభవించినప్పుడు, "ఉదీర్ష్వనారీ" త్యాది మంత్రము నందలి యనుజ్ఞనుబట్టి యిష్టమున్నచో వివాహము చేసికోవచ్చును.

వామ—మీరన్నియు నపార్థములే చెప్పుచున్నారు. ఎవరిది న్యాయపక్షమో యగ్రాసనాసీనులై మధ్యవర్తులుగానున్న సాంబశివ రావుపంతులుగారు సెలవియ్యవలెను.

వీర—మనతో నెవ్వరితోను జెప్పకుండ సాంబశివరావు పంతులుగారు తమ పీఠము నుండి దిగి నడిచినారు.

పర—సాంబశివరావుపంతులుగారు లేకపోయిన, మన శ్రీనివాసాచార్యులవారి నడుగరాదా? మనపట్టణములో కపటమువిడిచి నిష్పక్షపాతముగాఁ జెప్పువారు వారికంటె మఱియెవ్వరున్నారు ? వామనశాస్త్రిలగారివాదము శాస్త్రసమ్మతమైనదని యింతపిల్లవానికయినను తెలియునే.

త్రివి—(తనలో) శ్రీనివాసాచార్యులుగారు నిష్కపటముగా జెప్పుదురఁట! లోకములోని కాపట్యమంతయు మూర్తీభవించి, ఆయన రూపమున నవతరించినది. ఆయన యెప్పుడయిన మనసులో నున్నది ధారాళముగాఁ జెప్పునా? అయినను సభలో నేమిచెప్పునో చూతము.

వేణు—పరబ్రహ్మసోమయాజులుగారు బ్రాహ్మణ్యులు. వారి కోరిక శ్రీనివాసాచార్యులుగారు చెల్లించవలెను.

శ్రీని—నాకీవిషయము పూర్ణముగాఁ దెలియదు. కర్మనిష్ఠులు మీరే సెలవియ్యవలెను.

వేణు—అలాగునఁగాదు. మాయందఱిలోను మీరే బహుబుద్ధిమంతులు, మీరే సెలవియ్యవలెను.

శ్రీని—నన్ను గొప్పచేసి యింతమంది కోరుచున్నారు గనుక మార్గపువట్టుపట్టి చెప్పకుండుట మంచిదికాదు. నాయభిప్రాయమును జెప్పినప్పుడు మీరెవ్వరును కోపపడకుండవలెను. నాకు వేదవిషయములో విశేషపరిచయములేదు. వీరరాఘవరావుగారు శ్రమచేసి బహుదూరము చెప్పినారుగాని వారివాదము ప్రస్తుతాంశమున కంతగా సంబంధించినట్టు కనఁబడదు. వామనశాస్త్రిగారు సంగ్రహముగాఁ జెప్పినను, చెప్పిన రెండుముక్కలును వారివాదమును స్థాపించజాలినవిగాను సుబోధముగానునున్నట్టు నామతమునకు తోఁచినది.

పర——(చప్పట్లుకొట్టి) మా వాదము గెలిచినది; మా వాదము గెలిచినది.

భామ——మేము శాస్త్రమర్యాదనుమీఱి యొక్కముక్క చెప్పము.

వేణు——ఇఁక సభ చాలించి, యీసారి స్మృతివిషయమయిన చర్చ చేయవచ్చును.

త్రివి——ఇంతటితోనే మొగము మొత్తినది. ఇఁక వేఱే ధర్మశాస్త్రచర్చతో పనిలేదు.

వేణు——ఆలాగున సెలవియ్యవద్దు. మీ వాదము పూర్ణముగా విన్నవిమ్మటగాని యిదమిద్ధమని చెప్పవల్లకాదు.

వీర——వాదముయొక్క బలాబలములు మధ్యవర్తులు చెప్పకపోయినను జనులు మనసులకయినను తెలియక మానవు. పయి భానువారమునాఁడు మరల సభ జరగనిండి. ఇప్పటికి వెళ్ళుదము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]



భాస్కర ప్రెస్, రాజమండ్రి——1950